—: అంకితము. :—

# శ్రీకామేశ్వరికి, శ్రీచంద్రమౌళీశ్వరునకు.

శ్రీశారదాగ్రంథమాలికాయాం



ద్వత్రయం కుసుమమ్
శ్రీభగవద్గీతాఙ్క౭.



# శ్రీభగవద్గీతా
# శాంకరభాష్యతత్త్వబోధిని

"శాస్త్రరత్నాకర" బ్ర॥ వే॥ దెందుకూరి నృసింహశాస్త్రిణాం
ప్రియ శిష్యేణ,
బ్ర॥ వే॥ బులుసు వెఙ్కటశాస్త్రిణాం
తనూభవేన,
శ్రీశేషమాంబాగర్భశుక్తిముక్తాఫలాయమానేన
"తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణేన,
గౌతమసగోత్రోద్భవేన,

## బులుసు అప్పన్నశాస్త్రిణా

ప్రణీతా సతీ,

తత్పుత్రాభ్యాం న్యాయశాస్త్రకోవిదాభ్యాం,
శ్రీసత్యవతీగర్భశుక్తిముక్తాఫలాభ్యాం,
శ్రీ వేఙ్కటశాస్త్రి, మిత్రసత్యనారాయణాభ్యాం,

గ్రంథాన్తర్నిర్దిష్టవదాన్యశేఖరాణాం,
సంపూర్ణద్రవ్యసహాయేన,

భట్నవిల్లిగ్రామసంస్థాపితే స్వీయ శ్రీశారదాముద్రాలయే
ముద్రాపితాసతీ విజయతేతరామ్.

ద్వితీయముద్రణం ప్రతి॥ 1250.
క్రీ॥ శ॥ 1957.



ద్వితీయకుసుమస్య మూల్యాం: 6-0-0

అన్నిహక్కులు
బులుసు వెంకటశాస్త్రి
అండ్
యీ. మిత్రిసత్యనారాయణగార్లవి.



గ్రంథప్రాప్తిస్థానము:—
శ్రీ శారదామద్రణాలయము.
భట్నవిల్లి.
అమలాపురం తాలూకా, తూర్పుగోదావరిజిల్లా.



---

# శ్రీశారదాగ్రంథమాలికాగీతాంకనిబంధనములు.

వదాన్యశేఖరులు:—

1 బేలు (16 రీములు) కాగితమునకు సరిపడు రు 350-0-0 వారిబ్లాకు ఇప్పించవలయును.

మహారాజపోషకులు:— 100-0-0

రాజపోషకులు:— 50-0-0

పై మూడుస్థానముల నలంకరించిన వారు మొట్టమొదట మాత్రమే యా యా ద్రవ్యము నొసంగవలయును. వీరలకు "శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని" సంపూర్తిగ 5 సంపుటములు యొసగబడును.

పోషకులు:— 25-0-0

వీరికి "శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని" ప్రథమ ద్వితీయ తృతీయాధ్యాయములు గల మొదటసంపుటముమాత్రి మొసగబడును. 2వ సంపుటము మొదలు మిగిలిన 4 సంపుటములను ప్రతిసంపుటమునకు నియమితమైన రు 6-0-0 చొ॥ నొసంగచ్చు బడయగలరు.

గ్రాహకులు:—ప్రతిసంపుటమునకు 6-0-0

మార్గవ్యయము ప్రత్యేకము

ఇట్లు
బులుసు అప్పన్న శాస్త్రి

# కృతజ్ఞతాభినందనపత్రము.

అమలాపురంతాలూకా కోదూరుపాడు గ్రామవాస్తవ్యులు, పండితపోషణనిరతులు, దేవ బ్రాహ్మణపూజాధురంధరులు, సత్యనిరతులు నగు కీ. శే. నడింపల్లి సుబ్బరాజావారి పుత్రులు: (1) మ. రా. శ్రీ భావరాజుగారు (2) మ. రా. శ్రీ సూర్యనారాయణరాజుగారు (3) మ. రా. శ్రీ రామభద్రరాజుగారు ఎమ్. ఎల్. ఏ. (4) మ. రా. శ్రీ వేంకటపతిరాజుగార్లు 'పుత్రాదిచ్ఛేత్పరాజయమ్' అను న్యాయమును సార్థకముచేయుచు స్వగ్రామమున శ్రీసీతారామాలయ ప్రతిష్ఠ నొనరించి, పితృగుణాధికగుణములు కలవారై, విద్వజ్జనపోషణనిరతులై యుండ నేనీ 'భగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని' ముద్రణవిషయము మనవిచేసిన వెంటనే రు. 350లను బహూకరించి నన్నానందాబ్ధి నోలలాడించిరి. ఇట్టి వదాన్యశేఖరులను—

"అగ్రే కృత్వా కమపి చరణం జానునైకేన తిష్ఠన్పశ్చాత్పార్థేన ప్రణయరసయుక్చక్షుషా వీక్షమాణః। సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రామాబిభ్రాణో రథ మధివసన్ పాతు వస్సూతవేషః॥'

దక్షిణపాదమును ముందుంచి, వామజానువును భూమినోపి, శరీరోపరిభాగముతో నిలచి, వామహస్తమున తోత్రమును, (కశను) దక్షిణహస్తమున జ్ఞానముద్రను ధరియించి, పార్థుని ప్రణయరసముతోగూడిన దృష్టితో చూచుచున్న, పార్థునిరథము నధిష్ఠించిన పార్థసారథి యాయు రారోగ్యైశ్వర్యాభివృద్ధిని, ధర్మార్థకామమోక్షపురుషార్థముల నొసంగి, సర్వదా రక్షించుగాక.

మఱియు అమలాపురంతాలూకా ముక్తిక్షేత్రనివాసులును, మండలాధీశ్వర పదవ్యారూఢులై, తమ మండలాంతర్గతప్రజానీకమును పుత్రవాత్సల్యముతో పాలించినవారును, సూర్యరాయాంధ్రనిఘంటువునకు ప్రేరకులై ప్రోత్సాహకులైన శ్రీ పీఠికాపురాధీశ్వరులద్వారా నిఘంటునిర్మాతలై, యాంధ్రప్రజల కత్యంతోపకృతి గావించి, దిగంతవిశ్రాంతకీర్తికాంతులై, వదాన్యశేఖరులైన మ॥ రా॥ శ్రీ జయంతి రామయ్యపంతులుగారి పుత్రులు మ॥ రా॥ శ్రీ శ్రీ బుచ్చిరామశర్మగారు తమ యౌదార్యాదిగుణసమూహముచే తండ్రిగారిని మరపించి స్వగ్రామమున ఉన్నతపాఠశాల (హైస్కూలు) ను స్థాపించి, దానికి వలయు స్థల, ధన దాన మొనరించి, స్వీయయశఃకాంతను దిగంతవిశ్రాంతను గావించుటను నేఁ గాంచి, 'విద్వత్కవిశేఖరులు' బ్ర॥వే॥ వెంపరాల సూర్యనారాయణశాస్త్రిగారితో వెడలి, వారిని దర్శించి, నా 'భగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని' ముద్రణను ప్రస్తావింప వారానందకందలితహృదయులై, వెంటనే రు. 350 లు తన్ముద్రణమునకు సహాయ మొనరించిరి. ఇట్టి వదాన్యశేఖరులకు—

'చత్వారః ప్రథయన్తు విద్రుమలతారక్తాంగుళిశ్రేణయ
శ్శ్రియశ్శోణసరోజకోరకరుచ స్తే శార్ఙ్గిణః పాణయః।
ఫాలే వ్వబ్జభువో లిఖంతి యుగప ద్యే పుణ్యవర్ణావళీః
కస్తూరీమకరీః పయోధరయుగే గండద్వయే చ శ్రియః॥'

బ్రహ్మదేవుని నాల్గుమోములం దొక్కసారిగ నాయుర్దాయపంక్తులను, లక్ష్మీదేవియొక్క గండద్వయ, కుచద్వయములం దొక్కసారిగ కస్తూరీమకరికాపత్రములను నేవి విలిఖించుచుండెనో యాపగడపుదీవలవలె నెఱ్ఱనైన-శార్ఙ్గియగు శ్రీమహావిష్ణువుయొక్క వ్రేళ్ళపంక్తులుకల నాలుగుబాహువులు ధర్మార్థ కామ మోక్షములనెడి పురుషార్థచతుష్టయమును, నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని ప్రసాదించుగాక! యని శ్రీమహావిష్ణ్వవతారభూత పార్థసారథిని ప్రార్థించుచుంటిని.

ఇట్లు గ్రంథరచయిత.

# వదాన్య శేఖరులు

(1) కీ॥ శే॥ నడింపల్లి సుబ్బరాజుగారి కుమార్లు:—

1. మ॥ రా॥ శ్రీ భావరాజుగారు.

2. మ॥ రా॥ శ్రీ సూర్యనారాయణరాజుగారు.

3. మ॥ రా॥ శ్రీ రామభద్రరాజు గారు. ఎమ్. ఎల్. ఏ.

4. మ॥ రా॥ శ్రీ వెంకటపతిరాజుగార్లు.

కోడూరుపాడు. అమలాపురం తాలూకా.

(2) కీ॥ శే॥ జయంతి రామయ్యపంతులుగారి కుమాళ్ళు:—

మ॥ రా॥ శ్రీ బుచ్చిరామశర్మగారు.

ముక్తీశ్వరము. అమలాపురంతాలూకా.

(3) మ॥ రా॥ శ్రీ జద్దతుల్, యకరాా, బాఫియత్, బాషండ్, శ్రీ దువ్వూరి వేంకటపతిసోమయాజులుగారు. ముక్కామలజమీందారువారు. గంగలకుర్రు. అమలాపురంతాలూకా.

(4) కీ॥ శే॥ యనమండ్ర లక్ష్మీనరసింహంగారి కుమాళ్ళు:—

మ॥ రా॥ శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారు.

గోమహల్. బ్రాహ్మణ వీధి. బెజవాడ. నెం 1

(5) మ॥ రా॥ శ్రీ యల్లమిల్లి రామచంద్రరావుగారు.

సర్కిల్ ఇనస్పెక్టరుగారు. రాజోలు.

(6) బ్ర॥ వే॥ కొండూరి సూర్యనారాయణరావు అండ్ సన్ అచ్యుతరామయ్యగార్లు: రాజమండ్రి.

(7) 'విద్వత్కల్పతరు' మ॥ రా॥ శ్రీ ఈదర వెంకటారావుపంతులుగారు, వేంకటరామ అండ్ కో ప్రొప్రైటరు, ఏలూరు.

# మహారాజపోషకులు

(1) మ॥ రా॥ శ్రీ 'సాహిత్యభూషణ' సాగి, సత్యనారాయణరాజుగారు, చింతలపల్లి, రాజోలుతాలూకా.

(2) బ్ర॥ వే॥ 'వేదసమ్రాట్' కడియాల పేరావధానులుగారి కుమాళ్లు శ్రీమేధాదక్షిణామూర్తిగారు, విశ్వేశ్వరాయపురం, రాజోలుతాలూకా.

(3) మ॥ రా॥ శ్రీ తురగా రామచంద్రరావుగారు, ఇన్కంటాక్సు అసిస్టెంటుకమీషనరు. రిటైర్డు గాంధీనగరం, కాకినాడ.

(4) మ॥ రా॥ శ్రీ పారుపూడి బాపూరావుగారు, కాకినాడ.

(5) మ॥ రా॥ శ్రీ దంటు భాస్కరరావుగారు.

(6) బ్ర॥ వే॥ మేడవరపు సర్వేశ్వరశాస్త్రిగారు, మండపేట, రామచంద్రపురంతాలూకా.

(7) బ్ర॥ వే॥ 'వైద్యరత్న' ద్విభాష్యం వెంకటేశ్వర్లుగారి కుమాళ్లు శ్రీసూర్యనారాయణమూర్తిగారు, చింతలూరు, ఆలమూరుపోస్టు, రామచంద్రపురంతా॥

(8) మ॥ రా॥ శ్రీ చాడ చినవెంకన్నగారి కుమాళ్లు 1 మంగయ్యగారు, 2 వెంకన్నగారు, 3 అనంతరామయ్యగారు, 4 వెంకటేశ్వర్లుగార్లు, తొండంగి, తునిడివిజను.

(9) మ॥ రా॥ శ్రీ జమలాపురపు వెంకటేశ్వరరావుగారు, (అడ్వకేటు) ఖమ్మంమెట్టు, నైజాం.

(10) మ॥ రా॥ శ్రీ కలవాల రాజారాంగారు, (అడ్వకేటు) ఖమ్మంమెట్టు, నైజాం.

(11) బ్ర॥ వే॥ రాయప్రోలు లింగనసోమయాజులుగారు, బి.ఎ. బి. ఎల్ వకీలు, గుంటూరు.

(12) బ్ర॥ వే॥ వినపాముల లక్ష్మీనృసింహంగారి కుమాళ్లు శ్రీసీతారామయ్యగారు, రైలుపేట, గుంటూరు.

(13) బ్ర॥ వే॥ బొగ్గవరపు బుచ్చయ్యశాస్త్రిగారు, తాపేశ్వరం.

(14) బ్ర॥ వే॥ దువ్వూరి బాలకృష్ణమూర్తిగారి దత్తతకుమారులు: బ్ర॥ వే॥ సూర్యనారాయణమూర్తిగారు, దువ్వూరివారి ముక్కామల, అమలాపురంతాలూకా.

(15) మ॥ రా॥ శ్రీ బచ్చు రామనాథస్వామిగారి కుమారులు: మ॥రా॥శ్రీ విశ్వనాథంగారు, దువ్వూరివారిముక్కామల, అమలాపురంతాలూకా.

(16) ఋషిపుంగవ బ్ర॥ వే॥ డొక్కా రామావధానులుగారి కుమాళ్లు శ్రీప్రాచ్యగోదావరీమండలవేదప్రవర్ధకసభాధ్యక్షులు బ్ర॥ వే॥ డొక్కాసుబ్బారావుగారు, వక్కలంక.

(17) ప్రాచ్యగోదావరీమండలవేదప్రవర్ధకసభాధ్యక్షులు, ఋషిపుంగవ, తాతా కామేశ్వరశర్మగారు. గంగలకుర్రుఅగ్రహారం. అమలాపురంతాలూకా.

(18) మ॥ రా॥ శ్రీ సమయమంతుల సుబ్బమ్మ, ప్రకాశంగార్లకుమారరత్నము మ॥ రా॥ శ్రీ నాగేశ్వరరావుగారు. (నాగేశ్వరరావుగారిభార్య మాణిక్యాంబగారి కుమారులు రామకృష్ణుని పేరుతో.) ర్యాలి, కొత్తపేటతాలూకా.

(19) బ్ర॥వే॥ వేలూర్రిలక్ష్మీనరసింహం వెంకట్రామయ్య, వేలూరివెంకటేశ్వరసోమయాజులుగార్లు. రాజమండ్రి.

# రాజపోషకులు

(1) మ. రా. శ్రీ పైడా సూర్యనారాయణమూర్తి జమీందారువారు, కాకినాడ.

(2) మ. రా. శ్రీ సత్యవాడ రామచంద్రయ్యగారు, రాజోలు.

(3) మ. రా. శ్రీ గరిమెళ్ల వెంకటరమణకామేశ్వరరావుగారు, గంగలకుర్రు, అమలాపురంతా॥

(4) 'ఆయుర్వేదాచార్య' అలియస్, బ్ర॥ వే॥ యిటికాల జగన్నాథరావుశాస్త్రిగారు, యీనాందారు, ఎమ్.ఎ; ఎమ్.ఎస్. పోలీసుస్టేషన్‌వీధి, మండపేట, రామచంద్రపురంతాలూకా.

(5) బ్ర॥వే॥ కందర్ప సూర్యనారాయణమూర్తిగారు, బి. ఎ. హోమ్యో డాక్టర్. ఆలమూరు అగ్రహారం, St మండపేట, రామచంద్రపురంతాలూకా.

(6) బ్ర॥వే॥ మేడవరపు విశ్వనాథంగారు, మండపేట, రామచంద్రపురంతాలూకా.

(7) బ్ర॥ వే॥ చీమలకొండ సుబ్బరాయశాస్త్రిగారికుమాళ్లు సింహాద్రిశాస్త్రిగారు బోడపాడు అగ్రహారం, తాడేపల్లిగూడెంతాలూకా.

(8) మ॥ రా॥ శ్రీ రావినూతుల రామారావుపంతులుగారు. రాజమండ్రి.

(9) మ॥ రా॥ శ్రీ. భట్టిప్రోలు జగన్నాధరావుగారు ఏలూరు.

(10) బ్ర॥ వే॥ కాశీభట్ల సూర్యనారాయణగారు. పంచాయతీబోర్డుప్రెసిడెంటు, కపోతేశ్వరచన్నకేశవస్వామి దేవస్థాన మేనేజింగుట్రస్టీ. కడలి, రాజోలుతాలూకా

(11) మ॥ రా॥ శ్రీ కాదంబరి మల్లపరాజుగారు. కడలి, రాజోలుతాలూకా

(12) మ॥ రా॥ శ్రీ భుజంగరాజు బుచ్చిరామయ్యగారు, ఏలూరు.

(13) బ్ర॥ వే॥ కొత్తపల్లి కృష్ణమూర్తిగారికుమాళ్లు వెంకటకృష్ణసిద్ధాంతిగారు, ఏలూరు.

(14) బ్ర॥ వే॥ గుండు వెంకటాద్రిమసోమయాజులుగారు, ద్విజవైద్యశేఖరులు, ఏలూరు

(15) బ్ర॥ వే॥ ఆకెళ్ల వెంకట సుబ్బారాయుడుగారు. దువ్వూరివారిముక్కామల

(16) సమయమంతుల వెంకటరత్నంగారు, వీరిభార్య నాగమ్మగార్లజ్ఞాపకార్థము, వీరికుమారులు (1) పెదనాగేశ్వరరావుగారు (2) వారిపౌత్రులు సుబ్బారావుగార్లు, ర్యాలి, కొత్తపేటతాలూకా.

# మహారాజపోషకులు.

(20) మ॥రా॥శ్రీ పైడా వెంకటసూర్యనారాయణమూర్తి జమీందారువారు, కాకినాడ.

(21) కీ॥శే॥ చావలి వేంకటనరసింహశాస్త్రిగారి స్థానమున సోదరులు బ్ర॥వే॥ వేంకటరఘునాయకశాస్త్రిగారు, ధవళేశ్వరము.

(22) శ్రీమదుభయవేదాంతప్రవర్తక, ప్రతివాదిభయంకర పార్థసారథిగారు, బి.ఎ., బి.కామ్., ఎల్ ఎల్. బి., అడ్వొకేట్. కాకినాడ.

# కృతజ్ఞతావిజ్ఞప్తి

బ్రి॥ వే॥ అస్మద్గురువరేణ్యులగు, 'శాస్త్రరత్నాకర' శ్రీ దెందుకూరి నరసింహశాస్త్రిగురుపాదులచెంత భాష్యత్రయమును శ్రవణ మొనర్చినవారును, అస్మత్సతీర్థులును, విజయవాడనివాసులును, నిరంతరదాననిరతులును, ప్రతివిద్వాంసునకు రు. 500 చొ॥న పదివేలరూప్యము లొక్కసారి బహూకరించి, దిగంతవిశ్రాంతకీర్తిశోభితులు, వదాన్యశేఖరులు నగు కీ॥ శే॥ యనమండ్ర లక్ష్మీనరసింహముగారికుమారులు బ్రి॥ వే॥ పిచ్చయ్యశాస్త్రిగా రన్ని విషయములలో తండ్రిగారి నతిక్రమించి యౌదార్యాదిగుణములతో శోభిల్లుచుండి రనుట యేమాత్ర మతిశయోక్తి కానేరదు. ఇట్టి సుగుణపుంజమున కాలవాలమగు శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారి దర్శనమునకై బ్రి వే॥ 'తర్కవేదాంతవిశారద' శ్రీముదిగొండ వెంకటరామశాస్త్రిగారితో జని మన 'శ్రీమద్భగవద్గీతా శాంకరభాష్యతత్త్వబోధిని' ముద్రణవిషయమై మనవిచేసినంతమాత్రముననే రు. 350 లర్పించి, వదాన్యశేఖరస్థాన మలంకరించి, తమ యుదారభావమును వ్యక్తపఱచిరి. ఇట్టి వదాన్యశేఖరులను—

'అగ్రే కృత్వా కమపి చరణం జాను నైకేన తిష్ఠ
న్పశ్చార్ధేన ప్రణయరసయు కృతుపాఽ వేక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథ మధివస న్పాతు వ స్సూతవేషః ॥'

దక్షిణపాదమును ముందుంచి, వామజానువును భూమినోపి, శరీరోపరిభాగముతో నిలచి, వామహస్తమున తోత్రమును, (కశను) దక్షిణహస్తమున జ్ఞానముద్రను ధరియించి, పార్థుని ప్రణయరసముతోగూడిన దృష్టితో చూచుచు, పార్థునిరథము నధిష్ఠించిన పార్థసారథి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని, ధర్మార్థకామ మోక్షపురుషార్థముల నొసంగి, సర్వదా రక్షించుగాక.

ఇట్లు గ్రంథరచయిత.

# కృతజ్ఞతాభినందనము.

అమలాపురంతాలూకా, గంగలకుర్రుగ్రామవాస్తవ్యులు, జడ్జితుల్, యకరాజ్ బ్ర॥ వే॥ [illegible] దువ్వూరి సూర్యనారాయణసోమయాజులు బాఫియత్, ఖాపండ్ ముక్కామల జమీందారు [illegible] పుత్రరత్నమున్ను, వాజపేయాదిక్రతునిర్వాహకులును, శ్రీ సుబ్రహ్మణ్యప్రతి [illegible]కర్తట్టిన్ని, జీర్ణదేవాలయోద్ధారకులును, 'చిత్రాగదసంగ్రహ' (శ్రీసోమయాజిసత్పథ) [illegible]ర్తట్టిన్ని, శాంతిదాంత్యాదిగుణగరిష్ఠులును, అపకారికి నుపకార మొనరించునట్టిన్ని, [illegible] మానకరుణారసభరితులును, జడ్జితుల్, యకరాజ్ శ్రీదువ్వూరి వేంకటపతిసోమ [illegible] బాఫియత్, ఖాపండ్ ముక్కామలజమీందారువారిని దర్శించి, మన 'శ్రీమద్భగవద్గీతా [illegible] భాష్యతత్త్వబోధిని' ముద్రణవిషయమై మనవిచేసినంతమాత్రమున నే రు. 350 లర్పించి, [illegible] మలంకరించి, తమ యుదారభావమును వ్యక్తపరచిరి. ఇట్టి వదాన్య [illegible]—

'చత్వారః ప్రభవన్తు విద్రుమలతారక్తాంగుళిశ్రేణయ
శ్శ్రీయశ్శోణసరోజకోరకరుచ స్తే శార్ఙ్గిణః పాణయః ।
వాలే ష్వబ్జభువో లిఖన్తి యుగప ద్యే పుణ్యవర్ణావళీః
కస్తూరీమకరీః పయోధరయుగే గండద్వయే చ శ్రియః ॥'

బ్రహ్మదేవుని నాల్గుమోములం దొక్కసారిగ నాయుర్దాయపంక్తులను, లక్ష్మీదేవియొక్క [illegible] కుచద్వయములం దొక్కసారిగ కస్తూరీమకరికాపత్రములను నేవి విలిఖించుచుం [illegible] పగడపుదీవలవలె నెఱ్ఱనైన-శార్ఙ్గియగు శ్రీమహావిష్ణువుయొక్క వ్రేళ్ళపంక్తులుకల [illegible]బాహువులు ధర్మార్థ కామ మోక్షములనెడి పురుషార్థచతుష్టయమును, నాయురారో[illegible]వ్యాభివృద్ధిని ప్రసాదించుగాక! యని శ్రీమహావిష్ణ్వవతారభూత పార్థసారథిని ప్రార్థిం [illegible]

ఇట్లు,
బులుసు అప్పన్న శాస్త్రి

# కృతజ్ఞతావిజ్ఞప్తి

బ్ర॥ వే॥ అస్మద్గురువరేణ్యులగు, 'శాస్త్రరత్నాకర' శ్రీ దెందుకూరి నరసింహశాస్త్రిగురుపాదులచెంత భాష్యత్రయమును శ్రవణ మొనర్చినవారును, అస్మత్సతీర్థులును, విజయవాడనివాసులును, నిరంతరదాననిరతులును, ప్రతివిద్వాంసునకు రు. 500 చొ॥న పదివేలరూప్యము లొక్కసారి బహూకరించి, దిగంతవిశ్రాంతకీర్తిశోభితులు, వదాన్యశేఖరులు నగు కీ॥ శే॥ యనమండ్ర లక్ష్మీనరసింహముగారికుమారులు బ్ర॥ వే॥ పిచ్చయ్యశాస్త్రిగా రన్నివిషయములలో తండ్రిగారి నతిక్రమించి యౌదార్యాదిగుణములతో శోభిల్లుచుండి రనుట యేమాత్ర మతిశయోక్తి కానేరదు. ఇట్టి సుగుణపుంజమున కాలవాలమగు శ్రీ పిచ్చయ్యశాస్త్రిగారి దర్శనమునకై బ్ర॥ వే॥ 'తర్క-వేదాంతవిశారద' శ్రీముదిగొండ వెంకటరామశాస్త్రిగారితో జని మన 'శ్రీమద్భగవద్గీతా శాంకరభాష్యతత్త్వబోధిని' ముద్రణవిషయమై మనవిచేసినంతమాత్రముననే రు. 350 లర్పించి, వదాన్యశేఖరస్థాన మలంకరించి, తమ యుదారభావమును వ్యక్తపఱచిరి. ఇట్టి వదాన్యశేఖరులను—

'అగ్రే కృత్వా కమపి చరణం జాను నైకేన తిష్ఠ
న్పశ్చార్ధేన ప్రణయరసయు క్చక్షుషాఽవేక్షమాణః ।
సవ్యే తోత్రం కరసరసిజే దక్షిణే జ్ఞానముద్రా
మాబిభ్రాణో రథ మధివస న్పాతు వ స్సూతవేషః ॥'

దక్షిణపాదమును ముందుంచి, వామజానువును భూమినోపి, శరీరోపరిభాగముతో నిలచి, వామహస్తమున తోత్రమును, (కశను) దక్షిణహస్తమున జ్ఞానముద్రను ధరియించి, పార్థుని ప్రణయరసముతోగూడిన దృష్టితో చూచుచు, పార్థునిరథము నధిష్ఠించిన పార్థసారథి ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని, ధర్మార్థకామమోక్షపురుషార్థముల నొసంగి, సర్వదా రక్షించుగాక.

ఇట్లు గ్రంథరచయిత.

# కృతజ్ఞతాభినందనము.

అమలాపురంతాలూకా, గంగలకుర్రుగ్రామవాస్తవ్యులు, జద్దతుల్, యకరాజ్ బ్రి॥ వే॥ శ్రీ దువ్వూరి సూర్యనారాయణసోమయాజులు బాఫియత్, ఖాపండ్ ముక్కామల జమీందారు వారి ద్వితీయపుత్రరత్నమున్ను, వాజపేయాదిక్రతునిర్వాహకులును, శ్రీ సుబ్రహ్మణ్యప్రతిష్ఠనొనరించినట్టిన్ని, జీర్ణదేవాలయోద్ధారకులును, 'చిత్రాగదసంగ్రహ' (శ్రీసోమయాజిసత్పథ) కృతిపతులైనట్టిన్ని, శాంతిదాంత్యాదిగుణగరిష్ఠులును, అపకారికి నుపకార మొనరించునట్టిన్ని, నిష్కారణజాయమానకరుణారసభరితులును, జద్దతుల్, యకరాజ్ శ్రీదువ్వూరి వేంకటపతిసోమయాజులు బాఫియత్, ఖాపండ్ ముక్కామలజమీందారువారిని దర్శించి, మన 'శ్రీమద్భగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని' ముద్రణవిషయమై మనవిచేసినంతమాత్రముననే రు. 350 లర్పించి, వదాన్యశేఖరస్థాన మలంకరించి, తమ యుదారభావమును వ్యక్తపరచిరి. ఇట్టి వదాన్యశేఖరులను—

'చత్వారః ప్రథయన్తు విద్రుమలతారక్తాంగుళిశ్రేణయ
శ్శ్రీయశ్శోణసరోజకోరకరుచ స్తే శార్జ్గిణః పాణయః ।
ఫాలే ష్వబ్జభువో లిఖన్తి యుగప ద్యే పుణ్యావర్ణావళీః
కస్తూరీమకరీః పయోధరయుగే గండద్వయే చ శ్రియః ॥'

బ్రహ్మదేవుని నాల్గుమోములం దొక్కసారిగ నాయుర్దాయపంక్తులను, లక్ష్మీదేవియొక్క గండద్వయ, కుచద్వయములం దొక్కసారిగ కస్తూరీమకరికాపత్రములను నేవి విలిఖించుచుండెనో యాపగడపుదీవలవలె నెఱ్ఱనైన–శార్జ్గియగు శ్రీమహావిష్ణువుయొక్క వ్రేళ్ళపంక్తులుకల నాలుగుబాహువులు ధర్మార్థ కామ మోక్షములనెడి పురుషార్థచతుష్టయమును, నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధిని ప్రసాదించుగాక! యని శ్రీమహావిష్ణ్వవతారభూత పార్థసారథిని ప్రార్థించుచున్నాను.

ఇట్లు

బులుసు అప్పన్నశాస్త్రి

శ్రీభగవద్గీతా చతుర్థ, పంచమ, షష్ఠాధ్యాయము లందలి శ్లోకముల

## అకారాదిసూచిక.

| | |
|---|---|
| చతుర్థాధ్యాయ శ్లోకసంఖ్య | 42 |
| పంచమాధ్యాయ శ్లోకసంఖ్య | 29 |
| షష్ఠాధ్యాయ శ్లోకసంఖ్య | 47 |
| మొత్తం. | 118 |
| ప్రథమషట్క శ్లోకములసంఖ్య | 442 |



శ్రీమత్పరమహంసపరివ్రాజకవర్యేత్యాదిబిరుదావళీవిరాజమాన,
షణ్మతస్థాపనాచార్య, శ్రీగోవిందభగవత్పూజ్యపాదశిష్య,
శ్రీజగద్గురు, శ్రీ ౧౧౦౮ శ్రీ శ్రీ శ్రీ

## శ్రీమదాద్యశఙ్కరభగవత్పూజ్యపాదాః.

శుభమస్తు.

# శ్రీభగవద్గీతా

## శాంకరభాష్యతత్త్వబోధిని

### చతుర్థోఽధ్యాయః.

శ్రీభగవా నువాచ—

గీ॥ ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్ ।
వివస్వా న్మనవే ప్రాహ మను రిక్ష్వాకవేఽబ్రవీత్ ॥౧॥

పదవిభాగము:— శ్రీభగవాన్–ఉవాచ॥ ఇమం–వివస్వతే–యోగం–ప్రోక్తవాన్–అహం–అవ్యయమ్–వివస్వాన్–మనవే–ప్రాహ–మనుః–ఇక్ష్వాకవే–అబ్రవీత్ ॥ ॥౧॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్= షడ్గుణైశ్వర్యసంపన్నుడగు శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ= చెప్పుచుండెను. అహం– నేను; అవ్యయం= (నాశరహితమగు మోక్షరూపఫలము కలదగుటచే) నాశరహితమైనట్టి; ఇమం= పూర్వమునందుగల యధ్యాయద్వయముచే జెప్పబడిన; యోగం= యోగమును; వివస్వతే= సూర్యునికొరకు; ప్రోక్తవాన్= బోధించితిని. వివస్వాన్= సూర్యుడు; మనవే= మనువుకొరకు; ప్రాహ= చెప్పెను. మనుః= మనువు; ఇక్ష్వాకవే= (స్వపుత్రుడగు) ఇక్ష్వాకువుకొరకు; అబ్రవీత్= చెప్పెను. ॥౧॥

శాంకరభాష్యమ్:—

యోఽయం యోగోఽధ్యాయద్వయే నోక్తో జ్ఞాననిష్ఠాలక్షణ స్సంన్యాసః కర్మయోగోపాయో యస్మి న్వేదార్థః పరిసమాప్తః ప్రవృత్తిలక్షణో నివృత్తిలక్షణశ్చ, గీతాసు చ సర్వా స్వయ మేవ యోగో వివక్షితో భగవతాఽతః పరిసమాప్తం వేదార్థం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రవృత్తిచే దెలిసికొనదగిన కర్మయోగము, నివృత్తిచే దెలిసికొనదగిన జ్ఞానయోగ మనెడి వేదార్థ మేకర్మయోగద్వయమునందు పరిసమాప్తమో, కర్మయోగ ముపాయముగాగల యట్టి జ్ఞాననిష్ఠారూప మగు సంన్యాస మనెడి యోగము ప్రథమద్వితీయాధ్యాయములచే

—♦ ౪వ అధ్యాయము—౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఇంతకు బూర్వము జ్ఞానయోగ ముపేయముగను, (సాధ్యముగను) కర్మయోగ ముపాయముగను ప్రతిపాదితములైనవి. అట్లైనను "ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి" అను గీతోక్తరీతిని సాధ్యసాధనములకు ఫలైక్యముచే నుపచారతః ఐక్యమును జెప్పి, సాధనభూతమగు కర్మయోగమును, సాధ్యభూతమగు జ్ఞానయోగమును, యనేకగుణవిధానమునకై వంశకథనరూపమున శ్రీకృష్ణపరమాత్మ

శాంకరభాష్యమ్:—

మన్వాద స్తం వంశకథనేన స్తౌతి శ్రీభగవాన్ — ఇమ మధ్యాయద్వయేనోక్తం యోగం వివస్వత ఆదిత్యాయ సర్గాదౌ ప్రోక్తవా నహం జగత్పరిపాలయితౄణాం క్షత్రియాణాం బలా ధానాయ। తేన యోగబలేన యుక్తా స్సమర్థా భవంతి బ్రహ్మ పరిరక్షితుమ్। బ్రహ్మక్షత్రే పరి పాలితే జగత్పరిపాలయితు మలం। అవ్యయ మవ్యయఫలత్వాత్। నహ్యస్య సమ్యగ్దర్శననిష్ఠా లక్షణస్య మోక్షాఖ్యం ఫలం వ్యేతి। సచ వివస్వా న్మనవే ప్రాహ; మను రిక్ష్వాకవే స్వపుత్రా యాదిరాజాయాబ్రవీత్। ||1||

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జెప్పబడెను. గీతలయందంతట నీజ్ఞానయోగమే శ్రీకృష్ణపరమాత్మచే వివక్షితము (ప్రతిపాదితము). కాన వేదార్థమును పరిసమాప్తముగ శ్రీకృష్ణపరమాత్మ తలచి యీ యోగము కృత్రిమమనెడి శంకను తొలగించుటకు సంప్రదాయోపదేశ (గురుశిష్యపరంపరోపన్యాస) మనెడి వంశకథన ముచే నీయోగమును శ్రీకృష్ణపరమాత్మ స్తుతించుచుండెను.

అర్జునుని గూర్చి శ్రీకృష్ణపరమాత్మ ఇట్లు పలికెను. ఓయర్జునా! కర్మయోగమనెడి యుపా యముచే బొందదగిన, ప్రథమద్వితీయాధ్యాయములచే బోధింపబడిన యీ జ్ఞానయోగమును సృష్ట్యాదియందు నేను (స్వయముగ) సూర్యునికొరకు బోధించితిని. (ఈ చెప్పుటవలన స్వయ ముగ కృతార్థులు కానివారు తమప్రయోజనమునందు వ్యగ్రులైయుండి పరుల కుపదేశింప జాలరు. అట్లుకాక శ్రీకృష్ణభగవానులు పరుల కుపదేశించుటచే దాను కృతార్థుడని, తన కేవిధ మగు ప్రయోజనము లేదని స్పష్ట మగుచున్నది). తనకు బ్రయోజనము లేనిచో సూర్యున కుప దేశించు టెందులకు ? అనిన ఈ యోగము నాశరహితమగు వేదమూలక మగుటచే నవ్యయ

యీ యధ్యాయాదియందు స్తుతించుచున్నాడు—"ఇమం...అబ్రవీత్" ద్వితీయాధ్యాయ తృతీయాధ్యాయములచే జెప్పబడినదియు, కర్మనిష్ఠారూపోపాయలభ్యమగు జ్ఞాననిష్ఠారూపయోగమును-సర్వజగత్పరిపాలకుడ నగు నేను సృష్ట్యాదియందు క్షత్రియులకు బలమునుజేకూర్చి తదధీనమగు సర్వజగత్తును పాలింపనెంచి సమస్తక్షత్రియవంశము నకు మూలపురుషుడగు సూర్యునకు సర్వసందేహనివారణపూర్వకముగ జెప్పియుంటిని. "ఉపదిష్టమగు జ్ఞానయోగ ముచే బల మెట్లు చేకూరు"నను శంకను 'అవ్యయం' అను విశేషణవిన్యాసముచే తొలగించుచుండెను— 'న వ్యేతీ త్యవ్యయం' (నశించకుండునది యవ్యయ మనబడును. అనగా నీజ్ఞానయోగ మవ్యయ(నాశ)రహితమగు వేదమూల ముగా కలదగుటచేతను, నాశరహితమగు మోక్షము ఫలముగా కలదగుటచేతను, నీయమగు మోక్షఫలమునుండి వ్యభిచరించనిది (జ్ఞానము కలిగినపుడు నియమముగ మోక్షము సంభవించునను యథార్థజ్ఞానములో కారణరూపముగ విషయ మగునది) కాన నవ్యయ మనబడును. కాన ఫలావశ్యంభావనియమము కల జ్ఞానయోగముచే బలమును చేకూ ర్చుట శక్యమే యగు నని భావము). ఆనా శిష్యుడగు సూర్యుడు—తన పుత్రుడగు వైవస్వతమనువు కుపదేశించెను. ఆ మనువు-తన పుత్రుడును, రాజులలో బ్రథముడు నగు నిక్ష్వాకున కుపదేశించెను. (ప్రతిమన్వంతరకాలమునందును యీభగవదుపదేశము స్వాయంభువమన్వాది సాధారణమేయైనను ప్రస్తుతవైవస్వత మన్వంతరాభిప్రాయముతోడనే సూర్యుని మొదలుకొని గురుశిష్యసంప్రదాయము పరిగణింపబడెను).

శంకరానందీయము:— ద్వితీయతృతీయాధ్యాయములయందు - కర్మయోగమేయుపాయముగాగల జ్ఞానయోగమే "ఏషా బ్రాహ్మీ స్థితిః" అనియు, "సంస్తభ్యాత్మానమాత్మనా" అను మొదలగు వచనములచే మోక్షైకసాధనమని ప్రతిపాదించి, ప్రస్తుతము అజ్ఞానయోగము "ఏష పంథా ఏత త్కర్మ। ఏత ద్బ్రహ్మ" అను

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మనబడును. అట్టి జ్ఞానయోగబలము కలవారై క్షత్రియులు బ్రాహ్మణత్వమును రక్షించుటకు సమర్థు లగుదురు గాన జగమును రక్షించు క్షత్రియులకు బలము ప్రాప్తించుటకు నేను సూర్యున కీజ్ఞానయోగము నుపదేశించితిని.

బ్రాహ్మణత్వక్షత్రియత్వములు రక్షింపబడిన బ్రాహ్మణు లుపదేశకులై, క్షత్రియులు పరిపాలకులై నిఖిలజగమును రక్షించుటకు సమర్థు లగుదురు. ఈ యోగమున కిట్టి మహిమ కలదా? అనినచో నాశరహితమగు మోక్షమును సమకూర్చుటచే జ్ఞానయోగ మవ్యయము. ఈ సమ్యగ్దర్శనయోగప్రాప్తమగు మోక్షమనెడి ఫలము నశించదు. అనగా నీయోగమువలన మోక్షము ప్రాప్తించును. కాన నీయోగ ముత్కృష్టమైనది. పరమాత్మచే నుపదిష్టుడై సూర్యుడు మనువున కుపదేశించెను. ఆ మనువను ఆదిరాజు తనపుత్రుడగు నిక్ష్వాకున కుపదేశించెను. ||౧||

శ్రుతిప్రమాణసిద్ధమైనను, సిద్ధపురుషపరంపరాప్రాప్తమగుటచేగూడ పరమప్రమాణసిద్ధమని సూచించుటకు వంశకథనమున కృష్ణపరమాత్మ స్తుతించుచున్నాడు. 'అహం' పరమాత్మనగు నేను "అవ్యయం" అవ్యయవేదైకప్రమాణమగుటచే జ్ఞానయోగమవ్యయమనబడును. లేక, "న స పున రావర్తతే" (ముక్తుడగువాడు తిరిగిరాడు) అను శ్రుతి చెప్పిన నవ్యయఫలహేతువగుటచే గాని యవ్యయ మనబడును. అనగ దనను బ్రహ్మముగను దెలిసికొనుట రూపమగు జ్ఞానయోగముచే లభ్యమగు మోక్షము నాశరహితమయినదగుటచే నవ్యయఫలహేతుత్వము జ్ఞానయోగమునకు సిద్ధించుచున్నది. ఇక సాధ్యమగునది యనిత్యమను యనుభవ ముండుటచే జ్ఞానసాధ్యమగు మోక్షమనిత్య మను యనుమానము "న స పున రావర్తతే" అనుశ్రుతిచే పరాహతమయినది. కాన జ్ఞానయోగము నిత్యమగు మోక్షము ఫలము కాగలదగుటచే నవ్యయ మనంబడునని యర్థము. "ఇమం యోగం" అధ్యాయద్వయప్రతిపాదితము, మోక్షైకప్రయోజనమునగునట్టి జ్ఞానయోగమును సూర్యున కుపదేశించితిని. ఆ సూర్యుడును, "స్వయం తీర్ణః పరాన్ తారయతి" అను న్యాయానుసార మాతని పుత్రుడగు మనువున కుపదేశించెను. ఆమనువు తన పుత్రుడగు నిక్ష్వాకున కుపదేశించెను.

భాష్యోత్కర్షదీపిక:— ద్వితీయతృతీయాధ్యాయోక్తము, నిష్ఠాద్వయాత్మకము నగు వేదార్థము సమాప్తమయ్యె నని తలచి శ్రీకృష్ణపరమాత్మ-సంప్రదాయ (గురు పరంపరా) ప్రదర్శనపూర్వకముగ నిష్ఠాద్వయమును స్తుతించుచున్నాడు-"ఇమం యోగం" అధ్యాయద్వయోక్తము, కర్మయోగరూపోపాయసహితము నగు సాంఖ్యయోగమును, సంన్యాససహితమగు సంధ్యోపాసనాదినిర్వికల్పసమాధ్యనుష్ఠానాంతకర్మయోగమును, పారివ్రాజ్యానధికారులగు క్షత్రియులకు యోగ్యమగు జ్ఞాననిష్ఠోపసర్జనమును. ("అవ్యయ మవ్యయఫలత్వాత్" అను భాష్యముపలక్షణము. అనగా నాశరహితమగు మోక్షము ఫలము గా కలదగుటచే జ్ఞాననిష్ఠ యవ్యయ మనబడునని భాష్యమునకు యథాశ్రుతార్థము. ఈ భాష్యముచే నాశరహితమగు వేదము మూలముగా కలదగుటచే గూడ జ్ఞాననిష్ఠ యవ్యయ మని తెలిసుకొన దగుననుట) "ఈ జ్ఞాననిష్ఠ యవిచ్ఛిన్నసంప్రదాయము (గురుశిష్యపరంపర) కలదిగాన నవ్యయ మనబడును" అని కొందరు వ్యాఖ్యానించిరి గాని యీ వ్యాఖానము-"స కాలేనే హ మహతా యోగో నష్టః పరంతప!" (అట్టి యోగము దీర్ఘకాలమునకు విచ్ఛిన్నసంప్రదాయకమై కనుపడకున్నది" అను వాక్యశేష విరుద్ధ మగుటచే నుపేక్ష్యము. (శిష్టమగు నర్థము వ్యాఖ్యాంతరోక్తరీతిని జూడదగును).

పరమార్థప్రప:— ద్వితీయతృతీయాధ్యాయములచే జ్ఞానకర్మయోగముల నిరూపించి, ప్రస్తుత మీయధ్యాయమును కర్మము బ్రహ్మార్పణముగ చేయబడినదై మోక్షప్రాపక మగు నని నిరూపించుట కుపక్రమించుచుండెను. ఈ యధ్యాయమున చెప్పబోవు ప్రమేయ మెవనిచే నుపదేశింపబడి పరంపరాప్రాప్తమై యనేకులచే

గీ॥ ఏవం పరంపరాప్రాప్త మిమం రాజర్షయో విదుః।
స కాలే నేహ మహతా యోగో నష్టః పరంతప! ॥౨॥

పదవిభాగము:— ఏవం-పరంపరాప్రాప్తం-ఇమం-రాజర్షయః-విదుః-సః-కాలేన-ఇహ-మహతా-యోగః-నష్టః-పరంతప! ॥౨॥

ప్రతిపదార్థము:— హే పరంతప!=శత్రువులను తపింపజేయు యో యర్జునా!; ఏవం=ఈ విధమున; పరంపరాప్రాప్తం=క్షత్రియపరంపరగా సంప్రాప్తమైన; ఇమం=ఈ యోగమును; రాజర్షయః=రాజర్షులు; విదుః=తెలిసికొనిరి. సః=అట్టి; యోగః=జ్ఞానయోగము; మహతా=గొప్పదైన; కాలేన=కాలముచే; ఇహ=ఈ సమయము నందు; నష్టః=నశించిన సంప్రదాయము కల దైనది. ॥౨॥

శాంకరభాష్యమ్:—

ఏవ మితి। ఏవం క్షత్రియపరంపరాప్రాప్త మిమం రాజర్షయో రాజానశ్చ త ఋషయశ్చ రాజర్షయో విదు రిమం యోగమ్। స యోగః కాలే నేహ మహతా దీర్ఘేణ నష్టో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈవిధమున క్షత్రియపరంపరాప్రాప్తమైన జ్ఞానయోగమును* రాజర్షులు తెలిసికొనిరి. అట్లైనచో సంప్రదాయసిద్ధమగు నీయోగమును నీ వెందుల కుపదేశింపవలయు ననెదవా? శత్రువులను తపింపజేయు యో యర్జునా! ఈ జ్ఞానయోగము సంప్రదాయసిద్ధమైన దైనను దీర్ఘ

వనుష్ఠింపబడినదో యా విషయమును మూడు శ్లోకములచే జెప్పుచున్నాఁడు "ఇమం యోగం" ఈ వక్ష్యమాణ మగు యోగమును అని యర్థము. (పరిశిష్టమగు నర్థము వ్యాఖ్యానాంతరరీతిని గ్రాహ్యము).

నీలకంఠీయము:— ద్వితీయతృతీయాధ్యాయోక్తమగు నర్థము ప్రమాణమా? అప్రమాణమా? అను శంకను తొలగించుటకు విద్యావంశ సంప్రదాయమును, శ్రీకృష్ణపరమాత్మకు భ్రమయు, విప్రలంభకత్వము అనెడి దోషములను నిరసించుటకు తన కీశ్వరత్వమును, సర్వజ్ఞత్వమును 'ఇమం' అను శ్లోకము మొదలుకొని చెప్పు చుండెను.

'ఇమం' కర్మయోగోపాయసహితము, సంన్యాససహితము నగు సాంఖ్యయోగమును అని శంకరభగవత్పాదులు వ్యాఖ్యానించిరి. (మా యభిప్రాయ మేదనిన?) జ్ఞాననిష్ఠ కుపసర్జనము, (అంగము) సంన్యాసమునందు నధికారు లగు క్షత్రియులకే యోగ్య మగునట్టి సంధ్యోపాసనాది నిర్వికల్పక సమాధ్యనుష్ఠానాంతకర్మయోగమును-సర్వక్షత్రియులకు మొదటివా డగునట్టియు, మండలాభిమాని యగునట్టి సూర్యునికొరకు "అథ య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుషోదృశ్యతే హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశ అప్రణఖాత్సర్వ ఏవసువర్ణస్తస్య యథా కప్యాసంపుండరీక మేవ మక్షిణీ తస్యోదితినామ" అను శ్రుతిసిద్ధ మగు నాదిత్యాంతర్యామియగు నేను పూర్వమునందు చెప్పితిని. ఈ యోగ మెట్టిదనిన? "అవ్యయం" విచ్ఛిన్నము కాని సంప్రదాయముకలది. (ఈ చెప్పుటవలన కర్మయోగమున కనాదిత్వ ముపాదితము). సూర్యుఁడు తన కుమారుఁడగు మనువుకొరకు చెప్పెను. మనువు తన కొమరుఁడగు నిక్ష్వాకువుకొరకు చెప్పెను. ॥౧॥

—♦ ౩వ అధ్యాయము—౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— సూర్యుని మొదలు గురుశిష్యపరంపరాప్రాప్తమై స్వపిత్రాది

* ఐశ్వర్యసంపత్తులు, రాజత్వము ఎవరికి యుండునో వారికే సూక్ష్మార్థనిరీక్షణసామర్థ్యరూపమగు ఋషిత్వము సంభవించిన అట్టివారు రాజర్షు లనఁబడుదురు. ॥౨॥

శాంకరభాష్యమ్.—
విచ్ఛిన్నసంప్రదాయ స్సంప్రవృత్తో హే పరంతప ! ఆత్మనో విపక్షభూతాః పర ముచ్యంతే తాన్ శౌర్యతేజోగభ స్తిభిః ర్భాను రివ తాపయతీతి పరంతప శ్శత్రుతాపన ఇత్యర్థః ||౨||

శాంకరభాష్యతత్త్వబోధిని.—
కాలమగుటచే నిపుడీయోగముయొక్క సంప్రదాయము నశించినది. కాన విచ్ఛిన్నసంప్రదాయము కలదగుటచే తిరిగి నుపదేశించుచుంటిని.

తనకు శత్రుభూతులు పరు లనబడుదురు. వారలను శౌర్యముచేతను; తేజస్సుచేతను కిరణములచేతను సూర్యుడువలె తపింపజేయువాడు పరంతపు డన బడు నని యర్థము. అట్టివాడగుటంజేసి యర్జునుని "పరంతప" అని సంబోధించెను. ||౨||

పోక్తమగు నీయోగమును సూక్ష్మవస్తునిరీక్షణసమర్థులగు నిమిప్రభృతులగు రాజర్షులు తెలిసికొనిరి. కాన ననాదివేదమూలకమగుటచేతను, అనంతఫలమగుటచేతను, అనాదిగురుశిష్యపరంపరాప్రాప్తమగుటచేతను, కృత్రిమత్వశంకానాస్పదమగుటచే నీయోగము మహాప్రభావముకలది. (అని యీయోగమునెడ శ్రద్ధాతిశయమునకై స్తుతించెను). శత్రుతాపనుడవగు నో యర్జునా! అట్టి మహాప్రయోజనము కలదైనను యీ యోగము దీర్ఘకాలమునకు ధర్మము హ్రసించుటచే నీ కాలమున దుర్బలులు నజితేంద్రియులు నగు ననధికారులబొంది కామక్రోధాదులచే నభిభూయమానమై విచ్ఛిన్న సంప్రదాయముకలది యయ్యెను. (అట్టి యోగమార్గములేనిచే పరమపురుషార్థము పొప్తించదు కాన లోకదౌర్భాగ్యమెట్టిది. అయ్యో. అని శ్రీకృష్ణపరమాత్మ పైవిధమున దుఃఖమును సూచించెను). "హే పరంతప!" అను సంబోధనముచే కామక్రోధాదిరూపమగు శత్రుగణమును గొప్పవివేకముచేతను, తపస్సుచేతను తపింపజేయు నో యర్జునా! ఊర్ధ్వశ్యుపేక్షణాద్యద్భుతకర్మకారివిగాన జితేంద్రియుడవగు నీ వీయోగానుష్ఠానమున కధికారి వని సూచింపబడెను.

శంకరానందీయము:— శ్రీకృష్ణపరమాత్మ తనచే చెప్పబడిన జ్ఞానయోగము విశిష్టజనపరిగృహీతమై యైనదని ఈశ్లోకమున జెప్పుచున్నాడు. బ్రహ్మనిష్ఠచే కామక్రోధాదిశత్రుగణమును తపింపజేసిన యో యర్జునా! వివస్వదాది విశిష్టజనపరంపరాప్రాప్తమగు నీజ్ఞానయోగమును తరువాతవారగు జనకాదిరాజర్షులు తెలిసికొనిరి. (లేక, జనకాదిరాజులు, సనకాదిఋషులుగూడ తెలిసికొనిరనిగాని యర్థము చెప్పనగును). "మహానుభావులగు రాజర్షులచే గ్రహింపబడినచో నీయోగ మంతటను ప్రసిద్ధమేయైనదికాదా? ప్రసిద్ధమగు నట్టి యోగమును ప్రస్తుత మెందుల కుపదేశించెద"నను నాశంకమీద నుత్తరార్థమును చెప్పుచున్నాడు. పూర్వకాలమున నాచే నుపదిష్టమైన నీయోగము ప్రస్తుతము కాలదేశవిపర్యాసము వలన ప్రవర్త్య ప్రవర్తకజనము లేకుండుటచే నీలోకమున సంప్రదాయవిచ్ఛిత్తిని బొందినది.

నీలకంఠీయము:— ఇక్ష్వాకువులవలన నిమినాభాగాది క్రమమున రాజర్షులు, జనక, అజాతశత్రు, కేకయప్రభృతిరాజులు, సనక వశిష్ఠాదిఋషులు (సూక్ష్మార్థదర్శులు) తెలిసికొనిరి. లేక రాజర్షులు తెలిసికొనిరనియర్థము. అట్టి యోగ మీకాలమునం దదర్శనమును పొందెను. ||౨||

గీ॥ స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః ।
భక్తోసి మే సఖా చేతి రహస్యం హ్యేత దుత్తమమ్ ॥ ॥3॥

పదవిభాగము:— సః-ఏవ-అయం-మయా-తే-అద్య-యోగః-ప్రోక్తః-పురాతనః-భక్తః-అసి-మే-సఖా-చ-ఇతి-రహస్యం-హి-ఏతత్-ఉత్తమమ్ ॥ ॥3॥

ప్రతిపదార్థము:— హి=ఏ కారణమువలన; ఉత్తమం=శ్రేష్ఠమైన; ఏతత్=ఈ జ్ఞానము; రహస్యం=గోపనీయమో; తథాపి=(ఈ పదమధ్యాహార్యము)అయినను; త్వం=నీవు; భక్తః=భక్తుడవు; సఖాచ=స్నేహితుడవు; మే=నాకు; అసి=అయితివి; ఇతి=ఈ కారణమువలన; మయా=నాచేతను; తే=నీకొరకు; అద్య=ఇపుడు; పురాతనః=ప్రాచీనమైన; సఏవ=ఆ; అయం=ఈ; యోగః=జ్ఞానయోగము; ప్రోక్తః=ప్రకర్షగ చెప్పఁబడెను. ॥3॥

శాంకరభాష్యమ్:—

దుర్బలా నజితేన్ద్రియా న్ప్రాప్య నష్టం యోగ మిమ ముపలభ్య లోకం చా పురుషార్థసంబన్ధినం । సఏవాయమితి । సఏవాయం మయా తే తుభ్య మద్యేదానీం యోగః ప్రోక్తః పురాతనః భక్తోఽసి మే సఖా చాఽసీతి । రహస్యం హి యస్మా దేత దుత్తమం యోగో జ్ఞాన మిత్యర్థః । ॥3॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏ కారణముచే వర్తమానకాలమున జ్ఞానయోగము సంప్రదాయరహితమాయె ననిన, ఇక్కాలమున ప్రజలు కామక్రోధాదిప్రధానులగుటంజేసి దుర్బలులు. అట్టి ప్రజలను పొంది కామక్రోధాదులచే నభిభూయమానమై యోగము విచ్ఛిన్నసంప్రదాయము కలదాయెను. అట్టి దానినిగ యోగమును తెలిసికొని, లోకము పరమపురుషార్థసంబంధము లేనిదానినిగ గురుతెంచి శ్రేష్ఠమైన యీ జ్ఞానయోగము రహస్యమైనను నీవు నాకు భక్తుడవు (శరణబుద్ధిచే ప్రీతియుక్తుడవు) స్నేహితుడ (సమానవయస్సుకలవాడవై స్నిగ్ధుడవై సహాయ మొనరించువాడ)వగుటఁజేసి యీ ప్రాచీనమైన యోగము నాచే నీకుపదేశింపఁబడెను. ॥3॥

—♦ ౪వ అధ్యాయము—3వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

శంకరానందీయము:— 'వినష్టసంప్రదాయకమగు నీయోగమును ప్రస్తుత మెందులకు ప్రవర్తింపజేసితి' యందువా? చెప్పెద వినుము. కూటస్థము, అసంగము, చిద్రూపము, అవిషయము, అవిక్రియము నగు నాత్మయందు అనాత్మధర్మముల నారోపించి "నేను కర్తను, నేను భోక్తను, నేను సుఖవంతుడను, నేను దుఃఖవంతుడను అని మోహించుచున్నట్టియు, తపించుచున్నట్టి యీ లోకమును జూచి ఇట్టి జనమును సంసారసాగరమునుండి యుద్ధరింపనెంచిన నాచే నిన్ను నిమిత్తునిగా జేసుకొని యీ యోగ మిపుడు ప్రవర్తింపజేయఁబడుచున్నది". అను నాశయముతో నీ శ్లోకమును జెప్పుచున్నాడు— "స ఏవాయం—పురాతనః" అనాదిశ్రుతిమూలక మగుటచే సనాతనము, సంసారధ్వాంతవిధ్వంసకము నగు నీయోగమును పూర్వము సంప్రదాయప్రవృత్తికై సూర్యున కుపదేశించితినో అట్టి ఆ జ్ఞానయోగమే నాచే-కర్తృత్వభోక్తృత్వభ్రమచే మోహపడుచున్న నీకొర కుపదేశింపఁబడెను. (బుద్ధిమోహవిచ్ఛేదమునకై యుపదేశింపఁబడెనని యర్థము) అర్జునునకు జ్ఞానోపదేశయోగ్యత్వము సుత్తరార్ధముచే

అర్జున ఉవాచ:—అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః ।
కథ మేత ద్విజానీయాం త్వ మాదౌ ప్రోక్తవా నితి ॥ ॥౪॥

పదవిభాగము:—అర్జునః-ఉవాచ-అపరం-భవతః-జన్మ-పరం-జన్మ-వివస్వతః—కథం—ఏతత్—విజానీయాం-త్వం-ఆదౌ-ప్రోక్తవాన్-ఇతి ॥ ॥౪॥

ప్రతిపదార్థము:— హే కృష్ణ !=(ఈ పద మధ్యాహార్యము) ఓ శ్రీకృష్ణపరమాత్మ !; భవతః=నీయొక్క; జన్మ=వసుదేవగృహమునందు జనించుట; అపరం=ఈ కాలమునం దైనది. వివస్వతః=సూర్యునియొక్క; జన్మ=పుట్టుట; పరం=సృష్ట్యాదియం దైనది. త్వం=(ఈ కాలమునందు జనించిన) నీవు; ఆదౌ=సృష్ట్యాదియందు; ప్రోక్తవాన్=(సూర్యునికొర) కుపదేశించితివి; ఇతి=ఈ విధమున; ఏతత్=దీనిని; కథం=అవిరుద్ధార్థముగ నెట్లు; విజానీయాం=తెలిసికొనెదను; ఇతి=(ఈపదమధ్యాహార్యము) ఈవిధమున; అర్జునః=అర్జునుడు; ఉవాచ=ప్రశ్నించెను.

శాంకరభాష్యమ్—

భవతా విప్రతిషిద్ధ ముక్త మితి మా భూ త్కస్యచి ద్బుద్ధి రితి పరిహారార్థం చోద్యమివ కుర్వ న్- అపరమితి । అపర మర్వా గ్వసుదేవగృహే భవతో జన్మ, పరం పూర్వం సర్గాదౌ జన్మోత్పత్తి ర్వివస్వత ఆదిత్యస్య । తత్కథ మేత ద్విజానీయా మవిరుద్ధార్థతయా । య స్త్వ మేవాదౌ ప్రోక్తవా నిమం యోగం స ఏవ త్వ మిదానీం మహ్యం ప్రోక్తవా నసీతి॥ ॥౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని—

'శ్రీకృష్ణు డీశ్వరుడు కానేరడు. కనుకనే సర్గాదియందు సూర్యునకు ద్వాపరావసానమగు నీసమయమున జన్మించిన తానుపదేశించినట్లు చెప్పియుండె' నని యెవనికైన జ్ఞానము కలుగ వచ్చును. అట్టి జ్ఞానము కలుగకుండగ శ్రీకృష్ణునియం దనీశ్వరత్వశంకను తొలగించుటకు ఆశ్చర్యముపడువానివలె యర్జునుడీవిధమున ప్రశ్నించెను.

ఓశ్రీకృష్ణా ! ద్వాపరావసానమున వసుదేవుని గృహమునందు నీజన్మముకదా ? యీసృష్ట్యాదియందుకదా సూర్యుని జన్మము. ఈ కాలమునందు జన్మించిన నీవు సృష్ట్యాదియం దుపదేశించిన జ్ఞానయోగమునే నీవేయిపుడు నాకుపదేశించితివని యవిరుద్ధార్థముగ నెట్లుగ్రహింపనగును? భిన్న కాలికుల కుపదేశించుట యసంభవము. ॥౪॥

చెప్పుచున్నాడు-"భక్తోసి—ఉత్తమం" "యథా శివమయో విష్ణు రేవం విష్ణుమయ శ్శివః" (ఎట్లు విష్ణువు శివమయుడో యట్లె శివుడును విష్ణుస్వరూపుడు) అను స్మృత్యుక్తరీతిని శివకేశవుల కభేదముకూర్చియమాణ మగుటవలన శివస్వరూపుడ నగు నన్నే బయటను, లోపలను, అవ్యాజమైన శ్రద్ధతో భజించుచున్న నీవు నా కత్యంతభక్తుడవు. మరియు, సఖుడవు (సఖుడ నగు నా స్మరణ దర్శనశ్రవణాదులచే ద్రవీభూతాంతఃకరణముకలవాడవు) కనుక నీకీ యోగము నుపదేశించితి నని యర్థము. ఈ యోగోపదేశమునకై పాత్రవిచారణమును చేయవలయునా ? అను శంకమీద చెప్పుచున్నాడు. 'రహస్యం' ఈ జ్ఞానశాస్త్రము అతిగోప్య మైనది. కాన పాత్రాపాత్రవిచారణ లేకుండగ నెవనికో యొకానొకనికి యుపదేశింపదగినది కాదు. 'ఉత్తమం' సర్వోత్తమపరబ్రహ్మప్రాప్తికి హేతు వగుటచే నుత్తమమైనది. ॥౩॥

—♦ ౪వ అధ్యాయము—౪వ శ్లోక వ్యాఖ్యావిశేషములు ♦—

శంకరానందీయము:— "క్షత్రియు డగు వసుదేవుని పుత్రు డగుటవలన కృష్ణుడు రాజసాధారణుడు.

శ్రీ భగవానువాచ:— బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప ॥ ||౫||

పదవిభాగము:— శ్రీ భగవాన్-ఉవాచ; బహూని-మే-వ్యతీతాని-తవ-చ-అర్జున!-తాని-అహం-వేద-సర్వాణి-న-త్వం-వేత్థ-పరంతప! ॥ ||౫||

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=సమాధానము చెప్పెను. హే అర్జున=ఓ యర్జునుడా!; మే=నాకు; తవచ=నీకును; బహూని=అనేకమైన; జన్మాని=జన్మములు; వ్యతీతాని=అతిక్రమించినవి. హేపరంతప=శత్రువులను తపింపజేయు ఓ యర్జునా!; అహం=నేను; సర్వాణి=నిఖిలములగు; తాని=ఆ జన్మములను; వేద=ఎరుగుదును. త్వం=నీవు; నవేత్థ=గుర్తెరుగవు. ||౫||

---

ఇతనిచే చెప్పఁబడిన యీ గీతాశాస్త్రము ప్రమాణము" అని సర్వులకు గీతాశాస్త్రమునం దవిశ్వాసము సంభవించును. "ఈ గీతాశాస్త్రరచయితయగు శ్రీకృష్ణుఁడు భగవంతుఁడు" అని తెలియఁబడిన నవిశ్వాసము తొలిగి శ్రద్ధాభక్తులచే సర్వులకు గీతాశాస్త్రమునందు ప్రవృత్తి గలుగును. అందుచే సర్వులు కృతార్థు లగుదురని శ్రీకృష్ణపరమాత్మయొక్క పరమేశ్వరత్వమును పరమేశ్వరుఁడగు శ్రీకృష్ణపరమాత్మయొక్క ముఖముచేతనే ప్రకటన చేయించవలెనను యాశయముచే నర్జునుఁడు 'అపరం' అను శ్లోకముచే ప్రశ్నించుచుండెను.

నీలకంఠీయము:— భగవంతుడగు వాసుదేవుడు మనుష్యుడు నసర్వజ్ఞుడను మూర్ఖులశంకను తొలగించుట కర్జునుడు "అపరం" అను శ్లోకముచే నాశంకించుచుండెను.

ఓ శ్రీకృష్ణా! వసుదేవునిగృహమునందు నీకు శరీరగ్రహణమై స్వల్పకాలమైనది, ఇది మనుష్యజన్మము కాన నికృష్టమైనది. సూర్యుడు సృష్ట్యాదియందు శరీరమును గ్రహించినవాడు. అతనిజన్మ దేవజన్మమగుటచే నుత్కృష్టమైనది. (ఇచట యాత్మకు జన్మాభావము పూర్వమునందు చెప్పబడుటచే దేహాభిప్రాయముచేతనే యర్జునుని ప్రశ్నమని గ్రహింపనగును). కాన సర్వజ్ఞుడు, దేవుడు, సృష్ట్యాదిపురుషుడు నగు సూర్యునకు అసర్వజ్ఞుడవు, మనుష్యుడవు, ద్వాపరాంతమగు నీ కాలమునందు జన్మించిననీవు చెప్పితి వను విరుద్ధార్థమును నేనెట్లు గ్రహింపవలయును ?

ఇచట నిష్కృష్టాశయ మేమనిన? (1) ఓ శ్రీకృష్ణా! యీ దేహముతో గూడిన నీవు మరియొక దేహముతో గూడి సూర్యునకు కర్మయోగ ముపదేశించితివా ? (2) ఈదేహముతోనే యుపదేశించితివా ? దేహాంతరముతో గూడి యుపదేశించితి ననెదవా ? అట్లుపదేశించుగాక. కాని నీవు మనుష్యుడవగుటచే నసర్వజ్ఞుడవు; అసర్వజ్ఞుడు జన్మాంతరానుభూతవిషయమును స్మరించుటకు సమర్థుడు కాడు కాన నసర్వజ్ఞుడవగు నీవు జన్మాంతరానుభూతము నెట్లు స్మరించుచుంటివి. అట్లు స్మరించుటకు, చెప్పుటకు నీకు సామర్థ్యము లేదు. అట్లు కానిచో నసర్వజ్ఞుఁడ నగు నాకుగూడ జన్మాంతరానుభూతము స్మృతికి రావలసివచ్చును. కాన జన్మాంతరముచే సూర్యున కుపదేశించితి నను ప్రథమపక్షము సంభవింపదు. సృష్ట్యాదియందు యీ వసుదేవగృహమునం దుత్పన్నమగు దేహము లేమింజేసి యీ దేహముతోనే యుపదేశించితినను ద్వితీయపక్షముకూడ సంభవింపదు. తేలినయాశయమేమి ? శ్రీకృష్ణుడు దేహాంతరముచే సృష్ట్యాదియం దుండినను ఆదేహముచే ననుభూతవిషయమే కృష్ణదేహమునందు స్మరణకు సంభవింపనందున సృష్ట్యాదియందు సూర్యునకీయోగము నుపదేశించితి నని యిపుడు నీవు చెప్పుట యెట్లుపపన్నమగునని యొకప్రశ్నము. ఈదేహములో స్మరణ సంభవించినను సృష్ట్యాదియం దీదేహము లేమింజేసి నీవీదేహముతో సృష్ట్యాదియం దీయోగమును సూర్యున కెట్లుపదేశించితివి ? అని రెండవప్రశ్నము. ||౪||

శాంకరభాష్యమ్:—

యో వాసుదేవే౽నీశ్వరా౽సర్వజ్ఞాశంకా మూర్ఖాణాం తాం పరిహరన్ శ్రీభగవానువాచ: యదర్థో హ్యర్జునస్య ప్రశ్నః— బహూనీతి। బహూని మే మమ వ్యతీతాన్యతిక్రాన్తాని జన్మాని తవ చ హే౽ర్జున! తాన్యహం వేద జానే సర్వాణి; న త్వం వేత్థ జానీషే. ధర్మాధర్మాది ప్రతిబద్ధజ్ఞానశక్తిత్వాత్। అహంపున ర్నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావత్వా దనావరణజ్ఞానశక్తిరితి వేదాహం హే పరంతప! ||౫||

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వశ్లోకమునం దర్జునప్రశ్న మెందులకు జేయబడెను? వాసుదేవు డీశ్వరుడు, సర్వజ్ఞుడు కాడను శంకను తొలంగించుటకు కదా. వాసుదేవునివిషయమై మూర్ఖులకు గల "వాసుదేవు డీశ్వరుడు గాడు, సర్వజ్ఞుడును కాడు" అను శంకను పరిహరించుచు శ్రీకృష్ణపరమాత్మ యర్జునుని ప్రశ్నమున కిట్లు సమాధానమును జెప్పదొడగెను.

ఓయర్జునా! నీకును, నాకును అనేకజన్మము లతిక్రమించినవి. (ఇన్ని దేహములయం దనుస్యూత మగు యాత్మ మణిగణములయం దనుస్యూతమగు సూత్రమువలె నొకటియె. అటులైనను యాజన్మము లన్నిటిని నేను గుర్తెరుగుదును. నీవాజన్మములను గుర్తెరుగవు. మణిగణములయం దనుస్యూతమైన సూత్రమువలె యన్నిజన్మములయం దనుస్యూతమైన యాత్మయొక్కటియే యైనచో నేనెందుల కాజన్మములను యెరుగను? నీవెందుల కెరుగుదువు? అనినచో జీవోపాధిభూతమగు నంతఃకరణధర్మముకదా జ్ఞానశక్తి. అదేవిధమున ధర్మాధర్మములు, రాగలోభములు కూడ నంతఃకరణధర్మములు. ఎవనికి ముక్తికాంత చేకూరదో యట్టివానికి ధర్మాధర్మములు తప్పవు. నీవు ముముక్షువవుకాని ముక్తుడవు కావు. అందుచే నీకు ధర్మాధర్మములు తప్పవు. అట్టి ధర్మాధర్మములు జ్ఞానశక్తిని ప్రతిబంధించుటచే నీ వాజన్మము లన్నిటిని గుర్తెరుగవు నేనన్నచో నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుడ నగుటం జేసి నాజ్ఞానశక్తిని ధర్మాధర్మములు ప్రతిబంధింపనందుననే నాజన్మము లన్నింటిని గుర్తెరుగుదును.

ఇట్లు చెప్పుటవలన వాసుదేవునియం దనీశ్వరత్వాసర్వజ్ఞత్వాశంక తొలంగింపబడెను. ||౫||

—♦ ౪వ అధ్యాయము— ౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— లోకదృష్ట్యభిప్రాయముచే లీలాదేహగ్రహణరూపములగు ననేకజన్మములు సర్వజ్ఞుడనగు నాకును, సూర్యున కుదయములవలె గతించినవి. మరియు నజ్ఞానివగు నీకును కర్మార్జితదేహగ్రహణరూపములగు ననేకజన్మములు గతించినవి. (ఇట 'తవచ' అనునది యర్జునేతరులగు జీవుల కుపలక్షణము. లేక జీవైక్యాభిప్రాయకము. 'అర్జున' అని శ్లేషగ కృత్షనామముచే సంబోధించుచు 'నీవు అవృతజ్ఞానము కలవాడ' వని సూచించెను). అట్టి నాసంబంధమగు లీలాదేహగ్రహణరూపానేకజన్మములను, నీసంబంధమగు కర్మోపార్జితదేహగ్రహణరూపానేకజన్మములను— సర్వజ్ఞుడను, సర్వశక్తిసంపన్నుడ నగు నే నెఱుంగుదును. ఇక నీవన్నచో జీవుడవు. కనుక నే యజ్ఞుడవు, తిరోభూతజ్ఞానశక్తివి, అట్టి నీవు నీజన్మములనే తెలియకుందువు. అట్టియెడ పరకీయ

గీ॥ అజోఽపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోఽపి సన్ ।
ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా ॥ ॥౬॥

పదవిభాగము:— అజః-అపి-సన్-అవ్యయాత్మా-భూతానాం-ఈశ్వరః--అపి--సన్--ప్రకృతిం--స్వాం-అధిష్ఠాయ-సంభవామి-ఆత్మమాయయా । ॥౬॥

ప్రతిపదార్థము:— హే౽ర్జున != (ఈ పద మనువృత్తము) ఓ యర్జునుడా !; అహం=(ఈ పద మధ్యాహార్యము) నేను; అజోఽపిసన్=జన్మలేనివాడ నైనను; అవ్యయాత్మా=నశించని జ్ఞానశక్తి కలవాడ నైనను; భూతానాం=బ్రహ్మాదిస్తంబపర్యంత మగు భూతములకు; ఈశ్వరోఽపిసన్=పరిపాలించు స్వభావము కలవాడ నైనను; స్వాం=స్వకీయ మగు; ప్రకృతిం=సత్త్వరజస్తమోగుణాత్మకమగు మాయను; అధిష్ఠాయ=స్వాధీన మొనరించుకొని; ఆత్మమాయయా=నా సంబంధమగు మాయచే; సంభవామి=దేహవంతునివలె యగుచుంటిని. ॥౬॥

శాంకరభాష్యమ్:—

కథం తర్హి తవ నిత్యేశ్వరస్య ధర్మాధర్మాభావేఽపి జన్మేత్యుచ్యతే— అజోఽపీతి। అజోఽపి జన్మరహితోఽపి సం స్తథాఽవ్యయాత్మాఽక్షీణజ్ఞానశక్తిస్వభావోఽపి సం స్తథా భూతానాం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జన్మమును గూర్చి ధర్మాధర్మములు కారణములు, నిత్యుండవు, ఈశ్వరుడవు, నగు నీకట్టి ధర్మాధర్మములే లేనపుడు జన్మమే సంభవము కాదు. అనేక జన్మము లెట్లు నీకు సంభవించెను

జన్మముల నెట్లు తెలిసికొందువు ? (తెలిసికొనలేవని భావము). "పరం శత్రుం భేదదృష్ట్యా పరికల్ప్య హంతుం ప్రవృత్తోఽసీతి పరంతప !" (శత్రువు లొకని భేదదృష్టిచే వేరుగ గల్పించి వాని బరిమార్చుటకు ప్రవర్తించుచుంటివి ఇట్టి విపరీతదర్శి వగుటచే భ్రాంతుడ వయితివని పై సంబోధనచే సూచింపబడెను. పై సంబోధనద్వయముచే నావరణవిక్షేపములు రెండును యజ్ఞానధర్మములుగ జూపబడెను).

శంకరానందీయము:— ఈ నా మాయావిలాసవైభవము నే సత్యమని తెలిసికొనువారు మూఢులే యగుదురు కాని నాతత్త్వమును దెలిసికొను పండితులకు- నాయందీశ్వరత్వభావనయు, శ్రద్ధయు, నా వాక్యములయందు ప్రమాణబుద్ధియు కలుగును. నేను స్వయముగ నజుడను, అవ్యయుడను, సర్వభూతముల కీశ్వరుడను, నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావుడను నైయున్నను స్వీయమహిమచే నిత్యసిద్ధజ్ఞానైశ్వర్యశక్తిబలవీర్య తేజస్సంపన్నుడను, లోకనిగ్రహానుగ్రహచికీర్షువును నగు నాకీవిధముగ ననేకజన్మములు కలవని యీశ్లోకమున జెప్పుచున్నాడు—

అప్రమేయస్వభావుడను, అనంతశక్తిమంతుడను, పరమేశ్వరుడను, అగు నాకు దేవతిర్యఙ్మనుష్యులలో ననంఖ్యాకములగు జన్మములు గలిగినవి. నీకు నితరులకు ననేకజన్మములు గలిగినవి. వీటినన్నిటిని నేనెరుగుదును. (అనగా "నహి విజ్ఞాతు ర్విజ్ఞాతే ర్విపరిలోపో దృశ్యతే" (విజ్ఞాతకు విజ్ఞానలోప ముండదు). అను శ్రుతిచొప్పున నప్రతిహతవిజ్ఞానశక్తి కలవాడ నగుటచే నతీతానాగతవర్తమాన కాలికమగు సర్వార్థజాతమును నేనెరుగుదునని యర్థము). నీవైతే వీనిని నేటిని యెరుగకుందువు, అనగా (పాపపుణ్యరాగద్వేషములచే దిరోభూతమైన జ్ఞానశక్తి కలవాడ వగుటచే నతీతానాగతవర్తమానార్థజాతములో కొద్దిగ నైన దెలిసికొనలేకుంటి వని యర్థము). ॥౫॥

—♦ ౪వ అధ్యాయము— ౫వ శ్లోక వ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— "నీ యతీతానేకజన్మకత్త్వమును స్మరించెడి నీ వొక జాతిస్మరుడ వగు జీవుడ వగుదువు. "శాస్త్రదృష్ట్యా తూపదేశో వామదేవవత్" అను సూత్రోక్తరీతి వామదేవు డను యోగి జీవు

శాంకరభాష్యమ్:—

బ్రహ్మాది స్తంబపర్యంతానామీశ్వర ఈశనశీలోఽపి సన్ ప్రకృతిం స్వాం మమ వైష్ణవీం మాయాం త్రిగుణాత్మికాం యస్యా వశే సర్వం జగద్వర్తతే, యయా మోహితం సత్స్వమాత్మానం వాసుదేవం న జానాతి తాం ప్రకృతిం స్వా మధిష్ఠాయ వశీకృత్య సంభవామి దేహవా నివ భవామి జాత ఇవాత్మమాయయాఽఽత్మనో మాయయా న పరమార్థతో లోకవత్ ॥౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ననెదవా? జన్మము లేనివాడనైనను, క్షీణముకాని జ్ఞానశక్తిస్వభావము కలవాడనైనను; బ్రహ్మాది స్తంబపర్యంతంభూతముల కీశ్వరుడనైనను, దేనివశమునందు నిఖిలజగత్తుయుండి దేనిచే మోహపెట్టబడినదై తనను వాసుదేవస్వరూపముగ దెలిసికొనుటలేదో యట్టి సత్త్వరజస్తమోగుణాత్మక మగు నాసంబంధమైన వైష్ణవీమాయను స్వాధీన మొనరించుకొని, పుట్టినవానివలె, దేహవంతునివలె నాసంబంధమగు మాయచే నగుచుంటిని. లోకమువలె నాకు శరీరముల యందు పరమార్థత్వాభిమానము లేదు. అనగా నాజన్మము పారమార్థికము కాదు. మరేమనిన ప్రాతిభాసికమని గ్రహింపవలయును. ॥౬॥

డర్యేను 'నేను మనువు నైతిని', సూర్యుడనైతిని అని సార్వాత్మ్యభిమానముచే పరజన్మజ్ఞానము కలవా డర్యేనం కనుకనే యిట్టి జీవసాధారణసర్వజ్ఞతాశాలిని డ వగు నీవు సర్వజ్ఞుఁ డగు సూర్యున కెట్లుపదేశించితివి? మఱియు జీవుడు వ్యష్ట్యుపాధికుడు గాన పరిచ్ఛిన్ను డగును. అట్టి జీవునకు సర్వసంబంధిత్వము పొసగదు గాన ముఖ్యమగు సర్వజ్ఞత్వము సంభవింపదు. మఱియు సమష్ట్యుపాధికు డగు విరాట్టుగూడ స్థూలభూతోపాధికుడు గాన నట్టి విరాట్టునకు సూక్ష్మభూత పరిణామవిషయకము,మాయాపరిణామవిషయకమునగు జ్ఞానము సంభవింప నేరదు. ఇటులే సూక్ష్మోపాధికు డగు హిరణ్యగర్భునకు తత్కారణ మాయా పరిణామాకాశాది సర్గక్రమాదివిషయకజ్ఞానము సంభవింపనేరదు. కనుక నీశ్వరుఁడే కారణోపాధికుడు గాన యతీతాదిసర్వార్థజ్ఞానవంతుడై ముఖ్యసర్వజ్ఞుఁ డగును. (ఇట కాలత్రయనిబంధితము లగు మాయావృత్తులు మూడని గాని, లేక సర్వము విషయముగాగల మాయావృత్తి యొకటియే యనిగాని యూహింపదగును.) అట్టి సర్వజ్ఞుఁడు, నిత్యుడు నగు యీశ్వరునకు ధర్మాధర్మములు లేమింజేసి జన్మమే పొసగదు గాన యతీతానేకజన్మవత్త్వమసలే పొసగనేరదు. ఇట్లగుటచే "జీవత్వ మున్నచో సర్వజ్ఞత్వ మనుపపన్న మగును. ఈశ్వరత్వమున్నచో దేహగ్రహణ మనుపపన్న మగు" నను శంకాద్వయమును నీశ్లోకమున పరిహరించుచు నీశ్వరానిత్యత్వపక్షమునుగూడ నిరాకరించుచుండెను.

అపూర్వదేహేంద్రియాదిగ్రహణము జన్మ మనబడును. పూర్వగృహీతదేహేంద్రియాదివియోగము వ్యయము (మృతి) మనబడును. ఈరెంటిని తార్కికులు ప్రేత్యభావమందురు. ఈజన్మవ్యయములే "జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ" అను వచనముచే చెప్పబడినవి. ఈరెండు ధర్మాధర్మవశమున గలుగుచుండును. ఇది ధర్మాధర్మవశత్వము— దేహాభిమానియు నజ్ఞుడునగు జీవునకు కర్మాధికారముకలన ప్రాప్తించుచుండును. ఇట్లుండ సర్వకారణుఁడు సర్వజ్ఞుడునగు ఈశ్వరుడీవిధమగు దేహమును గ్రహించు టనుపపన్న మనుటయు క్తము. అట్లుకానిచో శ్రీకృష్ణునియొక్క శరీరము (1) స్థూలభూత కార్యమా? లేక (2) సూక్ష్మభూత కార్యమా? స్థూలభూతకార్యమను ప్రథమపక్షమున (1) వ్యష్టిరూపమా. లేక (2) సమష్టిరూపమా. వ్యష్టిరూపమన్నచో జాగ్ర దవస్థయు, అస్మదాదిసామ్యము యనివార్యము. సమష్టిరూపమన్నచో సమష్ట్యుపాధికుఁడగుటవలన విరాడ్జీవరూప

త్వము శ్రీకృష్ణున కనివార్యము. సూక్ష్మభూతకార్యము శ్రీకృష్ణశరీరమను ద్వితీయపక్షమున నట్టిశరీరము (1) వ్యష్టిరూపమా? లేక (2) సమష్టిరూపమా? వ్యష్టిరూపమన్నచో స్వప్నావస్థయు, అస్మదాది తుల్యత్వము సంభవించును. సమష్టిరూపమన్నచో సమష్ట్యుపాధికుండగుటవలన హిరణ్యగర్భ జీవస్వరూపత్వము సంభవించును. ఈ చెప్పుట వలన తేలిన యాశయమేమి? పరమేశ్వరునకు జీవావిష్టము కాని భౌతికదేహము సంభవింపదని సిద్ధ మగుచున్నది. జీవావిష్టమగు శరీరమునందు శ్రీకృష్ణపరమాత్మ భూతావేశమువలె ప్రవేశించెనని చెప్పుటయు పొసగదు. ఆ శరీరమునందు జీవునకు భోగమంగీకరించినచో నంతర్యామిరూపుడగు పరమేశ్వరునకు సర్వశరీరప్రవేశము సిద్ధమగుచుండ శరీరవిశేషము నొప్పుట (భూతావేశమువలె జీవశరీరమునందు ప్రవేశించెనని చెప్పుట) వ్యర్థమగును. భోగమే లేదనినచో (భోగాయతనమగు) జీవశరీరత్వమే యనుపపన్నమగును. కాన నీశ్వరశరీరము భౌతికశరీరము కాదని పూర్వార్థముచే చెప్పుచుండెను, "అజోఽపిసన్" (పుట్టుక లేనివాడు) అను విశేషణముచే, నీశ్వరుఁడు పూర్వమునందు లేని మఱియొకశరీరమును ధరింపడని సూచితమయ్యెను. "అవ్యయాత్మాసన్" (నాశములేనివాడు) అను విశేషణముచే నీశ్వరునకు పూర్వదేహవిచ్ఛేదము నిరాకృతమయ్యెను. "భూతానామీశ్వరోఽపిసన్" (బ్రహ్మాదిస్తంబపర్యంతమగు సర్వభూతములకు ప్రభువు) అను విశేషణముచే నీశ్వరుఁడు ధర్మాధర్మములకు వశవర్తి కాడని సూచితమైనది. అట్లగుచో నీశ్వరునకు దేహగ్రహణమెట్లుపపన్నమగుననుశంకను ఉత్తరార్థముచే తొలంగించుచుండెను. "ప్రకృతింస్వాం" అఘటనఘటనాసమర్థయు, విచిత్రానేకశక్తిమతియు, స్వోపాధిభూతయునగు మాయను, "అధిష్ఠాయ" చిదాభాసచే వశపరచుకొని "సంభవామి" ఆ మాయాపరిణామ విశేషములచేతనే దేహవంతుడువలె, పుట్టినవాడువలె నయ్యెదను. అనాదియగు మాయయే నాకు ఉపాధియై యెల్లప్పుడుండునది, గాన నిత్యమై, జగత్కారణత్వ సంపాదకమై మదిచ్ఛానువర్తినియై, విశుద్ధసత్త్వమయి యగుటచే నాకు మూర్తియైయుండును. అట్టి మాయావిశిష్టుడగు నాకు అజత్వము, అవ్యయత్వము, ఈశ్వరత్వము, ఉపపన్నములగును. కాన నట్టి నిత్యమగు దేహముతోడనే నీకును, సూర్యునకును, గూడనుపదేశించితిననుట యుపపన్నము. "ఆకాశశరీరం బ్రహ్మ" (బ్రహ్మము అవ్యాకృతాకాశశరీరకము) అనుశ్రుతియు, "ఆకాశస్తల్లింగాత్" అను న్యాయము నీశ్వరుడు మాయామాత్రవిగ్రహుఁడే యని తెల్పుచున్నవి. "ఈశ్వరునిశరీరము భౌతికశరీరమే కానిచో, భౌతికశరీరధర్మములగు మనుష్యత్వాదుల ప్రతీతి యెట్లు సంభవించుచున్నది." అను శంకను "ఆత్మమాయయా" అను పదముచే తొలంగించుచుండెను. నాసంబంధమగు మాయచేతనే లోకానుగ్రహమునకై నాయందు మనుష్యత్వాదిప్రతీతి కలుగుచున్నది గాని వస్తుస్థితిచే నాయందు మనుష్యత్వాదిధర్మములేవియు లేవనిభావము. ఈవిషయమునే మోక్షదర్శనమున భగవంతుడు నారదునకిట్లుపదేశించెను. "మాయాహ్యేషా మయా సృష్టా య న్మాం పశ్యసి నారద! । సర్వభూతగుణై ర్యుక్తం న తు మాం ద్రష్టు మర్హసి" (ఓ నారదా! యీమాయ నాచే సృజింపబడినది. దీనినే నన్నుగా జూచుచుంటివి. కాని సర్వభూతగుణములతో గూడిన (కారణోపాధికుడనగు) నన్ను చర్మచక్షువుతో జూడజాలవు.) మఱియు నీవిషయమునే శ్రీశంకరభగవత్పాదులు గూడ గీతాభాష్యాదియందు "స చ భగవాన్ జ్ఞానైశ్వర్యబలవీర్య తేజోభిః సదా సంపన్న స్త్రిగుణాత్మికాం వైష్ణవీం స్వాం మాయాం ప్రకృతిం వశీకృత్యాఽజోఽవ్యయో భూతానా మీశ్వరో నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావోఽపి సన్ స్వమాయయా దేహవా నివ జాత ఇవచ లోకానుగ్రహం కుర్వన్నక్ష్యతె స్వప్రయోజనాభావేఽపి భూతానుజిఘృక్షయా" అని చెప్పియుండిరి. కొందరు వ్యాఖ్యాతలుగూడ పైవిధముగనే స్వేచ్ఛావినిర్మితము, మాయామయముదివ్యమునగుస్వరూపముచే నవతరించెనని వ్యాఖ్యానించిరి. "నిత్యో యః కారణోపాధిః మాయాఖ్యోఽనేకశక్తిమాన్। స ఏవ భగవద్దేహ ఇతి భాష్యకృతాం మతమ్" (మాయాభిధానకము, విచిత్రానేకశక్తులు కలదియు, నగు కారణోపాధియే భగవద్దేహ మని భాష్యకారుల యభిప్రాయము) అను నీశ్లోకముగూడ నిరుక్తవిషయమును ధృవపరచుచున్నది. మరికొందరు పరమేశ్వరునకు దేహదేహిభావమును దలపక నిత్యుడు, విభువు, సచ్చిదానందఘనుడు. భగవంతుడు,

వాసుదేవుడు, పరిపూర్ణుడు, నిర్గుణుడు నే పరమాత్మ యగునో యాపరమాత్మరూపవిగ్రహము కలవాడగును. స్వేతరమగు- భౌతికమగునది కాని మాయికమగునది కాని యగుశరీరమా పరమేశ్వరునకు లేదని చెప్పుదురు. ఈ పక్షమున నిట్లు యోజింపదగును. “ఆకాశవత్సర్వగతశ్చ నిత్యః” “అవినాశీ వా అరేయ మాత్మాఽనుచ్ఛిత్తిధర్మా” అను మొదలగు శ్రుత్యుక్తరీతిని “అసంభవస్తు సతోఽనుపపత్తేః” “ఆత్మా శ్రుతే ర్నిత్యత్వాచ్చ తాభ్యః” ఇత్యాది న్యాయానుసారము వస్తుస్థితి ననుసరించి నేను జన్మవినాశరహితుడను, సర్వావభాసకుడను, సర్వజగత్కారణ మాయాధిష్ఠాన మగుటచే సర్వభూతేశ్వరుడను, అయినను “స్వాం ప్రకృతిం” సచ్చిదానందఘనైకరసస్వరూప మగు స్వభావ (నిజస్వరూప) మును (ఇట ప్రకృతిశబ్దము మాయావాచకము గాన నట్టి మాయావ్యావృత్తికొరకు “స్వాం” అని ప్రయోగించెను.) “అధిష్ఠాయ” అధిష్ఠించియే (స్వస్వరూపావస్థితుడ నయియే) “సంభవామి” దేహదేహిభావమును విడచియే దేహవంతునివలె వ్యవహరించెదను. అట్లగుచో దేహవంతుడు కాని పరమేశ్వరునియందు దేహప్రతీతి యెట్లు సంభవించుచున్నది. అను నాశంకపై జెప్పుచున్నాడు. ‘ఆత్మమాయయా’ నిర్గుణుడను, శుద్ధుడను, సచ్చిదానందరసఘనుడను, వాసుదేవుడను, భగవంతుడను, దేహదేహిభావశూన్యుడను అగు నాయందు దేహప్రతీతి స్వీయమాయచేతనే యగుచున్నది. (మాయామాత్రకల్పితమే) అని యాశయము. “కృష్ణమేనమవేహి త్వ మాత్మాన మఖిలాత్మనాం। జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాఽఽభాతి మాయయా” (ఈ శ్రీకృష్ణ పరమాత్మను సమస్తజనులకు నాత్మనుగ దెలిసికొనుము. ఆ పరమాత్మయే జగములకు మేలుకూర్చువాడై యీ భూమియందు స్వీయమాయచే దేహవంతునివలె భాసించుచుండెను.) “అహో! భాగ్య మహో భాగ్యం నందగోప వ్రజౌకసాం। యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనం” (నందగోపుని పల్లెయందున్నవారి కెంతభాగ్య మబ్బెను. సనాతనమగు పరిపూర్ణానంద పరబ్రహ్మము వారి కాప్తమిత్రుడయ్యెను. కాన వారికెంత భాగ్యమబ్బెను.) అను నీరెండుశ్లోకములు పై యర్థమును పోషించుచున్నవి. మఱికొందరు— నిత్యుడు, నిరవయవుడు, నిర్వికారుడు, పరమానంద రసస్వరూపుడు నగు పరమాత్మకు అవయవావయవిభావము నొప్పి వాస్తవిక దేహము కలదని తలచుచుండిరి. కాని “నిర్యుక్తికం బ్రువాణస్తు నాస్మాభి ర్వినివార్యతే” అను న్యాయానుసారము వారి మతమును ఖండింపకుంటిమి. అట్టి వాస్తవిక దేహమే సంభవించుచో నది యటులే యగుగాక విస్తృత వ్యర్థవిచారణతో నేమి ప్రయోజనము.

శంకరానందీయము:— “కర్మణా బధ్యతే జంతుః కర్మణైవ ప్రలీయతే” (ప్రతిజంతువు కర్మము చేతనే పుట్టుచుండును; గిట్టుచుండును) అను స్మృత్యుక్తరీతిని జన్మమరణములకు హేతువులగు పుణ్యపాపకర్మలు లేమింజేసి స్వతంత్రుడవగు నీకు జన్మాదు లెట్లు సంభవించును. అను నాశంకకు సమాధానముగ నాకీజన్మమరణములు మాయచేతనే కలుగుచున్నవి. కాని, లోకులకువలె పుణ్యపాపకర్మలచే కలుగుటలేదని యీ శ్లోకమున జెప్పుచున్నాడు. “అజః” (ఎప్పుడును, దేనివల్లను పుట్టనివాడు) “న తస్య కశ్చిజ్జనితా న చాధిపః” (ఆపరమేశ్వరునకు జనకుడు గాని, ప్రభువుగాని యెవ్వడును లేడు) అను శ్రుత్యనుసారము జన్మాదిహేతువులగు యుపాదానాదులు లేమింజేసి జన్మరహితుడనే యగుదును. మఱియు నటులే “అవ్యయాత్మా” నిరవయవుడ నగుటచే వినాశకారణ సామగ్రీసంబంధము సంభవింపదు. నాశక్రియలకు విషయము కాని స్వభావము కలవాడను (అనగా “అజో నిత్యః” అను శ్రుత్యుక్తరీతిని నేనెల్లప్పుడు నిత్యుడనే గాని షడ్వికారమగు నాశము కలవాడను కాను.) “అజః, అవ్యయాత్మా” అని విశేషణద్వయముచే తదంతరాలపతితములైన వికారము లేవియు లేనివాడనని ద్యోతనజేయబడెను. కర్మనిమిత్త జన్మాదికము లేకపోయినను నీవు ఈశ్వరుడు, నియంతయు కేరాకడు కలడా? యను ప్రశ్నకు సమాధానముగ “భూతానా మీశ్వరోఽపి సన్” అని జెప్పుచున్నాడు. “ఏష సర్వేశ్వరః” అను శ్రుతిచొప్పున బ్రహ్మాదిస్తంబ పర్యంతమగు సర్వభూతములకు నేనే స్వసన్నిధిమాత్రముచేతనే ప్రభువును, నియంతనుయగుదును గాని “న చాధిపః”

అను శ్రుతిచెప్పున నితరుని కెన్నటికిని నియోగవిషయుడను కాను. ఈవిధముగ నజుడను, అవ్యయుడను, సర్వభూతేశ్వరుడనైనను వికారరహిత పరమాత్మనగుదును. అట్టి నేనే "ప్రకృతిం" "మాయాం తు ప్రకృతిం విద్యాత్" అను శ్రుతిచెప్పున ప్రకర్షతో కృతి (సృష్ట్యాదిక్రియ) దేని సకాశమునుండి యగునో అట్టి త్రిగుణాత్మికమగు మాయ ప్రకృతి యనబడును. "స్వాం" "కార్యోపాధి రయం జీవః కారణోపాధి రీశ్వరః" అను శ్రుత్యుక్తరీతిని తన కుపాధిభూతము, అవ్యక్తసంజ్ఞికము నగునట్టి మాయ నధిష్ఠించి (ఆమాయయందును, మాయాకార్యమునందును "నేను నాది" అను భావనను జేసి) "ఆత్మమాయయా సంభవామి" ఆత్మాధీనమగు మాయచే సంభవించెదను. లేక సూర్యునివిడచి కాంతియు, నగ్నిని విడచి ఉష్ణత్వము వేరుగనుండనట్లు నన్ను విడచి మాయయను నది వేరుగ సంభవించదు గాన మదభిన్నమాయ "ఆత్మమాయ" యనఁబడును. ఈవిషయమునే "దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢాం" అను శ్రుతియు స్థిరపరచుచున్నది. అట్లుకానిచో (పరమేశ్వరునికంటె మాయ భిన్నముగనే యున్నదనిచో) నద్వైతహానియు, శ్రుతివిరోధము ప్రాప్తించెడిని, కాన దహనశక్తి వహ్న్యభిన్నమైనట్లు మదభిన్నము, ప్రకృతిశబ్దితము నగు మాయచేతనే నేను జన్మవంతుడ నగుచుంటిని. కాని వస్తుతః జన్మవంతుడను గాను. ఏమన, పరమార్థతః జన్మవంతుడనే యన్నచో "నిష్కలం నిష్క్రియం శాంతం, న జాయతే మ్రియతే వా విపశ్చిత్" అను శ్రుతులకు విరోధము సంభవించును. కాన నేను మాయచేతనే దేవాదులయందు సంభవించుచుంటిని. ఈవిధముగ తత్పదార్థమగు నీశ్వరుని జన్మాదికము మాయిక మని బోధిత మగుటచే త్వంపదార్థమగు జీవు డీశ్వరాభిన్ను డగుటవలన జీవుని జన్మాదికముగూడ నావిద్యకమే యని సూచింపబడెను.

భాష్యోత్కర్షదీపిక:— పరమేశ్వరునియందు శరీరశరీరిభావము సంభవింపదు. మరేమనిన? నిత్యుడు, విభువు, సచ్చిదానందఘనుఁడు, భగవంతుఁ డగు వాసుదేవుఁడు నగు నేను పరిపూర్ణుఁడు, నిర్గుణుఁడు, పరమాత్మ జన్మవినాశాది రహితుఁడు జగత్కారణుఁ డగుటచే సర్వభూతముల కీశ్వరుఁడ నైనను నిజరూపమగు సచ్చిదానందఘనైకరసస్వరూపమగు స్వభావము నధిష్ఠించి (అనగా స్వస్వరూపావస్థితుఁడనై) శరీరశరీరిభావము లేకుండగనే దేహివలె వ్యవహరించుచుంటిని. అట్లగుచో దేహశూన్యుఁ డగు సచ్చిదానందఘనునియందు శరీరిత్వప్రతీతి యెట్లు పొసగు? నను శంకను తొలగించుటకు "ఆత్మ మాయయా" అని చెప్పెను. అనగా నిర్గుణుఁడు, శుద్ధుఁడు, సచ్చిదానందఘనుఁడు, శరీరశరీరిభావశూన్యుఁడు, భగవంతుఁడు, వాసుదేవుఁడు నగు నాయందు శరీరశరీరిభావప్రతీతి మాయామాత్ర మని యర్థము. కనుకనే "కృష్ణమేన మవేహి త్వ మాత్మాన మఖిలాత్మనాం। జగద్ధితాయ సోఽప్యత్ర దేహీవాఽఽభాతి మాయయా" అని శ్రీమద్భాగవతమునందు 'దేహీవ' (శరీరము కలవానివలె) అని చెప్పఁబడెను. శ్రీమద్భాగవతమునందే "అహో! భాగ్య మహో! భాగ్యం నన్దగోపవ్రజౌకసాం। యన్మిత్రం పరమానన్దం పూర్ణం బ్రహ్మ సనాతనం" అని పరిపూర్ణరూపము పరమానందరూపమునగు బ్రహ్మమే శరీరివలె గోపగోపికలకు మిత్రరూపమువలె భాసించెనని చెప్పుచుండెను". అని కొందరు చెప్పుచుండిరి.

ఈవిషయమున కొంత విచారింపదగియున్నది. పరమేశ్వరునియందు శరీరశరీరిభావము లేదని చెప్పుట "మాయచే శరీరశరీరిభావము పరమేశ్వరునియందు కలదు. వాస్తవికముగ శరీరశరీరిభావము లేదు." అని యంగీకరించిన భగవద్భాష్యకారుల మతమునకు విరుద్ధమగుటచే నుపాదేయము కాదు.

నిత్యుడు, అందునను నిర్గుణుడు, "అథాత ఆదేశో నేతి నేతి। నేదం యదిద ముపాసతే। ఏకమేవాద్వితీయం। సత్యం జ్ఞానమనన్తం బ్రహ్మ। విజ్ఞానమానన్దం బ్రహ్మ। అస్థూలమన ణ్వహ్రస్వమదీర్ఘం। యత్ర నాన్య త్పశ్యతి నాన్యచ్ఛృణోతి నాన్యద్విజానాతి స భూమా। యో వై భూమా త త్సుఖం। యతో వాచో నివర్తన్తే। అప్రాప్య మనసా సహ। త దేత దపూర్వ మనపర మనన్తర మబాహ్య మయ మాత్మా బ్రహ్మ సర్వానుభూః। నిష్కలం

నిష్క్రియం శాన్తం నిరవద్యం నిరంజనం। అపాణిపాదం'' ఇత్యాదిశ్రుతితాత్పర్యసిద్ధమగు పరమాత్మయే పరమాత్మవిగ్రహ మని చెప్పుటయు పొసగదు.

ఎందువలననిన ? అట్టి విగ్రహము (1) సాకారమా ? (2) లేక నిరాకారమా ? సాకారమనుపక్షమున (1) నిర్గుణమగు పరమాత్మయొక్క పరిణామమా ? (2) లేక వివర్తమా ? నిర్వికారునకు వికారస్వరూపమగు పరిణామము సంభవింపనందున పరిణామమను పక్షము సంభవింపదు. అట్లు కాక నిర్వికారునకు కూడ వికారస్వరూపమగు పరిణామమంగీకరించినచో నవికారియగు పరమాత్మ కనిత్యత్వము సంభవించెడిని. వివర్తమను పక్షమునందు వివర్తమును సాధించెడి మాయ యవశ్య మంగీకరింపవలెను. అట్లంగీకరించిన నట్టి భగవద్దేహము మాయికమైయుండ "భగవద్దేహము మాయికము కాదు''. అని చెప్పుట యసంగతము. కాన భగవద్దేహము సాకారమను ప్రథమపక్షము సమంజసము కాదు. ఇక నిరాకారమను ద్వితీయపక్షమును విచారింతము. సర్వాకారశూన్యుడని యంగీకరించి తిరిగి విశేషాకారముచే గ్రహింపబడువాడు కాన సవిగ్రహుడని చెప్పుట స్వవచన వ్యాఘాతమగును కాన భగవద్విగ్రహము నిరాకారమని చెప్పుటయు పొసగదు. మరియు అట్టి భగవద్విగ్రహము (1) హస్తపాదాదులు కలదా ? లేక హస్తపాదాదులు లేనిదా ? హస్తపాదాదులు కలదను ప్రథమపక్షమున నట్టి హస్తపాదాదులు (1) దృశ్యములా ? లేక (2) అదృశ్యములా ? దృశ్యములను ప్రథమపక్షమున భగవద్విగ్రహము పంచభూతకార్యము కానందున మాయికమని యవశ్య మంగీకరింపవలెను. అదృశ్యమను ద్వితీయపక్షమున భక్తులకు దర్శనాదులు సంభవింపకపోయెడిని. కాన ద్వితీయపక్షముకూడ సంభవింపదు. భగవద్విగ్రహసంబంధమగు హస్తపాదాదు లదృశ్యములైనను మాయచే దృశ్యములగును. కాన భక్తులకు దర్శనాదిలోపము సంభవింపదనెదవా? అట్లగుచో నట్టి హస్తపాదాదులు (1)పరమాణ్వాదులవలె యదృశ్యములా ? (2) లేక బ్రహ్మస్వరూపమగుటచే నదృశ్యములా ? పరమాణ్వాదులవలె యదృశ్యములను ప్రథమపక్షమున పరమాణ్వాదులు యోగులకు యోగబలముచే నక్షిగోచరములు గాన నట్లే భగవద్విగ్రహ సంబంధమగు హస్తపాదాదులు గూడ యోగుల కక్షిగోచరములు కావలసివచ్చును. గాన భగవద్విగ్రహసంబంధమగు హస్తపాదాదులు పరమాణ్వాదులువలె నదృశ్యము లను ప్రథమపక్షము సమంజసముకాదు; ఇక బ్రహ్మస్వరూపముచే నదృశ్యములను ద్వితీయపక్షమునందు హస్తపాదాదు లవయవములు. అట్టి యవయవములు కలది భగవద్విగ్రహమని స్వశిష్యముఖబంధన (ముఖపిధాన)రూపమగు వచనమాత్రమే యగును కాని స్వేష్టము సిద్ధింపనేరదు. ఈ చెప్పుటవలన నేతత్పక్షము ననుసరించి క్లిష్టకల్పనచే శ్లోకయోజనకూడ.నిరాకృతము.

ఉదాహృతవచనద్వయమునుగూడ భాష్యకారుల మతమునందు లెస్సగ నుపపన్న మగును. కాన సచ్చిదానందస్వరూపుడు, మాయావిశిష్టుడు, "యతోవా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి। యత్ప్రయన్త్యభిసంవిశంతి'' "యత స్సర్వాణి భూతాని భవంత్యాదియుగాగమే। యస్మింశ్చ ప్రలయం యాంతి పునరేవ యుగక్షయే'' "జన్మాద్యస్య యతః'' ఇత్యాది శ్రుతిస్మృతిన్యాయములచే జగత్కారణప్రతిపాదితుడు, శుద్ధబుద్ధముక్తస్వభావుడు, అశరీరి, సర్వేశ్వరుడు, మాయానియంత యగు పరమాత్మ సాధకానుగ్రహార్థమై తన మాయచే లీలావిగ్రహమును గ్రహించి జన్మించినవాడువలె, విగ్రహవంతుడువలె భాసించుచుండె ననెడి మతము శ్రుతిస్మృతీతిహాసపురాణానుగ్రహీతంబగు మతము. ఈ మతమే సర్వజ్ఞులు, భాష్యకర్తలు నగు శ్రీశంకరభగవత్పాదుల మతము. ఈ మతమే శరణ బొందదగినది.

"భగవంతునిశరీరము కర్మవలన జనించినది కాదు. కనుకనే "అజోఽపిసన్'' అని చెప్పబడెను. అట్లగుచో భగవంతుడగు శ్రీకృష్ణుని దేహము జన్మించుటకు కారణ మేది ? అవిద్య యనెదమా ? భగవంతుని కవిద్యయే లేనందున నదియు పొసగదు. జీవావిద్యయే భగవద్దేహమున కుపాదాన మనెదమా ? జీవావిద్యవలన జనించెడి శుక్తిరజతాదులువలె భగవద్దేహముకూడ తుచ్ఛ మయ్యెడిని. చిన్మాత్రముభగవద్దేహమున కుపాదాన మనిన చిత్తునకు

సాకారత్వము సంభవింపనందున నదియు సంభవము గాదు. చిత్తునకు సాకారత్వము సంభవించు ననినను చిత్తు యింద్రియగోచరము కానందున తదుపాదానక మగు భగవచ్ఛరీరముకూడ యింద్రియగోచరము కాకపోయెడిని. కాన దేవకీగర్భప్రవేశ, జనన, బాల్య, కౌమార, పౌగండ, యౌవనాది ప్రతీతివిషయ మగు భగవద్దేహము దేని నవలంబనము జేసుకొని జన్మించెను? అని ప్రశ్నించిన "ప్రకృతిం స్వాం" జీవాత్మలు పంచభూతాత్మక మగు ప్రకృతిని యాధారముగ జేసుకొని జన్మాదులను పొందుచుండిరి. నేనైతే ప్రత్యగ్రూపముకంటె వేరు కానట్టి "ప్రకృతిం" ప్రత్యక్చైతన్యము నధిష్ఠించి, "ఆత్మమాయయా" స్వీయమాయచే జన్మాదులను పొందుచుంటిని. ఒకానొక మాయను తాను స్వస్థానమునందే యున్నవాడైనను యదృశ్యుడైనను, స్థూలసూక్ష్మభూతములను స్వీకరించకయే కేవల మాయచేత తనతో సమాన మగు రెండవ మాయావిని నేత్రమార్గముచే గగనము నధిష్ఠించు వానిని యెట్లు సృజియించునో, అట్లే నేనును కూటస్థచిన్మాత్రుడనై, అగ్రాహ్యుడనై నా మాయచే చిన్మయ మగు నాయొక్క శరీరమును సృజించెదను. అట్టి శరీరమునకు బాల్యాద్యవస్థలు నేత్రగ్రాహణమువలె చూపించెదను. కాని లౌకికమాయావి తన మాయ నుపసంహరించుచు రెండవవాడగు మాయావినికూడ నుపసంహరించును. నేనైతే నామాయను యుపసంహార మొనరింపను. నాదేహమును యుపసంహరించను. ఇదియే లౌకికమాయావికిని, నాకును గల విశేషము. ఇట్లగుచో హిరణ్యశ్మశ్రుత్వాది లక్షణములుకల విగ్రహముతో గూడిన చేతనుని "అంతస్తద్ధర్మోపదేశాత్" ఇత్యాదిన్యాయసిద్ధమగు వియదాద్యుపాదానలక్షణమగు సర్వేశ్వరత్వ ముపపన్నమగును. మఱియొకవిధమున యుపపన్నము గానేరదు. కాన పరమేశ్వరునకు మాయామయశరీరము నిత్యమని సిద్ధము. "హిరణ్యశ్మశ్రుత్వాదిలక్షణమగు నొక దేహముచేతనే సూర్యున కుపదేశించి నీకు గూడ నుపదేశించుచుంటిని". అని కొందరు వర్ణించుచుండిరి.

ఈ విషయమున కొంచెము చెప్పదగియున్నది. నియమ్యదేహముకంటె వేరుగ నియామకదేహము లేనందున నొకదేహముచేతనే నుపదేశించుచుంటి ననునది యుపపన్నము గాదు. మఱియు హిరణ్యశ్మశ్రుత్వాది ధర్మవిశిష్టమగు నాదిత్యాంతర్యామిదేహమే శ్రీకృష్ణదేహ మగుచో శ్రీకృష్ణదేహ మటులే హిరణ్యశ్మశ్రుత్వాదిలక్షణములు కలదియే కనుపించవలసివచ్చును. మేఘశ్యామత్వాదిలక్షణములు కలదిగ కనుపించకపోయెడిని. మాయచే నట్లు కనుపించె ననెదరా! అంతకంటె హిరణ్యశ్మశ్రుత్వాదివిశిష్టదేహములు సవిశేషములు కాన మాయికము లనియు. అందుచే కృష్ణాదివిగ్రహములు పరంపరయా మాయికము అని భాష్యవిరుద్ధకల్పనకంటె పరమేశ్వరుడశరీరుడైనను సాధకానుగ్రహార్థ మాదిత్యాంతర్యామిరూపముచే కృష్ణాదిదేహాత్మస్వరూపముచేతను, మాయచే నవస్థానము సంభవించునని వర్ణించుట శ్రేష్ఠము. ఒకానొక లౌకికమాయావి అనునది మొదలుకొని దృష్టాంత పురస్సరముగ జెప్పబడిన విషయముకూడ సమంజసము కాదు. అట్లగుచో భగవంతుడగు వాసుదేవునిచే మొట్టమొదట నాలుగు బాహువులు కల రూపము చూపింపబడి తిరిగి రెండుభుజములు కలరూపము జూపింపబడెను. దానిని యంతర్హిత మొనరించి, తిరిగి యారూపమే ప్రకటితమను ప్రసిద్ధికి విరోధము వాటిల్లును. అట్లు కానిచో ననంతమగు మోహిన్యాది పరమేశ్వర దేహము లొకసారియే కనుపింపవలసి వచ్చును. కాన పరమేశ్వరుడు భక్తులనిమిత్తము ఆయా విగ్రహముల నావిర్భవింపజేయును. తిరిగి యాదేహములను తిరోధాన మొనరించునని యవశ్య మంగీకరింపవలయును. "అజోఽపి" ఇత్యాది విశేషణములచే భాష్యకారోక్త వ్యాఖ్యానముచే పరమేశ్వరుడగు శ్రీకృష్ణపరమాత్మకు జీవునికంటె వైలక్షణ్యము కనుపించుచుండ భాష్యవిరుద్ధము, క్లిష్టము అప్రసిద్ధము నగు నర్థము కల్పించుట యనుచితము. కాన "ఏతేనాహం" ఇత్యాదికముచే కొందరిచే వర్ణింపబడిన యాశయము నిరాకృతము. కనుకనే యీశ్వరదేహాభిప్రాయముచే నర్జునుడు ప్రశ్నించెనని పూర్వమునందు జెప్పబడిన కొందరి యభిప్రాయము పరమేశ్వరునకు వాస్తవదేహము లేనందున తొలగింపబడెను.

కాన నో శ్రీకృష్ణా! నీవుకూడ నసర్వజ్ఞుడవై, జీవుడవే కదా, అట్టి నీవాదిత్యునిగూర్చి యుపదేశించుట విరుద్ధము అని మూర్ఖాభిప్రాయముచే నర్జునుడు ప్రశ్నించెను. "నేను జీవునివలె ధర్మాధర్మాది పరతంత్రుడను కానందున నజుఁడను, అవ్యయాత్మను, భూతములకీశ్వరుఁడను. ఇట్టివాడ నైనను నా ప్రకృతి నధిష్ఠించి స్వమాయచే సంభవించుచుంటిని" అని చెప్పుటచే నీశ్వరుఁడను, సర్వజ్ఞుఁడ నగు నేను సర్గాదియం దుపదేశముకొరకే యోగ్య మగు విగ్రహమునుధరించి, సూర్యునికొరకే యోగము నుపదేశించితినో ఆ నేనే యిప్పుడు కూడ నీకొరకా యోగము నుపదేశించితి నను యుత్తరము సమంజసము.

పరమార్థప్రప:— శ్రీకృష్ణపరమాత్మ తనకీశ్వరత్వమును ప్రకటించుచు నిట్లు చెప్పదొడగెను. "అజః" అనుత్పత్తి ధర్మముకలవాడనై, "అవ్యయాత్మా" అవినాశ ధర్మముకలవాడనై, "భూతానా మీశ్వరః" భూతములకు ప్రభువునై (కర్మపారతంత్ర్యరహితుడనై) "సంభవామి" లెస్సగ లోపించని సర్వజ్ఞత్వాది గుణములు కలవాడనై యగుచుంటిని. శ్రీకృష్ణపరమాత్మ యీశ్వరు డగుచో నీశ్వరునకు లింగదేహాదులు లేనందున జన్మ మెట్లు పొసగును. అను నాశంకను తొలగించుటకు 'ప్రకృతిం' అని చెప్పుచుండెను. 'స్వాం' నాయం దధ్యస్తము, శుద్ధసత్త్వాత్మకము నగు ప్రకృతి నధిష్ఠించి అనగా స్వేచ్ఛావిర్భూతశుద్ధసత్త్వాత్మకమూర్తిచే నవతరించుచుంటిని. ఈవిషయమే "సతో హి మాయయా జన్మ జాయతే న తు తత్త్వతః ॥ అసతో మాయయా జన్మ తత్త్వతో నహి యుజ్యతే। వంధ్యాపుత్రో న తత్త్వేన మాయయా వాపి జాయతే" సద్రూపమునకు మాయచే జన్మ సంభవించును. తత్త్వమువలన సంభవింపదు. అసత్తునకు మాయచే జన్మ యథార్థముగ సంభవింపదు. ఈవిషయమున దృష్టాంతము- వంధ్యా (గొడ్డురాలి) పుత్రుడు తత్త్వమువలన నప్రసిద్ధుడు మాయచేతను జన్మింపడు.

నీలకంఠీయము:— "నీవు సర్వజ్ఞుడవైన నేమి? జీవులగు యోగులకు సర్వజ్ఞత్వము ప్రసిద్ధమే. కాన నీవుకూడ పూర్వజన్మస్మృతికల జీవుడవే" అను శంకను 'అజః' అను శ్లోకముచే దొలగించుచుండెను. దేహత్వము కంటె వేరుపరుపబడిన యాత్మకజత్వము, అవ్యయత్వము "నత్వేవాహం జాతు నాసం" అను శ్లోకమునందు సాధింపబడెను. ఈశ్లోకమునందు దేహవిశిష్టమగు నీశ్వరున కజత్వము, అవ్యయత్వము "ఈశ్వరోఽపి సన్" అను దానిచే చెప్పబడుచుండెను. దేహవ్యతిరిక్తమగు నస్మదాదులకు కూడ నీశరత్వము "తత్త్వమసి" 'అహం బ్రహ్మాస్మి' ఇత్యాదిశ్రుతులవలన బ్రసిద్ధమే. కాన దేహవిశిష్టునకే యజత్వము, నిత్యత్వము యిచట దృఢము జేయబడుచుండెను. అట్లు కానిచో పరమాత్మకనీశ్వరత్వము ప్రాప్తించెడిని. ఆదిత్యాంతర్యామియగు పరమేశ్వరుని హిరణ్యశ్మశ్రుత్వాదివిశిష్టమగు దేహము కర్మవలన జన్మించినది కాదుగాన నుత్పత్తివినాశములు గలది గాదు. కర్మఫలమునకు పరాకాష్ఠ (చివరిహద్దు) హైరణ్యగర్భశరీరప్రాప్తియే. "పురుషోహ వై నారాయణోఽకామయత అత్యతిష్ఠేయం సర్వాణి భూతాని అహ మేవేదం సర్వం స్యామితి। స ఏతం పురుష మేధం పంచరాత్రం యజ్ఞక్రతు మపశ్యత్" ఇత్యాదివాక్యములచే శతపథబ్రాహ్మణమునందు నారాయణాఖ్య పరమాత్మకు "సహస్రశీర్షా పురుషః। సహస్రాక్షః సహస్రపాత్, స భూమిం విశ్వతో వృత్వా। అత్యతిష్ఠద్దశాంగులం" "పాదోఽస్య సర్వా భూతాని త్రిపాదస్యామృతం దివి" అను పురుషసూక్త ప్రతిపాదితమగునట్టియు, సర్వభూతముల నతిక్రమించి యున్నట్టియు, యీశ్వరునకు గూడ శరీరము పంచరాత్రమనెడి కర్మవిశేషఫలముగ క్రియమాణ మగుటవలన నీశ్వరుని దేహము గూడ కర్మాయత్తమగుటఁజేసి యనిత్యమేయని శంకింపఁజనదు. శతపథబ్రాహ్మణముచే జెపబడు నారాయణుడు హిరణ్యగర్భుడే. అతనిదేహము పంచరాత్రాఖ్యకర్మవిశేషమువలన జనించినను పరమేశ్వరదేహ మట్టిది కాదు.

కాన నది నిత్యమే. పూర్ణకాముడు, సర్వము నతిక్రమించియున్నట్టి పరమేశ్వరునకు "సర్వభూతముల నతిక్రమించి యుండగలను". అని తిరుగ కామన సంభవింపదు. పరమేశ్వరునియందుగూడ కామన "సోఽకామయత బహుస్యాం ప్రజాయేయేతి" అను శ్రుతిప్రసిద్ధమే యనెదవా ? నీవెంత శ్లాఘనీయప్రజ్ఞ కలవాడవు. సాక్షాత్తు దేవతలకు ప్రియుడవగు నీవు "ఆప్తకామస్య కా స్పృహా" "లోకవత్తు లీలాకైవల్యం" అను శ్రుతిన్యాయములవలన విస్పృహుడు, లీలచేతనే బ్రహ్మాండకోటులను సృజించునట్టి పరమేశ్వరుడు నగు శ్రీకృష్ణపరమాత్మకర్మను సర్వాత్మ్యమును ప్రార్థించునట్టి కింకరకృతమగు కర్మతో సామ్యము నాపాదించుచుంటివి. కాన భగవంతుని శరీరము కర్మవలన ప్రాప్తించునది కాదు. కనుక నేవిరాట్సూత్రాత్మాతిరిక్తునకు భౌతికము సంభవింపదు గాన పరమేశ్వరదేహము భౌతికము కాదు. కాన "అజోఽపి సన్" అని చెప్పుట న్యాయమే.

పరమేశ్వరదేహము భౌతికము కాదన్నచో నికదాని కుపాదానకారణమేది ! పరమేశ్వరునకు అవిద్య సంభవింపదు. కాన నది యీశ్వరదేహమున కుపాదానమగుట యుపపన్నము గాదు. ఇక జీవావిద్యోపాదానకములగు శుక్తిరజతాదులు తుచ్ఛములు. అట్టి జీవావిద్య పరమేశ్వరదేహమున కుపాదానమనిన శుక్తిరజతాదులవలె పరమేశ్వరదేహముగూడ తుచ్ఛము కావలసివచ్చును. పరమేశ్వరదేహము చిన్మాత్రమే యనిన దానికి సాకారత్వము పొసగకుండెడిని. అట్లగుచో (సాకారకమే కాదనినచో) నతీంద్రియము కావలసివచ్చును, కాన దేవకీగర్భప్రవేశజననబాల్యకౌమారపౌగండ యౌవనాది ప్రతీతివిషయమగు భగవద్దేహమునకు ఆలంబనమేమనిన వినుము "ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా" దీనికి నిష్కృష్టాశయమిది— జీవాత్మలు అనాత్మభూతము, భౌతికమునగు ప్రకృతినధిష్ఠించి జన్మమును పొందుచుందురు. నేనైతే ప్రత్యక్చైతన్య రూపమగు ప్రకృతినే యధిష్ఠించి (ఇతరమగు యుపాదానమును గ్రహింపకయే) నాసంబంధమగు మాయచే జన్మించుచుంటిని. అదెట్లనిన ! ఒకానొక మాయావి స్వయముగ స్వస్థానమునుండి యప్రచ్యుతస్వభావము కలవాడైనను యదృశ్యుడై స్థూలసూక్ష్మభూతములను గ్రహించకయే కేవలమాయచే తనతో సమానుడును, సూత్రమార్గముచే గగనము నధిష్ఠించుచున్నట్టియు నగు రెండవ మాయావిని సృజియించును. ఇట్లే నేనును (కూటస్థచిన్మాత్రము) స్వమాయచే చిన్మయమగు శరీరము నాత్మకు సృజించెదను. అట్టి దేహమునకు బాల్యాద్యవస్థలు సూత్రారోహణమువలె చూపించుచుంటిని. ఇంతమాత్రమే విశేషము. లౌకికమాయావి మాయ నుపసంహరించుచు రెండవవాడగు సూత్రస్థమాయావినిగూడ యుపసంహరించును. నేనైతే నామాయ నుపసంహరింపనివాడనై నాదేహమునుకూడ నుపసంహరింపను. ఇట్లగుచో హిరణ్యశ్మశ్రుత్వాది లక్షణములతో గూడిన చైతన్యమునకు "అంతస్తద్ధర్మోపదేశాత్" ఇత్యాది న్యాయసిద్ధమగు వియదాద్యుపాదానత్వ స్వరూపమగు సర్వేశ్వరత్వము సంభవించును. మరియొకతీరున సంభవింపదు. కాన పరమేశ్వరునకు మాయామయమగు శరీరము నిత్యమని సిద్ధమగుచున్నది. కాన, నొకదేహము చేతనే సూర్యున కుపదేశించి యాదేహము చేతనే నీకు నుపదేశించుచుంటిని. మరియొకస్థలమునందుగూడ నాజగన్మూర్తి నిత్యమైనదే యని సావధారణముగ ప్రతిజ్ఞ చేయబడుచుండెను. "దేవానాం కార్యసిద్ధ్యర్థ మావిర్భవతి సా యదా । ఉత్పన్నేతి తదా లోకే సా నిత్యా ప్యభిధీయతే" దేవతల కార్యసిద్ధ్యర్థ మెపుడు జగన్మూర్తి యావిర్భవించునో అపుడు లోకమునందు నిత్యమైనదైనను యాజగన్మూర్తి పుట్టెను. అని చెప్పబడుచున్నది. సూర్యునకువలె నిత్యమైనను జగన్మూర్తికి యావిర్భావము నుపేక్షించి బాల్యాదికము, ఉత్పత్త్యాదికము అంగీకరింపబడుచున్నది. భాష్యమునం దైతే తన స్వరూపము ప్రకృతిరూపము, వైష్ణవి త్రిగుణాత్మకము అగు మాయను స్వాధీనమొనరించుకొని యాత్మమాయచే దేహవంతునివలె, పుట్టినవానివలె కనుబడుచుంటిని. పరమార్థమువలన లోకమువలె గాదు. అని వ్యాఖ్యానింపబడెను. ॥౬॥

గీ|| యదా యదా హి ధర్మస్య గ్లాని ర్భవతి భారత! |
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహమ్ ||౭||

పదవిభాగము:— యదా-యదా-హి-ధర్మస్య-గ్లానిః-భవతి-భారత!-అభ్యుత్థానం-అధర్మస్య-తదా-ఆత్మానం-సృజామి-అహమ్ | ||౭||

ప్రతిపదార్థము:— హే భారత!=భరతాన్వయసంభూతుఁడ వగు నో యర్జునా!; యదాయదాహి=ఏయేసమయములయందు; ధర్మస్య=వర్ణాశ్రమాచారాదులచే నూహింపఁదగిన ధర్మమునకు; గ్లానిః=హాని; భవతి=అగుచున్నదో; అధర్మస్య=అధర్మమునకు; అభ్యుత్థానం=అభివృద్ధి; భవతి=(ఈ పద మావృత్తము) అగుచున్నదో; తదా=అట్టిసమయములందు; అహం=నేను; మాయయా=(ఈ పద మధ్యాహార్యము) మాయచే; ఆత్మానం=నా స్వరూపమును; సృజామి=సృజియించుచుంటిని. ||౭||

శాంకరభాష్యమ్.—
తచ్చ జన్మ కదా కిమర్థం చేత్యుచ్యతే— యదేతి | యదా యదా హి ధర్మస్య గ్లాని ర్హాని ర్వర్ణాశ్రమాదిలక్షణస్య ప్రాణినా మభ్యుదయనిశ్శ్రేయస సాధనస్య భవతి భారత! అభ్యుత్థాన ముద్భవోఽధర్మస్య తదాఽఽత్మానం సృజా మ్యహం మాయయా ||౭||

శాంకరభాష్యతత్త్వబోధినీ.—
నీకట్టి మాయానిబంధనమగు జన్మ మెపుడు ప్రాప్తించును. యెందులకు ప్రాప్తించును. అనిన వినుము చెప్పెదను. భరతాన్వయసంభూతుఁడ వగు నో యర్జునా! ధర్మనాశన మగుచో ప్రాణుల కభ్యుదయ నిశ్శ్రేయసములు సమకూరవు. కాన, నభ్యుదయ నిశ్శ్రేయసములకు హేతువు ధర్మము. వర్ణాశ్రమాచారాదులచే నూహింపదగినట్టి యాధర్మమున కెపు డెపుడు హాని సంభవించునో, అధర్మ మెపుడు వృద్ధినొందునో అపుడు మాయచే నాస్వరూపమును సృజియించెదను. (అట్టిసమయమున నేనేను మాయానిబంధనమగు దేహమును ధరియించెదను). ||౭||

—♦ ౪వ అధ్యాయము ౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఇట్టి సచ్చిదానందఘనుఁడవగు నీ కెప్పు డెందులకు దేహివలె వ్యవహారము సంభవించునెదవా! వేదవిహితము, ప్రాణుల యభ్యుదయ నిశ్శ్రేయసములకు హేతువు, వర్ణాశ్రమతదాచారములచే వ్యంగ్యము. ప్రవృత్తినివృత్తిరూపము నగు ధర్మమున కెపుడెపుడు హాని సంభవించునో ఇటులే నెపు డెపుడు వేదనిషిద్ధము, నానావిధదుఃఖసాధనము, ధర్మవిరోధియగు నధర్మ ముద్భవించునో అట్టితరి నాస్వరూప మగు దేహము నిత్యసిద్ధ మైనను సృజింపబడినదానివలె మాయచే జూపించుచుండెదను. (ఇట "భారత!" అని సంబోధనచే భరతవంశోద్భవుఁడవు కాన, లేక జ్ఞానరతుఁడవు కాన నీవు ధర్మహానిని సహించుటకు సమర్థుఁడవు కావని యర్థము గ్రహింప నగును).

భాష్యోత్కర్షదీపిక:— నిత్యసిద్ధ మగు నాత్మస్వరూపదేహమును సృష్టింపబడినదానివలె చూపించెదనని కొందరు (మధుసూదనసరస్వతులు) వ్యాఖ్యానించిరి. ఇట కొంచెము విచారింతము. (1) పరమేశ్వరదేహము పరమేశ్వరునికంటెభిన్నమా? లేక పరమేశ్వరానన్యమా? పరమేశ్వరునికంటె భిన్న మను ప్రథమపక్షమున నట్టి దేహమున కసత్త్వాద్యాపత్తిచే సచ్చిదాదిరూపత్వస్వీకారమునకు విరోధము ప్రాప్తించును. కాన ప్రథమపక్షమా

గీ॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్ ।
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥ ॥౮॥

పదవిభాగము:— పరిత్రాణాయ-సాధూనాం-వినాశాయ-చ-దుష్కృతాం-ధర్మసంస్థాపనార్థాయ-సంభవామి-యుగే-యుగే । ॥౮॥

ప్రతిపదార్థము:— సాధూనాం=సన్మార్గమునందు ప్రవర్తించువారలయొక్క; పరిత్రాణాయ=అంతట రక్షించుటకొరకును; దుష్కృతాం=పాపము నాచరించువారలయొక్క; వినాశాయ=నాశముకొరకును; ధర్మసంస్థాపనార్థాయ=ధర్మముయొక్క సంస్థాపనముకొరకును; యుగే యుగే=ప్రతియుగమునందు; మాయయా=(ఈ పదము అధ్యాహార్యము) మాయచే; సంభవామి=జన్మించుచుంటిని. ॥౮॥

శాంకరభాష్యమ్:—

కి మర్థం— పరిత్రాణాయేతి । పరిత్రాణాయ పరిరక్షణాయ సాధూనాం సన్మార్గస్థానాం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కృతకృత్యుడగు పరమేశ్వరుడు ధర్మము కృశించునట్టియు, అధర్మము వృద్ధినొందునట్టి

సమంజసము గాదు. పరమేశ్వరదేహము పరమేశ్వరానన్య మను ద్వితీయపక్షమునందు ఆ దేహము పరిచ్ఛిన్నమా? లేక అపరిచ్ఛిన్నమా? (సర్వవ్యాపకమా) పరిచ్ఛిన్న మనినచో నీశ్వరునకు పరిచ్ఛిన్నత్వమే సంభవించెడిని. అట్లగుచో నీశ్వరదేహమునకు నిత్యసిద్ధత్వమును జెప్పెడివారలచే పరమేశ్వరున కసత్త్వము సంపాదిత మగును. అట్టియసత్త్వసంపాదనచే మూలోచ్ఛేదమే సంపాదిత మగును. ఈశ్వరదేహ మపరిచ్ఛిన్న మను ద్వితీయపక్షమునను యీశ్వరదేహ మపరిచ్ఛిన్న మని జెప్పి, తిరిగి యవయవసమూహము పరిమితాకారము నని చెప్పుట స్వవచనవిరోధ మగును.

స్వాభిప్రాయము:— భాష్యోత్కర్షదీపికాకారుల స్వభావ మెన్నడు మారదు. పరమతమును రామానుజులయొక దోషోద్ఘాటనచే దూషించుట వీరికి స్వభావము. మధుసూదనసరస్వతు లేమి జెప్పిరి? సచ్చిదానందస్వరూప మగు నా దేహమును స్పష్టమైనదానివలె జూపించెద నని జెప్పిరి. దీని యర్థ మేమి? పరమేశ్వరానన్యమగు దేహము అవయవసంబంధము లేనిదైనను యవయవసంబంధము కలదివలె యపరిచ్ఛిన్నమైనను పరిచ్ఛిన్నమువలె జూపించెద ననియే కదా యర్థము. పరమేశ్వరానన్యము పరమేశ్వరదేహ మని జెప్పుచుండ పరమేశ్వరునికంటె దేహము భిన్నమా? అనన్యమా? అని భాష్యోత్కర్షదీపికాకారుల వికల్ప మెటుల సంభవించును? సంభవింపదు. పరమేశ్వరదేహము సచ్చిదానందపరమేశ్వరస్వరూప మని జెప్పుటచే పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు గనుక నట్టి దేహము గూడ సర్వవ్యాపకమే యని యర్థము స్పష్ట మగుచుండ నట్టి దేహము పరిచ్ఛిన్నమా? అపరిచ్ఛిన్నమా? అని దీపికాకారుల వికల్పమునకు తా వెక్కడిది! సర్వవ్యాపక మగు నా స్వరూప మైనను నా దేహమును యవయవసంబంధము కలదానినిగను, పరిమితాకారము కలదానినిగను చూపించెద నని జెప్పుటయందు యేమి స్వవచనవిరోధ ముండును? ఒక మాయావి పెద్దదియగు ప్రాసాదమును సూక్ష్మ మగు తన ముఖముచే మ్రింగునట్లు మాయచే జూపించును. అం దేమి యాశ్చర్యము? అటులే యీశ్వరుడు తన మాయచే నపరిచ్ఛిన్న మగు తన స్వరూపమును పరిచ్ఛిన్నమైనదానివలె జూపించుటయం దేమియు విరోధ ముండదు. అట్లు జెప్పుటయందును స్వవచనవిరోధము ప్రాప్తింపదని మా యభిప్రాయము. ॥౭॥

—♦ ౪వ అధ్యాయము—౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఓ శ్రీకృష్ణా! ధర్మహానియు, అధర్మవృద్ధియు, నగు కాలమునం

శాంకరభాష్యమ్:—

వినాశాయ చ దుష్కృతాం పాపకారిణామ్ । కించ ధర్మసంస్థాపనార్థాయ ధర్మస్య సమ్యక్స్థాపనం తదర్థం సంభవామి యుగే యుగే ప్రతియుగమ్ ॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సమయమునసే ప్రయోజనము నుద్దేశించి మాయానిబంధన దేహమును పొందవలయు ననెదవా? సత్పురుషులను రక్షించుటకు, పాపాత్ములను నశింపజేయుటకు, ధర్మసంస్థాపనకొరకు, ప్రతియుగమునం దాత్మమాయచే జనించెదను. ధర్మము స్థాపితమైనచో జగము స్థాపితమగును. లేనిచో జగము భిన్నమైన మర్యాదకలదై అసంగత మగును. ॥౮॥

దావిర్భవింతు ననుచుంటివి. అట్లగుచో ధర్మవినాశము, అధర్మవృద్ధి నీయావిర్భావహేతువులు కాన నారెండును నీకు సంతోషకారులా? అటులైనచో నీయవతార మనర్థమును సమకూర్చునదే యనుశంకను "పరిత్రాణాయ" అను శ్లోకముచే తొలంగించు చుండెను.

ధర్మహానిచే క్షయమును పొందుచుండిన వేదమార్గానుసారులగు పుణ్యపురుషులను సర్వవిధముల రక్షించుటకును, అధర్మవృద్ధిచే నభివృద్ధిని పొందుచున్న వేదమార్గవిరోధులగు పాపకారుల వినాశముకొరకును ప్రతియుగమునం దావిర్భవించెదను. పై రెండును యెట్లగుననిన ధర్మసంస్థాపనచే నగును. గాన నట్టి ధర్మముయొక్క సంస్థాపనకొరకు (లెస్సగ నధర్మమును నివారించి వేదమార్గపరిరక్షణకొరకు ప్రతియుగమునం దావిర్భవించెదను.

శంకరానందీయము:— ప్రాణము పోవుచున్నను యెవరు స్వధర్మమును పరిత్యజింపరో వారే సాధువు లనబడుదురు. స్వధర్మైకశరణులగు యట్టివారల పరిరక్షణకొరకు (పరిత్రాణమనగ సాధువులు ప్రార్థింపకుండగనే యిహపరలోకవిచ్ఛిత్తి వారలకు కాకుండగ రక్షించుటయే) ఈ చెప్పుటవలన సాధువులు— "ఈశ్వరుడే మనలకు రక్షకుడు" అని ధైర్యముచే స్వధర్మమునం దుండవలయునని సూచింపబడెను మరియు నెవరు వాఙ్మనఃకాయము లనెడి కరణత్రయముచేతను యెంతమాత్రము సుకృతము నాచరింపక దుష్కృతమునే యాచరించెదరో అట్టివారలు దుష్కృతు లనుపించుకుందురు. వారు జగద్దూషకులు. అట్టివారలకు పుత్రపౌత్ర కళత్రసోదరులతో గూడ సమూలవినాశముకొరకును, సత్పురుషుల యభ్యుదయ నిశ్శ్రేయసహేతువగు ధర్మమును యధర్మ తిరస్కారపూర్వకముగ సంస్థాపన చేయుటకును కృతత్రేతాయుగములయందు మాటిమాటికి నామాయచే స్వయముగ నవతరించుచుంటిని. ఈ చెప్పుటవలన దేలిన యాశయమేమి? 1. సాధుపరిపాలనము 2. దుష్టవినాశనము 3. ధర్మసంస్థాపనము అనెడి మూడును భగవదవతారమునకు ప్రయోజనములని సూచింపబడెను. యజ్ఞాదిధర్మమును రక్షించిన దానిచే దేవతలు వృద్ధినొందెదరు. అందుచే వర్షములు సంభవించును. అందువలన నన్నము, దానిచే సర్వప్రాణులు జీవించెదరు. కాన ధర్మరక్షణమాత్రముచే నిఖిలప్రపంచము సురక్షిత మగునని భావము.

పరమార్థప్రప:— సర్వులయందు సమానదృష్టికల పరమేశ్వరునకు సాధుసంరక్షణము, దుష్టనిగ్రహము, న్యాయమా? యని శంకింపజనదు, "లాలనే తాడనే మాతుర్న వైషమ్యం యథార్భకే। తద్వదేవ మహేశస్య నియంతు ర్గుణదోషయోః" పిల్లవానిని లాలించినను తాడనమొనరించినను తల్లికి వైషమ్య మెట్లుసంభవింపదో అటులే నియంతయగు మహేశునకు గుణదోషములవిషయమై వైషమ్యములు లేవని తెలిసికొననగును ॥౮॥

గీ॥ జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః ।
త్యక్త్వా దేహం పున ర్జన్మ నైతి మా మేతి సోఽర్జున ॥ ॥౯॥

పదవిభాగము:— జన్మ—కర్మ—చ—మే—దివ్యం—ఏవం—యః—వేత్తి—తత్త్వతః—త్యక్త్వా—దేహం—పునః—జన్మ—న—ఏతి—మాం—ఏతి—సః—అర్జున! ॥౯॥

ప్రతిపదార్థము:— హేఽర్జున!=ఓ యర్జునుఁడా!; మే=నాయొక్క; జన్మ=మాయారూపమును; కర్మచ=సాధుపరిత్రాణాదికర్మమును; దివ్యం=అప్రాకృతైశ్వర్యము; ఏవం=ఈ పూర్వోక్తరీతిని; తత్త్వతః=యథార్థముగ; యః=ఎవఁడు; వేత్తి=తెలిసికొనునో; సః=ఆ పురుషుఁడు; దేహం=(ప్రారబ్ధకర్మాధీనమగు) నీ దేహమును; త్యక్త్వా=విడిచి; పునః=తిరిగి; జన్మ=జన్మమును; నైతి=పొందఁడు; మాం=నన్నును; ఏతి=పొందుచున్నాఁడు. ॥౯॥

---

శాంకరభాష్యమ్—

తత్— జన్మేతి । జన్మ మాయారూపం, కర్మచ సాధుపరిత్రాణాది, మే మమ దివ్య మప్రాకృత మైశ్వర మేవం యథోక్తం యో వేత్తి తత్త్వత స్తత్త్వేన యథావ త్త్యక్త్వా దేహ మిమం పునర్జన్మ పున రుత్పత్తిం నైతి న ప్రాప్నోతి మా మే త్యాగచ్ఛతి స ముచ్యతే హేఽర్జున! ॥౯॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని—

భగవంతుని జన్మ కల్పిత మనియు, అతని కర్మ సాధుపరిరక్షణము, దుష్టనిగ్రహము, ధర్మస్థాపనమని నాసంబంధమగు న ప్రాకృతైశ్వర్యమును పూర్వోక్తరీతిని యథార్థముగ నెవడు తెలిసికొనునో అట్టివాడీప్రారబ్ధకర్మాయత్తంబగు దేహమును విడచి తిరిగి జన్మమును పొందడు. నన్నును. పొందుచున్నాడు. అనగా ముక్తుడగుచున్నాడు. ఎవడు భగవంతునికి జన్మము వాస్తవమైనది. సాధుజనపరిపాలనాదికము మరియొక క్షత్రియుని కర్మయని తెలిసికొనునో అట్టివాడు తత్త్వమును తెలిసికొనని వాడగుటచే సంసారమునందే నిమగ్నుడగుచున్నాడని యాశయము. ॥౯॥

---

—♦ ౪వ అధ్యాయము— ౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము♦— నిత్య సిద్ధుడను, సచ్చిదానందఘనుడను, అగు నాకు జన్మమనగ నావిలాసచే జన్మించినట్లనుకరించుట, నిత్యసిద్ధేశ్వరస్వరూపుడనగు నాయొక్క కర్మ యనగ ధర్మసంస్థాపనద్వారమున జగత్పరిపాలనము. ఇది ఇతరులు జేయుటకు శక్యము కాదని. ఈశ్వరుడవగు నాకు "దివ్యం" అప్రాకృతము, అసాధారణమునగు కర్మము. ఇటులే "అజోఽపి సన్" ఇత్యాదికముచె జెప్పబడినదానిని భ్రాంతిరహితముగ నెవడు తెలిసికొనునో (అనగా మూఢులు శ్రీకృష్ణునియందు మనుష్యత్వభ్రాంతిచే భగవంతునికిగూడ గర్భవాసాదిరూపమగు జన్మమును స్వభోగార్థమై కర్మయనియు, యారోపించెదరు. ఇటు లారోపించుటకు కారణమేమి? పరమార్థముగ శ్రీకృష్ణుడు శుద్ధసచ్చిదానందఘనరూపుడని తెలియకపోవుటయే. అట్టి యజ్ఞానమును తొలంగించుకొని పరమేశ్వరు డజుడైనను మాయచే జన్మానుకరణము, అకర్తయైనను పరానుగ్రహార్థము కర్మానుకరణము అనియెవడు తెలిసికొనునో) అట్టి వాడాత్మయొక్క తత్త్వస్ఫురణవలన నీదేహమును విడచి తిరిగి జన్మ

గీ॥ వీతరాగభయక్రోధా మన్మయా మా ముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః ॥ ॥౧౦॥

పదవిభాగము:— వీతరాగభయక్రోధాః- మన్మయాః- మాం- ఉపాశ్రితాః- బహవః- జ్ఞానతపసా-పూతాః-మద్భావం-ఆగతాః । ॥౧౦॥

ప్రతిపదార్థము:— బహవః=అనేకులు; వీతరాగభయక్రోధాః-వీత=పోయిన, రాగభయక్రోధాః=కామము, భయము, క్రోధము కలవారై, మన్మయాః=ఈశ్వరాభేదదర్శులై (బ్రహ్మవేత్తలై); మాం=పరమేశ్వరుఁడ నగు నన్నును; ఉపాశ్రితాః=ఆశ్రయించినవారై (కేవలజ్ఞాననిష్ఠులై); జ్ఞానతపసా=పరమాత్మవిషయకమగు జ్ఞానమనెడి తపస్సుచే; పూతాః=పవిత్రమైనవారై; మద్భావం=ఈశ్వరభావమును (మోక్షమును); ఆగతాః=పొందిరి.

శాంకరభాష్యమ్:—

నైష మోక్షమార్గ ఇదానీం ప్రవృత్తః కింతర్హి పూర్వమపి—వీతరాగేతి । వీతరాగభయక్రోధా-రాగశ్చ, భయంచ, క్రోధశ్చ వీతా విగతా యేభ్యస్తే వీతరాగభయక్రోధా మన్మయా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రస్తుతమోక్షమార్గము నూతన మగుటంజేసి యవ్యవస్థితము. అనగా నీవు బోధించిన మోక్షమార్గమునకు వ్యతిరిక్తముగ మరియొకఁడు చెప్పవచ్చును. తద్వ్యతిరిక్తముగ మరియొకఁడు

మును పొందడు. మరేమి చేయుననిన ? భగవంతుఁడను, సచ్చిదానందఘనుఁడను, నగు నన్నే పొందును. సంసారసాగరమునుండి ముక్తుఁడగునని యర్థము.

శంకరానందీయము:— దుష్టులను నిగ్రహించుటకొరకును, శిష్టులననుగ్రహించుటకొరకును, ధర్మసంస్థాపనముకొరకును సూర్యుఁడు మొదలగువారలకు యోగోపదేశముకొరకును మాయచే జన్మించిన శరీరములును, అట్టి శరీరములచే నాచరింపబడిన కర్మలును ఇవన్నియు వస్తుతః బ్రహ్మమాత్రస్వరూపమే అని యెవఁడు తెలిసికొనునో వాఁడు ముక్తిని పొందుచున్నాఁడని "జన్మకర్మ" అనుశ్లోకముచే జెప్పఁబడెను.

"ఇతరాపేక్ష లేకుండగ స్వాత్మయందు స్వయముగ స్వప్రకాశచే ప్రకాశించునది "దివ్యం" అని యనబడును. అది నిర్విశేషచిదేకరసమగు పరబ్రహ్మము. స్వప్రకాశము, పూర్ణానందైకఘనము, అద్వితీయము, సర్వాధిష్ఠానము నగు పరబ్రహ్మమునందు యేప్రకృతి ప్రతీతమగుచున్నదో (భాసించుచున్నదో) నాయొక్క యేప్రాకృతజన్మము, ప్రాకృతశరీరము కలదో ఏకర్మ మట్టి శరీరముచే నాచరింపబడెనో వీనినన్నిటిని యథాశాస్త్రదృష్టిచే పరిశీలించి ఇవన్నియు "దివ్యం దివో బ్రహ్మణస్స్వరూపం" బ్రహ్మయొక్క స్వరూపమగు చైతన్యమాత్రమే యని తెలిసికొనునో "సర్వము బ్రహ్మమాత్రస్వరూపమే" అని తెలిసికొనునట్టి యావిద్వాంసుఁ డీదివ్యదేహమును విడచి తిరిగి జన్మమును పొందఁడు. మరేమగుననిన ? సచ్చిదానందైకరసస్వరూపము, బ్రహ్మము నగు నన్నే పొందును. అనగా విదేహముక్తిని పొందునని యర్థము. ॥౯॥

—♦ ౪వ అధ్యాయము ౧౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— "మామేతి సోఽర్జున" అని పూర్వశ్లోకమునందు జెప్పఁబడెను. ఈ చెప్పుటవలన పరమాత్మ సర్వముక్తప్రాప్య డగుటచే ఈ మోక్షమార్గమునకు పురుషార్థత్వము, అనాదిపరంపరాగతత్వము నిరూపింపబడెను. ఈ విషయమునే "వీతరాగభయక్రోధా" అను శ్లోకముచే గూడ స్పష్టముగ జెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

బ్రహ్మవిద ఈశ్వరాభేదదర్శినో మామేవ పరమేశ్వర ముపాశ్రితాః కేవలజ్ఞాననిష్ఠా ఇత్యర్థః। బహవోఽనేకే జ్ఞానతపసా జ్ఞాన మేవచ పరమాత్మవిషయం తప స్తేన జ్ఞానతపసా పూతాః పరాం శుద్ధిం గతా స్సంతో మద్భావ మీశ్వరభావం మోక్ష మాగతా స్సమనుప్రాప్తాః। ఇతరతపోనిరపేక్షజ్ఞాననిష్ఠా ఇత్యస్య లింగం జ్ఞానతపసేతి విశేషణమ్ ॥౧౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చెప్పవచ్చును. ఎవనికి తోచినట్లు జెప్పిన నది వ్యవస్థితము కాక నవ్యవస్థితమగునని శంకింప జనదు. ఈ మోక్షమార్గ మిపుడే ప్రవృత్తమైనది కాదు. మరేమనిన? పూర్వమునందుకూడ ననేకులు రాగభయక్రోధములను విడనాడి బ్రహ్మవేత్తలై (తమను యీశ్వరాభిన్నముగ "బ్రహ్మైవాహ మస్మి" అని తెలుసుకొని) పరమేశ్వరునే యాశ్రయించి, అనగా కేవలజ్ఞాననిష్ఠాపరులై, పరమాత్మవిషయకజ్ఞానమనెడి తపస్సుచే నుత్కృష్టమగు పరిశుద్ధిని పొంది; మోక్షమును పొందిరి. ఇట "మా ముపాశ్రితాః" అను వాక్యమునకు కేవల ఇతరతపోనిరపేక్షజ్ఞాననిష్ఠులని యర్థము జెప్పుటకు హేతువు "జ్ఞానతపసా" అనునదియే గ్రహింపనగును. ఈ చెప్పుటచే నీమోక్షమార్గము నూతనముగ ప్రవృత్తము కాన నవ్యవస్థిత మనెడి శంక తొలగింపబడెను. ॥౧౦॥

ఫలతృష్ణయే రాగ మనఁబడును. సర్వవిషయములను త్యజించి కేవల జ్ఞానమార్గమునం దెట్లు జీవింపవలయునను వృత్తియే భయ మనఁబడును. ఈ జ్ఞానమార్గము సర్వవిషయములను భేదించునది. ఇట్టి జ్ఞానమార్గ మెట్లు హితమగునను ద్వేషవృత్తియే క్రోధ మనఁబడును. ఇట్టి రాగభయక్రోధములను విడచినట్టి శుద్ధసత్త్వముకలవారై, "మన్మయాః" తత్పదార్థమగు పరమాత్మను త్వంపదార్థ మగు జీవుని యభిన్నముగ సాక్షాత్కార మొనరించుకొని, లేక మదేకచిత్తులై (పరమేశ్వరునియందే చిత్తముకలవారై) "మా ముపాశ్రితాః" ఏకాన్తప్రేమభక్తిచే నీశ్వరుని శరణుబొందినవారై యనేకులు సర్వకర్మక్షయహేతు వగుటవలన జ్ఞానమే తపస్సు. అట్టి తపస్సుచే నశించిన సర్వపాపములు కలవా రగుచు అనగా పోఁగొట్టబడిన నజ్ఞానతత్కార్యమలములు కలవా రగుచు విశుద్ధసచ్చిదానందఘనరూపమగు మోక్షమును పొందిరి. అనగా అజ్ఞానమాత్రము తొలగుటచే మోక్షమును పొందిరి. అని యాశయము. లేక జ్ఞానమనెడి తపస్సుచే జీవన్ముక్తులైనవా రగుచు "మద్భావం" పరమేశ్వరవిషయక మగు రతియని పేరుగల ప్రేమను పొందిరి. అనియైనను భావమును జూచుకొనవలెను. ఈ విషయమునే "తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే" అని శ్రీకృష్ణపరమాత్మయే జెప్పఁగలడు.

శంకరానందీయము:— "యోగః ప్రోక్తః పురాతనః" అనుదానిచే జెప్పఁబడిన జ్ఞానయోగప్రోక్తత్వమునే యీ శ్లోకమున-సర్వము బ్రహ్మస్వరూపమేయను జ్ఞానయోగముచే ప్రాచీను లనేకులు ముక్తులైరి. అని ప్రతిపాదించుచుండెను. "వీతరాగ భయక్రోధాః" ఉపకారకము లగువానియందును, భోగములయందును రాగము, ఆధ్యాత్మికాద్యుపద్రవములనుండి భయము, తన కపకారకులయందు క్రోధము నివి ప్రతివానికి కలుగుచుండును. వీనిని తీవ్రముముక్షుచేతను, సదసద్వివేకవైరాగ్యములచేతను విడనాడినవారు వీతరాగభయక్రోధు లనఁబడుదురు; అట్టివారును—"జ్ఞానతపసా" బ్రహ్మమునే నేను యని యప్రతిబద్ధముగ గలుగు బ్రహ్మాత్మత్వదర్శనమే జ్ఞాన మున

గీ॥ యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహమ్ ।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ ! సర్వశః ॥౧౧॥

పదవిభాగము:— యే- యథా- మాం- ప్రపద్యంతే- తాన్- తథా- ఏవ- భజామి- అహం- మమ- వర్త్మ- అనువర్తంతే- మనుష్యాః- పార్థ!- సర్వశః । ॥౧౧॥

ప్రతిపదార్థము:— హే పార్థ!=పృథాపుత్రుడ వగు నో యర్జునా!; యే=ఎవరు; మాం=పరమేశ్వరుడ వగు నన్నును; యథా=ఏపనులను కోరువారై; ప్రపద్యంతే=శరణ జొచ్చుచుండిరో; అహం=నేను; తాన్=వారలను; తథైవ=తత్ఫలప్రదానము చేతనే; భజామి=అనుగ్రహించుచుంటిని. మనుష్యాః=మనుష్యులు; సర్వశః=సర్వప్రకారములచేతను; మమ=పరమేశ్వరుడ వగు నాయొక్క; వర్త్మ=మార్గమునే; అనువర్తంతే=అనుసరించుచుండిరి. ॥౧౧॥

శాంకరభాష్యమ్:—

తవ తర్హి రాగద్వేషౌ స్తః, యేన కేభ్యశ్చిదేవాత్మభావం ప్రయచ్ఛసి న సర్వేభ్య ఇత్యుచ్యతే— యే యథేతి। యే యథా యేన ప్రకారేణ యేన ప్రయోజనేన యత్ఫలార్థితయా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈశ్వరుడ వగు నీవు సర్వులకు మోక్ష మొసంగెదవా ? "జ్ఞానతపసా పూతాః" జ్ఞానమనెడి తపస్సుచే పవిత్రులై మోక్షమును పొందెదరని జెప్పుట వ్యర్థము. సర్వులకొరకు

బడును. అట్టి జ్ఞానరూపమగు తపస్సనే-"మనసశ్చేంద్రియాణాంచ హ్యైకాగ్ర్యం పరమం తపః" అను స్మృత్యను సారము ముముక్షు వగువాడు జేయదగును. అట్టి జ్ఞానతపముచే 'పూతాః' లెస్సగ వినష్టమైన యనాత్మస్వభావము కలదగుటచే శుద్ధమైన మనస్సుకలవారును నగు శుద్ధాత్ములగు వామదేవాద్యనేక మహర్షులు ముముక్షువులై యెల్లపుడు స్వయముగ 'మాం' అనాదియు, ననంతము, నబాహ్యము, నద్వితీయము నగు పరబ్రహ్మమును (నన్నును) "ఉపాశ్రితాః" ఆశ్రయించినవారలై (అనగా సర్వము బ్రహ్మస్వరూపమే యని వెలుపలను, లోపలను యంతట బ్రహ్మదృష్టిచే సదేకత్వదర్శనమును జేయుచున్నవారలై) 'మన్మయాః" నా (బ్రహ్మ) స్వరూపముచే బూర్ణులై దేహపాతానంతరమున "మద్భావ మాగతాః" బ్రహ్మాత్మస్వరూపావస్థానరూపమగు విదేహముక్తిని పొందిరి.

శ్రీధరీయము:— "నీజన్మకర్మలను దెలిసికొనుచో నీయైక్యమెట్లు సంభవించును ?" అను నాశంక మీద జెప్పుచున్నాడు. నేను శుద్ధసత్త్వరూపములైన యవతారములతో ధర్మరక్షణమును చేయుచుందును గాన నా సంబంధమగు పరమకారుణికత్వమును తెలిసికొని విక్షోభరహితులై రాగ, భయ, క్రోధములను విడచినవారై మదేకచిత్తులై నన్నే యాశ్రయించినవారలై మత్ప్రసాదలభ్యమైన యాత్మజ్ఞానముచేతను తత్పరిపాక హేతువగు తపస్సుచేతను నిర్మూలితమైన అజ్ఞానతత్కార్యమలము కలవారలై పూర్వ మనేకులు నాసాయుజ్యమును పొందియుండిరి. (ఈభక్తిమార్గము క్రొత్తగ బయలుదేరినది కాదనిభావము) "తాన్యహం వేదసర్వాణి" ఇత్యాదిగ్రంథముచే- విద్యావిద్యోపాధులచే దత్త్వంపదార్థములగు నీశ్వరజీవులను ప్రదర్శించి, ఈశ్వరు డవిద్యోపాధికుడు కాడు గాన నిత్యశుద్ధుడగుననియు నందుచే నవిద్యోపాధికుడగు జీవుడు ఈశ్వరానుగ్రహాలబ్ధజ్ఞానముచే నజ్ఞానముతొలగి శుద్ధుడగుననియు, నట్టిశుద్ధమగు సత్తునకు చిదంశముతో నైక్యము జెప్పబడెనని దెలిసికొనదగును.) ॥౧౦॥

—♦ ౪వ అధ్యాయము—౧౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఎవరు జ్ఞానతపస్సుచే పవిత్రులో అట్టి నిష్కాములు నీస్వరూప

శాంకరభాష్యమ్:—

షూం ప్రపద్యంతే తాం స్తథైవ తత్ఫలదానేన భజామ్యనుగృహ్ణామ్యహ మిత్యేతత్ । తేషాం మోక్షం ప్రత్యనర్థిత్వాత్ । న హ్యేకస్య ముముక్షుత్వం ఫలార్థిత్వం చ యుగప త్సంభవతి । అతో యే ఫలార్థిన స్తా న్ఫలప్రదానేన, యే యథోక్తకారిణ స్త్వఫలార్థినో ముముక్షవశ్చ తాన్ జ్ఞానప్రదానేన, యే జ్ఞానిన స్సంన్యాసినో ముముక్షవశ్చ తాన్మోక్షప్రదానేన, తథాఽఽర్తా నార్తిహరణేనేత్యేవం యథా ప్రపద్యంతే యే తాం స్తథైవ భజామీత్యర్థః । న పునా రాగద్వేషనిమిత్తం మోహనిమిత్తం వా కంచి ద్భజామి । సర్వథాపి సర్వావస్థస్య మమేశ్వరస్య వర్త్మ మార్గ మను వర్తంతే మనుష్యాః, యత్ఫలార్థితయా యస్మిన్కర్మ ణ్యధికృతా యే ప్రయతంతే తే మనుష్యా ఉచ్యంతే హేపార్థ ! సర్వశ స్సర్వప్రకారైః ॥౧౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మోక్ష మొసగక కొంతమందికొరకే మోక్షము నొసగెదవా ? అటులైన నీకు రాగద్వేషములు సంభవించెడిని. అట్టి రాగద్వేషములతో కూడిన నీ కీశ్వరత్వ మెట్లు సిద్ధించును ? అని శంకించినచో ఎవ రేఫలము నపేక్షించి నన్ను శరణ బొందెదరో వారలను తత్ఫలప్రదానముచేతనే ననుగ్రహించెదను. ఎవరు మోక్షము నపేక్షించెదరో వారలకు జ్ఞానసంపాదనద్వారమున మోక్షమును, ఎవరు స్వర్గాదిఫలాంతరము నపేక్షించెదరో వారలకు స్వర్గాదిఫలమును యీశ్వరుడొసగును. స్వర్గాదిఫలమును కోరువారు మోక్షము నపేక్షింపనందున వారలకు మోక్షఫలము నొసగడు కాన, యీశ్వరునికి రాగద్వేషములు సంభవములు కావు. ప్రత్యేకము ఫలమును కోరువారలకు బ్రత్యేకఫలము నొసగు గాక. ఒకడే మోక్షమును, స్వర్గాదిఫలమును కోరినచో నారెంటిని యీశ్వరు డొసగునా యని శంకింపజనదు. స్థితిగతులువలె పరస్పరవిరుద్ధములగు ముముక్షుత్వము, ఫలార్థిత్వ మొకనికి యొక్కసారి సంభవములు కావు. కాన నారెంటిని నొకని కెందుల కొసగ డీశ్వరు డను శంకకు తావులేదు. మొట్టమొదట ఫలార్థియై కర్మ

మును (మోక్షమును) పొందెదరనియు, ఎవరు పవిత్రులో సకాములగునట్టివారు నీస్వరూపమును పొందరనియు చెప్పుచుంటివి. అట్లగుచో ఫలదాతవగు పరమేశ్వరుడవైన నీకు వైషమ్యము, నైర్ఘృణ్యము, నిర్దయత్వము సంభవింపవా ? అను శంకను 'యేయథా' అను శ్లోకముచే తొలగించుచుండెను.

పరమేశ్వరుని సేవించువారు నలుగురు. వారెవరనిన ? (1) ఆర్తుడు, (2) అర్థార్థి, (3) జిజ్ఞాసువు, (4) జ్ఞాని. యీనలుగురిలో నెవరెవరు సర్వఫలప్రదాతయగు నన్ను కామనచేగాని, నిష్కామనచేగాని సేవించెదరో వారలు కోరిన ఫలప్రదానముచే నేను వారల ననుగ్రహించెదను: అంతకు విరుద్ధముగ నుండను. వారలలో ముముక్షువులు, కానట్టి యార్తులను వారి యార్తిని తొలిగించి యనుగ్రహించెదను. అర్థార్థులను ధనాదుల నొసగి యాదరించెదను. 'వివిదిషన్తి' అను శ్రుతి విహితంబగు నిష్కామకర్మ నాచరించు జిజ్ఞాసువులను జ్ఞానమొసంగి యనుగ్రహించెదను. ముముక్షువులగు జ్ఞానులను మోక్షప్రదానముచే ననుగ్రహించెదను. ఇంతియేకాని యొకదానిని కోరినవారలకు కోరినదానికంటె వేరగుదాని నొసంగను.

శాంకరభాష్యతత్త్వబోధిని.—

ముల నాచరించినచో నా కర్మఫలము నొసగుచుండ నతడే మోక్షార్థి యుత్తరకాలమున నగుచో నతనికే కాలాంతరమున నీశ్వరుడు మోక్షము నొసగును. కాన నెవరు ఫలము నపేక్షించెదరో వారి కాఫలప్రదానముచేతను, ఎవరు శాస్త్రోక్తకర్మకారులై ఫలము నపేక్షింపక ముముక్షువులో వారలను జ్ఞానప్రదానముచేతను, ఏజ్ఞానులు సర్వకర్మలను పరిత్యజించి, ముముక్షువులో వారలను మోక్షప్రదానముచేతను, అదేవిధమున నార్తుల నార్తిహారణముచేతను, ఎవరెవ రేవిధమున శరణ బొందెదరో వారల నాయావిధముననే నే ననుగ్రహించెదను. రాగనిమిత్తముగ గాని, ద్వేషనిమిత్తముగ కాని మోహనిమిత్తముగ గాని యెవనినిగూడ యనుగ్రహింపను. ఎట్లయినను సర్వవిధములచే మానవులు సర్వత్రయుండిన యీశ్వరుడనగు నాయొక్క మార్గమునే (జ్ఞానకర్మరూపమగు మార్గమునే) యనుసరించుచుండిరి. ఈ శ్లోకమున "మనుష్యులు నామార్గమునే యనుసరించుచుండిరి" అనిచెప్పుటచే యితరు లీశ్వర మార్గానుసారులుకారని చెప్పినట్లగుచున్నదని శంకింపజనదు. ఎవ రేఫలార్థులై, యేకర్మమునం దధికృతులై ప్రయత్నించెదరో, అట్టివారందరును ఇట జెప్పబడిన మనుష్యశబ్దవాచ్యులే. కాన నోయర్జునా! సర్వప్రాణులు సర్వప్రకారములచే నామార్గమునే యనుసరించుచుండిరి. ॥౧౧॥

"అట్లైన ఓకృష్ణా! నీవు నీభక్తులకే ఫలమునిచ్చెదవు. ఇతరులకు ఫలము నివ్వనివాడవగుటచే నీకు వైషమ్యముతప్పు" దనుశంకను 'మమవర్త్మ' అను నుత్తరార్థముచే తొలిగించుచుండెను. ఓ యర్జునా! సర్వాత్ముడను, వాసుదేవుడనగు నాయొక్క భజనమార్గము కర్మరూపము, జ్ఞానరూపము. ఇట్టిమార్గముచే యింద్రాగ్ని వరుణాది దేవతల నుద్దేశించి యజించువారలందరు కర్మాధికారముచే యనుసరించెదరు. కనుకనే బ్రహ్మసూత్రములయందు గూడ 'ఫలమత ఉపపత్తేః' పరమేశ్వరస్వరూపమే సర్వదేవతలగుటవలన పరమేశ్వరునివలననే ఫలము ప్రాప్తించునని స్పష్టముగ చెప్పబడెను. అనగా సర్వస్వరూపమగుటచేతను ఫలదాతయొక భగవంతుడేయని యర్థము. ఈ విషయమునే శ్రీకృష్ణపరమాత్మ "యేఽప్యన్యదేవతాభక్తా," అని చెప్పగలదు. కాన మనుష్యులు యెవరిని సేవించినను వారందరు పరమేశ్వరుని సేవించినవారే. పరమేశ్వరుని సేవింపని మనుష్యుడే లేడు. ఎందులవనిన పైనలుగురిలో ప్రతిమనుష్యుడు ఏదోయొకదానిచే అనగా నార్తిచేతనో, లేక ధనతృష్ణచేతనో జిజ్ఞాసచేతనో, మోక్షకామనచేతనో, పరమేశ్వరస్వరూపమగు నింద్రాదిదేవతలను సేవించువారే) కాన మనుష్యుల నందరిని వారివారి కోరికల ననుసరించి నేననుగ్రహించువాడనే కాన నాకు వైషమ్యము లేదని యాశయము.

శంకరానందీయము:— సుధాబ్ధియందుండు ప్రాణులువలె సర్వప్రాణులును అద్వితీయ పరబ్రహ్మస్వరూపుడవగు నీయందే స్థితులవారగుచుండిరి. కాన త్వదాశ్రయము సర్వులకు తుల్యమేయగుచుండ వారిలో కొందరికే ముక్తిని యనుగ్రహించుచుంటివిగాని యందరకు యనుగ్రహించుటలేదు. నీకీపక్షపాతము తగునా? అను నాశంకమీద— "అమృతాబ్ధివాసులందరకు తద్వాసిత్వము తుల్యమేయైనను అమృతపానము చేసినవారలకే యమరత్వము సిద్ధించునుగాని యితరులకు సిద్ధింపనేరదు. అట్లే నాయాశ్రయము అందరకు సమమేయైనను నన్నొకనినిగూర్చియే పరభావమును బొందువారలకు మోక్షముచేకూరునుగాని యపరభావమును పొందు వారలకు మోక్షము చేకూరదు". అని "తం యథా యథోపాసతే తథైవ భవతి" అను శ్రుత్యర్థముననుసరించి చెప్పుచున్నాడు.

'ద్వేరూపే వాసుదేవస్య వ్యక్తంచావ్యక్తమేవచ । అవ్యక్తం బ్రహ్మణో రూపం వ్యక్తమేతచ్చరాచరం' (వాసుదేవునకు వ్యక్తమనియు, అవ్యక్తమనియు, రెండు రూపములు కలవు అందున- బ్రహ్మస్వరూప మవ్యక్తము. నిఖిల చరాచరజగత్తు వ్యక్తరూపము) అనుస్మృతిచొప్పున నిర్విశేషపరబ్రహ్మస్వరూపమవ్యక్తముగను, మాయోపాధిక కార్యజాతము వ్యక్తముగను, నాతత్త్వమును శాస్త్రాచార్యోపదేశసంస్కృతస్వస్వప్రజ్ఞానురూపముగ దెలిసికొని పరబ్రహ్మవేత్తలు గాని, యపరబ్రహ్మవేత్తలు గాని తత్తత్ఫలార్థులై ద్విధావస్థితుడను పరమాత్మనునగు నాజ్ఞానయోగముచే గాని లేక, మరియొకవిధముచే గాని యుపాసించినచో తత్తత్సాధన నిష్ఠులగు ఉపాసకులు యేయే తత్త్వమునందు పరినిష్ఠితులగుదురో యాయాతత్త్వరూపముగనే ప్రత్యక్షమై వారల ననుగ్రహించెదను. (ఆయా ఉపాసనానురూపమగు ఫలమును వారికి చేకూర్చెదనని యర్థము). "యాదృశీభావనాయత్ర సిద్ధిర్భవతి తాదృశీ" (దేనియందెట్టి భావనకలుగునో అట్టితత్స్వరూపముగనే సిద్ధియు కలుగును). అను న్యాయానుసారము స్వస్వప్రజ్ఞాబలపరిగృహీతవస్తూపాసనానురూపముగనే యాయా ఉపాసకులకు ఫలముసిద్ధించును. గాని మరియొకవిధముగ సిద్ధింపనేరదు. కాన నాకెట్టిపక్షపాతమును లేదు. నేను జ్ఞానకర్మయోగప్రధానము నగు స్వభావముతో నుంటిని. శాస్త్రజ్ఞులు తదనుసారులు, ముముక్షులునగు బ్రాహ్మణాదులు- సర్వేశ్వరుడనగు నాకభిహితము, శ్రుతిస్మృతి విహితము నగు కర్మమార్గము నే యనువర్తించుచుండిరి. లేక నేను లోకసంగ్రహార్థము కర్మను జేయుచుందును. అట్టి మత్కృతివిషయభూతమగు కర్మమార్గమునే యనుసరించుచున్నారు. (విశేషించి కర్మనే చేయుచుండిరని యర్థము).

భాష్యోత్కర్షదీపిక:— తనయందు ప్రసక్తములైన రాగద్వేషముల నీశ్లోకమునందు వారించుచుండెను. "యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవాహం భజామి" (యెవరు యేప్రకారముగ అనగా కామార్థము కాని, అర్థనిమిత్తము కాని, ఆర్తినివృత్త్యర్థము కాని, జ్ఞానమునకై గాని నన్ను సేవించెదరో వారల నావిధముగనే తత్తత్ఫలప్రదానముచే సమస్తఫలప్రదాతను, పరమేశ్వరుడను అగు నేను అనుగ్రహించెదను. "యే మనుష్యులు యేఫలమును కోరి యేకర్మయం దధికృతులై యింద్రాదిదేవతాంతరముల యజించెదరో వారలు సర్వాత్మనగు నాయొక్క కర్మమార్గమునే యనుసరించుచుండిరి. అర్థాంతరవర్ణనవ్యగ్రులగు కొంద రీవిధముగ వ్యాఖ్యానించిరి— యేమనుష్యులు సర్వశరీరస్థుడ నగు నన్ను యేప్రకారముగ (అనగ శత్రుత్వముచే గాని, మిత్రత్వముచే గాని) అనుసరించెదరో వారల నావిధముగనే యనుసరించెదను. యెవరు భక్తిధ్యాన ప్రణిధానాత్మక మగు నామార్గము ననుసరించెదరో వారల నావిధముగనే సర్వవిధముల నేననుసరించెదను. అని. ఈ వ్యాఖ్యానమున 'మాముపాశ్రితాః యజంతే' అని పూర్వోత్తరగ్రంథానుసారియగు "ప్రపద్యంతే భజామి" అను వీనియొక్క యథాశ్రుతార్థము విడువబడెను. "పార్థ!" అను సంబోధనముచే— "ఇతరమనుష్యులుగూడ నామార్గము ననుసరించుచుండిరి గాని మత్సంబంధివగు నీవుమాత్రము నన్ననుసరించకుంటివి" అని ఆశ్చర్యము సూచింపబడెను.

నీలకంఠీయము:— సాధురక్షణమును, అసాధు వినాశమును చేయునట్టి నీకు వైషమ్యము, దయలేకపోవుట యనెడి దోషద్వయము కలదు. అందువలన నస్మదాదులతో సమానమగు నీసంబంధమగు జన్మకర్మస్వరూపముల విచారణచే నేమిప్రయోజనము ? అను నాశంకను "యే యథా" అను శ్లోకముచే తొలగించుచుండెను.

ఏమానవులు సర్వశరీరస్థితుఁడనగు నన్ను యేవిధమున అనగా శత్రుభావముచేగాని, మిత్రభావముచే గాని పొందెదరో వారలనదే భావముచే నేనుకూడ ననుసరించెదను. ఎవరు నామార్గమును (భక్తిధ్యాన ప్రణిధానరూపమగుమార్గము) ననుసరించెదరో నాయాత్మభూతులగువారలను నేను సర్వవిధములచే ననుసరించెదను. జీవుడు ప్రతిబింబస్వరూపుడు. ఈశ్వరుఁడనగు నేను బింబభూతుఁడను. కాన నేను బింబముగాగల ప్రాణిజాతమునం దెవడు ప్రీతినిగాని, ద్వేషమును కాని చేయునో అట్టి మత్ప్రతిబింబభూతుడగు జీవునియందు నేనుకూడ నట్లే ప్రీతిని. ద్వేషమును జేయుదును. బింబమునకు పూజకాని, పరాభవము కాని చేసినచో నది ప్రతిబింబమునందే సంక్రమించును. కాన; వైషమ్య నిర్దయత్వములు నాకు సంభవింపవు. ఇవన్నియు ప్రతిబింబగతములేయని గ్రహింపనగును. అందువలన శ్రేయోర్థి సర్వులకు కల్యాణముకొరకే ప్రయత్నింపవలయునని భావము. ॥౧౧॥

గీ॥ కాంక్షన్తః కర్మణాం సిద్ధిం యజన్త ఇహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా ॥ ॥౧౨॥

పదవిభాగము:— కాంక్షంతః-కర్మణాం-సిద్ధిం-యజంతే-ఇహ-దేవతాః-క్షిప్రం-హి-మానుషే-లోకే-సిద్ధిః-భవతి-కర్మజా । ॥౧౨॥

ప్రతిపదార్థము:— మానుషే లోకే=మనుష్యలోకమునందు కర్మవలన జనించెడి; సిద్ధిః=ఫలసిద్ధి; క్షిప్రం=శీఘ్రముగ; హి=ఏకారణమువలన; భవతి=యగుచున్నదో; అతః=ఆకారణమువలన; ఇహ=ఈ మనుష్యలోకమునందు; కర్మణాం=కర్మలయొక్క; సిద్ధిం=ఫలసిద్ధిని; కాంక్షంతః=కోరుచున్నవారై; దేవతాః=ఇంద్రాగ్న్యాదిదేవతలనుగూర్చి; యజంతే=యాగమును జేయుచుండిరి. ॥౧౨॥

శాంకరభాష్యమ్:—

యది తవేశ్వరస్య రాగాదిదోషాభావా త్సర్వప్రాణిష్వనుజిఘృక్షాయాం తుల్యాయాం సర్వఫలప్రదానసమర్థే చ త్వయి సతి "వాసుదేవ స్సర్వ" మితి జ్ఞానేనైవ ముముక్షవ స్సంతః కస్మా త్త్వామేవ సర్వే న ప్రతిపద్యంత ఇతి శృణు తత్ర కారణమ్— కాంక్షంత ఇతి ॥ కాంక్షంతోఽభీప్సంతః కర్మణాం సిద్ధిం ఫలనిష్పత్తిం ప్రార్థయంతో యజంత ఇహాస్మి౯్ల్లోకే దేవతా ఇంద్రాగ్న్యాద్యాః "అథ యోఽన్యాం దేవతా ముపాస్తేఽన్యోఽసా వన్యోఽహ మస్మీతి న స వేద యథా పశు రేవం స దేవానాం" (బృ॥ 1-4-10) ఇతి శ్రుతేః । తేషాం భిన్నదేవతా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈశ్వరుడవగు నీకు రాగద్వేషాదిదోషములు లేనందున సర్వప్రాణులయం దనుజిఘృక్ష (దయ) సమానమై యుండ, నీవు సర్వఫలప్రదానసమర్థుడవై యుండ "ఈ నిఖిలజగము వాసుదేవస్వరూపమే" అనెడి జ్ఞానముచేతనే ముముక్షువులై నిన్నే యేకారణముచే సర్వులు శరణను పొందరు ? అను శంకపై కారణమును జెప్పుచున్నాడు.

చిరకాలమునకు ప్రాప్తించు ఫలముకన్న శీఘ్రముగ ప్రాప్తించు ఫలము నపేక్షించుట ప్రాణిస్వభావము. అది యెట్లనిన ? ఒకానొకడు క్షుధార్తుడై భిక్షనిమిత్తము రాగా వానిని గాంచి యజమాని 'నీవాతురతను పొందకు; రేపు నీకు షడ్రసోపేతాహారము నిచ్చెద' నన్న నది విని యా భిక్షుకు డేమి సమాధాన మొనరించును ? 'రేపటి భోజన మట్లుండనిమ్ము ! నేడు గంజియైన పోయు' మని రొదచేయును. అనగా నేమి? ప్రాణిజాతము దీర్ఘకాలభావియగు గొప్పఫలము

— ♦ ౪వ అధ్యాయము— ౧౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦ —

మధుసూదనసరస్వతీయము:— "సర్వేశ్వరుడవగు నిన్నే శరణుపొందక కొందరు యితరోపాసన ల నుచేయుచుందురు. కారణమేమి" అను నాశంకమీద చెప్పుచున్నాడు. 'కర్మణాం సిద్ధిం కాంక్షంతః ఇహ దేవాః యజన్తే' కర్మలయొక్క ఫలనిష్పత్తిని కోరినవారలై అజ్ఞానప్రతిహతులగుటచే కొందరు ఇంద్రాదిదేవతలను పూజించుచుండిరిగాని నిష్కామలైనన్ను సేవించుటలేదు. కారణమేమన ? ఇంద్రాదిదేవతాయాజులగు కర్మఫలకాంక్షులకు—"కర్మజా సిద్ధిః మానుషే లోకే క్షిప్రంభవతి" కర్మజన్యమగు ఫలము మనుష్యలోకమున శీఘ్రముగ

శాంకరభాష్యమ్:—

యాజినాం ఫలాకాంక్షిణాం క్షిప్రం శీఘ్రం యస్మా న్మానుషే లోకే హి శాస్త్రాధికారః । క్షిప్రం హి మానుషే లోక ఇతి విశేషణా దన్యేష్వపి కర్మఫలసిద్ధిం దర్శయతి భగవాన్ । మానుషేలోకే వర్ణాశ్రమాది కర్మాణీతి విశేషః । తేషాం వర్ణాశ్రమాద్యధికారికర్మణాం ఫలసిద్ధిః క్షిప్రం భవతి కర్మజా కర్మణో జాతా ||౧౨||

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కన్న శీఘ్రభావియగు నల్పఫలమునే యపేక్షించును. కాన భిన్నదేవతల నుద్దేశించియాగాదులొన రించు ఫలాకాంక్షులకు మనుష్యలోకమున కర్మఫలము శీఘ్రముగ సిద్ధించును. ఇట్లనుటచే నాలస్యముగ లోకాంతరమందుకూడ కర్మఫలము సిద్ధించునని శ్రీకృష్ణపరమాత్మ జెప్పినట్లగు చున్నది. అదియెట్లనినవర్ణాశ్రమాదివిభాగము మనుష్యలోకమునందే కలదు. "శాస్త్రం మనుష్యా నేవాధికరోతి" అను న్యాయమున వర్ణాశ్రమాదిపురస్సరముగ విధించు "బ్రాహ్మణో యజేత" ఇత్యాదిశాస్త్రము ననుసరించి మనుష్యులే శాస్త్రమునం దధికృతు లగుటంజేసి శాస్త్రోక్తకర్మల నాచరించుటకు మనుష్యులకే యధికారము కలదు. అట్టి కర్మములు రెండువిధములు. శరీరాంతరోపభోగ్యఫలదాయకములు, ఈ శరీరోపభోగ్యఫలదాయకములు. అందు మొదటివి జ్యోతిష్టోమాదులు. రెండవవి ఈలోకమునందే వృష్ట్యాదిఫలప్రదానయోగ్యములగు కారీర్యేష్ట్యాదులు. అందు శీఘ్రఫలప్రదానసమర్థములగు కర్మములయందే ప్రాణుల కాసక్తి కలిగి యట్టి వర్ణాశ్రమాద్యధికారి కర్మల నాచరించినచో వాటియొక్క ఫలసిద్ధి శీఘ్రముగ కర్మవలన పుట్టిన దగును. ఇట్టవిధమున దేవతలు వేరు, నేను వేరు. అని యెవడు భిన్నదేవత నుపాసించునో వాడాత్మస్వరూపమును తెలిసినవాడు కాడు. మనచే నొసగబడిన తృణజలాదులను గైకొని హల (నాగలి) వహనాదులచే పశు వెట్లు మనల కుపకరించునో అదే విధమున నీయజ్ఞుడగువాడు కూడ యాగాదులచే దేవతల కుపకరించుటచే నీడు దేవపశు వనబడునని భిన్నదేవతాయజన శీలు రను బృహదారణ్యకశ్రుతి నిందించుచున్నది. అట్టివారలై కర్మల ఫలసిద్ధిని కోరుచు నింద్రాగ్న్యాదిభిన్నదేవతలను గూర్చి యీ మనుష్యలోకమునందు యాగములు సలిపెదరు. కాన శీఘ్రఫలాసక్తులై యాగములు సలిపెడివార లగుటంజేసి సర్వఫలప్రదాతయగు నేనుండినను సర్వప్రాణులయందు దయ నాకుండినను "సర్వము వాసుదేవస్వరూపము" అని ప్రాణులు నన్ను శరణపొందరు. ఇందుకు గారణము శీఘ్రఫలాకాంక్షయేయని గ్రహింపనగును. ||౧౨||

సంభవించును. ఇక జ్ఞానఫలమన్ననో శీఘ్రముగ సంభవించునది కాదు. (ఇట మానుషలోకమున కర్మఫలము శీఘ్రముగ సంభవించునని విశేషించి చెప్పుటవలన మానుషలోక వ్యతిరిక్తస్వర్గాది లోకములయందుగూడ వర్ణాశ్రమ ధర్మవ్యతిరిక్త కర్మఫలమ్ సిద్ధించునని సూచింపబడెను). సకాములగు మోక్షవిముఖులు-క్షుద్రఫలసిద్ధికై మద్వ్యతిరిక్తులగు దేవతల నారాధించెదరు. కనుక నే వారు ముముక్షువు లారాధించినట్లు నన్నారాధింపకుందురని యర్థము.

గీ॥ చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః ।
తస్య కర్తార మపి మాం విద్ధ్యకర్తార మవ్యయమ్ ॥ ॥౧౩॥

పదవిభాగము— చాతుర్వర్ణ్యం-మయా-సృష్టం-గుణకర్మవిభాగశః-తస్య-కర్తారం-అపి-మాం-విద్ధి-అకర్తారం-అవ్యయమ్ । ॥౧౩॥

ప్రతిపదార్థము:— మయా=ఈశ్వరుడ నగు నాచే; చాతుర్వర్ణ్యం=బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రు లనెడి నాలుగువర్ణములు; గుణకర్మవిభాగశః=గుణవిభాగపూర్వకముగను, కర్మవిభాగపూర్వకముగను; సృష్టం=సృజింపబడెను. తస్య=ఆ సృష్టికి; కర్తారమపి=కర్తనైనను; మాం=నన్నును; అకర్తారం=కర్తను కానివానినిగను; అవ్యయం=నాశరహితునిగను; అసంసారిణం=(ఈ పదమధ్యాహార్యము) సంసారరహితునిగను; విద్ధి=తెలిసికొనుము.

శాంకరభాష్యమ్—
మానుష ఏవ లోకే వర్ణాశ్రమాదికర్మాధికారో నాఽన్యేషు లోకేష్వితి నియమః

శాంకరభాష్యతత్త్వబోధిని—
మనుష్యలోకమునందే బ్రాహ్మణాదివర్ణములు, బ్రహ్మచర్యాద్యాశ్రమములు, అవస్థా

శంకరానందీయము:— "మోక్షమునకు సన్నికృష్టకారణము, ప్రకృష్టమైనదియు, సర్వశ్రుతిసిద్ధము నగు జ్ఞానయోగమును విడిచి పండితులుగూడ కర్మమార్గమునే యాశ్రయించుచుండిరి. ఇట కారణమేమి? అను నాశంకకు సమాధానముగ—"జ్ఞానయోగము చిత్తశుద్ధ్యైకలభ్య మగుటవలన నట్టి చిత్తశుద్ధి లేకుండగనే సర్వకర్మ ల్లను సన్న్యసించి జ్ఞానయోగమునందు ప్రవృత్తమైనవానికి జ్ఞాననిష్ఠ సంభవింపనేరదు అది లేనిచో మోక్షము సంభవింపనేరదు. అందువలన నట్టివానికి జ్ఞానకర్మఫలద్వయమునుండియు భ్రంశము సంభవించును. కాన మోక్షమునకు ప్రథమకారణ మగు చిత్తశుద్ధినే సత్కర్మవలన సంపాదింపదగునని యూహించి విచక్షణులగు పండితులు తత్కారణ మగు కర్మమునే యనుష్ఠించుచుండిరి". అని యీ శ్లోకమున జెప్పుచున్నాడు—"ఇహ దేవతా యజంతః కర్మణాం సిద్ధిం కాంక్షంతః మమ వర్త్మానువర్తన్తే" (ఈ లోకమున ఇంద్రాగ్న్యాదిదేవతలను-వారి యనుగ్రహసిద్ధికై ఆజ్యాది హవిస్సుచే నారాధించుపండితులు-శ్రద్ధాభక్తులతో నియమపూర్వకముగ ననుష్ఠితములైన శ్రౌతస్మార్తాది కర్మలచే నైన సత్త్వశుద్ధిరూపసిద్ధిని కోరినవారై నా మార్గము ననుసరించుచుండిరి). "హఠాదియోగములచేగూడ సత్త్వశుద్ధిని సంపాదించుట శక్యమే యగునుకదా! ఇక కర్మలతో నేమి ప్రయోజనము?" అను నాశంకకు సమాధానముగ— "హఠాదియోగము అవైదికము అగుటచేతను, బ్రాహ్మణులకవిహితమగుటచేతను, అనుష్ఠానారోగ్యములగుటచేతను, అనుష్ఠింపబడినను వాటిచే చిత్తశుద్ధి బహుకాలభావ్య మగుటచేతను, వాటినివిడచి ముముక్షువగు బ్రాహ్మణుడవశ్యము కర్మనే చేయదగునని యుత్తరార్థముచే జెప్పుచున్నాడు—"హి మానుషే లోకే కర్మజా సిద్ధిః క్షిప్రం భవతి" ఏ కారణముచే కర్మభూమియందు వైదికకర్మానుష్ఠానసంపన్నము, చిత్తశుద్ధిరూపము నగు సిద్ధి శీఘ్రకాలములో సంభవించుచున్నదో ఆ కారణముచే పండితులు కర్మనే చేయుచుండిరి. (యజ్ఞములచే నారాధితులగు దేవతల ప్రసాదముచే శీఘ్రముగనే మనస్సు ప్రసన్న మగు నని యర్థము). "మానుషే లోకే సిద్ధిః" అనుటచే మనుష్యలోకమునందే చాతుర్వర్ణ్యవ్యవస్థయు, చాతురాశ్రమ్యవ్యవస్థయు, కర్మవిధియు సంభవించును గాని ఇతరలోకములలో నివియు లేవని సూచితమయ్యెను. ॥౧౨॥

—♦ ౪వ అధ్యాయము ౧౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— "శరీరారంభకములగు గుణములయొక్క వైషమ్యముచే గూడ జను

శాంకరభాష్యమ్.—

కేం నిమిత్త ఇతి, అథవా వర్ణాశ్రమాదిప్రవిభాగోపేతా మనుష్యా మమ వర్త్మాఽనువర్తంతే
సర్వశ ఇత్యుక్తం కస్మా త్పునః కారణా న్నియమేన తవైవ వర్త్మానువర్తన్తే నాన్యస్యే
త్యుచ్యతే— చాతుర్వర్ణ్యమితి। చాతుర్వర్ణ్యం చత్వార ఏవ వర్ణా శ్చాతుర్వర్ణ్యం మయేశ్వ
రేణ సృష్ట ముత్పాదితం "బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్" (ఋ॥ 10-9-12) ఇత్యాది
శ్రుతేః, గుణకర్మవిభాగశో గుణవిభాగశః కర్మవిభాగశశ్చ గుణా స్సత్త్వరజస్తమాంసి। తత్ర
సాత్త్వికస్య సత్త్వప్రధానస్య బ్రాహ్మణస్య "శమో దమ స్తపః" ఇత్యాదీని కర్మాణి। సత్త్వో
పసర్జనరజఃప్రధానస్య క్షత్రియస్య శౌర్య తేజఃప్రభృతీని కర్మాణి। తమ ఉపసర్జనరజఃప్రధా
నస్య వైశ్యస్య కృష్యాదీని కర్మాణి। రజఉపసర్జనతమఃప్రధానస్య శూద్రస్య శుశ్రూషైవ
కర్మే త్యేవం గుణకర్మవిభాగశ శ్చాతుర్వర్ణ్యం మయా సృష్టమిత్యర్థః। తచ్చేదం చాతుర్వర్ణ్యం
నాన్యేషు లోకే ష్వతో మానుషే లోక ఇతి విశేషణమ్। హంత! తర్హి చాతుర్వర్ణ్యసర్గాదేః
కర్మణః కర్తృత్వా త్తత్ఫలేన యుజ్యసేఽతో న త్వం నిత్యముక్తో నిత్యేశ్వర ఇతి। ఉచ్యతే।
యద్యపి మాయాసంవ్యవహారేణ తస్య కర్మణః కర్తార మపి సంతం మాం పరమార్థతో విద్ధ్య
కర్తార మత ఏవావ్యయ మసంసారిణం చ మాం విద్ధి ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధినీ.—

విశేషములు అట్టి వర్ణాశ్రమాదులను పురస్కరించుకొనియే తత్కర్మములు విహితములు. యితర
లోకములయందు వర్ణాశ్రమాదివిభాగము లేదు. కర్మవిధానము లేదను నియమమునం దేమి
హేతువు ?

లేక, వర్ణాశ్రమాదివిభాగముతోగూడిన మనుష్యులు సర్వప్రకారములచే నామార్గమునే
యనుసరించుచుండి రని జెప్పితివి. ఏకారణముచే నియమముగ నీమార్గమునే మనుష్యులు
యనుసరించుచుండిరి ? ఇతరుల మార్గము నేల యనుసరింపకుండిరి ? అను నాశంకమీాద జెప్పు
చున్నాడు.

బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులనెడి నాలుగువర్ణముల 'బ్రాహ్మణోస్య ముఖ మాసీత్'
అను స్మృత్యనుసారము సృజించితిని. సత్వగుణప్రధానులు బ్రాహ్మణులు అట్టి బ్రాహ్మణులకు

అసమానస్వభావులగుదు" రని ఈశ్లోకమున జెప్పుచున్నాడు— "మయా గుణకర్మవిభాగశః చాతుర్వర్ణ్యం
సృష్టం" ఈశ్వరుడనగు నాచే గుణవిభాగానుసారముగను, కర్మవిభాగానుసారముగను, చాతుర్వర్ణ్యము (నాలుగు
వర్ణములు) సృజింపబడెను. అనగా బ్రాహ్మణులు సత్త్వప్రధానులు గాన వారలకు శమదమాదిసాత్త్వికకర్మము
లుండుననియు, ఇట్లే క్షత్రియులు సత్వోపసర్జనరజఃప్రధానులుగాన వారలకు సత్వోపసర్జనరాజసములగు శౌర్య
తేజః ప్రభృతికర్మములుండుననియు, ఇట్లే తమోపసర్జనప్రధానులగు వైశ్యులకు తాదృశములగు కృష్యాదికర్మ
ములుండుననియు, ఇట్లే తమఃప్రధానులగు శూద్రులకు త్రైవర్ణికశుశ్రూషాది తామసకర్మలుండుననియును మను
ష్యలోకమున వ్యవస్థకల్పింపబడెను. "అట్లగునో విషమస్వభావముకల చాతుర్వర్ణ్యమును సృజించెడి నీకును వైష
మ్యము కలదా ?" అను ప్రశ్నకు సమాధానముగ నుత్తరార్థమును చెప్పుచున్నాడు. "తస్య కర్తారం— అవ్య
యం" (విషమస్వభావముకల చాతుర్వర్ణ్యమునకు వ్యవహారదృష్టిచే కర్తనుగను, పరమార్థదృష్టిచే నకర్తనుగను
నిరహంకారుడనగుటచే నక్షీణమగు మహిమలకన్నను తెలిసికొనుము.

శాంకరభాష్యతత్త్వబోధిని:—
అంతరింద్రియనిగ్రహము, బహిరింద్రియనిగ్రహము, తపస్సు, శౌచము, క్షాంతి, ఋజుభావము, జ్ఞానము, విజ్ఞానము, ఆస్తికత యను నీ గుణములు విధింపబడెను. సత్త్వ మప్రధానము, రజస్సు ప్రధానముగా గల క్షత్రియునకు శౌర్యము, తేజస్సు, ధృతి, కార్యనిర్వర్తనసామర్థ్యము, యుద్ధమునుండి వెనుకకు తిరుగకుండగ నిలచుట, సత్పాత్రము ప్రాప్తించినపుడు ముక్తహస్తు డగుట, ప్రభుత్వము యను నీ కర్మములు విధింపబడినవి. తమోగుణ మప్రధానముగా గలిగి రజోగుణము ప్రధానముగాగల వైశ్యునకు వ్యవసాయము జేయుట, గోవులను రక్షించుట, వర్తకము జేయుట అను నీ కర్మములు విధింపబడినవి. రజోగుణ మప్రధానముగా గలిగి తమోగుణము ప్రధానముగా గల శూద్రునకు పూర్వవర్ణుల శుశ్రూష యను కర్మము విధింపబడెను. ఈ విధముగ గుణవిభాగపూర్వకముగను, కర్మవిభాగపూర్వకముగను బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు నాచే సృజింపబడిరి. ఇచట తత్త్వ మిది. (పరమేశ్వరుడు చాతుర్వర్ణ్యమును సృజించెను. అనుటచే సృష్టినుండియే చాతుర్వర్ణ్యవిభాగ మేర్పడినట్లు స్థిరపడుచున్నది. ఎట్లు సృజించెను? అనిన గుణకర్మవిభాగపురస్సరముగ సృజించెను. అనగా బ్రాహ్మణాదివర్ణులను సత్త్వరజస్తమోగుణములలో నేదో యొకదానిని ప్రధానముగ జేసికొని సృజించెను. మరియు నాచే సృష్టమైన నీవర్ణు లాయా కర్మములనే తప్పక నాచరించుచుండవలె నని యాయా వర్ణులు జేయదగిన కర్మములను గూడ వేర్వేరుగ నియమించియే యీ వర్ణులను సృజియించెను. అనియే యీ శ్లోకమువలన దేలిన యాశయము. ఈ శ్లోకమునకు కొందరు ఇందునగల "సృష్టం" అను పదమును విడిచియో, లేక దాని యర్థము నన్యథా గ్రహించియే గుణకర్మవిభజనపూర్వకముగ వర్ణము లేర్పడు నని వ్యాఖ్యానించి, యంత్యజుడైనను సత్త్వప్రధానుడై, శమదమాది కర్మములు కలవాడై యుండినచో వాడు బ్రాహ్మణు డనియు, బ్రాహ్మణవర్ణమునందు జనించినను తమఃప్రధానుడై శుశ్రూషాపరుడైనచో నా పురుషుడు చతుర్థుడగు ననియు వచించెదరు. ఇట్టి వాక్యములను పలికి, నిరంతరము ప్రోత్సహించి వర్ణాశ్రమాచారదూరులను జేయుచుండిరి. అట్టివారి వాక్యములను బాగుగ విచారించి యిందుగల "సృష్టం" అను పదమున కేమి గతి యని ప్రశ్నించి, వారి వాక్యములు ప్రమాణాభాసములుగ గ్రహించెదరుగాక. బ్రాహ్మణుడు తన కర్మల నాచరింపనిచో "బ్రాహ్మణబ్రువుడు, బ్రహ్మబంధువు" అను పదములచే వ్యవహరింపబడునుగాని శూద్రుడు కానేరడు. ఈ విషయమున ఛాందోగ్యోపనిషత్తునందలి శ్వేతకేతూపాఖ్యానమే సాక్షి యగును. కనుకనే "స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః" అని కృష్ణపరమాత్మ స్వకర్మనిరతులకే సిద్ధి గలుగునని జెప్పఁగలడు).

శంకరానందీయము:— 'మమ వర్త్మానువర్తంతే' అనుస్థలమున మత్ప్రతివిష్ణ్వాభాతమగు కర్మమార్గమును విచక్షణులనుసరించుచుండిరి. అని చెప్పబడెను. దానినే ఈశ్లోకమున స్పష్టపరచుచుండెను:— "గుణకర్మ

గీ॥ న మాం కర్మాణి లిమ్పన్తి న మే కర్మఫలే స్పృహా ।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభి ర్న స బధ్యతే ॥ ॥౧౪॥

పదవిభాగము:— న-మాం-కర్మాణి-లిమ్పన్తి-న-మే-కర్మఫలే-స్పృహా-ఇతి-మాం-యః-అభిజానాతి-కర్మభిః-న-సః-బధ్యతే । ॥౧౪॥

ప్రతిపదార్థము:— మాం=నన్ను; కర్మాణి=కర్మలు; నలిమ్పన్తి=(దేహారంభకములై) లేపమునుపొందవు; మే=నాకు; కర్మఫలే=కర్మఫలమునందు; స్పృహా=కోరిక; న=లేదు. ఇతి=ఈవిధమున; యః=ఎవడు; మాం=నన్ను; అభిజానాతి=తెలిసికొనునో; సః=వాడు; కర్మభిః=కర్మలచే; న బధ్యతే=బంధింపబడడు. ॥౧౪॥

---

శాంకరభాష్యమ్:—

యేషాం తు కర్మణాం కర్తారం మాం మన్యసే పరమార్థత స్తేషా మకర్తైవాహం యతః— నేతి। న మాం తాని కర్మాణి లిమ్పన్తి దేహాద్యారంభకత్వే నాహంకారాభావాత్ । న చ తేషాం కర్మణాం ఫలేషు మే స్పృహా తృష్ణా। యేషాం తు సంసారిణా మహం కర్తే త్యభి

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈ చాతుర్వర్ణ్య మితరలోకములయందు లేదు. కనుకనే పూర్వశ్లోకమునందు 'మానుషే లోకే' అను విశేషణము విన్యసింపబడెను. అట్లగుచో చాతుర్వర్ణ్యసృష్టికర్త వగుటంజేసి తత్ఫలముకూడ నీకు ప్రాప్తించెడిని. అట్లగుచో నీవు నిత్యముక్తుడవు, నిత్యేశ్వరుడవు కావు. అనినచో మాయాసంబంధము వలన చాతుర్వర్ణ్యకర్తనైనను పరమార్థముగ నన్నును యకర్తనుగ దెలిసికొనుము. కనుకనే నన్నును నాశరహితునిగను, సంసారరహితునిగను దెలిసికొనుము.।౧౩।

ఏ కర్మలకు కర్తనుగ నన్ను దలచుచుంటివో పరమార్థమువలన నే నాకర్మల కకర్తను. ఎందువలననిన ?

నా కహంకారమమకారములు లేమింజేసి యా కర్మములు దేహాద్యారంభకములై నన్ను బంధింపవు. ఆ కర్మఫలములయందు నాకు కోరికయు లేదు.

---

విభాగశః" (సత్త్వాదిగుణములయొక్కయు, శమాదికర్మలయొక్కయు విభాగముచే "చాతుర్వర్ణ్యం మయా సృష్టం" నాలుగు వర్ణములు నాచే సృజింపబడినవి. కాన మనుష్యులు నామార్గము ననుసరించుచుండిరి. పరిశిష్టము వ్యాఖ్యానంతరోక్తరీతిని జూడదగును. ॥౧౩॥

—♦ ౪వ అధ్యాయము ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— అహంకారము లేమింజేసి కర్తృత్వాభిమానశూన్యుడను, భగవంతుండనగు నన్ను జగత్సృష్ట్యాదికర్మలు దేహారంభకములై బంధింపవు. (ఈ చెప్పుటవలన పరమేశ్వరునకు కర్తృత్వము తొలంగింపబడెను.) 'ఆప్తకామస్య కా స్పృహా' అను శ్రుత్యనుసారము ఆప్తకాముడనగు నాకు కర్మఫలమునందు తృష్ణయును లేదు. కర్తృత్వాభిమానముచేతను, ఫలతృష్ణచేతను కర్మలు బంధకములగును. అట్టి కర్తృత్వాభిమానము, ఫలతృష్ణయు లేమింజేసి నన్నాకర్మలు బంధిపనేరవు. ఇట్లే ఇతరుడు కూడ అకర్తను, అభోక్తను యగు

శాంకరభాష్యమ్.—

మానః కర్మసు స్పృహా తత్ఫలేషు చ తాన్కర్మాణి లిమ్పన్తీతి యుక్తం, తదభావాన్న మాం కర్మాణి లిమ్పన్తీత్యేవం యోఽన్యోఽపి మా మాత్మత్వేనాభిజానాతి, నాహం కర్తా న మే కర్మఫలే స్పృహేతి స కర్మభి ర్న బధ్యతే। తస్యాపి న దేహాద్యారంభకాణి కర్మాణి భవన్తీత్యర్థః। ||౧౪||

శాంకరభాష్యతత్త్వబోధిని.—

ఏసంసారులకు "నేను కర్తను" అని కర్మలయం దభిమానము, కర్మఫలములయందు కోరికయు కలదో వారలకు కర్మలు దేహాద్యారంభకములగునని చెప్పుట యుక్తముగాని నాకట్టి యభిమానము, కర్మఫలస్పృహయు లేనందున నాకా కర్మములు దేహాద్యారంభకములు కానేరవు. ఈ విధముగనే యితరుడుకూడనన్ను నాత్మరూపముగ దెలిసికొనునో అనగా ("నేను కర్తనుకాను, నాకు కర్మఫలములయందు కోరికలేదు" అని తెలిసికొనునో) అట్టివాడు కర్మములచే బంధింపఁబడడు. అట్టిజ్ఞానికి అహంకారాదులు లేనందున కర్మములు దేహాద్యారంభకములు కానేరవని యర్థము. ||౧౪||

నన్నాత్మగ దెలిసికొనునో అట్టివా డకర్త్రాత్మజ్ఞానముచే కర్మలవలన బంధింపబడడు. మరేమగును? ముక్తుఁడగువని యర్థము.

శంకరానందీయము:— పరబ్రహ్మస్వరూపుడనగు నాకు మాయాతత్కార్యరూపమగు ఈ పాధిద్వయము సంభవింపనేరదు. (బంధకము కానేరదు) ఏమన?— కూటస్థుడను, అసంగుడను, చిత్స్వరూపుడను అగు నాకు మాయాతత్కార్య సంబంధమే సంభవింపదు కాన మాయాకర్తృకమగు జగత్సృష్ట్యాదికర్మములతో సంశ్లేషము నాకు లేకుండును. మరియు నిశ్లేష ప్రత్యగ్రూపుడనగు నే నసంగుడను గాన నాకు మాయాకార్యములగు దేహేంద్రియాదులచే చేయబడు కర్మలతోకూడ సంశ్లేషములేదు. పైవిధముగ కర్తృత్వభోక్తృత్వాది ధర్మశూన్యుడను, పరమాత్ముడను నగు నన్ను శ్రవణమననాదిసంజాత మగు విజ్ఞానబలముచే నెవడు స్వస్వరూపునిగ దెలిసికొని కర్మలయందుప్రవర్తించునో వానిని కర్మలు బంధింపనేరవు" అని ఈశ్లోకమున జెప్పుచున్నాడు. 'మాం' కూటస్థాసంగచిద్రూపుడనగుటచే బుద్ధ్యాదిసంబంధశూన్యుడను, ప్రత్యగ్రూపుడను అగునాకు 'కర్మఫలే' కర్మలయందును కర్మజన్యఫలములయందును, "నస్పృహా" స్పృహ (ఇచ్ఛ) బుద్ధిధర్మమగుటచే బుద్ధ్యాది సాక్షియు, అవికారుడను అగు నాకు బుద్ధిధర్మములు సంభవింపవు గాన వానిలోచేరిన కరఫలేచ్ఛయు సంభవింపనేరదు. కనుకనే 'న మాంకర్మాణి లిమ్పన్తి' "స యథా కామో భవతి తత్క్రతు ర్భవతి యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే" అను శ్రుత్యుక్తరీతిని కామియగు వానికే కర్మలు, సంకల్పములు, తదారంభములు కూడయగుటచే కర్మఫలేచ్ఛగు విజ్ఞుడే కర్మములు జేయునుగాని యకామి చేయనేరడు. కాన బుద్ధ్యాదికృతములగు కర్మలు— అకర్తను, కర్మ, తత్కర్తృసాక్షిని యగు నన్ను స్పృశింపనేరవు. అనగా ఫలేచ్ఛగువానిచే చేయబడు కర్మము లైతే మరల వానినే స్పృశించునుగాని మరొకనినిస్పృశింపనేరదు. కాన బుద్ధ్యాదికముకంటె వేరగు కర్మకర్తయగువానిని బుద్ధ్యాదికృతకర్మములు స్పృశింపనేరవు. 'ఇతి' పరమాత్మనగు నన్ను కర్మాకర్తనుగను అభోక్తనుగను ఆకాశమువలెసర్వగతునిగను ఆసంగునిగను, అవి క్రియునిగను బుద్ధి, తద్ధర్మ, తదవస్థాసాక్షినియగు నన్ను పరమాత్మునిగను స్వతత్త్వముగను "యోభిజానాతి" లెస్సగ నాభిముఖ్యముతో "అయ మేవాహ మస్మి" అని సాక్షాత్తు స్వస్వరూపముగ నెవడు తెలిసికొనునో వాడు విద్వాంసుడు, అధికారియునగును. అట్టివాడు లోకసంగ్రహార్థము తనచే చేయబడిన కర్మలచే బంధింపబడడు. (అనగా నట్టివానికి కర్మములు దేహారంభకములు కావని యర్థము). ||౧౪||

గీ॥ ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥ ॥౧౫॥

పదవిభాగము:— ఏవం- జ్ఞాత్వా- కృతం- కర్మ- పూర్వైః- అపి- ముముక్షుభిః- కురు-కర్మ-ఏవ-తస్మాత్-త్వం-పూర్వైః-పూర్వతరం-కృతం। ॥౧౫॥

ప్రతిపదార్థము:— ముముక్షుభిః=మోక్షేచ్ఛకుల; పూర్వైరపి=ప్రాచీనులచేతనున్ను; ఏవం=నేను కర్తనుకాను, నాకు కర్మఫలమునందు కోరికలేదని; జ్ఞాత్వా=తెలిసికొని; కర్మ=కర్మము; కృతం=ఆచరింపబడెను. తస్మాత్=ప్రాచీనులచే నాచరింపబడిన దగుటవలన; త్వం=నీవు; పూర్వైః=ప్రాచీనులచే; కృతం=చేయబడిన; పూర్వతరం=అతిప్రాచీనమైన; కర్మైవ=కర్మమునే; కురు=చేయుము. ॥౧౫॥

శాంకరభాష్యమ్:—

నాహం కర్తా న మే కర్మఫలే స్పృహేతి—ఏవమితి। ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరప్యతిక్రాన్తైర్ముముక్షుభిః, కురు తేన కర్మైవ త్వం న తూష్ణీమాసనం నాపి సంన్యాసః కర్తవ్యస్తస్మాత్త్వం పూర్వైరప్యనుష్ఠితత్వాద్యద్యనాత్మజ్ఞస్త్వం తదాఽఽత్మశుద్ధ్యర్థం, తత్త్వవిచ్చేల్లోకసంగ్రహార్థం పూర్వైర్జనకాదిభిః పూర్వతరం కృతం నాధునాతనం నిర్వర్తితం। ॥౧౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"నీకును, జ్ఞానికిని కర్మతత్ఫలసంబంధము లేనిచో నాకుమాత్రము కర్మముతో నేమి ప్రయోజన" మని శంకింపజనదు. ప్రాచీనులగు ముముక్షువులచే "నేను కర్తనుగాను, నాకు కర్మఫలములయందు కోరికలేదు" అని తెలిసికొని కర్మ మాచరింపబడెను. అట్టి ప్రాచీనులచే నాచరింపబడినదగుటచే పరమప్రాచీనమగు కర్మమునే—ప్రాచీనానుష్ఠితమగుటవలన నీవజ్ఞుడవగుచో చిత్తశుద్ధినిమిత్తము కాని, తత్త్వవేత్తవగుచో లోకసంగ్రహార్థము కాని యాచరింపుము. తూష్ణీంభావమునుకాని, కర్మసంన్యాసమునుకాని పొందవలదు. ఈ కర్మము తత్త్వవేత్తలగు జనకాదులచేగూడ నాచరింపబడిన దగుటచే అధునాతనముగ నిర్వర్తితముగాదు.

(ఇట "కురు" అని చెప్పుటచే కర్మము విధింపబడుచున్నదని కొందరు చెప్పెదరు. ప్రస్తుత మీయుద్ధకర్మము 'తస్మాద్యుధ్యస్వ భారత" అనుచోట 'ఇచట తత్త్వమిది'

—♦ ౪వ అధ్యాయము—౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— "నేను కర్తనుగాను, కర్మఫలమునందు స్పృహలేనివాడ" నని తెలిసికొనువాడు కర్మబద్ధుడు కాడు. కనుకనే "ఏవం జ్ఞాత్వా" కర్తృత్వములేని తాము కర్మాలిప్తులమని తెలిసికొని "కృతంకర్మ పూర్వైరపి ముముక్షుభిః" యీ యుగమున యయాతి యదుప్రభృతులగు ముముక్షువులచే కర్మచేయబడెను. "కురు— కృతం" కాన నీవుగూడ కర్మనే చేయుము కాని ఊరక కూర్చొనుటను గాని సంన్యసించుటను గాని చేయకుము. నీవు చేయుకర్మలు తత్త్వవేత్తవు కానిచో నీ కాత్మశుద్ధ్యర్థ ముపయోగించును.

గీ॥ కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।

తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్ ॥ ||౧౬||

పదవిభాగము:— కిం-కర్మ-కిం-అకర్మ-ఇతి-కవయః-అపి-అత్ర-మోహితాః-తత్-తే-కర్మ--ప్రవక్ష్యామి-యత్-జ్ఞాత్వా-మోక్ష్యసే-అశుభాత్ । ||౧౬||

ప్రతిపదార్థము:— కర్మ=కర్మము; కిం ?=ఎట్టిది ?; అకర్మ=అకర్మము; కిం ?=ఎట్టిది ?; ఇతి=ఈ విధమున; కవయోపి=బుద్ధిమంతులున్ను; అత్ర=ఈ కర్మాకర్మ విషయమై: మోహితాః=మోహమును పొందిరి. యత్=ఏకర్మాకర్మములను; జ్ఞాత్వా=తెలిసికొని; అశుభాత్=సంసారమునుండి; మోక్ష్యసే=విడువబడెదవో; తత్=ఆ; కర్మ=కర్మమును; అకర్మ=అకర్మమును; తే=నీకొఱకు; ప్రవక్ష్యామి=చెప్పగలను. ||౧౬||

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అనునది మొదలగు గ్రంథభాగమునందు మాచే జూపబడిన విధముననే విధిచే ప్రాప్తము కానందున యనువాదమాత్రమేయని గ్రహింపనగును. అర్జునుడు శోకమోహవ్యాకులుడై బ్రాహ్మణధర్మమునందు ప్రవృత్తుడగుటకు సిద్ధమై స్వధర్మవిముఖుఁడగుటఁజూచి యతనిని స్వధర్మమునందు ప్రోత్సహించుచుండెనే కాని యుద్ధకర్మమును విధించుటలేదని గ్రహింపనగును. ||౧౫||

---

తత్త్వవేత్తవగునోనవి లోకసంగ్రహార్థమగును. ఈకర్మలు జనకాదులచే బూర్వయుగమునందు గూడ జేయబడెను. (ఇట్లనుటచే— పూర్వులగు యదుయయాతిప్రభృతులను, అంతకంటె పూర్వులగు జనకాదులు ఈ కర్మము నాచరించిరి. కావునవశ్యము నీవు చేయదగిన దని సూచితమయ్యెను.)

శంకరానందీయము:— ‘శరీరేంద్రియాదిరూపమగు నుపాధిచే ననుష్ఠింపబడిన కర్మలు బంధకములు కా’ వనెడి విద్వాంసుని జ్ఞానమే పరార్థప్రవృత్తియందు ప్రబలమగు సాధనమని సూచించి, ప్రాచీనులుకూడ “నుపాధికృతమగు కర్మలు బంధకములు కా”వనెడి జ్ఞానముచేతనే పరార్థము కర్మలయందు ప్రవృత్తులైరని శిష్టాచారమును ప్రమాణముగ నిచ్చి యోయర్జున! నీవుకూడ శిష్టులగు ప్రాచీనులయాచారముననే యనుసరించుమని యీశ్లోకమున బోధించుచుండెను.

నేను ‘అహం’ అనెడి బుద్ధికి సాక్షియగు ప్రత్యగాత్మస్వరూపుడను. అట్టినేను దేహేంద్రియాదులకంటె భిన్నుడను. కనుకనే దేహేంద్రియాదికృతమగు కర్మలచే బద్ధుడను కానని యాత్మకు దేహేంద్రియాదిభిన్నత్వమును, దేహేంద్రియాదికృతమగు కర్మలకబంధకత్వమును పై జెప్పినవిధమున దెలిసికొని “ముముక్షుభిః” (ఈపదము గర్భితణిజన్తరూపము). అవిద్యాబంధమునవలన విడిపించుట కిచ్ఛయించు ప్రాచీనులగు జనకాదులచే లోకహితార్థము కర్మ మాచరింపబడెను. కాన నోయర్జునా! నీవుకూడ ప్రాచీనులు, సత్పురుషులు అగు జ్ఞానవృద్ధులచే నాచరింపబడినట్టి యనాదికాలప్రవృత్తమగు కర్మమునే లోకహితార్థ మాచరింపుము. సన్న్యాసమునుమాత్రము స్వీకరింపవలదని యర్థము.

శ్రీధరీయము:— “అహంకారాదులు లేకుండగ నాచరింపబడిన కర్మ బంధకము కాదు”. అని తెలిసికొని ముముక్షువులగు జనకాదు లంతఃకరణశుద్ధినిమిత్తము యుగాంతములయందుకూడ చేయబడిన కర్మ నాచరించిరి. కాన నోయర్జునా! నీవుకూడ వెంట్రుకొందట కర్మ నాచరింపుము. ||౧౫||

శాంకరభాష్యమ్:—

తత్ర కర్మచే త్కర్తవ్యం త్వద్వచనా దేవ కరో మ్యహం కిం విశేషితేన పూర్వైః పూర్వతరం కృత మిత్యుచ్యతే—యస్మా న్మహ ద్వైషమ్యం కర్మణి, కథం?—కిం కర్మేతి। కిం కర్మ? కిం చా కర్మేతి కవయో మేధావినోఽప్యత్రాస్మి న్కర్మాదివిషయే మోహితా మోహం గతా అత స్తే తుభ్య మహం కర్మా కర్మ చ ప్రవక్ష్యామి యజ్జ్ఞాత్వా విదిత్వా కర్మాది మోక్ష్యసేఽశుభా త్సంసారాత్ ॥ ॥౧౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

'మనుష్యలోకమున కర్మయే చేయదగిన దగుచో నీవాక్యము ననుసరించియే దాని నాచరించెదను. "పూర్వైః పూర్వతరం కృతం" ప్రాచీనులచే నతి ప్రాచీనమగు కర్మ చేయబడెనని చెప్పుట యెందులకు ?" యనెదవా ? చెప్పెద వినుము. కర్మయందు మహద్వైషమ్యము కలదు. అది యెట్టిదనిన ? కర్మమనగ నెట్టిది ? అకర్మమనగ నెట్టిది ? అని బుద్ధిమంతులు కూడ నీకర్మాకర్మవిషయమై మోహమును పొందిరి. కాన, నేకర్మాకర్మములను తెలిసికొని కశ్మలమగు సంసారమునుండి విడువబడెదవో, అట్టి కర్మాకర్మములను నీకొరకు చెప్పెద.

ఈచెప్పుటవలన (మేధావులకు గూడ నీకర్మవిషయమై వ్యామోహము సంభవించుచుండ నీకు వ్యామోహము కలుగకతప్పదు. అట్టి వ్యామోహ నిరాసార్థమై ఆప్తవాక్య మపేక్షితము. కాన కర్మమునందు వైషమ్యము కలదు. కాన నతిప్రాచీనమగు కర్మము ప్రాచీనులచే నాచరింపబడెనని పైప్రశ్నకు సమాధాన మీయబడెను). ॥౧౬॥

— ♦ ౪వ అధ్యాయము— ౧౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦ —

మధుసూదనసరస్వతీయము:— "పూర్వైః పూర్వతరం కృతం" అని కర్మ నాచరించుటయందు మిక్కిలి నిర్బంధము చేయుచుంటివి. ఇంక నీకర్మవిషయమున నేమి సందేహముకలదనెదవా ? ఓయర్జునా ! ఈకర్మవిషయమున సందేహముకలదని "కింకర్మ" అను శ్లోకముచే జెప్పుచుండెను.

క్రియారహితమగు నొడ్డునందుండు వృక్షములయందు నావలయందుండు పురుషునకు గమనభ్రమయుండుటవలనను, అట్లే చక్షురింద్రియసంబంధము కలిగిన దూరప్రదేశమున నడచుచున్నట్టి పురుషులయందు దూరదోషమువలన గత్యభావభ్రమ గన్పట్టుటవలనను పరమార్థముగ "నేదికర్మ యేది యకర్మ" యని బుద్ధిమంతులుకూడ నత్యంతము నిరూపించుటకు శక్యము కానందున నీవిషయమున మోహమును పొందిరి. అనగా నిర్ణయించుటకు సామర్థ్యము లేకుండిరి. కాన నోయర్జునా ! నీకొరకు కర్మస్వరూపమును, అకర్మస్వరూపమును సందేహము లేకుండగ జెప్పెద. ఈకర్మాకర్మస్వరూపములను దెలిసికొని సంసారమునుండి విడువబడెదవు.

శంకరానందీయము:— "కర్మణా బధ్యతే జన్తుః" (జీవుడు కర్మచే బంధింపబడును). అనెడి స్మృతివలన కర్మలకు బంధకత్వమే సిద్ధించుచున్నదని శంకింపఁజనదు. "కర్మణా బధ్యతే జన్తుః" అను స్మృతివాక్య మవిద్వాంసునిచే నాచరింపబడిన కర్మలకే బంధకత్వము బోధించును. "తం విదిత్వా న లిప్యతే కర్మణా పాపకేన" (సచ్చిదానందస్వరూపమగు నాత్మస్వరూపమును దెలిసికొనిన పాపకర్మచే లేపమును బొందడు). అను

గీ|| కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః |
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః || ||౧౭||

పదవిభాగము:— కర్మణః-హి-అపి-బోద్ధవ్యం-బోద్ధవ్యం-చ-వికర్మణః-అకర్మణః-చ-బోద్ధవ్యం-గహనా-కర్మణః-గతిః | ||౧౭||

ప్రతిపదార్థము:— కర్మణోహ్యపి=శాస్త్రవిహితకర్మముయొక్కయు; తత్త్వం=తత్త్వము; బోద్ధవ్యం=తెలిసికొనదగినది; అస్తి=కలదు. వికర్మణః=శాస్త్ర నిషిద్ధముయొక్కయు; తత్త్వం=తత్త్వము; బోద్ధవ్యం=తెలిసికొనతగినది; అస్తి=కలదు. అకర్మణశ్చ=తూష్ణీంభావముయొక్కయు; తత్త్వం=తత్త్వము; బోద్ధవ్యం=తెలిసికొనదగినది; అస్తి=కలదు. ('తత్త్వం, అస్తి' అను ఈ రెండుపదములు పైమూడుస్థలములయందు నధ్యాహార్యములు) కర్మణః=(ఈపద ముపలక్షణము. ఉపలక్షణమనగ శక్యార్థమునం దేకదేశకథనము) కర్మాకర్మవికర్మముల యొక్క; గతిః=తత్త్వము; గహనా=విషయము తెలిసికొనుటకు శక్యమైనది కాదు. ||౧౭||

శాంకరభాష్యమ్:—

నచైతత్త్వయా మన్తవ్యం, కర్మనామ దేహాదిచేష్టా లోకప్రసిద్ధ మకర్మ తదక్రియా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

"కర్మ మనగ లోకప్రసిద్ధమగు దేహాదిచేష్టకదా. అకర్మమనగ తూష్ణీంభావముగ నుం

శ్రుతి విద్వాంసునకు పాపకర్మసంబంధము లేదని బోధించుచున్నది. కాన బూహ్యోపదాహ్యతస్మృతి యజ్ఞాని విషయకమేయని దెలిసికొననగును.

అందువలన కర్మాకర్మలతత్త్వమును లెస్సగ దెలిసికొనిన విద్వాంసునిచే నాచరింపబడినకర్మ యకర్మయేయై బంధముకొఱకు కాదు. అవిద్వాంసునిచే చేయబడిన యకర్మయు కర్మయేయై బంధముకొఱకగును.

'నీవుచెప్పిన రీతిని కర్మ యకర్మస్వరూపము, అకర్మ కర్మస్వరూపముయగుచో కర్మాకర్మల లక్షణమేది ?' యని శంకించెదవా ? చెప్పెదవినుమని 'కింకర్మ' అను శ్లోకముచే శ్రీకృష్ణపరమాత్మ చెప్పదొడగెను.

శ్రుతిస్మృతులచే విహితమైనదియే కర్మ. శ్రుతిస్మృతులచే విహితముకానిది యకర్మయని కొందరు పండితులు చెప్పిరి. మరికొందఱు శ్రౌతస్మార్తము లన్నియు కర్మలు, అట్టి శ్రౌతస్మార్తకర్మల సంన్యాస మకర్మయనియు చెప్పిరి. చలనాత్మకమగునదంతయు కర్మ, తూష్ణీంభావముగ నుండుట యకర్మయని మఱికొందఱు చెప్పుచుండిరి. మఱికొందరు కర్మశబ్దవాచ్య మేది ? అకర్మశబ్దవాచ్య మేది ? అని కర్మాకర్మతత్త్వనిర్ణయమునందు మూఢభావమునుపొంది కర్మాకర్మతత్త్వమును నిర్ణయించుట కసమర్థులైరి. కాన కర్మాకర్మస్వరూపమును తెలియని నీకొరకు కర్మాకర్మల లక్షణము నుపదేశించెదను. ఇట్టి కర్మాకర్మల తత్త్వమును తెలిసికొనిన నీవు ముక్తుడవు కాగలవు.

శ్రీధరీయము:— అట్టికర్మ తత్త్వవేత్తలతోగూడి విచారించి చేయదగినది "కింకర్మ" అనుశ్లోకముచే బోధించుచుండెను. కర్మనాచరించుట యెట్టిది ? కర్మాకరణ మెట్టిది ? అను విషయమై వివేకులుకూడ మోహమును పొందిరి. కాన నేకర్మను చేయుటవలన సంసారముచే విడువబడెదవో అట్టికర్మాకర్మలను నీకొరకు బోధించెదను వినుము. ||౧౬||

—♦ ౪వ అధ్యాయము—౧౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— దేహేంద్రియాదివ్యాపారము కర్మయనియు, తూష్ణీంభావము

శాంకరభాష్యమ్:—

తూష్ణీ మాసనం కిం తత్ బోద్ధవ్య మితి । తస్మా దుచ్యతే— కర్మణ ఇతి । కర్మణ శ్శాస్త్రవిహితస్య హి యస్మా దప్యస్తి బోద్ధవ్యం చాస్త్యేవ వికర్మణః ప్రతిషిద్ధస్య బోద్ధవ్యం । తథాఽకర్మణశ్చ తూష్ణీంభావస్య బోద్ధవ్య మస్తీతి త్రిష్వప్యధ్యాహారః కర్తవ్యో యస్మా ద్గహనా విషమా దుర్జ్ఞానా, కర్మణ ఇత్యుపలక్షణార్థం కర్మాదీనాం కర్మాకర్మవికర్మణాం గతి ర్యాథాత్మ్యం తత్త్వమిత్యర్థః ॥ ॥౧౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

డుటయేకదా, ఇట్టి కర్మాకర్మలవిషయమై తెలిసికొనదగిన దేదికల" దని నీవు తలవరాదు. యెందువలన ననెదవా? శాస్త్రవిహితకర్మవిషయమై, శాస్త్రనిషిద్ధమగు వికర్మవిషయమై, అకర్మవిషయమై (తూష్ణీంభావవిషయమై) తెలిసికొనదగినది కలదు. కాన నాప్రవచన మర్థవత్తగును. (ఇటగల "కర్మ" అనుపద ముపలక్షణము. అనగా తాను చెప్పదగిన యంశమున నేకదేశమును చెప్పుట) ఇచట కర్మాకర్మవికర్మలు చెప్పదగియుండ తదేకదేశమగు కర్మనుబోధించు కర్మపదమునుమాత్రమే ప్రయోగించుట. అనగా నిచట కర్మపదముచే కర్మాకర్మవికర్మలు గ్రహింపనగును. (కర్మాకర్మవికర్మముల తత్త్వము తెలిసికొనుట శక్యముకాదు. కాన నేనాతత్త్వమును జెప్పెద వినుము). ॥౧౭॥

పొందియుండుట అకర్మయనియు సర్వలోకప్రసిద్ధమే. ఈ విషయమును నేనే యెరుగుదును. ఈ విషయమున నీవు బోధింపదగిన దేమికలదను శంకను "కర్మణః" అను శ్లోకముచే దొలిగించుచుండెను.

శాస్త్రవిహితకర్మయొక్క దెలియదగిన తత్త్వముకలదు. శాస్త్రనిషిద్ధకర్మయొక్క దెలియదగిన తత్త్వము కలదు. తూష్ణీంభావరూపమగు అకర్మయొక్క దెలియదగిన తత్త్వము గలదు. కర్మాకర్మవికర్మల తత్త్వము దెలిసికొనుట శక్యమైనది కాదు. అందువలన "కర్మాకర్మలు లోకప్రసిద్ధములే. అందు దెలిసికొనదగిన దేదికల" దని శంకింపఁజనదని యాశయము.

శంకరానందీయము:— కర్మాకర్మల తత్త్వ మారురుక్షువు దెలిసికొనదగినదా? లేక ఆరూఢుడు దెలిసికొనదగినదా? "ఆరురుక్షువే కర్మాకర్మవికర్మలయం దధికారము కలవాడు. కర్మాకర్మవికర్మలు దురవగాహము లగుటవలన నతఁడే ప్రయత్నపూర్వకముగ కర్మాకర్మవికర్మలతత్త్వమును దెలిసికొనవలయును. ఆరూఢుడు తెలిసికొనవసరములేదు" అను ఆశయముచే "కర్మణః" అను శ్లోకమును జెప్పదొడఁగెను.

శాస్త్రము లనేకములు. శాస్త్రప్రవర్తకు లనేకులు. అట్టి శాస్త్రప్రవర్తకులచే బోధింపబడిన కర్మగూడ దేశభేదముచేతను, కాలభేదముచేతను, యుగభేదముచేతను, అధికారిభేదముచేతను, బ్రాహ్మణాది వర్ణభేదముచేతను, బ్రహ్మచర్యాద్యాశ్రమభేదముచేతను, బాల్యయౌవనాది వయోభేదముచేతను, అవస్థాభేదముచేతను సంకోచము, వికాసము గలిగి కర్మవిధి యనేకరూపములగును. కాన అట్టి కర్మయొక్క తత్త్వము నారురుక్షువు దెలిసికొనిన యథాశాస్త్రముగ కర్మ నాచరించుటకు సమర్థుడగును. అట్టి కర్మతత్త్వమును దెలిసికొననివాడు యథాశాస్త్రముగ కర్మల నాచరింపనేరడు. అందుచే కర్తవ్యమగు కర్మయొక్క తత్త్వమును నారురుక్షువు లెస్సగ దెలిసికొనవలయును. అట్లే అనన్తకర్మసంబంధముగల విధివాక్యముచే విహితమగు కర్మకు విపరీతముగ

విధింపఁబడునది వికర్మ యనఁబడును. అట్టి వికర్మయే ప్రతిషిద్ధకర్మ యనియు జెప్పఁబడును. అట్టి నిషిద్ధకర్మ యుపదేశకాలాదిభేదముచే ననేకవిధములు అట్టినిషిద్ధకర్మతత్త్వమును దెలిసికొనిన యానిషిద్ధాంశము బరిత్యజించుటకు వీలగును. నిషిద్ధమును దెలిసికొననిచో బరిత్యజించుట వలనుపడదు. కాన శాస్త్రనిషిద్ధమగు నిందితకర్మ యొక్క తత్త్వమునుకూడ తెలిసికొనవలయును. అకర్మయనగ కర్మసంన్యాసము. ఈకర్మసంన్యాసము కామ్యకర్మ పరిత్యాగమనియు, నిషిద్ధకర్మపరిత్యాగమనియు, కర్మఫలపరిత్యాగమనియు, సర్వకర్మపరిత్యాగమనియు ననేకవిధములు. కాన నట్టి కర్మసంన్యాసరూపమగునట్టి యకర్మయొక్క తత్త్వము తెలిసికొనతగినదే. కర్మాకర్మవికర్మల యొక్క గతి అనగా ఇతికర్తవ్యతానిశ్చయము విద్వాంసులకుకూడ తెలిసికొనుటకు శక్యమైనది కాదు. కాన అరు రుక్షువు కర్మాకర్మవికర్మల స్వరూపమును, లక్షణమును, రహస్యమును, శాస్త్రమువలన, ఆచార్యునివలన లెస్సగ దెలిసికొనవలయును.

పరమార్థప్రపా:— కర్మాకర్మవికర్మల దత్త్వము తెలిసికొనుట శక్యమైనది కాదని "కర్మణః" అను శ్లోకముచే బోధించుచుండెను.

మోక్షనిరూపణమున కర్మాకరణమునందు వికర్మ యుపక్రాంతము కాలేదు. కాన వేదవిహితమగు కర్మ వలన నేది ప్రాప్తించునో తత్త్వమువలన నట్టిది తెలియనగును. కర్మము "కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మయః" అను నుత్తరశ్లోకముచే రెండువిధములుగ చెప్పఁబడును. అట్లు రెండువిధముల ననుసరించి స్వర్గప్రాపక మగు కర్మము నశించుఫలము కలదగుటచే వికర్మమనఁబడును. అట్టిదానివలన నేమిప్రయోజనము ప్రాప్తించు నని దెలిసికొనవలయును. అట్లే 'అకర్మణః' కర్మపరిసమాప్తిరూప మగు నైష్కర్మ్యమువలన నేమిసంభవించుననియు దెలిసికొనవలయును. ఎందులకు తెలుసుకొనుటయనెదవా ? కర్మయొక్కగతి (తత్త్వము) గహనము (తెలిసికొనుట) క్లిష్టమైనది. ఈ విషయమే "కర్మాకర్మవికర్మమున్మ సుధియా బోద్ధవ్యమేవాదితః, కర్మ స్యా ద్విధిపూర్వకం తు మనసా సర్వేన్ద్రియవ్యాపృతిః । త ద్ద్వేధా సఫలం ఫలేన రహితం త్వాద్యం వికర్మ స్మృతం, బన్ధా దన్య దకర్మ శుద్ధికరణా న్నైష్కర్మ్యతా మాగతమ్" యోగ్యమైన బుద్ధిగల పురుషుడు ప్రప్రథమమున కర్మాకర్మవికర్మల రహస్యమును తెలిసికొనవలయును. ఈ మూటిలో కర్మయనగ నేదియనిన ? "అహ రహ స్సంధ్యా ముపాసీత" ఇత్యాదివిధిపూర్వకముగ సత్వప్రధానమగు మనస్సుతో గూడ త్వక్చక్షుశ్శ్రోత్రరసన ఘ్రాణము లనెడి జ్ఞానేంద్రియములయొక్కయును, వాక్పాదపాణిపాయూపస్థ లనెడి కర్మేంద్రియములయొక్కయు వ్యాపారమే కర్మ యనఁబడును. అనగా యజ్ఞోపకరణము, దర్శనము, (శాస్త్రము) శాస్త్రప్రతిపాద్యము, వేదశ్రవణము, హోమ ధూమాఘ్రాణనము, యజ్ఞపాత్రల దర్శనము, పురోడాశభక్షణము, యజ్ఞనసామగ్రిసంపాదనిమిత్తము హస్తపాద ములక్రియ, ఋతుకాలమున భార్యాగమనము, దక్షిణదిక్కునందు మలోత్సర్జనము, మొదలగు విధ్యుక్తమగు నింద్రియవ్యాపారము కర్మ యనఁబడును. ఇట్టికర్మ స్వర్గమును పొందించుచున్నదై సఫలమనియు, మోక్షప్రాపకమై ఫలరహితమనియు రెండువిధములు. రెండువిధముల కర్మలవిషయమై విధిసమానమే. విధిసమానమైనపు డేకవిధమే యగును కాని రెండువిధము లెట్లాగనెదవా ? ఈద్వైవిధ్యము సంకల్పకృతము. (అనగా ఫలసంకల్పముచే ననుష్ఠించిన నది సఫలకర్మ యనఁబడును. సంకల్పరహితమైనకర్మ ఫలరహితమనఁబడును). ఆ రెండుకర్మలలో మొట్టమొదటిది యగు సఫలకర్మ స్వర్గప్రాపకమై వినశ్వరఫలము కలది. అందుచే నట్టి కర్మబంధకమగుటవలన వికర్మ యనఁబడును. ఫలరహితకర్మము చిత్తశుద్ధి నొనరించినపిదప యుపరతిని (శాంతిని) బొంది జ్ఞానప్రదానమును పొంది మోక్షప్రాపకమగును. కాన ఫలరహితకర్మ అకర్మ మనఁబడును. ||౧౭||

గీ॥ కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః ॥
స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥ ॥౧౮॥

పదవిభాగము:— కర్మణి–అకర్మ–యః–పశ్యేత్–అకర్మణి–చ–కర్మ–యః–సః–బుద్ధిమాన్–మనుష్యేషు–సః–యుక్తః–కృత్స్నకర్మకృత్ । ॥౧౮॥

ప్రతిపదార్థము:— యః=ఎవడు; కర్మణి=కర్మమును; అకర్మ=అకర్మమునుగ; పశ్యేత్=తెలిసికొనునో; అకర్మణిచ=అకర్మమును; కర్మ=కర్మముగ; యః=ఎవడు; పశ్యేత్=తెలిసికొనునో; సః=వాడు; మనుష్యేషు=మనుష్యులలో; బుద్ధిమాన్=బుద్ధిమంతుడు; సః=వాడు; యుక్తః=యోగి; కృత్స్నకర్మకృత్=నిఖిలకర్మల నాచరించినవాడు*.

---

శాంకరభాష్యమ్.—

(1) కిం పున స్తత్త్వం కర్మాదే ర్య ద్బోద్ధవ్యం వక్ష్యామీతి ప్రతిజ్ఞాత ముచ్యతే–కర్మణీతి। కర్మణి కర్మ క్రియత ఇతి వ్యాపారమాత్రం తస్మి న్కర్మ ణ్యకర్మ కర్మాభావం యః పశ్యే దకర్మణి చ కర్మాభావే కర్తృతన్త్రత్వా త్ప్రవృత్తినివృత్త్యో ర్వస్త్వప్రాప్త్యైవ హి సర్వ ఏవ

---

శాంకరభాష్యతత్త్వబోధిని.—

(1) కర్మాకర్మవికర్మల యేతత్త్వము దెలిసికొనదగినదో దానిని చెప్పెదనని నీచే బ్రతిజ్ఞ చేయబడెను. అట్టి తత్త్వ మేది యందువా? చెప్పెద వినుము.

చేయబడు వ్యాపారమాత్రమెల్ల కర్మ యనఁబడును. అట్టికర్మమునందు 'అకర్మ' కర్మాభావము నెవడు చూచునో "అకర్మణి" కర్మాభావమునందు కర్మము నెవడుచూచునో అనగా ఇట ప్రవృత్తి యనగా కర్మరూపము, నివృత్తి యనగా కర్మాభావరూపము నగును. కాన నివృత్తిరూపకర్మాభావమునందు కర్మదర్శన మెట్లు పొసగునెదవా? ప్రవృత్తిరూపకర్మ మెట్లు కర్త్రధీనమో అట్లే నివృత్తియు కర్త్రధీనమే యగును కాన ప్రవృత్తియందువలె నివృత్తియందుకూడ కర్మదర్శనము విరుద్ధముకాదు. నివృత్తి వస్త్వధీనమగుటచే కర్తృనిబంధనము లేదు

---

—♦ ౪వ అధ్యాయము ౧౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఒకానొకడు నావ నధిష్ఠించి నదియందు ప్రయాణముచేయుచుండ నాపురుషుడు నదీతటము (గడ్డు) నందుండు వృక్షములపై పు చూచిన వృక్షములు పరుగిడుచున్నట్లు తలచును. అట్లే శరీరేంద్రియాదులు వ్యాపారము (కర్మ) కలవై యుండ నేను మనుష్యుడను, గ్రుడ్డివాడను, స్థూలుడను, బ్రాహ్మణుడను అని యాత్మయందు శరీరేంద్రియాదితాదాత్మ్యాధ్యాస (భ్రమ) కలవాడగుటవలన శరీరేంద్రియాదినిష్ఠమగు వ్యాపార (కర్మ) మాత్మనిష్ఠమే యని తలచును. అట్లాత్మనిష్ఠముగ దలచిన కర్మనందు— క్రియాశూన్యమగు నదీతటమునఁదుండు వృక్షములయందు చలనక్రియ యున్నదని తలచుచున్నను తత్త్వమును పరిశీలించి యాక్రియ నదీతటస్థవృక్షములయందు లేదు, నదీతటస్థవృక్షములయం దకర్మయే కలదని తలచినట్లు అకర్త్రాత్మస్వరూపమును

* ఈశ్లోకమునందు "పశ్యేత్" అను క్రియాపదమునకు జ్ఞాన మర్థమగుటఁజేసి "కర్మణి" అను స్థలమునందుగల సప్తమికి విషయత్వ మర్థము గ్రహింపవలయును కనుక నీప్రతిపదార్థ నిరూపణమునందు ద్వితీయార్థముగ జెప్పఁబడెను. అనగా కర్మము నకర్మముగను, అకర్మమును కర్మముగను నెవఁడు తెలిసికొనునో యని యర్థము.

శాంకరభాష్యమ్.—
క్రియాకారకాదివ్యవహారోఽవిద్యాభూమావేవ కర్మ యః పశ్యేత్పశ్యతి స బుద్ధిమాన్మనుష్యేషు స యుక్తో యోగీ కృత్స్నకర్మకృత్సమస్తకర్మకృచ్చ స ఇతి స్తూయతే కర్మాకర్మణో రితరేతరదర్శీ।

(2) నను కి మిదం విరుద్ధ ముచ్యతే కర్మ ణ్యకర్మ యః పశ్యే దిత్యకర్మణిచ కర్మేతి। నహి కర్మాకర్మ స్యా దకర్మ వా కర్మ తత్ర విరుద్ధం కథం పశ్యే ద్ద్రష్టా।

శాంకరభాష్యతత్త్వబోధిని.—
కాన నివృత్తిరూపకర్మాభావమునందు కర్మదర్శనము సంభవింపదని శంకింపవలదు. కర్మయని, కర్తయని, ఫలమనెడి వ్యవహార మవిద్యావస్థయందే సర్వులకు సంభవించును. ఎందువలననిన? నవిద్యావస్థయందు సత్యవస్తుసందర్శనము లేదు. కనుకనే యవిద్యావస్థయందే క్రియాకారకఫలభేదము. కాన నట్టి యవిద్యావస్థయందు ప్రవృత్తియందువలె నివృత్తియందుకూడ నెవడు కర్మను తెలిసికొనునో యని యర్థము). వాడు బుద్ధిమంతుడు, మనుష్యులలో వాడు యోగి, సమస్తకర్మముల నాచరించినవాడు. (ఈశ్లోకమున కర్మమునం దకర్మమును, అకర్మయందు కర్మమును చూచువాడు నుతింపబడెను).

(2) ఇంతవరకు "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అను శ్లోకమునందుగల శబ్దములకు యథాశ్రుతార్థము నిరూపింపబడెను. ఇంతమాత్రమునే తెలిసికొని శ్లోకతాత్పర్యజ్ఞానము లేనివాడై వాది శంకించుచుండెను. కర్మయం దకర్మమును, అకర్మయందు కర్మము నెవడు తెలిసికొనునో యని విరుద్ధముగ బలుకుచుంటివేమి? ఏమివిరోధమనెదవా? ఇట 'కర్మణి, అకర్మణి' అనుస్థలములయందుగల సప్తమికి విషయత్వ మర్థమా? అధికరణత్వ మర్థమా? విషయత్వమనెదవా? కర్మ విషయకము, అకర్మ ప్రకారకము దర్శనమగును. అది యెట్లనిన? మృత్తు

చక్కగ బరిశీలించి వాస్తవముగ శరీరేంద్రియాది నిష్ఠమగు నీకర్మ అకర్మమే. అనగా నకర్తయగు నాత్మయందు లేదు. అని యెవడు తెలిసికొనునో— (అనగా దేహేంద్రియాదులు వ్యాపారములు కలవై యుండ దేహేంద్రియాదులే నేనను భ్రాంతివలన దేహేంద్రియాదులయందుండు వ్యాపారము నాత్మయం దధ్యసించి నేను చేయుచుంటినని భ్రమించుచుండెను. అట్లు దేహేంద్రియాదినిష్ఠవ్యాపారము కలవాడుగ భ్రమించుచుండిన యాత్మస్వరూపమునందు కర్మాభావమును యెవడు తెలిసికొనునో) యని "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అను పాదమున కర్థము. మఱియు దూరముగ కొందఱు మనుజులు నడచి వెళ్ళుచుండ వారలు కంటికి కనుపించుచుండ దూరదోషముచేత యాపురుషులు నడచుటలేదని తలచును. తత్త్వమును విచారించి యాపురుషులు నడచుచుండిరని తెలిసికొనును. అట్లే దేహేంద్రియాదులు త్రిగుణమాయాపరిణామము అగుటవలన నెల్లపుడు వ్యాపారములు కలవై యుండ నేను వ్యాపారము లేనివాడనై సుఖముగ నుంటి నను యభిమానముచే నాత్మయం దారోపితమగు వ్యాపారోపరమమునందు (అకర్మయందు) వ్యాపారముతోగూడిన దేహేంద్రియాదుల స్వరూపపర్యాలోచన చేసి వస్తుతత్త్వము వలన నీవ్యాపారోపరమము (అకర్మ) నివృత్తియనెడి ప్రయత్నస్వరూపమగు వ్యాపారమే యని యెవడు తెలిసి

శాంకరభాష్యమ్॥—

(3) న స్వకర్మైవ పరమార్థత స్తత్కర్మైవ దవభాసతే మూఢదృష్టే ర్లోకస్య। తథా కర్మైవాకర్మైవ తత్ర యథాభూతదర్శనార్థ మాహ భగవాన్ "కర్మ ణ్యకర్మ యః పశ్యే"

శాంకరభాష్యతత్త్వబోధిని॥—

నకు, ఘటమునకు తాదాత్మ్యము, సంబంధము. అనగా ఘటము మృత్స్వరూపమనుట. అట్టి మృద్ఘటములకగు "మృత్తు ఘటము" అను దర్శనము మృద్విషయకము ఘటప్రకారకమగును. అట్లే కర్మాకర్మలకు తాదాత్మ్యముండినచో "కర్మ మకర్మము" అనెడి దర్శనముకూడ కర్మవిషయకము, అకర్మప్రకారకము నగును. కాని ప్రవృత్తి నివృత్తిరూపములగు కర్మాకర్మల కెన్నడును తాదాత్మ్యము పొసగదు. అనగా నెన్నడును కర్మ మకర్మముకాని, అకర్మము కర్మము కాని కానేరవు. అందుచే కర్మము నకర్మముగను, అకర్మమును కర్మముగను తెలిసికొనుమని చెప్పుట విరుద్ధము. "కర్మణి, అకర్మణి" అను స్థలములయందుకల సప్తమీవిభక్తి కధికరణత్వ మర్థమనెదవా? అట్లైనను కర్మ భావరూపము, అకర్మ యభావరూపము. కాన నట్టి భావాభావరూపములగు కర్మాకర్మముల కాధారాధేయభావము సుతరాం విరుద్ధమగుటంజేసి కర్మమునం దకర్మమును, అకర్మమునందు కర్మమును జూడుమని చెప్పుటయు నత్యంతవిరుద్ధమే యగును.

(3) "కర్మణి, అకర్మణి" అనుస్థలములయందుకల సప్తమీవిభక్తికి విషయత్వార్థము నంగీకరించి వాదిచే నుడువబడిన పూర్వపక్షమును పరిహరించుచుండెను అదియెట్లనిన?

ఆత్మానాత్మలకు పరస్పరాధ్యాస మనాదిసిద్ధము. అనగా నాత్మానాత్మవివేకములేని ప్రాణికోటి నిష్క్రియమగు నాత్మయు, సక్రియమగు ననాత్మయు (శరీరాదులు) యొకటేయని

కానునో అట్టి పరమార్థదర్శి బుద్ధిమంతుడనియు, యోగయుక్తుడనియు, సర్వధర్మముల నాచరించినవాడనియు ద్వితీయచరణముచే స్తుతింపబడెను. ఈశ్లోకమునందుగల "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అను పాదమునందుగల కర్మశబ్దమునకు కర్మవికర్మ లర్థము. కాన ప్రథమపాదముచే కర్మవికర్మల తత్త్వము చెప్పబడెను. "అకర్మణి చ కర్మ యః" అను ద్వితీయపాదముచే అకర్మయొక్క తత్త్వము చెప్పబడెను. అని తెలిసికొనవలయును.

కర్తృత్వాభిమానము లేనిచో శాస్త్రవిహితకర్మ కాని, శాస్త్రనిషిద్ధకర్మముగాని బంధహేతువు కాదు. కాన నోయర్జునా! కర్మ బంధహేతువుకాన "నే నేకర్మను చేయక నుదాసీనుడనై సుఖముగ నుండెద"నని నీవు తలచుట మృష (మిథ్యయే). కర్తృత్వాభిమానమును పరిత్యజించినవానిని కర్మ బంధింప నేరదని "న మాం కర్మాణి లింపంతి" అనుశ్లోకముచే తెలుపబడెను. వస్తుతత్త్వమును తెలిసికొననిచో "తూష్ణీంభావముచే నుంటి"నను యౌదాసీన్యాభిమానస్వరూపమగు కర్మయు బంధహేతువే యగును. అందువలన కర్మ వికర్మాకర్మల తత్త్వమును పైన బోధించినవిధమున నెరిగి వికర్మను, అకర్మను పరిత్యజించి కర్తృత్వాభిమానమును, ఫలాభిసంధిని వదలి యోయర్జునా! విహితకర్మము నాచరింపుమని యభిప్రాయము.

ఈశ్లోకమును మఱియొకరీతిన వ్యాఖ్యానింపవచ్చును. అదియెట్లనిన? 'కర్మణి' జ్ఞానకర్మయందు అనగా దృశ్యమగు జడప్రపంచమునందు సద్రూపముచేతను స్ఫురణరూపముచేతను అనుస్యూతము. సర్వాధిష్ఠానము అగు 'అకర్మ' అవేద్యము, స్వప్రకాశచైతన్యము అని పరమార్థదృష్టిచే నెవడు తెలిసికొనునో, అట్లే "అకర్మణి" స్వప్రకాశమగు

శాంకరభాష్యమ్.—

దిత్యాది। అతో న విరుద్ధమ్। బుద్ధిమత్త్వా ద్యుపపత్తేశ్చ "బోద్ధవ్య" (గీ-4-17) మితి చ యథాభూతదర్శన ముచ్యతే।

శాంకరభాష్యతత్త్వబోధినీ.—

భ్రమనొందుచుండుట యనాదిసిద్ధమే. కనుకనే మూఢుడు సక్రియమగు శరీరము నడచుచుండ 'నేను నడచుచుంటిని' అని నిష్క్రియాత్మయందు గమనాదులను, సక్రియమగు నంతఃకరణము కామనాదులు కలదై యుండ నిష్క్రియమగు నాత్మయందా కామనాదుల నారోపించి 'నేనిచ్ఛయించుచుంటిని' అనియు భ్రమయుట యితరేతరావివేకముచేతనే కలుగుచుండుట యనుభవసిద్ధము. మరియు నిట్లే తనకంటే వేరుగ గన్పట్టుచున్న పుత్రాదులు వికలులైనచో "నేను వికలుడననియు, సకలులైనచో 'నేను సకలుడ'ననియు భ్రమయుట లోకసిద్ధము. ఇంతియె కాదు నేత్రమున గ్రుడ్డితనము ప్రాప్తించినచో "నేను గుడ్డివాడను" అనియు, శ్రోత్రమునకు బధిరత్వము ప్రాప్తించినచో "నేను బధిరుడ"ననియు ఇంద్రియధర్మములను తనయందారోపించుటయు, ఇంద్రియాదులతో పరస్పరాధ్యాసమువలననే యని గ్రహింపనగును. కాన పరస్పరాధ్యాసమువలన నవివేకి నిష్క్రియమగు కూటస్థబ్రహ్మమును క్రియావంతముగ దెలిసికొను

దృగ్వస్తువునందు కల్పితము "కర్మ" మాయామయమగు దృశ్యము (జడము) పరమార్థమువలన సత్తు కాదు. ఎందువలననిన ? దృక్కునకు, దృశ్యమునకు పరస్పరసంబంధములేనందున అని హేతువును సమన్వయింపవలెను. ఈ విషయమే "యస్తు సర్వాణి భూతా న్యాత్మ న్యేవానుపశ్యతి। సర్వభూతేషు చాత్మానం తతో న విజుగుప్సతే॥" అని ఈశావాస్యోపనిషత్తునందు చెప్పఁబడెను. ఇట్టిదృక్కునకు దృశ్యమునకు పరస్పరాధ్యాస యుండినను శుద్ధమగు నాత్మవస్తువును పైజెప్పినవిధమున నెవడు తెలిసికొనునో ఇట్లు వాడు పరమార్థదర్శి యగుటవలన యితరుడు కానందున యితడే బుద్ధిమంతుడు. యితరుడు కాడు. ఇట్టివాడే బుద్ధిసాధనమగు యోగముతోగూడినవాడు. అంతఃకరణపరిశుద్ధిచే యేకాగ్రచిత్తుడు. అందుచేతనే యిట్టివా డంతఃకరణపరిశుద్ధిసాధనమగు నిఖిలకర్మల నాచరించినవాడని వాస్తవధర్మములచే స్తుతింపబడుచుండెను. కాన నోయర్జునా ! నీవుకూడ పరమార్థదర్శివగుము, పరమార్థదర్శనముచేతనే నీవు నిఖిలకర్మల నాచరించినవాడ వగుదువని యభిప్రాయము. అందువలననే దీనిని తెలిసికొనుటచే సంసారమువలన విడువబడెదవు. కర్మాకర్మవికర్మల తత్త్వము తెలిసికొనదగినది. అట్టి తత్త్వమును దెలిసినవాడు బుద్ధిమత్త్వాది ధర్మములు కలవాడని స్తుతియు యేదిచెప్పఁబడెనో అదంతయు పరమార్థదర్శనమునందు సంగతమగును. పరమార్థతత్త్వముకంటె భిన్నమగుదానియొక్క జ్ఞానముచే నశుభరూపసంసారమునుండి మోక్షణము సంభవింపదు. కాన నశుభరూపసంసారమోక్షకమగు తత్త్వజ్ఞానమే యిచట వివక్షితము. కాన నోయర్జునా ! నీవుకూడ నితరమగు దానిని తెలిసికొనవలదు. అట్టి యితరజ్ఞానమువలన బుద్ధిమత్త్వము కుదరదని పరమార్థదర్శివ్యాఖ్యానము యుక్తమైనదే.

మతికొందరీశ్లోకము నన్యరీతిని వ్యాఖ్యానించిరి. అదియెట్లనిన ? "కర్మణి" పరమేశ్వరార్థ మాచరింపబడు నిత్యకర్మ బంధహేతువు కానందున నట్టి నిత్యకర్మ మకర్మమే యని యెవడు తెలిసికొనునో, అట్లే 'అకర్మణి' నిత్యకర్మల నాచరింపకపోవుట ప్రత్యవాయజనకమగుటచే బంధహేతువగును. కాన అట్టి నిత్యకర్మల నాచరింపకపోవుట (అకర్మము) కర్మమేయని యెవడు తెలిసికొనునో అని "కర్మణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః"

శాంకరభాష్యతత్త్వబోధిని:—
టచే నాబుద్ధిని తొలగించుటకు శ్రీకృష్ణపరమాత్మ 'కర్మణ్యకర్మ యః పశ్యేత్' అని చెప్పమొద
లిడెను. అనగానేమి? ఏనిష్క్రియమగు కూటస్థబ్రహ్మమును క్రియావత్తుగ మూఢులు దెలిసికొను
చుండిరో అట్టి క్రియావత్తుగ మూఢదృష్టికి భాసించుదానిని 'అకర్మ' నిష్క్రియాత్మనుగ దెలిసి
కొనుము. అని కర్మణ్యకర్మ యః పశ్యేత్' అనుదాని కర్థము. ఏవిధమున నిష్క్రియకూటస్థ
బ్రహ్మము మూఢునకు సక్రియముగ భాసించుచున్నదో అట్లే 'కర్మ' సక్రియమగు ద్వైతము 'అక
ర్మణి' అధిష్ఠానమగు నిష్క్రియకూటస్థబ్రహ్మమునందు సంసృష్టమై భాసించుచున్నదని యెవఁడు
తెలిసికొనునునో అని ద్వితీయపాదమగు' అకర్మణి చ కర్మ యః' అనుదాని కర్థము. సక్రియమగు
ద్వైతప్రపంచమునకు, నిష్క్రియమగు కూటస్థబ్రహ్మమునకు పరస్పరాధ్యాస (ఆత్మానాత్మ లోక
టియే యని భ్రమ) సిద్ధించియుండ యట్టి భ్రమను పొంగొట్టి సమ్యగ్దర్శనము సిద్ధించుటకు
భగవంతుని "కర్మణ్యకర్మ యః పశ్యేత్" అనువాక్య ముచితమే యగును. ఎట్లు ముత్యాపు

అను చరణమును వ్యాఖ్యానించిరి. ఇట్టివ్యాఖ్యాన మసంగతము ఎందువలననిన? "నిత్యకర్మ మకర్మమే" అను
జ్ఞానము భ్రమాత్మకము. అశుభరూపము. ఇట్టి యశుభరూపమగు జ్ఞానమున కశుభరూపసంసారమోక్ష హేతుత్వము
సంభవింపదు. కాన పైవ్యాఖ్య యసంగతమని యెఱుఁగవలెను.

తెలిసికొనదగిన కర్మాకర్మలతత్త్వ మిట్టి మిథ్యాజ్ఞానము కాదు. కర్మ మకర్మ మనెడిజ్ఞానము మిథ్యాజ్ఞానము
(భ్రమజ్ఞానము). ఇట్టి భ్రమాత్మకజ్ఞానము కలవానికి "స బుద్ధిమాన్మనుష్యేషు" అని యుత్తరార్థముచే బుద్ధిమత్త్వాదు
లచే స్తుతియు సమంజసము గాదు. నిత్యకర్మానుష్ఠానము అంతఃకరణపరిశుద్ధిద్వారమున బ్రహ్మజ్ఞానమునకుపయుక్తము.
ఇంతియే కాని నిత్యకర్మ లకర్మ లను జ్ఞానము శాస్త్రముచే నామాదులదృష్టి "నామబ్రహ్మేత్యుపాసీత" అని
విధించినట్లెచటను విధింపబడనందున యెచటనుయుక్తము కాదు. ఉపక్రమవిరోధము ప్రాప్తించును. కాన
"కర్మణ్యకర్మ యః పశ్యేత్" అనువాక్యమే కర్మ మకర్మమనుజ్ఞానమును విధించుచున్నదని చెప్పుటకు వలను
పడదు. నిత్యకర్మాకరణముగూడ స్వరూపముచే నిత్యకర్మకు విరుద్ధమగు కర్మకు ద్యోతకము. అనగా నొకపురు
షుడు నిత్యకర్మల నాచరించుట లేదు. అట్టి నిత్యకర్మల నాచరింపకపోవుటవలన నీపురుషుడు నిత్యకర్మలకు విరుద్ధ
మగు పాపకర్మల నాచరించుచుండెనని యూహింపనగును. అంతియే కాని "నిత్యకర్మాకరణము పాపహేతు
వగుటచే కర్మమే" యను జ్ఞానమెచటను యుపయుక్తము కాదు. అభావమువలన భావపదార్థము పుట్టునని యంగీ
కరించినచో సర్వప్రమాణములకు విరోధము వాటిల్లును. కాన నిత్యకర్మాకరణమనెడి యభావమువలన ప్రత్యవాయ
మనెడి భావపదార్థము పుట్టనేరదు. అట్లు కాక నభావమువలన భావమే జనించినచో నభావమనునది సర్వత్రసాధా
రణముగ సంభవించుచునేయుండును. కాన సర్వత్రసర్వదా కార్యము జనించుచునే యుండవలసివచ్చును. అందు
వలన నభావమువలన భావము పుట్టనేరదు. "కర్మశబ్దము భావార్థకము. అట్టి కర్మశబ్దమువలన క్రియ ప్రతీయమాన
మగును. ఈయర్థమే విధింపబడుచున్నది." అను న్యాయానుసారము భావార్థమే యపూర్వజనకము "అతిరాత్రే
షోడశినం నగృహ్ణాతి" అనుస్థలమున షోడశిగ్రహాగ్రహణ మపూర్వజనకము కాదు. మఱేమనిన? యజమానిసం
కల్పవిశేషమే యపూర్వజనకమని "నేక్షేతోద్యంతమాదిత్యం" (ఉదయించుచున్న సూర్యుని చూడకూడదని
చెప్పియుండిరి. అచట సూర్యదర్శనాభావ మపూర్వజనకము కాదు. ప్రజాపతివ్రతమునందు సూర్యదర్శనము నిషే
ధింపఁబడెను. అట్టి సూర్యదర్శనాభావోపలక్షితసంకల్పమే యపూర్వజనకమైనటుల యంగీకరించిరి. కనుక నే

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చిప్పనుచూచి రజతమని భ్రమనొందినవానినిగూర్చి ఏ వస్తువు యింతవరకు రజతమని దెలిసికొంటివో దాని నిపుడు శుక్తిశకలముగ (ముత్యపుచిప్పనుగ) తెలిసికొనుమని భ్రమసిద్ధమగు రజతాదివిషయానువాదపురస్సరముగ శుక్తిశకలము నుపదేశించినటుల కర్త్రాదిస్వరూపవిషయానువాదపురస్సరముగ తదధిష్ఠానము, కర్త్రాదిరహితము, కూటస్థము అగు బ్రహ్మమిచట శ్రీకృష్ణునిచే బోధింపబడుటవలన భగవద్వచనమునకు విరోధము లేదు. మఱియు కూటస్థబ్రహ్మముకంటె వేఱుగ భాసించు నిఖిలప్రపంచము మాయామాత్ర మగుటంజేసి అట్టి మాయామాత్రప్రపంచజ్ఞానమువలన బుద్ధిమత్త్వయుక్తత్వకృత్స్నకర్మకృత్త్వము లుపపన్నములు కానందున నీశ్లోకమునందు 'స బుద్ధిమాన్' అనుదానిచే బుద్ధిమత్త్వాదినిర్దేశమువలనను బ్రహ్మజ్ఞానముచేతనే బుద్ధిమత్త్వాదిక ముపపన్న మగుటచే నిచట సర్వక్రియారహితబ్రహ్మజ్ఞానమే వివక్షితము. కాన అధ్యారోపిత కర్త్రాదుల యనువాదపూర్వకముగ తదధిష్ఠానము, కర్త్రాదిరహితము, నిర్విశేషము నగు బ్రహ్మము బోధ్యమాన మగుటవలన నీ శ్లోకమున విరోధాశంకావకాశము లేదు.

మఱియు "కర్మణోహ్యపి బోద్ధవ్యం" అనుచోటనుండు బోధశబ్దమునకు సమ్యగ్జ్ఞానమే ప్రసిద్ధమగు యర్థము. కర్మాకర్మవికర్మముల స్వరూపము బోద్ధవ్యమని జెప్పుచుండెడి శ్రీకృష్ణునిచే సమ్యగ్జ్ఞానోపదేశమే వివక్షితమగుటంజేసి నిచట కూటస్థబ్రహ్మమే వివక్షితము, కాన నేవిరోధమిచట ప్రాప్తింపదు.

---

"అకుర్వ న్విహితం కర్మ" అను స్థలమువనుండిన శతృప్రత్యయము లక్షకమని వ్యాఖ్యానించిరి. శతృప్రత్యయము "లక్షణహేత్వోః క్రియాయాః" అను పాణినిసూత్రమువలన యవిశేషముగ లక్షణార్థమునందు హేత్వర్థమునందు ప్రాప్తించుచున్నను 'అకుర్వన్' అనుస్థలమున విహితకర్మాకరణరూపయభావమునకు ప్రత్యవాయరూపభావహేతుత్వము సంభవింపనందున లక్షణార్థకముగ వ్యాఖ్యానించిరి. కాన ప్రస్తుతము మిథ్యా (భ్రమ) దర్శనము తొలంగింపవలసియుండ "కర్మ యకర్మ, అకర్మ కర్మ" యని వ్యాఖ్యానించుట యెంతమాత్రము మంచిది కాదు. మఱియు "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అను వాక్యము నిత్యకర్మానుష్ఠానపరమేయని చెప్పుటయు సంగతము కాదు. అట్లగుచో శ్రీకృష్ణపరమాత్మ "నిత్యాని కుర్యాత్" (నిత్యకర్మల నాచరింపుము) అని చెప్పవలయును. అట్లుచెప్పక నిత్యకర్మాచరణ బోధకమగు వాక్యమును బ్రయోగింపక "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అని నిత్యకర్మాచరణమును బోధింపని వాక్యమును బ్రయోగింటచే శ్రీకృష్ణపరమాత్మ జగద్వంచకుడని చెప్పవలసివచ్చు ననెడి దోషము లీవ్యాఖ్యయందు భాష్యకారులు భాష్యమున విస్తారముగ జూపియుండిరి. కాన నేనిచట యింతకంటె విస్తారముగ జూప నవసరములేదని విరమించుచుంటిని.

శంకరానందీయము:— కర్మాకర్మవికర్మలతత్త్వమారూఢుడు తెలిసికొన నవసరము లేదు. ఆరురుక్షువే అశుభసంసార మోక్షణముకొఱకు కర్మాకర్మల తత్త్వమును తెలిసికొనవలయును. అట్టి తత్త్వమునే చెప్పెదనని పూర్వమునందు ప్రతిజ్ఞ చేయబడెను. అట్టి ప్రతిజ్ఞాత మగు కర్మాకర్మలతత్త్వమునే "కర్మ ణ్యకర్మ" అను శ్లోకముచే చెప్పుచుండెను.

"క్రియత ఇతి కర్మ" దేహేంద్రియాదులచే చేయబడున దెల్లను కర్మ యనఁబడును. అది లౌకికకర్మయు, వైదికకర్మయు కూడ నగును. అది శరీరాద్యుపాధి సంబంధమైనది. అట్టి చేష్టామాత్రస్వరూపమగు లౌకిక వైదిక

శాంకరభాష్యమ్ :—

(4) నచ విపరీతజ్ఞానా దశుభా న్మోక్షణం స్యాత్ "యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభా" (గీ-4-16) దితి చోక్తమ్। తస్మా త్కర్మాకర్మణీ విపర్యయేణ గృహీతే ప్రాణిభి స్తద్విపర్యయ గ్రహణనివృత్త్యర్థం భగవతో వచనం "కర్మ ణ్యకర్మ యః" ఇత్యాది। నచాత్ర కర్మాధికరణ

శాంకరభాష్యతత్త్వబోధిని :—

(4) ఫలమునుబోధించెడి వాక్యముయొక్క విచారముచేతనుగూడ నిచట కూటస్థబ్రహ్మమే యభిప్రేతము. అది యెట్లనిన ? పూర్వశ్లోకమునందు ఫలమును బోధించెడి "యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్" అను వాక్యము కలదు. దాని కర్థ మేమి ? ఏ కర్మాకర్మవికర్మముల తత్త్వజ్ఞానమువలన సంసారమునుండి విముక్తుడ వగుదువో యనికదా యర్థము. దీనివలన దేలిన యాశయ మేమి ? కర్మాకర్మవికర్మల తత్త్వజ్ఞానము మోక్షసాధనమనియే నిర్ణయింపవలయును. అది కర్మమునం దకర్మజ్ఞాన మనెదవా ? ఇది విపరీతజ్ఞానము. ఇట్టి విపరీతజ్ఞానమువలన మోక్ష మెట్లుప్రాప్తించును ? ప్రాప్తింపనేరదు. కనుకనే "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అనుచోట

కర్మయందు "అకర్మ" కర్మాభావమును—ఆత్మయాథాత్మ్యమును దెలిసి యే విద్వాంసుడు చూచునో, అట్లే "అకర్మణి" దేహేంద్రియవ్యాపారోపరమరూపమగు తూష్ణీంభావావస్థయందు "కర్మ" క్రియను యెవడు చూచునో యని యర్థము.

క్రియారూప మగు వ్యాపారము చూడబడుటవలన కర్మ మకర్మము కాదు. అకర్మ మనగ తూష్ణీంభావము. అదియు స్థాణువువలె ప్రత్యేకము చూడబడుటవలన కర్మము కాదు. అట్లగుచో ప్రత్యక్షమునకు విరోధము వాటి ల్లును. కాన భావ మభావరూపము, అభావము భావరూపము కానేరదు. కాన కర్మను అకర్మనుగాను, అకర్మను కర్మనుగాను తెలిసికొనుట సంభవింపదని శంకింపజనదు.

యోగ్య మగు బుద్ధిచే విచారించిన కర్మ మకర్మముగాను, అకర్మమును కర్మనుగాను దెలిసికొనుట సంభవించును. అది యెట్లనిన మేఘములు పరిగిడుచుండునపుడు చంద్రుడుకూడ పరిగిడుచుండునట్లు కనుపించును. కాన చంద్రునియం దాక్రియ లేకున్నను మేఘములక్రియచే చంద్రుడు క్రియకలవా డగును. మరియు ఆతపము (ఎండ) క్రియాశూన్యమైనను దర్పణాదులను చలింపజేసినచో దర్పణాదిచాలనక్రియచే ఆతపము క్రియకల దగును. అట్లే సర్వ జీవులు స్వయముగ క్రియలేనివా రైనను దేహేంద్రియతాదాత్మ్యముచే దేహాదులక్రియచే క్రియావంతు లగుదురు. అట్లైనను బ్రహ్మవేత్త "నేను బ్రహ్మస్వరూపమునే" అని బ్రహ్మమునందే యాత్మత్వవిజ్ఞానము కలవా డగును. అట్టి విజ్ఞానముచే తనకు దేహాదిసంబంధము లేమింజేసి దేహాదికర్తృకమగు కర్మను 'నాది నా సంబంధమైనది' అనెడి స్వత్వము లేనందున అకర్మగ దెలిసికొనును. అన్యకర్తృక మగు కర్మయం దన్యున కెన్నడు స్వత్వ ముండదు. కాన దేహాదికర్తృకమగు కర్మ జీవునకు కర్మబంధము కానందున బంధకముగానట్టి యకర్మతుల్య మగుటంజేసి యకర్మయే యగును. అందువలన బ్రహ్మవేత్త దేహేంద్రియాదికర్తృకమగు కర్మను యకర్మగనే తెలిసికొనును. ఇంతియే కాని తనయందుండు కర్మ నకర్మగ తెలిసికొనడు. ఎందువలన ? తాను నిరవయవుడు కాన నిరవయవమునందు కర్మసంభవింపనందున మేఘములు చలించు (పరుగిడు) చుండ చంద్రుని నిష్క్రియునిగ నెట్లుచూతునో, అట్లే దేహేంద్రియాదులు స్వేచ్ఛగ విషయములయందు ప్రవర్తించుచుండ విద్వాంసుండు తనను నిష్క్రియునిగ తెలిసి కొనును. కాన "నిష్కలం నిష్క్రియం" అనుశ్రుతిప్రామాణ్యమువలన కూటస్థము, అసంగము, చిద్రూపము

శాంకరభాష్యమ్ :—

మకర్మాస్తి కుండే బదరాణీవ, నాప్యకర్మాధికరణం కర్మాస్తి కర్మాభావత్వా దకర్మణః। అతో విపరీతగృహీత ఏవ కర్మాకర్మణీ లౌకికై ర్యథా మృగతృష్ణికాయా ముదకం శుక్తికాయాం వా రజతమ్।

శాంకరభాష్యతత్త్వబోధిని :—

కూటస్థబ్రహ్మమే బోధింపఁబడును. అట్టి కూటస్థబ్రహ్మముయొక్క దర్శనము మోక్షకారణమే యగును. కాన ప్రాణులు కర్మాకర్మలను విరుద్ధముగ గ్రహించుచుండిరి. అట్టిప్రాణుల విపరీత గ్రహణనివృత్తికొఱకే శ్రీకృష్ణపరమాత్మ 'కర్మ ణ్యకర్మ యః పశ్యేత్' అని చెప్ప మొదలిడెను.

ఇట వ్యవహారభూమియందు కుండమునందు బదరీబీజములవలె కర్మ మధికరణముగా గలది యకర్మము కాదు. అకర్మయనగ కర్మాభావము, అభావము తుచ్ఛమగుటంజేసి దానియం దాధారత్వముగాని, యాధేయత్వముగాని యుండనేరదు కనుకనే అకర్మమధికరణముగాగల కర్మము సంభవింపదు. అందుచే కర్మాకర్మలు మృగతృష్ణిక (ఎండమావుల) యందు జలమువలె శుక్తిక (ముత్యపుచిప్ప) యందు రజతమువలె లౌకికులచే విపరీతముగ గ్రహింపబడెను.

అగు నాత్మనే యాత్మరూపముగ తెలిసికొనిన విద్వాంసునకు దేహేంద్రియాదికర్తృకమగు కర్మ నకర్మగ దెలిసికొనుట సమంజసమేయగును. ఇట్టిజ్ఞానము విద్వత్ప్రత్యక్షము. "అకర్తారం స పశ్యతి" అను స్మృతిసిద్ధమగుటవలన ప్రామాణ్య ముపపన్నము.

మఱియు అశ్వమునధిష్ఠించి ప్రయాణముచేయువా డశ్వమాగినపుడు తా నాగినటుల తెలిసికొనును. నడుచుచున్న సూర్యుని నడవనివానినిగ దెలిసికొనును. అట్లే మూఢుడు (అజ్ఞాని) తనయందు దేహాదుల నధ్యసించి (దేహాదులే యాత్మయని భ్రమించి) దేహాదులవ్యాపారోపరమము ప్రాప్తించినపుడు "నేను తూష్ణీంభావముగ నుంటిని, దుఃఖకరమగు నేకర్మను చేయుటలేదు" అని యసుఖరూపమగు దేహేంద్రియ నిరోధమునందు సుఖబుద్ధిచే దేహేంద్రియాదుల యక్రియచే తన నక్రియునిగా తెలిసికొనును. (చూచుచుండును) విద్వాంసుఁడట్లు తెలిసికొనడు. మఱి యెట్లుచూచును? దేహేంద్రియవ్యాపారోపరమమగు నకర్మను కర్మస్వరూపముగనే తెలిసికొనును. నిగూఢాంగులిముష్టియందు అనగా ఒకానొకడు వ్రేళ్ళుముడిచి పిడికెడ పట్టెననుకొనుడు. అట్టి పిడికెడయందు వెలుపల క్రియలేకున్నను పిడికిడిలోపల వ్రేళ్ళముకుళీభావమునకు కారణమగు వ్రేళ్ళయొక్క నిరోధక్రియ కలదు. చక్షుస్సు మూసుకొనినను వెలుపల దర్శనక్రియ లేకున్నను కనురెప్పల నిరోధనక్రియ కలదు. అట్లే 'నేను దేనిని చేయను' అని తూష్ణీంభావావస్థయందు కూడ వెలుపల దేహేంద్రియాదుల చలనక్రియ లేకున్నను లోపల "నేను యేకర్మను చేయను" అని కర్తృకాగ్రహరూపమగు మానసక్రియ కలదు. సర్వార్థసిద్ధులు మనోవ్యాపారమూలకములుగాన లోపల అగ్రహక్రియలేనిచో వెలుపల హస్తాదుల నిరోధమే సంభవింపదు. ఇంద్రియముల నిగ్రహక్రియచేతనే దేహము నిశ్చలమగుచున్నది. ఇంద్రియనిగ్రహక్రియలేనియెడల దేహచలనము కాని, ఇంద్రియచలనము కాని సంభవించెడిని. అందువలన తూష్ణీమవస్థాన మకర్మయైనను అది కర్తయొక్క యాగ్రహరూపమానసక్రియయే. కాన నట్టి యకర్మను కర్మనుగ దెలిసికొనుట న్యాయసిద్ధము, దృష్టాంతసిద్ధము, అనుభవసిద్ధము. అందువలన నకర్మను కర్మగ తెలిసికొనుట విరుద్ధము కాదు. ప్రామాణికమేయగును. భావము నభావముగను, అభావమును భావముగను, శంకింపజనదు. దేహేంద్రియాదులచేష్ట భావరూపమయినను అది యబంధక

శాంకరభాష్యమ్:—

(5) నను కర్మ కర్మైవ సర్వేషాం న క్వచి ద్వ్యభిచరతి-తన్న, నౌస్థస్య నావి గచ్ఛన్త్యాం తటస్థే ష్వగతిషు నగేషు ప్రతికూలగతిదర్శనా ద్దూరస్థేషు చక్షుషాఽసన్నికృష్టేషు గచ్ఛత్సు గతత్వ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(5) సర్వప్రాణులకు కర్మము కర్మముగనే భాసించుచున్నది. ఎచటను వ్యభిచరించుట లేదు. అదేవిధమున నకర్మ మకర్మము గనే భాసించుచున్నదికాని యదియు వ్యభిచరించుట లేదు. కాన వివాదవిషయమగు కర్మాకర్మములు అవ్యభిచారు లగుటంజేసి సత్యములు అని శంకింపఁ జనదు.

నావయందుండువానికి నావ వెళ్లుచుండ ఒడ్డుయందుండు గతిశూన్యమగు వృక్షముల యందు ప్రతికూలముగ గమనము కన్పించుటచేతను, చక్షురింద్రియమునకు సన్నికృష్టము కాక

మగుటవలన నభావతుల్యమే. అందువలన కర్మను అకర్మనుగ దెలిసికొనుట యుపయుక్తమే. కనుకనే భావము నభావముగ దెలిసికొనుట యుపపన్నమే. తూష్ణీంభావావస్థానరూపమగు నకర్మయందును పైనచెప్పినవిధమున కర్మదర్శనమువలన నకర్మయందు కర్మదర్శనమున్ను యుపపన్నతరమే. కాన నేమియు విరోధములేదు.

విద్వాంసునకు— కర్మయం దకర్మదర్శన మతీతానాగతవర్తమానసర్వకర్మనాశహేతు వగుటచే జన్మాది బంధనివర్తకమగుటవలన నవశ్యము కర్తవ్యమే. అకర్మయందు కర్మదర్శనమునకు ప్రయోజనము లేనందున 'అకర్మణి చ కర్మ యః పశ్యేత్' అని యకర్మయందు కర్మదర్శనమును విధించుట వ్యర్థమని శంకింపజనదు.

అకర్మయందు కర్మదర్శనముగూడ విధించుట నిష్క్రియము, అస్పష్టము నగు నాత్మయొక్క దర్శనమునకు సాధనమగుటచే సఫలమగును. "నిష్కలం, నిష్క్రియం శాంతం" అనుశ్రుతివలన నిష్క్రియత్వ శాంతత్వ ములు బ్రహ్మలక్షణములుగ శ్రుతిప్రమాణములగుటవలన నిష్క్రియత్వశాంతత్వములు కల దేహేంద్రియవ్యాపార పరమరూపమగు తూష్ణీమవస్థానమునందు స్వరూప (ఆత్మ) భ్రమ సంభవించును. అనగా దేహేంద్రియాదుల యందున్న తూష్ణీమవస్థానరూపమగు వ్యాపారోపరమమును. "నేను తూష్ణీంభావమును పొందియుంటి" నని ఆత్మసంబంధమైనదానినిగ భ్రమించును. అట్టిభ్రమ లేకుండుటకు "అకర్మణి చ కర్మ యః" అని యుపదేశింపఁబడెను. కర్మవలె యకర్మయు యౌపాధికమగుటవలన, పురుషకంత్రమగుటవలన, దృశ్యమగుటవలన. విచారింపఁగ సక్రియమగుటవలన స్వయముగ ననాత్మయేయగును. 'అట్టి యకర్మను చూచువాడే యాత్మ యని దెలిసికొనవలయునని సూచించుటకు "అకర్మణి చ కర్మ యః" అని చెప్పఁబడెను.

మఱియు "అకర్మయు కర్మవలె కర్మస్వరూపమే" అను జ్ఞానముచే కర్మాకర్మల రెండింటి కనాత్మత్వము సిద్ధించును. అట్టి నిశ్చయముండిన విద్వాంసుడు తూష్ణీంభావమును పొందియుండవలెనా? లేక కర్మలను చేయవలయునా? అని విచారించిన అకర్మ నిష్ఫల మగుటవలన నకర్మాపేక్షయా లోకోపకారకమగుటవలన విద్వాంసునకు కర్మయందు ప్రవృత్తి సఫలమని "అకర్మణి చ కర్మ యః" అను వాక్యముచే శ్రీకృష్ణపరమాత్మ సూచించుచుండెను. కాన "అకర్మణి చ కర్మ యః పశ్యేత్" అను విధివాక్యము సర్వదా అన్నివిధములచేతను సఫలమే యగును.

"నహి వస్తు" దృశ్యమగు ద్వైతమే లేదని జ్ఞానముకల విద్వాంసునకు దేహేంద్రియాదులు మిథ్యారూపములు. కాన దేహేంద్రియాదులయందుండు కర్మకూడ మిథ్యయే యను జ్ఞానము సంభవించును. ఇట్టి జ్ఞానికి కర్మ

శాంకరభాష్యమ్.—

భావదర్శనాత్ । ఏవ మిహా ప్యకర్మ ణ్యహం కరోమీతి కర్మదర్శనం, కర్మణి చాకర్మదర్శనం, విపరీతదర్శనం యేన తన్నిరాకరణార్థ ముచ్యతే "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" ఇత్యాది ।

శాంకరభాష్యతత్త్వబోధిని.—

దూరమునందుండు పురుషులు నడచుచుండ వారియందు గమనము కాన్పింపక పోవుటవలనను నీకర్మాకర్మములు వ్యభిచారులు కాన నివి సత్యములని చెప్పుటకు వీలుగాదు. అదేవిధమున గతిశూన్యమగు తటస్థవృక్షములయందు గతిదర్శనమువలె నిష్క్రియమగు కూటస్థబ్రహ్మమునందు "అహం కరోమి" నేను చేయుచుంటిని అని కర్మదర్శనము—నడచుచుండెడి దూరస్థపురుషులయందు కర్మాభావదర్శనమువలె సక్రియమగు ద్వైతప్రపంచమునం దకర్మదర్శనము విపరీతదర్శనము లనఁబడును. అట్టి విపరీతదర్శనమును తొలంగించుటకే శ్రీకృష్ణపరమాత్మ 'కర్మ ణ్యకర్మ యః పశ్యేత్' అని చెప్పుచుండెను.

యందు కర్మదర్శనము సంభవింపదు. ఎందువలననిన దేహాదులు సత్యమైనపుడు కదా దేహాశ్రితమగు నకర్మకు సత్యత్వము, కర్మరూపత్వము సిద్ధించుట. అకర్మయందు కర్మత్వజ్ఞానముండినపుడు కర్మయం దకర్మత్వజ్ఞానము మిథ్యాజ్ఞాననిబంధనమగుటవలన కర్మయం దకర్మత్వజ్ఞానము సిద్ధించును. ఇట్లు పరస్పరవిరుద్ధ మగు కర్మయం దకర్మదర్శనము, అకర్మయందు కర్మదర్శనము ఒక పురుషునకు సంభవింపవు. ఈ శ్లోకమునందు "యః" అను యచ్ఛబ్ద ద్వయముండుటచే కర్మయం దకర్మదర్శనము, అకర్మయందు కర్మదర్శనము, భిన్నపురుషాశ్రితములే అని శంకింపఁజనదు. ఈస్థలమున విద్వాంసునకు కర్మాకర్మలయందు మిథ్యాత్వదర్శనమే వివక్షితము. అదియెట్లనిన ? దేహేంద్రియాదులకు, దేహేంద్రియాశ్రితకర్మకు మిథ్యాత్వము ఎట్లు తెలిసికొనదగినదో అట్లే దేహేంద్రియాదుల వ్యాపారోపరమరూపమగు నకర్మకుకూడ మిథ్యాత్వము తెలిసికొనదగినది. కర్మాకర్మలు రెండును యవిద్యాకార్యములగు దేహాదుల నాశ్రయించినవే. కాన కర్మాకర్మలు రెండును అవస్తువులే. అవస్తువులు కనుకనే మిథ్యాభూతములు. అట్లు కానిచో భేదజ్ఞానము కలవానికి కశుభమగు సంసారమువలన మోక్షము (విముక్తి) సంభవింపదు. కాన కర్మాకర్మలు రెండును అవస్తువులే. అందువలననే యీరెండును మిథ్యలని తెలిసికొనదగినవి. ఎవడు కర్మాకర్మలను, ఆ కర్మాకర్మల కాశ్రయమగు దేహేంద్రియాదులను మిథ్యాభూతములుగ నిశ్చయించుకొని, యిట్టి కర్మాకర్మలకు దేహేంద్రియాదులకు అధిష్ఠానము, నిష్కలము, నిష్క్రియము, శాన్తము, దేశమువలన కాలమువలన వస్తువువలన ననంతము, అఖండానందైకరసము నగు పరమాత్మస్వరూపమే "నేను" అని తనస్వరూపముచే తెలిసికొని పరమాత్మస్వరూపమున నుండునో అట్టివాడె సంసారమునుండి ముక్తుడగును. "పరమాత్మ వేఱు, నేను వేఱు. నేనుకర్తను, భోక్తను, నాకు పరలోక సంబంధము కలదు, నాచే నాచరింపబడిన కర్మలకు ఫలప్రదాత యీశ్వరుడు" అని తెలిసికొనువాడు సంసారమునుండి ముక్తుడు కాడు. కాన, కర్మయం దకర్మజ్ఞానము, అకర్మయందు కర్మజ్ఞానము, ఈరెండును నేకపురుషాశ్రితములే. అనేకపురుషాశ్రితములు కావు. "కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః" అనుస్థలమున 'యః' అను యచ్ఛబ్దములు రెండుండుటచే కర్మయం దకర్మదర్శి యొకడు, అకర్మయందు కర్మదర్శి మఱియొకడనియు శంకింపఁజనదు. "యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్యభిసంవిశన్తి" అను స్థలమున యతః, యేన, యత్, అని యచ్ఛబ్దములు మూడుండలేదా ? అంతమాత్రముచే భిన్నపురుషజ్ఞానము గలుగునా ? జగజ్జన్మస్థితిలయహేతువగు నేక పరమాత్మజ్ఞానము

శాంకరభాష్యమ్.—

మచిన్త్యోఽయం' (గీ-2-25) 'న జాయతే మ్రియతే వా' (గీ-2-20) ఇత్యాదినాఽఽత్మని కర్మాభావ శ్శ్రుతిస్మృతిన్యాయప్రసిద్ధ ఉక్తో వక్ష్యమాణశ్చ తస్మి న్నాత్మని కర్మాభావే అకర్మణి కర్మ విపరీతదర్శన మత్యన్తనిరూఢమ్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని.—

అదెట్లనిన ? "అవ్యక్తోఽయ మచిన్త్యోఽయం; న జాయతే మ్రియతేవా కదాచిత్" ఇత్యాదిగ్రంథముచే నాత్మయందు కర్మాభావము శ్రుతిస్మృతి న్యాయప్రసిద్ధమని చెప్పఁబడెను. మున్ముందావిషయమునే "సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే" అను గ్రంథముచే స్పష్టముగ జూపించును.

కర్మమనునది దేహాదినిర్వర్త్యమగుటచే కాయక, వాచక, మానసికభేదముచే మూఁడువిధములు. కూటస్థస్వభావమగు నాత్మ యసంగతమగుటవలన నట్టియాత్మచే నిర్వర్త్యమగు కర్మమే యప్రసిద్ధము. కాన నిస్సంగము, నిష్క్రియము నగు యాత్మయందు విపరీతమగు కర్మయొక్క దర్శన మెట్లు సిద్ధించు నని శంకింపవలదు.

"అహం కర్తా" నేను కర్తను అనెడి యాత్మసమానాధికరణముగ భాసించెడి వ్యాపారమాత్రముయొక్క యనుభవమువలన నిష్క్రియాత్మయందు కర్మభ్రమ యత్యంతము నిరూఢము.

సిద్ధింపదు. అట్లైన జగమునందు మిథ్యాత్వజ్ఞానము సంభవింపనందున భేదజ్ఞానమే సంభవించును. అట్టి భేదజ్ఞానముండిన జీవబ్రహ్మల కభేదజ్ఞానము సంభవము కాదు. అట్లగుచో బ్రహ్మవేత్త బ్రహ్మస్వరూపమును పొందునని చెప్పుట యసంగతము. కాన, బ్రహ్మము నకభిన్ననిమిత్తోపాదానత్వము చెప్పుటకు భృగువల్లి ప్రారంభమై "యతో వా ఇమాని భూతాని జాయన్తే, యేన జాతాని జీవన్తి, యత్ప్రయన్త్యభిసంవిశన్తి" అని చెప్పబడెను. ఈ వాక్యములు బ్రహ్మ కభిన్ననిమిత్తోపాదానత్వమును చెప్పుటకు ప్రవర్తించినవి. జగజ్జన్మకర్త యొకడు లయకర్త మరియొకడనిన బ్రహ్మమున కభిన్ననిమిత్తోపాదానత్వము పొసగదు. అందుచే నిచటయుండు యచ్ఛబ్దత్రయము యొకబ్రహ్మమునే చెప్పును. అట్లే 'కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః' అనుచోట నుండు యచ్ఛబ్దద్వయము కర్మయం దకర్మదర్శియు, అకర్మయందు కర్మదర్శియు వేఱని బోధింపదు. మఱేమనిన ? వారిరువురు యొకటేయని పూర్వమునందు చెప్పిన విధమున బోధించును. కాన, కర్మయం దకర్మదర్శనము, అకర్మయందు కర్మదర్శనము భిన్నకర్తృకములు కావు. అట్లగుచో నొక యచ్ఛబ్దము ప్రయోగించిన చాలదా ? రెండుయచ్ఛబ్దము లెందులకు ప్రయోగింపవలె ననెదవా ? జ్ఞానసౌకర్యము నిమిత్తమట్లు యచ్ఛబ్దములు ప్రయోగింపబడెను గాని, అట్లు గ్రహీతలిద్దరను బోధించుటకు బ్రయోగింపబడలేదు. మఱియు "సబుద్ధిమాన్" అను యుత్తరవాక్యమునందు 'సః' అనెడి తచ్ఛబ్దమొకటియే ప్రయోగింపబడెను. కాన, కర్మయం దకర్మజ్ఞానము, అకర్మయందు కర్మజ్ఞాన మొకనికే చెప్పబడెనని గ్రహింపనగును.

ఇట్లు కర్మ నకర్మనుగాను, అకర్మను కర్మనుగాను యెవడు శాస్త్రమువలన, ఆచార్యునివలన, యుక్తివలన అనుభవమువలన తెలిసికొనునో, అట్టివాడే మనుష్యులలో సర్వశాస్త్రములయం దధికారి. వాడే యాత్మతత్త్వమును తెలిసినవాడు. అట్టివాడే యోగి. అట్టివాడే శ్రౌతస్మార్తరూపమగు నిఖిలపుణ్యకర్మల నాచరించినవాడు "యథా కృతాయవిజితా యాధరేయా స్సంయన్త్యేవ మేనగ్ం సర్వం తదభిసమేతి యత్కించ ప్రజా స్సాధు కుర్వన్తి

శాంకరభాష్యమ్:—

(7) యతః "కిం కర్మ కి మకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః" (గీ-4-116) దేహాద్యాశ్రయం కర్మాత్మ న్యధ్యారోప్యాహం కర్తా మమైత త్కర్మ మయాఽస్య ఫలం భోక్తవ్య మితి చ। తథాహం తూష్ణీం భవామి యేనాహం నిరాయాసోఽకర్మా సుఖీ స్యా మితి కార్యకరణాశ్రయవ్యాపారోపరమం తత్కృతం చ సుఖిత్వ మాత్మ న్యధ్యారోప్య న కరోమి కించి త్తూష్ణీం సుఖ మాస మిత్యభిమన్యతే, లోక స్తత్రేదం లోకస్య విపరీతదర్శనాపనయనాయాహ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(7) ఏదికర్మము? అకర్మమేది? అని బుద్ధిమంతులుగూడ మోహమును పొందుచుండిరి, కాన నిష్క్రియమగు యాత్మయందు కర్మకలదని భ్రాంతి సర్వులకు కలదు. ఆత్మ నిష్క్రియముకదా! అట్టియాత్మయందు కర్మవిభ్రమ మెటుల సంభవించుననెదవా? కర్మమున కాశ్రయము దేహాదులు. అట్టి దేహాదుల కాత్మకు ఐక్యాధ్యాసమువలన దేహాదులయందుండు కర్మము నాత్మయం దారోపించి "నేనుకర్తను, ఈకర్మము నాసంబంధమైనది, నేనీ కర్మఫలము ననుభవింపవలెననియు; అట్లే కార్యకరణములయందుండు వ్యాపారోపరమరూపమగు నకర్మమును ఏతూష్ణీంభావముచే నిరాయాసుడనై కర్మరహితుడనై సుఖముకలవాడనగుదునో అట్టి తూష్ణీంభావమును పొందెదను" అని కార్యకరణములయందుండు వ్యాపారోపరమమును, అట్టి వ్యాపారోపరమనిమిత్తమగు సుఖిత్వమును యాత్మయందారోపించి నేనేమియు

యస్తద్వేద య త్సవేద" (ద్యూతమునందు జయముపొందినవానికి పరాజితులు తమపందెము నిచ్చునటుల రెవడాత్మస్వరూపమును దెలిసికొనునో వానిని ప్రజ లేయేసుకృతముల నాచరించెదరో అవన్నియు పొందుచున్నవి). అను శ్రుతివలన మనుష్యులందరిచే నాచరింపబడిన పుణ్యకర్మలన్నియు యాత్మజ్ఞానిచే నాచరింపబడినవే యగుచున్నవి. కాన కర్మయం దకర్మను, అకర్మయందు కర్మను దెలిసికొనినవాడు జ్ఞానియగుటవలన నతని "కృత్స్నకర్మకృత్" (నిఖిలకర్మల నాచరించినవాడని స్తుతించుట యుక్తమే.

లేక "కిం కర్మ కి మకర్మేతి" అను శ్లోకవ్యాఖ్యానశేష మిచట వ్రాయబడుచుండెను. కర్మాకర్మల తత్త్వమును లెస్సగ దెలిసికొని యశుభమగు సంసారమునుండి ముక్తుడవు కాగలవు.

"తమేవం విదిత్వాఽతిమృత్యుమేతి" అనుశ్రుతి ఆత్మతత్త్వజ్ఞానమువలననే మోక్షము సంభవించునని బోధించుచున్నది. కర్మాకర్మలతత్త్వజ్ఞానమువలన మోక్షము ప్రాప్తించునని బోధించుటలేదని యనెదవా? సత్యమే. ఆత్మజ్ఞానమువలననే మోక్షము ప్రాప్తించును. అయినను "తదా విద్వా న్పుణ్యపాపే విధూయ" అనుశ్రుతి పుణ్యపాపముల విధ్వంసన మొనరించుకొనిన విద్వాంసునకే ముక్తి ప్రాప్తించునని బోధించుచున్నది. కాన ముముక్షువు కర్మాకర్మవికర్మల తత్త్వముయొక్క జ్ఞానముచే జన్మమరణాదులకు హేతువగు కర్మాకర్మవికర్మలవలన విముక్తుడు కాగలడు. అందునిమిత్తమై కర్మాదుల తత్త్వము దెలిసికొనదగినదని "కర్మణో హ్యపి బోద్ధవ్యం" అనువాక్యమును శ్రీకృష్ణపరమాత్మ చెప్పమొదలిడెను.

మనుష్యునకు కర్తవ్యమని శాస్త్రముచే బోధింపబడిన స్వర్గాదులకు హేతువగుకర్మయొక్క తత్త్వము సద్గురువులవలన ముముక్షువుచే దెలిసికొనదగినది. నరకాది దుర్గతికి హేతువగు శాస్త్రనిషిద్ధకర్మయొక్క తత్త్వము

శాంకరభాష్యమ్—

భగవాన్ 'కర్మ ణ్యకర్మ యః పశ్యేత్' ఇత్యాది। అత్ర చ కర్మ కర్త్రైవ సత్కార్యకరణాశ్రయం కర్మరహితేఽవిక్రియ ఆత్మని సర్వై రధ్యస్తం యతః పండితోఽప్యహం కరోమీతి మన్యతే। అత ఆత్మసమవేతతయా సర్వలోకప్రసిద్ధే కర్మణి నదీకూలస్థేష్వివ వృక్షేషు గతిః

శాంకరభాష్యతత్త్వబోధిని—

చేయను, తూష్ణీంకారముగ సుఖమును పొందితినని లోక మభిమానమును పొందుచుండెను. వ్యవహారభూమియందు లోకముయొక్క యిట్టి విపరీతదర్శనమును తొలగించుటకు శ్రీకృష్ణ పరమాత్మ "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అని చెప్పుచుండెను.

ఈ వ్యవహారభూమియందు కార్యకరణము (శరీరేంద్రియాదు) లాశ్రయముగా కలదై కర్మము కర్మస్వరూపముగనే నున్నదై కర్మరహితము, అవిక్రియమునగు నాత్మయందు కార్య కరణా (శరీరేంద్రియా) రోపణద్వారమున సర్వులచే నధ్యస్తమగుచున్నది. (ఆరోపింపబడు చున్నది). అనగా జపాకుసుమస్ఫటికములకు సాన్నిధ్యమున్నపు డారెంటికి భేదజ్ఞానము లేనితరి యాజపాకుసుమమునందుండు లౌహిత్యమును (యెరుపును) స్ఫటికమునం దారోపించి స్ఫటికము లోహితమని భ్రమనొందినటుల కార్యకరణములకు ఆత్మకు భేదజ్ఞానము లేనందున కార్యకరణ ముల (శరీరేంద్రియాదుల) యందాత్మ తాదాత్మ్యమును, ఆత్మయందు కార్యకరణములను అధ్య సించు (ఆరోపించు)ను. ఇదియే పరస్పరాధ్యాస మనబడును.

సద్గురువులవలన దెలిసికొనదగినది. అటులనే యనర్థహేతువు, అశ్రద్ధచే విహితాకరణరూపమునగు నకర్మయొక్కయు తత్త్వము సద్గురువులవలన దెలిసికొనదగినది. చలనమే కర్మయొక్కతత్త్వము. ఇంతకంటె కర్మయొక్క తత్త్వము దెలిసికొనదగిన దేమికలదని శంకింపజనదు కర్మాకర్మవికర్మల తాదాత్మ్యగతి సద్గురూపదేశములేనిదే యూహ చే దెలిసికొనుటకు శక్యమైనదికాదు.

కర్మాకర్మవికర్మలతత్త్వము సద్గురువుచే దెలిసికొనదగినదగుచో లోకగురువగు నీవే యాకర్మాకర్మవికర్మల తత్త్వము నుపదేశించుమనెదవా ? అట్లగుచో నుపదేశించెద వినుము. కర్మాకర్మవికర్మలకు, ఆకాశాదినిఖిలప్రపంచ మునకు తత్త్వము బ్రహ్మమే. అట్టి బ్రహ్మము దెలియబడిన సర్వముయొక్కతత్త్వము దెలియబడును. "సర్వ భూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని। సంపశ్యన్బ్రహ్మ పరమం" (ఆత్మను సర్వభూతములయందుండు వానిగను సర్వభూతము లాత్మయందుండు వాటినిగను తెలిసికొనినవాడు). అనుశ్రుతిప్రమాణము గాకల నిశ్శేషసంసారవిభ్రమ విధ్వంసక మగు పరావరైకత్వజ్ఞానమును "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అను శ్లోకముచే శ్రీకృష్ణపరమాత్మ యుపదేశించుచుండెను.

"క్రియతే సృజ్యత ఇతి కర్మ" సృజింపఁబడునది కర్మ యనఁబడును. అది బ్రహ్మ కార్యమగు మహత్త త్త్వము మొదలు స్థూలము వరకు జగత్తు. అట్టి జగత్తునందు "న విద్యతే యత్ర కర్మ తదకర్మ" దేనియందు కర్మ లేదో అది యకర్మ యనఁబడును. "నిష్కలం నిష్క్రియం" అనుశ్రుతిసిద్ధమగు అట్టి యకర్మస్వరూపమగు పరబ్రహ్మమును యెవడు తెలిసికొనునో అనగా ప్రతీతమగు ప్రపంచమును పరబ్రహ్మరూపముగ నెవడు తెలిసి కొనునో అని "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అను పాదమున కర్థము.

శాంకరభాష్యమ్:—

ప్రాతిలోమ్యే నాకర్మ కర్మాభావం యథాభూతం గత్యభావ మివ వృక్షేషు యః పశ్యే దకర్మణి చ కర్మ కరణవ్యాపారోపరమే కర్మ వదాత్మ న్యధ్యారోపితే తూష్ణీ మకుర్వ న్సుఖ మాస

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇట్టి యధ్యాసమూలముననే శరీరేంద్రియాదులకన్న తాను వాస్తవముగ వేరైనను "నేను మనుష్యుడను, నేను గ్రుడ్డివాడను, నేను బధిరుడను, నేను కర్తను" అని శరీరేంద్రియ మనోధర్మము లగు గమనక్రియ, అంధత్వ, బధిరత్వ, మూకత్వ, కర్తృత్వాదులను స్ఫటికమునందు లౌహిత్యమునువలె తనయం దారోపించుకొనును. ఇట్టి యధ్యాస మనాదికాలమునుండి ప్రస్ఫుట మగుటచేతనే బండితుడుగూడ 'నేను జేయుచుంటిని' అని కర్తృత్వమును తనయం దారోపించుకొనును. ఇక మూఢునివిషయ మేమి జెప్పవలెను? కాన కర్మ మాత్మసమవేతముగ సర్వలోకప్రసిద్ధము. అట్టి కర్మమును నదీకూలస్థములగు వృక్షములయందు ప్రాతిలోమ్యముగ ననుభవసిద్ధ మగు గమనము వృక్షములయందుండు గమనము గాదు. (అనగా నదీతీరమునందుండు వృక్షములయందు గమనము లేదు) అని తెలిసికొనునట్లు కర్మము గాదు. (అనగా నిష్క్రియ మగు నాత్మయందు గమనాదులు లేవని) యథాభూతమగు గత్యభావము నెవడు దెలిసికొనునో—నడచుచున్నట్టి దూరస్థపురుషులయందు భాసించు గత్యభావము (గమనక్రియ

పూర్వపక్షము:— జగత్తు సవిశేషము, బ్రహ్మ నిర్విశేషము. (విశేషములులేనిది) గాన గోవు, అశ్వమువలె బ్రహ్మము, జగత్తు పరస్పరము విరుద్ధములు. విరుద్ధములగు గవాశ్వములను పరస్పరము గోవును అశ్వముగను, అశ్వమును గోవుగను తెలిసికొనుట యెట్లు సంభవముకాదో అట్లే విరుద్ధమగు జగత్తును బ్రహ్మముగ విద్వాంసుడెట్లు తెలిసికొనును? తెలిసికొనలేడని శంకింపజనదు.

సిద్ధాంతము— గవాశ్వములకు కార్య కారణభావము లేనందున, జాతిగతభేదమువలనను గవాశ్వములకు వైలక్షణ్యముండును. జగద్బ్రహ్మములైతే కార్య కారణభావమును పొందినవగుటంజేసి వైలక్షణ్యము సిద్ధింపదు. కనుకనే విద్వాంసుడు జగమును బ్రహ్మముగ దెలిసికొనును.

పూర్వపక్షము:— జగము నామమువలన, రూపమువల్లన, గుణమువలన, జాతివలన, నామ, రూప, జాతి గుణశూన్యమగు బ్రహ్మముకంటె వేఱగును. అట్టిభేదము ప్రత్యక్షసిద్ధమే. ఇట్లు ప్రత్యక్షసిద్ధమగు భేదముచే భిన్నమగు జగమును బ్రహ్మముగ నెట్లు విద్వాంసుడు దెలిసికొనును?

సిద్ధాంతము— ఉదకమొక్కటైనను ఉదకమునందు తరంగములని, నురగయని, బుద్బుదములనియు యెట్లు భేదకల్పనయో, భూమి యొక్కటైనను భూమియందు వృక్షములని, క్షేత్రములని, గృహములనియు యెట్లు భేదకల్పనయో అట్లే ఒక్కబ్రహ్మమునందు నామరూపాదిభేదకల్పన భ్రమమూలకమైనది. వాస్తవమైనది కాదు. జలమునందుండు మధురత్వము, ద్రవత్వము, శీతత్వము, శుక్లత్వము మొదలగు ధర్మములు ఫేనతరంగాదులయందు లోపల వెలుపల అనుభూయమానమగుటచే ఫేనతరంగాదులును జలముకంటే వేరు కానట్లు జలసత్తకంటె వేరగు సత్త ఫేనతరంగాదులయందు కాన్పించనందున ఫేనతరంగాదులు జలస్వరూపమే యగునట్లు జగమునందంతటను వెలుపల లోపల విచ్ఛేదములేకుండగ బ్రహ్మధర్మములగు సత్యచిత్త్వాదులే కన్పట్టుటవలన, జగమునందు బ్రహ్మ

శాంకరభాష్యమ్—

ఇత్యహంకారాభిసంధిహేతుత్వాత్తస్మిన్నకర్మణి చ కర్మ యః పశ్యేత్ య ఏవం కర్మాకర్మవిభాగజ్ఞః స బుద్ధిమాన్ పండితో మనుష్యేషు స యుక్తో యోగీ కృత్స్నకర్మకృచ్చ సోఽశుభాన్మోక్షితః కృతకృత్యో భవతీత్యర్థః।

శాంకరభాష్యతత్త్వబోధిని—

లేమి) గత్యభావము గాదు. మఱేమనిన నది గమనమే. అనగా నావపురుషులయందు గమనము గలదు. అని దెలిసికొనినటుల శరీరేంద్రియాదుల వ్యాపారోపరమము కర్మమువలె "నేను తూష్ణీంకారముగ నేమియు చేయనివాడనై సుఖముగ నుంటిని" అనెడి యహంకారాభిసంధివలన నాత్మయం దారోపితము. అట్టి శరీరేంద్రియాదుల వ్యాపారోపరమరూప కర్మాభావము నెవడు కర్మగ దెలిసికొనునో (అనగా నీ వ్యాపారోపరమము ఆత్మధర్మము గాదు. మఱేమనిన శరీరము నందుండు కర్మవిశేషమే యని యెవడు దెలిసికొనునో) అనగా నిట్టి కర్మాకర్మవిభాగమును దెలిసికొనినవాడు జ్ఞాని, మనుష్యులలో వాడే యోగియనియు, నిఖిలకర్మల నాచరించినవాడనియు జెప్పనొప్పును. అట్టి పురుషుఁడే సంసారసాగరమునుండి విముక్తుఁడై కృతకృత్యుఁడగునని యర్థము.

---

సత్తకంటె వేఱగు సత్త లేనందునను "చిద్ధీదం సర్వం సద్ధీదం సర్వం। సర్వం ఖల్విదం బ్రహ్మ। బ్రహ్మైవేదం సర్వం" (ఈనిఖిలప్రపంచకము చిత్స్వరూపము, సత్స్వరూపము, బ్రహ్మస్వరూపము, ఈనిఖిలప్రపంచకము బ్రహ్మస్వరూపమే) అను శ్రుతులచేతను మృత్కార్యమగు ఘటాదులు మృత్స్వరూపములే అయినట్లు బ్రహ్మకార్యమగు నిఖిలప్రపంచము బ్రహ్మమే. శుక్తియం దారోపింపబడిన రజతమువలె బ్రహ్మమునం దారోపితము అనునట్టి యుక్తులచేతను, మృదాది దృష్టాంతములచేతను లెస్సగ విచారించిన నిఖిలజగము బ్రహ్మమే యగును. కనుకనే పరిశుద్ధమైన యంతఃకరణముకల బ్రహ్మవేత్త నిఖిలజగమును బ్రహ్మముగ దెలిసికొనునని యర్థము.

విచారింపఁగ పూర్వమునందు జూపఁబడిన శ్రుతియుక్తిదృష్టాంతానుభవములచే జగత్తునకు బ్రహ్మమాత్రత్వము సిద్ధింప జగత్తునకు కార్యత్వము నివృత్తమగును. జగత్తునకు కార్యత్వము నివర్తింప "నిమిత్తాపాయే నైమిత్తికస్యాప్యపాయః" కార్యము లేనిచో (నివృత్తమైనచో) కారణము లేనిదే (నివృత్తమే) అను న్యాయానుసారము బ్రహ్మమునకు కారణత్వము కూడ నివృత్తమగును. ఎందువలన ననిన? ఒకదానికి కార్యత్వ ముండునపుడే మఱియొకదానికి కారణత్వము సంభవించును. జగత్తునకు కార్యత్వమే లేనపుడు కార్యత్వసాపేక్షితమగు కారణత్వము బ్రహ్మమున కెటుల సంభవించును? సంభవింపదు. పైన జెప్పిన విధమున జగత్తునకు కార్యత్వము, బ్రహ్మమునకు కారణత్వము నివర్తించుటచే కార్యకారణభావశూన్యము, నద్వితీయము, నగు బ్రహ్మము సిద్ధించును. అయినను ఇపుడు విచారించుటచే నద్వితీయత్వము బ్రహ్మమునకు సిద్ధించినను—ఇట్టి విచారమునకు పూర్వమునందు జగత్తనియు, బ్రహ్మమనియు, ద్వైతమే కలదని శంకింపజనదు. పూర్వమునందు రజ్జువే (త్రాడే) సర్పముగను, సర్పశిరస్సుగను; పుచ్ఛముగను నెట్లు భాసించెనో; నిర్జలప్రదేశమే జలతరంగ ఫేనబుద్బుదరూపముగ నెట్లు భాసించెనో; అట్లే బ్రహ్మమే భ్రాంతిచే ద్రవ్యగుణకర్మాది భేదములచే వెలుగు జగదాత్మకముగ భాసించెను. వాస్తవముగ జగత్తనునది లేదు కాన ముముక్షువు బ్రహ్మమునకు కాలత్రయమునం దద్వితీయత్వము సిద్ధించుటకు బ్రహ్మమునందు

శాంకరభాష్యమ్:—

(8) అయం శ్లోకోఽన్యథా వ్యాఖ్యాతః కైశ్చిత్ । కథం, నిత్యానాం కిల కర్మణా మీశ్వరార్థేఽనుష్ఠీయమానానాం తత్ఫలాభావా దకర్మాణి తా నుచ్యన్తే గౌణ్యా వృత్త్యా, తేషాం చాకరణ మకర్మ, తచ్చ ప్రత్యవాయఫలత్వా త్కర్మోచ్యతే గౌణ్యైవ వృత్త్యా। తత్ర నిత్యే కర్మ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(8) శుక్తియందు రజతమువలె యాత్మయందు కార్యకరణసంఘాతసమారోపద్వారమున కార్యకరణసంఘాతవ్యాపారరూపమగు కర్మ మారోపితము. శుక్తికయం దారోపితమగు రజతమును రజతాభావమునుగ దెలిసికొనినటుల యాత్మయం దారోపితమగు కర్మము నెవఁడిది యాత్మనిష్కర్మము గాదు. కర్మాభావమేయని దెలిసికొనునో, 'అకర్మణి' కార్యకరణసంఘాత వ్యాపారోపరమము కార్యకరణసంఘాతద్వారమున నాత్మయం దారోపితము. అట్టి కర్మాభావమును "కర్మ" ఈ వ్యాపారోపరమ మహంకారహేతుకమని యెవఁడు దెలిసికొనునో అట్టి రూప్యతదభావవిభాగము లేని శుక్తిమాత్రమువలె కర్మాకర్మవిభాగశూన్యము, కూటస్థము అగు బ్రహ్మమును దెలిసికొనినవాఁడు బుద్ధిమంతుఁడు, యోగి, నిఖిలకర్మలనాచరించినవాఁడని, స్తుతికి పాత్రుఁడని "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అను శ్లోకమున కాశయము. ఈ శ్లోకమును వృత్తికారు లన్యథా వ్యాఖ్యానించిరి. అది యెట్లనిన—

—♦ వృత్తికారమతము ♦—

శబ్దముచే నర్థమును గ్రహింపవలయుననిన వృత్తియనుసాధనపురస్సరముగనే దెలిసికొనవలయును. అట్టివృత్తి శక్తియని, లక్షణ యని రెండువిధములు. అందు లక్షణావృత్తి ముఖ్యమనియు, గౌణమనియు రెండువిధములు. "గంగాయాం ఘోషః" అనుచోట గంగాపదము శక్తియను సాధనముచే ప్రవాహమ్మును బోధించును. అట్టిప్రవాహమునకు తీరమునకు

బ్రహ్మవివర్తముగ జగత్తు యున్నదని తెలిసికొనవలయు నని వ్యతిహారముఖమున జెప్పిన దర్శనముచే జగత్తు బ్రహ్మస్వరూపమగుటయందు సందేహనివృత్తికొఱకు "అకర్మణి చ కర్మ యః" అను వాక్యముచే దృఢపరచుచుండెను. "అకర్మణి" చెప్పబడినలక్షణముకల బ్రహ్మమునందు జగత్తును "యః పశ్యేత్" జగత్తు బ్రహ్మవివర్తము కాన స్వతః సత్తలేమింజేసి రజతమును శుక్తివలె, ఉదకమును మరుప్రదేశమువలె నిఖిలజగత్తు బ్రహ్మమేయని ఎవఁడు తెలిసికొనునో యని యర్థము. "సర్వం తం పరాదాద్యోఽన్యత్రాత్మన స్సర్వం వేద" బ్రహ్మముకంటె వేఱుగసత్త కలదానినిగ నామరూపాది జగత్తును తెలిసికొనువాఁడు అనర్థమును పొందు) నని శ్రుతి చెప్పుచున్నది. కాన, నామరూపాదిద్వైతదర్శనమును విడచి సాక్షాత్ సర్వభ్రాంతిరహితమగునటుల నామము, రూపము, గుణము, కర్మఅను సర్వప్రపంచము బ్రహ్మస్వరూపమే యని తెలిసికొనవలయును.

ఇట్లు సందిగ్ధము, విపర్యస్తము కానటుల సర్వమును ప్రత్యగ్దృష్టిచే బ్రహ్మరూపయని యెవఁడు దెలిసికొనునో వాఁడే బ్రహ్మవేత్త; వాఁడే బ్రహ్మనిష్ఠుఁడు; వాఁడే "కృత్స్నకర్మకృత్=కృత్స్నాని సర్వా ణ్యనేకకల్పార్జితాని సంచితా న్యాధునికజన్మకృతా న్యప్రవృత్తఫలాని కర్మాణి నానాయోనిప్రాపకాణి స్వయాథాత్మ్యవిజ్ఞానఖడ్గేన

శాంకరభాష్యమ్.—

ణ్యకర్మ యః పశ్యే త్ఫలాభావా ద్యథా ధేనురపి గౌరగౌ రుచ్యతే క్షీరాఖ్యం ఫలం న ప్రయచ్ఛతీతి తద్వత్ । తథా నిత్యాకరణే త్వకర్మణి కర్మ యః పశ్యే న్నరకాదిప్రత్యవాయఫలం ప్రయచ్ఛతీతి ।

శాంకరభాష్యతత్త్వబోధిని.—

సాక్షాత్సంబంధము సంయోగము. అట్టిప్రవాహసంబంధమగు సంయోగముచే తీరబోధ కలుగును కాన నాసంయోగరూపసాక్షాత్సంబంధము ముఖ్యలక్షణయని పేర్కొనబడును. గోవు క్షీరములనెడి ఫలము నివ్వజాలనినాడు 'ఇయం గౌ రగౌః' అని యొకడు పలికెను. దాని వలన నెట్టిజ్ఞానముకలుగును ? క్షీరమనెడిఫలము నివ్వనేరని వృషభమువలె నీగోవుకూడ క్షీర ఫలము నివ్వనందున గోవుకాదు, మఱేమనిన వృషభమేయగును. అనగా క్షీరఫలము నివ్వ జాలనందున వృషభసాదృశ్యముకలదు. కాన సాదృశ్యవిశిష్టమునందు సాదృశ్యమనెడి సంబంధ ద్వారమున నర్థబోధకలిగించు లక్షణ గౌణీలక్షణయనఁబడును. కాన గౌణీవృత్తిచే గోవు గోవుకాదు అనినట్లు ఈశ్వరార్థమనుష్ఠింపఁబడు నిత్యకర్మములు ఫలము లేమింజేసి యకర్మము లనఁబడును. అట్టి నిత్యకర్మముల యకరణము ప్రత్యవాయఫలముకలదగుటచే గౌణీవృత్తిచే కర్మమనఁబడును. ధేనువు క్షీరమనెడిఫలము నివ్వజాలనితరి యధేనువనఁబడినటుల యీశ్వ రార్థ మనుష్ఠింపఁబడు నిత్యకర్మములు ఫలము లేమింజేసి యకర్మములనియు, అట్టి నిత్యకర్మ ముల యకరణము ప్రత్యవాయఫలము కలదగుట కర్మమని యెవఁడు దెలిసికొనునో వాఁడు బుద్ధిమంతుఁడు, యోగి, నిఖిలకర్మకృత్ అని వృత్తికారు లీశ్లోకమును వ్యాఖ్యానించిరి.

కృంతతి ఛినత్తీతి కృత్స్నకర్మకృత్" నానాయోనిప్రాపకములగు సంచితములైన అనేక కల్పార్జితములు, అప్ర వృత్తఫలములునగు యీజన్మార్జితములగు నానాకర్మలను తన యాథాత్మ్యజ్ఞానఖడ్గముచే ఛేదించెడివాఁడగుచున్నాఁడు. "సర్వం పాప్మానం తరతి" (ఎవఁ డాత్మజ్ఞానియో వాఁడు నిఖిలపాపములను తరించువాఁ డగుచున్నాఁడు). అను శ్రుతిప్రామాణ్యమువలన నెవఁ డిట్టి ఆత్మయాథాత్మ్యముకలవాఁడో వాఁడ శుభమగు సంసారమునుండి ముక్తుఁ డగు చున్నాఁడని యర్థము.

నీలకంఠీయము:— ఏకర్మాకర్మల తత్త్వమును చెప్పెదనని ప్రతిజ్ఞచేసెనో, అట్టితత్త్వమును "కర్మ ణ్యకర్మ" అనుశ్లోకముచే చెప్పుచుండెను. "కర్మణి" కర్మాకర్మవికర్మస్వరూపమగు దేహేంద్రియాదివ్యాపా రము ప్రత్యగాత్మయం దవిద్యచే నారోపితమైయుండ అట్టికర్మను "అకర్మ" కర్మాభావమునుగ— నావయం దున్న పురుషుఁడు తీరమునందుండు వృక్షమునందు చలనము నారోపించియుండ తత్త్వబుద్ధిచే నాచలనమును చల నాభావమునువలె నెవఁడు తెలిసికొనునో, అట్లే త్రిగుణాత్మకములగు దేహేంద్రియాదులు నిత్యకర్మలు కలవై యుండ నెవఁడు చంద్రతారకాదులయందు గత్యభావమునువలె నేను తూష్ణీంభావుఁడనైతిని, దేనిని చేయుట లేదని యధ్యసించుచుండెనో (భ్రమను పొందుచుండెనో) అట్టి తూష్ణీంభావమే యకర్మ. అట్టి యకర్మను కర్మ నిగ్రహమనెడి ప్రయత్నరూపముగ నెవఁడు తెలిసికొనునో అట్టివాఁడు మనుష్యులలో తత్త్వదర్శి. ఇట్టిజ్ఞానముచే నాత్మయందు భ్రాంతిజనితవ్యాపారము, ఆనాత్మయందు తూష్ణీమాసనరూపనిర్వ్యాపారత్వమే బాధితమగుటవలన

శాంకరభాష్యమ్॰—

(9) నైతద్యుక్తం వ్యాఖ్యాన మేవం జ్ఞానా దశుభా న్మోక్షణానుపపత్తేః "యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభా" (గీ-4-16) దితి భగవతోక్తం వచనం బాధ్యేత। కథం నిత్యానా మను

శాంకరభాష్యతత్త్వబోధిని॰—

—♦ భగవద్భాష్యకారసిద్ధాంతము ♦—

(9) ఈశ్వరార్థమనుష్ఠీయమానము లగు నిత్యకర్మములు ఫలము లేమింజేసి యకర్మములే. మఱియు అట్టి నిత్యకర్మముల యకరణరూపాకర్మము ప్రత్యవాయఫలజనకమగుటచేసి కర్మమేయనుజ్ఞానమువలన నశుభరూపసంసారముయొక్క మోక్షణము సంభవింపనందున "యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్" అను భగవద్వచనము బాధింపఁబడును. కాన నిట్టివృత్తికారవ్యాఖ్యానము యుక్తముకాదు. 'ధర్మేణ పాప మపనుదతి' (ధర్మముచే పాపమును నశింపజేయును). అనుశ్రుతివలన నిత్యకర్మానుష్ఠానమువలన పాపక్షయరూపఫలము సంభవించినను ఫలాంతరము నిత్యకర్మలకు లేదని తెలిసికొని నిత్యకర్మల నాచరించినచో నశుభక్షయమొందులకు కాదని శంకింపజనదు. "క్షేత్రజ్ఞ స్యేశ్వరజ్ఞానా ద్విశుద్ధిః పరమా మతా" (క్షేత్రజ్ఞనకీశ్వరజ్ఞానమువలన నుత్కృష్టమగు విశుద్ధి (సంసారమోక్షణము) కలుగును. అను స్మృత్యుక్తరీతిని యాత్యంతికసంసారోపరమమునుకూర్చి యీశ్వరజ్ఞానము కారణము. కాని నిత్యకర్మానుష్ఠానము కారణముకాదు. అయినను నిత్యకర్మానుష్ఠానముకూడ నాత్యంతికసంసారమోక్షణమునకు కారణమని యంగీకరించినను నిత్యకర్మానుష్ఠానమువలన నశుభరూప సంసారముయొక్క

విట్టిజ్ఞానియే యోగియనియు, కర్మయోగఫలమగు తత్త్వజ్ఞానము ప్రాప్తించుటవలన కృత్స్నకర్మకృత్ అనియు స్తుతిమాత్రము. ఆత్మకు కర్తృత్వమును, కార్యకరణసంఘాతమునకు కర్తృత్వమును తలచువాడు కర్మల నాచరించవలయును. అని యర్థము. ఈవిషయము "అవ్యక్తోఽయం" అను శ్లోకవ్యాఖ్యానావసరమునందనేకవిధముల విస్తారముగ వ్రాయబడెను. అయినను తత్త్వము దుర్బోధమగుటవలన మాటిమాటి శాస్త్రతత్త్వము సుబోధమగుటకై చెప్పబడుచుండెనని ప్రాచీనుల యాశయము.

మఱికొందఱు— నిత్యకర్మను పరమేశ్వరార్థ మనుష్ఠించుచుండ యట్టి నిత్యకర్మ బంధహేతువు కానందున "ఇట్టి నిత్యకర్మ మకర్మ" మనియు, అట్లే నిత్యకర్మాకరణము ప్రత్యవాయహేతువగుటచే "నిత్యకర్మాకరణము కర్మయే" యనియు నెవఁడు తెలిసికొనునో వాడు బుద్ధిమంతుడని చెప్పుచుండిరి. నిత్యకర్మ అకర్మ అను జ్ఞానము మిథ్యాజ్ఞానము కాన నదియే యశుభరూపమగుటవలన నట్టిజ్ఞానమునకు శుభరూపమోక్షహేతుత్వము లేమింజేసి పైవ్యాఖ్యానమసంగతమని తెలియనగును. ఇట్టి మిథ్యాజ్ఞానము బోద్ధవ్యమగు తత్త్వముకాదు. ఇట్టి జ్ఞానముకలవానికి బుద్ధిమత్త్వాదిస్తుతి యుపపన్నము కాదు.

మరికొందఱు— "కర్మణి" జ్ఞాతార్థకర్మభూత (దృశ్య)మగు జడమును "అకర్మ" సద్రూపముచే యనువ్యాతము, సర్వభ్రమాధిష్ఠానము, నిష్క్రియము, అవేద్యము అగు స్వప్రకాశచైతన్యరూపమునుగ నెవఁడు దెలిసికొనునో అట్లే "అకర్మణి" స్వప్రకాశమగు దృగ్వస్తువునందు "కర్మ" దృశ్యమును కల్పితమును

శాంకరభాష్యమ్.—

ష్ఠానా దశుభా త్స్యన్నామ మోక్షణం, న తు తేషాం ఫలాభావజ్ఞానాత్ । నహి నిత్యానాం ఫలాభావజ్ఞాన మశుభముక్తిఫలత్వేన చోదితం, నిత్యకర్మవిజ్ఞానం వా న భగవతైవేహోక్తం।

(౧0) ఏతే నాకర్మణి కర్మదర్శనం ప్రత్యుక్తం। న హ్యకర్మణి కర్మేతి దర్శనం కర్తవ్యత యేహ చోద్యతే, నిత్యస్య తు కర్తవ్యతామాత్రం। నచాకరణా న్నిత్యస్య ప్రత్యవాయో భవ

శాంకరభాష్యతత్త్వబోధిని.—

మోక్షణము ప్రాప్తించుగాక. కాని నిత్యకర్మలకు ఫలము లేదనుజ్ఞానమువలన నశుభమోక్షణముమాత్రము ప్రాప్తింపదు. నిత్యకర్మానుష్ఠానమువలన నశుభక్షయము ప్రాప్తించినను యీ ప్రకరణమునందు జ్ఞానమువలన నశుభక్షయము "యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్" అను దానిచే ప్రతిజ్ఞాతము కాన నట్టి జ్ఞానము నిత్యకర్మలకు ఫలములేదు కాన నవి యకర్మలను జ్ఞానము సంసారరూపాశుభమోక్షఫలకముగ శ్రుతియందు దెచ్చుటను విధింపఁబడలేదు. మఱియు యతీంద్రియార్థము శాస్త్రమువలన దెలియనగును కాన నట్టి శాస్త్రము యెచటను నిత్యకర్మ విజ్ఞానమునకు మోక్షఫలమును చెప్పుటలేదు. ఈ విషయమున భగవద్వచనమే ప్రమాణ మనెదవా ? అట్టితీరున శ్రీకృష్ణపరమాత్మ యెచటను యీగీతలయందు చెప్పియుండలేదు.

(10) అశుభమోక్షణాసంభవప్రదర్శనముచే కర్మమునం దకర్మదర్శనము నిరాకరింపబడెను. ఈ న్యాయముచేతనే యకర్మమునందు కర్మదర్శనము కూడ నిరాకరింపబడెను. "నామ బ్రహ్మే త్యుపాసీత, మనో బ్రహ్మే త్యుపాసీత" (నామమునందు బ్రహ్మదృష్టినుంచి యుపాసింపవలెను, మనస్సునందు బ్రహ్మదృష్టినుంచి యుపాసింపవలెనని) నామాదులయందు బ్రహ్మదృష్టిని విధించినటుల ఫలార్థమై యకర్మమునందు కర్మదృష్టిని విధించుటచే నశుభరూపసంసారమునుండి మోక్షణరూపమగు ఫలము ప్రాప్తించునని శంకింపఁజనదు. ఈ శ్లోకమునందు పరమతమున నిత్యకర్మలకు కర్తవ్యతామాత్రమే వివక్షితము. కాన నశుభమోక్షణరూపఫలము కొఱకకర్మమునందు కర్మదర్శనము విధింపఁబడుటలేదు. కాన పూర్వోక్తాశంకకిందవకాశము లేదు. ఇచట యట్టివిధి లేకున్నను యట్టివిధిని కల్పించెదమనెదవా ? నిత్యకర్మలకిచట కర్తవ్యతామాత్రము చెప్పబడుటవలన నట్టికల్పనయు అనగా నకర్మమునందు కర్మదృష్టి విధింపబడుచుండెనను కల్పనయు పరుని (వాది) యొక్క సిద్ధాంతమునకు విరుద్ధము.

గను, మాయామయమునుగను, పరమార్థసద్రూపభిన్నమునుగను యెవడు దెలిసికొనునో వాడు పరమార్థమును దెలిసికొనినవాడగుటవలన బుద్ధిమంతుడు. అని వాస్తవికగుణముచేతనే యట్టివాడు స్తుతింపఁబడుచుండెను. అనియునీశ్లోకమును వ్యాఖ్యానించిరి. "కర్మకురు" "కర్మప్రవక్ష్యామి" అని యనుష్ఠేయకర్మప్రస్తావమునందు తత్త్వజ్ఞాన మనవసరముగానట్టి వ్యాఖ్యానముకూడ నసంగతమే యగును. "కర్తురీప్సితతమం కర్మ" అనునది పారిభాషికము. అట్టిపారిభాషిక మూగమార్గనిర్ణయానర్హమగుటవలన నట్టిపారిభాషికముచే కర్మశబ్దమునకు దృశ్యమర్థమని గ్రహించుటయు సంభవింపదు.

శాంకరభాష్యమ్:—

తీతి విజ్ఞానా త్కించి త్ఫలం స్యాత్ । నాపి నిత్యాకరణం జ్ఞేయత్వేన చోదితం। నాపి కర్మాకర్మేతి మిథ్యాదర్శనా దశుభా న్మోక్షణం, బుద్ధిమత్త్వం, యుక్తతా, కృత్స్నకర్మకృత్త్వాదిచ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వాది మతమున నీ శ్లోకమునందు నిత్యకర్మలకు కర్తవ్యత్వము గూడ నవివక్షితమే. మరే మనిన? నిత్యకర్మానుష్ఠానమునందు ప్రవృత్తి గలుగుట కిచట 'నిత్యకర్మల నాచరింపనిచో ప్రత్యవాయము సంభవించును' అనెడి జ్ఞానము కర్తవ్యముగ మాత్రమే వివక్షిత మనెదవా? ఇచట వాదిని ప్రశ్నింపవలసియున్నది. "నిత్యకర్మలు విహితములుగాన నిత్యకర్మలయందు ప్రవృత్తి కలుగునా? లేక నిత్యకర్మల నాచరింపనిచో ప్రత్యవాయము (పాపము) ప్రాప్తించు నను జ్ఞానమువలన నిత్యకర్మలయందు ప్రవృత్తి కలుగునా? నిత్యకర్మల నాచరింపనిచో ప్రత్యవాయము కలుగునను జ్ఞానమువలననే నిత్యకర్మలయందు ప్రవృత్తి కలుగుననెదవా? అట్లైన "అహ రహ స్సంధ్యా ముపాసీత" అనెడి నిత్యకర్మవిధానమున కానర్థక్యము ప్రాప్తించును. ఇట్టి శ్రుతికి వైయర్థ్యము నంగీకరించుట న్యాయము కాదు. అట్లైన వేదమునకే యప్రామాణ్యము ప్రాప్తించెడిని. కాన 'అహ రహ స్సంధ్యా ముపాసీత' యనెడి విధులవలననే నిత్యకర్మల యందు ప్రవృత్తి గలుగుచుండ నిత్యకర్మముల నాచరింపనిచో ప్రత్యవాయము ప్రాప్తించు ననెడి జ్ఞానమునకు నిత్యకర్మలయందు ప్రవృత్తియే ఫలమని జెప్పుట నీలుపడదు. ఇట్టి జ్ఞానమునకు ఫలాంతరముగూడ గాన్పింపనందున 'నిత్యకర్మల నాచరింపనిచో ప్రత్యవాయము ప్రాప్తించు' ననెడి జ్ఞానము నిష్ఫలమే యగును.

మఱియు నిత్యకర్మాకరణమునందు కర్మదృష్టి విధింపబడినచో నిత్యాకరణ మాలంబన మగును ఏది యాలంబనమో యది ప్రధాన మగుటచే దానికే జ్ఞేయత్వము జెప్పవలయును.

---

యథార్థమును విచారించుచో 'కర్మణ్యకర్మ' అను శ్లోకమున కర్థ మిట్లు దెలిసికొననగును. 'కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యం చ వికర్మణః। అకర్మణశ్చ బోద్ధవ్యం' అను శ్లోకమునందు కర్మాకర్మవికర్మలయొక్క పర్యవసానము గహన మగుటవలన బోద్ధవ్యము (తెలిసికొనదగినది) అని జెప్పఁబడెను. ఆశ్లోకమునకే "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్. సబుద్ధిమా న్మనుష్యేషు" అనుశ్లోకము వ్యాఖ్యానము. అదియెట్లనిన? "కర్మణి" అనుపదముచే కర్మాకర్మవికర్మలు గ్రహింపనగును వాటియందు శాస్త్రమువలన తద్వ్యపరీత్యముచూడబడును. ఎట్లనిన? శ్రద్ధారహితునిచే నాచరింపఁబడిన క్రతువు శ్రద్ధారహితుఁడగు వతనికి యకృతమైనదియగును. కాన నట్టిక్రతు వక్రతువే యని శాస్త్రమువలన ననిపించుకొనును. దాంభికునిచే క్రతువాచరింపబడినచో నట్టి క్రతువు దాంభికునకు వికర్మ యని యనిపించుకొనును. ఈ విషయమే శ్రీకృష్ణపరమాత్మచే "అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్ । అస దిత్యుచ్యతే పార్థ" (అశ్రద్ధచే హుతము, దత్తము, తపింపబడిన తపస్సు ఇట్టి కృతము అన్నియు యసత్తులే యని) జెప్పఁబడెను. మఱియు మరియొకస్థలమునందు "చత్వారి కర్మా ణ్యభయంకరాణి భయం ప్రయచ్ఛ న్త్యయథాకృతాని । మానాగ్నిహోత్ర ముతమానమౌనం మానేనాధీత ముతమానయజ్ఞః" (మానాగ్నిహోత్రము, మానమౌనము, మానముచే నధీతము, మానయజ్ఞము అను నీనాల్గుకర్మలు శాస్త్రము చెప్పినవిధమున

శాంకరభాష్యమ్ :—

ఫల ముపపద్యతే స్తుతి ర్వా। మిథ్యాజ్ఞాన మేవ హి సాక్షా దశుభరూపం కృతోఽన్యస్మా దశుభా న్మోక్షణం, న హి తమ స్తమసో నివర్తకం భవతి।

శాంకరభాష్యతత్త్వబోధిని :—

నిత్యకర్మాకరణ మభావరూప మగుటవలన నది తుచ్ఛమగుటచే నద్దానికి జ్ఞేయత్వము సంభవింపదు. కాన నిత్యకర్మాకరణము జ్ఞేయ మనియు విధి సంభవము కాదు.

నిత్యకర్మాకరణ మభావరూపమగుటచే నసత్తనఁబడును. అట్టి యసత్తు నాలంబనముగఁ జేసికొనినామాదులయందు బ్రహ్మదృష్టివలె జ్ఞానము సంభవింపకున్నను 'ఇది రజతము' అను జ్ఞానమువలె 'అకర్మ కర్మ' అను జ్ఞానము సంభవించుననెదవా ? 'కర్మ అకర్మ' అనెడి జ్ఞానము కాని 'అకర్మ కర్మ' అనెడి జ్ఞానము కాని మిథ్యాజ్ఞాన మగును. అట్టి జ్ఞానమాత్రమువలన నశుభమోక్షణము ప్రాప్తింపనేరదు. మరియు అట్టి జ్ఞానికి బుద్ధిమత్త్వము, యుక్తత్వము, నిఖిలకర్మకృత్త్వము అనెడి ఫలముకాని, స్తుతికాని ప్రాప్తింపనేరదు.

స్వప్నమునందు గలిగెడి మిథ్యాజ్ఞానమునకు లోకమున ఫల మనుభవసిద్ధమే. అట్లే 'కర్మ అకర్మ' అనెడి జ్ఞానము మిథ్యాజ్ఞాన మైనను యిట్టి జ్ఞానమునకు ఫలము ప్రాప్తింపవచ్చునని శంకింపఁజనదు. అట్టిమిథ్యాజ్ఞానము సాక్షాత్తు అశుభరూపము. అట్టి యశుభరూప మగు మిథ్యాజ్ఞానమువలన నశుభరూపసంసారమోక్షణ మెటులు ప్రాప్తించును ? (ప్రాప్తింపదనియే భావము.)

అశుభరూపమిథ్యాజ్ఞానమువలన యశుభనివృత్తి యేల కాదనెదవా ? తమస్సు తమోనివర్తకము కానటుల యశుభమువలన యశుభము నివర్తింపనేరదు.

---

నాచరించినచో నభయము నొసఁగును. అట్లు కానిచో భయమునే యొసఁగును). అని చెప్పబడెను. అట్లే యాత్రయార్తపరిత్రాణమునందు శక్తుఁడైనవాఁడార్తపరిత్రాణమొనరింపక యుదాసీనుఁడైనచో నట్టివాని యా యౌదాసీన్యరూపమగు నకర్మయు ఆర్తత్రాణము లేమిఁజేసి వికర్మ (నిషిద్ధకర్మ)యని యనిపించుకొనును. అగ్న్యాధాన మొనరించిన దీక్షితులుకాని, భగవద్ధ్యానాసక్తుఁడుకాని సకాలమునందు (వైశ్వదేవానుష్ఠానకాలమునందు) పంచయజ్ఞము లాచరింపనిచో నట్టి పంచయజ్ఞాకరణము "దీక్షితో న దదాతి" "సర్వధర్మా న్పరిత్యజ్య" అను వచనములవలన నిత్యకర్మకాలమున ప్రత్యవాయహేతువు, అవిహితము నగునన్యము నాచరించినందున కర్మయే యనిపించుకొనును. అట్లే హింస వికర్మ (నిషిద్ధకర్మ)యైనను "అగ్నీషోమీయం పశు మాలభేత" అను వాక్యమువలన యజ్ఞమునందు శాస్త్రవిహితమగు కర్మయేయని యనిపించుకొనును. పశువు వృథానష్టమైనచో అహింసయే విధ్యర్థానిష్పత్తివలన కర్మయని యనిపించుకొనదు. కామకారముచే చేసినది కానందున వికర్మయనియు ననిపించుకొనదు. మఱేమనిపించుకొనును ? పరిశేషమువలన కృతమైనను యకృతమే కాన నకర్మయని యనుపించుకొనును. కొందరుదొంగలలో నొకదొంగవానిని రాజు శిక్షింపక విడిచినచో రాజుయొక్క యట్టికర్మయు "స్తేనః ప్రముక్తో రాజని పాపం మార్ష్టి" (రాజు దొంగవానిని శిక్షింపక విడిచినచో రాజునందు పాప మావహించును).

శాంకరభాష్యమ్.—

(11) నను కర్మణి యదకర్మదర్శన మకర్మణి వా కర్మదర్శనం న తన్మిథ్యాజ్ఞానం కిం? తర్హి గౌణం ఫలభావాభావనిమిత్తమ్। న కర్మాకర్మవిజ్ఞానాదపి గౌణాత్ఫలస్యాశ్రవణాత్।

శాంకరభాష్యతత్త్వబోధిని.—

(11) "ఇదం రజతం" (ఇది రజతము) అనెడిజ్ఞానము సదసత్తులకు సామానాధికరణ్య మవగహించుటచే తద్వ్యవివేకపూర్వక మగుటంజేసి మిథ్యాజ్ఞాన మగును. 'సింహో మాణవకః' (మాణవకుడుసింహము) అనుజ్ఞానము మాణవకావివేకపూర్వకము గాదు. మరియు సదసత్తుల సామానాధికరణ్య మవగహించునదియు కాదు. కాన నీజ్ఞానము గౌణప్రత్యయ మనబడును. ఇట్టి ప్రత్యయమునకు ఫలము శౌర్యధైర్యములు కలవాడు మాణవకు డని తెలియుటయే. అట్లే కర్మమునం దేయకర్మదర్శనము, అకర్మమునం దేకర్మదర్శనము, కలవో యా

అనువాక్యమువలన నిషిద్ధకర్మయే (వికర్మయే) యని యనుపించుకొనును. యతీశ్వరుడు దొంగను శిక్షింపక నుపేక్షించినచో వాయతియొక్క యాకర్మ యకర్మ యనుపించుకొనును. అట్లే ఒకానొకడు మరియొకనిభార్య వ్యభిచరించుచుండ వద్దానినిచూచి యజమానునితో నీభార్య వ్యభిచరించుచుండెనని చెప్పిన నది సత్యమైనను యజమాని తనభార్యను హింసించుటవలన నాసత్యము హింసాఫలకమగుటంజేసి వికర్మయని యనిపించుకొనును. నిరక్షరకుక్షి కాని, కొంచెము చదివినవాడుకాని రాజసభకు రాగా వానిని పరికించి యాస్థానవిద్వాంసుడు వీడు గొప్పవిద్వాంసుడని ప్రభువుతో పలికిన మాటలు కన్నృతమైనను యావిద్వాంసునివాక్యమువలన యానిరక్షరకుక్షికి గొప్పదానమొసరించుటవలన నాయనృతము శాస్త్రవిహితకర్మయేయగును. కాన 'కర్మణి' అనుపదముచే చెప్పబడు కర్మాకర్మవికర్మలయందు 'అకర్మ' పూర్వోక్తవిధమున తద్వైపరీత్యమును యెవడు తెలిసికొనునో అట్టి కార్యాకార్యవిభాగజ్ఞుడు బోద్ధవ్యములను తెలిసికొనుటచే 'బుద్ధిమాన్' బుద్ధిమంతుడని చెప్పబడుచున్నాడు.

అట్లే 'కింకర్మ' అనుశ్లోకమునందు దేనియందు కవులకుకూడా (క్రాంతదర్శులకుకూడ) మోహముకలదో ఏ కర్మాకర్మలజ్ఞానము అశుభమోక్షహేతువో అట్టికర్మాకర్మలను చెప్పెదనని ప్రతిజ్ఞ చేయబడెనో దానికి 'అకర్మణి చ కర్మ యః పశ్యే త్సయుక్తః' అనునది వ్యాఖ్యానము. ఇట చకారము జ్ఞానద్వయరూపసముచ్చయమును బోధించును ఈచెప్పుటవలన నెవడుబుద్ధిమంతుడు, యుక్తుడు అగునో వాడు నిఖిలకర్మకృత్తగును. కాని కేవల బుద్ధిమంతుడు కాని, కేవలయుక్తుడు కాని నిఖిలకర్మకృత్తు కాడని తెలిసికొననగును. అది ఎట్లనిన? 'అకర్మణి' క్రియాశూన్యము, కూటస్థము అగు వస్తువునందు 'కర్మ' స్పందతోగూడిన బాహ్యమగు గగనాదులను, అభ్యంతరమగు ప్రమాతాదికమును ఆధారాధేయభావముచేగాని, ఉపాదానోపాదేయభావముచేగాని, అధిష్ఠానాధ్యస్తభావముచేగాని చూచుచునట్టి శాస్త్రవేత్తలు కర్మల నాచరించెదరు అందు ఆధారాధేయభావముచే జూచువాడు సాంఖ్యుడు. అసంగుడనగు నాయందు (ఆత్మయందు) కార్యకరణసంఘాతధర్మమగు కర్త్రాదికము అవివేకమువలన స్ఫటికమునందు లౌహిత్యమువలె భాసించుచున్నదని సాంఖ్యుడు తలచును. రెండవవాడు కనకకుండలమువలె బ్రహ్మవలన జనించునట్టి యీసర్వము బ్రహ్మస్వరూపమేయని కర్మయు, తత్సాధనములు, నేను బ్రహ్మస్వరూపమే యని తలచుచు కర్మల నాచరించును. వీరిరువురు యుక్తులైనను అతిబుద్ధిమంతుడగు నయుక్తుడుకూడ కర్మల నాచరించును. అట్టియయుక్తునిచే నాచరింపబడినదంతయు యసద్రూపమే యగును కాని యశుభమోక్షణముకొఱకు కానేరదు. ఈవిషయమునే "యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మిం ల్లోకే యజతి, దదాతి. తపస్తప్యతేఽపి

శాంకరభాష్యమ్.—

నాపి శ్రుతహాన్యశ్రుతపరికల్పనయా కశ్చిద్విశేషో లభ్యతే। స్వశబ్దేనాపి శక్యం వక్తుం నిత్యకర్మణాం ఫలం నా స్త్యకరణాచ్చ తేషాం నరకపాత స్స్యాదితి। తత్ర వ్యాజేన పరవ్యామోహరూపేణ "కర్మ ణ్యకర్మ యః పశ్యే" దిత్యాదినా కిమ్?

శాంకరభాష్యతత్త్వబోధిని.—

రెండును మిథ్యాజ్ఞానములు కావు. మరేమనిన? గౌణప్రత్యయములు. ఈ ప్రత్యయములలో మొదటిది నిత్యకర్మలకు ఫలములేమింజేసి తన్నిమిత్తకమగు నకర్మదర్శనము. రెండవది నిత్యాకరణరూపమగు నకర్మము ప్రత్యవాయఫలనిమిత్తకమనెదవా? అదియు నసంగతమే. ఏలన గౌణమగు "కర్మ మకర్మము, అకర్మము కర్మము" అనెడి విజ్ఞానమువలన ఫలము శ్రూయమాణమగుటలేదు. కాన కర్మాకర్మవిజ్ఞానము గౌణప్రత్యయమన్నను ప్రయోజనములేదు.

"కర్మ మకర్మ" మను గౌణవిజ్ఞానోపన్యాసవ్యాజముచే నిత్యకర్మలు కర్తవ్యములుగ వివక్షితములగుటవలన గౌణజ్ఞానమునకు ఫలము లేదనునది దూషణముకానేరదని శంకింపఁ జనదు. అట్లయినచో శ్రుతహాన్యశ్రుతకల్పన సంభవించెడిని. అనగా శ్రుతమగు జ్ఞానమువలన నశుభమోక్షణరూపార్థమును పరిత్యజించుట, అశ్రుతార్థమును నిత్యకర్మానుష్ఠానమును కల్పించుట. అట్టికల్పనముచే విశేష మేమియు లేదు. నిత్యకర్మములకు ఫలము లేదు. అట్టి కర్మముల నాచరింపనిచో నరకపాతము తప్పదు. అనెడి స్వశబ్దములచేతనే చెప్పుటకు శక్యమైనదికదా. అట్లుచెప్పక పరవ్యామోహరూపమగు "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అనువ్యాజోక్తిచే జెప్పుట యెందులకు?

బహూని వర్షసహస్రాణ్యంతవ దేవాస్య తద్భవతి" అను శ్రుతియు బోధించుచున్నది. ఎవఁడు యుక్తుడైనను జ్ఞానవిహీనుఁడగుటవలన నకార్యమునుకూడ చేయునో అట్టివాడు పాపసంబంధము లేకుండగ జేయునట్టి యపరోక్షజ్ఞానముయొక్క లేమిఁజేసి ప్రత్యవాయము కలవాడగును. అవిద్యావిద్యాశబ్దములచే చెప్పఁబడు నీకర్మపరోక్షజ్ఞానములకు సముచ్చయమును, "విద్యాం చావిద్యాం చ' అను శ్రుతిబోధించుచున్నది.

లేక, కర్మయం దకర్మదర్శనము రెండువిధములు. ఒకటి పరోక్షరూపము; రెండవది యపరోక్షరూపము. ఆరెంటిలో పరోక్షజ్ఞానముకలవాడు జ్ఞానకర్మసముచ్చయము ననుష్ఠించువాడు బుద్ధిమంతుడు ననిపించుకొనును. అపరోక్షరూపము రెండువిధములు. ఒకటి యుపాస్యసాక్షాత్కారరూపము; రెండవది తత్త్వసాక్షాత్కారరూపము. అందు ఉపాస్యసాక్షాత్కారము. వ్యాకృతోపాస్యసాక్షాత్కార మనియు, అవ్యాకృతోపాస్య సాక్షాత్కారమనియు రెండువిధములు, వ్యాకృత మన కార్యమనియు, అవ్యాకృతమనగ కారణమనియు గ్రహింపనగును వ్యాకృత (సూత్ర కార్య) మగు నుపాస్యసాక్షాత్కారముకలవాడు దేహమునం దహంకారము లేనివాడగుటవలన యోగశాస్త్రమునందు 'విదేహుడు' అని చెప్పఁబడును. కారణ (అవ్యాకృత) మగు నుపాస్యసాక్షాత్కారము కలవాడు "ప్రకృతియందు లయముకలవాడు" అని చెప్పఁబడును. ఈవ్యాకృతావ్యాకృతోపాసనలు సంభవాసంభవసంజ్ఞలు కలవై వీటిసముచ్చయము "అన్య దేవాహు స్సంభవా దన్యదాహు రసంభవాత్। ఇతి శుశ్రుమ పూర్వేషాం యే న స్తద్వ్యాచచక్షిరే॥ సంభూతిం చ వినాశం చ

శాంకరభాష్యమ్:—

(12) తత్రైవం వ్యాచక్షాణేన భగవతోక్తం వాక్యం లోకవ్యామోహార్థ మితి వ్యక్తం కల్పితం స్యాత్ । న చైత చ్ఛద్మరూపేణ వాక్యేన రక్షణీయం వస్తు, నాపి శబ్దాన్త

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(12) ఈశ్లోకమునందు వృత్తికారులు చెప్పిన విధమున శ్రీకృష్ణపరమాత్మచే నీవాక్యము చెప్పబడినచో లోకవ్యామోహార్థ మిది కల్పింపబడిన దని సువ్యక్తమే. అట్లగుచో పరమాప్త యగు శ్రీ. కృష్ణపరమాత్మకు వంచకత్వ మాపాదిత మగునుకాన నీవృత్తికారవ్యాఖ్యాన ముపేక్షణీయము.

నిత్యకర్మానుష్ఠానసిద్ధ్యర్థము వ్యాజరూపమైనను భగవద్వచన ముచితమే యని శంకింప జనదు. "నిత్యకర్మ లాచరింపవలయు" ననుస్వశబ్దముచేతనే నిత్యకర్మానుష్ఠానము సిద్ధించుచుండ ఇట్టి వ్యాజరూపమగు వాక్యముచే రక్షింపదగినది కాదు. నిత్యకర్మానుష్ఠానరూపమగు వస్తువు- సుబోధత్వసిద్ధ్యర్థ మాత్మప్రతిపాదనము తిరిగి తిరిగి చేయబడునో, అట్లే నిత్యకర్మముల యనుష్ఠానము యోగ్యముగ దెలియబడుటకు "కర్మ ణ్యకర్మ" అని భగవంతుడు శబ్దాంతరముచే జెప్పుట న్యాయమే యని యనెదవా? "కర్మ ణ్యకర్మ" అను వాక్యమునకు నిత్యకర్మానుష్ఠానవాచకత్వము లేమింజేసి శబ్దాంతరముచే తిరిగి తిరిగి చెప్పబడినచో సుబోధ మగు ననియు జెప్పుటకు వీలుపడదు.

యస్తద్వేదోభయగ్ం సః । వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యాఽమృత మశ్నుతే" అను నీశావాస్యశ్రుతిచే చెపఁబడుచున్నది. ఇట్టి యవ్యాకృతోపాస్యసాక్షాత్కారముకలవాడు "యుక్తుడు" అని చెప్పఁబడును. ఇట్టి వానికికూడ ముందుకర్తవ్యము కలదు కాన నితడుకూడ కృత్స్నకర్మకృత్తు కాడు. మఱి యెవఁడు కృత్స్నకర్మకృత్తు? అనిన నెవనికి కర్మబాధపురస్సరముగ ముఖ్యమగు నకర్మదర్శనముకలదో యట్టివాడే కృతకృత్యుడగుటవలన ముఖ్యమగు కృత్స్నకర్మకృత్తగును. ఈముగ్గిరిలో మొదటివాడు దేహాభిమానముకల మనుష్యులలో బుద్ధిమంతుఁడు, క్రాంతదర్శికానందున కవి కాడు. (కవియనగ క్రాంతదర్శియని యర్థము). మిగిలిన యిరువురు అనగా వ్యాకృతోపాస్యసాక్షాత్కారముకలవాడు, అవ్యాకృతోపాస్యసాక్షాత్కారము కలవాడు క్రాంతదర్శులయినను తత్త్వవిషయమున మూఢులగుటఁజేసి కవులయినను ఆత్మతత్త్వమున మోహితు లనఁబడుదురు. వీరలకు వ్యవధానముగ (ఆలస్యముగ) సంసారమునుండి ముక్తికలుగును. ఉత్తముడు (తత్త్వసాక్షాత్కారవంతుఁడు) జీవించియుండగనే సంసారమునుండి ముక్తుఁడగును. అని 'కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అను శ్లోకమున కర్థమని నాకు దోచుచున్నది. "వ్యాఖ్యాతురపి మే నాస్తి భాష్యకారేణ తుల్యతా । గుహాకద్యోతినోఽప్యస్తి కిం దీపస్యార్కతుల్యతా" (వ్యాఖ్యాత నగు నాకు భాష్యకారులగు శ్రీమచ్ఛంకరభగవత్పాదులతో సామ్యము లేదు. గుహనుమాత్రము ప్రకాశింపఁజేయు దీపమునకు జగదవభాసకుండగు సూర్యునితో సామ్య మెన్నడైన సంభవించునా? సంభవింపదు.)

లేక కర్మాకర్మలను వక్తవ్యములుగను, బోద్ధవ్యములుగను ప్రతిజ్ఞ జేసినందున నీశ్లోకమునం దాకర్మాకర్మలక్షణములను ప్రదర్శించుట యుక్తమని వ్యాఖ్యానింపదగినది. కాన ఏది యకర్మవిశేషతమో యదియేకర్మ, ఇతరమైనది కాదని కర్మలక్షణము. అట్లే యేది కర్మవిశేషితమో యది యకర్మ. ఇతరమైనది కాదని యకర్మలక్ష

శాంకరభాష్యమ్:—

రేణ పునః పున రుచ్యమానం సుబోధం స్యా దిత్యేవం వక్తుం యుక్తం 'కర్మ ణ్యేవాధికార స్తే' (గీ_2_47) ఇత్యత్ర హి స్ఫుటతర ఉక్తోఽర్థో న పున ర్వక్తవ్యో భవతి। సర్వత్ర చ ప్రశస్తం బోద్ధవ్యం చ కర్తవ్య మేవ న నిష్ప్రయోజనం బోద్ధవ్య మిత్యుచ్యతే।

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

మఱియు "కర్మణ్యేవాధికారస్తే" అనుచోట స్పష్టముగ నీ నిత్యకర్మానుష్ఠానము చెప్పఁబడుటచే తిరిగి చెప్పదగిన విషయ మేదియు లేదు.

ఇంతవర కగు గ్రంథముచే కర్మాకర్మవిజ్ఞానవ్యాజమున నిత్యకర్మానుష్ఠానకర్తవ్యతయందు తాత్పర్య మను వృత్తికారమతము నిరాకృతము. "కర్మ మకర్మము" అను జ్ఞానము గౌణ మను పక్షము కూడ సంభవము కాదు. ఏలన ? లోకమునందు, వేదమునందు ప్రశస్తమగు దేవతాదితత్త్వము, అనుష్ఠానార్హమగు నగ్నిహోత్రాదికము, దెలిసికొనదగినది. నిష్ఫలమగు కాకదంతాదికము దెలిసికొనదగినది కాదు. కాన కర్మయందకర్మదర్శనము, అకర్మమునందు కర్మదర్శనము గౌణ మగుటచే ప్రశస్తము కాదు. కర్తవ్యము కాదు. కాన నీగౌణదర్శనము బోద్ధవ్య మని చెప్పుటకు తగదు.

ణము. అని వ్యాఖ్యానింపదగును. శ్లోకమునందలి యక్షరార్థమేమనిన ? "కర్మణి" సాధనములతోకూడిన యజ్ఞాదికమునందు "అకర్మ" క్రియాశూన్యము, కూటస్థము నగు బ్రహ్మస్వరూపమును "యః పశ్యేత్" ఎవడు చూచునో, అనగా కర్మయందు, కర్మాంగములయందు బ్రహ్మదృష్టి నధ్యసింపవలయుననుట. అదియెట్లనిన ? "అహం క్రతు రహం యజ్ఞః స్వధాఽహ మహ మౌషధం। మంత్రోఽహ మహ మేవాజ్య మహ మగ్ని రహం హుతమ్" క్రతువు, యజ్ఞము, స్వధాకారము, సోమరసము, మంత్రము, అజ్యము, అగ్నియు, హోమముచేయ బడు చరుపురోడాశాదికము నేనే) అని చెప్పినరీతిని యజ్ఞతదంగములయందు బ్రహ్మదృష్టి నధ్యసింపవలయును. అనగా యజ్ఞతదంగములు బ్రహ్మస్వరూపమే యని యుపాసన చేయవలెను. అట్లు కానిచో నేది చేయబడునో యది వృథాచేష్టారూపమే యగును. కనుకనే శ్రీకృష్ణపరమాత్మ "గహనా కర్మణో గతిః" కర్మయొక్క గతి గహనము. దుర్బోధము (దెలిసికొనుట శక్యము కానిది) అని చెప్పియుండెను

కర్మయం దధ్యసింపఁబడునట్టి యకర్మ యనునదియేది ? అని ప్రశ్నించెదవా ? (అవిద్యావస్థయందు) ఏ యాత్మయం దీపుణ్యపాపాత్మకమగు కర్మ చూడబడుచుండెనో "పుణ్యో వై పుణ్యేన కర్మణా భవతి పాపః పాపేన" (పుణ్యముకలవాడు పుణ్యకర్మచేతను, పాపముకలవాడు పాపకర్మచేతను పుట్టుచుండెను.) అని శ్రుతియు చెప్పుచుండెనో అట్టి పుణ్యపాపకర్మల ఫలమగు సుఖదుఃఖములుగూడ "నేను సుఖవంతుడను, నేను దుఃఖవంతుఁడను" అని దేనియం దనుభూయమానము లగుచున్నవో, అట్టి ప్రత్యక్చైతన్యుఁడగునాత్మయే "అకర్మ" అనుశబ్దార్థము. అట్టియాత్మయందే యీకర్మ స్పంద (చలన) రహితమగునట్టియు సర్పరూపము కానట్టి రజ్జువు (త్రాడు) నందు చలనక్రియగల సర్పమువలె నధ్యస్తమని యెవడు దెలిసికొనునో యని శ్లోకస్థమగు నక్షరముల యర్థము. దీనిభావమేమనిన ? ఎట్లు రజ్జువునం దధ్యస్తమగు సర్పమును చూచుచు "ఇది సర్పము కాదు మరేమనిన రజ్జువు" అని యుపదేశించినను విక్షేపశక్తిప్రాబల్యమువలన పురోవర్తివస్తువునందు రజ్జుత్వమును దెలిసికొనని మానవునికూర్చి "ఈసర్పమును రజ్జుదృష్టిచే నుపాసించుము" అని నియోగించిన నామానవుఁడట్లే రజ్జుదృష్టిచేనుపా

శాంకరభాష్యమ్:—

(13) నచ మిథ్యాజ్ఞానం బోద్ధవ్యం భవతి, తత్ప్రత్యుపస్థాపితం వా వస్త్వాభాసం। నాపి నిత్యానా మకరణా దభావా త్ప్రత్యవాయభావోత్పత్తిః 'నాసతో విద్యతే భావ' (గీ-2-16) ఇతి వచనాత్ 'కథ మసత స్సజ్జాయేతే' తి చ దర్శితమ్। అసత స్సజ్జన్మప్రతిషేధా దసత స్సదుత్పత్తిం బ్రువతాఽసదేవ సద్భవే త్సచ్చాస ద్భవే దిత్యుక్తం స్యాత్। తచ్చాయుక్తం సర్వప్రమాణవిరోధాత్।

(14) నచ నిష్ఫలం విదధ్యా త్కర్మశాస్త్రం దుఃఖస్వరూపత్వా ద్దుఃఖస్య చ బుద్ధిపూర్వకతయా కార్యత్వానుపపత్తేః। తదకరణే చ నరకపాతాభ్యుపగమేఽనర్థాయైవోభయథాపి కరణేఽ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(13) కర్త్రాదులు మాయామాత్రములు కాన తద్విషయకజ్ఞానము గౌణమైనను మిథ్యాజ్ఞానమే యగును. కాన నట్టి మిథ్యాజ్ఞానము దెలిసికొనదగినది కాదు. అట్టిజ్ఞానము తెలిసికొనదగినది కాకున్నను యాజ్ఞానవిషయము బోద్ధవ్య మగునని శంకింపజనదు, అట్టి జ్ఞానముచే సిద్ధించునది వస్త్వాభాసమే యగును. కాన నాభాసమునకు వస్తుత్వము లేమింజేసి నదియు బోద్ధవ్యము కానేరదు. నిత్యకర్మముల యకరణము ప్రత్యవాయహేతు వగుటంజేసి యకర్మ కర్మ మనబడును. గౌణీవృత్తిచే నని జెప్పుటయు సమంజసము కాదు. "నాసతో విద్యతే భావః" అను గీతావచనముచేతను, "కథ మసత స్సజ్జాయేత" అను ఛాందోగ్యమంత్రపాఠక శ్రుతిచేతను, యసత్తు వలన సత్తు పుట్టదని నిషేధించుటవలన నిత్యకర్మాకరణమనెడి యభావము వలన ప్రత్యవాయ మనెడి భావపదార్థము పుట్టనేరదు. అట్లు కాక యసత్తువల్ల సత్తు జనించునని చెప్పినచో నీవు యసత్తు సత్తగుననియు సత్తు యసత్తగుననియు చెప్పినవాడవగుదువు. నిరస్తసమస్తతత్త్వములుకలదానికి యత్కించిత్తత్త్వము నంగీకరించినచో, సర్వప్రమాణముల కప్రామాణ్యము ప్రాప్తించెడిని. (అదియెట్లనిన ? ప్రత్యక్షానుమానోపమానశబ్దార్థాపత్త్యనుపలబ్ధులను నవి ప్రమాణములు. ఇట్టి ప్రమాణములకుకూడ గోచరము కానట్టియు, నిరస్తసమస్తతత్త్వములు కల వంధ్యాపుత్ర, శశశృంగ, గగనారవిందములకు కూడ తత్త్వ మంగీకరించినపై ప్రమాణముల కచట ప్రవృత్తి లేమింజేసి ప్రమాణము లప్రమాణములు కావలసివచ్చును).

(14) నిత్యకర్మానుష్ఠానము దుఃఖరూపములగుటవల నట్టినిత్యకర్మములను నిష్ఫలముగ కర్మశాస్త్రము విధింపదు. నిత్యకర్మము దుఃఖరూపమైనను సాధ్యమగుటచే కార్యము. కాన నట్టి దానిని విధించు విధియు సంభవించుననెదవా ? అట్లగుచో దుఃఖరూపము నెవడును బుద్ధి

సించిన నట్టియుపాసనాదార్ఢ్యముచే సర్పమునుమరచి రజ్జుతత్త్వమునె దెలిసికొనునో, ఎవడు "ఇదిసర్పము కాదు రజ్జువు" అనువాక్యమువలననె రజ్జుతత్త్వముదెలిసికొనునో నట్టివానికిప్రత్యయావృత్తిరూపమగు నుపాసనతో పనిలేదు. అట్లే యకర్మశబ్దార్థమగు నాత్మయందధ్యస్తమగు కర్త్రాదికమును "తత్త్వమసి" అనువాక్యమువలన బాధింపఁజేసి యాత్మప్రతిపత్తి (జ్ఞానము) శుద్ధసత్త్వునకు కలుగును. మఱియొకనికి ('తత్త్వమసి' అనువాక్యము

శాంకరభాష్యమ్:—
కరణే చ శాస్త్రం నిష్ఫలం కల్పితం స్యాత్ । స్వాభ్యుపగమవిరోధ శ్చ నిత్యం నిష్ఫలం కర్మే త్యభ్యుపగమ్య మోక్షఫలాయేతి బ్రువతః । తస్మా ద్యథాశ్రుత ఏవార్థః 'కర్మ ణ్యకర్మ యః' ఇతిత్యాదేః । తథా చ వ్యాఖ్యాతో ఽస్మాభిః శ్లోకః । ॥౧౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—
పూర్వకముగ నాచరింపడు కాన నట్టి కర్మమునకు కార్యత్వము సంభవించునందున దానిని విధించు విధి వ్యర్థము.

నిత్యకర్మలకు స్వర్గాదిఫలములు లేకున్నను అట్టి కర్మముల నాచరింపనిచో నరకపాత మావశ్యకమగుటచే యట్టి నరకపాతము సంభవింపకుండుటకు నిత్యకర్మము లావశ్యకములు. కాన వాటిని విధించు విధివాక్యము వ్యర్థము కానేరదందువా ? అటులైన నిత్యకర్మము లాచరించుట వలన దుఃఖము ప్రాప్తించును. ఆచరింపనిచో నరకపాతము తప్పదు కాన నుభయథా అనగా నిత్యకర్మానుష్ఠానమునందును, నిత్యకర్మాననుష్ఠానమునందును యనర్థమే కల్పింపబడుటవలన శాస్త్రము నిష్ఫలమైన దని కల్పించిన ట్లగును. నిత్యకర్మలకు స్వర్గాదిఫలము లేకున్నను మోక్షఫలము సంభవించునుగాన నిత్యకర్మము లావశ్యకములు. ముముక్షువుచే నాచరణీయములు కాన వాటిని విధించుట సమంజసమే యనెదవా ? అట్లు నీవు చెప్పినయెడల నిత్యకర్మలకు ఫలము లేదని నీవు ప్రథమమున జెప్పి, యనంతరమున మోక్షము ఫల మని జెప్పినచో నీ మతమునకే విరోధము వాటిల్లును. (కాన నిత్యకర్మములకు ఫలము లేనందున నట్టి కర్మముల నకర్మములుగను, నిత్యకర్మాకరణము ప్రత్యవాయఫలక మగుటచే నాయకర్మము కర్మముగను నెవడు దెలిసి కొనునో వాడు బుద్ధిమంతుడు, యోగి, నిఖిలకర్మకృత్తు, అని వ్యాఖ్యానించిన వృత్తికార వ్యాఖ్యాన మెటుల చూచినను సరిపడనందున నది యుపేక్షణీయము. కాన నీ 'కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అను శ్లోకమునకు యథాశ్రుతార్థమునే గ్రహించుడు. ఈ శ్లోకమున కా యథా శ్రుతార్థ మేదనిన ? ఎట్టితీరున విరోధములు వాటిల్లవో యావిధమున వృత్తికారమతనిరాసకు పూర్వమునందే యీ శ్లోకము మాచే వ్యాఖ్యానింపబడెను. (దానిని చూడుడు!!) ॥౧౮॥

వలన నాత్మజ్ఞానము కలుగనివానికి) కర్త్రాదుల నకర్మ (బ్రహ్మ) దృష్టిచే నుపాసించువాని కుపాసనాదార్ఢ్యము వలన కర్త్రాదికము తిరోహితమై యకర్మ (బ్రహ్మ) తత్త్వజ్ఞానము సంభవించును. అనిభావము.

లేక, కర్మయం దకర్మదృష్టివలె నిషిద్ధకర్మసహితమగు విహితాకరణరూపమగు నకర్మయందుకూడ 'నకర్మ' (బ్రహ్మ)దృష్టిని చేయదగదని యాశంకించి "కర్మ ణ్యకర్మ" అని చెప్పెను. విహితాకరణమునందు, నిషిద్ధాచరణ మునందు కర్మదృష్టియే చేయవలెను. విహితాకరణరూపమగు నకర్మవలన భయపడెడివాడు శాస్త్రవిహితకర్మను బ్రహ్మదృష్టిచే చేయవలెను. అట్లే విహితాకరణము, నిషిద్ధకర్మయు బ్రహ్మదృష్టిచే చేయరాదు, అని అర్థము.

గీ॥ యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః॥ ॥౧౯॥

పదవిభాగము:— యస్య-సర్వే-సమారమ్భాః--కామసంకల్పవర్జితాః--జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం-తం-ఆహుః-పండితం-బుధాః। ॥౧౯॥

ప్రతిపదార్థము:— యస్య=ఎవనియొక్క; సర్వే=నిఖిలమైన; సమారమ్భాః=కర్మములు; కామసంకల్పవర్జితాః, కామ=కామముచేతను, సంకల్ప=కామమునకు కారణమగు సంకల్పముచేతను, వర్జితాః=విడిచిపెట్టబడినవై; భవంతి=(ఈ పద మధ్యాహార్యము) అగుచున్నవో; జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం, జ్ఞాన=కర్మమునం దకర్మాది దర్శనరూపమగు జ్ఞానమనెడి; అగ్ని=అగ్నిహోత్రముచే; దగ్ధ=తగులపెట్టఁబడిన; కర్మాణం=కర్మములు కల; తం=ఆ పురుషుని; పండితాః=బ్రహ్మవేత్తలు; పండితం=ఆత్మజ్ఞానినిగ; ఆహుః=చెప్పుచున్నారు. ॥౧౯॥

---

శాంకరభాష్యమ్:—

తదేతత్కర్మణ్యకర్మాదిదర్శనం స్తూయతే—యస్యేతి। యస్య యథోక్తదర్శినస్సర్వే యావన్తస్సమారమ్భాః కర్మాణి సమారభ్యన్త ఇతి సమారమ్భాః కామసంకల్పవర్జితాః కామైస్తత్కారణైశ్చ సంకల్పైర్వర్జితా ముధైవ చేష్టామాత్రా అనుష్ఠీయన్తే ప్రవృత్తేనచే ల్లోక

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

'యస్య సర్వే' అను శ్లోకముచే పూర్వమునందు చెప్పఁబడిన కర్మమునం దకర్మాది దర్శనము స్తుతించుచుండెను. కర్మమునం దకర్మాదిదర్శనముగల యే పురుషునియొక్క నిఖిల కర్మములు కోరికచేతను, అట్టి కోరికకు పూర్వాంగమగు సంకల్పముచేతను వర్జితములో-ఇట్లు కామసంకల్పవర్జితము లగుచో నతి డాకర్మల నెందుల కాచరించుననెదవా? వ్యర్థముగ చేష్టామాత్ర

---

(అనగా విహితమగు కర్మలను పరిత్యజించుట యబ్రహ్మస్వరూపమే, పరదారాభిమర్శన పరద్రవ్యాపహరణము బ్రహ్మమే, అనృతవదనము బ్రహ్మస్వరూపమే, కలంజభక్షణము బ్రహ్మస్వరూపమే, లశునపలాండు భక్షణము బ్రహ్మస్వరూపమే యని బ్రహ్మదృష్టిచే పరదారాభిమర్శన, పరద్రవ్యాపహరణ, అనృతవదన, అభక్ష్య భక్షణాదిక మాచరింపవలదు మరేమనిన? పరదారాభిమర్శనాదికము కర్మయే. ఇట్టి కర్మము నిషిద్ధమను దృష్టినాశ్రయించి పరదారాభిమర్శనాదికమును పరిత్యజింపుడు. ఇక శాస్త్రవిహితమగు కర్మము బ్రహ్మస్వరూపము, తదంగములు బ్రహ్మస్వరూపము, కర్త్రాదికము బ్రహ్మస్వరూపము అను బ్రహ్మదృష్టిచే నుపాసించుచు నట్టి కర్మల నాచరింపుడు. అట్టైన నుపాసనాదార్ఢ్యమువలన కర్త్రాదికము నివృత్తమై బ్రహ్మతత్త్వసాక్షాత్కారము కలిగి ముక్తు లగుదురు. ఇట్టివారే బుద్ధిమంతులు, యుక్తులు అగుదురు కనుకనే వారు నిఖిలకర్మల నాచరించిన వారగుదురని జ్ఞానిని స్తుతించెను. ॥౧౮॥

## —♦ ౪వ అధ్యాయము ౧౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— పూర్వమునందు జెప్పబడిన విధమున యెవడు పరమార్థదర్శియో అట్టివానికి కర్తృత్వాభిమానము లేమింజేసి కర్మలేపము (కర్మసంబంధము) సంభవింపదని "యస్య సర్వే" అను శ్లోకము మొదలుకొని 'బ్రహ్మార్పణం...బ్రహ్మకర్మసమాధినా' అను శ్లోకమువరకు విస్తారముగ జెప్పఁబడుచుండెను.

పూర్వమునందు జెప్పఁబడిన యేపరమార్థదర్శియొక్క లౌకిక వైదికకర్మలు ఫలతృష్ణారహితములు, నేను చేయుచుంటినను కర్తృత్వాభిమానరహితములు నగునో అట్టివానిని కర్మాదులయం దకర్మాదులదర్శనమనెడి జ్ఞానాగ్నిచే దగ్ధమైన శుభాశుభకర్మలు కలవానినిగను పరమార్థదర్శినిగను బ్రహ్మవేత్తలు చెప్పుదురు. పరమార్థదర్శికి శుభాశుభకర్మలు జ్ఞానాగ్నిచే దగ్ధమగునని "తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యప

శాంకరభాష్యమ్ :—

సంగ్రహార్థం నివృత్తేనచే జీవనమాత్రార్థం తం జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం కర్మాదావకర్మాదిదర్శనం జ్ఞానం తదేవాగ్నిస్తేన జ్ఞానాగ్నినా దగ్ధాని శుభాశుభలక్షణాని కర్మాణి యస్య తమాహుః పరమార్థతః పణ్డితం బుధా బ్రహ్మవిదః । ||౧౯||

శాంకరభాష్యతత్త్వబోధినీ :—

ములే యాకర్మములగును అందున ప్రవృత్తికలవాడై చేసినచో యాకర్మము లోకసంగ్రహార్థమగును. నివృత్తుడై యాచరించినచో జీవనమాత్రార్థమగును. కాన పూర్వోక్తమగు కర్మమునం దకర్మదర్శనమనెడి యాత్మజ్ఞానరూపమగు నగ్నిచే నాశనమొనరింపబడిన శుభాశుభములనెడి కర్మములుకల యాపురుషుని బ్రహ్మవేత్తలు పరమార్థముగ నిత డాత్మజ్ఞానియని చెప్పుచుండిరి. ||౧౯||

దేశాత్" బ్రహ్మజ్ఞానముకలిగినచో ఆగామికర్మలసంబంధముండదు. సంచితమగు పాపకర్మలు నశించునని బ్రహ్మసూత్రము స్పష్టముగ బోధించుచున్నది.

శంకరానందీయము:— "యథా పుష్కరపలాశ ఆపో న శ్లిష్యన్తే" తామరాకుయందుంచిన యుదకము తామరాకున కంటనటుల యెవడు కర్మయం దకర్మత్వదర్శనముచే శరీరయాత్ర కుపయుక్తములు, జ్ఞానసమానకాలీనములునగు సర్వకర్మలను విశ్లేషను పొందిచుకొనునో (నశింపజేసుకొనునో) అట్టిపురుషుడే పండితుడని "యస్యసర్వే" అనుశ్లోకముచే బోధించుచుండెను.

ఏబ్రహ్మవేత్తయొక్క "సమారంభాః సమ్యగ్దేహేంద్రియాదిభి రేవారభ్యన్తే క్రియన్త ఇతి" ప్రాణరక్షణమాత్రోపయోగియగు దేహేంద్రియాదులచే చేయబడు నిఖిలకర్మలు "కామసంకల్పవర్జితాః" దీనిచే కాదగినదను యిచ్ఛావేగమునకు కారణమగు సమ్యక్త్వబుద్ధి (మంచిదనుబుద్ధి) అట్టివాటిచే శూన్యమై- అనగ ఏజ్ఞానికర్మలు ఆకలిమొదలగువాటివలె తాత్కాలిక మగునో "జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం" 'నేను కూటస్థాసంగచిద్రూపుడను, కర్తను, భోక్తను, శ్రోతను, ద్రష్టను, వక్తను కాను' అనెడి యాత్మయం దాత్మభావాపత్తిచే దేహ, తద్ధర్మ, తత్కర్మ, సుఖముల కసంగత్వదర్శనమనెడి యగ్నిచే దగ్ధమైన విహితావిహితములు, ఔపాధికములు నగు నిఖిలకర్మలుకల యావిద్వాంసుని శాస్త్రజ్ఞులు జీవన్ముక్తునిగను, మహాపురుషునిగను చెప్పుచుండిరి. 'పండితః' అనగా 'పండా=కల్యాణీ సర్వత్ర బ్రహ్మమాత్రావగాహిన్యఖండాత్మికా వృత్తిరస్య సంజాతేతి పండితః' అనగా మంగళప్రదమైనట్టియు, నిఖిలమునందు బ్రహ్మమాత్రస్వరూపము నవగహించిన నఖండాత్మకవృత్తికలవాడు పండితుడు.

ఇచట "కామసంకల్పవర్జితాః" అనిచెప్పుటచే- "యద్యద్ధి కురుతే జన్తుస్తత్తత్కామస్య చేష్టితమ్" (జీవుడు దేనినిచేయునో అదెల్లను కాముని చేష్టితమే) అను న్యాయానుసారము కర్మలయందు ప్రవృత్తికి కారణము కాముడు. అట్టి కామునకు కారణము కార్యముల సంకల్పమే. అట్టిసంకల్పమే లేనిచో స్వార్థమునకుగూర్చికాని, పరార్థమునుగూర్చిగాని విద్వాంసునకు ప్రవృత్తి యనుపపన్నమై, శరీరయాత్రావశిష్టమై తాత్కాలిక మగును. అందుకూడ కామాదులు లేమింజేసి వేగవర్జితమై జ్ఞానాగ్నిచే నిర్దగ్ధ మగునని సూచింపబడెను.

నీలకంఠీయము:— అజ్ఞానులకు కర్మయం దకర్మభావనను దృఢపరచుటకు విద్వాంసుల కర్మదర్శనమును స్తుతించుచుండెను. ఏవిద్వాంసుని కర్మలు ఫలేచ్ఛచేతను, "నేను దీనిని చేయుచుంటిని" అనెడి యభిమానముచేతను వర్జితములో అట్టి విద్వాంసుని- కర్మాదులయం దకర్మదర్శనముచే అంకురీభావములేనివాటిగ చేయబడిన శుభాశుభకర్మలు కలవానినిగను, పండితునిగను విద్వాంసులు చెప్పుచుండిరి. ||౧౯||

గీ॥ త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతి సః ॥ ॥౨౦॥

పదవిభాగము:— త్యక్త్వా-కర్మఫలాసంగం-నిత్యతృప్తః-నిరాశ్రయః- కర్మణి-అభిప్రవృత్తః-అపి-న-ఏవ-కించిత్-కరోతి-సః । ॥౨౦॥

ప్రతిపదార్థము:— యః=ఏపురుషుఁడు; కర్మఫలాసంగం, కర్మ=కర్మములయం దభిమానమును, ఫలాసంగం=ఫలమునం దాసక్తిని; త్యక్త్వా=విడచి; జ్ఞానేన=(ఈ పద మధ్యాహార్యము) యథోక్తమగు జ్ఞానముచే; నిత్యతృప్తః=నిత్యతృప్తుఁడై, (అనగా విషయములయందు కోరిక లేనివాఁడై); నిరాశ్రయః=దృష్టమగునిష్టఫలము, అదృష్ట మగు నిష్టఫలము, అదృష్ట మగు నిష్టఫలములకు యేది సాధనమో యట్టి సాధనరహితుఁడై; వర్తతే=(ఈ పదమధ్యాహార్యము) ఉండునో; సః=అట్టివాడు; కర్మణి=కర్మమునందు; అభిప్రవృత్తోఽపి=అంతట ప్రవృత్తుఁడైనను; కించిత్=కొంచము కర్మమునైన; నకరోత్యేవ=చేయనివాఁడే యగుచున్నాడు. ॥౨౦॥

శాంకరభాష్యమ్:—

(1) యస్త్వకర్మాదిదర్శీ సోఽకర్మాదిదర్శనా దేవ నిష్కర్మా, సంన్యాసీ జీవనమాత్రార్థచేష్ట స్సన్కర్మణి న ప్రవర్తతే యద్యపి ప్రాగ్వివేకతః ప్రవృత్తః। యస్తు ప్రారబ్ధకర్మా స న్నుత్తరకాల ముత్పన్నాత్మసమ్యగ్దర్శన స్స్యాత్స కర్మణి ప్రయోజన మపశ్య న్ససాధనం కర్మ పరిత్యజత్యేవ। స కుతశ్చి న్నిమిత్తా త్కర్మపరిత్యాగాసంభవే సతి కర్మణి తత్ఫలేచ సంగరహిత

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) ఆత్మజ్ఞానముకలుఁగుటకు పూర్వమునం దభినివేశముచే కర్మయందు ప్రవృత్తుఁడైనను ఎవడు కర్మాదులయం దకర్మమును చూచునో యట్టివా డకర్మాదిదర్శనమువలన నభినివేశము లేమింజేసి ప్రవృత్తి సంభవింపనందున నిష్కర్ముఁడై సంన్యాసియైనను జీవనమాత్రనిమిత్తమగు చేష్టకలవాఁడై కర్మమునందు ప్రవర్తింపడు. జీవనమాత్రము నుద్దేశించి ప్రవృత్త్యాభాసము మాత్రము వానికి ప్రాప్తించును.

వివేకముండినను తత్త్వసాక్షాత్కారము లేమింజేసి కర్మలయందు ప్రవృత్తుఁడైనవాని కెట్లు కర్మత్యాగము సంభవించునని శంకింపఁజనదు. ఎవఁడు ప్రారబ్ధకర్మకలవాఁడై యుత్తర కాలమున జనించిన సమ్యగ్దర్శనము కలవా డగునో అట్టివాడు కర్మమునందు ప్రయోజనమును కానక

—♦ ౪వ అధ్యాయము— ౨౦ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— ఆరంభింపఁబడిన ఫలములుకల ప్రాగ్జన్మకృతములగు సంచితకర్మలు జ్ఞానాగ్నిచే నశించుగాక, ఆగామిలఁజేయకుండుగాక, జ్ఞానోత్పత్తికాలమునం దాచరింపబడినకర్మ లాగామిసంచితములయం దంతర్భావముకానందున నట్టికర్మలవలన జ్ఞానికికూడ నవశ్యము ఫలము సంభవించు నను యాశంకను "త్యక్త్వా" అనుశ్లోకముచే తొలంగించుచుండెను.

శాంకరభాష్యమ్.—

తయా స్వప్రయోజనాభావా ల్లోకసంగ్రహార్థం పూర్వవ త్కర్మణి ప్రవృత్తోఽపి నైవ కించి త్కరోతి జ్ఞానాగ్నిదగ్ధకర్మత్వా త్తదీయం కర్మాఽకర్మైవ సమ్పద్యత ఇత్యేత మర్థం దర్శయిష్య న్నాహ—త్యక్త్వేతి।

శాంకరభాష్యతత్త్వబోధిని.—

సాధనములతోకూడ కర్మమును పరిత్యజించును. ఎంతమాత్రము కర్మముల నాచరింపడు. అట్టి సమ్యగ్దర్శికి యేదోయొక కారణముచే కర్మపరిత్యాగము సంభవింపకున్నను అతడు కర్మమునందు, తత్ఫలమునందును సంగరహితుఁడగుటచే స్వప్రయోజనము లేనందున లోకసంగ్రహార్థము కర్మమునందు ప్రవృత్తుడైనను యేకర్మమును చేయనివాడే యగుచున్నాడు. అట్టివాడు జ్ఞానాగ్నిదగ్ధకర్మము కలవాడగుటవలన వానిసంబంధమగు కర్మ మకర్మమే యగుచున్నదను యీ విషయమును చూపదలచి శ్రీకృష్ణపరమాత్మ 'త్యక్త్వాకర్మఫలాసంగం' అని చెప్పుచుండెను.

అకర్త, అభోక్తయగు నాత్మయొక్క దర్శనముచే నిఖిలము బాధితమగుటవలన కర్మలయందు కర్తృత్వాభిమానమును, కర్మఫలములయందు భోగాభిలాషను విడచి పరమానందస్వరూపలాభముచే సర్వత్ర కోరికలేనివాడై, అద్వైతదర్శనముచే దేహాద్యాశ్రయములేనివాడైన * (దేహేంద్రియాద్యభిమానశూన్యుఁడై.) జీవన్ముక్తుడు సమాధివ్యుత్థాన కాలమునందు ప్రారబ్ధకర్మవశమువలన వైదికకర్మయందుకాని, లౌకికకర్మయందుకాని లోకదృష్టిచే సాంగోపాంగానుష్ఠానముకొరకు ప్రవృత్తుఁడైనను నిష్క్రియాత్మదర్శనముచే నిఖిలము బాధితమగుటవలన తన దృష్టిచే దేనిని చేయనివాడే యగుచున్నాడు.

శంకరానందీయము:— సర్వమును బ్రహ్మముగ దెలిసికొనిన విద్వాంసునకు స్వార్థముగాని, పరార్థముగాని ప్రవృత్తిసంభవింపదు. ఒకానొకప్పుడు వాసనావశమున యాహారాదులయందు ప్రవృత్తుడైనను యట్టివాడు స్వయముగ నకర్తయే యగును, అని యీ శ్లోకమునజెప్పుచున్నాడు. బ్రహ్మవేత్త "నిత్యతృప్తః" నిత్యము, బ్రహ్మానందైకరసము, స్వస్వరూపముచే సాక్షాత్కృతము నగు బ్రహ్మముచేతనే దృప్తినిపొందినవాడగును. (స్వస్వరూపసుఖసంపన్నుఁడగును.) కనుకనే "నిరాశ్రయః" కామముచే పురుషుడు సాధనసహితమగు కర్మము నాశ్రయించునుగాన కామము ఆశ్రయమనబడును.) బ్రహ్మవేత్త నిరాశ్రయుడగును. (నిష్కాముడగును). కర్మలయందు ప్రవర్తింపడు. ప్రవృత్తి కామమూలకముగాన కామశూన్యుడగు బ్రహ్మవేత్తకు కర్మప్రవృత్తియు సంభవింపదని యర్థము. అట్టిబ్రహ్మవేత్త యొకానొకప్పుడు వాసనావశమున భిక్షాటనాదుల యందు ప్రవర్తించినను అనగా "కర్మఫలాసంగంత్యక్త్వా" (శుభాశుభరూపకర్మలు దేహమునందు ఫలించునుగాన దేహము కర్మఫలమనఁబడును. లేక దేహము కర్మవలనపుట్టినదిగాన కర్మఫలమనఁబడును) అట్టిదేహమునందు "నేనుకర్తను, భోక్తను, వక్తను, శ్రోతను, ద్రష్టను," అనెడి దేహతాదాత్మ్యము విడచి స్వోచితకర్మమునందు ప్రవర్తించినను నట్టిబ్రహ్మవేత్త ఇతరదృష్టిచే చేయుచున్నవాడైనను స్వీయదృష్టిచే నేమియు చేయనివాడే

* అనగా నిత్యతృప్తుడుకనుకనే ఫలకామనలేనివాడు, దేహేంద్రియాద్యభిమానములేనివాడు. కనుకనే కర్తృత్వాభిమానములేనివాడని క్రమముగ నిత్యతృప్తుడు, నిరాశ్రయుడు అనురెంటిని ఫలకామన కర్తృత్వాభిమానములులేకుండుటయందు హేతువులుగ సమన్వయించుకొనవలెను.

శాంకరభాష్యమ్:—

(2) త్యక్త్వా కర్మ స్వభిలామం ఫలాసంగం చ యథోక్తేన జ్ఞానేన నిత్యతృప్తో నిరాకాంక్షో విషయే ష్విత్యర్థః। నిరాశ్రయ ఆశ్రయరహితః। ఆశ్రయో నామ య దాశ్రిత్య పురుషార్థం సిసాధయిషతి। దృష్టాదృష్టేష్టఫలసాధనాశ్రయరహిత ఇత్యర్థః। విదుషా క్రియమాణం కర్మ పరమార్థతోఽకర్మైవ తస్య నిష్క్రియాత్మదర్శనసంపన్నత్వాత్। తేనై వంభూతేన ప్రయోజనాభావా త్ససాధనం కర్మ పరిత్యక్తవ్య మేవేతి ప్రాప్తే తతో నిర్గమాసంభవా ల్లోకసంగ్రహచికీర్షయా, శిష్టవిగర్హణాపరిజిహీర్షయా వా పూర్వవ త్కర్మ ణ్యభిప్రవృత్తోఽపి నిష్క్రియాత్మదర్శన సంపన్నత్వా న్నైవ కించి త్కరోతి సః॥ ॥౨౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(2) కర్మములయందు కోఱికను, తత్ఫలములయందాసక్తిని వదలి కర్మాదులయంద కర్త్రాదిదర్శనరూపమగు నాత్మవిజ్ఞానముచే నిత్యతృప్తుఁడై (అనగా స్రక్చందనవనితాది భోగములయందు కోఁకలేనివాఁడై) ఆశ్రయరహితుఁడై (అనగా దేని నాశ్రయించి పురుషార్థమును సాధింపనిచ్ఛగలవాఁడగునో యట్టి దృష్టాదృష్టేష్టఫలములకు సాధనమగు కర్మయనెడి యాశ్రయరహితుఁడై యెవఁడుండునో- విద్వాంసునిచే చేయబడుకర్మము విద్వాంసుఁడు నిష్క్రియాత్మదర్శియగుటవలన పరమార్థముచే నకర్మమేయగును. ఇట్టివిద్వాంసునిచే ప్రయోజనము లేనందున సాధనముతోఁగూడినకర్మము పరిత్యజింపవలసినదేయని ప్రాప్తించినను అట్టి కర్మములవలన నిర్గమముసంభవింపనందున లోకసంగ్రహచికీర్షచేగాని శిష్టులుచేయు నిందను పరిహరించు యిచ్ఛచేగాని అజ్ఞానావస్థయందువలె కర్మమునందు ప్రవృత్తిగలయట్టివాఁడు దేనిని చేయనివాఁడేయగుచున్నాఁడు. ॥౨౦॥

యగును. (కర్మలయం దకర్మత్వమునుచూచువాఁడగుటచే నట్టిబ్రహ్మవేత్త యుపాధికృతములగు కర్మలచే లేపమును బొందఁడని యర్థము.)

నీలకంఠీయము:— "ప్రాయశ్చిత్తముచే పాపకర్మ నశించునట్లు జ్ఞానాగ్నిచే పూర్వకర్మ నశించినను వర్తమానకాలమున చేయుచుండెడి కర్మఫలమును తప్పక (జ్ఞానికి) నిచ్చును" అనునాశంకను "త్యక్త్వా" అను శ్లోకముచే తొలగించుచుండెను.

ఆత్మలాభముచే జ్ఞాని నిత్యతృప్తుడగుటవలన ఫలమునం దాసక్తిని వదలి, అహంకారము నాశ్రయముగ జేసుకొనిరామే ప్రతిమానవుడు కర్మను చేయును. ఈ జ్ఞానియన్ననో "నిరాశ్రయః" అహంకారరహితుడై, మదాజ్ఞారూపమగుటచే కర్మయం దంతట ప్రవృత్తుడైనను దేనిని చేయనివాడే యగును. కాన జ్ఞానిచే నాచరింపబడు కర్మ ఫలమునొసగుటకు సమర్థమైనది కాదు. ॥౨౦॥

గీ| నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః |
శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్ || ||౨౧||

పదవిభాగము:— నిరాశీః- యతచిత్తాత్మా- త్యక్తసర్వపరిగ్రహః-- శారీరం- కేవలం- కర్మ- కుర్వన్-న- ఆప్నోతి-కిల్బిషమ్ || ||౨౧||

ప్రతిపదార్థము:— నిరాశీః=తృష్ణావిశేషములగు ప్రార్థనాభేదములు (విశేషములు) లేనివాడై; యతచిత్తాత్మా--యత=నియమింపబడిన; చిత్త=అంతఃకరణము; ఆత్మా=బాహ్యేంద్రియములు శరీరముకలవాడై; త్యక్తసర్వపరిగ్రహః-త్యక్త=విడిచిపెట్టబడిన; సర్వపరిగ్రహః=నిఖిలప్రతిగ్రహములుకలవాడై; కేవలం=ఒక్క; శారీరం=శరీరస్థితిమాత్రప్రయోజకమగు; కర్మ=కర్మమును; కుర్వన్=చేయునట్టివాడు; కిల్బిషమ్=పాపమును; నాప్నోతి=పొందడు. ||౨౧||

---

శాంకరభాష్యమ్:—

(1) యః పునః పూర్వోక్తవిపరీతః ప్రాగేవ కర్మారమ్భా ద్బ్రహ్మణి సర్వాన్తరే ప్రత్యగాత్మని నిష్క్రియే సంజాతాత్మదర్శన స్స దృష్టాదృష్టేష్టవిషయాశీర్వివర్జితతయా దృష్టాదృష్టార్థే కర్మణి ప్రయోజన మపశ్య న్ససాధనం కర్మ సంన్యస్య శరీరయాత్రామాత్రచేష్టోయతి ర్జ్ఞాననిష్ఠో ముచ్యత ఇత్యేత మర్థం దర్శయితు మాహ—నిరితి | నిరాశీ ర్నిర్గతా ఆశిషో యస్మా త్స నిరాశీః, యతచిత్తాత్మా చిత్త మన్తఃకరణ మాత్మా బాహ్యః కార్యకరణసఙ్ఘాత స్తా వుభావపి యతౌ సంయతౌ యేన స యతచిత్తాత్మా, త్యక్తసర్వపరిగ్రహ స్త్యక్త స్సర్వః పరిగ్రహో యేన స త్యక్తసర్వపరిగ్రహః, శారీరం శరీరస్థితిమాత్రప్రయోజనం కేవలం తత్రా ప్యభిమానవర్జితం కర్మ కుర్వ న్నాప్నోతి న ప్రాప్నోతి కిల్బిష మనిష్టరూపం పాపం ధర్మం చ | ధర్మోఽపి ముముక్షోః కిల్బిష మేవ బన్ధాపాదకత్వాత్ |

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) విక్షేపకమగు కర్మముండినను కూటస్థాత్మానుసంధానముసిద్ధించినచో నది కైవల్యహేతువగును. విక్షేపము లేనిచో కూటస్థాత్మానుసంధానము తప్పక మోక్షహేతువగును. కాన నెవడు పూర్వోక్తమగు లోకసంగ్రహాదులయందు నిరపేక్షుడై (శిష్టవిగర్హణాదులను లెక్కసేయక కర్మారంభమునకు పూర్వమునందే సర్వాంతర్యామియు, ప్రత్యగాత్మయు, నిష్క్రియము అగు బ్రహ్మమునందు జనించిన యాత్మదర్శనము కలవాడో, (అనగా నిష్క్రియము, సర్వాంతర్యామియు అగు కూటస్థబ్రహ్మస్వరూపుడను నేను అను బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముకల

---

—♦ ౪వ అధ్యాయము—౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూధనసరస్వతీయము:— "అత్యంతవిక్షేపహేతువైనను జ్యోతిష్టోమాదికమే సమ్యగ్జ్ఞానవశమున ఫలజనకము కాదన్నచో నిక శరీరస్థితిమాత్రహేతువు అవిక్షేపకరము నగు భిక్షాటనాదికము విజ్ఞానికి బంధహేతువెట్లగును?" అని కైముతికన్యాయముచేనిట్టికర్మము బంధకము కానేరదని ఈ శ్లోకమున చెప్పుచున్నాడు. "నిరాశీః-

శాంకరభాష్యమ్:—

(2) కించ శారీరం కేవలం కర్మే త్యత్ర కిం శరీరనిర్వర్త్యం శారీరం కర్మాభిప్రేతమాహోస్విచ్ఛరీరస్థితిమాత్రప్రయోజనం శారీరం కర్మేతి। కించాతః? యది శరీరనిర్వర్త్యం శారీరం కర్మ, యదివా శరీరస్థితిమాత్రప్రయోజనం శారీర మితి; ఉచ్యతే-యదా శరీరనిర్వర్త్యం కర్మ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వాడో) అట్టి దృష్టవిషయములగు స్రక్చందనవనితాదులయందు, అదృష్టవిషయములగు స్వర్గాదులయందు తృష్ణలేనివాడగుటచే దృష్టాదృష్టములు ప్రయోజనములుగా గల కర్మల యందు ప్రయోజనము లేదని తెలిసికొని సాధనసహితమగు కర్మను సంన్యసించి శరీరయాత్రా మాత్రచేష్ట కలవాడై యందు జ్ఞాననిష్ఠుడగునట్టి యతి మోక్షమును పొందునని విషయమును చూపుటకు శ్రీకృష్ణపరమాత్మ "నిరాశీః" అని చెప్ప మొదలిడెను.

ఎవడు చిత్తమును (అంతఃకరణమును) బాహ్యమగు కార్యకరణసంఘాతమును (శరీరేంద్రియాదులను) నియమించుకొని (అనగా నంతఃకరణమును సంకల్పరహిత మొనరించిన నది విషయకామనారహిత మగును. అట్లు విషయకామనారహిత మంతఃకరణమగుచో బాహ్యములగు శరీరేంద్రియములు విషయములయందు ప్రవర్తింపవు. అట్లు శరీరేంద్రియాదులను చిత్తమును నియమించుకొని) కనుకనే యైహికములగు స్రక్చందనవనితాదులయందుగాని, శబ్దస్పర్శరూపరసగంధములయందుగాని, ఆముష్మికములగు స్వర్గాదులయందుగాని తృష్ణ జనింపదు. అట్టి తృష్ణారహితుడై, సర్వప్రతిగ్రహములను వీడి శరీరస్థితిమాత్రమునకు ప్రయోజనమగు నట్టియు, అభిమానవర్జితము నగు కర్మముచేయునో అట్టివా డనిష్టరూపమగు నధర్మరూపపాపమును, ధర్మమును పొందడు. అధర్మ మనిష్టరూప మగును. కాని ధర్మ మనిష్టరూప మెట్లగు నని శంకింపఁజనదు. ధర్మముకూడ బంధహేతు వగుటవలన ముముక్షువున కనిష్టరూపమే యగును. అనగా నిట్టి యతి శరీరయాత్రకు దగు కర్మము నభిమానవర్జితముగ నాచరించినను బంధమునకు కారణమగు పుణ్యపాపములను పొందక ప్రారబ్ధకర్మక్షయానంతరము ముక్తుడగు నని యాశయము.

(2) ఈ శ్లోకమునందు "శారీరం" అనుపదముకలదు. దానికి 'శరీరనిర్వర్త్యంకర్మశారీరం' (శరీరముచే జేయబడు కర్మమాత్ర) మెల్ల "శారీరం" అని యిచట చెప్పనొప్పునా? శరీరస్థితికి

పరిగ్రహః" తృష్ణారహితుడు, నియమితములగు అంతఃకరణముసహితము బాహ్యేంద్రియసహితదేహముకలవాడును, కనుకనే త్యక్తములగు భోగోపకరణములు కలవాడును అగు జ్ఞాని (ప్రారబ్ధకర్మవశమున 'శారీరం-కిల్బిషం' శరీరస్థితిమాత్రోపయోగియగు కౌపీనాచ్ఛాదనాదిగ్రహణ, భిక్షాటనాదిరూపమగు (యతి గూర్చి శాస్త్రముచే నభ్యనుజ్ఞాతమగు కాయిక, వాచిక, మానసికాన్యతమము, అందునను కేవలము కర్తృత్వాభిమానశూన్యమునగు) కర్మమును పరాధ్యారోపితకర్తృత్వముచే చేయుచున్నను, అట్టిజ్ఞాని అకర్త్రాత్మదర్శియగుటచే ధర్మాధర్మఫలభూతము,

శాంకరభాష్యమ్.—

శారీర మభిప్రేతం స్యా త్తదా దృష్టాదృష్టప్రయోజనం కర్మ ప్రతిషిద్ధ మపి శరీరేణ కుర్వ-న్నాప్నోతి కిల్బిష మితి బ్రువతో విరుద్ధాభిధానం ప్రసజ్యేత। శాస్త్రీయం చ కర్మ దృష్టాదృష్ట ప్రయోజనం శరీరేణ కుర్వ న్నాప్నోతి కిల్బిష మిత్యపి బ్రువతోఽప్రాప్తప్రతిషేధప్రసంగః।

శాంకరభాష్యతత్త్వబోధిని.—

ప్రయోజకమగు కర్మమాత్రమే 'శారీరం' అని యీ స్థలమునందు చెప్పనొప్పునా? శరీరముచే నాచరింపదగిన కర్మము 'శారీరం' అనిననేమి? శరీరస్థితికి హేతువగు కర్మము 'శారీరం' అనిననేమి? ఎట్లనిననేమి యనినచో— ఈ శ్లోకమునందుగల "శారీరం" అను పదమునకు "శరీరముచే జేయదగిన కర్మము" అని యర్థము జెప్పినచో నట్టికర్మము శాస్త్రనిషిద్ధకర్మమా? శాస్త్రసిద్ధమా? శాస్త్రనిషిద్ధకర్మమన్నచో దృష్టాదృష్టప్రయోజనము శాస్త్రనిషిద్ధమగు శరీర నిర్వర్త్యకర్మము నాచరించువాడు. "నాప్నోతి కిల్బిషం" కిల్బిషమును (పాపమును) పొందడని చెప్పువాడు. విరుద్ధమును చెప్పినవాడే యగుచున్నాడు. దృష్టాదృష్టప్రయోజన మగు శాస్త్రీయ కర్మమును శరీరముచే జేయువాడు పాపమును పొందడని 'శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషం' అను వాక్యమున కర్థ మనెదవా? ఇట్లు చెప్పువాని కప్రాప్తప్రతిషేధ యను దోషము ప్రాప్తించెడిని. అది యెట్లనిన ఒకానొకడు యజమానికడకేగి అయ్యా! నేనీరోజున మీ యింటివద్ద భోజనముచేసెద నని చెప్ప యదివిని యజమాని మాయింటివద్ద నీకు భోజనము పెట్టుట వీలుపడదని జెప్పుట ప్రసక్తమగు భోజనమునకు నిషేధము- ఇది ప్రసక్తప్రతిషేధ మనబడును. కాని యాపురుషుడే యజమాని కడకేగక భోజనము నీయింట చేసెదనని చెప్పక తాను మార్గము ననుసరించిపోవుచుండ యజమాని యాపురుషుని పిలిచి నీకీరోజున నేను భోజనము

అనిష్టమునగు సంసారమును పొందనేరడు. పాపమువలె బుణ్యముగూడ యనిష్టసంసారఫలకమే గాన కిల్బిషమే యగును. ఇటకొందరు "శారీరం" శరీరముచే నిర్వర్త్యమగు కర్మమని వ్యాఖ్యానించిరి. కాని వారిమతమున "కర్మ కుర్వన్" అనుదానివలననే యీ యర్థము ప్రాప్తించుచుండ "శారీరం" అనుపదము వ్యర్థమగును. ఇంకను ఈ విషయమగుచర్చ భాష్యమునందు విస్తరముగనున్నది.

శంకరానందీయము:— ఏయతీశ్వరుడు వివేకవైరాగ్యశమదమాదిసాధనసంపత్తిచే సర్వకర్మలనువిడచి (సన్యసించి) శ్రవణమననములచే నాత్మతత్త్వమును దెలిసికొని, నిధిధ్యాసనపరుడై యుండునో అట్టి యతీశ్వరుడు శరీరయాత్రామాత్రాత్మకమగు కర్మను చేసియు బ్రహ్మనిష్ఠచే నిర్మూలింపబడిన బంధముకలవాడై (బంధమును నిర్మూలించుకొనినవాడై) ముక్తుడగునని "నిరాశీః" అను శ్లోకముచే జెప్పుచుండెను. నిఖిలవైషయిక కామన అను బరిత్యజించి కనుకనే కౌపీనకంథాతిరిక్త సర్వపరిగ్రహములను పరిత్యజించి, యోగనిష్ఠాపరుడైన యతి స్వాయ ముగ చిత్తమును, దేహమును, నిరోధించి. లేక "యతం సంస్థాపితంచిత్త మాత్మన్యేవ న క్వచి దనాత్మని యేన సః" అంతఃకరణను యనాత్మలయందుంచక కేవల మాత్మయందే యుంచినవాడై ప్రాణసంరక్షణమే ప్రయోజనముగా కల- అందునను "కేవలం" నేను యతిని, జ్ఞానిని, నేనుభిక్షకువచ్చియుంటిని అనెడి కర్తృత్వాభిమానమును విడచి భిక్షాటనాదికర్మను చేయునో అట్టి యతి కిల్బిష (పాప) మును పొందనేరడు.

శాంకరభాష్యమ్:—

శారీరం కర్మ కుర్వ న్నితి విశేషణా త్కేవలశబ్దప్రయోగాచ్చ వాఙ్మనోనిర్వర్త్యం కర్మ విధి ప్రతిషేధవిషయం ధర్మాధర్మశబ్దవాచ్యం కుర్వ న్నాప్నోతి కిల్బిష మిత్యుక్తం స్యాత్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పెట్టను. అని చెప్పుట యప్రసక్తమగు భోజనమునునిషేధించుటచే యిది యప్రసక్తప్రతిషేధ యను దోషము. అట్లే శాస్త్రీయమగు కర్మముల నాచరించువానికి పాపము ప్రాప్తించుచో నీగీతావాక్యముచే నట్టివానికి పాపము ప్రాప్తించదని నిషేధింపవచ్చును. కాని శాస్త్రసిద్ధమగు కర్మముల నాచరించువానికి పాపమే ప్రాప్తించనపుడు "నాప్నోతి కిల్బిషం" పాపమును పొంద డని నిషేధించుట యప్రాప్తప్రతిషేధ యను దోషము ప్రాప్తించును.

"శారీరం కేవలం కర్మకుర్వన్" అని కర్మకు శారీరం అనువిశేషణమువలనను, కేవలశబ్ద ప్రయోగస్వారస్యమువలనను వాఙ్మనస్సులచే నాచరింపబడుకర్మ ప్రతిషేధవిషయము. అనగా వాఙ్మనస్సులచే ధర్మమునుకాని అధర్మమునుగాని చేయరాదు. అట్లు వాఙ్మనస్సులచే ధర్మ మునుకాని అధర్మమునుకాని చేసినయెడల పాపమును పొందును. అనిచెప్పినట్లగును. అందునను వాఙ్మనస్సులచే శాస్త్రవిహితమగు కర్మము నాచరించినచో పాపమునుపొందుననిచెప్పుట విరు

పూర్వపక్షము:— "వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి" (సంన్యసించి భిక్షాటనము నాచరించెదరు). అను శ్రుతిచే ప్రాణసంరక్షణకు హేతువగు భిక్షాటనము యతీశ్వరునకు విహిత మగుటవలన విహితమగు భిక్షాట నము నాచరించిన పాపమే సంభవము కాదుకదా. సంభవింపనిపాప మప్రాప్తమైనపుడు "పాపమును పొందడు" అని నిషేధించుటవలన యప్రాప్తప్రతిషేధ మనెడి దోషము గీతావాక్యమునందు సంభవించునని శంకింపఁజనదు.

సిద్ధాంతము:— "యతచిత్తాత్మా" అని చెప్పుటచే వాగింద్రియముకూడ నిరుద్ధమైనదగుటవలన నట్టి యతి "అభిశస్తపతితవర్జం" అను శ్రుతిచే నిషేధింపఁబడిన అభిశస్తపతితులవలన గూడ భిక్షను పొరబాటుచే గ్రహించిన కిల్బిషమును పొందును. అట్టి జ్ఞానప్రతిబంధకమగు కిల్బిషము (పాపము)ను కర్మణ్యకర్మ యఃపశ్యేదకర్మణిచ కర్మయః... కర్మణ్యకర్మదర్శన మనెడి జ్ఞానాగ్నిచే నశింపఁజేసుకొని ముక్తిని పొందునను యాశయముచే "కుర్వన్నాప్నోతి కిల్బిషం" అని చెప్పెను. కాన యప్రాప్తప్రతిషేధమనెడి దోషము ప్రాప్తింపదు.

లేక "మధు మాంసంచ మద్యంచ తాంబూలం తైల మౌషధమ్। త్యాజ్యా న్యష్టౌ యతే ర్దారా స్తథా కన్యాచ కాంచనమ్" యతి మధువును, మాంసమును, మద్యమును, తాంబూలమును, నూనెను, ఔషధమును, కన్యను, బంగారమును, దూరముగ విడవవలెననుటచే స్వప్నమునందైన తలవరాదని యర్థము. అని స్మృతిచే నిషిద్ధ మగు నవి కూడ శరీరస్థితికి హేతువగును. ఏవి లేకపోయినచో శరీరముపోవునో (నశించునో) శ్రవణాదికము సిద్ధిం పదో అది శారీరకర్మ యనిపించుకొనును. పాముకాటు, నేత్రరోగము, ఉదరశూల, కొండలగు, మహోపద్రవ ములు వ్యాపించినపుడు "ఔషధవ దశన మాచరేత్" (ఔషధమువలెనే భోజనమును చేయవలె) నను శ్రుతి వలన నప్రయత్నముగ ప్రాప్తించిన శరీరస్థితిమాత్రమునకు కారణమగు కర్మను యతీశ్వరు డాచరించినను శ్రవణ మనననిధిధ్యాసనతత్పరుడైనచో పాపమును పొందడు. కాన నప్రాప్తప్రతిషేధ మనెడి దోషము సంప్రాప్తింపదు.

లేక "నిరాశీః" నిత్యానిత్యవివేక వైరాగ్య తీవ్రమోక్షేచ్ఛలచే తుచ్ఛవిషయములుగల ఐహికాముష్మిక సుఖాశల విడిచినట్టియు, అట్టివాడు కనుకనే "త్యక్త సర్వపరిగ్రహః ధర్మప్రజాసంపత్త్యర్థం పరిగృహ్యేత ఇతి పరిగ్రహః దారాదిః త్యక్తః సర్వపరిగ్రహః యేన సః" ధర్మప్రజాసంపత్యర్థము పరిగ్రహించు భార్యాదులను

శాంకరభాష్యమ్.—

తథాఽపి వాఙ్మనసాభ్యాం విహితానుష్ఠానపక్షే కిల్బిషప్రాప్తివచనం విరుద్ధమాపద్యేత। ప్రతిషిద్ధసేవాపక్షేఽపి భూతార్థానువాదమాత్రమనర్థకం స్యాత్।

యదా తు శరీరస్థితిమాత్రప్రయోజనం శారీరం కర్మాభిప్రేతం భవే త్తదా దృష్టాదృష్టప్రయోజనం కర్మ విధిప్రతిషేధగమ్యం శరీరవాఙ్మనోనిర్వర్త్య మన్య దకుర్వం స్తైరేవ శరీరాదిభి శ్శరీరస్థితిమాత్రప్రయోజనం కేవలశబ్దప్రయోగా దహం కరోమీ త్యభిమానవర్జిత శ్శరీరాదిచేష్టామాత్రం లోకదృష్ట్యా కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్। ఏవం భూతస్య పాపశబ్దవాచ్య కిల్బిషప్రాప్త్యసంభవా త్కిల్బిషం సంసారం నాప్నోతి జ్ఞానాగ్నిదగ్ధసర్వకర్మత్వా దప్రతిబంధేన ముచ్యత ఏవేతి పూర్వోక్తసమ్యగ్దర్శనఫలానువాద ఏవైషః। ఏవం శారీరం కేవలం కర్మే త్యస్యార్థస్య పరిగ్రహే నిరవద్యం భవతి ॥ ॥౨౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని.—

ద్ధమేయగును. శాస్త్రనిషిద్ధకర్మము నాచరించినచో పాపమునుపొందునని చెప్పుట భూతార్థానువాదమేయగును. అనగా నిషిద్ధకర్మము నాచరించువానికి పాపము సిద్ధమైయుండ అట్లు వాడు పాపమును పొందునని చెప్పుట వ్యర్థమని యాశయము.

శరీరస్థితిమాత్రము ప్రయోజనముగాకల కర్మమే "శారీరం" అనుపదమున కర్థమని యభిప్రాయమన్నచో విధిప్రతిషేధగమ్యము, దృష్టాదృష్టప్రయోజనకము, శరీరవాఙ్మనోనిర్వర్త్యమునగు కర్మమునాచరింపక యా శరీరవాఙ్మనస్సులచేతనే శరీరస్థితిమాత్రము ప్రయోజనముగాకల "కేవలం" అను శబ్దప్రయోగమువలన "నేను చేయుచుంటిని" అను యభిమానరహితుఁడై లోకదృష్టిచే చేయుచున్నను పాపమును పొందడు. ఇట్టివానికి పాపశబ్దవాచ్యమగు కిల్బిషప్రాప్తియే సంభవింపనందున యట్టియతి సంసారమును పొందడు. జ్ఞానాగ్నిచే దగ్ధమైన సర్వకర్మలు కలవాడగుటవలన మోక్షమునే పొందునని పూర్వమునందు చెప్పబడిన సమ్యగ్దర్శనఫలమే యనువదింపబడెను. "శారీరం కేవలం కర్మ" అనుదాని కీయర్థమునే గ్రహించినచో నిరవద్యమగును. ॥౨౧॥

మోక్షేచ్ఛచేవిడచునట్టి అనగా సంన్యసింపఁబడిన సర్వకర్మతత్సాధనములు కలిగినట్టి యతీశ్వరుఁడు స్వయముగ బాహ్యప్రవృత్తివలన మరలించిన యంతఃకరణము శరీరము కలవాఁడై "శారీరమ్" శరీరమే యుపాధిగాగల యాత్మను పొందించు శ్రవణాదికర్మను అనగా బాహ్యమగు జపాదికమును విడచి యాంతరమగు కేవలశ్రవణాది కర్మను జేయువాఁడే "కిల్బిషం న ప్రాప్నోతి" దుఃఖప్రదమగు సంసారబంధమును పొందడు. "కుర్వన్నాప్నోతి కిల్బిషమ్" అని చెప్పుటవలన జపాది కర్మయు శ్రవణమునుగాని శ్రవణాదులను విడచి తద్వ్యతిరిక్తమగు జపాదులను గాని జేయు యతీశ్వరుఁడు సంసారబంధమును పొందునని సూచింపబడెను. ఈచెప్పుటవలన యతీశ్వరుఁడు సర్వదా శ్రవణాదికమునే యాచరించవలెను యితరమగు స్తోత్రపాఠము, మంత్రజపాదుల నాచరింపవలదని యీ శ్లోకముచే సిద్ధమైన యర్థము. యీ విషయమునే "యమా నభీక్ష్ణం సేవేత నియమా న్మత్పర స్త్యజేత్ । జిజ్ఞాసాయాం సంప్రవృత్తో నాద్రియేత్ కర్మచోదనామ్॥" "సంన్యస్య శ్రవణం కుర్యా న్నాన్యత్కుర్యా ద్యతిః క్వచిత్" (యతీశ్వరుఁడు యమముల నత్యంతము సేవించవలెను. పరమాత్మపరుఁడై నియమమును బరిత్యజించవలెను. బ్రహ్మజిజ్ఞాసయందు ప్రవృత్తుఁడై కర్మలను విధించు విధివాక్యములను యెన్న డాదరింపవలదని స్మృతియు బోధించుచున్నది.

గీ॥ యదృచ్ఛాలాభసన్తుష్టో ద్వన్ద్వాతీతో విమత్సరః ।
సమ స్సిద్ధా వసిద్ధౌ చ కృత్వాఽపి న నిబధ్యతే ॥ ॥౨౨॥

పదవిభాగము:— యదృచ్ఛాలాభసన్తుష్టః- ద్వంద్వాతీతః- విమత్సరః- సమః- సిద్ధౌ- అసిద్ధౌ-చ-కృత్వా-అపి-న-నిబధ్యతే ॥ ॥౨౨॥

ప్రతిపదార్థము:— యదృచ్ఛాలాభసన్తుష్టః- యదృచ్ఛాలాభ=యాచింపకుండగ పొందబడిన లాభముచే; సన్తుష్టః=పుట్టిన యలంప్రత్యయముకలవాడై; (చాలుననుజ్ఞానముకలవాడై) ద్వన్ద్వాతీతః= శీతోష్ణాదిద్వంద్వములచే కొట్టబడినవాడైనను ఖేదమును పొందనిచిత్తముకలవాడై; విమత్సరః=వైరములేని బుద్ధికలవాడై; యదృచ్ఛాలాభస్య= (ఈపదమధ్యాహార్యము) యదృచ్ఛాలాభముయొక్క; సిద్ధౌ= సిద్ధియందును; అసిద్ధౌ=అసిద్ధియందును; సమః=హర్షవిషాదరహితుడై; కర్మ=(ఈపదమధ్యాహార్యము) శరీరస్థితిప్రయోజకకర్మమును; కృత్వాఽపి=చేయువాడైనను; న నిబధ్యతే=బంధింపబడడు. ॥౨౨॥

శాంకరభాష్యమ్:—

త్యక్తసర్వపరిగ్రహస్య యతే రన్నాదే శ్శరీరస్థితిహేతోః పరిగ్రహ స్యాభావాద్యాచనాదినా శరీరస్థితౌ కర్తవ్యతాయాం ప్రాప్తాయాం "అయాచిత మసంక్లుప్త ముపపన్నం యదృ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రతిగ్రహములనెల్ల విడిచిన యతికి శరీరస్థితికి హేతువగు నన్నాదుల ప్రతిగ్రహము సంభ

శ్రీధరీయము:— "శారీరమ్" యోగారూఢుడు శరీరనిర్వాహ (స్థితి) మాత్రప్రయోజకమగు స్వాభావికమైన భిక్షాటనాది కర్మను చేయువాడైనను "కిల్బిషమ్" శాస్త్రవిహితకర్మల నాచరించనందున ప్రాప్తించెడి పాపమును పొందడు.

నీలకంఠీయము:— జ్ఞానికి కర్మాచరణము గౌణము. (ముఖ్యము కాదు). కర్మ నాచరించకపోవుటయే ముఖ్యమని యాశంకించి గృహస్థునకు కర్మ నాచరించకపోవుట ప్రత్యవాయజనక మని వ్యతిరేకముఖమున 'నిరాశీః' అను శ్లోకముచే చెప్పుచుండెను.

ఎవడు స్త్ర్యాదిపరిగ్రహరహితుడో (సంన్యాసియో) అట్టివాడు యోగైశ్వర్యమును కోరనివాడై నిగృహీతమగు బుద్ధియు, దేహేంద్రియాది సంఘాతముకలవాడై అనగా సమాధికాలమునం దరికట్టబడిన బాహ్యాభ్యంతర వృత్తులు కలవాడై యుండునో అట్టివాడు సమాధినుండి లేచిన కాలమున శరీరస్థితిమాత్రప్రయోజకమగు భిక్షాటనాదికమును, అందుకూడ కర్తృత్వాభిమానశూన్యముగను, పరులచే నారోపింపబడిన కర్తృత్వపురస్సరముగ నాచరించినను "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" అను శ్రుతివిహితమగు కర్మలను విధివలన పరిత్యజించుటచే నట్టి కర్మల నాచరింపకపోవుటవలన ప్రాప్తించెడి ప్రత్యవాయమును పొందడు. ఎవడు స్త్ర్యాదిపరిగ్రహముకలవాడో అట్టివాడు యోగైశ్వర్యమును కోరనివాడైనను నిగృహీతమగు బుద్ధి దేహేంద్రియాదులు కలవాడైనను కేవలము శరీరస్థితిమాత్రప్రయోజకమగు కర్మనుమాత్రము చేయునో యావజ్జీవశ్రుతిచోదితమగు కర్మల నాచరించనందున కిల్బిషమును (పాపమును) తప్పక పొందును. ॥౨౧॥

—♦ ౪వ అధ్యాయము—౨౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— పూర్వశ్లోకమునందు త్యక్తసర్వపరిగ్రహములుకల యతీశ్వరుడు శరీరస్థితిమాత్రప్రయోజకమగు కర్మ నాచరింపవచ్చునని యభ్యనుజ్ఞ యొసంగబడెను. అందున అన్నము, ఆచ్ఛాద

శాంకరభాష్యమ్.—

చ్ఛయా) (భా-21-8-12) ఇత్యాదినా వచనే నానుజ్ఞాతం యతేశ్శరీరస్థితిహేతో రన్నాదేః ప్రాప్తిద్వార మావిష్కుర్వన్నాహ—యదృచ్ఛేతి। యదృచ్ఛాలాభసన్తుష్టః ప్రార్థితోపనతో లాభో యదృచ్ఛాలాభస్తేన సన్తుష్ట స్సంజాతాలంప్రత్యయో ద్వన్ద్వాతీతో ద్వన్ద్వై శ్శీతోష్ణాదిభి

శాంకరభాష్యతత్త్వబోధిని.—

వింపనందున యాచనాదులచే శరీరస్థితి కర్తవ్యమైయుండ * "అయాచిత మసంక్లుప్త ముపపన్నం యదృచ్ఛయా" (యాచింపకుండగను, ఒకానొకస్థలమునందే యని సంక్లుప్తము కాకుండగ యాదృచ్ఛికముగ ప్రాప్తమగుదానినే భుజింపవలయుననెడి వచనముచే ననుజ్ఞాతము. యతి యొక్క శరీరస్థితికి హేతువునగు నన్నముయొక్కయు, కౌపీనాదులయొక్కయు, ప్రాప్తిద్వారమును ప్రకటనచేయుచు "యదృచ్ఛాలాభసన్తుష్టః" అని శ్రీకృష్ణపరమాత్మ చెప్ప మొదలిడెను.

నము పొందఁగునవి లేనియెడల శరీరముండ నేరనందున యాచ్ఞాదులచేతను, స్వప్రయత్నముచేతను అన్నాదికము సంపాదింపవలసియుండ "యదృచ్ఛయా" అనుశ్లోకముచే నియమములను చెప్పుచుండెను.

"యదృచ్ఛయా" శాస్త్రానుమతముకాని ప్రయత్నముకంటె వేరగునది యదృచ్ఛ యనఁబడును. అట్టి యదృచ్ఛచే శాస్త్రానుమతమగు నన్నాదుల సంప్రాప్తిచే సంతుష్టుడైనట్టియు, ఈవిషయనే "భైక్షంచరేత్" (భిక్షాటనను ఆచరించవలయునని) భిక్షాటనను ప్రకృతముగ జేసికొని "అయాచిత మసంక్లుప్త ముపపన్నం యదృచ్ఛయా" (యాచింపకుండగను, నియమితము కాకుండగను యదృచ్ఛచే సంప్రాప్తమగు నన్నాదులను యతి గ్రహింపవలయును) అను శాస్త్రము బోధించుచు యతీశ్వరులకు యాచ్ఞాసంకల్పాదులు కూడదని బోధించుచున్నది. మనువున్ను "న చోత్పాతనిమిత్తాభ్యాం న నక్షత్రాంగవిద్యయా। నానుశాసనవాదాభ్యాం భిక్షాం లిప్సేత కర్హిచిత్" ఉత్పాతనిమిత్తములచేతను, జ్యోతిశ్శాస్త్రముచేతను, అనుశాసనవాదములచేతను యతీశ్వరుఁడు యెన్నడు భిక్షను కోరరాదని బోధించుచుండెను. "యతయో భిక్షార్థం గ్రామం విశన్తి" (యతీశ్వరులు భిక్షనిమిత్తము గ్రామమును ప్రవేశించుచుండిరి.) అనుస్మృతి యతీశ్వరునకు భిక్షనిమిత్తము గ్రామమును ప్రవేశించుటకు తత్ప్రయత్నమునం దభ్యనుజ్ఞ యిచ్చుటవలన నట్టిప్రయత్నము యతీశ్వరునకు శాస్త్రవిహితమే. ఇట్లే పరులవలన శాస్త్రసిద్ధమైనది పొందఁ తగినది యతి స్వీకరింపవచ్చును. అవి యేవనిన— "కౌపీనయుగలం వాసః కన్థాం శీతనివారిణీం, పాదుకే చాపి గృహ్ణీయాత్కుర్యా న్నాన్యస్య సంగ్రహమ్" (రెండుకౌపీనములు, ఒక వస్త్రము, చలిబాధను నివారించు ఒకకంథ (బొంత)యు, పాదుకలు యతీశ్వరుఁడు స్వీకరింపవచ్చును. ఇతరమైనదానిని దేనిని స్వీకరింపవలదు. అని యతి స్వీకరించవలసినవాటిని స్మృతి బోధించుచున్నది.

* "అయాచితం" భిక్షాటనార్థము ప్రయత్నము చేయుటకు పూర్వమునందే యొకానొక యోగ్యునిచే సమర్పింపఁబడిన భైక్షము అయాచిత మనఁబడును. "అసంక్లుప్తం" అభిశప్తుని, పతితునివిడచి సంకల్పము లేకుండగనే నయిదు గృహములనుండి గాని, యేడు గృహములనుండిగాని తీసుకొనిరాబడిన భైక్షమసంక్లుప్త మనబడును. "ఉపపన్నమ్" భక్తజనులచే తన సమీపమును గూర్చి తీసుకురాబడిన యన్నము ఉపపన్న మనఁబడును. అదియు తన ప్రయత్నము లేకుండగనే యుండవలయును. మరియు, "మాధూకరము, అసంక్లుప్తము, ప్రాక్ప్రణీతము, అయాచితము, తాత్కాలికోపపన్నము" అని భైక్షము ఐదు విధములు. ఈ ఐదువిధములయిన భైక్షము యతికి

శాంకరభాష్యమ్ :—

ర్హన్యమానో ప్యవిషణ్ణచిత్తో ద్వన్ద్వాతీత ఉచ్యతే। విమత్సరో విగతమత్సరో నిర్వైరబుద్ధి స్సమ స్తుల్యో యదృచ్ఛాలాభస్య సిద్ధా వసిద్ధౌ చ। య ఏవం భూతో యతి రన్నాదే శ్శరీరస్థితి హేతో ర్లాభాలాభయో స్సమో హర్షవిషాదవర్జితః కర్మాదా వకర్మాదిదర్శీ యథాభూతాత్మ

శాంకరభాష్యతత్త్వబోధిని :—

తన ప్రార్థనలేనిదే ప్రాప్తమగు లాభము (భిక్ష)చే చాలునను జ్ఞానముకలవాడై శీతోష్ణాది ద్వంద్వములచే కొట్టబడుచుండినను ఖేదమునుపొందని చిత్తముకలవాడై, యెవరియందును వైరములేనివాడై, యదృచ్ఛాలాభముయొక్క సిద్ధియందు హర్షరహితుఁడై, అట్టి యదృచ్ఛాలాభముయొక్క యసిద్ధియందు విషాదరహితుఁడై యేయతియుండునో, కర్మాదులయం దకర్మాదిదర్శియు, యథాభూతాత్మదర్శననిష్ఠుఁడగు నాయతి శరీరస్థితిమాత్రప్రయోజనకము, శరీరాది

స్వప్రయత్నములేనిదే కౌపీనకంథాదులు లభించనిచో శీతోష్ణాదిపీడితుఁడై యతీశ్వరు డెట్లుజీవించవలయు ననుశంకను— "ద్వన్ద్వాతీతః" అనుపదముచే నివారించుచుండెను. క్షుత్పిపాసాశీతోష్ణవర్షాదుల నతిక్రమించినవాడై (క్షుత్పిపాసలను, శీతోష్ణాదులను, వర్షవాతాదులను సహించినవాడై) అనగా సమాధికాలము నందు క్షుత్పిపాసాదులస్ఫురణయే యుండదు. సమాధివ్యుత్థానకాలమందన్ననో క్షుత్పిపాసాదుల స్ఫురణయున్నను పరమానందము, అద్వితీయము, అకర్తృరూపము, అభోక్తృరూపము, అగు నాత్మయొక్క జ్ఞానముచే క్షుత్పిపాసాదులు బాధితమగుటవలన (రజ్జుతత్త్వసాక్షాత్కారముచే బాధితమగు సర్పముచే కరవబడినను యంతఃకరణము క్షోభించనటుల) క్షుత్పిపాసాదులచే బాధింపబడుచున్నను క్షోభించబడని మనస్సుకలవాడై యుండును. కనుకనే పరులకు లాభించినప్పుడు, తనకు లాభించనినాడు * మత్సరములేనివాడై (అద్వితీయాత్మదర్శనముచే వైరబుద్ధి లేనివాడై) కనుకనే యదృచ్ఛాలాభము సిద్ధియందు, అసిద్ధియందు తుల్యుడై అనగా సిద్ధియందు సంతోషము, అసిద్ధియందు విషాదము లేనివాడై స్వానుభవముచేత యకర్తయై పరులచే నారోపింపబడిన కర్తృత్వముకలవాడై శరీరస్థితిమాత్రప్రయోజకమగు భిక్షాటనాదికర్మను చేయువాడైనను బంధుహేతువగు కర్మ మవిద్యతోకూడ జ్ఞానాగ్నిచే దగ్ధమగుటవలన భిక్షాటనాదికర్మచే బంధింపబడడు.

శంకరానందీయము :— పరావరైకత్వ (జీవబ్రహ్మైక్య) విజ్ఞానముచే నత్యంతము దగ్ధమైన యవిద్యయు, తత్కార్యగ్రంథులు కలిగిన జీవన్ముక్తుఁడగు విద్వాంసునకు శరీరయాత్రకంటె యతిరిక్తమగు కర్తవ్యమైన కర్మ లేదని చెప్పి నిధిధ్యాసగల యతియగు వానికి అన్నముయొక్కయు, అన్నదాతయొక్కయు, విచారమును విడచి శరీరయాత్రను చేయువానికికూడ ముక్తి సంభవించునని చెప్పి జీవన్ముక్తుడై యజగర (కొండచిలువ) వృత్తినవలంబించి యదృచ్ఛాప్రాప్తిచే జీవనముచేయు యతికి యేవృత్తి చెప్పబడెనో అట్టిశరీరస్థితిమాత్రప్రయోజకమగు వృత్తి (కర్మ) ముక్తిప్రతిబంధకము కాదని శ్రీకృష్ణపరమాత్మ 'యదృచ్ఛాలాభసంతుష్టః' అను శ్లోకముచే చెప్పుచుండెను.

నీవు, నేను, ఇది, అది, ఇష్టము, అయిష్టము శుద్ధము, అశుద్ధము, ద్వైతము, అద్వైతము అనునవి మొదలుగాగల విపరీతజ్ఞానములు అంతట బ్రహ్మదృష్టిచే నశించిన యట్టిద్వంద్వరూపమగు విపరీతజ్ఞానము లేనివాడై, కనుకనే "ఈసర్వము నేనే" అని సర్వమును తనరూపముగ దెలిసికొనుటవలన నుత్కృష్టత్వాపకృష్టత్వ భావన సంభవింపనందున సర్వత్ర ఆత్మబుద్ధి కలుగుటచే నశించిన మత్సర (కోప) ముకలవాడై కనుకనే "యదృచ్ఛాలాభసంతుష్టః" ప్రారబ్ధకర్మవశమున ప్రయత్నములేకుండగ ప్రాప్తించినది యదృచ్ఛాలాభమనఁబడును. సత్పురుషునిచే గాని, దుర్మార్గునిచే గాని యివ్వబడినది పవిత్రమైనది గాని, అపవిత్రమైనదిగాని స్వల్పము గాని, విస్తారము గాని యగు నన్నాదికముచే పరితృప్తినిపొందినవాడై "సిద్ధావసిద్ధౌ చ సమః" ఆహారము సిద్ధించినను, సిద్ధింపకున్నను బ్రహ్మానందానుభూతిచే స్వయముగ

* మత్సరమనగ పరోత్కర్షాసహనపూర్వకమగు స్వోత్కర్షవాంఛయే.

శాంకరభాష్యమ్.—

దర్శననిష్ఠ శ్శరీరస్థితిమాత్రప్రయోజనే భిక్షాటనాదికర్మణి శరీరాదినిర్వర్త్యే "నైవ కించిత్కరోమ్యహం" (గీ-5-8) "గుణా గుణేషు వర్తన్తే" గీ-3-28) ఇత్యేవం సదా సంపరిచక్షాణ ఆత్మనః కర్తృత్వాభావం పశ్యన్నైవ కించి ద్భిక్షాటనాదికం కర్మ కరోతి। లోకవ్యవహారసామాన్య దర్శనేన తు లౌకికై రారోపిత కర్తృత్వే భిక్షాటనాదౌ కర్మణి కర్తా భవతి। స్వానుభవేన తు శాస్త్రప్రమాణాదిజనితే నాకర్తైవ। స ఏవం పరాధ్యారోపితకర్తృత్వం శరీరస్థితిమాత్రప్రయోజనం భిక్షాటనాదికం కర్మ కృత్వాఽపి న నిబధ్యతే బన్ధహేతోః కర్మణ స్సహేతుకస్య జ్ఞానాగ్నినా దగ్ధత్వాదిత్యుక్తానువాద ఏవైషః ॥ ॥౨౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని.—

నిర్వర్త్యము నగు భిక్షాటనపాదుకాచ్ఛాదనములయందు "నేను కొంచమైన చేయునదిలేదు "గుణాగుణేషు వర్తన్తే" ఇందిరియములు విషయములయందు వర్తించుచున్నవికాని నేను ప్రవర్తించుటలేదు." అని చెప్పుచున్నట్టి యాయతి తనకు కర్తృత్వాభావమును దెలిసికొనుచున్నవాడై యేదో యొక భిక్షాటనాదికమును చేయుచున్నాడు. లోకవ్యవహారదృష్టిచే లౌకికులచే భిక్షాటనాది కర్మమునం దారోపితకర్తృత్వముండుటచే భిక్షాటనాది కర్మమునందు కర్తయగుచున్నాడు. శాస్త్రప్రమాణమువలన పుట్టిన స్వానుభవముచే నకర్తయే యగుచున్నాడు.

ఈ విధమున పరులచే నారోపిత కర్తృత్వముగల శరీరస్థితిమాత్రప్రయోజకమగు కర్మము నాచరించినను బంధహేతువగు కర్మము యజ్ఞానముతోగూడ జ్ఞానాగ్నిదగ్ధమగుటవలన నట్టి కర్మముచే బంధింపబడడని యిది పూర్వమునందు చెప్పబడిన విషయముయొక్క యనువాదమే అని గ్రహింపనగును. ॥౨౨॥

హర్ష విషాదశైత్యోష్ణ్యాదులు లేనివాడై శరీరయాత్రను చేసినను అజగరస్వరూపుడు, బ్రహ్మవిత్తు అగు యతీశ్వరుడు "న నిబధ్యతే" ముక్తికి ప్రతిబంధకమును పొందడు. లోకదృష్టిచే ఆహారాదివైషమ్యముచే ప్రతిబంధకవత్తగు దోషముచే శాన్పించుచున్నను విద్వాంసుండు "ఈనిఖిలజగత్తు, నేను బ్రహ్మమే" అని భోక్తయు, భోగ్యము, దాతయు, దేయము నెందఱగునవి బ్రహ్మమాత్రమున ప్రవిలాపితమగుటవలన నద్వితీయమగు పరబ్రహ్మమునందు బ్రతిబంధకమగు నన్యము సంభవింపనందున నీవిద్వద్దేహము పతితమైనవెంటనే విదేహముక్తిని పొందునని యర్థము.

నీలకంఠీయము:— "స్త్ర్యాదిపరిగ్రహముకలవాడు కుటుంబపోషణయందు తొందరకలవా డగును. గాన నట్టివాడు ధనవ్యయముచేతను, శరీరాయాసముచేతను సాధ్యమగు నగ్నిహోత్రాదుల నెటుల ననుష్ఠించును." అను నాశంకను "యదృచ్ఛాలాభసంతుష్టః" అను శ్లోకముచే తొలిగించుచుండెను.

ప్రార్థింపకుండగ సంప్రాప్తమగు లాభముచే సంతుష్టుడై అనగా బ్రాహ్మణునకు ఋతామృతములచే జీవనము విహితము. అట్టి జీవనము కలవాడై ఋత మనగ నుంఛశిలావృత్తులు. అమృతమనగ యాచింపకుండగ సంప్రాప్తమైనది యని గ్రహింపనగును. ఈవిషయమే "ఋత ముంఛశిలం ప్రోక్త మమృతం స్యా దయాచితమ్" అను స్మృతిచే చెప్పబడెను. విస్తారముగ ప్రార్థించినను, ప్రాప్తింపకున్నను, సుఖదుఃఖములు లేనివాడై పరుని లాభమును జూచి సంతాపములేనివాడై, సముడై, యదృచ్ఛాలాభముచేతనే యిష్టి, పశు, చాతుర్మాస్యాది నిత్యకర్మల సిద్ధియందును, అసిద్ధియందును సముడై అనగా నిర్వికార (వికారశూన్యుడై) యిష్ట్యాదులను చేయు

గీ॥ గతసఙ్గస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః ।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ॥ ॥౨౩॥

పదవిభాగము:— గతసఙ్గస్య- ముక్తస్య- జ్ఞానావస్థితచేతసః- యజ్ఞాయ-ఆచరతః- కర్మ-సమగ్రం-ప్రవిలీయతే ॥ ॥౨౩॥

ప్రతిపదార్థము:— గతసఙ్గస్య-గత=నివృత్తమైన; సఙ్గస్య=ఆసక్తి కలిగినట్టియు; ముక్తస్య=నివృత్తమగు ధర్మాధర్మాదిబంధము కలిగినట్టియు; జ్ఞానావస్థితచేతసః-జ్ఞాన=బ్రహ్మాత్మైక్యజ్ఞానమునందే; అవస్థిత=ఉంచబడిన; చేతసః=చిత్తము కలిగినట్టియు; యజ్ఞాయ=పరమేశ్వరునినిమిత్తము; ఆచరతః= (కర్మమును) చేయువానియొక్క; కర్మ=కర్మము; సమగ్రం= (అగ్రేణ, ఫలేన, సహవర్తత ఇతిసమగ్రం) ఫలముతోగూడ; ప్రవిలీయతే=నశించుచున్నది. ॥౨౩॥

శాంకరభాష్యమ్:—

“త్యక్త్వా కర్మఫలాసఙ్గం” (గీ 4-20) ఇత్యనేన శ్లోకేన యః ప్రారబ్ధకర్మా సన్యదా నిష్క్రియబ్రహ్మాత్మదర్శనసంపన్నస్స్యాత్తదా తస్యాత్మనః కర్తృకర్మప్రయోజనాభావదర్శినః కర్మపరిత్యాగే ప్రాప్తే కుతశ్చిన్నిమిత్తాత్తదసంభవేసతి పూర్వవత్తస్మిన్కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః (గీ 4-20) ఇతి కర్మాభావః ప్రదర్శితః। యస్యైవం కర్మాభావో దర్శితస్తస్యైవ— గతసంగస్య సర్వతో నివృత్తాసక్తేర్ముక్తస్య నివృత్తధర్మాధర్మాదిబంధస్య జ్ఞానా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

“త్యక్త్వా కర్మఫలాసంగం” అను శ్లోకముచే నేసమయమున నేపురుషుఁడు నిష్క్రియాత్మజ్ఞానము కలవాఁడగునో అట్టి సమయమున క్రియాకారక ఫలాభావజ్ఞానము కల యట్టిపురుషునకు కర్మపరిత్యాగము ప్రాప్తించినను యేదో యొక నిమిత్తమువలన కర్మపరిత్యాగము ప్రాప్తింపకున్నను యజ్ఞానావస్థయందువలె నిత్యనైమిత్తికకర్మములయందు ప్రవృత్తుఁడైనను వాఁడు దేనిని

వాఁడైనను అయిష్ట్యాదుల ఫలమగు స్వర్గాదులచే బంధింపబడఁడు. “కృత్వాఽపి” అనుచోటనుండు అపి శబ్దమువలన బంధహేతువగు కర్మ తత్త్వజ్ఞానముచే దగ్ధమగుటంచేసి పాపముచేగూడ బంధింపఁబడఁడని గ్రహింపనగును. ఈవిషయమునే “న్యాయాగతధనస్తత్త్వజ్ఞాననిష్ఠోఽతిథిప్రియః। శ్రాద్ధకృత్సత్యవాదీ చ గృహస్థోపి విముచ్యతే” (న్యాయముగ సంప్రాప్త ధనముకలవాఁడై,) తత్త్వజ్ఞాననిష్ఠుఁడై అతిథులయందు ప్రీతికలవాఁడై, పితృకార్యములను చేయువాఁడై, సత్యమునే పలుకునట్టి గృహస్థుకూడ ముక్తుఁడగును.) అని స్మృతి చెప్పుచున్నది. భాష్యమునందైతే యీశ్లోకము సంన్యాసిపరముగ శ్రీమచ్ఛంకర భగవత్పాదులచే వ్యాఖ్యానింపబడెను. ॥౨౩॥

—♦ ౪వ అధ్యాయము—౨౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— త్యక్తసర్వపరిగ్రహుఁడు, యదృచ్ఛాలాభసంతుష్టుఁడునగు యతీశ్వరుఁడు శరీరస్థితిప్రయోజకమగు భిక్షాటనాదికర్మ నాచరించినను అట్టికర్మచేతను యతి బంధింపబడఁడని చెప్పుటవలన గృహస్థులు బ్రహ్మవేత్తలు నగు జనకాదుల యజ్ఞరూపమగు కర్మ వారలకు బంధహేతువగునను శంకను తొం

శాంకరభాష్యమ్.—

వస్థితచేతసో జ్ఞాన ఏవావస్థితం చేతో యస్య సోయం జ్ఞానావస్థితచేతా స్తస్య యజ్ఞాయ యజ్ఞనిర్వృత్త్యర్థ మాచరతో నిర్వర్తయతః కర్మ సమగ్రం సహాగ్రేణ ఫలేన వర్తత ఇతి సమగ్రం కర్మ తత్సమగ్రం ప్రవిలీయతే వినశ్యతీ త్యర్థః ॥ ॥౨౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని.—

యాచరింపనివాడే యగునని (వానికి) కర్మాభావము చూపబడెను. ఎవని కీవిధమున కర్మాభావము చూపఁబడెనో ప్రతివస్తువయందు నివృత్తమైన యాసక్తి కలిగినట్టియు, ధర్మాధర్మ రాగ ద్వేషాది బంధమువలన నివృత్తుడైనట్టి బ్రహ్మాత్మైక్యజ్ఞానము నందు దృఢముగ నుంచబడిన నంతఃకరణము కలిగి యీశ్వరార్థము కర్మల నాచరించు యా పురుషునియొక్క కర్మము ఫలముతోగూడ నశించుచున్నది. (అనగా నట్టివానిచే నాచరింపఁబడినకర్మము భర్జితబీజమువలె జ్ఞానాగ్నిచే భర్జితమగుటఁజేసి ఫలము నివ్వజాలదు. అతడు ముక్తుడగునని యాశయము.) ॥౨౩॥

గించుటకు "త్యక్త్వా కర్మఫలాసంగం" ఇత్యాదికముచే చెప్పబడినవిషయమునే "గతసంగస్య" అను శ్లోకముచే వివరించుచుండెను.

కర్మఫలమునందాసక్తి లేనట్టియు, 'ముక్తస్య' కర్తృత్వభోక్తృత్వాద్యధ్యాసశూన్యుడైనట్టియు నిర్వికల్పబ్రహ్మాత్మైక్యబోధయందేయుండిన చిత్తముకల స్థితప్రజ్ఞుడు అగు అనగా స్థితప్రజ్ఞుడుకనుకనే కర్తృత్వభోక్తృత్వాద్యధ్యాసశూన్యుఁడు కనుకనే కర్మఫలమునం దాసక్తిలేనివాడు. ఆట్టివాడైనను ప్రారబ్ధకర్మవశమున యజ్ఞ సంరక్షణార్థము, లేక శ్రేష్ఠాచారమగుటచే జ్యోతిష్టోమాదియజ్ఞమునందు లోకప్రవృత్తినిమిత్తముకాని విష్ణుప్రీతినిమిత్తముకాని యాచరించునట్టి బ్రహ్మవేత్తయొక్క యజ్ఞదానాదికర్మము "సహాగ్రేణ ఫలేన న విద్యత ఇతి సమగ్రం" ఫలముతోకూడ తత్త్వదర్శనమువలన కారణమగు నవిద్యానాశపూర్వకముగ నశించుచున్నది.

శంకరానందీయము:— "ఈనిఖిలజగత్తు, నేను పరబ్రహ్మస్వరూపమే" అని నిఖిలజగత్తును, తనను ప్రత్యగ్దృష్టిచే బ్రహ్మముగ నెల్లపుడు చూచునట్టి బ్రహ్మవేత్తలగు జీవన్ముక్తుల శరీరయాత్రాత్మకమగు కర్మము బ్రహ్మదృష్టిచే ప్రవిలాపితమగుట (లయమును పొందింపబడినదగుట)చేత సత్తువలేనిదై జీవన్ముక్తుల ముక్తికి ప్రతిబంధకము కాకుండుగాక. లోకానుగ్రహకామనచే కర్మయందు ప్రవృత్తమైన యాధికారికుడుకాని, అవిద్వాంసుఁడగు నన్యుడుగాని "నేనుకర్తను, నాచే నిదికర్తవ్యము" అనెడి క్రియాకారకభేదదృష్టి నాశ్రయించి కర్మనాచరించినచో నట్టికర్మము ముక్తిని ప్రతిబంధించును. ఈవిషయమునే "నాభుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" అనేకకల్పకోట్లు గతించినను తనచే నాచరింపబడిన కర్మ మనుభవింపనిదే నశించదని స్మృతియు బోధించుచున్నది. అనుయాశంకను బ్రహ్మవేత్త అగు మహాపురుషులచే ననుష్ఠింపబడు లౌకికకర్మకాని, వైదికకర్మకాని క్రియాకారకాదిభేదముచే నేదైనను సర్వము "బ్రహ్మమే" అని సర్వత్రబ్రహ్మదృష్టిచేతనే యాచరింపఁబడును. కాని "ఇది నాచే నాచరింపబడుచున్నది" అనుభేదదృష్టిచే నాచరింపబడదు. అందువలన బ్రహ్మవేత్తలచే నాచరించబడు కర్మమెట్టిదైనను యట్టివారలకు ముక్తినిప్రతిబంధించుటకు సమర్థము కాదని యాశయముచే శ్రీకృష్ణపరమాత్మ "గత

ముక్తుడు బ్రహ్మమునందే యాత్మభావాపత్తిచే "నేను, నాది" అనెడి యభిమానశూన్యుఁడు, అహంకార రహితుఁడు గనుకనే "గతసంగస్య—సజ్యతే పుమా ననేన కర్మస్వితి సంగః కామః" దేనిచే కర్మలయందు పురుషుడు కట్టబడునో అట్టి కామరహితుఁడు, కనుకనే యంతటను బ్రహ్మదర్శనరూపమగు జ్ఞానమునందు సమకూర్పబడిన చిత్తముకలవాడు, అనగా విషయాకగాహియగు నంతఃకరణవృత్తిని యెల్లపుడు బ్రహ్మాకారత్వమును పొందించునట్టివాడు, విష్ణువుకొఱకు లేక 'దేవాన్యజన్తీతి యజ్ఞాః బ్రాహ్మణాదయః" శ్రౌతకర్మలచేతను, స్మార్తకర్మలచేతను దేవతలనుగూర్చి యాగముచేయు బ్రాహ్మణాదులు యజ్ఞశబ్దముచే జెప్పఁబడుదురు, (ఇచట "యజ్ఞాయ" అనుశబ్ద మేకవచనాంతమైనను జాతియం దేకవచనప్రయోగమనిన బ్రాహ్మణాద్యర్థము సంభవించును. అట్టి బ్రాహ్మణాదులకొరకు లోకహితవునిమిత్తము కర్మల నాచరించువారలైనను అట్టి యాధికారికులకు నిత్యమనుష్ఠేయమానమగు కాయక వాచక మానసిక కర్మము. లేక కర్మాకర్మాదిరూపమగు సర్వము బ్రహ్మదృష్టిచే ప్రవిలాపితమై మూలాజ్ఞానముతోకూడ నశించి జన్మాదిఫలముకొఱకు సమర్థముకాదు.

నీలకంఠీయము:— "త్యక్త్వా కర్మ ఫలాసంగమ్" అను శ్లోకము మొదలు మూడుశ్లోకములచే విద్వాంసుడు కర్మలను చేయువాడైనను చేయనివాడే, కనుకనే కర్మలతో లేపమును పొందడు. కర్మలేపము లేనందుననే బద్ధుడుకాడని చెప్పఁబడును. ఇచట నొక సంశయము కలదు. జ్ఞానముచే కర్మల ఫలదానశక్తి ప్రతిబంధము చేయబడునా? లేక కర్మలు (సమూలము) నశింపజేయఁబడునా? అని యాశంకించి మొదటి పక్షమున ముక్తునకు కూడ తిరిగి సంసారము సంభవించవలసివచ్చునని తలచి ద్వితీయపక్షమును "గతసంగస్య" అను శ్లోకముచే నంగీకరించు చుండెను.

విద్వాంసుఁడు గతసంగుడు (కర్తృత్వాభిమానశూన్యుడు) కనుకనే దేనిని చేయడనిచెప్పబడెను. విద్వాంసుడు ముక్తుడు. (ఫలకామనను విడచినవాడు) కనుకనే కర్మలచే లేపమును పొందడని చెప్పఁబడెను. విద్వాంసునకు పొందదగిన దేదియు లేనందున ఫలాంతరము నిమిత్తము విద్వాంసుఁడు కర్మల నాచరింపడు. మరేమనిన? యజ్ఞేశ్వరప్రీత్యర్థమే కర్మల నాచరించును. కాన యజ్ఞేశ్వరప్రీతి జనింపజేసి కృతార్థములయిన కర్మలచే విద్వాంసుఁడు బంధింపఁబడఁడని చెప్పఁబడెను. విద్వాంసుఁడు సమ్యగ్దర్శనమునందు ప్రతిష్ఠితమైన ప్రజ్ఞకలవా డగుటవలన నీశ్వర ప్రీతిఫలకమగు జ్ఞాననిష్ఠాప్రాప్తి పూర్వమునందే ప్రాప్తించిన దగుటవలన గతసంగుడు (కర్తృత్వాభిమానశూన్యుఁడు) ముక్తుడు (ఫలకామనను విడచినవాడు). పరమేశ్వరప్రీతినిమిత్తము కర్మల నాచరించునట్టియు, జ్ఞానావస్థితుఁడును అగు నీవిద్వాంసునకు క్రియమాణములగు సర్వకర్మలు సర్వవిధములచేతను నిష్ప్రయోజనమై సమగ్రముగ (ఫలముతోగూడ) లేక వాసనతోగూడ నశించును. గాన ఎన్నడును ఫలము నివ్వజాలవు. వహ్నికి యౌష్ణ్యము స్వాభావికము. అట్టి స్వాభావికమగు నౌష్ణ్య మెవ్వరిచేతను ప్రత్యాఖ్యానము చేయుటకు వీలుకానటుల కర్మలకు ఫలజననసామర్థ్యము స్వాభావికము. అట్టి స్వాభావికధర్మమును ప్రత్యాఖ్యానము జేయుటకు వీలుకానందున నీకర్మప్రలయము (కర్మనాశనము) విద్వద్దృష్టిచే చెప్పబడెనని గ్రహింపనగును. కనుకనే జ్ఞానముచే పూర్వకర్మల దాహము (నాశము) ఆగామికర్మల యసంబంధము "తద్యథైషీకాతూల మగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే" ఏషీకాతూలము (దూది) అగ్నియందుంచబడి యెటులనశించునో అట్లే జ్ఞాననిష్ఠుని సంచితకర్మలు జ్ఞానాగ్నిచే నశించును.) "తం విదిత్వా న కర్మణా లిప్యతే పాపకేన" (పరమాత్మస్వరూపమును దెలిసికొనిన జ్ఞాని ఆగామిపాపకర్మముచే లేపమును పొందడు) అనుశ్రుతులచే బోధింపబడుచుండెను. మఱియు "తస్య పుత్రా దాయ ముపయంతి సుహృద స్సాధుకృత్యాం ద్విషన్తః పాపకృత్యాం" (జ్ఞానియొక్క దాయమును పుత్రులు, సాధుకర్మను మిత్రులు, పాపకర్మను శత్రువులు, పొందెదరు) అను శ్రుతియు

గీ|| బ్రహ్మార్పణం బ్రహ్మ హవి ర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్ ।
బ్రహ్మైవ తేన గన్తవ్యం బ్రహ్మకర్మసమాధినా || ||౨౪||

పదవిభాగము:— బ్రహ్మ-అర్పణం-బ్రహ్మ-హవిః-బ్రహ్మాగ్నౌ- బ్రహ్మణా- హుతం- బ్రహ్మ-ఏవ-తేన-గన్తవ్యం- బ్రహ్మకర్మసమాధినా || ||౨౪||

ప్రతిపదార్థము:— అర్పణం=హవిస్సును సమర్పించుటకు సాధనము; బ్రహ్మ=బ్రహ్మస్వరూపమే; హవిః=అజ్యాదిహవిస్సు; బ్రహ్మ=బ్రహ్మస్వరూపమే; బ్రహ్మాగ్నౌ=బ్రహ్మస్వరూపమగు నగ్నియందు; బ్రహ్మణా=బ్రహ్మస్వరూపమను కర్తచే; నిర్వర్తింపఁబడు; హుతం=హవనక్రియయు; బ్రహ్మైవ=బ్రహ్మస్వరూపమే; బ్రహ్మకర్మసమాధినా=బ్రహ్మమనెడి కర్మమునందు చిత్తసమాధానముగల; తేన=ఆపురుషునిచే; గన్తవ్యం=పొందదగిన ఫలము; బ్రహ్మైవ=బ్రహ్మమే యై; భవతి= (ఈపదమధ్యాహార్యము) యగుచున్నది. ||౨౪||

శాంకరభాష్యమ్:—

(1) కస్మాత్పునః కారణాత్క్రియమాణం కర్మ స్వకార్యారమ్భ మకుర్వత్సమగ్రం ప్రవిలీయత ఇత్యుచ్యతే యతః- బ్రహ్మేతి । బ్రహ్మార్పణం యేన కరణేన బ్రహ్మవి ద్ధవి రగ్నా వర్పయతి తద్బ్రహ్మైవేతి పశ్యతి తస్యాత్మవ్యతిరేకేణాభావం పశ్యతియథా శుక్తికాయాం రజతాభావం పశ్యతి తదుచ్యతే బ్రహ్మైవార్పణమితి । యథా యద్రజతం తచ్ఛుక్తి కైవేతి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) "నా భుక్తం క్షీయతే కర్మ కల్పకోటిశతైరపి" (తాను చేసిన కర్మమనేకకోట్ల కల్పములు గడచినను తా నాకర్మఫలము ననుభవింపనిదే నశించదను స్మృతివలన కర్మము ఫలమివ్వనిదే నివృత్తము కాదని) స్మృతి ఘోషించుచుండ నేకారణమువలన విద్వాంసునిచే ననుష్ఠింపఁబడిన కర్మము తన కార్యమగు ఫలమును పుట్టించక ఫలముతోఁగూడ నశించుననెదవా? (వినుము) చెప్పెద.

"అర్పణం= అర్ప్యత్యనేనేత్యర్పణమ్" ఏ సాధనముచే నాజ్యాదిహవిస్సుల నగ్నియందుంచునో యట్టి యాజ్యాదుల యర్పణమునకు సాధనములగు స్రుక్స్రువ దిక మర్పణమనఁబడును.

విద్వాంసునిధనము పుత్రులను పొందినట్లు కర్మలుకూడ నన్యులనుపొందునని బోధించుటవలన విద్వత్కృతమగు కర్మలకు వాస్తవముగ నాశములేదు. (మరియునిన విద్వాంసులకు ఫలారంభకములుగాక సుహృత్తులకు, శత్రువులకు ఫలారంభకములగునని గ్రహింపనగును. (ఈచెప్పుటవలన కర్మలస్వభావము ఫలజననసామర్థ్యము స్థిరమనియు, నది యన్యులకు ఫలజనకమనియు, జ్ఞానికి ఫలజనకమై బంధకము కానేరదనియు తేలిన యాశయము. ||౨౩||

—• ౪వ అధ్యాయము—౨౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:—చేయబడుకర్మము ఫలమునివ్వక యెట్లునశించును? అనుశంకను అట్టి కర్మమునకు కారణమగు నజ్ఞానము బ్రహ్మజ్ఞానమున కార్యమగు కర్మయు నశించునని "బ్రహ్మార్పణం" అనుశ్లోకముచే జెప్పుచుండెను.

యజ్ఞాదిక్రియ యనేక కారకసాధ్యము. యాగమనగ దేవతనుద్దేశించి చరు పురోడాశాది ద్రవ్యముల త్యాగమే. అగ్నియందట్టి ద్రవ్యముయొక్క ప్రక్షేపమువలన నట్టిద్రవ్యత్యాగమే హోమమనఁబడును. అట్టి హోమ

శాంకరభాష్యమ్.—

బ్రహ్మ, అర్పణ మిత్యసమస్తే పదే। యదర్పణబుద్ధ్యా గృహ్యతే లోకే తదస్య బ్రహ్మవిదో బ్రహ్మైవే త్యర్థః ॥

(2) బ్రహ్మ హవి స్తథా య ద్ధవిర్బుద్ధ్యా గృహ్యమాణం త ద్బ్రహ్మైవాస్య। తథా బ్రహ్మాగ్నావితి సమస్తం పదం। అగ్ని రపి బ్రహ్మైవ యత్ర హూయతే। బ్రహ్మణా కర్త్రా బ్రహ్మైవ కర్త్రే త్యర్థః। యత్తేన హుతం హవనక్రియా తద్బ్రహ్మైవ। యత్తేన గన్తవ్యం ఫలం తదపి బ్రహ్మైవ। బ్రహ్మకర్మసమాధినా బ్రహ్మైవ కర్మ బ్రహ్మకర్మ తస్మిన్సమాధి ర్యస్యస బ్రహ్మకర్మసమాధి స్తేన బ్రహ్మకర్మసమాధినా బ్రహ్మైవ గన్తవ్యం। ఏవం లోకసంగ్రహం చికీర్షుణాఽపి క్రియమాణం కర్మ పరమార్థతోఽకర్మ బ్రహ్మబుద్ధ్యుపమృదిత

శాంకరభాష్యతత్త్వబోధిని.—

బ్రహ్మవేత్త యట్టి స్రుక్స్రువాదికమును బ్రహ్మమునుగ దెలిసికొనును. అనగా; "య ద్రజతం త చ్ఛుక్తి కైవ" ఏది రజతమై యింతవరకు భాసించినదో యది ముత్యపుచిప్ప అనుచోట బాధయందు సామానాధికరణ్యము. బాధయందు సామానాధికరణ్యమనగ నింతవరకు భాసించిన రజతము రజతముకాదు మరేమనిన? శుక్తికయే అని శుక్తియందు రజతాభావమును చూచుట. అట్లే యే స్రుక్స్రువాదికము కలదో యది వాస్తవముగ స్రుక్స్రువాదికముకాదు. మరేమనిన బ్రహ్మమేయని బ్రహ్మాభిన్నముగ నాస్రుక్స్రువాదికముయొక్క యభావమును దెలిసికొనును. (అనగా బ్రహ్మముకంటె వేరుగ నర్పణాదికము లేదని దెలిసికొనునని యాశయము.) మూలము నందుగల "బ్రహ్మార్పణం" అనుచోట బ్రహ్మ-అర్పణం అనునవి యసమస్తమగు పదద్వయము. (పర్యవసితమేమి) ఏది లోకమునందర్పణబుద్ధిచే గ్రహింపబడునో నట్టి యాజ్యాది హవిర్దాన సాధనమగు స్రుక్స్రువాదికమెల్ల యీ బ్రహ్మవేత్తకు బ్రహ్మస్వరూపమే యనియర్థము.

(2) అట్లే యేది హవిర్బుద్ధిచే గ్రహింపబడుచున్నదో అట్టి యాజ్యాది హవిస్సులున్ను యీబ్రహ్మవేత్తకు బ్రహ్మస్వరూపమే. "బ్రహ్మర్పణం" అనునది యసమస్తపదముగున టుల (బ్రహ్మాగ్నౌ) అనుపద మసమస్తముకాదు. మరేమనిన? సమస్తపదమని గ్రహింపనగును. దేనియం దాజ్య పురోడాశాదికమును హోమముచేసెదరో అట్టి యగ్నియు బ్రహ్మమే. అట్టి కర్తచే సలుపఁబడు హవనక్రియయు బ్రహ్మమే. బ్రహ్మమనెడి కర్మమునందు చిత్తసమాధానముకలవానిచే పొందదగిన ఫలమున్ను బ్రహ్మమే. ఈవిధమున లోకసంగ్రహముచేయ నిచ్ఛకలవానిచే నాచరింపబడు కర్మము— హవనసాధనములగు స్రుక్స్రువాదులు, హవిస్సు,

మున కుద్దేశ్యమగు దేవతకే సంప్రదానము. అగ్నియందుంచబడు చరుపురోడాశాదిద్రవ్యము హవిస్సనఁబడును. అట్టి హవిస్సే సాక్షాత్ 'హూ' ధాత్వర్థకర్మ, దానికి (అట్టి హోమమునకు) ఫలము కాలాంతరమునందు ప్రాప్తించు స్వర్గాదికము. ఈఫలమునే భావనాకర్మమనెదరు. "హూ" అనునది మొదలగు పాత్రవిశేషము హవిస్సును ధరిం

శాంకరభాష్యమ్.—

త్వాత్ । ఏవం సతి నివృత్తకర్మణోఽపి సర్వకర్మసంన్యాసిన స్సమ్యగ్దర్శనస్తుత్యర్థం యజ్ఞత్వసంపాదనం జ్ఞానస్య సుతరా ముపపద్యతే యదర్పణా ద్యధియజ్ఞే ప్రసిద్ధం తదస్యాధ్యాత్మం బ్రహ్మైవ పరమార్థదర్శిన ఇతి ॥

(3) అన్యథా సర్వస్య బ్రహ్మత్వేఽర్పణాదీనా మేవ విశేషతో బ్రహ్మత్వాభిధాన మనర్థకం స్యాత్ । తస్మా ద్బ్రహ్మైవేదం సర్వ మిత్యభిజానతో విదుష స్సర్వకర్మాభావః । కారక

శాంకరభాష్యతత్త్వబోధిని.—

అగ్నియు, హోమకర్తయు పొందదగిన ఫలమున్ను బ్రహ్మమే యనెడి బ్రహ్మజ్ఞానముచే నుపమర్దిత మగుటవలన పరమార్థముగ కర్మమేయగును. ఇట్లగుచో యజ్ఞమునను సరించి ప్రసిద్ధమగు నే యర్పణాదికముకలదో ఆయర్పణాదిక మీబ్రహ్మవేత్తయగు పరమార్థదర్శి కధ్యాత్మమగు బ్రహ్మమేయని నివృత్త సర్వకర్మములుకల సర్వకర్మ సంన్యాసిసంబంధమగు జ్ఞానమునకు యజ్ఞత్వ సంపాదనము సమ్యగ్దర్శనస్తుతినిమిత్తము సుతరాం ఉపపన్నమగును.

(3) 'బ్రహ్మార్పణం' అను శ్లోకముచే జ్ఞానమునకు యజ్ఞత్వ ముపపాదితము. అట్లుకానిచో ప్రపంచమంతయు బ్రహ్మస్వరూపమే యైయుండ విశేషముగ నర్పణాదులకే బ్రహ్మస్వరూపత్వము జెప్పుట నిరర్థక మయ్యెడిని. కాన జ్ఞానస్తుతినిమిత్తము జ్ఞానమునకు యజ్ఞత్వసంపాదనము చేయుటకే యర్పణాదులకు బ్రహ్మత్వ ముపపాదితము. అందువలనను 'బ్రహ్మైవేదం సర్వం' (ఈ ప్రపంచమంతయు బ్రహ్మమే) అనెడి యాత్మవ్యతిరేకముగ బ్రపంచమున కసత్త్వమును దెలిసికొనిన విద్వాంసునకు కారణబుద్ధి లేకుంజేసియు సర్వకర్మాభావమే సిద్ధించుచున్నది. యజ్ఞమునందు 'ఇంద్రాయ వ్రీహిభి ర్జుహోతి' అను స్థలమునందు 'ఇంద్రాయ' అను పదముచే జెప్పఁబడు ఇంద్రదేవతావిశేషము చతుర్థీకారక మనఁబడును. 'వ్రీహిభిః' అను పదముచే జెప్పఁబడు వ్రీహులు (ధాన్యము) కరణకారక మనఁబడును. అగ్నిహోత్రాది నిఖిలకర్మములు "ఇంద్రాయ" అను శబ్దసమర్పిత మగు నింద్రాగ్న్యాదిదేవతావిశేషసంప్రదానకారక బుద్ధికలవై, 'వ్రీహిభిః' అనెడి శబ్దసమర్పిత వ్రీహ్యాదిరూప కరణకారకబుద్ధి కలవై "నేను కర్తను, నాచే నీ ఫలము పొందదగినది" అనెడి కర్త్రభిమానఫలాభిసంధి కలవై లోకవేదములయందు ప్రసిద్ధముగ చూడఁబడుచున్నవి. కాని "ఇంద్రాయ" అను శబ్దసమర్పిత మగు నింద్రాగ్న్యాది దేవతావిశేషరూప మగు సంప్రదానకారకముయొక్క జ్ఞానముతో శూన్యమై 'వ్రీహిభిః' అనెడి శబ్దసమర్పిత వ్రీహ్యాదికరణకారకశూన్యమై "నేను కర్తను" అనెడి కర్తృత్వాభిమానశూన్యమై "నాచే యీ ఫల మనుభవింపదగినది" అనెడి ఫలాభిసంధివర్జితమై యే యజ్ఞరూపకర్మము లోక

చినదగుటచేతను, హవిస్సును అగ్నియందుంచుటలో యధిక సాధనమగుటచేతను "కరణము" అని యనిపించు కొనును. మంత్రాదికముకూడ దేవతాదిప్రకాశకమగుటచే "కరణములే" యని యనిపించుకొనును.

శాంకరభాష్యమ్:—

బుద్ధ్యభావాచ్చ । నహి కారకబుద్ధిరహితం యజ్ఞాఖ్యం కర్మ దృష్టం। సర్వమేవాగ్నిహోత్రాదికం కర్మశబ్దసమర్పితదేవతావిశేషసంప్రదానాదికారకబుద్ధిమ త్కర్త్రభిమానఫలాభిసంధిమచ్చ దృష్టం నోపమృదితక్రియాకారకఫలభేదబుద్ధిమ త్కర్తృత్వాభిమానఫలాభిసంధిరహితం వా । ఇదం తు బ్రహ్మబుద్ధ్యుపమృదితార్పణాదికారకక్రియాఫలభేదబుద్ధికర్మతోఽకర్మైవ తత్ ।

(4) తథా చ దర్శితం 'కర్మణ్యకర్మ యః పశ్యేత్' (గీ-4-18) కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః, (గీ-4-20) గుణా గుణేషు వర్తన్తే, (గీ-3-28) నైవ కించిత్కరోమీతి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

వేదములయందు చూడబడలేదు. బ్రహ్మవేత్తచే నాచరింపబడు కర్మము బ్రహ్మబుద్ధిచే నుపమర్దితమగు నర్పణాదికారకక్రియాఫలభేదబుద్ధి కలది. అనగా నీ బ్రహ్మవేత్తకు "సర్వము బ్రహ్మమే" అను జ్ఞానము కలదు. అట్టి జ్ఞానముచే నేనీ కర్మమునకు కర్తను, నాచే నీ ఫలమనుభవింపదగినది, అనెడి ఇంద్రాగ్న్యాదులకొఱకు నీ హోమము చేయుచుంటిని, అనెడి సంప్రదానకారకబుద్ధియు వ్రీహులచే హోమము చేయదగినది. అనెడి కరణకారకబుద్ధియు నుపమర్దితము. (అనగా బ్రహ్మజ్ఞానముకలవాని కిట్టి క్రియాకారకఫలభేదజ్ఞాన ముండదు). అందువలన నట్టివానిచే నాచరింపఁబడు కర్మము కర్మాభావమే యగును. పర్యవసితమేమనిన ? బ్రహ్మవేత్తయొక్క కర్మము "బ్రహ్మైవాహ మస్మి" అనెడి బ్రహ్మజ్ఞానముచే నిరాకృతమగు క్రియాకారకాది భేదబుద్ధి కలదగుటచే నట్టి కర్మ మకర్మమే యగును. ఎందువలననిన ? కర్మమునకు వ్యాపకము కారకాదికము. అనగా నెచట కర్మము ప్రసక్తమగునో యచట ఇంద్రాదిసంప్రదాన కారకము, వ్రీహ్యాదికరణకారకాదులు నియమితములు. ఎట్లనిన ? ధూమ ముండిన స్థలమునందెల్ల నగ్ని యుండునటుల యని గ్రహింపనగును. ఇట ధూమము వ్యాప్యము, అగ్ని వ్యాపక మనఁబడును. అట్లే కర్మము వ్యాపకము. దేవతాదికారకము వ్యాప్య మగును. వ్యాప్యమగు ధూమము నివర్తించినచో వ్యాపకమగు నగ్ని నివర్తించినటుల "బ్రహ్మమే సర్వము" అను జ్ఞానముచే నింద్రాదికారకము నివృత్తమగుచో వ్యాప్యమగు కర్మముకూడ నివర్తించును కాన నిద్రించువానిచేష్టవలె బ్రహ్మవేత్తయొక్క శరీరాదిచేష్ట కర్మవ్యాపకమగు నింద్రాదికారకవ్యావృత్తివలన కర్మాభాసమే యగునని యర్థము.

(4) జ్ఞానిచే ననుష్ఠింపఁబడిన కర్మ మకర్మమే యని "కర్మణ్యకర్మ యః పశ్యేత్, గుణా గుణేషు వర్తన్తే, నైవకించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్" అను గీతావాక్య

యాకరణములు కారకములని, జ్ఞాపకములని రెండువిధములు. క్రియయు అగ్నియందు త్యాగమనియు, ప్రక్షేపమనియు రెండువిధములు. ఆరెంటిలో మొదటిదగు త్యాగమనెడిక్రియయందు యజమాని సాక్షాత్తుకర్త యగును. ప్రక్షేపమనెడి క్రియయందు యజమానిచే క్రీతమైన (ధనపూర్వకముగ కొనబడిన) యధ్వర్యుడు కర్త

శాంకరభాష్యమ్.—

యుక్తో మన్యేత తత్త్వవిత్ (గీ–5–8)" ఇత్యాదిభిః। తథా చ దర్శయం స్తత్రతత్ర క్రియాకారక ఫలభేదబుద్ధ్యుపమర్దం కరోతి। దృష్టా చ కామ్యాగ్నిహోత్రాదౌ కామోపమర్దేన కామ్యాగ్నిహోత్రాదిహానిః। తథా మతిపూర్వకామతిపూర్వకాదీనాం కర్మణాం కార్యవిశేష స్యారమ్భకత్వం దృష్టమ్। తథేహాపి బ్రహ్మబుద్ధ్యుపమృదితార్పణాది కారకక్రియాఫలభేదబుద్ధే ర్బాహ్యచేష్టామాత్రేణ కర్మాపి విదుషోఽకర్మ సమ్పద్యతే। అత ఉక్తం సమగ్రం ప్రవిలీయత ఇతి।

శాంకరభాష్యతత్త్వబోధినీ.—

ములచే శ్రీకృష్ణపరమాత్మ చూపియే యుండెను. బ్రహ్మవేత్తకు దృష్టమగు కర్మము లేదని చెప్పినను అట్టి కర్మకారణ మగు క్రియాకారక ఫలభేదజ్ఞానము నశించినచో నది యెట్లు నశించు ననియు యెట్లు సమంజస మగునని శంకింపఁబనదు. బ్రహ్మవేత్తకు కర్మము లేదని శ్రీకృష్ణపరమాత్మ చూపుచు ,'ఈకర్మము నాచే జేయదగినది, ఈకర్మకు నేను కర్తను, ఈకర్మఫలము నాచే యనుభవింపదగినది, ఈదేవతకొరకీహవిస్సు నర్పణము జేయవలెను" అనెడి క్రియాకారకఫల భేదబుద్ధియొక్క యుపమర్దమును (నాశమును, లేక నివృత్తిని) జేయుచునే యుండెను. కాన కారణమగు క్రియాకారకఫలభేదజ్ఞానము సంభవింపనందున తత్కార్యమగు కర్మయు విద్వాంసునకు సంభవింప నేరదు.

అది యెట్లనిన ? కామనచే ననుష్ఠింపఁబడిన యగ్నిహోత్రము కామ్యాగ్నిహోత్రమై యది యపూర్వద్వారమున నా కామనానుగుణమగు స్వర్గాదులను కలుగజేయును. కామనారహితముగ నా యగ్నిహోత్రము నాచరించినచో నాయగ్నిహోత్రము కామ్యాగ్నిహోత్రము గాక నిత్యాగ్నిహోత్రమనంబడి స్వర్గాదులకు సాధనము గాక నంతఃకరణమును సత్త్వప్రధాన మొనరించి శ్రవణాది ద్వారమున బ్రహ్మజ్ఞానమునకు సాధనమై మోక్షమునకు ప్రయోజన మగుచున్నది. అట్లే "ఈకర్మ మిట్లాచరింపఁదగినది, నాచేనీకర్మముయొక్క ఫలమనుభవింపఁ దగినది" అను జ్ఞానపూర్వకముగ నాచరింపఁబడిన కర్మలకు ఫలవిశేషరూపకార్యజనకత్వము, అట్టి జ్ఞానము లేకుండగ నాచరింపఁబడిన కర్మములకు ఫలవిశేషరూప కార్యారంభకత్వము లోకమున యనుభవసిద్ధమే. గాన నిచటగూడ "క్రియాకారకఫలము లన్నియు బ్రహ్మమే" అను బుద్ధిచే

యగును. ద్రవ్యప్రక్షేపమున కధికరణ మగ్నియగును. ఇట్లే దేశకాలాదికముగూడ సర్వక్రియాసాధారణము అధికరణరూపమగును. ఇట్టి నిఖిలక్రియా కారకాదివ్యవహారములు రజ్జ్వజ్ఞానముచే పరికల్పితములగు సర్పధారకలె బ్రహ్మాజ్ఞానముచే పరికల్పితములై రజ్జుతత్త్వసాక్షాత్కారముచె సర్పధార బాధితమైనటుల బ్రహ్మతత్త్వజ్ఞానముచే క్రియా కారకాది నిఖిలవ్యవహారములు బాధితములగును. అట్లు బాధితములైనను (ప్రారబ్ధకర్మవశమున) తిరిగి యనువృత్తములై యవి వ్యవహారాభాసములుగ గోచరించుచున్నను దగ్ధపటన్యాయమున ఫలముకొరకు సమర్థము కానేరవని యీశ్లోకముచే జెప్పఁబడెను.

శాంకరభాష్యమ్—

(౫) అత్ర కేచి దాహు ర్యద్బ్రహ్మ తదర్పణాదీని బ్రహ్మైవ కిలార్పణాదినా పంచ విధేన కారకాత్మనా వ్యవస్థితం స త్తదేవ కర్మ కరోతి, తత్ర నార్పణాబుద్ధి ర్నివర్త్యతే, కిం త్వర్పణాదిషు బ్రహ్మబుద్ధి రాధీయతే। యథా ప్రతిమాదౌ విష్ణ్వాదిబుద్ధి ర్యథా వా నామాదౌ బ్రహ్మబుద్ధిరితి।

శాంకరభాష్యతత్త్వబోధిని—

నుపమృదితము (అనగా నర్పణాది రూప క్రియా కారక ఫలము లన్నియు బ్రహ్మమే యను జ్ఞానము గలవానికి “ఈకర్మము నాచే జేయదగినది; ఇంద్రాదులకొరకు హవిస్సు నర్పింపవలయును; ఈ కర్మఫలము నాచే ననుభవింపఁదగినది” అనెడి జ్ఞానముండదనుట). అట్టి విద్వాంసుని కర్మము బాహ్యచేష్టామాత్రముచే కర్మరూపమైనను యది యకర్మమే యగుచున్నది; కనుకనే పరమేశ్వరార్థమాచరించు విద్వాంసుని కర్మము ఫలముతోఁగూడ నశించునని యీ శ్లోకమునందే చెప్పబడెను.

(౫) ఈ శ్లోకమును కొందరు మఱియొకవిధముగ వ్యాఖ్యానించుచుండిరి. అది యెట్లనిన? “ఏ బ్రహ్మము కలదో యది యర్పణాదిరూపము” అని, ఇచట ప్రసిద్ధము నుద్దేశించి యప్రసిద్ధ విధానమున్యాయముకాని, యప్రసిద్ధమునుద్దేశించి ప్రసిద్ధవిధానమును విధించుట న్యాయముకాదనిక శంకింపఁజనదు. కర్మ, కర్త, కరణము, సంప్రదానము, అధికరణ మనెడి యయిదువిధములగు కారకరూపముగ బ్రహ్మమే యున్నదై కర్మమును చేయుచున్నది. అని యంగీకరించుటచే బ్రహ్మమున కప్రసిద్ధి లేదు. కాన నట్టిబ్రహ్మానువాదపురస్సరముగ నర్పణాదులయందు బ్రహ్మదృష్టి విధింపబడుచుండెను. ప్రాతిభాసికరజతానువాదపురస్సరముగ నేది రజతమో యది శుక్తిక యనుజ్ఞానముచే రజతబుద్ధి నివర్తించినటుల ఇచట యేది యర్పణాదికమో యది బ్రహ్మమే యను జ్ఞానముచే నర్పణాదిబుద్ధి నివర్తింపఁజేయుటలేదు. మఱే మనిన ? ప్రతిమాదులయందు విష్ణుబుద్ధివలెను, నామాదులయందుబ్రహ్మబుద్ధివలె యర్పణాదులయందు బ్రహ్మబుద్ధి యుంచబడుచున్నది. (అనగా నర్పణాదులు బ్రహ్మమేయని యుపాసింపవలయునని యీ శ్లోకము నుపాసనాపరముగ వ్యాఖ్యానించిరి).

అదియెట్లనిన ?— “అర్ప్యతే అనేనేతికరణవ్యుత్పత్త్యా అర్పణం జుహ్వాది, మంత్రాదిచ” దేనిచే ఆజ్యాది హవిస్సు అర్పింపబడునో అట్టి జుహూ మొదలగు పాత్రవిశేషములు, మంత్రములు కరణవ్యుత్పత్తిచే అర్పణము అనిపించుకొనును. “అర్ప్యతే అస్మై ఇతి వ్యుత్పత్త్యా” దేనికొర కాజ్యాదిహవిస్సు అర్పింపబడునో అట్టి దేవతావిశేషముకూడ “అర్పణం” అనుశబ్దముచే చెప్పఁబడును. అర్ప్యతే అస్మి న్నితివ్యుత్పత్త్యా, దేనియం దాజ్యాదిహవిస్సు అర్పింపబడునో అట్టి యధికరణమగు దేశ కాలాదులు “అర్పణం” అనుశబ్దముచే చెప్పఁబడును. ఇట్టియర్పణ శబ్దముచే చెప్పఁబడు జుహూ మొదలగు పాత్రవిశేషములు, మంత్రాదులు, దేవతాస్వరూపములు అధికరణమగు

శాంకరభాష్యమ్:—

(౯) సత్య మేవ మపి స్యా ద్యది జ్ఞానయజ్ఞస్తుత్యర్థం ప్రకరణం న స్యాత్ । అత్ర తు సమ్యగ్దర్శనం జ్ఞానయజ్ఞశబ్దిత మనేకాన్యజ్ఞశబ్దితా న్క్రియావిశేషా నుపన్యస్య "శ్రేయా న్ద్రవ్యమయాద్యజ్ఞా జ్జ్ఞానయజ్ఞః" ఇతి జ్ఞానం స్తౌతి। అత్ర చ సమర్థ మిదం వచనం బ్రహ్మార్పణ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(౯) అర్పణాదులయందు బ్రహ్మదృష్టిని విధించుచో విధింపఁబడు దృష్టి మానసక్రియా రూప మగుటచే సమ్యగ్జ్ఞానము కానేరదు. ఇచట యజ్ఞశబ్దవాచ్యములగు ననేక క్రియావిశేషముల నుపన్యసించి "శ్రేయా న్ద్రవ్యమయా ద్యజ్ఞా జ్జ్ఞానయజ్ఞః" అని జ్ఞానమునే నుతించుచుండెను. అట్టి జ్ఞానమే జ్ఞానయజ్ఞశబ్దితము. కాన నీ ప్రకరణము జ్ఞానయజ్ఞస్తుతినిమిత్తము

దేశకాలాదులు బ్రహ్మమే. త్యాగమునకు ప్రక్షేపమునకు సాక్షాత్తు కర్మయగు నాజ్యాదిహవిస్సులు బ్రహ్మమే, ఏయగ్నియం దాజ్యాదిహవిస్సు లుంచబడునో ఆయగ్నియు బ్రహ్మమే. "బ్రహ్మాగ్నౌ" అనునది సమాసపదము. అట్లే యేయజమానిచేతను, యేయధ్వర్యునిచేత నాజ్యాదిహవిస్సు లగ్నియందుంచబడునో ఆ యజమానుడు, అధ్వర్యుడు కర్తృకారకము లనఁబడును. ఆ వారిరువురిని కర్తృవాచకముగ విధింపబడిన తృతీయావిభక్తిచె ననువదించి వారిరువురు బ్రహ్మమేయని "బ్రహ్మణా" అనుశబ్దము చెబోధించుచుండెను. అనగా యజమానియు, అధ్వర్యుఁడు బ్రహ్మమేయని యర్థము. బ్రహ్మస్వరూపమగు యజమానిచేతను, అధ్వర్యునిచేతను జేయబడిన హవనము అనగా త్యాగక్రియయును, ప్రక్షేపక్రియయు బ్రహ్మమే. అట్టిహవనముచె (యాగముచె) పొందదగిన స్వర్గాది కర్మయు బ్రహ్మమే. ఈ చెప్పినవిధమున కర్మయందు బ్రహ్మజ్ఞానముకల బ్రహ్మవేత్త కర్మానుష్ఠాతయైనను అతనిచే పొందదగినది పరమానందాద్వయమే.

శంకరానందీయము:— కర్మల ప్రవిలాపనప్రకారమును "బ్రహ్మార్పణం" అను శ్లోకముచే జెప్పుచుండెను. "హవిరర్ప్యతే౽నేనేత్యర్పణమ్" దేటిచే హవిస్సు మొదలగున వర్పింపబడునో యట్టిచమస్సు, స్రుక్కు, స్రువాది పాత్ర అర్పణము లనఁబడును. అట్టి పాత్రవిశేషము లన్నియు బ్రహ్మమే యని ప్రత్యగ్దృష్టిచే బ్రహ్మవేత్తచూచుచును. (అనగా మూఢదృష్టికి యేది రజతమై భాసించుచున్నదో, అదియే వివేకదృష్టికి శుక్తియైనట్లు అజ్ఞాని దృష్టికి యే చమసాది పాత్రలు యజ్ఞ సాధనములో అవియే బ్రహ్మవేత్తయొక్క దృష్టికి బ్రహ్మమేయగునని యర్థము,) "బ్రహ్మహవిః" యజ్ఞసంబంధము, హోమము జేయదగిన యే చరుపురోడాశాది హవిస్సుకలదో ఆ హవిస్సు మొదలగువాటిని బ్రహ్మముగ బ్రహ్మవేత్త దెలిసికొనును. 'బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి' అను శ్రుత్యుక్తరీతిని హోమము చేయు బ్రహ్మవేత్తయు బ్రహ్మమే. బ్రహ్మస్వరూపమగు యజమానిచే బ్రహ్మస్వరూపమగు నగ్నియందు అనగా బ్రహ్మవేత్త హోమాధికరణమగు యగ్నిని బ్రహ్మముగ జూచును. ఆయగ్నియందు హోమము జేయబడిన హవనక్రియయు బ్రహ్మమేయని బ్రహ్మవేత్త దెలిసికొనును. సర్వము బ్రహ్మస్వరూపమేయని దెలిసికొనుటయే బ్రహ్మకర్మము. అట్టి బ్రహ్మకర్మమునందు స్థాపింపబడిన చిత్తముగల (అనగా సర్వము బ్రహ్మస్వరూపమే యని జూచునట్టి) బ్రహ్మవేత్తచే బ్రహ్మజ్ఞానఫలముగ పొందదగినది బ్రహ్మమే యగును.

ఇట్లు లోకహితమునిమిత్తము ప్రవృత్తమైన యధికారియగు బ్రహ్మవేత్తయొక్క సాధనములతోగూడిన నిఖిలకర్మలు బ్రహ్మవృత్తిచే బ్రహ్మమాత్రముగ లయమును పొందింపబడినవగుటచే శక్తిలేనివై యకర్మములేయై బంధముకొఱకు సమర్థములు కావని తేలిన యాశయము.

శాంకరభాష్యమ్ః—

మిత్యాది జ్ఞానస్య యజ్ఞత్వసంపాదనేఽన్యథా సర్వస్య బ్రహ్మత్వేఽర్పణాదీనా మేవ విశేషతో బ్రహ్మత్వాభిధాన మనర్థకం స్యాత్ ।

(7) యేత్వర్పణాదిషు ప్రతిమాయాం విష్ణుదృష్టివ ద్బ్రహ్మదృష్టిః క్షిప్యతే నామాదిష్వివ చేతి బ్రువతే, న తేషాం బ్రహ్మవిద్యోక్తేహ వివక్షితా స్యా దర్పణాదివిషయత్వా ద్జ్ఞానస్య। నచ దృష్టిసంపాదనజ్ఞానేన మోక్షఫలం ప్రాప్యతే, "బ్రహ్మైవ తేన గన్తవ్యం" ఇతి చోచ్యతే। విరుద్ధం చ సమ్యగ్దర్శన మన్తరేణ మోక్షఫలం ప్రాప్యత ఇతి ।

శాంకరభాష్యతత్త్వబోధినిః—

ప్రారంభింపఁబడెను. అట్లు గానిచో యర్పణాదులయందు బ్రహ్మదృష్టియనునది సత్యమే యయ్యెడిని. మరియు "బ్రహ్మార్పణం" అను మంత్రము జ్ఞానమునకు యజ్ఞత్వసంపాదనయందే సమర్థ మగుచున్నది. అట్లు కానిచో ప్రపంచమంతయు బ్రహ్మస్వరూపమైయుండ విశేషముగ నర్పణాదులకే బ్రహ్మత్వమును జెప్పుట యనర్థకమయ్యెడిని (కాన యజ్ఞాంగములగు నర్పణాదులకే బ్రహ్మస్వరూపత్వమును జెప్పుటచే నీ ప్రకరణము జ్ఞానమునకు యజ్ఞత్వసంపాదనద్వారమున జ్ఞానస్తుతినిమిత్తమే యని నిర్ధారింపవలయును. కాని యర్పణాదులయందు బ్రహ్మదృష్టి విధాయకము కానేరదని గ్రహింపనగును.

(7) అర్పణాదులయందు బ్రహ్మదృష్టిని చేయువారలకు కూడ నిచట బ్రహ్మజ్ఞానమే వివక్షితము. కాన మతభేద మేమియు లేదని శంకింపవలదు. ఎట్లు నామాదికము బ్రహ్మదృష్టిచేతను ప్రతిమాదికము విష్ణుదృష్టిచేతను ఉపాస్యమో అట్లే యర్పణాదికమునందు బ్రహ్మదృష్టి నుంచవలె నని చెప్పువారికి నీస్థలమున బ్రహ్మవిద్య వివక్షితము కాదు. ఎందువలననిన? అర్పణాదికమునందు బ్రహ్మదృష్టినుంచినచో నాజ్ఞాన మర్పణాదివిషయకమగుటచే ప్రధానముగ జేయునర్పణాదికమే యగును. కాన బ్రహ్మవిద్య వివక్షితము కాదు. మరియు "బ్రహ్మైవ తేన గన్తవ్యం" అని యిట్టిజ్ఞానము కలవారికి మోక్షప్రాప్తిచెప్పఁబడుచున్నది. అర్పణాదులయందు బ్రహ్మదృష్టి సంపాదనమాత్రముచే మోక్షఫలము పొందబడదు. అట్లు కాక నిట్టి దృష్టిసంపాదనచే కూడ మోక్షము ప్రాప్తించుననిన సమ్యగ్దర్శనము లేనిదే మోక్షము ప్రాప్తించుననుట విరుద్ధము.

ఈచెప్పుటచే చలనాత్మకమగు ప్రవృత్తి నిరోధించుటకు శక్యము కానందున యెల్లపుడు విద్వాంసుడు గూడ యేదోయొక కర్మయందు ప్రవర్తింపవలసియుండ యితరకర్మల నాచరింపక వైదికకర్మలయందు ప్రవర్తించుట యలంకారముకొఱకు, మనస్సంతోషముకొఱకు, లోకహితముకొఱకు, అంతతః బంధములేకుండుటకు అగుచున్నది. గాన సత్పురుషులగు బ్రహ్మవేత్తలు బ్రహ్మదృష్టిచే వైదికకర్మలయందు ప్రవర్తింపదగినదని సూచింపబడెను.

పరమార్థప్రపః— ఉపక్రాంతమైన జ్ఞానరూపవిషయమును "బ్రహ్మార్పణం" అనుశ్లోకముచే నుపసంహరించుచుండెను. చిత్తసంబంధమగు దానసంకల్ప మర్పణ మనిపించుకొనును. అట్టియర్పణము బ్రహ్మరూప

శాంకరభాష్యమ్—

(౪) ప్రకృతవిరోధ శ్చ। సమ్యగ్దర్శనం చ ప్రకృతం "కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" (గీ-4-18) ఇత్యతారంభేచ సమ్యగ్దర్శనం తస్యైవోపసంహారాత్। "శ్రేయా న్ద్రవ్యమయా ద్యజ్ఞా జ్జ్ఞానయజ్ఞః" (గీ-4-33) "జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిం" (గీ-4-39) ఇత్యాదినా సమ్యగ్దర్శనస్తుతి మేవ కుర్వ న్నుపక్షీణోఽధ్యాయః। తత్రాకస్మా దర్పణాదౌ బ్రహ్మదృష్టి రప్రకరణే ప్రతిమాయా మివ విష్ణుదృష్టి రుచ్యత ఇత్యనుపపన్నం। తస్మా ద్యథావ్యాఖ్యాతార్థ ఏవాయం శ్లోకః। ||౨౪||

శాంకరభాష్యతత్త్వబోధిని—

(౪) అర్పణాదులయందు బ్రహ్మదృష్టివిధానబలముచే మోక్షము ప్రాప్తించుననుటయు ప్రకృతవిరుద్ధమే. "కర్మణ్యకర్మ యః పశ్యేత్" అనుస్థలమునందును అంతమునందును సమ్యగ్దర్శనముతోనే యుపసంహరించుటవలనను సమ్యగ్దర్శనమే ప్రకృతము. మరియు, "శ్రేయాన్ద్రవ్యమయా ద్యజ్ఞా జ్జ్ఞానయజ్ఞః; జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తిం" అనునవి మొదలగు గీతావాక్యములచే సమ్యగ్దర్శనస్తుతిని చేయుచునే యీ యధ్యాయము సమాప్తిని పొందెను. ఇట్లీయధ్యాయము జ్ఞానప్రకరణమై యుండ నకస్మాత్తుగ ప్రతిమయందు విష్ణుదృష్టివలె నర్పణాదులయందు బ్రహ్మదృష్టి చెప్పబడుచున్నదని యప్రకరణమున చెప్పుట యుపపన్నము కాదు. కాన ప్రకృతమునకు విరోధము. అందువలన నీ శ్లోకము మాచే వ్యాఖ్యానింపబడిన యర్థమే కలది ||౨౪||

మగుటచే బ్రహ్మమే యగును. సమిత్తులు, తిలలు, ఆజ్యము మొదలగు హవిస్సులు విరాడ్బ్రహ్మముయొక్క వ్యష్టిరూపమగుటచే బ్రహ్మమే. అగ్నియు వైశ్వానరాపరపర్యాయమగు బ్రహ్మమే, అట్టియగ్నియందు యేపురుషుఁడు హోమముచేయునో అట్టిపురుషుఁడు బ్రహ్మమే. అని దెలిసికొని యెవనిచే కర్మచేయబడునో అట్టి బ్రహ్మార్పణమనెడి బ్రహ్మకర్మయందుంచబడిన చిత్తైకాగ్ర్యము కలవానిచే పొందదగినది బ్రహ్మమే.

నీలకంఠీయము:— ఏకారణమువలన విద్వాంసుల కర్మలు నశించును? అనునాశంకను "బ్రహ్మార్పణం" అనుశ్లోకముచే తొలిగించుచుండెను. విద్వాంసులు సవికల్పకసమాధియందు నిఖిలప్రపంచమును ప్రత్యగాత్మశక్తిచే నిర్మింపఁబడినదానినిగ దెలిసికొనెదరు. ఈ విషయమునే, "కిం కారణం" (ఈ జగత్తు జన్మించుటయందు కారణమేది?) అని యుపక్రమించి "కాలః స్వభావః" కాలము కారణము, స్వభావము కారణము అని లోకదృష్టిచే కాలాదులను కారణములుగ చెప్పి కారణమును నిర్ణయించి "తే ధ్యానయోగానుగతా అపశ్యన్దేవాత్మశక్తిం స్వగుణైర్నిగూఢామ్" (జ్ఞానులు ధ్యానయోగమునుపొందినవారై తనగుణములచే నిగూఢమగు నాత్మశక్తిని జగత్కారణముగ దెలిసికొనిరి.) అనుశ్రుతియు జ్ఞానులు సవికల్పకసమాధిచే పరమాత్మశక్తియే జగత్కారణమని దెలిసికొనిరని బోధించుచున్నది. కాన సవికల్పకసమాధిచే సర్వము బ్రహ్మమునందు కల్పితమని దెలిసికొనెడివిద్వాంసుల కేది యర్పణసాధనమో అట్టి జుహూ (యజ్ఞమునందుపయోగించుపాత్ర) మంత్రాదికము బ్రహ్మస్వరూపమే, కర్మయందు యివ్వదగిన హవిస్సుయు బ్రహ్మస్వరూపమే, ఏది హుతమో అనగా హవనక్రియచే నర్పితమగు దేవబ్రాహ్మణాదికము బ్రహ్మస్వరూపమే. ఏది యగ్నియందు హుతమో అదియు బ్రహ్మమునందే హుతము, (ఇట "బ్రహ్మణి" అనుపదమధ్యాహార్యము) ఏది యజమానిచే హోమముచేయబడునో

గీ॥ దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే ।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి ॥ ॥౨౫॥

పదవిభాగము:— దైవం-ఏవ-అపరే-యజ్ఞం-యోగినః-పర్యుపాసతే-బ్రహ్మాగ్నౌ-అపరే-యజ్ఞం-యజ్ఞేన-ఏవ-ఉపజుహ్వతి. ॥౨౫॥

ప్రతిపదార్థము:— అపరే=కొందరగు; యోగినః=కర్మానుష్ఠానపరులు; దైవం=ఇంద్రాదిదేవతా సంబంధమగు; యజ్ఞమేవ=యజ్ఞమునే; పర్యుపాసతే=చేయుచుండిరి. అపరే=మరికొందరగు బ్రహ్మవేత్తలు; బ్రహ్మాగ్నౌ=బ్రహ్మ మనెడి యగ్నిహోత్రమునందు; యజ్ఞేనైవ=అశనాది సర్వసంసారధర్మవర్జిత మగు నాత్మస్వరూపము చేతనే; యజ్ఞం=అధ్యస్త సర్వోపాధికమగు నాత్మరూపమగు యాహుతిని; ఉపజుహ్వతి=హోమము చేయుచుండిరి. ॥౨౫॥

శాంకరభాష్యమ్—

తత్రాధునా సమ్యగ్దర్శనస్య యజ్ఞత్వం సమ్పాద్య తత్ స్తుత్యర్థ మన్యేపి యజ్ఞా ఉపక్షిప్యన్తే దైవ మేవేత్యాదినా। దైవ మేవ దేవా ఇజ్యన్తే యేన యజ్ఞేనాసౌ దైవో యజ్ఞ

శాంకరభాష్యతత్త్వబోధిని—

“బ్రహ్మార్పణం” అను శ్లోకముచే జ్ఞానమునకు యజ్ఞత్వము సంపాదింపఁబడెను. అది యట్లుండ యిపుడు తిరిగి సమ్యగ్దర్శనమునకు యజ్ఞత్వమును సంపాదించి జ్ఞానముయొక్క స్తుతి నిమిత్త మితర మగు యజ్ఞములు చెప్పఁబడుచుండెను.

అదియు బ్రహ్మముచేతనే హుతము, ఏది యాకర్మచే పొందదగినఫలమో అట్టిఫలము బ్రహ్మస్వరూపమే. విస్తారముగ చెప్పుటచే నేమిలాభము ? విద్వాంసు డేయే కర్మ నాచరించునో అనగా పరుండుట, కూర్చుండుట మొదలగు నిఖిలము బ్రహ్మస్వరూపమే. అందు కారణమేమన ? సవికల్పకసమాధిచే గలిగిన నాత్మసాక్షాత్కారమే యని గ్రహింపనగును. కాన విద్వాంసునకు సకలము బ్రహ్మస్వరూపమే యగుటవలన బ్రహ్మము ప్రత్యక్స్వరూపమే కాన నివ్వదగినఫలము లేమింజేసి కట్టెలయందుంచబడిన యగ్ని కట్టెలను భస్మముగనొనరించిన పిదప దహింపఁజేయదగినవస్తువులేనందున స్వయముగ నశించినట్లు కర్మలు నశించునని యాశయము.

కొందరు కర్మలయందు, తదంగములయందు నామాదులయందు బ్రహ్మదృష్టివలె నిట బ్రహ్మదృష్టి విధింపబడెనని (అనగా నీశ్లోకమునందు కర్మ తదంగములను బ్రహ్మదృష్టిచే నుపాసించుట విధింపబడెనని) వ్యాఖ్యానించిరి. ఇట బ్రహ్మవిద్య ప్రకృతముకాన నుపక్రమాదులకు విరుద్ధమగుటఁజేసి నిట్టివ్యాఖ్యాన మసంగతమని భాష్యమునందే యావ్యాఖ్యానము నిరసింపబడెను.

ఈశ్లోకమున కర్మయందు, కర్మాంగములయందు యథార్థమగు బ్రహ్మదృష్టి చెప్పఁబడెను. అట్టి బ్రహ్మదృష్టి స్థితప్రజ్ఞలక్షణములెట్లుజ్ఞానులకనుష్ఠేయములో అట్లే యజ్ఞానులకనుష్ఠేయమని ఫలముచే సిద్ధించుచున్నది. ॥౨౪॥

—♦ ౪వ అధ్యాయము—౨౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— సమ్యగ్దర్శనము యజ్ఞస్వరూప మగుటచే నద్దాని “బ్రహ్మార్పణం” అను శ్లోకముచే స్తుతిజేసి తిరిగి జ్ఞానయజ్ఞముయొక్క స్తుతినిమిత్తమే యితరయజ్ఞములను “దైవమేవా” అను శ్లో

శాంకరభాష్యమ్:—

స్త మేవాపరే యజ్ఞం యోగినః కర్మిణః పర్యుపాసతే కుర్వంతీ త్యర్థః। బ్రహ్మాగ్నౌ "సత్యం జ్ఞాన మనన్తంబ్రహ్మ" (తై-2-1-) "విజ్ఞాన మానన్దం బ్రహ్మ" (బృ-3-9-28) "యత్సాక్షా దపరోక్షా ద్బ్రహ్మ। య ఆత్మా సర్వాన్తరః" (బృ3-4-1) ఇత్యాది వచనోక్త మశనా

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శ్రేయస్సాధనములగు సర్వమునకు ముఖ్యవృత్తిచే గాని, గౌణవృత్తిచే కాని యజ్ఞత్వమును చూపించుచు మొట్టమొదట "దైవమేవ" అనుశ్లోకముచే రెండుయజ్ఞములను చూపించుచుండెను.

యేనిచే ఇంద్రాది దేవతలగూర్చి యాగము చేయుదురో అవి దైవములనఁబడును. (అట్టి యజ్ఞములు పంచపాకయజ్ఞములు, సోమము, అతిరాత్రము, అప్తోర్యామము, వాజపేయము, బృహస్పతిసవనము అనునవి మొదలగు యజ్ఞములు) అట్టి యజ్ఞమును కొందరు కర్మనిష్ఠాపరు

స్తుతించుచుండెను. కొందరు కర్మాచరణతత్పరులు జ్ఞానయజ్ఞము నాచరింపక యింద్రాగ్న్యాదిదేవతల నుద్దేశించి దర్శపూర్ణమాసజ్యోతిష్టోమాది యజ్ఞములనే చేయుచుండిరి. ఇట్లు కర్మయజ్ఞమును జెప్పి యంతఃకరణపరిశుద్ధిద్వారమున కర్మయజ్ఞఫలమగు జ్ఞానయజ్ఞమును "బ్రహ్మాగ్నౌ" అను సుత్తరార్థముచే జెప్పుచుండెను. సత్యజ్ఞానానంద రూపము, నిరస్తసమస్తవిశేషము, తత్పదార్థము నగు బ్రహ్మ మనెడి యజ్ఞమునందు త్వంపదార్థమగు ప్రత్యగాత్మయనెడి *యజ్ఞముచేతను హోమము నాచరించుచుండిరి. అనగా "యజ్ఞేనైవ" అనుచోటనుండు తృతీయావిభక్తి 'ఇత్థంభూతలక్షణే తృతీయా' అను సూత్రముచే సంప్రాప్తము. ఏవకారము భేదాభేదములను వ్యావృత్తి చేయును (తొలగించును). అనగా త్వంపదార్థభేదముగనే పరమాత్మను దెలిసికొందురని యర్థము. "అపరే" అనగ కర్మలకంటె వేరగు బ్రహ్మదర్శులైన సంన్యాసు లని యర్థము. మున్ముందు జీవబ్రహ్మభేదజ్ఞానమును యజ్ఞముగ జెప్పి నద్దానిని స్తుతించుటకు జీవబ్రహ్మభేదయజ్ఞసాధనము లగు యజ్ఞములమధ్య "శ్రేయా న్ద్రవ్య మయాద్యజ్ఞాత్" అని జెప్పుచుండెను.

శంకరానందీయము:—పూర్వమునందు "బ్రహ్మార్పణం" అను శ్లోకముచే జుహూచమసాది పాత్రవిశేషాదులు బ్రహ్మస్వరూపములే యను జ్ఞానమునుయజ్ఞరూపముగ వర్ణించియట్టి జ్ఞానయజ్ఞము సాక్షాత్తు మోక్షసాధనమగుటచే దైవాదియజ్ఞములకంటె సర్వోత్తమ మని ప్రతిపాదించుటకు (చెప్పుటకు) మోక్షమునకు వ్యవహిత (దూర)ముగ సాధనములగు దైవాదియజ్ఞములను ముముక్షువులు స్వాధికారానుసారముగ చిత్తశుద్ధినిమిత్త మాచరింపవలయునని సూచించుటకున్ను 'దైవం' అను శ్లోకముచే కొన్ని దైవాదియజ్ఞములను జెప్పుచుండెను.

ఇంద్రాదిదేవతల నుద్దేశించి యాచరించు యజ్ఞములు దైవము అనఁబడును.. అట్టి శ్రౌతస్మార్తకర్మలను మోక్షకాములు కర్మయోగులు నగు గృహస్థులు యంతఃకరణశుద్ధినిమిత్త మాచరించుచుండిరి. వైదికమగు దైవయజ్ఞమే గృహస్థుల కాచరింపదగినదని సూచించి బ్రహ్మవేత్త లగు యతీశ్వరులకు ముక్తినిమిత్తము జ్ఞానయజ్ఞమే చేయుతగినదని జ్ఞానయజ్ఞమును మరియొకవిధమున "బ్రహ్మాగ్నౌ" అను సుత్తరార్థముచే వర్ణించుచుండెను.

గృహస్థులకంటె యితరులగు యతీశ్వరులు శ్రవణాదులచే దెలిసికొనిన యాత్మతత్త్వముకలవారై "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ। ఆనందో బ్రహ్మ। తదేత ద్బ్రహ్మాపూర్వ మనపరం" ఇత్యాది శ్రుతులచే ప్రసిద్ధము, నిరస్తాశేషవిశేషములు కలిగినట్టియు, సచ్చిదానందాత్మకము నగు పరబ్రహ్మ మవిద్యాతత్కార్యముల దహింపఁ

* యాస్కముని యజ్ఞశబ్దమును ఆత్మనామములయందు పఠించుటవలన నిచట యజ్ఞశబ్దమునకు ప్రత్యగాత్మ యర్థము జెప్పుట సమంజసమే.

శాంకరభాష్యమ్:—

యాది సర్వసంసారధర్మవర్జితం 'నేతి నే' (బృ-4-4-22) తీతి నిరస్తాశేషవిశేషం బ్రహ్మశబ్దే నోచ్యతే బ్రహ్మ చ త దగ్నిశ్చ స హోమాధికరణత్వవివక్షయా బ్రహ్మాగ్ని స్తస్మిన్ బ్రహ్మాగ్నా వపరేఽన్యే బ్రహ్మవిదో యజ్ఞం యజ్ఞశబ్దవాచ్య ఆత్మాఽఽత్మనామసు యజ్ఞశబ్దస్య పాఠా త్తమాత్మానం యజ్ఞం పరమార్థతః పరమేవ బ్రహ్మ సన్తం బుద్ధ్యాద్యుపాధి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లాచరించెదరు. అని యీశ్లోకపూర్వార్థమున కర్థము. "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, విజ్ఞాన మానన్దం బ్రహ్మ, య త్సాక్షాదపరోక్షా ద్బ్రహ్మ, య ఆత్మా సర్వాన్తరః" అనునవి మొదలగు శ్రుతులచే బోధింపఁబడునట్టి యశనాయాది సర్వసంసారధర్మశూన్యుడు, 'నేతి నేతి' వాక్యములచే నిరస్తమగు నిశ్శేషవిశేషములు కల శుద్ధ బ్రహ్మమే 'బ్రహ్మాగ్నా' అను స్థలమునందు గల బ్రహ్మశబ్దముచే చెప్పఁబడును. అట్టి బ్రహ్మమునకు హోమాధికరణత్వము వివక్షచేయుటచే నాబ్రహ్మాగ్నియనఁబడును. అట్టి బ్రహ్మాగ్నియందు, (ఆత్మనామముల యందు పఠింపఁబడుటవలన యజ్ఞశబ్దవాచ్య మాత్మయగును. అట్టియాత్మ పరమార్థముగ

జేయుటవలనను సోపాధికాత్మ (జీవాత్మ) యనెడి యాహుతియొక్క ప్రక్షేపమున కాధార మగుటవలన నగ్ని యనఁబడును. పామరులచే "నేను భోక్తను" అని విషయోపభోగములచే యాగముచేయబడు సోపాధిక మగు జీవాత్మ యజ్ఞ మనఁబడును. అట్టి బ్రహ్మాగ్నియందు యజ్ఞరూప మగు జీవుని హోమము జేయుచుండిరి. వాస్తవికముగ నాత్మ నిర్విశేష మైనను అధ్యాసవలన బుద్ధ్యాద్యుక్త మగు నాత్మ (జీవాత్మ) ను యాహుతిని క్షేపణకాలమునందు నిర్విశేషాత్మస్వరూపముగ హోమము చేయుచుండిరి. "నేను బ్రహ్మనే" అని సోపాధికముగ గోచరించుచున్న అహంపదార్థమును వివేకవృత్తిచే నిర్విశేషబ్రహ్మముగ భావనచేసి (తలచి) బ్రహ్మాభిన్నముగ తనను యనుభవించుచున్నారు.

లేక యతీశ్వరులు "యజ్ఞం" సోపాధికమగు నాత్మ (జీవాత్మ) ను "యజ్ఞేన" "యజ్ఞో వై విష్ణుః" అను శ్రుతిబోధితమగు సోపాధిక మైన యీశ్వరస్వరూపముతో గూడ హోమముచేయుచుండిరి అనగా సోపాధికమగు నీశ్వరుని, సోపాధికమగు జీవుని, యీశ్వరోపాధియగు మాయను. జీవోపాధియగు నంతఃకరణమును తొలగించి తరంగబుద్బుదములను, వాటి నామరూపములను తొలగించి వాటియాధారమగు సముద్రముతో యభిన్నముగ చూచునట్లు యధిష్ఠానము, నిర్విశేష ము, తురీయము నగు బ్రహ్మముతో నభిన్నముగ చూచెదరు.

పరమార్థప్రపా:— "ఇజ్యతే యస్మిన్నితి యజ్ఞః" (దేనియందు యాగము చేయబడునో అదియజ్ఞమని పించుకొనును.) అను వ్యుత్పత్తిచే యజ్ఞముగ నుపపాదితము బ్రహ్మానుభవరూపమగు జ్ఞానము. ఈ జ్ఞానయజ్ఞమే సర్వయజ్ఞములకంటె నుత్కృష్టము. అని బోధించుటకు అట్టే యాయజ్ఞ మధికారిభేదముచే ననేకవిధములని చెప్పుటకు "దైవమేవ" అనుశ్లోకము మొదలుకొని యెనిమిదిశ్లోకములచే పన్నెండుయజ్ఞములను చెప్పుచుండెను.

కర్మకుశలులగుకొందఱు యింద్రసూర్యాదిదేవతలనుద్దేశించి యాగముచేయు యజ్ఞములను దేవతలయందు బ్రహ్మబుద్ధిలేనివారై యుపాసించుచుండిరి. జ్ఞానయోగులైతే జ్ఞానయజ్ఞముచే కర్మరూపమగు యజ్ఞమును చేసి బ్రహ్మస్వరూపమగు యగ్నియందు యట్టికర్మను లయమునుపొందించుచుండిరని యర్థము.

నీలకంఠీయము:— ఇట్లు సమ్యగ్దర్శనమునకు యజ్ఞత్వమును సంపాదించి జ్ఞానయజ్ఞస్తుతినిమిత్తము మఱికొన్ని యజ్ఞములను "దైవమేవాపరే" అనుశ్లోకము మొదలుకొని చెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

సంయుక్త మధ్యస్త సర్వోపాధిధర్మకమాహుతిరూపం యజ్ఞేనైవాత్మనైవాత్మనైవోక్తలక్షణే నోపజుహ్వతి ప్రక్షిపన్తి। సోపాధికస్యాత్మనో నిరుపాధికేన పరబ్రహ్మస్వరూపేణైవ యద్దర్శనం స తస్మిన్ హోమస్తం కుర్వన్తి బ్రహ్మాత్మైకత్వదర్శననిష్ఠాస్సంన్యాసిన ఇత్యర్థః। సోయం సమ్యగ్దర్శనలక్షణో యజ్ఞో దైవయజ్ఞాదిషు యజ్ఞేషూపక్షిప్యతే "బ్రహ్మార్పణ" మిత్యాదిశ్లోకైః। "శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాజ్జ్ఞానయజ్ఞః పరన్తప।" ఇత్యాదినా స్తుత్యర్థమ్। ॥౨౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పరబ్రహ్మస్వరూపమైనను బుద్ధ్యాద్యుపాధి సంయుక్తమై తనయం దధ్యస్త సర్వోపాధిధర్మములు గలదై యాహుతిరూపమగుచున్నది. అట్టి బుద్ధ్యాద్యుపాధిసంయుక్తమగు నాత్మను నిరస్త సర్వోపాధులు కల యాత్మస్వరూపముచేతనే బ్రహ్మవేత్తలు హోమము జేయుచుండిరి. (ఇట హోమమనగ బుధ్యాద్యుపాధులతోఁగూడిన యాత్మను నిరుపాధికమగు పరబ్రహ్మస్వరూపముగ తెలిసికొనుటచే బ్రహ్మాగ్నియందు హోమమనఁబడును.) అట్టి హోమమును జీవబ్రహ్మైక్యదర్శననిష్ఠులగు సంన్యాసులు జేయుచుండిరని యీ శ్లోకోత్తరార్థముయొక్క యర్థము. ఇట్టి సమ్యగ్దర్శనరూపమగు యజ్ఞము "శ్రేయాన్ ద్రవ్యమయాద్యజ్ఞాత్ జ్ఞానయజ్ఞః పరన్తప" అను దానిచే జేయబడు జ్ఞానస్తుతినిమిత్తము "బ్రహ్మార్పణం" ఇత్యాదిశ్లోకములచే దైవయజ్ఞాది రూప యజ్ఞములయందుంచబడుచున్నది. (దైవయజ్ఞాదులలో జ్ఞానయజ్ఞముకూడ పరిగణింపబడుచున్నది.) ॥౨౫॥

కర్మయోగులు దేవతలే ప్రధానము గాగల దర్శపూర్ణమాసాదియజ్ఞములనే సేవించుచుండిరి. మఱియొక యజ్ఞమును వారు సేవించరు. మరికొందరు సత్యజ్ఞానానందాత్మకము, అఖండైకరసము నగువస్తువే దెలియబడినదై సర్వకర్మలను దహించునదగుటవలన నగ్నివంటిదగును. కాన అట్టిబ్రహ్మమే యగ్నియనఁబడును. అట్టి బ్రహ్మాగ్నియందు 'యజ్ఞం' సోపాధికమగు జీవరూపమును "యజ్ఞేనైవ" నిరుపాధికమగు నాత్మస్వరూపముచే "ఉపజుహ్వతి" మహాకాశమునందు ఘటాకాశమువలె నుపాధియగు లింగదేహప్రహాణ (నాశ) పురస్సరముగ అయింపఁజేసుకొనెదరు. (అనగా ఆకాశమొకటియైనను ఘటమనెడి యుపాధి భేదమువలన ఘటాకాశమనియు, మహాకాశమనియు రెండువిధముల వ్యవహరించబడుచుండెను. అట్లే యాత్మయొకటియైనను అంతఃకరణరూపమగు నుపాధిభేదమువలన జీవపరశబ్దములచే వ్యవహరించబడుచుండెను. ఘటమనెడి యుపాధి నశించినచో మహాకాశమే యని వ్యవహరింపబడినట్లు అంతఃకరణమనెడి యుపాధి యవిద్యాపరిణామియగుటవలన నది జ్ఞానమనెడి విద్యకు విరోధి. అట్టి యవిద్య తనకువిరోధియగు విద్య జనించినతోడనే ప్రదీపమువలన తిమిరము నశించునటుల నశించును. విద్యవలన కారణమగు నవిద్య నశించినతోడనే యవిద్యాపరిణామియగు నంతఃకరణముకూడ నశించును. అంతఃకరణము నశించినవెంటనే నంతఃకరణమువలన జనించి యంతఃకరణ మాశ్రయముగాగలవిద్యయు కట్టెలను దగులబెట్టునట్టి యగ్ని యాశ్రయములేమింజేసి స్వయముగా శాంతించినట్లు స్వయముగనే నశించును. మహాకాశభేదకమగు ఘటాద్యుపాధులు లేనితరి ఘటాకాశము, మహాకాశమని వ్యవహారద్వయ మెట్లుసంభవింపదో అట్లే యాత్మకు జీవుడు, పరుడుఅనెడి భేదవ్యవహారద్వయమునకు కారణమగు నంతఃకరణరూపమగు నుపాధి విద్యవలన నశించినతరి జీవ, పర భేదవ్యవహారములు సంభవించవు అనియాశయము) ఇదియే జ్ఞానయజ్ఞము. ఈ జ్ఞానయజ్ఞమే ముఖ్యమైనది. ॥౨౫॥

గీ॥ శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీ న్విషయా నన్య ఇన్ద్రియాగ్నిషు జుహ్వతి ॥ ॥౨౬॥

పదవిభాగము:— శ్రోత్రాదీని–ఇన్ద్రియాణి–అన్యే–సంయమాగ్నిషు–జుహ్వతి–శబ్దాదీన్–విషయాన్–అన్యే–ఇన్ద్రియాగ్నిషు–జుహ్వతి ॥ ॥౨౬॥

ప్రతిపదార్థము:— అన్యే=కొందరు యోగులు; శ్రోత్రాదీని=శ్రోత్రము మొదలగు; ఇంద్రియాణి=ఇంద్రియములను; సంయమాగ్నిషు=సంయమములనెడి యగ్నులయందు; జుహ్వతి=హోమము చేయుచుండిరి. అన్యే=మరికొందరు; శబ్దాదీన్=శబ్దము మొదలగు; విషయాన్=విషయములను; ఇంద్రియాగ్నిషు=ఇంద్రియములనెడి యగ్నులయందు; జుహ్వతి=హోమము జేయుచుండిరి. ॥౨౬॥

శాంకరభాష్యమ్:—

శ్రోత్రాదీ నీతి । శ్రోత్రాదీ నీన్ద్రియా ణ్యన్యే యోగిన స్సంయమాగ్నిషు ప్రతీన్ద్రియం సంయమో భిద్యత ఇతి బహువచనం । సంయమాఏవాగ్నయ స్తేషు జుహ్వతీన్ద్రియసంయమ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కొందరు యోగులు త్వ క్చక్షు శ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనెడి యింద్రియములను సంయమము లనెడి యగ్నులయందు హోమము చేయుచుండిరి. (అనగా ఇంద్రియములను విషయము లనుండి మరల్చుటయె యింద్రియసంయమము; అట్టిసంయమమును జేయుచుండిరని యర్థము.) ఇట "సంయమమొకటియే యైయుండ "సంయమాగ్నిషు" అని బహువచన మెందుకు ప్రయోగింపబడెననిన ? ప్రతీంద్రియముల సంయమము యింద్రియభేదము ననుసరించి భిన్నమగుటచే ప్రతీంద్రియసంయమము భిన్నమే యగునని "సంయమాగ్నిషు" అను చోట బహువచనము ప్రయోగింపఁబడెను.

—◆ ౪వ అధ్యాయము—౨౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ◆—

మధుసూదనసరస్వతీయము:—పూర్వశ్లోకమునందు ముఖ్యము, గౌణములగు రెండురకముల యజ్ఞములు చెప్పఁబడెను. శ్రేయస్సాధనమగు నిఖిలవైదికకర్మలను యజ్ఞములుగ సంపాదించుచుండెను (బోధించుచుండెను).

కొందఱు త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లనెడి జ్ఞానేంద్రియములను శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములనుండి మరలించి ప్రత్యాహారపరులై ధారణాధ్యాన సమాధిరూపమగు సంయమమనెడి యగ్నియందు హోమము చేయుచుండిరి. ఈ విషయమునే భగవత్పతంజలి తనచే రచింపఁబడిన యోగసూత్రములయందు "త్రయమేకత్రసంయమః" అని చెప్పుచుండెను. అనగా హృత్పుండరీకమునందు మనస్సును చిరకాలము స్థాపనచేయుట ధారణయని యనఁబడును. ఒకచోట స్థాపనచేయబడిన చిత్తమునకు భగవదాకారవృత్తిప్రవాహము మధ్యమధ్యను యితరాకారప్రత్యయవ్యవహిత మైనపుడు ధ్యాన మనఁబడును. అన్నివిధములచేతను మధ్యమధ్య యితరప్రత్యయ (జ్ఞాన) శూన్యమైన భగవదాకారప్రత్యయములప్రవాహము సమాధి యనుపించుకొనును. అట్టి సమాధి చిత్తభూమిభేదముచే సంప్రజ్ఞాత మని, అసంప్రజ్ఞాత మనియు రెండువిధములు. చిత్తమునకు క్షిప్తము, మూఢము, విక్షిప్తము, ఏకాగ్రము, నిరుద్ధము యని అయిదుభూములు. అందున చిత్తము రాగద్వేషవశమున విషయములయం దభినివిష్టమైనపుడు క్షిప్తము. తంత్రాది (అలసతతో) గ్రస్తమైనపుడు మూఢము. ఎల్లపుడు విషయాసక్తమైనను యోగా

శాంకరభాష్యమ్.—

మేవ కుర్వన్తీత్యర్థః । శబ్దాదీ న్విషయా నన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి ఇన్ద్రియా ణ్యేవాగ్నయ. స్తేష్విన్ద్రియాగ్నిషు జుహ్వతి శ్రోత్రాదిభి రవిరుద్ధవిషయగ్రహణం హోమం మన్యన్తే । ।౨౬।

శాంకరభాష్యతత్త్వబోధినీ.—

కొందరు యోగులు శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములను యింద్రియము లనెడి యగ్నులయందుహోమము చేయుచుండిరి. (అనగా- రాగద్వేషములను విడచి నిషిద్ధములగు విషయములను పరిత్యజించి సంప్రాప్తమగు విషయముల శ్రోత్రాదులచే ననుభవించుటయే యింద్రియాగ్నులయందు విషయములహోమము అని తలచెదరు.) ॥౨౬॥

---

నొకప్పుడు ధ్యాననిష్ఠమైనపుడు క్షిప్తముకంటె వేఱగుటవలన విక్షిప్త మనఁబడును. అందు క్షిప్తము, మూఢము సమాధులా ? అను యాశంకయైన లేదు. ఎందువలన ? క్షిప్తము రాగద్వేషాదివశమున విషయములయం దభినివిష్టము, మూఢము తంద్రాదిగ్రస్తము కనుకనే సమాధిశబ్దము నెన్నడా యవస్థలయందు వర్తింపదు చిత్తము విక్షిప్తమైయుండ కాదాచిత్కముగ సమాధి విక్షేపప్రధాన మగుటవలన యోగపక్షమునందు వర్తింపదు. అనగా యోగ మనఁబడదు. మరేమనిన ? తీవ్రమగు వాయువుచే విక్షిప్తమగు ప్రదీపమువలె స్వయముగనే నశించును. ఏకవిషయక ధారావాహికవృత్తి సమర్థము, సత్త్వోద్రేకముచే తమోగుణ కృతతంద్రాది అయము లేమింజేసి ఆత్మాకారమగు వృత్తి యేకాగ్రతయనెడి భూమిక. అ యేకాగ్రతయే రజోగుణకృత చాంచల్యరూప విక్షేపము లేమింజేసి ఏకవిషయకమై సత్త్వము శుద్ధమైనపుడు చిత్త మేకాగ్రమగును. ఈ భూమికయందు సంప్రజ్ఞాతసమాధి ప్రాప్తించును. అందు ధ్యేయాకారమగు వృత్తియు భాసించును. ఆవృత్తియొక్కయు నిరోధము ప్రాప్తించినపుడు చిత్తము నిరుద్ధమై యసంప్రజ్ఞాతసమాధి భూమి యనుపించుకొనును. ఈ విషయమునే “తస్యాఅపి నిరోధే సర్వవృత్తినిరోధా న్నిర్బీజ స్సమాధిః” అను సూత్రము బోధించుచున్నది. ఈ సమాధికే సర్వమునుండి విరక్తుడైనట్టియు, సమాధిఫలమగు సుఖము నపేక్షించనట్టి యోగికి దృఢభూమియై “ధర్మమేఘము” అని యనఁబడును. ఈ విషయమునే “ప్రసంఖ్యానేఽప్యకుసీదస్య సర్వథా వివేకఖ్యాతే ర్ధర్మమేఘ స్సమాధిః । తతః క్లేశకర్మనివృత్తిః” (సర్వసిద్ధులు కరస్థితములై లెక్కించుటకు వీలైయున్నను వాటి విషయమై యాసక్తి లేనట్టి యోగి వివేకముకలవా డగుటవలన వాని సమాధి ధర్మమేఘ మనఁబడును). అట్టి ధర్మమేఘభూమి నధిరోహించినవానికి క్లేశములు నివృత్తములగును. పై విధముగ సంయమము అనేకవిధములు గాన “అగ్నిషు” అని బహువచనమున ప్రయోగింపఁబడెను. ఈ సంయమాగ్నులయం దింద్రియములను హోమముచేయుదురు. (అనగా ధారణాధ్యాన సమాధులు సిద్ధించుటకై యన్నియింద్రియములను వాటివాటి విషయములనుండి మరలింపవలెనని యర్థము). “స్వస్వవిషయ సంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇవేంద్రియాణాం ప్రత్యాహారః” (ఇంద్రియములకు స్వస్వవిషయముల సంబంధము లేనపుడట్టి ప్రత్యాహారము చిత్తస్వరూపానుకరణమువలె యుండును.) అను వచనానుసారము విషయ నిగృహీతము లగు యింద్రియములు చిత్తస్వరూపములే యగును. అట్లగుటచే చిత్తము విక్షేపము లేమింజేసి ధారణాదికమును నిర్వహించును. ఈ వివరణచే ప్రత్యాహార ధారణాధ్యాన సమాధులను యోగాంగచతుష్టయము నిరూపింపఁబడెను. ఈ విధముగ సమాధ్యవస్థయందు సర్వేంద్రియ వృత్తినిరోధము యజ్ఞముగ జెప్పఁబడెను. ఇక వ్యుత్థానావస్థయందు రాగద్వేషరహితముగ నగు విషయభోగమునుగూడ మరియొక యజ్ఞముగ నిరూపించుచుండెను. “శబ్దాదీ న్విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి” (వ్యుత్థితులగు మరికొందరు నితరసాధారణములు నవిరుద్ధములు నగు విషయములను శ్రోత్రాదులచే నిస్పృహతో గ్రహించుచుండిరి). ఇదియే వారికిగల హోమము.

శంకరానందీయము:— ద్వైవిధముగ బ్రహ్మవేత్తలచేయదగు జ్ఞానయజ్ఞమును జెప్పి యబ్రహ్మవేత్తలు జేయదగు యజ్ఞాంతరముల నీశ్లోకమున జెప్పుచున్నాడు:— "అన్యే" ఇంతకుపూర్వము జెప్పబడినవారి కంటె నితరులగు నబ్రహ్మవేత్తలగు నైష్ఠికబ్రహ్మచార్యాది ముముక్షువులు– "శ్రోత్రాదీ నీంద్రియాణి సంయమాగ్నిషు జుహ్వతి" శ్రోత్రాదీంద్రియములను, వాగాదీంద్రియములను సంయమములనెడి (అయా ఇంద్రియముల విషయముల వాటివాటి విషయమునుండి మరలించి వాటివాటిస్థానమునందె నిగ్రహించుట సంయమమనబడును. ఇంద్రియములనేకముగాన సంయమములనేకములని జెప్పబడెను) యగ్నులయందు హోమముచేయుచుండిరి. (ఇంద్రియనిగ్రహరూపమగు యజ్ఞమునుచేయుచుండిరని యర్థము.) "అన్యే" వీరికంటెనితరులు, ముముక్షువులునగు గృహస్థులు స్వధర్మనిష్ఠులై యనిషిద్ధములగు శబ్దాదివిషయములను యోగ్యకాలమున 'ఇంద్రియాగ్నిషు జుహ్వతి' ఇంద్రియములనెడి యగ్నులయందు హోమముచేయుచుండిరి విషయానుభవనియమమే వీరికి యజ్ఞమగునని యర్థము.

నీలకంఠీయము:— మఱికొందరు– సంయమములనెడి యగ్నులయందు శ్రోత్రాదీంద్రియములను హోమము జేసెదరు. ఇట సంశయము లనేకవిషయములు కలుగుటవలనను వేరు వేరు ఫలములు కలుగుటవలనను అనేకములని జెప్పుటకు "సంయమాగ్నిషు" అని బహువచనము ప్రయోగింపబడెను. ఈ విషయమే "భువన జ్ఞానంసూర్యసంయమాత్, చంద్రేతారావ్యూహజ్ఞానం కంఠకూపే క్షుత్పిపాసా నివృత్తిః" సూర్యసంయమము వలన భువనజ్ఞానము కలుగును. చంద్రునియందు తారావ్యూహజ్ఞానమువలన కంఠకూపమునందు క్షుత్పిపాసలు నివర్తించును. అని యోగసూత్రకారులచే చెప్పబడెను. అట్టిసంయమములే— యింద్రియములనెడి యింధన (కట్టెల) సంహారహేతువులగుటవలన నగ్నులనంబడును. అట్టి సంయమాగ్నులయందు శ్రోత్రాదీంద్రియములను 'జుహ్వతి' హోమముజేయుచుండిరి. అందుకూడ శ్రోత్రేంద్రియము ననాహతధ్వనియందు లెస్సగ నియమమొనరించి హంసోపనిషత్తునందు చెప్పిన విధమున ఘంటానాదము మొదలగు యుపనాదము లనుభవించుచుండెదరు. అనాహతధ్వనియందు చిత్తము నరికట్టినవో నట్టి సమయమున ఘంటానాదాది దశవిధశబ్దములకంటె వేరగు శబ్దములు గ్రహింపబడవు. ఇదియే శ్రోత్రేంద్రియమునకు సంయమాగ్నియందు హోమమని దెలియనగును. ఇట్లే యితరేంద్రియములను గూడ సంయమాగ్నియందు హోమమును దెలిసికొనవలెను. ఇట్లు సంయమాగ్నులయందు ఇంద్రియముల హోమమొనరించిన తద్ద్వారమున నిష్కలమగు తత్త్వమును పొందెదరు.

మరికొందరు శబ్దస్పర్శరూపరసగంధాదివిషయముల నింద్రియాగ్నులయందే హోమముచేసెదరు. అనగా శబ్దాదివిషయములనుండి శ్రోత్రాదీంద్రియముల నరికట్టిన (శ్రోత్రాదీంద్రియములు విషయములయందు ప్రవేశింపకుండగ నింద్రియముల నరికట్టినవారు) కాని వీరు ధారణాధ్యానసమాధ్యాత్మకమగు మనస్సుయొక్క సంయమమును– మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత. విశుద్ధ, సహస్రారాత్మకమగు షట్చక్రములలో నేదోయొక చక్రమునందు చేయుట కశక్తులు. తగులబెట్టబడిన కట్టెలుగల యగ్ని విషయవియోగమువలన స్వయముగ శాంతించినట్లు శబ్దాదివిషయవియోగమువలన మనస్సుతోగూడిన నింద్రియములు స్వయముగ విలీనమగును. అట్టి యింద్రియములయందు యెవరికి సమాధిబుద్ధికలుగునో వారలు యింద్రియములయందు విషయములనే యుపసంహరించినవార లగుదురు. కాని యింద్రియాదులను మనస్సు మొదలగువాటియం దుపసంహరించినవారు కారు. ఇట్టియింద్రియచింతకులనుద్దేశించి వాయుపీయమునందు "దశమన్వంతరాణి తిష్ఠంతీంద్రియచింతకాః" విషయముల యందు యింద్రియములు పోకుండగ నరికట్టుటయే సమాధియనుకొనెడి యింద్రియచింతకు లీలోకమునందు పదిమన్వంతరములు విగతజ్వరులై యుండెదరని చెప్పబడెను. ॥౨౬॥

గీ॥ సర్వాణీన్ద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥ ॥౨౭॥

పదవిభాగము:— సర్వాణి-ఇన్ద్రియకర్మాణి-ప్రాణకర్మాణి-చ-అపరే-ఆత్మసంయమయోగాగ్నౌ-జుహ్వతి-జ్ఞానదీపితే ॥ ॥౨౭॥

ప్రతిపదార్థము:— అపరే=మరికొందరు; సర్వాణి=సమస్తమైన; ఇంద్రియకర్మాణి-ఇంద్రియ=త్వక్చక్షు శ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములయొక్క; కర్మాణి=శ్రవణస్పార్శనచాక్షుషరాసనాది రూపకర్మలను; ప్రాణకర్మాణి చ-ప్రాణ=ఆధ్యాత్మిక వాయువుయొక్క, కర్మాణి చ=ఆకుంచనప్రసారణాది కర్మములను; జ్ఞానదీపితే=విజ్ఞానముచే నుజ్జ్వలభావమును పొందింపఁబడిన; ఆత్మసంయమయోగాగ్నౌ-ఆత్మ=ఆత్మయందు, సంయమ=ధారణాధ్యానసమాధిరూపసంయమమనెడి, యోగాగ్నౌ=యోగాగ్నియందు, జుహ్వతి=హోమము జేయుచుండిరి. ॥౨౭॥

శాంకరభాష్యమ్:—

కించ— సర్వాణీతి । సర్వాణీన్ద్రియకర్మాణీన్ద్రియాణాం కర్మాణీన్ద్రియ కర్మాణి తథా ప్రాణకర్మాణిప్రాణోవాయు రాధ్యాత్మిక స్తత్కర్మా ణ్యాకుంచనప్రసారణాదీని తానిచాపర

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరియు "సర్వాణి" అనుశ్లోకముచే మరియొకయజ్ఞమును చెప్పుచుండెను. చాక్షుష స్పార్శనశ్రోత్రరాసనాదిరూపమగు నిఖిలేంద్రియకర్మములను, అట్లే యాకుంచనప్రసారణగమ

—♦ ౪వ అధ్యాయము—౨౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— పతంజలిమతానుసారము అయపూర్వకసమాధియు, అనంతరమువ వ్యుత్థానము అను యజ్ఞద్వయమును జెప్పి బ్రహ్మవాదిమతానుసారముగ బాధపూర్వకముగ, కారణనాశముచే వ్యుత్థానశూన్యము, సర్వఫలభూతము నగు సమాధియజ్ఞము నీశ్లోకమున జెప్పుచున్నాడు—సమాధి అయపూర్వకమని, బాధపూర్వకమని రెండువిధములు. అందు—"తదనన్యత్వ మారంభణశబ్దాదిభ్యః" అను న్యాయానుసారము కారణముకంటె వ్యతిరేకముగ కార్యముండనేరదుగాన వ్యష్టిరూపమగు పంచీకృత పంచభూతకార్యము సమిష్టిరూప విరాట్కార్యమగుట సమిష్టిరూప విరాడ్వ్యతిరేకముగ నది లేనిదే యగును. అట్లే పంచీకృత పంచభూతాత్మకము, సమిష్టిరూపము నగు కార్యమపంచీకృతపంచమహాభూతకార్య మగుటచే నపంచీకృతపంచభూతములకంటె వ్యతిరేకముగ నది యుండనేరదు. అందునను శబ్దస్పర్శరూపరసగంధాఖ్యపంచగుణమగు పృథివి శబ్దస్పర్శరూపరసము అను నాల్గుగుణములుకల జలము కారణముగా కలది. కాన నట్టి జలముకంటె వ్యతిరేకముగ పృథివిలేనిదే యగును. ఆ జలముకూడ గంధరసేతరత్రిగుణాత్మక తేజస్సు కారణముగ కలదికాన తేజస్సుకంటె వ్యతిరేకముగ నదియు లేనిదే యగును. ఆ త్రిగుణాత్మకమగు తేజస్సుకూడ గంధరసరూపేతర ద్విగుణవాయు కార్యమగుట వాయువుకంటె వ్యతిరేకముగ నదియు లేనిదే యగును. ద్విగుణాత్మకమగు వాయువుగూడ శబ్దమాత్రగుణాకాశకార్యమగుట నాకాశముకంటె వ్యతిరేకముగ నదియు లేనిదేయగును. అట్టిశబ్దమాత్రగుణకమగు యాకాశముగూడ 'బహుస్యాం' అను పరమేశ్వర సంకల్పాత్మకాహంకారకార్య మగుటచే నట్టి యహంకారముకంటె వ్యతిరేకముగ నదియు లేనిదే యగును. ఆ సంకల్పాత్మకమగు నహంకారముగూడ మాయేక్షణరూపమహత్తత్త్వకార్య మగుటచే మహత్తత్త్వము

శాంకరభాష్యమ్. —

ఆత్మసంయమయోగాగ్నౌ వాత్మని సంయమ ఆత్మసంయమ స్స ఏవ యోగాగ్నిస్తస్మి న్నాత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి ప్రక్షిపన్తి జ్ఞానదీపితే స్నేహేనేవ ప్రదీపితే వివేకవిజ్ఞానే నోజ్జ్వలభావ మాపాదితే ప్రవిలాపయన్తీత్యర్థః ॥ ॥౨౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని. —

నాదిరూపమగు నాధ్యాత్మికవాయుకర్మములను తైలముచే నుద్దీపితమగు నగ్నియందువలె వివేకవిజ్ఞానముచే నుజ్జ్వలభావమును పొందింపఁబడిన నాత్మయందు ధారణాధ్యానసమాధులనెడి యోగాగ్నియందు కొందరు హోమముచేయుచుండిరి అని యాశయము. ॥౨౭॥

కంటె వ్యతిరేకముగ నదియు లేనిదే యగును. ఆ యాత్మణరూపమగు మహత్తత్త్వముఁగూడ మాయాపరిణామమగుట మాయకంటె వ్యతిరేకముగ నదియు లేనిదే యగును. ఆ మాయాఖ్యమగు కారణము జడమగుటచే చైతన్యమునం దధ్యస్తముఁగాన చైతన్యముకంటె వ్యతిరేకముగ నదియు లేనిదే యగును. అను నీ విధముగ యనుసంధానముచే కార్యకారణాత్మకము, విద్యమానము నగు ప్రపంచమునందు చైతన్యమాత్ర గోచరమగు సమాధియే లయపూర్వక సమాధి యనఁబడును. ఈ సమాధియందు తత్త్వమస్యాది మహావాక్యార్థజ్ఞానము నిరూఢము కానందున యవిద్యా తత్కార్యములు క్షీణింపవుగాన పై విధముఁగ చింతించుచున్నను కారణ ముండుటచే తిరిగి కృత్స్నప్రపంచక ముత్థిత మగుచుండును. గాన నీ సమాధి సుషుప్తివలె సబీజమై యముఖ్య మగును. తత్త్వమస్యాదిసాక్షాత్కారముచే నవిద్య నివర్తించిన సర్గక్రమమున తత్కార్యమగు యనాద్యవిద్యకుగూడ పునరుత్థాన ముండదుగాన తత్కార్యమునకుగూడ పునరుత్థాన ముండదు. కాన నీ సమాధి నిర్బీజమై బాధపూర్వక మనఁబడును. ఇది ముఖ్యసమాధి యనఁబడును. ఈ సమాధినే యీ శ్లోకమున జెప్పుచుండెను.

“సర్వాణి” నిఖిలములగు స్థూలరూపములగు సంస్కారములను, “ఇంద్రియకర్మాణి” త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణములను నైదుయింద్రియములయొక్కయు, వాక్పాణిపాదపాయూపస్థలను బాహ్యేంద్రియముల యొక్కయు, అంతరములగు మనోబుద్ధులయొక్కయు, స్పర్శన దర్శన శబ్దశ్రవణ రసగ్రహణ గంధగ్రహణము లను, వచనాదాన విహరణోత్సర్గానందములను, సంకల్పాధ్యవసాయములను ఇట్లే “ప్రాణకర్మాణి” ప్రాణా పాన వ్యానోదాన సమానములనెడి పంచప్రాణములయొక్క బహిర్నియమనాధోనియమనాకుంచన ప్రసరణా దులను (ఈచెప్పుటచే పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, పంచప్రాణములు, మనస్సు, బుద్ధియ నెడు సప్తదశాత్మకమగు లింగశరీరము నిరూపింపబడెను.) మరియు, సూక్ష్మభూతసమిష్టిరూపమగు హిరణ్యగర్భా ఖ్యలింగ మిట వివక్షజేయఁబడెనని జెప్పుటకు “సర్వాణి” అను విశేషణ ముపయుక్తమైనది. “ఆత్మసంయమ యోగాగ్నౌ” ఆత్మవిషయకమగు ధారణాధ్యాన సంప్రజ్ఞాతి సమాధిరూపమగు సంయమము పరిపక్వమైనచో నిరోధ సమాధిరూపమగు యోగము సిద్ధించును. ఈ నిరోధసమాధిని పతంజలి యీ విధముగ సూత్రించెను. “వ్యుత్థాన నిరోధసంస్కారయో రభిభవప్రాదుర్భావౌ నిరోధక్షణ చిత్తాన్వయో నిరోధపరిణామః” వ్యుత్థానము క్షిప్తమనియు, మూఢమనియు, విక్షిప్తమనియు మూడుభూములుగ నున్నది. ఈ భూమి త్రయసంస్కారములు సమాధికి ప్రతి బంధకములై యున్నవి. కాన వాటిని యోగులు ప్రయత్నపూర్వకముగ ప్రతిదినము, ప్రతిక్షణముగూడ తిరస్కరించు చుందురు. అట్టి యోగులకు, ఈ భూమిత్రయ సంస్కారములకు విరోధులగు నిరోధసంస్కారములు పుట్టుచుండును. అనంతరమున నిరోధమాత్రక్షణముననే చిత్తాన్వయము నిరోధపరిణామము కలుగును. “తతః ప్రశాంతవాహి

తాసంస్కారాత్'' తమోరజస్సులు క్షయమగుట, విక్షేపశూన్యమగుటచే శుద్ధసత్త్వస్వరూపమగు చిత్తము ప్రశాంత మనఁబడును. పూర్వపూర్వప్రశమసంస్కారసామర్థ్యముచే నగు చిత్తాధిక్యము ప్రశాంతవాహిత యనఁబడును. ఇట్టి ప్రశాంతవాహిత్వమే నిరోధసమాధివలన కలుగుఫలము. "విరామప్రత్యయాభ్యాసపూర్వః సంస్కారశేషోఽన్యః'' వృత్త్యుపరమనిమిత్తమైన పురుషప్రయత్నము విరామప్రత్యయ మనబడును. తదభ్యాసముచేనైన సంప్రజ్ఞాతవిలక్షణమగు యసంప్రజ్ఞాతసంస్కారశేషము ప్రశాంతవాహిత్వమునకు కారణమగును. ఇట్టి ఆత్మసంయమ యోగరూపము (జ్ఞానదీపితము వేదాంతవాక్యజన్యమగు బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారముచే అవిద్యాతత్కార్య నాశద్వారమున అత్యంతోజ్జ్వలితమగు) బాధపూర్వకసమాధిరూపమునగు వగ్నియందు హోమమును (ప్రవిలాపమును) జేయుచుండిరి. ॥౨౭॥

శ్రీధరీయము:—"అపరే'' ధ్యాననిష్ఠులగు మరికొందరు "ఇంద్రియకర్మాణి'' జ్ఞానేంద్రియములగు శ్రోత్రాదులయొక్క శ్రవణదర్శనాదికర్మలను, కర్మేంద్రియములగు వాక్పాణ్యాదుల వచనోపాదానాదికర్మలను "ప్రాణకర్మాణి'' (అనగా ప్రాణవాయువునకు వెలుపలకు వెడలుట, అపానవాయువునకు మలమును క్రిందకు తీసుకువెళ్ళుటయు, వ్యానవాయువునకు వ్యాకుంచనాకుంచనప్రసారణాదికము, సమానవాయువునకు భక్షించిన యాహారమును, త్రాగిన పానీయమును వాటివాటి స్థానములకు తీసుకువెళ్ళుట, ఉదానవాయువునకూర్ధ్వభాగములకు కావలసిన పదార్థమును తీసుకువెళ్లుట ఇవి పంచవాయువులయొక్క కార్యములు. "ఉద్గారే నాగ ఆఖ్యాత కూర్మ ఉన్మీలనే స్మృతః । కృకరః క్షుతకృత్ జ్ఞేయో దేవదత్తో విజృంభణే । న జహాతి మృతం చాపి సర్వవ్యాపీ ధనంజయః ।'' (నాగవాయువు వమనముచేయుటను, కూర్మవాయువు మేల్కానుటను, కృకరవాయువు తుమ్ముటను, దేవదత్తవాయువు ఆవలించుటను జేయించును. ధనంజయవాయువు మృతశరీరమునుగూడ విడిచిపెట్టకుండును.) పైనజెప్పబడిన దశవిధప్రాణాదివాయువులయొక్క కర్మములను "జ్ఞానదీపితే ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి।'' ధ్యేయవిషయముచే ప్రజ్వలితము, ఆత్మసంయమయోగధ్యానైకాగ్ర్యమనెడి యగ్ని యందు హోమముఁజేయుచుండిరి. (అనగా ధ్యేయమగు బ్రహ్మమును లెస్సగ దెలిసికొని దానియందు మనస్సును లగ్నముజేసి సర్వకర్మములను యుపరమింపజేయుదురని యర్థము.) ॥౨౭॥

నీలకంఠీయము:— పూర్వమునందు చెప్పఁబడిన యోగముకంటె నుత్కృష్టమగు యోగమును "సర్వాణి'' అను శ్లోకముచే చెప్పుచుండెను.

మతికొందరు యోగులు దేహేంద్రియప్రాణమనస్సులకంటె నాత్మ వేరను జ్ఞానముచే ప్రకాశింపఁజేయబడిన బుద్ధియందు సంశయమనెడి యోగాగ్నియందు సమస్తమగు నింద్రియకర్మలను (ఇంద్రియములయొక్క కర్మలనగా శబ్దాదిగ్రహణములు) ప్రాణకర్మలగు ఆకుంచన ప్రసారణ శ్వాసప్రశ్వాసాదులను ప్రవిలయమును జేయుచుండిరి.

ఇంద్రియయోగులకు సుషుప్తియందువలె ప్రాణ ముపసంహృతముకాదు. ఎందువలననిన? ప్రాణ సహచరమగు మనసున కుపసంహారము లేనందున ప్రాణముకూడ నుపసంహృతముకాదు. బుద్ధియోగులకన్ననో మనస్సు యుపసంహృతమగుటవలన తదాయత్తమగు ప్రాణముకూడ నుపసంహృతమగును. ఇదియే యింద్రియయోగులకు, బుద్ధియోగులకుగల విశేషము. ఇట్టిబుద్ధియోగులకుగూడ తెలిసికొనదగినదేదియు లేనందున బుద్ధి పూర్వమునందువలె లీనమైయుండ సమాధిబుద్ధిమాత్రము కలదు. ఇట్టిబుద్ధియోగులుకూడ బుద్ధికంటె వేరుగా నాత్మను తెలిసికొనువారు కారు. ఆత్మయందు బుద్ధి యుపసంహృతము కాదు. కనుకనే ఇట్టివారలనుద్దేశించి వాయవీయమునందు "బౌద్ధా దశసహస్రాణి తిష్ఠంతి విగతజ్వరాః'' బుద్ధియందు లీనమైనవారు పదివేలమన్వంతరములు విగతజ్వరులై సుఖముగ నుండెదరని చెప్పబడెను. ॥౨౭॥

౭

గీ॥ ద్రవ్యయజ్ఞా స్తపోయజ్ఞా యోగయజ్ఞా స్తథాఽపరే ।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయ స్సంశితవ్రతాః ॥ ॥౨౮॥

పదవిభాగము:— ద్రవ్యయజ్ఞాః – తపోయజ్ఞాః – యోగయజ్ఞాః – తథా – అపరే – స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః – చ – యతయః – సంశితవ్రతాః ॥ ॥౨౮॥

ప్రతిపదార్థము:— అపరే=కొందరు; ద్రవ్యయజ్ఞాః=తీర్థాదులయందు యజ్ఞబుద్ధిచే ద్రవ్యమును వినియోగించువారు ద్రవ్యయజ్ఞులు; అపరే=కొందఱు; తపోయజ్ఞాః=తపస్సే యజ్ఞముగాకలవారు; అపరే=కొందఱు; తథా=అట్లే; యోగయజ్ఞాః= ప్రాణాయామప్రత్యాహారధ్యానధారణాసమాధియమనియమాసనరూపయోగమే యజ్ఞముగాకలవారు; అపరే=మరికొందఱు; స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ=యథావిధిగ ఋగ్యజుస్సామాథర్వణవేదాభ్యాసమనెడి యజ్ఞము, శాస్త్రార్థపరిజ్ఞానమనెడి యజ్ఞములు కలవారు; యతయః=యతీశ్వరులు; సంశితవ్రతాః=లెస్సగ నతిదృఢత్వమునుపొందింపఁబడిన వ్రతములు కలవారు. ॥౨౮॥

**శాంకరభాష్యమ్—**

ద్రవ్యేతి । ద్రవ్యయజ్ఞా స్తీర్థేషు ద్రవ్యవినియోగం యజ్ఞబుద్ధ్యా కుర్వన్తి యే తే ద్రవ్యయజ్ఞాః, తపోయజ్ఞా యే తపస్విన స్తే తపోయజ్ఞాః, యోగయజ్ఞాః ప్రాణాయామ ప్రత్యాహారాదిలక్షణో యోగయజ్ఞో యేషాం తే యోగయజ్ఞా స్తథా పరే స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ స్వాధ్యాయో యథావిధి ఋగాద్యభ్యాసో యజ్ఞో యేషాం తే స్వాధ్యాయయజ్ఞాః జ్ఞానయజ్ఞాః జ్ఞానం శాస్త్రార్థపరిజ్ఞానం యజ్ఞో యేషాం తే జ్ఞానయజ్ఞాశ్చ యతయో యతనశీలాః సంశితవ్రతాః సమ్యక్శితాని తనూకృతాని తీక్ష్ణీకృతాని వ్రతాని యేషాం తే సంశితవ్రతాః ॥ ॥౨౮॥

**శాంకరభాష్యతత్త్వబోధిని—**

'ద్రవ్యయజ్ఞాః' అను శ్లోకముచే నారుయజ్ఞముల నుపపాదించుచుండెను. కొందరు తీర్థాదులయందు, పుణ్యస్థలములయందు యజ్ఞబుద్ధిచే ద్రవ్యమును వినియోగించెదరు. వారు ద్రవ్యమే యజ్ఞముగాకలవారలు. మఱికొందరు తపమునే యజ్ఞబుద్ధిచే ననుష్ఠించెదరు. వారు

—: ౪వ అధ్యాయము—౨౮ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— పైమూడుశ్లోకములచే బంచయజ్ఞములను జెప్పి ప్రస్తుతమీశ్లోకమున నితరములగు యారుయజ్ఞములను జెప్పుచున్నాడు. "అపరే" కొందరు "ద్రవ్యయజ్ఞాః" యథాశాస్త్రముగ ద్రవ్యత్యాగమే యజ్ఞముగకలవారు, (అనగ "వాపీకూపతటాకాది దేవతాయతనానిచ । అన్నప్రదానమారామః పూర్తమిత్యభిధీయతే॥ శరణాగతసంత్రాణం భూతానాం చాప్యహింసనం । బహిర్వేదిచ యద్దానం దత్తమిత్యభిధీయతే॥" వాపీకూపతటాకాదులను నిర్మించుట, దేవాలయనిర్మాణము, అన్నప్రదానము, ఆరామనిర్మాణము, ఇవి పూర్తములనబడును ! శరణాగతసంరక్షణము, భూతముల హింసించకపోవుట, (ప్రఖ్యాతివషయునట్లు దాన మొసంగుట, నివి దత్తములనబడును. అంతర్వేదిదానముగూడదీనిలోనే యంతర్భావమగును. ఇట్టి పూర్తదత్తాఖ్య స్మార్తకర్మతత్పరులు) ద్రవ్యయజ్ఞు లనబడుదురు. "తపోయజ్ఞాః" మరికొందరు కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సే యజ్ఞముగగలవారు. మరికొందరు "యోగయజ్ఞాః" తపోయజ్ఞులనబడుదురు. యమ, నియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధారణాధ్యాన సమాధులు యోగమున కష్టాంగములు. వీటిలో ప్రత్యాహారము "శ్రోత్రాదీనీంద్రియాణి" అనుశ్లోకమున నిర్వచింపబడెను. ధారణాధ్యానసమాధులు "ఆత్మసంయమయోగాగ్నౌ" అనుస్థలమున జెప్పబడెను. ప్రాణాయామము "అపానే జుహ్వతిప్రాణం" అనుముందుశ్లోకమున జెప్పబడును. యమనియమాసనములీశ్లోకమున జెప్పబడుచుండెను. అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము యను

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

తపస్సే యజ్ఞముగా కలవారు. మరికొందరు యమనియమాసనప్రాణాయామప్రత్యాహారధ్యాన ధారణాసమాధులనే యజ్ఞబుద్ధిచే ననుష్ఠించెదరు. వారు యోగమే యజ్ఞముగా కలవారు. అట్లే మరికొందరు గురువుగృహమునకేగి సాష్టాంగవందనము లర్పించి ప్రాఙ్ముఖులై పవిత్రమును హస్తమున ధరియించి ఋగ్యజుస్సామాథర్వణవేదముల నభ్యసించును. అట్టివారు స్వాధ్యాయమే యజ్ఞముగా కలవారు. మరికొందరు యథావిధిగ శాస్త్రముల నభ్యసించి శాస్త్రార్థపరిజ్ఞానము

---

నీయైదును యమము అనబడును. శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము అను నీయైదును నియమములనబడును. స్థిరసుఖముగల యాసనము పద్మకస్వస్తికాద్యనేక విధము. శాస్త్రగర్హితమగు ప్రాణివధము హింస యనబడును. ఇయ్యది కృతమనియు, కారితమనియు, అనుమోదితమనియు మూడువిధములు. ఇట్లే అయథార్థభాషణము, హింసింపతగనివారిని హింసించుటకు కారణమగు యథార్థభాషణము నీరెండును యనృతము అనబడును. అశాస్త్రీయమార్గమున బరద్రవ్యమును స్వీకరించుట స్తేయ మనబడును. అశాస్త్రీయమగు స్త్రీపురుషసమాగమము మైథున మనబడును. దేహయాత్రకు సరిపడుదానికంటె నధికభోగసాధనముల నశాస్త్రీయ మార్గమున స్వీకరించుట పరిగ్రహ మనబడును. ఇట్టిహింస, స్తేయము, మైథునము, అనృతము, పరిగ్రహము అను వీటి నివృత్తిరూపములగు యుపరమములు పైయమము అనబడును. మరియు, నిట్లే బాహ్యమనియు, అభ్యంతర మనియు శౌచము రెండువిధములు. అందు మృత్తు, జలము మొదలగువాటిచే శరీర క్షాళనము, హితము మితము పవిత్రమునగువానిని భుజించుట మొదలగునది బాహ్యశౌచము. స్నేహము మోదము మొదలగువాటిచే మదము మానము మొదలగు చిత్తమలములను క్షాళనచేయుట యాభ్యంతరశౌచము. సిద్ధమైయున్న భోగోపకరణములకంటె నధికమగు యుపకరణముల సంపాదింపరాదను ఇచ్ఛాభాసరూపమగు చిత్తవృత్తి సంతోష మనబడును. ఆకలి దప్పికలను, శీతోష్ణాదిద్వంద్వములను సహించుట, కాష్ఠమౌనము, ఆకారమౌనము మొదలగు వ్రతములు తపస్స నబడును. ఇంగిత (చేష్టామాత్ర) ము చేనైనను స్వాభిప్రాయమును దెలుపకుండుట కాష్ఠమౌనమనియు, మాట్లాడ కుండుట యాకారమౌనమనియు భేదము. మోక్షశాస్త్రాధ్యయనము గాని, ప్రణవజపము గాని స్వాధ్యాయమన బడును. ఫలాభిసంధిరహితముగ సర్వకర్మలను పరమేశ్వరున కర్పించుట యీశ్వరప్రణిధాన మనబడును ఇవి విధిరూపములగు నియమములు. పురాణములయందింతకంటె నెక్కువగ జెప్పబడినవాటిని యీ యమ నియమ ములలో నంతర్భావము జేయదగును. ఇట్టి యమనియమాభ్యాసపరులు యోగయజ్ఞులనబడుదురు. "స్వాధ్యాయ జ్ఞానయజ్ఞాశ్చ" యథావిధిగ వేదమునభ్యసించినవారు స్వాధ్యాయయజ్ఞు లనబడుదురు. న్యాయముగ వేదార్థ నిశ్చయపరులు జ్ఞానయజ్ఞు లనబడుదురు. "యతయః" యత్నశీలురై "సంశితవ్రతాః" లెస్సగ తీక్ష్ణమైన వ్రతము కలవారు. ఈ విషయమును పతంజలిభగవాను లిట్లు సూత్రించెను. "తే జాతిదేశకాల సమయానవచ్ఛిన్నాః సార్వ భౌమా మహావ్రతం" పూర్వమునందు జెప్పబడిన యహింసాదిపంచయమములే - జాతి, దేశ, కాల, సమయా వచ్ఛిన్నములై, దృఢభూములై మహావ్రతశబ్దవాచ్యములగుచున్నవి. అనగా- నరణ్యమునందు శాఖామృగ ములు, (వానరములు) వరాహఖడ్గాదిమృగములు యున్నపుడు వేటకేగిన క్షత్రియుడు - వరాహఖడ్గాది మృగ ములహింసించుచు తదతిరిక్తములగు శాఖామృగముల హింసింపననిదలచి, వాటినిహింసింపకుండుట జాత్యవచ్ఛి న్నమగు యహింస యనబడును. ఇట్లే అట్లు వేటకేగిన క్షత్రియుడు పుణ్యతీర్థమునందున్న మృగములను హిం సింపననిదలచివాటిని హింసింపకుండుట దేశావచ్ఛిన్నమగు యహింస యనబడును. ఇట్లే క్షత్రియుడు చతుర్దశి మొదలగు పర్వదివసములయందు మృగములను హింసింపరాదను యూహతో నట్లు హింసింపకుండుట కాలా వచ్ఛిన్నమగు యహింసయనబడును. క్షత్రియుడు దేవబ్రాహ్మణప్రయోజనము లేకుండగ హింసింపననుబుద్ధితో హింసింపకుండుటయు, యుద్ధరూపప్రయోజనములేకుండగ వ్యర్థముగ మరియొకని వధింపననుయూహతో వధింప కుండుటయు నివి ప్రయోజనవిశేషరూపసమయావచ్ఛిన్నమగు యహింసయనబడును. ఈరీతిగ యహింస జాతి, దేశ, కాల సమయావచ్ఛిన్నముగ నాలుగువిధములగును. ఇట్లే "వివాహాదిప్రయోజనములేనిచో యసత్యమాడను"

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**
కలవారు. అట్టివారు జ్ఞానమే యజ్ఞముగాకలవారు. మరికొందరు యతులు లెస్సగ తీక్ష్ణీకృతమగు (అతిదార్ఢ్యమును పొందింపఁబడిన) కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతములు కలవారు అని యీశ్లోకమున (1) ద్రవ్యయజ్ఞము, (2) తపోయజ్ఞము, (3) యోగయజ్ఞము, (4) స్వాధ్యాయయజ్ఞము, (5) జ్ఞానయజ్ఞము, (6) నిశితవ్రతయజ్ఞము అనెడి యాఱుయజ్ఞము లుపపాదితములు. ॥౨౮॥

అనుయూహతో నసత్యమును పలుకకుండుట ప్రయోజనవిశేషరూపసమయావచ్ఛిన్నసత్య మనబడును. ఇట్లే అపత్కాలమునువిడిచి క్షుద్బాధాపీడితుడనయ్యు పరద్రవ్యము నపహరింపను. అనుయూహతో నట్లపహరింపకుండుట కాలావచ్ఛిన్నమగు నస్తేయ మనబడును, ఇట్లే ఋతుకాలమునువిడచి తద్వ్యతిరిక్తకాలమున పత్నితో కూడననితలచి, యట్లు కూడకుండుట కాలావచ్ఛిన్నబ్రహ్మచర్యమనబడును. ఇట్లే గుర్వాదిప్రయోజనములకంటె నితరప్రయోజనములకై పరిగ్రహింపనను యూహతో యట్లు పరిగ్రహింపకుండుట ప్రయోజనవిశేషసమయావచ్ఛిన్నమగు యపరిగ్రహ మనబడును. ఇట్లే యథాయోగ్యముగ వాటివాటి యవచ్ఛేదకముల నూహింపనగును. ఇట్టియవచ్ఛేదపరిహారపూర్వకముగ సర్వజాతి సర్వదేశ సర్వకాల సర్వప్రయోజనములయందు నాచరింపబడు యహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాऽపరిగ్రహములు అధికప్రయత్నముచే పరిపాలింపబడునవి గాన సార్వభౌమము అనబడును. ఇవి యట్లాచరింపబడు కాలమున మహావ్రతశబ్దవాచ్యములగును. ఇట్లే కాష్ఠమౌనాదివ్రతమునుగూడ నూహింపనగును. ఇట్టి వ్రతదార్ఢ్యము సంపన్నమైనపుడు నరకద్వారభూతములగు కామక్రోధలోభమోహములు నివృత్తము అగును. అందున యహింసచేనగు క్షమ (ఓర్మి) చే క్రోధముయొక్కయు, బ్రహ్మచర్యముచేనగు వస్తువిచారణముచే కామముయొక్కయు, అస్తేయాపరిగ్రహరూపమగు సంతోషముచే లోభముయొక్కయు, సత్యముచేనగు యథార్థజ్ఞానరూపమగు వివేకముచే మోహముయొక్కయు, తన్మూలమగు సర్వముయొక్కయు నివృత్తి యగును. ఇట్టి వ్రతానుష్ఠాతలగు సకాములకు యోగశాస్త్రమునందు ఇతరములగు ననేకఫలములు చెప్పబడినవి. ॥౨౮॥

శంకరానందీయము:— ముముక్షువులు యీచెప్పబోవు యజ్ఞములనుగూడ జేయదగునని యీశ్లోకమున యజ్ఞాంతరముల కొన్నిటిని చెప్పుచున్నాడు;—

"అపరే" కొందరు "ద్రవ్యయజ్ఞాః" నియమముగ సత్పాత్రులయందు ద్రవ్యనిక్షేపణమే మనకు యజ్ఞమని తలచి ద్రవ్యవ్యయమునే చేయుదురు. అట్టివారు ద్రవ్యయజ్ఞులనబడుదురు. మరికొందరు— "తపోయజ్ఞాః" చాంద్రాయణప్రాజాపత్యాద్యుపవాసాదిరూపమగునదియే మనకుయజ్ఞమనితలచి యట్టితపస్సును జేయుచుందురు. వీరు తపోయజ్ఞులనబడుదురు. మరికొందరు, "యోగయజ్ఞాః" అసనప్రాణాయామాద్యంగములతోగూడిన యోగమే (చిత్తస్థైర్యమే) యజ్ఞమనితలచి దాని ననుష్ఠించెదరు. అట్టివారు యోగయజ్ఞు లనబడుదురు. అట్లే మరికొందరు — "స్వాధ్యాయజ్ఞానయజ్ఞాః" ఈపదమున యజ్ఞశబ్దము వేరువేరుగ సంబంధించును. "తస్యావా ఏతస్య యజ్ఞస్య ద్వావనధ్యాయౌ యదాऽऽత్మాऽశుచి ర్యద్దేశః" అనుశ్రుత్యుక్తానధ్యాయద్వయమును విడచి యెల్లపుడు వేదపారాయణమే మనకు కర్తవ్యమను యూహతో నధ్యయనవిధి నియమముగ జేయుదురు. కాన వారు స్వాధ్యాయయజ్ఞులనబడుదురు. మరికొందరు — జ్ఞానశాస్త్రపరిశీలనమే యజ్ఞమనితలచి అట్టి పరిశీలనమును జేయుదురు. ఇట్టివారు జ్ఞానయజ్ఞులనబడుదురు. ఈవిధముగ మోక్షమునిమిత్తమై యత్నశీలురు వారివారి నిష్ఠలయందతితీక్ష్ణమగువ్రత (నియమ) ముగలవా రక్కడక్కడ యనేకులు గలరు. ఈవిధముగ ద్రవ్యత్యాగమును, తపస్సును, యోగమును, స్వాధ్యాయవృత్తిని, శాస్త్రపరిశీలనమును యజ్ఞముగ పరిశీలించెదరు. ॥౨౮॥

నీలకంఠీయము:— ఇట్లు యజ్ఞపంచకమును మూడుశ్లోకములచే చెప్పి "ద్రవ్యయజ్ఞాః" అనుశ్లోకముచే నయిదు యజ్ఞములను చెప్పుచుండెను.

(1) ద్రవ్యముచే సాధింపఁదగినయజ్ఞములు. అవియేవనిన ? — శ్రౌతయజ్ఞములు పూర్వమునందే చెప్ప

గీ॥ అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాఽపరే ।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః ॥ ॥౨౯॥

పదవిభాగము:—అపానే- జుహ్వతి- ప్రాణం- ప్రాణే- అపానం- తథా- అపరే- ప్రాణాపానగతీః- రుద్ధ్వా- ప్రాణాయామపరాయణాః ॥ ॥౨౯॥

ప్రతిపదార్థము:—అపరే=కొందరు; అపానే= అపానవృత్తియందు; ప్రాణం= ప్రాణవృత్తిని; జుహ్వతి=హోమముచేయుచుండిరి; (అనగా పూరకమనెడి ప్రాణాయామమును చేయుచుండిరి). ప్రాణే= ప్రాణవృత్తియందు; తథా=అట్లే; అపానం=అపానవృత్తిని; జుహ్వతి=హోమముచేయుచుండిరి; (అనగా రేచకమనెడి ప్రాణాయామమును చేయుచుండిరి). ప్రాణాపానగతీః=ప్రాణాపానముల గమనములను; రుద్ధ్వా అరికట్టి; ప్రాణాయామపరాయణాః=ప్రాణాయామమునందాసక్తికలవారలై; (భవన్తి=ఈపదమధ్యాహార్యము) అగుచున్నారు; (అనగా కుంభకమనెడి ప్రాణాయామమును చేయుచుండిరి. ॥౨౯॥

---

శాంకరభాష్యమ్‌—

కించ- అపానఇతి । అపానేఽపానవృత్తౌ జుహ్వతి ప్రక్షిపన్తి ప్రాణం ప్రాణవృత్తిం; పూరకాఖ్యం ప్రాణాయామం కుర్వన్తీత్యర్థః । ప్రాణేఽపానం తథాఽపరే జుహ్వతి; రేచకాఖ్యంచ ప్రాణాయామం కుర్వన్తీత్యేతత్ । ప్రాణాపానగతీః ముఖనాసికాభ్యాం వాయోర్నిర్గమనం ప్రాణస్య గతిః, తద్విపర్యయేణాధోగమనమపానస్య తే ప్రాణాపానగతీ ఏతే రుద్ధ్వా నిరుధ్య ప్రాణాయామపరాయణాః ప్రాణాయామతత్పరాః కుంభకాఖ్యం ప్రాణాయామం కుర్వన్తీత్యర్థః ॥౨౯॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని—

మరియు 'అపానే' అనుశ్లోకముచే ప్రాణాయామమనెడి యజ్ఞము నుదాహరించు చుండెను. కొందరపానవృత్తియందు ప్రాణవృత్తిని హోమముచేయుచుండిరి. అనగా పూరక మనెడి ప్రాణాయామమును చేయుచుండిరని యర్థము. అట్లే కొందరు ప్రాణవృత్తియం దపానవృత్తిని హోమము చేయుచుండిరి. అనగా రేచకమనెడి ప్రాణాయామమును చేయు చుండిరి యని యర్థము. ముఖమునుండియు, నాసికనుండియు వాయువుయొక్క నిర్గమనము ప్రాణగతి యనఁబడును. అట్టిప్రాణగతికి విరుద్ధముగ వాయువుయొక్క యధోగమనమపానము యొక్క గతియనఁబడును. (అనగా ముఖనాసికలచే వాయువును బయటకు వదలుట ప్రాణము యొక్క గతియనియు, తద్విరుద్ధముగ ముఖనాసికలచే వాయువును శరీరములోనికి క్రిం క్రిందుగా నడిపించుట యపానముయొక్క గతియని యనఁబడును. అట్టి ప్రాణాపానగమన ముల నరికట్టి ప్రాణాయామ తత్పరులై కుంభక మనెడి ప్రాణాయామమును చేయుచుండిరని యర్థము. (అనగా ప్రాణాయామపరాయణులై రేచకము, పూరకమునుచేసి కుంభకమును ॥౨౯॥ చేయుచుండి రని భావము.

---

బడుటవలన నిచట ద్రవ్యసాధ్యములగు యజ్ఞములు తీర్థమునందు వాపీకూపారామములు, బహిర్వేదికా దానమని గ్రహింపవలయును. అట్టియజ్ఞముచేయువారు, అట్లే- (2) తపస్సు, కృచ్ఛ్రవ్రతము, చాంద్రాయణము, మాసముపవాసముండుట, ఇవి తపోయజ్ఞములు. ఇట్టితపోయజ్ఞములుకలవారు కొందరు, (3) అట్లే సంధ్యో పాసనమొదలు నిర్వికల్పసమాధిపర్యంతమగు కర్మలను ఫలపరిత్యాగ మొనరించి యీశ్వరార్పణముగ ననుష్ఠించుట యోగయజ్ఞమనబడును. ఇట్టియజ్ఞములుకలవారు కొందరు. లేక యమనియమాసనప్రాణాయామప్రత్యా

గీ॥ అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి ।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషాః ॥ ॥౩౦॥

పదవిభాగము:—అపరే- నియతాహారాః- ప్రాణాన్- ప్రాణేషు- జుహ్వతి- సర్వే- అపి- ఏతే- యజ్ఞవిదః-యజ్ఞక్షపితకల్మషాః ॥ ॥౩౦॥

ప్రతిపదార్థము:—అపరే=కొందఱు; నియతాహారాః=పరిమితమైన ఆహారము కలవారై; ప్రాణేషు ప్రాణవాయువిశేషములయందు; ప్రాణాన్=ప్రాణవాయువిశేషములను; జుహ్వతి=హోమము చేయుచుండిరి. ఏతే=ఈ; సర్వేఽపి=అందరున్ను; యజ్ఞవిదః=యజ్ఞమును తెలిసినవారై; యజ్ఞక్షపిత కల్మషాః; యజ్ఞ=యజ్ఞముచే; క్షపిత=నశింపజేయబడిన; కల్మషాః=పాపముకలవారలై; భవన్తి=(ఈపదమధ్యాహార్యము)అగుచుండిరి.॥౩౦॥

శాంకరభాష్యమ్:—

కించ-అపర ఇతి। అపరే నియతాహారా నియతః పరిమిత ఆహారో యేషాం తే నియతాహారా స్సన్తః ప్రాణా న్వాయుభేదా న్ప్రాణేష్వేవ జుహ్వతి యస్య యస్య వాయోర్జయః క్రియత ఇతరా న్వాయుభేదాం స్తస్మింస్తస్మి న్జుహ్వతి తే తత్ర ప్రవిష్టా ఇవ భవన్తి సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షపితకల్మషా యజ్ఞై ర్యథోక్తైః క్షపితో నాశితః కల్మషో యేషాం తే యజ్ఞక్షపితకల్మషాః ॥ ॥౩౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

మరికొందరు—ఉచ్ఛ్వాస నిశ్శ్వాస నిరోధరూపమగు కుంభకము నాచరించి పరిమితము, ఇష్టము, పవిత్రము అగు నాహారముకలవారై యేయేప్రాణవాయుజయ మాచరించెదరో అట్టిప్రాణవాయువులయం దజితప్రాణవాయువులను హోమముచేయుచుందురు. అనగా జితప్రాణవాయువులయం దజితప్రాణవాయువులు ప్రవిష్టములువలె నగుననుట. ఇట్టివీరలందరు యజ్ఞవేత్తలై యజ్ఞముచే నశింపజేయబడినపాపములు కలవారై యగుచుండిరి. ॥౩౦॥

హారధ్యానధారణసమాధిరూపమగు నష్టాంగములతోగూడిన "యోగశ్చిత్తవృత్తినిరోధః" అను పాతంజలిసూత్రముచే చెప్పఁబడు చిత్తవృత్తినిరోధమే యిట యోగమనఁబడును. అట్టియోగమనెడి యజ్ఞముకలవారుకొందరు. (4) నిత్యము వేదాధ్యయనము స్వాధ్యాయయజ్ఞమనఁబడును. అట్టివేదాధ్యయనమునం దాసక్తికలవారుకొందరు. (5) స్వాధ్యాయార్థముయొక్క పూర్వోత్తరమీమాంసా విచారము జ్ఞానయజ్ఞము. అట్టిజ్ఞానయజ్ఞరతులుకొందరు. వీరందరునుయతనశీలురు. లెస్సగ తీక్ష్ణమగు నహింసాదికము కలవారు. అని "యతయః, సంశితవ్రతాః" అనియు యీ రెండువిశేషణములు పైయయిదుగురియందు నన్వయింపవలెను. ॥౨౯॥

—॥ ౪వ అధ్యాయము—౨౯-౩౦-౩౧శ్లోకవ్యాఖ్యావిశేషములు ॥—

మధుసూదనసరస్వతీయము:— ప్రాణాయామయజ్ఞమును ౨౯శ్లోకము, ౩౦వశ్లోకపూర్వార్థముతోను చెప్పుచుండెను. "అపానే జుహ్వతిప్రాణం" కొందరు అపానవృత్తియందు ప్రాణవృత్తిని హోమము చేయుచుండిరి. (బాహ్యవాయువును శరీరాభ్యంతరమున బ్రవేశపెట్టి పూరకమను ప్రాణాయామము జేయుచుండిరి.) "ప్రాణేఽపానం తథాపరే" ప్రాణవృత్తియం దపానవృత్తిని హోమముజేయుచుండిరి. (శరీరస్థవాయువును వెలుపలకు విడచి రేచకాఖ్యప్రాణాయామమును జేయుచుండిరి.) ఇట పూరక రేచకముల జెప్పుటచే వాటితో నవినాభూతముగనుండు కుంభకము ప్రత్యేకము చెప్పఁబడకపోయినను చెప్పబడినట్లెయగును. కుంభకము-

గీ॥ యజ్ఞశిష్టామృతభుజో యాన్తి బ్రహ్మ సనాతనమ్ ।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ ॥ ॥౩౧॥

పదవిభాగము:—యజ్ఞశిష్టామృతభుజః-యాన్తి-బ్రహ్మ-సనాతనమ్-న-అయం-లోకః-అస్తి-అయజ్ఞస్య-కుతః-అన్యః-కురుసత్తమ! ॥౩౧॥

ప్రతిపదార్థము:—హేకురుసత్తమ=ఓయర్జునా! యజ్ఞశిష్టామృతభుజః-యజ్ఞ=యజ్ఞసంబంధమగు; శిష్ట=మిగిలిన; అమృత=అమృతరూపమగు నన్నమును; భుజః=అనుభవించువారు; సనాతనం=చిరంతనమగు; బ్రహ్మ=బ్రహ్మమును; యాన్తి=పొందుచుండిరి; అయజ్ఞస్య=ఈచెప్పబడిన యజ్ఞములలో నేదైన నొకదానినైన యాచరింపనివానికి; అయం=సర్వప్రాణిసాధారణమగు; లోకః=లోకము; నాస్తి=లేదు; అన్యః=యజ్ఞసాధ్యమగు లోకము; కుతః=ఎట్లుప్రాప్తించును? ప్రాప్తింపదు. ॥౩౧॥

శాంకరభాష్యమ్—

ఏవం యథోక్తాన్యజ్ఞా న్నిర్వర్త్య-యజ్ఞశిష్టామృతభుజో యజ్ఞానాం శిష్టంయజ్ఞశిష్టం యజ్ఞశిష్టం చ తదమృతంచ యజ్ఞశిష్టామృతం తద్భుంజన్త ఇతి యజ్ఞశిష్టామృతభుజో యథోక్తా న్యజ్ఞాన్కృత్వా తచ్ఛిష్టేనకాలేన యథావిధిచోదిత మన్నమమృతాఖ్యం భుంజన్తఇతి యజ్ఞశిష్టామృత

శాంకరభాష్యతత్త్వబోధని—

ఈచెప్పబడిన యజ్ఞముల నాచరించినపిమ్మట పాపము నశించునుకదా! అటుపిమ్మట ఏమి జరుగును? అనిన-ఈపూర్వోక్తమగు యజ్ఞముల నాచరించినపిమ్మట పూర్వోపవర్ణితమగు యజ్ఞములనుచేసి మిగిలినకాలముచే యథావిధిచోదితమగు నన్నమమృతమను పేరుగలదానిని భుజించువారు చిరంతనమగు బ్రహ్మమును పొందుచుండిరి. పూర్వోక్తయజ్ఞముల నాచరించి యవశిష్టకాలము విహితాన్నభోక్తలకెట్లు బ్రహ్మప్రాప్తి? యన్నచో నట్టివారు ముముక్షువులగుచో

యథాశక్తివాయువును లోపలకుపీల్చి శ్వాసప్రశ్వాసముల నిరోధించుట. యంతఃకుంభకమనియు, యథాశక్తిగా లోపలివాయువును వెలుపలకు విడచి లోపలకు రాకుండ నిరోధించుట బహిఃకుంభకమనియు రెండువిధములు. ఈ ప్రాణాయామత్రయానువాదపూర్వకముగ నాల్గవదియగు కుంభకమును "ప్రాణాపానగతీరుద్ధ్వా" అనుదానిచే చెప్పుచున్నాడు. ముఖముయొక్కయు, నాసికయొక్కయు లోపలనుండువాయువు వెలుపలకు వెడలుట ప్రాణగతియనబడును. బహిర్నిర్గతమైనవాయువు లోపలప్రవేశించుట యపానగతియనబడును. పూరకమున ప్రాణగతినిరోధము, రేచకమున యపానగతినిరోధము, కుంభకమునందు ప్రాణాపానగతుల నిరోధము అగును గాన క్రమముగను యొకేసమయమునను ప్రాణాపానగతుల (శ్వాసప్రశ్వాసముల) నిరోధించి ప్రాణాయామపరాయణులగుదురు. "అపరే" మరికొందరు "నియతాహారాః ప్రాణాన్ప్రాణేషుజుహ్వతి" ఆహారాది యోగసాధన విశిష్టులై బాహ్యాభ్యంతరకుంభకాభ్యాసనిగృహీతములగు ప్రాణములయందు జ్ఞానేంద్రియకర్మేంద్రియరూపములగు ప్రాణములను హోమముచేయుచుండిరి. (అనగా చతుర్థకుంభకాభ్యాసముచే దశవిధేంద్రియములను ప్రవిలాపనముచేయుచుండిరని యర్థము.) ఈ విషయమును సర్వమును పతంజలి పూజ్యపాదులు సంక్షేపముగను విస్తృతముగను సూత్రించిరి-అందు సంక్షేపసూత్రము:-"తస్మిన్సతిశ్వాసప్రశ్వాసయోర్గతివిచ్ఛేదలక్షణః ప్రాణాయామః" అసనము స్థిరమైనతోడనే ప్రాణాపానధర్మములగు శ్వాసప్రశ్వాసలయొక్క గతివిచ్ఛేదరూపమగు (పురుషప్రయత్నమును విడచి స్వాభావికముగ ప్రవహించుట, క్రమముగను యోగపత్తుగను

**శాంకరభాష్యమ్.—**

-భుజో యాన్తి గచ్ఛన్తి బ్రహ్మ సనాతనం చిరన్తనం ముముక్షవశ్చే త్కాలాతిక్రమాపేక్ష యేతి సామర్థ్యా ద్గమ్యతే। నాయం లోక స్సర్వప్రాణిసాధారణోఽప్యస్తి యథోక్తానాం యజ్ఞా నామేకోఽపి యజ్ఞో యస్య నాస్తి సోఽయజ్ఞ స్తస్య కుతోఽన్యో విశిష్టసాధనసాధ్యః కురు సత్తమ ! ॥౩౧॥

**శాంకరభాష్యతత్త్వబోధిని.—**

చిత్తశుద్ధిద్వారమున కాలాతిక్రమాపేక్షచే అనగా చిత్తశుద్ధిగలిగి దానివలన వివిదిష, దానివలన శ్రవణ మననద్వారమున నాత్మజ్ఞానమునుపొంది మోక్షమును పొందుదురని సామర్థ్యమువలన తోచుచున్నది. ఈయజ్ఞములలో నేదోయొకయజ్ఞమునైన నాచరింపనివానికి సర్వప్రాణిసాధా రణమగు నీలోకమే ప్రాప్తింపదు. విశిష్టసాధనసాధ్యమగు లోకాంతర మెట్లు ప్రాప్తించును ? ప్రాప్తించదు. ఇట 'కురుసత్తమ !' అనుసంబుద్ధి-కురుకులప్రధానుడగు నర్జునున కీయర్థము నందు బుద్ధిసమాధాన మనాయాసలభ్యమని చెప్పుటకు చెప్పబడెను. ॥౩౧॥

పురుషప్రయత్నవిశేషముచే నిరుద్ధమైనచో నట్టి నిరోధరూపమగు) ప్రాణాయామము అనుష్ఠేయము. వివరణ. సూత్రము:— "బాహ్యాభ్యంతరస్తంభవృత్తిర్దేశకాలసంఖ్యాభిః పరిదృష్టో దీర్ఘసూక్ష్మః" బాహ్యవృత్తి బాహ్య గతినిరోధరూపము గాన పూరక మనబడును. అంతరవృత్తి అంతరగతినిరోధరూపముగాన రేచక మనబడును. ఈ సూత్రమునందున బాహ్యశబ్దముచే రేచకము, అంతరశబ్దముచే బూరకము చెప్పబడునని కొందరిచే వ్యాఖ్యా నింపబడెను. ఒకేసమయమున బాహ్యాభ్యంతరగతినిరోధము స్తంభవృత్తియై కుంభక మనబడును. విధారకమను ప్రయత్నమువలన శ్వాసప్రశ్వాసములు రెండును యుగపత్తుగ లేకపోవుట సిద్ధించును. ఇయ్యది పూర్వమువలె యాపూరణప్రయత్నైకవిధారణముగాని, రేచనప్రయత్నైకవిధారణముగాని గానేరదు. ఇక నేమన ?— ఎట్లు తప్తోపలమునందుంచబడినజలముశుష్కించినదియై యంతటను సంకోచమునుపొందునో యట్లే వహనశీలమగు వాయువు బలవద్విధారకప్రయత్నముచే నవరుద్ధక్రియకలదై శరీరమునందె సూక్ష్మభూతమై యుండును. ఇయ్యది పూరించునది గాదుగానపూరకముగాదు. రేచించునది కాదు గాన నిది రేచకమూ కాదు. ఈ విధముగ ప్రాణా యామము మూడువిధములు. ఇది దేశముచేతను, కాలముచేతను, సంఖ్యచేతను పరీక్షితమై దీర్ఘసూక్ష్మసంజ్ఞ కలదియై యుండును. అనగ ఘనీభూతము, స్థూలమనగుపిండము(ముద్ద) ప్రసార్యమాణమై పల్చనై దీర్ఘము సూక్ష్మము నగును. అట్లేప్రాణముకూడ దేశ కాలసంఖ్యాధిక్యముచే నభ్యస్యమానమై దీర్ఘము సూక్ష్మమునగును. శ్వాసము హృదయమునుండి బయలువెడలి నాసాగ్రసమ్ముఖమున ద్వాదశాంగులపరిమితదేశమున సమాప్త మగును. అక్కడనుండియే తిరిగి హృదయమువరకు ప్రవేశించును గాన ప్రాణాపానగతి స్వభావసిద్ధము. అభ్యా సముచే గ్రమముగ నాభివద్దనుండి యాధారచక్రద్వారమున బయల్వెడలి నాసికాంతమునకు ఇరువదినాల్గుయం గుళముల పరిమితిగాని లేక ముప్పదియారంగుళముల పరిమితిగాని కలప్రదేశమున పరిసమాప్తమగును. ఈవిధ ముగనె ప్రవేశముగూడ నంత పరిమితముగనే యగును. నాసికమునుండి బయలువెడలువాయువు ప్రసరించు ప్రదేశమును తెలిసికొనుటకు వాయువులేనిప్రదేశమున నాసికాగ్రమునకు కొంతదూరమున సూక్ష్మమగు దూదిని యుంచి దాని చలనమునుబట్టి యాప్రదేశపరిమితిని తెలిసికొననగును. ఇట్లే లోపలకూడ పిపీలికా స్పర్శసదృశ మగు స్పర్శచే నాపరిమితి యూహింపదగును. ఇది దేశపరీక్షయనబడును. అట్లే రెప్పపాటుకాలములో నాల్గవ వంతు కాలము క్షణ మనబడును. ఈ క్షణముల యొక్క పరిమాణము నిశ్చయింపదగును. స్వజానుమండల ప్ర్యంతము మూడువర్యాయలు స్పృశించినయాకాలము ఛోటికావచ్ఛిన్న కాలమగును. అదియే మాత్రాకాలము.

అట్టి ముప్పదియారుమాత్రలచే నగు కాలము ప్రథమోద్ఘాతమను మందకాలము. అట్టికాలమును ద్విగుణీకృత మొన ర్చినచో నాకాలము ద్వితీయోద్ఘాతమను మధ్యకాలము. నాకాలమే త్రిగుణీకృతమగుచో తృతీయమగు నాకాలము తీవ్రమనబడును. నాభిమూలమునుండి ప్రేరితమైన వాయువు విరిచ్యమానమై శిరస్సునందభిహతమగుట యుద్ఘాత మనబడును. ఇయ్యది కాలపరీక్ష యనబడును. ప్రణవజపావృత్తిభేదముచేగాని శ్వాసప్రశ్వాసగణనచేగాని సంఖ్యా పరీక్ష జేయదగును. కుంభకమునందు దేశవ్యాప్తి తెలియబడకపోయినను కాలసంఖ్యావ్యాప్తి తెలియబడును. పైవిధ ముగ నిరూపింపబడిన ప్రాణాయామము-ప్రతిదిన మభ్యసింపబడినదియై, దివస మాసక్రమముచే దేశకాల ప్రచయ వ్యాపియగుటచే దీర్ఘమై, పరమనైపుణ్యముగల సమాధిని పొందించునదగుటచే సూక్ష్మమని నిరూపింపబడెను ఫలభూతమగు నాల్గవప్రాణాయామమును సూత్రించుచుండెను. “బాహ్యాభ్యంతరవిషయాపేక్షశ్చతుర్థః” బాహ్యవిషయమగు శ్వాసము రేచకము. అభ్యంతరవిషయమగు ప్రశ్వాస పూరకము. ఆరెంటికంటె యుగపత్తుగ బలవద్విధారకప్రయత్నమువలన నగునది కుంభకము. ఇదియు బాహ్యాభ్యంతరభేదముచే రెండువిధములు. ఆ రెంటిని (పూరకరేచకముల) యపేక్షింపక కేవల కుంభకాభ్యాసపాటవముచే ననేకమారు లాయా ప్రయత్నము లచే నగునది నాల్గవదియగు కుంభకము. ఇయ్యది బాహ్యాభ్యంతరవిషయము నాక్షేపించునది గాన తదనపేక్షమన బడును. ఈసూత్రమునకు వ్యాఖ్యాంతరము:—ద్వాదశాంగుల పరిమితత్వాదికము బాహ్యవిషయమనబడును. హృదయనాభిచక్రాదికము అభ్యంతరవిషయమనబడును. ఆరెంటిని యాక్షేపించి ప్రవృత్తమగు స్తంభరూపమగు గతివిచ్ఛేదము నాల్గవదియగు కుంభకమను ప్రాణాయామము. మూడవదియగు కుంభకము బాహ్యాభ్యంతరవిషయము లను పర్యాలోచనచేయకయే సంభవించును. ఇదియే నీరెంటికి భేదము. పైవిధముగ చతుర్విధమగు ప్రాణా యామము ‘అపానే జుహ్వతి ప్రాణం’ అను సార్ధశ్లోకముచే నిరూపించబడెను. ఇంతవరకునైన గ్రంథముచే చెప్ప బడిన ద్వాదశయజ్ఞ కర్తలకు కలుగు ఫలమును జెప్పుచున్నాడు. “సర్వేప్యేతే యజ్ఞవిదః...బ్రహ్మసనాతనం” పన్నెండువిధములగు యజ్ఞములను తెలుసుకొనినవారు, యజ్ఞములను చేసినవారును, యజ్ఞములచే నశింపజేయ బడిన కల్మషముకలవారు, యజ్ఞములను జేయగామిగిలిన కాలమునయున్న యన్నము యమృతమనబడును. అట్టి యన్నమును భుజించువారును, వీరందరును సత్త్వశుద్ధిపూర్వకజ్ఞానప్రాప్తిద్వారమున సనాతనమగు బ్రహ్మమును బొందెదరు. సంసారమునుండి ముక్తులగుదురని యర్థము. ఈవిధముగ యజ్ఞముల నాచరించినవారికి ఫలమును జెప్పి యజ్ఞముల నాచరించనివారికి దోషమును జెప్పుచున్నాడు— “నాయం..................కురుసత్తమ” నిరుక్తములగు యజ్ఞములలో నొక యజ్ఞమైన నాచరించనివాడు సర్వనింద్యుడగుటవలన నట్టివానికి స్వల్పసుఖము కల యీమనుష్యలోకమే ప్రాప్తించదు. స్వల్పసుఖస్థానమగు నీమనుష్యలోకమే ప్రాప్తించనప్పుడనేకసుకృత సాధనములచే సాధింపదగిన స్వర్గాదిలోకము లట్టివారికి యెటుల ప్రాప్తించును? ప్రాప్తించనేరవు. ॥౩౧॥

శంకరానందీయము:— పాపక్షయమును కోరునట్టి ముముక్షువునకు ప్రాణాయామముగూడ యజ్ఞ రూపమే. గాన నదియు ముముక్షువునకు కర్తవ్యమని సూచించుటకు “అపానే జుహ్వతి” అనుశ్లోకముచే జెప్పుచుండెను.

కొందరు ముముక్షువులు వాయుప్రవేశనాడియందు ప్రాణవృత్తిని హోమముచేయుచుండిరి. అనగా నాసి కాద్వయమునందు చిత్తతాళ్ళమును దెలిసికొని పూరకమనెడి ప్రాణాయామమును చేయుచుండిరని యర్థము. అట్లే మఱికొందరు వాయునిర్గమననాడియందపానవృత్తిని హోమమును చేయుచుండిరి. అనగా రేచకమనెడి ప్రాణాయామమును చేయుచుండిరని యర్థము. ముఖనాసికలచే వెలుపలకు వాయువుయొక్క గమనము ప్రాణ గతియనియు, ముఖనాసికలచే లోపలకు వాయువుయొక్క గమనము అపానగతియనియు జెప్పబడును. కొందరు ఇట్టి ప్రాణాపానగతులను నిరోధించి కేవలము కుంభకమనెడి ప్రాణాయామమును చేయుచుండిరని యర్థము.

అట్టి మనస్థైర్యమునట్టి వాయువు, వాక్కు, దృష్టి వీటికి స్థైర్యము చేకూరుచుండును. ఈ విధముగ నిరూపించబడిన ద్వాదశయజ్ఞములకు ఫలమును జెప్పుచున్నాడు. "సర్వేప్యేతే.........యాంతి బ్రహ్మ సనాతనం" ఈ యజ్ఞమును తెలిసికొనినవారును, లేక యజ్ఞములను జేయువారును, యజ్ఞములచే నశింపజేయుబడిన పాపములు కలవారును, (యజ్ఞము జేయగా మిగిలిన కాలమున ననిషిద్ధమగు నన్నము యమృత మనబడును.) అట్టియన్నమును భుజించువారును జ్ఞానప్రాప్తిద్వారమున నిత్యమగు బ్రహ్మను పొందుదురు. ||౩౧||

పరమార్థప్రదీప:— మరియు మూడు యజ్ఞముల నీశ్లోకమున జెప్పుచున్నాడు.-కొందరు "అపానే.....పరాయణాః" అధోవృత్తియందూర్ధ్వవృత్తిని పూరకమును హోమముజేయుచుండిరి. (అనగా పూరక కాలమున ప్రాణము నపానములో నేకముచేయుచుండిరని యర్థము. అట్లే కుంభకముచే ప్రాణాపానముల యూర్ధ్వాధోగతుల నిరోధించి రేచక కాలమున యపానమున బ్రాణములను హోమముచేయుచుండిరి. ఈ విధముగ రేచక పూరక కుంభకములచే ప్రాణవాయువును వశముజేసుకొని ప్రాణాయామపరాయణులవారగుదురు. పైవిషయమునే యాథర్వణశ్రుతియు నిట్లు జెప్పుచున్నది:— "ఆత్మా దేవానాం భువనస్య గర్భో యథావశం చరతి ఏష దేవః ఘోషా ఇదం యస్య శృణ్వేత రూపం తస్మై వాతాయ హవిషా విధేమ" దీనికి భాష్యము— "తస్మై వాతాయ ప్రాణముఖ్యాయ వాయుర్వై గౌతమసూత్రం తథా వాయుర్వై క్షేపిష్ఠాదేవతా తథా వాయో త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి" ఇత్యాదిశ్రుతేః వాతాయ హిరణ్యగర్భాయ హవిషా హవిర్ద్రవ్యేణ యథోచితాహారరూపేణ విధేమ పరిచరేమ తస్మై। కస్మై? యస్య ఇద మనుభూయమానం రూపం ఘోషా అనాహతధ్వనయః శృణ్వేత శ్రోత్రవిషయీకుర్వీత। యద్వైష ప్రాణ ఆత్మనో దేవో వశంచరతి వశవర్తీ భవతి। కింభూతో దేవః దేవానామాత్మా అంతర్యామీ న కేవలం దేవానాం భువనస్య గర్భో బీజభూతః" (ఏ ప్రాణవాయువుయొక్క యనాహతధ్వని వినబడుచున్నదో, ప్రాణరూపుడైనదేవుడు వశవర్తియగుచున్నాడో, సర్వదేవతలకు నంతర్యామియేగాక భువనమునకు బీజరూపుడో, అట్టి ప్రాణముఖ్యుడు, హిరణ్యగర్భరూపుడునగు వాయువుకొరకు యథోచితాహారరూపమగు హవిస్సుచే పరిచర్యచేయుదుము. అని సముదితార్థము.) ||౩౧||

నీలకంఠీయము:— పదునొకొండవయజ్ఞము నీశ్లోకమున జెప్పుచుండెను. మరికొందర పానవృత్తియందు ప్రాణవృత్తిని యుంచెదరు. అనగా పూరకమనెడి ప్రాణాయామము ననుష్ఠించెదరు. అట్లే ప్రాణవృత్తియందపానవృత్తిని యుంచెదరు. అనగా రేచకమనెడి ప్రాణాయామము ననుష్ఠించెదరు. ముఖమునను, నాసికలన వాయునిర్గమనము ప్రాణగతియనబడును. దానికి తల్లక్రిందుగ నధోనిర్గమన మపానగతియనబడును. అట్టి ప్రాణాపానగతుల నరికట్టిప్రాణాయామతత్పరులగుదురు.అనగా కుంభకమనెడి ప్రాణాయామమునాచరించెదరనియర్థము.

పండ్రెండవయజ్ఞము నీశ్లోకముచే చెప్పుచుండెను. మరికొందరు విషయభోగములను నిగ్రహించిన (విడచిన)వారై "ప్రాణాన్" మనస్సుతోగూడిన యింద్రియములను "ప్రాణేషు" మనశ్చిత్తాహంకారములయందు ప్రవిలాపమును జేయుచుండిరి. పూర్వమునందు బుద్ధిని గ్రహించుటవలన నిచట బుద్ధిని గ్రహించనవసరములేదు. కనుకనే యిచట "ప్రాణేషు" అనుశబ్దమునకు మనశ్చిత్తాహంకారములే యర్థము. అనగా నింద్రియములను సంకల్పాత్మక మనస్సుయందు లయింపజేసి యట్టిమనస్సును స్మరణాత్మకచిత్తమునందు, అట్టిచిత్తము నహంకారమునం దుపసంహరించును. అట్టి యభిమానరూపమగు నహంకారము- కట్టెల నన్నిటిని తగులబెట్టి భస్మమొనరించినయగ్ని తగులబెట్టదగినదేదియు లేనితరి స్వయముగా శాంతించినట్లు యభిమంతవ్యమేదియు లేనందున స్వయముగ లయమును పొందును. అట్టి యహంకారలయమునందెవరికి సమాధిబుద్ధికలదో వారాభిమానికులనబడుదురు. అట్టి యాభిమానికులు పూర్వమునందు చెప్పబడిన బుద్ధియోగులకంటె నికృష్టులు (తక్కువవారు.) ఇట్టి యాభిమానికుల నుద్దేశించి వాయవీయమునందు "సహస్రం త్వాభిమానికాః" అభిమానికులు వెయ్యిమన్వంతరములు

ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే ।
కర్మజా న్విద్ధి తా న్సర్వా నేవం జ్ఞాత్వా విమోక్ష్యసే ॥ ॥౩౨॥

**పదవిభాగము:—** ఏవం–బహువిధాః– యజ్ఞాః– వితతాః– బ్రహ్మణః– ముఖే– కర్మజాన్– విద్ధి– తాన్–సర్వాన్–ఏవం–జ్ఞాత్వా–విమోక్ష్యసే. ॥౩౨॥

**ప్రతిపదార్థము:—** ఏవం=పూర్వమునందు చెప్పఁబడిన; బహువిధాః=అనేకప్రకారములైన; యజ్ఞాః=యజ్ఞములు; బ్రహ్మణః=వేదముయొక్క; ముఖే=ద్వారమునందు; వితతాః=విస్తీర్ణమైనవి; తాన్=వాని; సర్వాన్=నిఖిలయజ్ఞములను; కర్మజాన్=కాయిక వాచిక మానసికకర్మలవలన జనించినవానినిగ; విద్ధి=తెలిసికొనుము; ఏవం=ఇట్లు; (యజ్ఞములు కర్మలవలన జనించునవి. నేను వ్యాపారశూన్యుడనని;) జ్ఞాత్వా=తెలిసికొని; అశుభాత్=(ఈపదమధ్యాహార్యము.) అశుభరూపమగు సంసారమునుండి; విమోక్ష్యసే=విడువబడగలవు. ॥౩౨॥

---

**శాంకరభాష్యమ్:—**

ఏవమితి । ఏవం యథోక్తా బహువిధా బహుప్రకారా యజ్ఞా వితతా విస్తీర్ణా బ్రహ్మణో వేదస్య ముఖే ద్వారే వేదద్వారే ణావగమ్యమానా బ్రహ్మణో ముఖే వితతా ఉచ్యంతే । తద్యథా—'వాచి హి ప్రాణం జుహుమః' ఇత్యాదయః। కర్మజా న్కాయికవాచికమానసకర్మో

---

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

ఈచెప్పఁబడిన యజ్ఞములను నీవూహించి చెప్పుచుంటివా ? అనుశంకను తొలిగించుటకు ఈయజ్ఞములు వేదమూలకములగుటచే నుత్ప్రేక్షామూలకములు కావని 'ఏవం' అనుశ్లోకముచే చెప్పుచుండెను.

---

విగతజ్వరులై యుండెదరని చెప్పఁబడెను. ఇచ్చట భౌతికమగు యోగము చెప్పబడలేదు. భౌతికయోగానుష్ఠాతల నుద్దేశించియే వాయవీయమునందు "భౌతికాస్తుశతంపూర్ణం" భౌతికయోగానుష్ఠాతలు నూరుమన్వంతరములు విగతజ్వరులై యుండెదరని చెప్పఁబడెను. వీరందరును యజ్ఞానుష్ఠాతలే. యజ్ఞముచే నశింపఁజేయబడిన కిల్బిష (పాప) ములుకలవారు. సర్వయజ్ఞములు పాపనాశనముకొఱకే సమర్థమైనవి. కాని సాక్షాత్తు మోక్షముకొఱకు సమర్థమైనవికావని యర్థము.

ఈ చెప్పఁబడిన యజ్ఞములలో నేదైన నొకయజ్ఞమునైన నాచరించుట కశక్తులనుగూర్చి చెప్పుచుండెను. పంచయజ్ఞ మహాయజ్ఞముల నాచరించగ మిగిలినయన్నము అమృతమనఁబడును. అట్టి యమృతాఖ్యమగు నన్నము నెవరుభుజించెదరో వారును చిత్తశుద్ధిద్వారమున సనాతనమగు బ్రహ్మమును పొందెదరు. పూర్వమునందు చెప్పఁబడిన 12 యజ్ఞములలో నేదోయొక యజ్ఞముకాని, పంచమహాయజ్ఞములుకాని లేనివాని కీలోకమే లేదు. అనగా నీలోకమునందు ప్రాప్తించు సుఖమే లేదు. ఇక నాత్మలోక మెట్లు ప్రాప్తించును ? ఎట్లును ప్రాప్తించనేరదు.
॥౩౧॥

—• ౪వ అధ్యాయము— ౩౨ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:—"ఈయజ్ఞము లన్నియు యూహాకల్పితములుగావు. వేదప్రమాణకములు"అని యీ శ్లోకమున జెప్పుచున్నాడు. "ఏవం................ముఖే" పూర్వోక్తములు బహుప్రకారములు నగు యజ్ఞములు (బ్రహ్మముఖమునందు) వేదద్వారమున విస్తృతములైనవని తెలియబడినవి. (ఆవేదవాక్యముల నిట

శాంకరభాష్యమ్:—

ద్భవా న్విద్ధి తా న్సర్వా ననాత్మజాన్ । నిర్వ్యాపారో హ్యాత్మా । అత ఏవం జ్ఞాత్వా విమో క్ష్యసేఽశుభాత్ । న మద్వ్యాపారా ఇమే నిర్వ్యాపారోఽహ ముదాసీన ఇత్యేవం జ్ఞాత్వాఽ స్మాత్సమ్య గ్దర్శనా న్మోక్ష్యసే సంసారబంధనా దిత్యర్థః ॥౩౨॥

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

ఈవిధముగ ననేకవిధములగు యజ్ఞములు వేదముయొక్క ముఖమునందు విస్తీర్ణమైనవి. అనగా (వేదద్వారమున తెలియబడుటవలన వేదముఖమున విస్తీర్ణమైనవి) అని చెప్పఁబడు చున్నవి అది యెట్లనిన "ఏతద్ధస్మ వై తత్పూర్వే విద్వాంస ఆహుః" (దీనిని ప్రాచీనవిద్వాం సులు చెప్పిరి అని యుపక్రమించి "వాచి హి ప్రాణం జుహుమః" వాక్కునందు ప్రాణమును హోమముచేయుచుంటిమి. అని జ్ఞానశక్తిగల విషయమునందు (వాక్కునందు) క్రియాశక్తిగల విష యప్రాణముయొక్క యుపసంహార మీశ్రుతియందు వివక్షితము. జ్ఞానశక్తికల వాగాదులు, క్రియా శక్తిగల ప్రాణాదులు పరస్పర ముత్పత్తిప్రళయములుకలవగుటచే నవి లేనిచో యధ్యయనమే సిద్ధిం చదని యర్థము. కాయికవాచికమానసరూపమగు కర్మములవలన నీయజ్ఞములు జనించునని తెలిసి కొనుము. అనగా కర్మము లనాత్మరూపములు. అట్టియనాత్మరూపములగు కర్మములవలననే నీయజ్ఞములు జనించును. ఆత్మయన్ననో వ్యాపారశూన్యము (క్రియారహితము) కాన నిట్లు తెలిసికొనిన సంసారబంధనమువలన నీవు ముక్తుడవగుదువు. (అనగా) "నివన్నియు నావ్యాపార ములు కావు, నేను నిష్క్రియుఁడను. ఉదాసీనుఁడను" అని తెలిసికొనినచో నిట్టి సమ్యగ్దర్శన మువలన సంసారబంధమునుండి విడవబడుదువు. )ముక్తుడ వగుదువనుట. ॥౩౨॥

గ్రంథవిస్తరభీతిచే నుదాహరించుటలేదు.) "కర్మజా న్విద్ధితాన్సర్వాన్" ఆయజ్ఞములను కాయిక వాచక మానసిక కర్మలవలన జనించువానిగను, ఆత్మ నిర్వ్యాపారమైనదిగానయాత్మజన్యములుగావనియును తెలిసికొనుము. అట్లాత్మస్వరూపుడనగు నే నుదాసీనుడనని తెలిసికొని యాసంసారసాగరమునుండి విముక్తుడవుకాగలవు. ॥౩౨॥

శంకరానందీయము:— పూర్వోక్తములగు యజ్ఞములన్నియు వేదప్రతిపాదితములు. "యజ్ఞవిదో యాంతి సనాతనం" (యజ్ఞవేత్తలు బ్రహ్మమును పొందెదరు.) అను ప్రమాణవాక్యము ననుసరించి యజ్ఞములకుకూడ సాక్షాన్మోక్షసాధనత్వము ప్రతీయమానమగుచున్నది. కాన నిక జ్ఞానసాధనప్రయాసమెందులకు?" అనునా శంక మీద చెప్పుచున్నాడు. "కర్మజాన్.........విమోక్ష్యసే" యజ్ఞాదికర్మలు- "నకర్మణా నప్రజయా" అను బహుశ్రుతివిరోధము వాటిల్లునుగాన నిత్యమగు మోక్షఫలమునిచ్చునని చెప్పుట యసంగతమగును. ఇక ననిత్యము అగు యజ్ఞాదులు యనిత్యఫలమునే యొసంగును. "క్రియాకుర్వద్ధికారకం" అను స్మృత్యనుసారము యజ్ఞములను కర్మలవలనను, కర్మకారకములవలనను పుట్టునవిగా (వాగాదీంద్రియజన్యములనుగ) తెలిసికొనుము. "యజ్ఞములు వాగాదీంద్రియవ్యాపారజన్యములేయైనను యపూర్వములు" అందువా ? యవి యపూర్వములైనను, పూర్వము లైనను కర్మలుగాన వాటినుండి కర్మత్వము తొలగనేరదు. కనుకనే యనిత్యఫలకములేగాని నిత్యఫలప్రదములు కానేరవు. అని పైవిధమున తెలిసికొని నిత్యఫలప్రదమగు జ్ఞానమును సంపాదించిన సంసారబంధమునుండి ముక్తుడవు కాగలవు. ॥౩౨॥

గీ॥ శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞాజ్జ్ఞానయజ్ఞః పరన్తప।
సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే ॥ ॥౩౩॥

**పదవిభాగము:—** శ్రేయాన్ - ద్రవ్యమయాత్ - యజ్ఞాత్ - జ్ఞానయజ్ఞః - పరన్తప! - సర్వం కర్మ - అఖిలం - పార్థ! - జ్ఞానే - పరిసమాప్యతే। ॥౩౩॥

**ప్రతిపదార్థము:—** హే పరన్తప! - శత్రువులను తపింపఁజేయు నోయర్జునా!; ద్రవ్యమయాత్ = ద్రవ్యమనెడి సాధనములచే సాధింపఁదగిన; యజ్ఞాత్ = యజ్ఞముకంటె; జ్ఞానయజ్ఞః = జ్ఞానమనెడి యజ్ఞము; శ్రేయాన్ = ప్రశస్యతరము; హే పార్థ! = కుంతీపుత్రుఁడవగు నోయర్జునా!; సర్వం = సమస్తమైన; అఖిలం = నిఖిలమగు; కర్మ = కర్మము; జ్ఞానే = (సర్వతస్సంప్లుతోదకస్థానీయమగు) జ్ఞానమునందు; పరిసమాప్యతే = అంతర్భవించుచున్నది. ॥౩౩॥

---

**శాంకరభాష్యమ్:—**

బ్రహ్మార్పణమిత్యాదిశ్లోకేన సమ్యగ్దర్శనస్య యజ్ఞత్వం సమ్పాదితం, యజ్ఞాశ్చానేక ఉపదిష్టాస్తైస్సిద్ధపురుషార్థప్రయోజనైః జ్ఞానం స్తూయతే। కథం? శ్రేయానితి। శ్రేయాన్ద్రవ్యమయాద్ద్రవ్యసాధనసాధ్యాద్యజ్ఞాజ్జ్ఞానయజ్ఞః హే పరన్తప! ద్రవ్యమయోహి యజ్ఞః

---

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

ఇంతవరకగు గ్రంథముచే కర్మయోగ మనేకధాఁ జెప్పఁబడెను. అది విని యర్జునుడు శ్రేయస్సాధనమెల్ల కర్మమే యనుజ్ఞానముచే కేవల జ్ఞానము నాదరింపకుండెనని శ్రీకృష్ణపరమాత్మ యూహించి 'బ్రహ్మార్పణం' అను శ్లోకముచే సమ్యగ్దర్శనమునకు యజ్ఞత్వము సంపాదించెను. అనంతరమున ననేకయజ్ఞముల నుద్దేశించెను. ఆయజ్ఞములన్నిటికి పురుషార్థమనెడి ప్రయోజనము సిద్ధమే. అట్టి సిద్ధమైన పురుషార్థముకల యజ్ఞములచే సమ్యగ్జ్ఞానమును స్తుతి చేయుచుండెను. అది యెట్లనిన? ద్రవ్యము, స్వాధ్యాయము అనెడి సాధనములచే సాధింపదగిన యజ్ఞముకంటె ఓయర్జున! జ్ఞానయజ్ఞము శ్రేష్ఠతరము. ఎందువలననెదవా? ద్రవ్యసాధ్యమగు యజ్ఞము ఫలజనకము. జ్ఞానయజ్ఞమన్ననో ఫలజనకముగాదు. ఏది ఫలజనకమో అది ఫలమును పుట్టించి నశించును. ఫలమన్ననో జన్యమగుటచే 'ఏది జన్యమో యది యనిత్యము' అను వ్యాప్తిచే ఫలమును యనిత్యమే. మోక్షమన్ననో స్వస్వరూపముగ నవస్థానము. అది నిత్యసిద్ధము. నిత్యసిద్ధమైనను యవిద్యచే గప్పబడినది. యట్టి ప్రతిబంధకమగు నవిద్యను తొలగించి నిత్యసిద్ధమగు స్వస్వరూపము నభివ్యక్తపరచుటచే జ్ఞానయజ్ఞ మభివ్యంజకముకాని, మోక్ష

---

—♦ ౪ వ అధ్యాయము— ౩౩ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

**మధుసూదనసరస్వతీయము:—** అన్నివిధములగు యజ్ఞములకు తుల్యకన్నిర్దేశమువలన కర్మజ్ఞానములకు సామ్యము ప్రాప్తించుచుండ జ్ఞానమునకు ప్రాశస్త్యసంపాదనమునకై యీ శ్లోకములు చెప్పుచున్నాఁడు. 'శ్రేయాన్...... పరంతప' ద్రవ్యోపలక్షితము, జ్ఞానశూన్యము, సంసారఫలకమునగు యజ్ఞముకంటె సాక్షాన్మోక్షఫలము కలదగుటచే జ్ఞానయజ్ఞమే ప్రశస్యతరమైనది. అట్లగుటవలన 'సర్వఁకర్మ' ఇట్టి పశుసోమచయనాది రూపమగు అఖిల

**శాంకరభాష్యమ్:—**

ఫలస్యారమ్భకో జ్ఞానయజ్ఞః న ఫలారమ్భకోఽతశ్శ్రేయాన్ప్రశస్యతరః । కథం ? యతస్సర్వం కర్మ సమస్త మఖిల మప్రతిబద్ధం పార్థ ! జ్ఞానే మోక్షసాధనే సర్వత స్సంప్లుతోదకస్థానీయే పరిసమాప్యతేఽన్తర్భవతీత్యర్థః । 'యథా కృతాయవిజితా యాధరేయాస్సంయన్త్యేవ మేనం సర్వం తదభిసమేతి యత్కించి త్ప్రజా స్సాధు కుర్వన్తి యస్తద్వేద యత్సవేద ।' (ఛాం-4-1-4) ఇతిశ్రుతేః । ॥౩౩॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

మును పుట్టించునదిగాదు. కాన ననిత్యఫలజనకమగు ద్రవ్యయజ్ఞములకంటె నిత్యసిద్ధమోక్షాభివ్యంజకమగు జ్ఞానయజ్ఞము శ్రేష్ఠతరము. అది ఎట్లనిన ? ఓయర్జునా ! అగ్నిహోత్రాది సమస్తకర్మము 'అవిద్యమానం ఖిలం శేషో స్యేత్యఖిలం' అను వ్యుత్పత్తిచే సిద్ధమగు మహత్తరకర్మము అనగా ప్రతిబద్ధముకాని యావత్కర్మములు సర్వత స్సంప్లుతోదక స్థానీయము, మోక్షసాధనము అగు జ్ఞానమునం దంతర్భవించుచున్నవి. ఈవిషయమై ఛాందోగ్యశ్రుతియే ప్రమాణము.

ఆశ్రుతియేదనిన ? "యథా కృతాయవిజితాయాధరేయా స్సంయన్త్యేవమేవ సర్వం తదభిసమేతి యత్కించిత్ప్రజాస్సాధు కుర్వన్తి యస్తద్వేద యత్సవేద" జానశ్రుతి యను యొక రాజు సర్వదా అన్నదానరతుడై యొకానొక సమయమున "నేనీ యన్నదానమువలన కృతార్థుడను" అని గర్వించి ప్రాసాదమున కూర్చుండియుండ యీయన్నదానమునకు సప్తమహర్షులు సంతసించి యీజానశ్రుతి యన్నదానమువలననే కృతార్థుడననుకొనుచుండెను. ఇంతమాత్రముచే నితడు కృతార్థుఁడు కానేరడని తలంచి యీజానశ్రుతిని కృతార్థునిగ జేయదలచి హంసరూపము నామహర్షులు దాల్చి జానశ్రుతి ప్రాసాదము మీదుగ గమనము కలవారై "ఈజానశ్రుతి రైక్వుడా" అనిసూత్రము పలికి తామేగిరి. ఆవాక్యమును జానశ్రుతి విని నాకన్న గొప్పవాడు రైక్వుడను వాడొకడు కలడు ? అని చింతించుచు నారైక్వుని వెదకి శిష్యభావమును

శ్రౌతకర్మము, ఉపాసనాదిరూపమగు యఖిలస్మార్తకర్మముకూడ బ్రహ్మాత్మైక్య సాక్షాత్కారరూపమగు జ్ఞానమునందు ప్రతిబంధక్షయద్వారమున పర్యవసించును. "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన, ధర్మేణ పాప మపనుదతి" అను శ్రుతులుగూడ పై యభిప్రాయమునే చెప్పుచున్నవి. పైవిషయమునే "సర్వాపేక్షా చ యజ్ఞాదిశ్రుతే రశ్వవత్" (అశ్వము దుక్కిదున్నుట కుపయోగించున దైనను యోగ్యతావశమున రథములాగుట కుపయోగించబడునటుల యజ్ఞదానాద్యాశ్రమోచితకర్మలు జ్ఞానోత్పాదనమునకై యపేక్షితము అగుచున్నవి. కాన జ్ఞానమున కాశ్రమోచిత కర్మాపేక్ష పైవిధమునకలదు.) అను న్యాయముకూడ చెప్పుచున్నది.

శంకరానందీయము:— అనిత్యఫలదములు వ్యవహితసాధనములు కలవియునగు దైవాదియజ్ఞములకంటె సాక్షాన్మోక్షసాధనమగుటవలన ఇంతకుపూర్వము "బ్రహ్మార్పణం" అనుమంత్రముచే వర్ణించబడిన జ్ఞానయజ్ఞ మెక్కు—

**శాంకరభాష్యతత్త్వబోధినీ—**

పొంది యతనిని తాను దేనివలన కృతార్థుఁడగునో దానినుపదేశింపమని వేడ నారైక్వుఁడనుగ్రహము కలవాడై యాజానశ్రుతికి బ్రహ్మజ్ఞానము నుపదేశించి పైనుదహరించిన శ్రుతిని చెప్పెను. ద్యూతమునందుం డొక యయఃఖండమునకు (నినుపగుండునకు) నాలుగు పలుకలుండును. ఒక పలకయందు నాలుగు గీటులుండును. అట్లు నాలుగు గీట్లుకల పలకకు కలియని పేరు. రెండవపలకయందు మూడుగీట్లుండును. మూడుగీట్లుగలపలకకు 'త్రేత' అనియు, అట్లే రెండు గీట్లుగల పలకకు 'ద్వాపర' అనియు, ఒక గీటుకల పలకకు 'కృత' యనియు పేరు. ద్యూతమాడువారాగుండును త్రిప్పి నేలవైచినచో నాల్గుగీట్లుకల పలక యెవరివలన పైకి తిరగబడునో వారాద్యూతము నందితరులను జయించినవారగుదురు. అది యెట్లనిన? ఒకటి రెండులోను, రెండు మూడులోను, మూడు నాలుగులో నంతర్భవించుటచే, మూడు, రెండు, ఒకటి యగునంకములు తిరిగినవారు జయించబడిన వారగుదురు. అట్టి కృతాయమనెడి ద్యూతమునందు జయముకలవానికొరకు మూడు, రెండు ఒకటి యంకములుకల త్రేతా ద్వాపర కలియను సంజ్ఞలు కల ద్యూతములు మహాసంఖ్యయందవాంతరసంఖ్య లంతర్భావమును తప్పక పొందుటవలన నంతర్భావమును పొందును. అట్లే జ్ఞానముకల పురుషుని నిఖిలప్రజ లేసాధుకర్మము నాచరించిరో యాసర్వము పొందుచున్నది నిఖిలప్రాణి కృతపుణ్య కర్మ ఫలభాక్కగు జ్ఞాని యెవరనెదవా? ఆరైక్వుఁ డేతత్త్వమును తెలిసికొనెనో ఆత్మతత్త్వము నెవడు తెలిసికొనునో అట్టిపురుషుని ఇతరులచే నాచరించబడిన పుణ్యకర్మలు పొందునని శ్రుతికూడ బోధించుచున్నది. కాన జ్ఞానమునందు నిఖిలకర్మము లంతర్భావమును పొందుచున్నవి ॥33॥

---

నదియని ఈ శ్లోకమున జెప్పుచున్నాడు. ద్రవ్యమంత్రతంత్రక్రియాశ్రమసాధ్యము, అనిత్యాల్పస్వర్గాదిఫలమునకు హేతువునగు దైవాదియజ్ఞజాతముకంటె జ్ఞానయజ్ఞము నిత్యనిరంతరానందరూపమోక్షఫలము నిచ్చునదియగుటవలన శ్రేష్ఠతరమైనది. పురుషునకు కర్తవ్యమగు శ్రౌతము, స్మార్తము, లౌకికము నగు సర్వకర్మ నిశ్శేషముగ జ్ఞానమునందు సమాప్తమగును (నదినిదాటి అవలివడ్డునకు వెళ్లనిచ్ఛగించువాడావలి యొడ్డునుజేరినచో వానికి వెళ్లదగినప్రదేశములేనటుల జ్ఞానముపొందినవానికి జేయదగినకర్మమేదియు లేదని యర్థము.)

లేక, "జ్ఞానేసంప్రాప్తే" జ్ఞానము ప్రాప్తించగనే "సర్వంకర్మ" బ్రహ్మకల్పశతములనుండియు వార్జించినదియు సంచితరూపము, ఆగామిరూపము, ప్రవృత్తఫలకము, అప్రవృత్తఫలకమునగు సర్వకర్మము "అఖిలంసమాప్యతే" సూర్యప్రభచే చీకటివలె జ్ఞానశక్తిచే నిశ్శేషముగ నిర్మూలించబడును.

లేక "యథా కృతాయవిజితాయాధరేయాః సంయన్తి" (జూదమునందు గెలుపొందినవానికి ఓడినవారు ధనమొనిచ్చునటుల) అనుశ్రుత్యుక్తరీతిని పుణ్యశీలురచే చేయబడిన యజ్ఞదానతపోవ్రతాదిరూపమగు సమస్తపుణ్యము-జ్ఞానము ప్రాప్తించినచో నాజ్ఞానిచే నిశ్శేషముగ పొందబడును. (జ్ఞానప్రాప్తిచే విద్వాంసుఁడు సర్వకర్మానుష్ఠాతయే యగునని యర్థము.) ॥33॥

గీ॥ తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా ।
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥ ॥౩౪॥

పదవిభాగము:— తత్ - విద్ధి - ప్రణిపాతేన - పరిప్రశ్నేన - సేవయా - ఉపదేక్ష్యన్తి - తే - జ్ఞానం - జ్ఞానినః - తత్త్వదర్శినః ॥౩౪॥

ప్రతిపదార్థము:— హే అర్జున !=(ఊపద మధ్యాహార్యము) ఓయర్జునుడా !; తత్త్వదర్శినః= బ్రహ్మముయొక్క యాథార్థ్యమును తెలిసికొనిన; జ్ఞానినః=జ్ఞానులు; తే=నీకొరకు; ప్రణిపాతేన= సాష్టాంగనమస్కారముచేతను; పరిప్రశ్నేన=బంధమనగ నేది ? మోక్షమనగ నేది ? విద్యయనగ నేది ? అవిద్యయనగ నేది ? అనెడి ప్రశ్నచేతను; సేవయా=శుశ్రూషచేతను; తత్=అ; జ్ఞానం=జ్ఞానమును; ఉపదేక్ష్యంతి=ఉపదేశింపగలరు; ఇతి=ఇట్లు; విద్ధి= తెలిసికొనుము. ॥౩౪॥

శాంకరభాష్యమ్:

తదేత ద్విశిష్టం జ్ఞానం తర్హి కేన ప్రాప్యత ఇత్యుచ్యతే—తద్విద్ధీతి। తద్విద్ధి విజానీహి యేన విధినా ప్రాప్యత ఇత్యాచార్యా నభిగమ్య ప్రణిపాతేన ప్రకర్షేణ నీచైః పతనం ప్రణిపాతో దీర్ఘనమస్కార స్తేన, కథం? బంధః, కథం? మోక్షః, కా? విద్యా, కా? చావిద్యేతి పరిప్రశ్నేన, సేవయా గురుశుశ్రూష యైవమాదినా ప్రశ్రయే ణావర్జితా ఆచార్యా ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం యథోక్త విశేషణం। జ్ఞానినో జ్ఞానవన్తోఽపి కేచిద్య థావత్తత్త్వ దర్శనశీలా అపరే నాతో విశినష్టి- తత్త్వదర్శిన ఇతి। యే సమ్యగ్దర్శిన స్తైరుపదిష్టం జ్ఞానం కార్యక్షమం భవతి। నేతర దితి భగవతో మతమ్॥ ॥౩౪॥

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

ఇట్టి శ్రేష్ఠతరమగు జ్ఞాన మేయుపాయముచే ప్రాప్తించును? అనుశంకను తొలిగించుటకు జ్ఞానప్రాప్త్యుపాయమును 'తద్విద్ధి' అనుశ్లోకముచే చెప్పుచుండెను.

"తద్విజ్ఞానార్థం స గురు మేవాభిగచ్ఛే త్సమిత్పాణి శ్శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్" అనుశ్రుత్యుక్తప్రకారము బ్రహ్మనిష్ఠుని కడకేగి ప్రకర్షగ నీచైః పతనము అనగా దండవత్ప్రణామమును చేయవలెను. అటుపిమ్మట బంధమనగ నెట్టిది? మోక్షమనగ నెట్టిది? విద్యయనగ నేది? అవిద్యయనగ నేది? అనునిట్టి ప్రశ్నములు చేయవలెను. అటుపిమ్మట గురుశుశ్రూష. అనగా పాదసంవాహన వస్త్రక్షాళనాది శుశ్రూష నాచరించవలయును. ఇట్టి

—♦ ౪వ అధ్యాయము—౩౪ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:— "మోక్షఫలప్రదానసమర్థమగు జ్ఞానముకలుగుటకు అతిప్రత్యాసన్నముగ (సన్నిహితమగు) నుపాయ మెద్ది?" అనుసాశంకమీద జెప్పుచున్నాడు. "తద్విద్ధి...సేవయా" గురువుల యొద్దకువెళ్ళి ప్రణిపాత (దీర్ఘనమస్కార) పూర్వకముగ "నేనెవడను? ఎట్లుబద్ధుడనైతిని? ఏ యుపాయముచే ముక్తుడనగుదును?" ఇత్యాది ప్రశ్నపూర్వకముగను, నన్నివిధముల గురువుల కనుకూల కార్యములను చేయుచు సర్వకర్మ విలక్షణము, సర్వఫలదమునగు జ్ఞానమును పొందుము. "ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః" పైవిధముగ భక్తిశ్రద్ధాతిశయపూర్వకముగు ప్రణిపాతవిశేషముచే ప్రసన్నులై - పదవాక్యన్యాయ ప్రమాణనిపుణులు, కృతసాక్షాత్కారులునగు జ్ఞానులు పరమాత్మవిషయకమగు జ్ఞానమును నీకై ఉపదేశింపగలరు. ఇట- ఆత్మవిషయకసాక్షాత్కారముగల జ్ఞానులచే నుపదేశింపబడినదే ఫలపర్యవసాయి యగును గాని కేవల పదవాక్యప్రమాణనిపుణులచే చేయబడు యుపదేశము ఫలపర్యవసాయి కానేరదని భగవన్మతము.

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**
గురుశుశ్రూష, దండవత్ప్రణామము, ప్రశ్నలు వీటిచే బ్రహ్మతత్త్వమును దెలిసిన జ్ఞానులగు గురువులు నీకు యథోక్తవిశేషణవిశిష్టజ్ఞానము నుపదేశించెదరు. ఈ విధముచేతనే యాజ్ఞానము పొందబడునని తెలిసికొనుము. జ్ఞానవంతులలో కొందరే యథావత్తత్త్వదర్శనసమర్థులు, కొందరు కారు. కనుకనే "జ్ఞానినః" అనుదానికి "తత్త్వదర్శినః" అను విశేషణ మీయబడెను. దీనివలన దేలిన యాశయమేమి? తత్త్వదర్శులు కాని జ్ఞాను లుపదేశించినను నది సమ్యక్ జ్ఞానమనంబడదు. కార్యక్షమము గాదు. అట్లుగాక తత్త్వదర్శులగు జ్ఞానులుపదేశించిన నది సమ్యగ్జ్ఞానము కార్యక్షమమగును. అని భగవన్మతము. అట్టిసమ్యక్‌జ్ఞానము తత్త్వదర్శులగు జ్ఞాను లీయుపాయముచే స్వాధీనులై యుపదేశింతురని భావము.

"ఇట "జ్ఞానినః తత్త్వదర్శినః" అను బహువచనము ఆచార్యవిషయకము. అనగా అనేకులగు నాచార్యులవలన శ్రవణ మనేక విధము లాచరింపవలయునను యాశయముతో ప్రయుక్తమే కాని యాత్మజ్ఞానము నుద్దేశించి యాచార్య బహుత్వము వివక్షితముకాదు. ఎందువలననిన? అట్టితత్త్వ సాక్షాత్కారము తత్త్వసాక్షాత్కారవంతుఁడగు నొక యాచార్యుని యుపదేశ మాత్రమువలననే జనించు. కాన తత్త్వసాక్షాత్కారోపదేశమున కాచార్యులనేకు లక్కరలేదు. ॥३४॥

యీ మతము "తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణి శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" అను శ్రుతిసమ్మతము. ఈ శ్రుతియందును "శ్రోత్రియం- అధీతవేదుడు; బ్రహ్మనిష్ఠం- బ్రహ్మసాక్షాత్కారముకలవాడు." అనియే వ్యాఖ్యానింపబడెను. (ఇట తత్త్వదర్శినః" అని ఆచార్యవిషయకమగు బహువచనము.— ఆచార్యుడు ఒకడేయైనను గౌరవాతిశయద్యోతనార్థము ప్రయుక్తము. అట్లుకాక యనేకాచార్యద్యోతకమే యన్నచో— తత్త్వసాక్షాత్కారముకల యొకయాచార్యునివలననే తత్త్వజ్ఞానోదయమగుచుండ నిక యాచార్యాన్తరాపేక్ష వ్యర్థమగును. ॥३४॥

శంకరానందీయము:— పూర్వోక్తవిధమున యుత్కృష్టమగు తత్త్వజ్ఞానము నాకెట్లు సిద్ధించును? అను నాశంకమీద జెప్పుచున్నాడు. "తద్విద్ధి" ద్రవ్యాదియజ్ఞముల కంటె నుత్కృష్టము సాక్షాన్మోక్షఫలకమునగు జ్ఞానమును గురువులనుండి తెలిసికొనుము. (గురువులను బ్రసన్నులనుగ జేసికొని వారివలన దెలిసికొనుమనియగను) "గురువులేవిధమున బ్రసన్నులై నాకు జ్ఞానము నుపదేశింతురు? అను నాకాంక్షమీద జెప్పుచున్నాడు— "ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" సాష్టాంగనమస్కారముచేతను, శ్రద్ధాభక్తిపురస్సరముగ యుక్తకాలములయందు చేయు శుశ్రూషచేతను, యోగ్యసమయమున సవినయముగ గురుసమీపమునుజేరి— "కథం బంధః కథం మోక్షో విద్యాఽవిద్యేచ కే ఉభే। క ఆత్మా కః పరాత్మా చ తయో రైక్యం కథం వద॥" బంధమెట్లు ప్రాప్తించును? మోక్షమెట్లుప్రాప్తించును? విద్యావిద్యలన నెట్టివి? జీవాత్మయనగ నెవడు? పరమాత్మయన నెవడు? ఆ జీవాత్మపరమాత్మల కైక్యమెట్లు తెలియనగునో దెలియజెప్పుడు) అను నీవిధములగు ప్రశ్నములచేతను గురువుల కడ నాత్మజ్ఞానము నార్జించుము. నైవిధమున ప్రణిపాత, శుశ్రూషా, వివేకప్రశ్నములచే నీయందు శ్రద్ధ, భక్తి, పాండిత్య ఉపదేశయోగ్యత్వములను గ్రహించి ప్రసన్నులై 'జ్ఞానినః' శాస్త్రజన్యజ్ఞానసంపన్నులును, 'తత్త్వదర్శినః' సాక్షాత్కారజన్యమగు వస్తుయాథాత్మ్యజ్ఞానముకల గురువులు శమదమాదిసాధనములుగల నీకై 'జ్ఞానం' బ్రహ్మాత్మైకత్వావగమకము నిశ్శేషసంసారభ్రమాపనోదకమునగు జ్ఞానము నుపదేశింపగలరు. "శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" అను శ్రుత్యనుసారము 'జ్ఞానినః' అనుపదముచే సర్వశాస్త్రార్థపరిజ్ఞానము, "తత్త్వదర్శినః" అనుపదముచే వస్తువిషయకాప్రతిబద్ధానుభవసంపత్తియు గురువులకుండవలెనని సూచింపఁబడెను.

గీ॥ యజ్జ్ఞాత్వా న పునర్మోహ మేవం యాస్యసి పాణ్డవ।
యేన భూతా న్యశేషేణ ద్రక్ష్య స్యాత్మ న్యథో మయి॥ ॥౩౫॥

పదవిభాగము:— యత్-జ్ఞాత్వా-న-పునః-మోహం-ఏవం-యాస్యసి-పాండవ-!-యేన-భూతాని-అశేషేణ-ద్రక్ష్యసి-ఆత్మని--అథో-మయి- ॥౩౫॥

ప్రతిపదార్థము:— హే పాండవ!=పాండురాజుకొడుకవగు నోయర్జునా! యత్=ఏజ్ఞానమును జ్ఞాత్వా=పొంది: పునః=తిరిగి; ఏవం=ఈవిధమగు; మోహం=మోహమును; నయాస్యసి=పొందవు; యేన=ఏజ్ఞానముచే; అశేషేణ=బ్రహ్మాదిస్తంబపర్యంతమగు; భూతాని=భూతములను; ఆత్మని=నీస్వరూపమునందు; అథో=మరియు; మయి=నాస్వరూపమునందును; ద్రక్ష్యసి=చూడగలవు; ॥౩౫॥

---

శాంకరభాష్యము —

తథాచ సతీద మపి సమర్థం వచనం- యదితి। యజ్జ్ఞాత్వా యజ్జ్ఞానం తైరుపదిష్ట మధిగమ్య ప్రాప్య పున ర్భూయో మోహ మేవం యథేదానీం మోహం గతోఽసి పున రేవం న యాస్యసి హేపాణ్డవ! కించ యేన జ్ఞానేన భూతా న్యశేషేణ బ్రహ్మాదీని స్తమ్బపర్యన్తాని ద్రక్ష్యసి సాక్షాదాత్మని ప్రత్యగాత్మని మత్సంస్థా నీమాని భూతానీతి అథో అపి మయి వాసుదేవే పరమేశ్వరే చేమానీతి క్షేత్రజ్ఞేశ్వరైకత్వం సర్వోపనిషత్ప్రసిద్ధం ద్రక్ష్యసీత్యర్థః॥ ॥౩౫॥

---

శాంకరభాష్యార్థప్రబోధిని:—

తత్త్వదర్శులచే నుపదిష్టమై జ్ఞాన మజ్ఞాననాశకమగుచుండ ''యజ్జ్ఞాత్వా'' అను వచనము కూడ యోగ్యవిషయమై యర్థవత్తగును. గాన నీసంబంధమగు మోహమును పోఁగొట్టుటకు సమర్థమగునట్టి తత్త్వజ్ఞానమునందు నీవు నిష్ఠావంతుఁడవై కాదగియున్నది. ఏ జ్ఞానమును నీవు పొంది- తిరుగ నీవిప్పుడెట్టిమోహమును పొందితివో యట్టిమోహమును యో యర్జునా! పొందవు. మఱియు బ్రహ్మాది తృణపర్యంతమగు సమస్తభూతముల ప్రత్యగాత్మస్వరూపమగు నీస్వరూపమునందు సాక్షాత్తు జూడగలవు. మరియు వాసుదేవుఁడు పరమేశ్వరుఁడు అగు నాయందుగూడ నీ నిఖిలభూతములను చూడగలవు. సర్వోపనిషత్ప్రసిద్ధమగు క్షేత్రజ్ఞేశ్వరైకత్వమును (జీవేశ్వరైక్యమును,) చూడగలవనియర్థము వివక్షితము. ఈ చెప్పుటవలన మూలమున జీవునియందు, ఈశ్వరునియందు భూతముల ప్రతిష్ఠితత్వనిర్దేశముచే జీవేశ్వరభేదానువాద మను మతమే యనుశంక తొలంగించఁబడెను. ॥౩౫॥

---

ఇట గురువిషయకమగు బహువచనము- ''బహుభ్యశ్శ్రోత్రియ్యం బహుధా'' అను న్యాయానుసారము గురువుల నేకుల నాశ్రయించినచో వారిలో బ్రహ్మవేత్తయగు నొకగురువులభించిన యాగురువువలన సంసారభ్రమాపనోదకమగు జ్ఞానము లభించునను యభిప్రాయముతో చెప్పబడెనేకాని అనేకగురువులనుండి జ్ఞానముసంపాదింపవలెనని చెప్పుటకాదు అట్లన్నచో ''శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం'' అను ఏకగురుబోధకమగు శ్రుతివిరోధము వాటిల్లును. మరియు 'ఉపసీదేదేక మేవ సద్గురుం బ్రహ్మవిత్తమం' అను న్యాయమునుకూడ నొకేగురువు నాశ్రయించవలెనని బోధించుచున్నది. కాన శాస్త్రజ్ఞుడు తత్త్వవేత్త యగు నొకేగురువు నాశ్రయించవలెనని పర్యవసితము. ॥౩౪॥

—♦ ౪వ అధ్యాయము— ౩౫ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:—''పూర్వోక్తరీతిని శ్రమించి జ్ఞానమును సంపాదించినతరువాత నేమగును?'' అనుశంకకు సమాధానము నీశ్లోకమున జెప్పుచున్నాడు. ''యజ్జ్ఞాత్వా......పాండవ!'' ఓపాండవా! ఆచా

శ్లో॥ అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సన్తరిష్యసి ॥ ॥౩౬॥

పదవిభాగము:— అపి-చేత్-అసి-పాపేభ్యః-సర్వేభ్యః-పాపకృత్తమః- సర్వం-జ్ఞానప్లవేన-ఏవ-వృజినం-సన్తరిష్యసి ॥ ॥౩౬॥

ప్రతిపదార్థము:— హే అర్జున!= (ఈపదమధ్యాహార్యము) ఓయర్జునుఁడా!; త్వం= (ఈపదమధ్యాహార్యము) నీవు; సర్వేభ్యః=సమస్తమైన; పాపేభ్యః=పాపములను నాచరించువారలకంటె; పాపకృత్తమోఽపి=పాపముల నాచరించువారలలో నుత్కృష్టుడవు; అసిచేత్=అయినవాడవైనను; తత్= (ఈపదమధ్యాహార్యము) అ; సర్వం=సమస్తమైన; వృజినం=పాపమును; జ్ఞాన ప్లవేనైవ=జ్ఞానమనెడి తెప్పచేతనే; సన్తరిష్యసి=దాటగలవు. ॥౩౬॥

శ్లో...పదిష్టమగు జ్ఞానమును తెలిసికొని (ఇట జ్ఞానంజ్ఞాత్వా'' అని జ్ఞాధాతువునకు "ఓదనపాకం పచతి'' అనుస్థలమునందువలె సామాన్యవిశేషభావమైన ప్రయోగము) బంధువధాది కారణకమగు నీవిధమగు మోహమును పొంద నేరవు. కనుక "యేన...మయి'' ఇట్టిజ్ఞానముచే పితృపుత్రాదిరూపము, బ్రహ్మాదిస్తంభపర్యంతము నగు స్వావిద్యావిజృంభితములగు భూతములను త్వంపదార్థమగు నీయందును, అనంతరము తత్పదార్థము పరమార్థతః భేదరహితము, అధిష్ఠానభూతము నగు నాయందును (వాసుదేవునియందును) అధిష్ఠానాతిరేకముగ కల్పితమగునది యుండదు గాన యభేదరూపముగనే జూడగలవు. (భగవంతుడనగు) నన్ను సాక్షాత్కరించుకొనినచో సర్వాజ్ఞాన నాశమగును. అందుచే తత్కార్యభూతరూపములగు సర్వభూతములు లేకుండు (భాసించుచుండు) ననిభావము. ॥౩౫॥

శంకరానందీయము:— సద్గురూపదేశమువలన ప్రాప్తించిన జ్ఞానమునకు ఫలము నీశ్లోకమున జెప్పుచున్నాడు. "యజ్జ్ఞాత్వా......పాండవ!'' ప్రసన్నులగు గురువులచే నుపదేశింపబడిన జ్ఞానమును పొందిననీవు. "నేను, వీరు నావారు'' అని యద్వితీయాత్మయం దనేకత్వభ్రమను పొంద నేరవు. (నీవు, నేను, ఇది, అది) అనెడి మిథ్యాజ్ఞానము విడుగగలదని యర్థము.

ద్వైతజ్ఞానహేతువగు భూతసముదాయముండ యాత్మ కద్వితీయత్వ మెట్లు ప్రాప్తించుననుశంకను "యేన భూతాని'' అను నుత్తరార్థముచే దొలగించుచుండెను-ఘట, కలశ, శరావాదికమంతయు బుద్ధిసాక్షిత్వముచే మృణ్మాత్రమునియు, తరంగ, ఫేన, బుద్బుదాదికమంతయు జలమాత్రమునియు యెట్లు గ్రహించెదవో అట్లే "ఆత్మైవేదంసర్వం'' (ఈనిఖిల మాత్మస్వరూపమే) అని సర్వభూతసముదాయమున కాత్మ మాత్రత్వ గ్రాహకము మాత్మబుద్ధిచేగు సమధిగతజ్ఞానముచే బ్రహ్మాదిస్తంబపర్యంతమగు నిఖిలభూతములను "సాక్షాదహమేవేదంసర్వం'' (ప్రత్యక్షముగ నీనిఖిలము నేనే) అని స్వస్వరూపముగ (తనస్వరూపముగ) చూడగలవు.

సర్వభూతములను నాస్వరూపముగ చూచుగాక "బ్రహ్మమని, ఆత్మయని'' భేదము కలిగియుండ యెట్లద్వైతము సిద్ధించును? అనుశంకను "అథోమయి'' అనువాక్యముచే తొలగించుచుండెను. అభూతములను నిర్విశేషపరబ్రహ్మస్వరూపమగు నాయందు వెంటనే జూడగలవు. ఈవిధముగ నీకును నాకును సర్వాత్మకత్వమును జూచి యిద్దరకు నేకత్వమును "తత్త్వమసి'' యనుశ్రుతిచొప్పున జూడగలవని యర్థము. లేక సర్వభూతాత్మకమగు నాత్మను జూచి ఆయాత్మను-నిర్విశేషము, సర్వాధిష్ఠానము, పరబ్రహ్మమునగు నాయందు జూడగలవు. (ఆత్మను బ్రహ్మాభిన్నముగ జూడగలవని యర్థము.) ౩౫॥

—• ౪వ అధ్యాయము—౩౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఈశ్లోకమున జ్ఞానమాహాత్మ్యమును చెప్పుచున్నాడు— "అపిచేత్'' అను నిపాతములు అసంభావితార్థాభ్యుపగమ ప్రదర్శనార్థకములు— ఈచెప్పబోవుయర్థము సంభవింపనే సంభవింపదు. అట్లైనను జ్ఞానఫలమును చెప్పుటకై అట్టి యసంభావితార్థము నంగీకరించి చెప్పబడుచున్నది. నీవు పాపకారు

శాంకరభాష్యమ్ —

కించైతస్య జ్ఞానస్య మాహాత్మ్యం— అపీతి। అపి చేదసి పాపేభ్యః పాపకృద్భ్యః సర్వేభ్యోఽతిశయేన పాపకృత్తమ స్సర్వం జ్ఞానప్లవేనైవ జ్ఞాన మేవ ప్లవం కృత్వా వృజినం వృజినార్ణవం పాపం సన్తరిష్యసి। ధర్మోఽపీహ ముముక్షోః పాప ముచ్యతే। ॥౩౬॥

శాంకరభాష్యతాత్పర్యబోధినీ—

మఱియు యీ జ్ఞానముయొక్క మహాత్మ్య మేమనిన ? ఓ యర్జున! పాపముల నాచరించెడి సర్వులకంటె నతిశయముగ పాపముల నాచరించువాడవైనను యానిఖిల పాపములను జ్ఞానమనెడి తెప్పనాధారముగ జేసుకొని నీవు తరించగలవు. పాపమును దాటినను ధర్మముండునుకదా ? దానిఫల మవశ్య మనుభోక్తవ్యమగుచుండ జ్ఞాని కెట్లు మోక్షము ప్రాప్తించుననెదవా ? ఈ యధ్యాత్మశాస్త్రమునందు ముముక్షువునకు సంసారహేతువగుటంజేసి ధర్మము కూడ పాపరూపమే యగును. కాన ధర్మాధర్మరూపమగు పాపార్ణవమును ముముక్షువు జ్ఞానమనెడి నావచే తరించునని చెప్పుట సంగతమేయగును. పాపముల నాచరించెడి నిఖిలపాపులకంటె యతిశయముగ పాపముల నాచరించుట యొకనియందెట్లు సంభవమగునని శంకింపఁజనదు. జ్ఞానమాహాత్మ్యప్రసిద్ధినిమిత్త మట్లొకనియందు నిఖిలపాపకారిత్వము నంగీకరించి యభ్యుపగమవాదిత్వముచే నట్లు చెప్పుటవలన విరోధములేదు. కాన నట్లు నుడువుట సమంజసమే. ॥౩౬॥

లందరికంటెను కూడ పాపకారివైనను—దుస్తరమగుటచే సముద్రసదృశమగు సర్వమగుపాపమును జ్ఞానమను తెప్పచే లెస్సగ దాటగలవు. ముముక్షువునకు పాపమువలె బుణ్యముగూడన ననిష్టఫలసాధనమే గాన నిట వృజిన శబ్దముచే సంసారఫలకవగు ధర్మాధర్మరూపకర్మము వివక్షితము.

శంకరానందీయము— పూర్వోక్తమగు నిట్టిజ్ఞానముబొందియు భీష్మద్రోణాదిగురుస్వజనవధజనిత మగు పాపమునుండి ముక్తుడనుకానను శంకావంతుడగు యర్జుననిజూచియీశ్లోకమున జెప్పుచున్నాడు— మహాపాపోపపాతక తత్సమపాపసంకరీకరణ మలినీకరణాదికములు ఉక్తములు, అనుక్తములు భూతభవిష్యద్వర్తమాన కాలీనములు నగు సర్వపాపములను జేసినవారికంటెగూడ నీవు పాపకృత్తముడవగుచో (అనగా నీవొక్కడవే యాసమస్త పాపములను జేసినవాడవగుచో) నట్టి సర్వపాపములనెడి సముద్రమును జ్ఞానమనెడి తెప్పతో (కూటస్థాసంగచిదా)పుడవగుట క్రియ సంభవించదుగాన నేను కర్మలకు కర్తనుగాను ఎల్లపుడు నిష్క్రియుడనే యైతిని అను యవిక్రియత్వజ్ఞానముచే) సంతరించగలవు. ఇట్లగుటచే భీష్మాదివధజనితమగు పాపమును తరించగలవని రామి చెప్పవలెను. (అనగ నల్పమగు నీపాపము ననాయాసముగ తరించగలవని యర్థము) ॥౩౬

పరమార్థప్రపా— "సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ" (బ్రహ్మము సత్యజ్ఞానానంతస్వరూపము) అను శ్రుతి చెప్పున జ్ఞానము పరమాత్మస్వరూపము. అదిసత్యము. దానికంటె నితరమగునది యనిత్యము. ఇట్లే పితృపుత్రసుహృద్బంధ్వాది సకలప్రపంచము మిథ్యయగుటవలన జ్ఞానైక నాశ్యము. ఎట్లు స్వాప్నికబ్రహ్మహత్య జాగ్రదవస్థయందు మిథ్యయగుటవలననే దానికి ప్రాయశ్చిత్తము విధించబడలేదో అట్లే జ్ఞానావస్థయందు సర్వప్రపంచము మిథ్యయగుటవలన యజ్ఞానావస్థయందాచరింపబడిన కర్మము అంటనేరవు. ॥౩౬॥

గీ॥ యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥ ॥౩౭॥

పదవిభాగము:—యథా-ఏధాంసి-సమిద్ధః- అగ్నిః- భస్మసాత్-కురుతే అర్జున- జ్ఞానాగ్నిః- సర్వ కర్మాణి- భస్మసాత్-కురుతే-తథా । ॥౩౭॥

ప్రతిపదార్థము:— హే అర్జున!=ఓయర్జునా!; సమిద్ధః=లెస్సగ ప్రజ్వలింపఁజేయబడిన; అగ్నిః=అగ్నిహోత్రము; ఏధాంసి=కట్టెలను; యథా=ఎట్లు; భస్మసాత్=భస్మీభావమును; కురుతే=చేయుచున్నదో; తథా=అట్లే; జ్ఞానాగ్నిః=జ్ఞానమనెడి యగ్నిహోత్రము; సర్వకర్మాణి=నిఖిలకర్మములను; (ప్రారబ్ధవ్యతిరిక్తనిఖిలకర్మములను;) భస్మసాత్=నిర్బీజములనుగ; కురుతే=చేయుచున్నది. ॥౩౭॥

శాంకరభాష్యమ్:—

జ్ఞానం కథం నాశయతి పాప మితి దృష్టాంత ముచ్యతే— యథేతి। యథైధాంసి కాష్ఠాని సమిద్ధస్సమ్యగిద్ధో దీప్తోఽగ్నిర్భస్మసా ద్భస్మీభావం కురుతేఽర్జున! జ్ఞానమేవాగ్నిర్జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా నిర్బీజీకరోతీత్యర్థః। నహి సాక్షా దేవ జ్ఞానాగ్నిః కర్మాణీంధన వ ద్భస్మీకర్తుం శక్నోతి తస్మా త్సమ్యగ్దర్శనం సర్వకర్మణాం నిర్బీజత్వే కారణ మిత్యభిప్రాయః। సామర్థ్యా ద్యేన కర్మణా శరీర మారబ్ధం తత్ప్రవృత్త ఫలత్వా దుపభోగేనైవ క్షీయతేఽతో యాన్యప్రవృత్తఫలాని జ్ఞానోత్పత్తేః ప్రాక్కృతాని జ్ఞానసహభావీని చాతీతానేకజన్మకృతాని చ తాన్యేవ సర్వాణి భస్మసాత్కురుతే॥ ॥౩౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జ్ఞానముండినను ధర్మాధర్మములు ప్రత్యక్షసిద్ధమైయుండ జ్ఞానమెట్లు ధర్మాధర్మరూపమగు పాపమును నశింపఁజేయును? అనెదవా వినుమీవిషయమున దృష్టాంతమును చెప్పెద. ప్రతిబంధరహితమై ప్రజ్జ్వలింపఁజేయబడిన యగ్నియెట్లు యెండినకట్టెలను ఓయర్జునా! భస్మమునొనరించునో. అట్లేజ్ఞానమనెడి యగ్నియుసర్వకర్మములను నిర్బీజముల నొనరించును. అని యర్థము. జ్ఞానము సాక్షాత్తు కర్మములను దహింపఁజేయునని చెప్పక నిర్బీజముల నొనరించునని చెప్పుట యెందులకనెదవా? శుక్తిజ్ఞానము శుక్తివిషయకాజ్ఞాననివర్తకమై లోకమున యనుభవసిద్ధము. అట్లే యాత్మజ్ఞానము స్వవిషయాత్మాజ్ఞాననివర్తకమగును. కర్మబీజభూతా

—• ౪ వ అధ్యాయము— ౩౭ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూధనసరస్వతీయము:— వెనుకటిశ్లోకమున సముద్రతరణమువలె పాపతరణము చెప్పబడెను. అట్లగుటచే సముద్రస్థానీయములగు కర్మలకు నాశముప్రతీయమానమగుటలేదనుయూహతో నీశ్లోకమున మరియొకదృష్టాంతమును జెప్పుచున్నాడు. "యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున!" (ఓయర్జునా ఎట్లు ప్రజ్వలితమగుయగ్ని కాష్ఠములను భస్మావశేషముగ జేయునో "జ్ఞానాగ్నిస్సర్వకర్మాణి భస్మసాత్కురుతేతథా" అట్లేజ్ఞానమనెడి అగ్ని ప్రారబ్ధభిన్నములగు పుణ్యపాపకర్మలనన్నిటిని- యాకర్మలకు కారణమగు నజ్ఞానమును నశింపజేయునది యగుటచే భస్మముగ జేయును. (నశింపజేయును.) ఈవిషయమునే "భిద్యతే హృదయగ్రంధిశ్ఛిద్యంతే సర్వసంశయాః। క్షీయంతే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే॥" (పరమాత్మ తెలియఁబడినచో

శాంకరభాష్యతత్త్వబోధిని:—

జ్ఞానజన్యకర్తృత్వభ్రమను నివర్తింపజేయును అట్టి కర్తృత్వ భ్రమ నివర్తింప కర్మములుండుటకు సమర్థములు గావు. కాన జ్ఞానమజ్ఞానమునే నివర్తింపజేయును. దీనివ్యాప్తివలన జ్ఞానము-కట్టెల నగ్ని భస్మముచేయునటుల కర్మములను సాక్షాత్తు నివర్తింపజేయదు. అజ్ఞానము నివర్తింపనిచో తిరుగ కర్మము లుద్భవించును. అందువలన సమ్యగ్జ్ఞానము మూలాజ్ఞాననివర్తకమై తద్ద్వారమున సర్వకర్మలను నిర్బీజములుగ నొనరించును. అనియే యభిప్రాయము.

జ్ఞానము మూలాజ్ఞాననివృత్తిద్వారమున సర్వకర్మలను నిర్బీజమొనరించుచో సర్వకర్మాంతర్గత మగుప్రారబ్ధకర్మముకూడ నివర్తింప వలసివచ్చును. అట్లగుచో జ్ఞానోదయసమకాలమునందే జ్ఞానికి శరీరపాతము సంభవించెడిని, అని శంకింపజనదు. జ్ఞానోదయ సమకాలమునందే జ్ఞానికి శరీరపాత మంగీకరించినచో "తత్త్వదర్శులచే నుపదిష్టమగు జ్ఞానము ఫలవత్తగును" అని చెప్పిన శ్రీకృష్ణ పరమాత్మయొక్క వాక్య మసంజస మయ్యెడిని. మరియొక విధమున తత్త్వదర్శియగు నాచార్యుడు లభింపనందున ప్రారబ్ధకర్మసంపాదకమగు యజ్ఞానలేశము జ్ఞానమువలన నశించదని యొప్పుకొనవలయును. కాన, ఏకర్మముచే శరీరము ప్రారబ్ధమైనదో యట్టికర్మము ప్రవృత్తమైన ఫలముకలదగుట వలన నుపభోగముచేతనే యాకర్మము నశించును.

హృదయగ్రంధి భేదింపబడును. సర్వసంశయములు ఛేదింపబడును. సర్వకర్మలు నశించును) అనుశ్రుతి సర్వకర్మవినాశమును బోధించుచున్నది.

మరియు "తదధిగమ ఉత్తరపూర్వాఘయో రశ్లేషవినాశౌ తద్వ్యపదేశాత్ తథా పుష్కరపలాశ ఆపోన శ్లిష్యంత ఏవమేవం విదిపాపంకర్మనశ్లిష్యతే" (తామరాకునందుంచబడిన యుదకము లాయాకులో సంశ్లేషనెట్లు పొందనేరవో యట్లే బ్రహ్మవేత్తయందు పాపకర్మ సంశ్లేషను పొందనేరదు.) అను ఛాందోగ్యశ్రుతి యాగామి పాపకర్మము బ్రహ్మవేత్తను బంధించదనియు, "తద్యథేషీకాతూల మగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే" యెట్లు (ఇషీకాతూల మగ్నియందుంచబడినదై నశించునో అట్లే యాబ్రహ్మవేత్తయొక్క సర్వపాపములు నశించును.) అనుశ్రుతి బ్రహ్మవేత్తయొక్క సంచితపాపకర్మలన్నియు నశించుననియు, "ఇతరస్యాప్యేవ మసంశ్లేషః పాతేతు; (పాపమువలెనే యాగామి పుణ్యకర్మయొక్క యసంశ్లేషము సంచితమగు పుణ్యకర్మయొక్క వినాశము యీసూత్రముచే చెప్పబడుచున్నది: పైనుదహరింపబడిన శ్రుతి సూత్రముల లెస్సగ విచారించినచో బ్రహ్మజ్ఞానియొక్క పుణ్యపాపములు నశించునని యర్థము సంభవించును గాన యాగామిసంచితములకే యశ్లేషవినాశములనియు, ప్రారబ్ధమునకు గాదనియు యర్థము సంభవింపదు. కాన జ్ఞానికి ప్రారబ్ధముకూడ నశించుననుశంకను యీసూత్రము తొలగించుచున్నది. "తస్య తావదేవ చిరం యావన్నవిమోక్ష్యేऽథసంపత్స్యే" అను శ్రుతిచెప్పిన యేశరీరముచే శ్రేయఃప్రాప్తికి సాధనమగు జ్ఞానము ప్రాప్తించెనో యట్టి శరీరపాతసమకాలమునందు సత్సంపత్తి కలుగునని చెప్పబడుటవలన శరీరపాతము ప్రారబ్ధకర్మక్షయమునకు నవధిచేయబడెను. అందువలన పూర్వోదాహృతశ్రుతిసూత్రములచే నారబ్ధకార్యములు కల సుకృతదుష్కృత విషయములని స్పష్టమగుచున్నది. అనగా పూర్వోదాహృతశ్రుతి సూత్రములవలన యాగామిసంచితములగు పుణ్య పాపములకే యసంశ్లేషవినాశములనియు, "అనారబ్ధకార్యే ఏవతు పూర్వే తదవధేః" "తస్య తావదేవచిరం" అను శ్రుతులవలన "భోగేన త్వితరే క్షపయిత్వా సంపద్యతే" భోగముచే ప్రారబ్ధములగు పుణ్యపాపకర్మలను నశింపజేసుకొని ముక్తుడగునని చెప్పబడుటవలన జ్ఞానియొక్క ప్రారబ్ధములగు పుణ్యపాపకర్మలు భోగముచే నశించునని

శాంకరభాష్యతత్త్వబోధిని: —

అట్లగుచో "జ్ఞానాగ్ని సర్వకర్మములను భస్మముచేయును" అని చెప్పుట యెట్లు సమంజసమగునని శంకింపఁజనదు. అందువలననే అనగా జ్ఞానమువలన నారబ్ధఫలకములగుకర్మములు నశించనందుననే ప్రారబ్ధఫలకము కానట్టి జ్ఞానోత్పత్తికి పూర్వమునందు ఈజన్మమునం దాచరించబడిన కర్మములు జ్ఞానముతోకూడ సహభావులగు ప్రాచీనానేకజన్మార్జితసంచితకర్మములన్నిటిని జ్ఞాన మజ్ఞానమును నశింపఁజేసి తద్ద్వారమున నశింపఁజేయును. (నిర్బీజములుగ నిఖిలకర్మలను జేయుననియే 'జ్ఞానాగ్ని స్సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా" అనువాక్యమునకర్థము.) ॥32॥

స్పష్టమగుచున్నది. అట్టిభోగ మొకదేహముచేగాని, యనేక దేహములచేగాని సంభవించును. కనుకనే బలవత్ప్రారబ్ధకర్మము వశిష్ఠాద్యాధికారికపురుషుల కనేక దేహారంభమగుచున్నది. కనుక వారికుండు ప్రారబ్ధకర్మ మధికార ముండువరకుండునదియే. అట్టి యధికారోపభోగముచేగాని వారిప్రారబ్ధకర్మము నశింపనేరదు. ఇట్టి బలవత్ప్రారబ్ధము యుపాసకులకేగాని యితరులకు సంభవింపనేరదు. కాన జ్ఞానాగ్ని ప్రారబ్ధభిన్నకర్మలను భస్మమొనరించునని యీశ్లోకతాత్పర్యము. అధికాంశముల భాష్యమున జూడదగును.

శంకరానందీయము: — గొప్ప మేరుపర్వతమును లంఘించుసమర్థునకు నీకతారేణులంఘనమువలె — జ్ఞానసాధనముతో యనంతపాపార్ణవమును తరించెడినీకు భీష్మాదివధజన్యమగు పాపమనెడి పల్వలమును దాటుట యశక్యమగునది కాదు. కాన ధర్మాధర్మతత్కార్యరూపార్ణవముదాటనిచ్ఛకలవాడు జ్ఞానమునే సంపాదింపదగును. అట్టిజ్ఞానముచేతనే విద్వాంసుడు శతకోటికల్పార్జితమగు పాపమును తరించును. "నైనం పాప్మా తరతి సర్వం పాప్మానం తరతి" అనుశ్రుతియు నైవిషయమునే జెప్పుచున్నది. సముద్రమును దాటునపుడు సాధనమగు నౌక కొంతకాలవిలంబమునపేక్షించునట్లు పాపమును నశింపజేయుటకు జ్ఞానమట్టి కాలవిలంబము నపేక్షింపక నొక క్షణములోనే సర్వపాపముల నశింపజేయునని సదృష్టాంతముగ నీశ్లోకమున జెప్పుచున్నాడు. యథైధాంసి......భస్మసాత్కురుతే తథా" చిన్నచిన్న పుల్లలచే ప్రజ్వలితమై ప్రవృద్ధమైన యగ్ని కాష్ఠముల నెట్లు భస్మముగ జేయునో యట్లే నిరంతరధ్యానసమాధులచే బ్రవృద్ధమైనజ్ఞానాగ్ని పుణ్యపాప మిశ్రరూపములగు సర్వకర్మలను భస్మముగజేయును. లేక ప్రారబ్ధకర్మము భోగముచేతనే నశించునది కావున దానిని విడిచి, జ్ఞానోత్పత్తికి బూర్వమునందును బరమునందును గలుగు బహుసంచితము లగు సర్వకర్మములను భస్మముగ జేయును. యెట్లు చీకటియందున్న స్థాణువును స్థాణ్వజ్ఞానముచే చోరుడనికాని భూతమని భ్రమపడి యనంతరము పార్శ్వస్థపురుషునిచే నుపదిష్టుడై దానిని నిజముగ స్థాణువని తెలిసికొనినయట్టి స్థాణుజ్ఞానము తత్స్వరూపావరణాజ్ఞాననివృత్తిపూర్వకముగ చోరభూతాదిభ్రమను నశింపజేసియట్టి భ్రమకార్యమగు భయకంపాదులను నశింపజేయునో యట్లే నిష్క్రియ బ్రహ్మాత్మైకత్వజ్ఞానముకూడ తదావరకాజ్ఞాననివృత్తితోగూడ విద్వాంసునకు అజ్ఞానోద్భావితకర్తృత్వభ్రమను నశింపజేసి యట్టికర్తృత్వ భ్రమమూలములగు సకలకర్మములనుగూడ తత్క్షణముననే నశింపజేసి నిష్క్రియబ్రహ్మాత్మైకత్వ విజ్ఞానవంతునిజేయును. అజ్ఞాననివృత్తిరూపమగు కార్యమునుగూర్చిమాత్రమే జ్ఞానము కారణమగును, కాని కర్తృత్వభ్రాంత్యాది నివర్తకమెట్లగునని శంకింపరాదు. యెట్లు బ్రహ్మాస్త్రపాతమునకు రావణశిరశ్ఛేదము, ప్రాణనిర్గమనము, దేహపాతముగూడ కార్యములగుచున్నవో, అట్లే నొకే క్రియవలన నానేక కార్యములు సంభవించుట యనుభవసిద్ధమగుటచే బ్రహ్మాత్మైక్యజ్ఞానమువలన అజ్ఞాననివృత్తియు, భ్రమాదినివృత్తియు, సంభవింపవచ్చును. కర్మమాత్రము యజ్ఞానమువలన జనించునదగుచో జ్ఞానమువలన నజ్ఞానమునశించిన యట్టియజ్ఞానకార్యమగుప్రారబ్ధకర్మముకూడ సంచితాగామికర్మలవలెనశించెడినని శంకింపరాదు. భోజనపూర్వకాలికము భోజనాంతరకాలికము నగుయన్నముయొక్క పరిత్యాగముపపన్నమగును కాని భుజింపబడినయన్న

గీ॥ నహి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే।
తత్స్వయం యోగసంసిద్ధః కాలే నాత్మని విన్దతి ॥ ॥౩౮॥

పదవిభాగము:—న-హి- జ్ఞానేన-సదృశం-పవిత్రం-ఇహ- విద్యతే- తత్- స్వయం- యోగసంసిద్ధః- కాలేన-ఆత్మని-విన్దతి। ॥౩౮॥

ప్రతిపదార్థము:—ఇహ=ఈ వ్యవహారభూమియందు; జ్ఞానేన=జ్ఞానముతో; సదృశం=సమానమైన; పవిత్రం=పవిత్రకరమగునది; నహి విద్యతే=లేదుకదా. తత్=అజ్ఞానమును; యోగసంసిద్ధః- యోగ=కర్మయోగముచే; సంసిద్ధః=యోగ్యతను పొందిన ముముక్షువు; కాలేన=దీర్ఘకాలముచే; ఆత్మని=ఆత్మయందు; స్వయం=స్వయముగ; విన్దతి=పొందుచున్నాడు. ॥౩౮॥

శాంకరభాష్యము:

యత ఏవ మతః — నహీతి। నహి జ్ఞానేన సదృశం తుల్యం పవిత్రం పావనం శుద్ధికర మిహ విద్యతే। తజ్జ్ఞానం స్వయమేవ యోగసంసిద్ధో యోగేన కర్మయోగేన సమాధియోగేనచ సంసిద్ధ స్సంస్కృతో యోగ్యతా మాపన్నో ముముక్షుః కాలేన మహతాఽఽత్మని విన్దతి లభత ఇత్యర్థః। ॥౩౮॥

శాంకరభాష్యార్థబోధిని:—

పరిశుద్ధికరమగు యశ్వమేధాదియాగములచేతనే పరమపురుషార్థమగు మోక్షము సిద్ధించుచుండ జ్ఞానముచే నేమిప్రయోజనమని శంకింపజనదు. పూర్వోక్తవిధమున జ్ఞాన ముత్కృష్టమగు మహిమకలదగుటంజేసి జ్ఞానముతోసమాన శుద్ధికరమగున దీవ్యవహారభూమియం దింకొకటిలేదు.

అట్లగుచో నట్టియాత్మజ్ఞాన మెందులకు సర్వులకు కలుగదనెదవా? అట్టిజ్ఞానమును కర్మయోగముచేతను, సమాధియోగముచేతను, సంస్కృతుడు అనగా యోగ్యతను పొందిన ముముక్షువు చిరకాలముచే నాత్మ విషయకముగ పొందును. అనగా నీశ్వరార్పణముగ కర్మల నాచరించినచో చిత్తశుద్ధిని పొందును. దానివలన ముముక్ష కలుగును. తీవ్రముముక్షవలన

మును పరిత్యజించుట యెట్లు శక్యముకాదో అట్లే ప్రవృత్తఫలకమగు (ఫలదానము కొరకభిముఖమైన) ప్రారబ్ధకర్మముగూడ జ్ఞానమువలన నశింపనేరదు.

అజ్ఞానకార్యమగు ప్రారబ్ధకర్మము నశించనిచో తత్కారణమగు నజ్ఞానముగూడ నుండవలసివచ్చునని శంకింపజనదు నిర్జలప్రదేశమునందు జలబుద్ధినశించినను, తిరిగియుచటనే జలాభాసప్రతీతి సంభవించుటవలనను, ప్రతిచ్ఛాయ (నీడ) యందుసత్యత్వబుద్ధిలేకున్నను, చేష్టాదివ్యవహారము సంభవించినట్లు దేహాదులయందాత్మత్వ, సత్యత్వ, మమత్వాదిబుద్ధిలేకున్నను విద్వాంసునకు కర్మతత్ఫలాభాసలు సంభవించును. కాన నిష్క్రియబ్రహ్మాత్మ విజ్ఞానముకలిగినట్టియు, సమాధిచే నప్రతిబద్ధత్వమును పొందించబడినట్టి విద్వాంసునకు జ్ఞానమువలన నిశ్శేషముగ నజ్ఞానము నశించుట యుక్తమేయగును. అట్లుకానిచో విద్వాంసునకు "ఇదిఘటము" అని చెప్పినంతమాత్రమున బ్రహ్మాకారజ్ఞానముకూడ నుండవలసివచ్చును. అట్లుండుట యనుభవవిరుద్ధము. కాన విద్వాంసునకుకలుగు "ఈ నిఖిలప్రపంచము, నేనుబ్రహ్మస్వరూపమే" అనువిజ్ఞానము కార్యముతోగూడ నిఖిలాజ్ఞానమును నిర్మూలించునని సిద్ధించుచున్నది. ॥౩౭॥

—• ౪వ అధ్యాయము—౩౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "నహిజ్ఞానేన........విద్యతే" ఈ లోకవ్యవహారమునగాని వేదమునగాని జ్ఞానముతో సమానమగు శుద్ధికరమగునది వేరొకటి లేదు. జ్ఞానముకంటె భిన్నమగునది యజ్ఞాననివర్తకము కాదుగాన జ్ఞానముకంటె నితరమగునది సమూలముగ పాపములను పొంగొట్టజాలదు. అజ్ఞానరూపకారణముండు

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

వైరాగ్యము అనగా నిహాముత్ర ఫలభోగవిరాగము కలిగి సద్గురువు నాశ్రయించి ప్రణిపాతాదులచే గురువును స్వాధీన మొనరించుకొని వేదాంతశ్రవణ మొనరించును. అటుపిమ్మట గురూపదిష్టార్థమును శ్రుతులచే సమన్వయముగ యుక్తులచే నాచరించును. ఇదియేమననము. ఈ మనన రూపమంతయు సూత్రభాష్యమునందు స్పష్టము. కాన మననార్థమగుటచే సూత్ర తద్భాష్యములు గౌణీవృత్తిచే మననరూపము లనంబడును. అనంతరము నిదిధ్యాస మొనరించి క్రమక్రమమున ననేక జన్మములకు త్రిపుటిని నశింపజేసుకొని యసంప్రజ్ఞాతసమాధినిష్ఠుడై యాత్మజ్ఞానమును పొందును. గాన సర్వులకు శీఘ్రముగా నాత్మజ్ఞానము కలుగ నేరదు. అని భావము. ॥౩౮॥

టచే పాపములు కలుగుచుండుటవలనను యట్టియజ్ఞానము జ్ఞానమువలన తొలగునదియగుటచే సమూలపాపనివృత్తియగును గాన జ్ఞానముతో సమమగు పవిత్రవస్తువు కొండు లేదని యర్థము. "అట్టియాత్మవిషయకమగు జ్ఞానమందరకు నెందులకు త్వరలో కలుగదు" యనుయాశంకమీద జెప్పుచున్నాడు. "తత్స్వయం........విందతి" అట్టిజ్ఞానమును చాలకాలమునకు కర్మయోగముచే సంస్కృతుడైనట్టివాడు యోగ్యతనుపొందినవాడై స్వయముగ నంతఃకరణమునందు పొందుచున్నాడు. యోగ్యతకలవాడు అన్యదత్తమైనజ్ఞానమును స్వనిష్ఠముగ గాని, లేక పరనిష్ఠమైనదానిని స్వీయముగా గాని పొంద నేరడని యర్థము. ॥౩౮॥

శంకరానందీయము:—"రాజసూయము, అశ్వమేధము మొదలగు క్రతువులచేతను, కన్యాదానాదులచేతను, కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సులచేతను సర్వపాపములు నివర్తించుచుండ, సర్వపరిగ్రహత్యాగపూర్వకము, శమదమాదిసాధనపూర్వకము నగు సంన్యాసాశ్రమము పొంది యాత్మజ్ఞానమును సంపాదించుటచే నేమి ప్రయోజనమనిశంకింపరాదు. ఏయేరోగమున కేయేయౌషధము జెప్పబడునో యాయాయౌషధసేవనమున నాయారోగములు మాత్రమే నివర్తించునట్లు "తరతి తరతి బ్రహ్మహత్యాం యోఽశ్వమేధేన యజతే" (ఎవ డశ్వమేధక్రతువు నాచరించునో వానికి బ్రహ్మహత్యాపాపమునశించును.) అను నిట్టి శ్రుత్యాదులచే నేయేపాపమున కేయేప్రాయశ్చిత్తము విహితమో యట్టిరాజసూయాదు లట్టిపాపములకు నివర్తకము లగును కాని సంచితాగామివర్తమానములగు యనేకజన్మాంతరార్జితములగు యన్నిపాపములకు నివర్తకములు గానేరవు. మరియు రాజసూయాదిక్రత్వాదులు సర్వపాపములకు నివర్తకములైనను సంచితాగామివర్తమానరూపములు, బహుజన్మసంపాదకములునగు పుణ్యకర్మలకుమాత్రము నివర్తకములుమాత్రము కానేరవు. ఆత్మజ్ఞానమన్ననో నికృష్టోత్కృష్టములగు యనేకజన్మలకు కారణములగు సంచితాగామివర్తమానరూపములగు యనేకపాపపుణ్యకర్మలను విధ్వంసన మొనరించుటయందు పరమకారణము పవిత్రతమము నగును. ఇట్టి జ్ఞానముతో సమానమయినది మరియొకటేదియు ముముక్షువునకు ప్రయత్నముతో సంపాదింపదగినది లేదు" అని సూచించుట కీశ్లోకమును జెప్పుచున్నాడు — "న హి జ్ఞానేన... విందతి"

అనేకవిధములగు యోనులయందు నానావిధజన్మమరణాది మహాదుఃఖపరంపరాప్రాపకములు ననేకకల్పశతసంపాదితములునగు నిఖిలపుణ్యపాపమిశ్రాత్మకములైన నిఖిలకర్మములను సమూలముగ నశింపజేయునదొకయాత్మజ్ఞానమే. కాన నట్టి జ్ఞానముతో— "సదృశం" పైనచెప్పబడిన ధర్మములచే సమానము, అత్యంతశుద్ధికరము, పరమపురుషార్థసాధనతమము నగున దీలోకమునందు గాని, లోకాంతరములయందు గాని శాస్త్రమునందు గాని సంభవించదు. అనాద్యవిద్యాతత్కార్యములను విధ్వంసమొనరించు నిట్టి జ్ఞానమును అధికారి యగు మతి యనేకసార్లు శ్రవణమనననిదిధ్యాసముల నాచరించినవాడై దీర్ఘకాలమునకు జ్ఞానయోగముచే నిత్యనిరంతరసమాధినిష్ఠారూపమగు తత్పరత్వముచే నిశ్శేషవినష్టసర్వబాహ్యవాసనతారూపసంసిద్ధిని స్వయముగ దనయంతఃకరణమునందె పొందును. అనగా జ్ఞానముచే లెస్సగ నిరూపింపబడిన సర్వప్రతిబంధములు కలవాడై ఈ నిఖిలజగత్తు నేనును బ్రహ్మమే యనెడి యప్రతిబద్ధమగు బ్రహ్మాకారవృత్తిని తనబుద్ధియందె పొందునని యర్థము. ॥౩౮॥

గీ॥ శ్రద్ధావాం ల్లభతే జ్ఞానం తత్పర స్సంయతేన్ద్రియః।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాన్తి మచిరే ణాధిగచ్ఛతి ॥ ॥౩౯॥

పదవిభాగము:— శ్రద్ధావాన్–లభతే–జ్ఞానం– తత్పరః–సంయతేన్ద్రియః–జ్ఞానం–లబ్ధ్వా–పరాం– శాన్తిం–అచిరేణ–అధిగచ్ఛతి– ॥౩౯॥

ప్రతిపదార్థము:— శ్రద్ధావాన్=శ్రద్ధాళువై నట్టియు; తత్పరః=గురూపాసనశ్రవణాదులయందాసక్తిగల; సంయతేన్ద్రియః–సంయత=విషయములనుండి మరల్పబడిన; ఇన్ద్రియః=త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వా ఘ్రాణాది రూపమగు నిన్ద్రియములుగలవాడు; జ్ఞానం=జ్ఞానమును; లభతే=పొందుచున్నాడు; లబ్ధ్వా=పొంది; అచిరేణ=శీఘ్రముగ; పరాం=మోక్షమనెడిపేరుగలశాంతిం=ఉపరతిని; (మోక్షమును) అధిగచ్ఛతి=పొందుచున్నాడు. ॥౩౯

శాంకరభాష్యమ్:—

యేనైకాన్తేన జ్ఞానప్రాప్తి ర్భవతి స ఉపదిశ్యతే-శ్రద్ధావానితి। శ్రద్ధావాం శ్రద్ధాలు ర్లభతే జ్ఞానం శ్రద్ధాలుత్వేఽపి భవతి కశ్చి న్మందప్రస్థానేఽత ఆహ-తత్పరో గురూపాసనాదా వభియుక్తో జ్ఞానలబ్ధ్యుపాయే శ్రద్ధావాం స్తత్పరోఽప్యజితేన్ద్రియ స్స్యా దిత్యత ఆహ- సంయతేన్ద్రియ స్సంయతాని విషయేభ్యోనివర్తితాని యస్యేన్ద్రియాణి స సంయతేన్ద్రియః। య ఏవం భూత శ్శ్రద్ధావాం స్తత్పర స్సంయతేంద్రియశ్చ సోఽవశ్యం జ్ఞానం లభతే। ప్రణిపాతాదిస్తు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కర్మయోగసమాధియోగములతో గూడినవానికి ఏయంతరంగసాధనముచే జ్ఞానప్రాప్తియో అట్టిజ్ఞానోత్పత్తియం దంతరంగసాధన 'యేన' అనుశ్లోకముచే నుపదేశించబడుచుండెను. శ్రద్ధకలవాడు జ్ఞానమునుపొందును. ఒకానొకడు శ్రద్ధాలువైనను గురూపాసనాదులయందు నిష్ఠలేనివా డగును. కాన 'తత్పరః' అని చెప్పఁడెను. శ్రద్ధాలువై జ్ఞానప్రాప్త్యుపాయమగు గురూపాసనాదులయందు నిష్ఠకలవాడై యుండవలెను. శ్రద్ధాలువైనను, నిష్ఠకలవాఁడైనను యజితేంద్రియుడగుచో జ్ఞానమునుపొందడు. కాన 'సంయతేంద్రియః' అని చెప్పఁబడెను. శ్రద్ధాలువై, గురూపాసనాదులయందు నిష్ఠకలవాడై, శబ్ద స్పర్శరూపరస గంధములనెడి విషయములనుండి మరలించబడిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణము లను యింద్రియములుకలవాడై యుండవలెను. ఎవఁడు శ్రద్ధాలువై, గురూపాసనశ్రవణాదులయందు నిష్ఠకలవాడై శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయములనుండి త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనెడి యింద్రియములను మరలించినవాడై యుండునో అట్టి పురుషుం డవశ్యము జ్ఞానమును పొందుచున్నాడు.

పరమార్థప్రపా:— "రాహు రదృశ్యోపి సదా శశిబింబస్థః ప్రకాశతే జగతి। తద్వద్విశుద్ధాత్మా చిత్తే ప్రకాశమేతిస్వయంహ్యాత్మా" యెల్లప్రడు రాహువుయదృశ్యుడైనను చంద్రబింబసంబంధమున జగమునందు బ్రకాశించునట్లు కర్మయోగముచే బరిశుద్ధమైన యంతఃకరణమునందు విశుద్ధాత్మ స్వయముగ బ్రకాశించును. అని పంచాశీతియు నిశ్లోక తాత్పర్యమునే తెల్పుచున్నది. ॥౩౯॥

—• ౪వ అధ్యాయము— ౩౯ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వమునందు జ్ఞానముప్రాప్తించుటకు "తద్విద్ధిప్రణిపాతేన" అను

శాంకరభాష్యమ్‌:—

బాహ్యోఽనైకాంతికోఽపి భవతి మాయావిత్వాదిసంభవాన్నతు తచ్ఛ్రద్ధావత్త్వాదా విత్యేకాన్తికో జ్ఞానలబ్ధ్యుపాయః। కిం పునర్జ్ఞానలాభా త్స్యాదిత్యుచ్యతే- జ్ఞానంలబ్ధ్వా పరాం మోక్షాఖ్యాం శాన్తి ముపరతి మచిరేణ క్షిప్ర మేవాధిగచ్ఛతి। సమ్యగ్దర్శనా త్క్షిప్రమేవ మోక్షో భవతీతి సర్వశాస్త్రన్యాయప్రసిద్ధ స్సునిశ్చితోఽర్థః॥ ౩౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

విచారింప "తద్విద్ధి ప్రణిపాతేన" అనుశ్లోకముచేతనే సాష్టాంగ నమస్కారాదికము జ్ఞానహేతువుగ నుపదేశించఁబడెను. అయినను నాసాష్టాంగ నమస్కారాదికము వంచకునియందు గూడ సంభవించుటచే నవి బాహ్యసాధనములై నియమముగ జ్ఞానసాధకములుకానేరవు. శ్రద్ధా, గురుపాసనా, శ్రవణాదులయందు నిష్ఠ, విషయమునుండి యింద్రియములను మరలించుట యను నవి మాయావంతునికి సంభవములు కానందున నంతరంగసాధనములై నియమముగ జ్ఞాన సాధనములగునని బహిరంగ సాధనములకంటే వేరుగ నీయంతరంగసాధనము లుపదిష్టములు ఇట్టిసాధన సంపన్నజ్ఞానికి జ్ఞానము ప్రాప్తించినచో నేమి ఫలము ప్రాప్తించు ననెదవా ? వినుము చెప్పెద- జ్ఞానమునుపొంది మోక్షమనెడి యుపరతిని శీఘ్రముగనే పొందును. సమ్యగ్దర్శనమువలన మోక్షము శీఘ్రముగ ప్రాప్తించు నననువిషయము సర్వశాస్త్రములయందును న్యాయముల యందును ప్రసిద్ధమై సునిశ్చితమగు విషయము.

అట్టి విషయమును బోధించు "శాస్త్రమేదనిన ? శాస్తీతి శాస్త్రంవేదః" శాసించునది వేదము "తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి" "జ్ఞానా దేవతు కైవల్యం" అనునట్టి వేదములే జ్ఞానమువలన మోక్షము ప్రాప్తించునని బోధించుచున్నవి. మరియు జ్ఞానమువలన యజ్ఞాననివృత్తి రజ్జ్వాదులయందు ప్రసిద్ధమగుటవలన, బ్రహ్మజ్ఞానమువలన నజ్ఞాన తత్కార్యనివృత్తిరూప మోక్షముకూడ సంభవించునను న్యాయమువలనకూడ బ్రహ్మజ్ఞానమువలన మోక్షము సిద్ధించుచున్నది. ॥౩౯॥

శ్లోకముచే గురువునకు సాష్టాంగనమస్కారమున్ను, సేవయు, ప్రశ్నయు అనెడి ఉపాయము చెప్పబడెను. వాటికంటె అత్యాసన్నతరము, నియమముగ జ్ఞానప్రాప్తి సాధనమునగు ఉపాయ మీశ్లోకమునందు చెప్పుచుండెను. గురువాక్యములయందు, వేదాంతవాక్యములయందు "ఇదిఇట్లే" అను యథార్థరూపమైన యాస్తిక్యబుద్ధి శ్రద్ధ యనిపించుకొనును. అట్టి శ్రద్ధకలపురుషుడు బ్రహ్మాత్మైక్య జ్ఞానమును పొందును. ఇట్టి శ్రద్ధావంతుడైన యొకా నొక డలసుడైనచో వానికట్లాత్మజ్ఞానము సంభవించుననుశంకను "తత్పరః" అనుపదముచే దొలగించుచుండెను. శ్రద్ధావంతుడై గురూపాసనాదులయందు, జ్ఞానోపాయమునందు అత్యంతమాసక్తికలవాడై యుండవలెను. శ్రద్ధా వంతుడై గురూపాసనాదులయందు జ్ఞానోపాయమునం దత్యాసక్తికలవాడైనను, ఒకానొకడజితేంద్రియుడైనచో వానికట్లాత్మజ్ఞానము సంభవించుననుశంకను "సంయతేంద్రియః" అనుపదముచే దొలగించుచుండెను. శబ్దస్పర్శ రూపరసగంధములనెడి సర్వవిషయములనుండి సర్వేంద్రియములను మరలించినవాడై యుండవలెను. "అనగా

(1) గురువేదాంతవాక్యములయందు విశ్వాసమనెడి శ్రద్ధయు, (2) గురూపాసనాదులయందు జ్ఞానోపాయమున నత్యాసక్తియు, (3) సర్వవిషయములనుండి సర్వేంద్రియములను మరలించుటయు, అనెడి మూడువిశేషణములు గలవాఁడవశ్యము జ్ఞానమును పొందును. మాయావంతుడు (కపటి) కూడ గురువునకు నమస్కారాదుల నాచరించును. కాన బాహ్యమగు నమస్కారాదులు నియమముగ బ్రహ్మజ్ఞానమును కలిగించునని చెప్పుటకు వీలుపడదు. శ్రద్ధ, గురూపాసనాదులయం దత్యంతాసక్తి, విషయములనుండి ఇంద్రియములనుమరలించుట (జితేంద్రియత్వము) అనునీమూడును జ్ఞానమును నియమముగ గలుగజేయుటయందు దగు నుపాయము. ఇట్టియుపాయముచే జ్ఞానమునుపొంది శీఘ్రముగ నవిద్యాతత్కార్య నివృత్తిరూపమగు మోక్షమునుపొందును. దీపము తానుజనించినంత మాత్రముననే ఇతరకారణమునపేక్షింపక యంధకారమును దొలగించునట్లు ఆత్మజ్ఞానముకూడ తాను జనించినంత మాత్రముననే మరియేయితరసహకారము నపేక్షింపక యజ్ఞానమును దొలిగించునని భావము. ॥౩౯॥

శంకరానందీయము:— ఇట్లు జ్ఞానమాహాత్మ్యమును దత్సిద్ధిప్రకారమును బ్రతిపాదించి జ్ఞానయోగసిద్ధి కంతరంగ సాధనములను "శ్రద్ధావాన్" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"తత్త్వమసి" అనుశ్రుతిచే బ్రహ్మాత్మైకత్వము జెప్పబడెను. అట్టి బ్రహ్మాత్మైకత్వమే గురువుచే నుపదేశింపబడును. అట్టిశ్రుతివాక్యమునందు, గురువాక్యమునందు సత్యత్వబుద్ధి శ్రద్ధయనబడును. ముముక్షువు యట్టి శ్రద్ధావంతుడై యుండవలెను. శ్రద్ధయేలేనిచో నేదియు సంభవింపనేరదు. కాన ప్రయత్నపూర్వకముగ శ్రద్ధను సంపాదింపదగునని యర్థము. శ్రద్ధావంతుడైనను బహిర్ముఖునకు జ్ఞానము సిద్ధింపనేరదు. అందుచేముముక్షువెన్నడును బహిర్ముఖుడు కారాదని "సంయతేంద్రియః" అనుపదముచే జెప్పుచుండెను. శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములందుబ్రవృత్తము గాని, త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనెడిపంచజ్ఞానేంద్రియములు— వక్తవ్య, గంతవ్య, ఆదాతవ్య, విసర్జయితవ్య, ఆనందయితవ్యములనెడి యైదువిషయములయందు బ్రవర్తింపని వాక్పాద పాణిపాయూపస్థలనెడి పంచకర్మేంద్రియములు గలవాడై బహిఃప్రవృత్తిశూన్యుడై యెల్లపుడు యతిధర్మములు కలిగియుండువానికి జ్ఞానముసిద్ధించును. జ్ఞానముసిద్ధించిన యాజ్ఞానము దానిచేతనే రక్షింపబడును. లేనిచో నది యుండనేరదు. ఇట్లు శ్రద్ధావత్త్వసంయతేంద్రియత్వములు సిద్ధించినను లోపలవిషయములను ధ్యానించుయతికి జ్ఞానము సిద్ధించదు. కాన యతి లోపలగూడ విషయములను మనస్సుచే ఎన్నడు చింతింపవలదని నియమించుటకు మూలమువందు "తత్పరః" అను పదమును ప్రయోగించెను. యెల్లపుడు బ్రహ్మాకారవిషయకమైన వృత్తికి లోపలను, వెలుపలను బ్రహ్మాకారపరత్వాపాదనమునందే యాసక్తమైనచిత్తముకలవాడై యుండవలెను. బ్రహ్మాకారవృత్తి పరత్వమే యసాధారణ కారణము. దానిచేతనే విపరీతజ్ఞానములన్నియు యనాత్మజ్ఞానములన్నియు నశించును జ్ఞానమున కప్రతిబద్ధత్వము సిద్ధించును. కాన నట్టి బ్రహ్మాకారత్వమునే మోక్షైకకామి సంపాదింపదగును. కాన శ్రద్ధా, సంయతేంద్రియత్వము, తత్త్వము ననెడి నియతవిశేషణత్రయముతోగూడిన యతియే "నేను బ్రహ్మస్వరూపుడనైతిని" అనెడి యప్రతిబద్ధమగు జ్ఞానమునుబొందుచున్నాడు. అనేకవిధముల శ్రుతశ్రావితవేదాంతములుకలవాడైనను మరియొకవిద్వాంసుడెవడును యట్టి జ్ఞానమును పొందనేరడు. ఇట్లు శ్రద్ధావత్త్వ, సంయతేంద్రియత్వ తత్పరత్వాది సాధనసంపత్తిచే దీర్ఘకాలికమగు నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే నిష్పన్నమైన (జనించిన) ట్టియు, జగత్తును, తనను బ్రహ్మస్వరూపముగ నుపలభ్యమానత్వాపాదకమగు జ్ఞానమునుబొంది బ్రహ్మవేత్తయగు యతి యుత్తరక్షణమునందే సంశయవిపరీతభావనాదిపినిర్ముక్తజ్ఞానావభాసితమగుటవలనను, వస్తుస్వభావమువలనను, అవిద్యాతత్కార్యాభాసశూన్యము, నిరతిశయసుఖాత్మకము, బ్రహ్మాత్మనావస్థాన లక్షణమునగు విదేహముక్తిని బొందుచున్నాడు. ॥౩౯॥

గీ॥ అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మనః ॥ ॥౪౦॥

పదవిభాగము:—అజ్ఞః–చ–అశ్రద్దధానః–చ–సంశయాత్మా–వినశ్యతి–న–అయం–లోకః–అస్తి–న–పరః–న–సుఖం–సంశయాత్మనః–

ప్రతిపదార్థము:—అజ్ఞశ్చ=ఆత్మజ్ఞానరహితుండును; లేక అనాత్మ నాత్మరూపముగ తెలిసికొనినవాడును; అశ్రద్దధానశ్చ=శ్రద్ధలేనివాడును; సంశయాత్మా=సంశయాత్మకమగు నంతఃకరణముకలవాడును; వినశ్యతి=నశించుచున్నాడు. (ఇట వినశ్యతి అను నేకవచనక్రియాపదమును ప్రత్యేకము "అజ్ఞశ్చవినశ్యతి, అశ్రద్దధానశ్చ వినశ్యతి, సంశయాత్మావినశ్యతి" అని యన్వయించుటచేత–"అజ్ఞః, అశ్రద్దధానః, సంశయాత్మాచ 'వినశ్యన్తి' అని యుండవలెను. కాని 'వినశ్యతి' అని యేకవచనాంతప్రయోగ మెట్లుపపన్నమగునను శంక తొలగించబడెను.) సంశయాత్మనః=సంశయాంతఃకరణునకు; అయం=ఈపరిదృశ్యమానలోకము; నాస్తి=లేదు; పరః=స్వర్గాదిలోకమును; నాస్తి=లేదు; సుఖం=సుఖము; నాస్తి=లేదు. ॥౪౦॥

---

శాంకరభాష్యమ్:—

అత్ర సంశయో న కర్తవ్యః, పాపిష్ఠో హి సంశయః । కథముచ్యతే—అజ్ఞశ్చేతి । అజ్ఞశ్చానాత్మజ్ఞోఽశ్రద్దధానశ్చ సంశయాత్మా చ వినశ్యతి । అజ్ఞాశ్రద్దధానౌ యద్యపి వినశ్యతస్తథాపి న తథా యథా సంశయాత్మా, సంశయాత్మా తు పాపిష్ఠః సర్వేషాం । కథం, నాయం సాధారణోఽపి లోకోఽస్తి తథా న పరో లోకో న సుఖం తత్రాపి సంశయోపపత్తేః సంశయాత్మనః సంశయచిత్తస్య । తస్మాత్సంశయో న కర్తవ్యః॥ ॥౪౦॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వమునందు చెప్పఁబడిన సాధనములు గలవా డుపదేశమాత్రముచేతనే బ్రహ్మమును సాక్షాత్కరింపఁజేసికొనును. ఎపుడు బ్రహ్మమును సాక్షాత్కరింపఁజేసికొనునో ఆక్షణమునందే అనగా శీఘ్రకాలమునందే మోక్షమును పొందును. ఈవిషయమున సంశయింపవలదు. సంశయము పాపిష్ఠము. ఎట్లనెదవా! చెప్పెద వినుము. ఆత్మజ్ఞానములేనివాడు, శ్రద్ధాలువు కానివాడు, సంశయాత్మ యీముగ్గురు నశించువారలు. విచారింప అజ్ఞుడు, అశ్రద్ధాలువు, వీరిరు

---

—• ౪వ అధ్యాయము— ౪౦ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— "పైనచెప్పబడినవిషయమై సంశయింపరాదు. అని యీశ్లోకమునచెప్పుచున్నాడు. "అజ్ఞశ్చ వినశ్యతి" అధీతముకాని శాస్త్రముకలవాడాత్మజ్ఞానశూన్యుడగును. అట్టివాడును, గురు, వేదాంతవాక్యార్థమునందు "ఇది యిట్లు కానేరదు" అను విపర్యయరూపమగు నాస్తికత్వబుద్ధి యశ్రద్ధయనబడును. అట్టియశ్రద్ధావంతుడును, "ఇది యిట్లగునా కాదా?" అను సంశయాక్రాంతచిత్తుడును వీరుస్వార్థమునుండి భ్రష్టులగుదురు. (ఇట సంశయాత్మునికంటె యజ్ఞుడు, అశ్రద్ధావంతుడు తక్కువవారు. అని తెల్పుటకై "అజ్ఞశ్చ, అశ్రద్దధానశ్చ" అనుపదములతో 'చ' కారమును బ్రయోగించెను.) ఏకారణమువలన సంశయాత్మ యందరికంటె పాపాత్ముడనెదవా? ధనార్జనాదులు లేమిఁజేసి సంశయాత్మ కీమనుష్యలోకము లేదు. ధర్మము లేమిఁజేసి స్వర్గాదిలోకములు లేవు. జ్ఞానములేమిఁజేసి మోక్షముసంభవముకాదు. అంతట సంశయాక్రాంతచిత్తుఁడు కాన భోజనాదులవలన ప్రాప్తించెడి సుఖముప్రాప్తించదు. అజ్ఞునకు అశ్రద్దధానునకు ధర్మము లేమింజేసి పరలోకము ప్రాప్తించకున్నను మనుష్యలోకమున భోజనాదులవలనకలిగెడి సుఖముప్రాప్తించును. సంశయాత్మయన్ననో ఈలోకము, పరలోకము, ఈలోకమున భోజనాదికృతసుఖము అనెడి మూడును లేనివాడగుటవలన నందరికంటె పాపాత్ముడని యర్థము. ॥౪౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—

పురు నశించువారలయినను సంశయాత్మ నశించునట్లు నశింపరు. వీరిముప్పురిలో సంశయాత్మ పాపిష్ఠుడు. అదియెట్లనిన సంశయాత్మ యొక కార్యమును మొదలిడిన నాడీకార్యము తుద ముట్టునా ముట్టదా ? యని సంశయించును భార్యయందీమంచిగుణము గలదా ? లేదా ? యనియు, పుత్త్రునియందు వీడు నమ్మతగినవాడా ? కాడా ? యనియు; మిత్త్రునియందు వీడు ద్రోహముజేయునా ? చేయడా ? యనియు, నేను పోవు త్రోవ సరియయినది యగునా? కాదా ? యనియు, నాగుణములు మంచివా ? కావా ? యనియు, ఇంతయేల నేను నేనవునా? కాదా ? యనియు కూడ సంశయము కలవాడగును. ఇట్లు సంశయములుకల యంతఃకరణకల వాడే సర్వప్రాణిసాధారణమగు లోకమున నెట్లు చలించును ? ఎంతమాత్రమీలోకమున చలింపఁజాలడు. కాన వానికి సాధారణలోకము గూడ ప్రాప్తించదు. (అనగా నీలోకమున దేహయాత్రకూడ చేయజాలక నశించును.) అట్టి సంశయాత్మ కీలోకముననే దేహయాత్ర సమ కూరనిచో పరలోక మెట్లు ప్రాప్తించును ? ప్రాప్తించదు. (అనగా నట్టి సంశయాత్మ పరలో కము లున్నవా ? లేవా ? వేదము ప్రమాణమా ? అప్రమాణమా ? పరలోకమున కేగి కర్మఫలము ననుభవించునా ? యనుభవించడా ? కర్మఫలప్రదాత కలడా ? లేడా ? యని యిట్లనేకవిధములు సంశయించును. అట్టి సంశయములు కలవాడెట్లు యాగముల నొనరించును ? చేయజాలడు. సుకృతము లాచరించనిచో వానికెట్లు పరలోకము ప్రాప్తించును ? ప్రాప్తించ నేరదు. అని యాశయము.) ఇన్నివిధముల సంశయముగలవానికి సుఖమునందు గూడ సంశయమే గలుగుటవలన లోకద్వయమునందు ప్రాప్తించు సుఖము ప్రాప్తించదు. కాన నోయర్జునా! సంశయము చేయదగదు. ॥౪౦॥

శంకరానందీయము :— "బ్రహ్మవిదాప్నోతి పరం, జ్ఞాత్వా దేవం ముచ్యతే సర్వపాపైః, జ్ఞాత్వాశివం శాన్తిమత్యన్తమేతి, తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి, య ఏతద్విదురమృతాస్తే భవన్తి।" యే విదుర్యాన్తి తే పరం తతోఽహం తత్త్వతో జ్ఞాత్వా విశతే తదనంతరం" "బ్రహ్మవిన్ముక్తో భవతి జ్ఞానవత్త్వాద్వామదేవవత్" ఇత్యాది శ్రుతిస్మృతిశతములవలన తేలినయాశయము జ్ఞానమువలన మోక్షముప్రాప్తించునని. ఇట్టి పరమపురుషార్థమగు మోక్షమునందు మోక్షైక కాముడగు బ్రాహ్మణుఁడశ్రద్ధనుగాని, సంశయమునుగాని, ఆత్మజ్ఞానసంపాదన యందు ప్రయత్నించకపోవుటగాని చేయరాదు. అట్లశ్రద్ధనుకాని, సంశయమునుకాని, ఆత్మజ్ఞానసంపాదన యందప్రయత్నమును కాని చేసిన మోక్షముపొందబడదని "అజ్ఞశ్చ" అనుశ్లోకముచే జెప్పుచుండెను. ఎవడు సర్వకర్మలను మోక్షార్థియై సన్యసించి మోక్షకారణమగు శ్రవణాదులయందును, శ్రవణాదికారణమగు గురు శుశ్రూషా, శమ, దమ, తితిక్షా, తత్పరత్వాదులయందు బ్రయత్నముంజేయక యెవడాత్మజ్ఞానమును సంపాదిం పడో యట్టివాడే మోక్షశాస్త్రమునందజ్ఞుడని జెప్పబడును. అట్టియజ్ఞుడును—ఎవనికి సంన్యాసమందును, వేదాంత శ్రవణాదులయందును, గురువునందును, మోక్షమునందును, జ్ఞానమువలన మోక్షముకలుగునను విషయమునందును, విశ్వాసముండదో వాడు శ్రద్ధాశూన్యుడనబడును. అట్టియశ్రద్ధధానుడును— "అపామసోమ మమృతాఅభూమ, దక్షిణావంతో అమృతం భజంతే" అను మొదలగు శ్రుతివాక్యములవలన కర్మలు ముక్తిహేతువుఁని తెలియ బడుచున్నవి. "తరతి శోక మాత్మవిత్, జ్ఞానా దేవ తు కైవల్యం, కర్మణాబధ్యతే జంతుర్విద్యయాతు విముచ్యతే"

గీ॥ యోగసంన్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయమ్ ।
ఆత్మవన్తం న కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ! ॥ ॥౪౧॥

పదవిభాగము:— యోగసంన్యస్తకర్మాణం-జ్ఞానసంఛిన్నసంశయం- ఆత్మవన్తం-న-కర్మాణి- నిబధ్నన్తి- ధనఞ్జయ! ॥౪౧॥

ప్రతిపదార్థము:— యోగసంన్యస్తకర్మాణం=యోగ పరమార్థదర్శన (ఆత్మతత్త్వజ్ఞాన)మనెడి యోగముచే; సంన్యస్త=సంన్యసింపఁబడిన; కర్మాణం=ధర్మాధర్మరూపనిఖిలకర్మములు కలిగినట్టియు; జ్ఞానసంఛిన్నసంశయం= జ్ఞాన=జ్ఞానముచే; సంఛిన్న=నశింపఁజేయబడిన; సంశయములు కలిగినట్టి; ఆత్మవన్తం=ఆత్మజ్ఞానమున నప్రమత్తుఁడగు వానిని; హేధనంజయ!=ఓయర్జునా!; కర్మాణి=పుణ్యపాపకర్మములు; న నిబధ్నన్తి=బంధించవు. (అనగా నట్టి జ్ఞానికి పుణ్యపాపకర్మములు ఫలారంభకములై సుఖదుఃఖమోహాత్మకమగు సంసారము నివ్వవు.) ॥౪౧॥

---

అను మొదలగుశ్రుతిస్మృతులుజ్ఞానమువలననే ముక్తి ప్రాప్తించునని తెలుపుచున్నవి కాన 'ముక్తికిఁగూర్పు కర్మలు కారణమా ? లేక జ్ఞానము కారణమా?' అను సంశయగ్రస్తుడు సర్వశాస్త్రజ్ఞుడైనను సంశయాత్మయనఁబడును. అట్టివాడును యీ మువ్వురును జ్ఞానఫలమునుండి భ్రంశమునొందెదరు. అనగా వీరుమువ్వురును యెప్పుడును ముక్తిని పొందనేరరని యర్థము. పైవిధముగ జ్ఞానశూన్యులగు మువ్వురకు మోక్షము సంభవింపదనిజెప్పి యీ మువ్వురిలోను దోషాధిక్యముకలవాడగుటచే సంశయాత్మను విశేషించిజెప్పుచున్నాడు:- "నాయం...... సంశయాత్మనః" సంశయాత్ముఁడగు పాపిష్ఠునకు మోక్షము సంభవింపకపోవుటయే కాదు. మరేమన భావిజన్మయందు మానవదేహముగూడ ప్రాప్తింపనేరదు. మరియు స్వర్గాద్యుత్తమలోకములుగూడ ప్రాప్తింపనేరవు. పురుషునకు మహాపాపమువలన కలుగు సంశయమే సర్వానర్థములకు మూలమగును. ఏమన "ఈ వైదికకర్మ యవశ్యముచేయదగును. దానిచే నేను తరించగలను." అని వైదికకర్మయందు శ్రద్ధసంభవించనిచో నట్టి శ్రద్ధాధైర్యములతో చేయబడిన కర్మలకుస్వఫలదానసామర్థ్యముండదు గాన యాయాకర్మానుగుణములగు లోకములు సంభవింపనేరవు. కాన సంశయాత్మునకు మోక్షము గాని స్వర్గాదిలోకములు గాని సంభవింపనేరవని యాశయము. మరియు నట్టి సంశయాత్మున కాహారాదులయందుగూడ సంశయమే యుండును గాన నరలోక పరలోకములయందుండు సుఖములకుగూడ దూరమగునని యర్థము. ఈ చెప్పుటచే ముముక్షువగుయతి ప్రయత్నపూర్వకముగ నాత్మజ్ఞత్వమును, సంన్యాసగురువాక్యములయందు శ్రద్ధావత్త్వము వీటిని సంపాదింపదగునని సూచితమయ్యెను. ॥౪౦॥

—• ౪వ అధ్యాయము— ౪౧ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— సర్వానర్థమూలమగు నిట్టిసంశయమును నిరాకరించుటకై యాత్మనిశ్చయరూపమగు నుపాయమును జెప్పుచు ద్వితీయ తృతీయాధ్యాయములచే జెప్పబడినదియు, పూర్వాపరభూమికాభేదమున కర్మజ్ఞానరూపముగ ద్వివిధమగు బ్రహ్మనిష్ఠను యీ శ్లోకమున నుపసంహరించుచుండెను:— భగవదారాధనరూపమగు సమత్వబుద్ధిచే భగవత్సమర్పితములగు కర్మలుకలవాడు యోగసంన్యస్తకర్ముఁడనఁబడును. లేక పరమార్థదర్శనరూపమగు యోగముచే సంన్యసింపబడిన కర్మలుకలవాడు యోగసంన్యస్తకర్ముడనఁబడును. అట్టివాడును, "సంశయమున్నచో యోగసన్న్యస్తకర్మత్వ మెట్లుపపన్నమగు" నను, యాశంకపై జెప్పుచున్నాడు. జ్ఞానసంఛిన్నసంశయం" ఆత్మ నిశ్చయరూపమగు జ్ఞానముచే విచ్ఛిన్నసంశయములుకలవాడును,— "విషయములయందుకల్గు పారవశ్యరూపమగు ప్రమాదముసంభవించినపుడు జ్ఞానమెట్లుకలుగును" అను యాశంకపై జెప్పుచున్నాడు. "ఆత్మవంతం" ప్రమాదరహితుడై యెల్లపుడు సావధానుడునగునట్టివానిని "కర్మాణి" లోకసంగ్రహము నిమిత్తమాచరింపఁబడునవిగాన వృథాచేష్టారూపములుకాని కర్మలు "ననిబధ్నంతి" అనిష్టశరీరమును గాని, ఇష్టశరీరమును గాని, మిశ్రశరీరమును గాని యారంభింపవు.

**శాంకరభాష్యమ్॥—**

కస్మాత్- యోగేతి। యోగసంన్యస్తకర్మాణం పరమార్థదర్శనలక్షణేన యోగేన సంన్యస్తాని కర్మాణి యేన పరమార్థదర్శినా ధర్మాధర్మాఖ్యాని తం యోగసంన్యస్తకర్మాణం। కథం? యోగసంన్యస్తకర్మేత్యాహ- జ్ఞానేనాత్మేశ్వరైకత్వదర్శనలక్షణేన సంఛిన్నస్సంశయో యస్య స జ్ఞానసంఛిన్నసంశయః। య ఏవం యోగసంన్యస్తకర్మా త మాత్మవన్త మప్రమత్తం గుణచేష్టారూపేణ దృష్టాని కర్మాణి న నిబధ్నన్త్యనిష్టాదిరూపం ఫలం నారభన్తే హేధనఞ్జయ!॥౪౧॥

**శాంకరభాష్యతత్త్వబోధిని॥—**

విచారింప సర్వానర్థహేతువగుటవలన సంశయము చేయదగినది కాదు. అయినను సంశయమును నివర్తింపఁజేయునది లేనితరి సంశయమును చేయకపోవుట యస్వాధీనమని శకింపఁజనదు. శ్రుతి, యుక్తిప్రయుక్తమగు నైక్యజ్ఞానము సంశయనివర్తకము. అట్టి పరమార్థదర్శనరూపజ్ఞానము మనెడి యోగముచే సంన్యసింపఁబడిన ధర్మాధర్మరూపనిఖిలకర్మములు కలిగినట్టియు, జ్ఞానముచే నివర్తింపఁజేయబడిన నిఖిలసంశయములు గలిగినట్టియు విషయపరవశు (ప్రమత్తు) డెవడు కాడో అట్టి పురుషుని కర్మములు బంధించవు. ఈశ్లోకమున "పాఠక్రమము కంటె యర్థక్రమము బలీయము" అనున్యాయమున జ్ఞానసంఛిన్నమగు సంశయములు కలవాడు కనుకనే యోగముచే సంన్యసింపఁబడిన నిఖిలకర్మములు కలవాడు అని యన్వయింపనగును. ఇట్లన్వయించుటచే సంశయవంతున కాత్మజ్ఞానమే సంభవింపనందున పరమార్థదర్శనమనెడి యోగముచే నిఖిలకర్మలను సంన్యసించుటయే సంభవింపదను శంక తొలగించబడెను. జీవేశ్వరైకత్వజ్ఞానము కలవానిని కర్మములు బంధింపవనగ బరమార్థదర్శికి సంశయము తొలగ సంశయోచ్ఛేదకజ్ఞానమాహాత్మ్యముచే కర్మములు నివర్తింప నప్రమత్తునకు (విషయములయందు పారవశ్యమును పొందనివానికి) గుణచేష్టారూపముచే ప్రాతిభాసికమగు కర్మములు యనిష్టరూపఫలమును పుట్టించనేరవు. (బంధహేతువులుకావు.) ॥౪౧॥

శంకరానందీయము:—"సంశయముసర్వానర్థహేతువగుచో నది నిశ్శేషముగ నెట్లు నివర్తించును ?" అను నాశంకపై శ్రుతి, యుక్తి సముత్పన్న బ్రహ్మాత్మైకత్వవిజ్ఞానముచేతనే నట్టిసంశయము విచ్ఛిన్నమగునుగాని మఱియొకవిధమున నివృత్తముగానేరదని సూచించుటకును, పరావరైకత్వవిజ్ఞాన సంఛిన్న సర్వసంశయములు గలవాడగుటచేతనే బ్రహ్మవేత్త కర్మలచే బంధింపబడడని యీ శ్లోకమున ప్రతిపాదించుచున్నాడు:— "జ్ఞానసంఛిన్నసంశయం" పరావరాఖండైకరసత్వ సందర్శనరూపము, నిరంతరసమాధినిష్పన్నమగుటచే నప్రతిబద్ధస్వభావముకల జ్ఞానముచే సంఛిన్నములగు—(నిశ్శేష నిర్మూలితములగు) "మోక్షము కర్మచే సిద్ధించునా ? లేక జ్ఞానముచేసిద్ధించునా? అందును మోక్షమునుగూర్చి పరోక్షజ్ఞానము కారణమా? లేకయపరోక్షజ్ఞానము కారణమా?" అను మొదలగు సంశయములుకలవాడును, కనుకనే "యోగసంన్యస్తకర్మాణం" ఈ సర్వము నేనుబ్రహ్మస్వరూపమే అని సర్వజగత్తును తననుగూడ బ్రహ్మముగ దెలిసికొనుట యోగమనబడును. అట్టియోగముచే సంన్యస్తములైన (విశ్లేషితములై లెస్సగ నత్యంతము బ్రహ్మమునందు బ్రహ్మాత్మజ్ఞానముచే లయమునుపొందించబడిన) సంచితాగామిరూపములగు సర్వకర్మలుకలవాడును, "ఆత్మవంతం" అప్రమత్తుడును, లేక— "ఆత్మైవబహిరంత స్సర్వాకృత్తే ర్విషయ త్వేనాస్యాస్తీత్యాత్మవాన్ తం" (ఆత్మయేలోపమున్ను వెలుపలను యంతట స్వీయవృత్తిలో విషయమైయుండువాడును నగు బ్రహ్మవేత్తను) "కర్మాణి" స్వప్నమువలెనాభాసరూపములు, శరీర

గీ॥ తస్మా దజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాఽఽత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠో త్తిష్ఠభారత ! ॥౪౨॥

ఇతి శ్రీ మహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యా
యాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే జ్ఞాన
కర్మసంన్యాసయోగోనామ చతుర్థో ఽధ్యాయః ॥

**పదవిభాగము:—** తస్మాత్– అజ్ఞానసంభూతం– హృత్స్థం– జ్ఞానాసినా– ఆత్మనః– ఛిత్త్వా– ఏనం– సంశయం– యోగం– ఆతిష్ఠ– ఉత్తిష్ఠ– భారత ! ॥౪౧॥

**ప్రతిపదార్థము:—** హేభారత ! = భరతాన్వయసంభూతుఁడవగు నోయర్జునా !; త్వం= ఈ పదమధ్యాహార్యము) నీవు; తస్మాత్= ఆ కారణమువలన; (అగా జ్ఞానసంఛిన్నసంశయముకలవాడు కర్మములచె బంధింపఁబడనందున) అజ్ఞానసమ్భూతం= అజ్ఞాన= అవివేకమువలన, సంభూతం= జనించినట్టియు; హృత్స్థం= బుద్ధియందున్న; ఏనం= ఈ; సంశయం= సంశయమును; జ్ఞానాసినా= జ్ఞానమనెడి ఖడ్గముచే ఛిత్త్వా= ఛేదించి; యోగం= సమ్యగ్దర్శనోపాయమగు కర్మానుష్ఠానమును; ఆతిష్ఠ= చేయుము. ఇదానీం= (ఈపదమధ్యాహార్యము; ఇప్పుడు; యుద్ధాయ= (ఈపదమధ్యాహార్యము) యుద్ధముకొఱకు; ఉత్తిష్ఠ= సన్నద్ధుడ వగుము. ॥౪౨॥

శాంకరభాష్యమ్:—

యస్మా త్కర్మయోగానుష్ఠానా దశుద్ధిక్షయహేతుక జ్ఞాన సంఛిన్న సంశయో న నిబధ్యతే కర్మభి ర్జ్ఞానాగ్ని దగ్ధకర్మత్వాదేవ, యస్మాచ్చ జ్ఞానకర్మానుష్ఠానవిషయే సంశయవా న్వినశ్యతి-

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కర్మయోగానుష్ఠానమువలన నశుద్ధినాశనమునకు హేతువగు జ్ఞానముచే నశింపఁజేయబడిన కర్మములు కల పురుషుండు జ్ఞానముచే దగ్ధమైన కర్మములు కలవా డగుటంబట్టి కర్మములచే బంధింపబడ నందునను, జ్ఞాన కర్మానుష్ఠానవిషయమున సంశయముకలవాడు నశించుటవలనను, యవివేకమువలన జనించునట్టి, బుద్ధియదుండునట్టి యీ పాపిష్ఠమగు సంశయ మాత్మవిషయ మగుటవలన స్వకీయమైన సంశయమును శోక మోహాది దోషములను హరించు సమ్యగ్దర్శనమనెడి ఖడ్గముచే ఛేదించును. ఇది స్థాణువా ? పురుషుడా ? అను దేవదత్తనిష్ఠసంశయము దేవదత్తనిష్ఠమగు 'నిది స్థాణువు' అను జ్ఞానముచేతనే నివర్తించినట్లాత్మనిష్ఠము, ఆత్మవిషయక

యాత్రామాత్రప్రయోజనములు దేహచేష్టారూపములు, యోగాగ్ని నిర్దగ్ధమగుటవలన నిర్వీర్యములునగుకర్మలు బంధింపనేరవు. (శుక్తికయనుజ్ఞానముచే రజతజ్ఞానమువలె బ్రహ్మజ్ఞానముచే గర్మలు నశించునని యర్థము.) ఈ చెప్పుటచే- బ్రహ్మవేత్త లగు యతులు- కర్మలు బంధకములు కాకుండుటకై యోగముచేతనే సర్వకర్మసంన్యాసము చేయదగునని సూచింపబడినది. ॥౪౧॥

—• ౪వ అధ్యాయము— ౪౨ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:—"అజ్ఞానసంభూతం" అవివేకమువలన బుట్టునదియు, "హృత్స్థం" బుద్ధిస్థితమునగుజ్ఞానము, ఆశ్రయమగు బుద్ధియు, దెలియబడినచో సంశయోచ్ఛేదము సుకరమగునని కారణాశ్రయములు రెంటిని యుపన్యసించెను. "ఏనంసంశయం" సర్వానర్థమూలమగు యీ సంశయమును "ఆత్మనోజ్ఞానాసినా" ఆత్మవిషయకమగు జ్ఞానమనెడి కత్తిచే ఛేదించి "యోగమాతిష్ఠ" సమ్యగ్దర్శనోపాయమగు నిష్కామకర్మయోగము నాచరింపుము. "ఉత్తిష్ఠభారత" కాన నోభరతవంశోద్భవ! యుద్ధమునకై సన్నద్ధుడవుకమ్ము. (భరత

**శాంకరభాష్యమ్:—**

తస్మాదితి। తస్మాత్పాపిష్ఠ మజ్ఞానసమ్భూత మజ్ఞానా దవివేకా జ్జాతం హృత్స్థం హృది బుద్ధౌ స్థితం జ్ఞానాసినా శోక మోహాదిదోషహరం సమ్యగ్దర్శనం జ్ఞానం తదేవాసిః ఖడ్గ స్తేన జ్ఞానాసినాఽఽత్మన స్స్వస్యాత్మవిషయత్వా త్సంశయస్య। నహి పరస్య సంశయః పరేణ ఛేత్తవ్యతాం ప్రాప్తో యేన స్వస్యేతి విశేష్యతేఽత ఆత్మవిషయోఽపి స్వస్యైవ భవతి। ఛిత్త్వైనం సంశయం స్వవినాశహేతుభూతం యోగం సమ్యగ్దర్శనోపాయకర్మానుష్ఠాన మాతిష్ఠ కుర్విత్యర్థః। ఉత్తిష్ఠేదానీం యుద్ధాయ భారతేతి। ॥౪_౨॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య గోవిన్ద
భగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతః
కృతౌ శ్రీమద్భగద్గీతాభాష్యే బ్రహ్మయజ్ఞ
ప్ర శం సా నా మ
చతుర్థోఽధ్యాయః॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

మునగు సంశయ మాత్మనిష్ఠజ్ఞానముచేతనే నివర్తించును. కాన విష్ణుదత్తునియందుండు సంశయము దేవదత్తునిచే ఛేదించుటకు వీలుకాదు. కనుకనే మూలమునందు "ఆత్మనః" అను విశేషణము విన్యసింపఁబడెను. కాన నాత్మవిషయకమగు సంశయ మాత్మసంబంధియే యగును. అట్టి స్వవినాశమునకు హేతుభూతమైన యీసంశయమును జ్ఞానాసిచే ఛేదించి సమ్యగ్దర్శనోపాయమగు కర్మానుష్ఠానము నాచరించుమని యర్థము. అట్లగుచో నీయాజ్ఞచే అగ్నిహోత్రాది కర్మముల నాచరించెదను. యుద్ధమువలననైతే యుపరతినే పొందెదను. (అనగా యుద్ధమును మానుదు ననుట, అనెదవా ? నీవు భరతాన్వయసంభూతుడవు. భరతాన్వయసంభూతులగు క్షత్రియులు నిత్యకర్మానుష్ఠానపరులు. యుద్ధమనునది క్షత్రియులకు నిత్యకర్మము. అట్టి నిత్యకర్మమును వదలుట నీకు దగదు. కాన నోభరతాన్వయసంభూతుండవగు ఓయర్జునా ! యిపుడు యుద్ధముకొఱకు లెమ్ము. (అనగా యుద్ధముచేయుటకు సన్నద్ధుడవగుము.)

ఈయధ్యాయచే యోగము కృత్రిమ మనుటయు, శ్రీకృష్ణుఁడగు భగవంతుఁ డనీశ్వరుఁడనియు, అనెడి శంకను తొలగించి బహిరంగసాధనములగు సాష్టాంగనమస్కార పరిప్రశ్న సేవల వలనను, అంతరంగసాధనములగు శ్రద్ధా తత్పరత్వ సంయతేంద్రియత్వములవలనను గలి

సంశోద్భవుని యుద్ధోద్యమము నిష్ఫలముకాదనిభావము.॥శ్లో॥స్వస్మిన్నీశత్వబోధేన భక్తిశ్రద్ధే దృఢకృతే। ధీహేతుః కర్మనిష్ఠాచవారిణేవహోపపాదితా॥ ఈ యధ్యాయమునందు శ్రీకృష్ణపరమాత్మచే తనను పరమేశ్వరునిగా బోధించి భక్తిశ్రద్ధలు దృఢపరచబడెను. కర్మనిష్ఠయాత్మజ్ఞానహేతువుగనుపన్యసించి యుపసంహరింపబడెను.

ఇట్లు శ్రీమధుసూదనసరస్వతీవిరచిత శ్రీమద్భగవద్గీతాచతుర్థాధ్యాయగూఢార్థదీపికకు
"తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ" బులుసు అప్పన్నశాస్త్రి
వి ర చి త తా త్ప ర్య బో ధి ని స మా ప్త ము.

శంకరానందీయము:— "ఎట్లుజ్ఞానసంఛిన్నసంశయములు కలవాడగుటచే యోగసన్న్యస్తసర్వకర్ములు కలవాడై బ్రహ్మవిద్వరిష్ఠుడు కర్మబంధ వినిర్ముక్తుడగుచుండెనో యట్లే నీవుకూడ జ్ఞానసంఛిన్నసంశయములు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

గిన సమ్యగ్దర్శనమువలన నశేషానర్థ నివృత్తిపూర్వకముగ జీవునకు బ్రహ్మభావమును బోధించి సర్వోత్కృష్టమగు నాత్మస్వరూపమునందు సంశయముకలవాని కధికారమువలన నశేషదోషములతోఁగూడిన సంశయమును విడచి యుత్తముడు, జ్ఞాననిష్ఠాపరుడు నగువానికి కర్మనిష్ఠ స్థాపించఁబడెను. ॥౪౨॥

ఇట్లు నూరువేలసంఖ్యగలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు మహాభారతము నందంతర్గతమైన భీష్మపర్వము నందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యారూపమును, యోగశాస్త్రము నగు భగవద్గీతలయందున్న శ్రీకృష్ణార్జున సంవాదమునందుగల జ్ఞాన కర్మ సంన్యాసయోగమను పేరి చతుర్థాధ్యాయమునకు గౌతమసగోత్రుండగు, 'తర్కరత్న న్యాయవేదాన్త విద్యాపారీణ'' బులుసు అప్పన్నశాస్త్రిచే రచయింపఁబడిన యానందగిరియ వ్యాఖ్యానుసృత శ్రీభగవద్గీతా శాంకరభాష్య తత్త్వబోధిని సమాప్తము.

హరిః ఓమ్ తత్సత్ ॥

శ్రీః శ్రీః శ్రీః

కలవాడవై యోగముచే సర్వకర్మలనువిడచినవాడవై కర్మనిష్ఠుడవుకమ్ము'' అని యీ శ్లోకమునజెప్పుచున్నాడు:— సంశయములుకలవానికి కర్మజ్ఞానయోగములలో నొకదానియందును బ్రవృత్తిసంభవింపదు. కాన నుభయభ్రష్టుడగును. అందుచే నోభరతవంశోద్భవుడవగు యర్జునా! నీవు అవిక్రియ బ్రహ్మాత్మత్వాదర్శనరూపమగు నజ్ఞానముచే బుట్టునదియు, నీయొక్క హృదయమునందుండునదియునగు సంశయమును "మోక్షసాధనము జ్ఞానమా ? మరొకటియా ? జ్ఞానమేయైన నది పరోక్షమా ? కాక నపరోక్షమా ? జ్ఞానముచేనవిద్యాతత్కార్యముల నిశ్శేషనివృత్తియగునా ? కాదా ? అనుమొదలగుసంశయమును) "బ్రహ్మనే నేను'' అనెడి బ్రహ్మాత్మైక్యస్వరూపమగు జ్ఞానమనెడి ఖడ్గముచే ఛేదించి కర్మయోగము నాచరింపుము. (యుద్ధముచేయుమని యర్థము)

ఇట్లు శ్రీశంకరానంద సరస్వతీవిరచిత శ్రీమద్భగవద్గీతా చతుర్థాధ్యాయగీతాతాత్పర్య బోధినికి "తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ'' బులుసు అప్పన్నశాస్త్రిచే రచియింపబడిన తాత్పర్యబోధిని సమాప్తము.

శ్రీధరీయము:— ఓభరతవంశోద్భవుడవగు యర్జునా! అజ్ఞానసంభూతము, హృదయసంస్థితము, శోకమోహాదిజనకము, నగు సంశయమును దేహాత్మవివేకరూపమగు ఖడ్గముచే ఛేదించి పరమాత్మజ్ఞానోపాయమగు కర్మయోగము నాచరింపుము. అందునను ప్రథమమున ప్రస్తుతమగు యుద్ధము నాచరింపుము. (ఇట "భారత'' అనుసంబోధనముచే క్షత్రియుడవగు నీకు యుద్ధముచేయుట స్వధర్మమని సూచింపబడెను.) శ్లో॥ పురుషస్థాదిభేదేన కర్మజ్ఞానమయీ ద్విధా । నిష్ఠోక్తా యేన తం వందే శౌరిం సంశయసంఛిదం'' (ముముక్షువగుపురుషుని యవస్థాభేదముచే (అధికారమునుబట్టి) రెండువిధములుగ (కర్మజ్ఞానరూపముగ) నిష్ఠనుపదేశించిసంశయవిచ్ఛిత్తి నొనరించిన శ్రీకృష్ణభగవానునకు నమస్కారము.)

ఇట్లు శ్రీధరస్వామికృత చతుర్థాధ్యాయసుబోధినికి "తర్కరత్న, న్యాయవేదాంతవిద్యాపారీణ'' బులుసు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని సమాప్తము.

సదానందీయము:— ॥శ్లో॥ స్వస్మిన్నీశత్వబోధా ద్భగవతి సుతనా భక్తిరాపాదితార్థా, ధీహేతుః కర్మనిష్ఠా క్రతుభిరపి తథా జ్ఞాననిష్ఠోత్తమోక్తా। సత్యం బ్రహ్మైక్యతత్త్వం ప్రతిపదముదితం దృశ్యమిథ్యాత్వమేవం, యేన శ్రీకాంతిధామ్నా తమిహ మురరిపుం కృష్ణమేవాశ్రయేహం॥ (యే శ్రీకృష్ణపరమాత్మచే సూక్ష్మరూపుడగు (నిర్గుణస్వరూపుడగు) తనను పరమేశ్వరునిగ బోధించి దృఢమగు భక్తి ప్రతిపాదింపబడెనో, మరియు ఫలాభిసంధి రహితముగ చేయబడిన యజ్ఞాదికర్మలు చిత్తనైర్మల్య జననద్వారమున జ్ఞానహేతువులగును. గాన కర్మనిష్ఠ పైవిధమున జ్ఞానకారణమనియు, అధికారియగు ముముక్షువు కర్మలను సంన్యసించి జ్ఞాననిష్ఠ నాశ్రయింపదగునియు, నది సాక్షాజ్జ్ఞానసాధనము గాన యుత్తమనిష్ఠయనియు, బ్రహ్మాత్మైక్యతత్త్వము సత్యమనియు, దృశ్యమగు సర్వము మిథ్యయనియు నుపదేశింపబడెనో యట్టి శ్రీకృష్ణపరమాత్మనే నేనాశ్రయించెదను.)

ఇట్లు శ్రీసదానందసరస్వతీవిరచిత చతుర్థాధ్యాయ భావప్రకాశకు
"తర్కరత్న, న్యాయవేదాంత విద్యాపారీణ" బిరుదు
అప్పన్నశాస్త్రివిరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

భాష్యోత్కర్ష దీపిక:— ఆత్మజ్ఞానము చిత్తశుద్ధిలభ్యమగునది యగుటవలనను, సంశయాత్మనశించును కనుకను, జ్ఞానసంఛిన్న సంశయుడు కర్మలచే బంధింపబడడు కావునను సంశయము అతిపాపిష్ఠము అజ్ఞానసంభవమగు అట్టి సంశయమును శోక మోహాది దోషహారమగు సమ్యగ్దర్శనమను ఖడ్గముచే ఛేదించి యాత్మజ్ఞానోపాయభూతమగు కర్మయోగము నాచరింపుము. ప్రస్తుతము స్వధర్మమగు యుద్ధముచేయుటకై లెమ్ము. (ఇట 'భారత!' అను సంబోధనము= యుద్ధముచేయుటకు తగుదువని సూచింపబడెను.) ఈ చతుర్థాధ్యాయమున యోగము సంప్రదాయసిద్ధమనియు, శ్రీకృష్ణభగవానులు సర్వజ్ఞుడనియు, పరమేశ్వరుడనియు ప్రతిపాదించి యోగ్యతాసంపత్తికై కర్మనిష్ఠను, తత్సాధ్యమగు జ్ఞాననిష్ఠను అత్యుత్తమమగుదానిగను ప్రతిపాదించి జ్ఞాననిష్ఠావిషయమై ప్రణిపాతాదికమును బహిరంగసాధనముగను, శ్రద్ధాదికము నంతరంగసాధనముగను నిరూపించి అజ్ఞాననిష్ఠకు సర్వానర్థనివృత్తి చేసగు బ్రహ్మభావమును ఫలముగ జెప్పి సంశయము నతిపాపిష్ఠమగుదానిగ జెప్పి యట్టి యశేషదోష భూయిష్ఠమగు సంశయమును విడచిన యుత్తమాధికారి జ్ఞాననిష్ఠనాశ్రయింపదగుననియు, అనధికారి కర్మనిష్ఠనాశ్రయింపదగుననియు నిరూపింపబడెను.

ఇట్లు శ్రీధనపతిసూరివిరచిత భాష్యోత్కర్ష దీపికకు "తర్కరత్న
న్యాయవేదాంతవిద్యాపారీణ" బిరుదు అప్పన్నశాస్త్రి
విరచిత తాత్పర్యబోధిని సమాప్తము.

పరమార్థప్రపా:— శ్లో॥ బాహ్యం కర్మాగమోక్తం ద్వివిధమపి వినశ్యత్ఫలం తద్వికర్మా
స్యాత్తచ్చాఽకర్మ యత్స్యా దమృతఫల మతః కర్మనైష్కర్మ్యయోస్తు।
అన్యోన్యం సాహచర్యం భవతి తదఖిలం మామిహోద్దిశ్య కార్యం
తద్వై బ్రహ్మార్పణంస్యా ద్వివిధయజనతః ప్రాహ పార్థం చతుర్థే ॥

వేదోక్తమగు బాహ్యమైన రెండువిధములగు కర్మలు నశించు ఫలములుకలవై వికర్మ యనుపించుకొనును. కర్మయే యకర్మయగుచో మోక్షమే ఫలము కలదగును. కాన కర్మనైష్కర్మ్యముల కన్యోన్యము, సాహచర్యము సంభవించుచున్నది. అట్టి నిఖిలకర్మలు నన్నుద్దేశించి చేయదగినవి. అట్లు చేయుటయే నిఖిల యాగముల నాచరించువానికి బ్రహ్మార్పణ మనిపించుకొనునని నాల్గవ యధ్యాయమునం దర్జునునిగూర్చి శ్రీకృష్ణపరమాత్మ బోధించెను.

ఇట్లు పరమార్థప్రపకు బిరుదు అప్పన్నశాస్త్రి విరచిత
తాత్పర్యబోధిని సమాప్తము.

శుభమస్తు.

# శ్రీభగవద్గీతా శాంకరభాష్యతత్త్వబోధిని

## శ్రీ భగవద్గీతా శాంకర భాష్యమ్.

### పంచమోఽధ్యాయః

### సంన్యాసయోగః

అర్జున ఉవాచ:—

గీ॥ సన్న్యాసం కర్మణాం కృష్ణ! పున ర్యోగం చ శంససి।
యచ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి సునిశ్చితమ్ ॥

**పదవిభాగము:**— అర్జునః-ఉవాచ-సంన్యాసం-కర్మణాం-కృష్ణ!- పునః-యోగం-చ- శంససి- యత్-శ్రేయః-ఏతయోః-ఏకం-తత్-మే-బ్రూహి-సునిశ్చితమ్ ॥ ॥౧॥

**ప్రతిపదార్థము:**—అర్జునః=అర్జునుడు; ఉవాచ=పలికెను; (ప్రశ్నించెను.) హేకృష్ణ= ఓశ్రీకృష్ణపరమాత్మా!; కర్మణాం=కర్మలయొక్క; సంన్యాసం=పరిత్యాగమును; శంససి=చెప్పుచుంటివి; పునః=తిరిగి; యోగం చ=కర్మానుష్ఠానమును; శంససి=(ఈపదమావృత్తము) చెప్పుచుంటివి; ఏతయోః=ఈకర్మానుష్ఠానకర్మసంన్యాసములలో; యత్=ఏది; శ్రేయః=శ్రేష్ఠమైనదో; తత=(ఈపదమధ్యాహార్యము) నీకు; సునిశ్చితం=అభిప్రేతమైన; తత్=అ; ఏకం=ఒకదానిని; మే=నాకు; బ్రూహి=చెప్పుము. ॥౧॥

---

—: ౫వ అధ్యాయము— ౧వ శ్లోక వ్యాఖ్యావిశేషములు :—

**మధుసూదనసరస్వతీయము:**— ఇంతకుపూర్వము తృతీయచతుర్థాధ్యాయములయందు కర్మజ్ఞానములు నిర్ణయింపబడినవి. ప్రస్తుతము పంచమషష్ఠాధ్యాయములచే కర్మతత్త్యాగములు నిర్ణయింపబడినవి. తృతీయాధ్యాయమున "జ్యాయసీచేత్కర్మణస్తే" అను మొదలగుదానిచే నర్జునునిచే ప్రశ్నింపబడి శ్రీకృష్ణపరమాత్మ- జ్ఞానకర్మలు రెండును వికల్పముగ గాని, సముచ్చయముగ గాని మోక్షమునుగూర్చి కారణములు కానేరవు. కాన యధికారభేదమునుబట్టి జ్ఞాననిష్ఠయు, కర్మనిష్ఠయు నాశ్రయింపదగునని "లోకేస్మి న్ద్వివిధా నిష్ఠా" అనుదానిచే నిర్ణయించెను. అజ్ఞానాధికారికమగు కర్మ జ్ఞానముతో సముచ్చయమును పొందనేరదు. (అనగ జ్ఞానము, కర్మ రెండునుకలసి మోక్షమునుగూర్చి కారణము కావనుట) ఏమన? జ్ఞానము కర్మాధికారహేతువగు భేదబుద్ధిని పోగొట్టునదగుటచే తేజస్తిమిరములవలె పరస్పరవిరుద్ధములగు జ్ఞానకర్మలు రెండును ఒకేమారు సంభవించుట కుదురదు గాన నా రెండునుకలసి మోక్షమునకు కారణమనుట యనుపపన్నము. మరియు జ్ఞానకర్మలకు వికల్పము కుదురదు. (అనగ నజ్ఞాననాశమునుగూర్చి జ్ఞానమువలె కర్మ స్వతంత్రముగ కారణము కాదనుట) జ్ఞానకార్యమగు

**శాంకరభాష్యమ్।—**

(1) "కర్మణ్యకర్మయఃపశ్యేత్" గీ-4-18 ఇత్యారభ్య "స యుక్తః కృత్స్నకర్మకృత్" (గీ-4-18) జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం" (గీ-4-19) "శారీరం కేవలం కర్మ కుర్వ౯" (గీ-4-21) "యదృచ్ఛాలాభసంతుష్టః" (గీ-4-22) "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః" (గీ-4-24) "కర్మ జాన్విద్ధితాన్సర్వా౯" (గీ-4-32) "సర్వంకర్మాఖిలం పార్థ!" (గీ-4-33) "జ్ఞానాగ్నిః సర్వ కర్మాణి" (గీ-4-37) "యోగసంన్యస్త కర్మాణం" (గీ-4-41) ఇత్యన్తైర్వచనైః సర్వకర్మ సంన్యాస మవోచ ద్భగవా౯ "ఛిత్త్వైనం సశయం యోగ మాతిష్ఠ" (గీ-4-42) ఇత్యనేన వచ

**శాంకరభాష్యతత్త్వబోధిని।—**

(1) "కర్మణ్యకర్మయఃపశ్యేత్" అనుశ్లోకము మొదలుకొని కర్మయం దకర్మదర్శనమును చెప్పి 'సయుక్తః కృత్స్నకర్మకృత్' అనుదానిచే అట్టిజ్ఞాని యోగియనియు, నిఖిలకర్మల నాచరించువాడని జ్ఞానప్రశంస ప్రసాదితము. అనంతరమున 'జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం' అనుదానిచే లోకసంగ్రహార్థము నిఖిలకర్మముల నాచరించుజ్ఞాని జ్ఞానాగ్నిదగ్ధమగు నిఖిలకర్మములు కలవాడగుటచే నట్టిజ్ఞానిని కర్మవలన ప్రాప్తించెడి బంధముతో రహితునిగ వివేకవంతులు చెప్పుచుండిరని జ్ఞానవంతునకు జ్ఞానఫలభూతమగు సంన్యాసమును వివక్షచేయుచు, వివిదిషువునకు సాధనరూపమగు సంన్యాసమును శ్రీకృష్ణపరమాత్మ వివక్షచేసెను. 'నిరాశీ ర్యతచిత్తాత్మా శారీరం కేవలం కర్మ కుర్వ౯' అనుదానిచే శరీరస్థితిమాత్రప్రయోజకమగు కర్మమును శరీరస్థితి యందుగూడ సంగరహితుఁడై చేయునట్టివాడు ధర్మాధర్మఫలభాగికాడని పూర్వోత్తరాధ్యాయములచే వివిదిషాసంన్యాస, విద్వత్సంన్యాసము లనెడి రెండువిధముల సంన్యాసమును సూచించెను. 'యదృచ్ఛాలాభసన్తుష్టః' అను స్థలమునందుగూడ సంన్యాసిధర్మకలాపోపదేశమువలన సంన్యాసము సూచించబడెను. 'బ్రహ్మార్పణం' అనుశ్లోకముచే జ్ఞానమునకు యజ్ఞత్వసంపాదనపూర్వకముగ ప్రశంసావాక్యమువలన జ్ఞాననిష్ఠునకు కర్మసంన్యాసము చూపఁబడెను. 'కర్మజా న్విద్ధి తాన్సర్వా౯' అను శ్లోకముచే-జ్ఞానయజ్ఞస్తుతినిమిత్తము నానావిధములగు యజ్ఞములను చెప్పియట్టి యజ్ఞములకు దేహాదివ్యాపారజన్యత్వవాక్యముచే నాత్మకు నిర్వ్యాపారత్వవిజ్ఞానఫలాభిలాషవలనను పూర్వోక్తాత్మను తెలిసికొనగోరినవానికి సర్వకర్మసంన్యాసమునందధికారము సూచితము. 'సర్వం కర్మాఖిలం పార్థ!' అనుదానిచే నిఖిలకర్మలకు జ్ఞానమునందు పర్యవసానమును

నజ్ఞాననాశము కర్మలచే చేయుట నశక్యముగాన వికల్ప ముపపన్నముగాదు. "తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి నాన్యఃపన్థావిద్యతేఽయనాయ" పరమాత్మస్వరూపమును దెలిసికొని సంసారమునుదాటును. (అనగా మోక్షమునుబొందును.) మోక్షమునకింతకంటె వేఱుమార్గముఁలేదు.) అనుశ్రుతి మోక్షమునకు జ్ఞానమే కారణమని బోధించుచున్నది. మఱియు జ్ఞానముకలిగినచో కార్యమగుకర్మ మపేక్షింపబడదని "యావా నర్థ ఉదపానే" అనుశ్లోకమునందు జెప్పఁబడెను. ఈ చెప్పుటవలన జ్ఞానికి కర్మయందనధికారము నిశ్చితమగుటచే ప్రారబ్ధకర్మవశమువలన వృథాచేష్టారూపముచే కర్మానుష్ఠానముగాని, సర్వకర్మసన్యాసముకాని చతుర్థాధ్యాయమునందు నిర్వివాదముగనిశ్చయించబడెను. అజ్ఞానియన్నచో యంతఃకరణశుద్ధిద్వారమున జ్ఞానముకొరకు కర్మలననుష్ఠించ

**శాంకరభాష్యమ్:—**

నేన యోగంచ కర్మానుష్ఠానలక్షణమనుతిష్ఠేత్యుక్తవాన్। తయో రుభయోశ్చ కర్మానుష్ఠానకర్మ సంన్యాసయోః స్థితిగతివ త్పరస్పరవిరోధాదేకేన సహ కర్తు మశక్యత్వా త్కాలభేదేనచానుష్ఠాన విధానాభావా దర్థాదేతయో రన్యతరకర్తవ్యతాప్రాప్తౌ సత్యాం యత్ప్రశస్యతర మేతయోః కర్మానుష్ఠాన కర్మసంన్యాసయో స్తత్కర్తవ్యం నేతరదిత్యేవం మన్యమానః ప్రశస్యతరబుభుత్సయాఽర్జున ఉవాచ 'సంన్యాసం కర్మణాం కృష్ణ!' (గీ-5-1) ఇత్యాదినా।

**శాంకరభాష్యతత్త్వబోధినిః—**

చెప్పుటవలన జిజ్ఞాసువునకు సర్వకర్మసంన్యాసము సూచింపఁబడెను. 'జ్ఞానాగ్నిః' అనుదానిచే-- 'తద్విద్ధి ప్రణిపాతేన' అనుశ్లోకమునందు జ్ఞానప్రాప్త్యుపాయమగు సాష్టాంగనమస్కారాదికమును చెప్పి పొందబడిన జ్ఞానముచే నతిశయమాహాత్మ్యముకలవానిచే సర్వకర్మల నివృత్తియే యనుసరింపదగినదని చెప్పుచుండెడి శ్రీకృష్ణపరమాత్మచే జ్ఞానమును కోరెడువానికి సంన్యాసమునందే యధికారమని చూపఁబడెను. 'యోగసంన్యస్తకర్మాణం' అనుదానిచే-జ్ఞానముచే సంఛిన్నమైన నిఖిలసంశయములు కలిగినట్టియు, అట్టి జ్ఞానమువలననే సర్వకర్మలను సంన్యసించినట్టియు, వశీకృతమగు కార్యకరణసంఘాతముకల పురుషుని ప్రాతిభాసికమగు కర్మములు బంధించవని రెండు విధములగు సంన్యాసములు శ్రీకృష్ణునిచే చెప్పఁబడెను.

అట్లగుచో కర్మసంన్యాసమే జిజ్ఞాసువుచేతను, జ్ఞానిచేత నాచరణీయమైనదగుటవలన కర్మానుష్ఠానముపాదేయము (స్వీకార్యము) కాదని శంకింపఁజనదు. "ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత!" అనుదానిచే కర్మానుష్ఠానరూపమగు యోగము ననుష్ఠింపుమని శ్రీకృష్ణ పరమాత్మయే చెప్పెను.

ఇట్లు శ్రీకృష్ణపరమాత్మ కర్మ, కర్మసంన్యాసములను చెప్పినచో నారెండు నేకపురుషునిచే ననుష్ఠింపదగినవగుటవలన విరోధ మేమియు లేదని శంకింపజనదు. నారెండును యేకపురుషానుష్ఠేయములనగ నొకటి నొకసమయముననే యేకపురుషానుష్ఠేయములా? లేక రెండుముందుగ కర్మయోగమునునుష్ఠించి యనంతరమున కర్మసంన్యాసమనుష్ఠేయమా? కర్మానుష్ఠానకర్మసంన్యాసములనెడి రెండును స్థితిగతులువలె పరస్పరవిరుద్ధములగుటవలన నొకపురుషునిచే నేకకాలమున ననుష్ఠించుటకు శక్యముకానందున ప్రథమపక్షము సంభవింపదు. కాలభేదముచే (అనగా కర్మానుష్ఠానానంతరమున కర్మసంన్యాసమనుష్ఠేయమని విధింపనందున ద్వితీయపక్షము సంభవింపదు. కాన

పలెను. ఈ విషయముననే "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన దానేన తపసాఽనాశకేన" (వేదానువచనముచేతను, యజ్ఞములచేతను, దానములచేతను, తపస్సుచేతను, నిరశనవ్రతములచేతను బ్రాహ్మణులు ఆత్మస్వరూపమును తెలిసికొనుటకిచ్ఛగించుచుండిరి.) అని శ్రుతిబోధించుచుండెను. "సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే" (నిఖిలకర్మలు జ్ఞానమునందే పరిసమాప్తిని బొందుచున్నవి.) అను భగవద్వచనముగూడ నివిషయముననే బోధించుచున్నది. ఇట్లే సర్వకర్మలు జ్ఞానమునిమిత్తము, సర్వకర్మసంన్యాసము జ్ఞానార్థమనియు

శాంకరభాష్యమ్:—

(2) నను చాత్మవిదో జ్ఞానయోగేన నిష్ఠాం ప్రతిపిపాదయిషుః పూర్వోదాహృతై ర్వచనై ర్భగవా న్సర్వకర్మసంన్యాస మవోచన్న త్వనాత్మజ్ఞ స్యాతశ్చ కర్మానుష్ఠాన కర్మ సంన్యాసయో ర్భిన్నపురుషవిషయత్వాదన్యతరస్య ప్రశస్యతరత్వబుభుత్సయా ప్రశ్నోఽనుపపన్నః। సత్యమేవత్వదభిప్రాయేణ ప్రశ్నో నోపపద్యతే-ప్రష్టుః స్వాభిప్రాయేణ పునః ప్రశ్నోయుజ్యత ఏవేతివదామః। కథం? పూర్వోదాహృతై ర్వచనై ర్భగవతా కర్మసంన్యాసస్య కర్తవ్యతయా వివక్షితత్వాత్ప్రాధాన్య మన్తరేణచ కర్తారం తస్యకర్తవ్యత్వాసంభవాత్। అనాత్మవిదపి కర్తా పక్షే ప్రాప్తోఽనూద్యత ఏవ, న పునరాత్మవి త్కర్తృకత్వమేవ సంన్యాసస్య వివక్షిత మితి।

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

నేమిచేయవలెనని‌నచో అర్థాత్తు యీకర్మయోగకర్మసంన్యాసములలో నేదో యొకటి కర్తవ్యమగు నని యన్యతరమునకు కర్తవ్యత్వము ప్రాప్తించును. అదియెట్లనిన ? (ఉన్నివృత్తికి కారణ ములు రెండు స్వతంత్రముగ నుండునపుడు అవి వైద్యశాస్త్రముచే పరస్పరవిరుద్ధములైన నా రెంటిలో నొకదానినే స్వీకరించవలెను. అందు దేనిని స్వీకరించవలెననిన ? ఆ రెంటిలో యేది ప్రశస్యతరమో యది స్వీకార్యమగునని ప్రశస్యతరమును తెలిసికొనుటకు ప్రశ్నించినటుల) శ్రేయఃప్రాప్తికి సాధనములుగ శ్రీకృష్ణపరమాత్మచే నుపదిష్టమైన పరస్పరవిరుద్ధములగుటచే నొకేకాలమందేకపురుషానుష్ఠేయములు కాని, విధిలేమింజేసి భిన్నకాలమునం దనుష్ఠేయములు కాని కానట్టి కర్మయోగ, కర్మసంన్యాసములలో నేది ప్రశస్యతరమో అది యనుష్ఠేయము. ఇతర మగున దనుష్ఠేయము కాదని తలచి ప్రశస్యతరమగుదానిని తెలిసికొనునిచ్ఛచే యర్జునుఁడు "సంన్యాసం కర్మణాం కృష్ణ పున ర్యోగంచ శంససి। యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితం" అని ప్రశ్నించెను.

—: పూర్వపక్షము :—

(2) ఆత్మవేత్తకు జ్ఞానయోగముచే నిష్ఠను చెప్పదలచినవాడై శ్రీకృష్ణపరమాత్మ "స యుక్తః కృత్స్నకర్మకృత్, జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం" ఇత్యాది పూర్వోదాహృతవచనము లచే సర్వకర్మసంన్యాసమును జెప్పెను. అనాత్మజ్ఞున కట్టి సంన్యాసమును చెప్పలేదు. కాన, కర్మానుష్ఠాన మజ్ఞానికి, కర్మసంన్యాసముజ్ఞానికి యగుటవలన (రెండు నొకపురుషునకు ప్రాప్తించ నందున) కర్మ, కర్మసంన్యాసములలో నేదో యొకటి ప్రశస్యతరమగుదానిని తెలిసికొను నిచ్ఛచే యర్జునుడు ప్రశ్నించె నని చెప్పుట యుపపన్నము కాదు.

—•సిద్ధాంతము•—

సత్యమే. వాదివగు నీయభిప్రాయానుసారముగ యర్జునప్రశ్నము సరిపడదు. ప్రశ్నయ నునది ప్రాశ్నికుని యభిప్రాయముచే నుడువబడునుకాని వాది యభిప్రాయముచే ప్రాశ్నికుడు ప్రశ్నింపడు. ప్రాశ్నికుని యభిప్రాయముచే నగుచో యీ యర్జునప్రశ్నముపపన్నమేయగును. ప్రష్టయొక్క యభిప్రాయ మెట్టిదనిన? పూర్వోదాహృతమగు 'స యుక్తః కృత్స్నకర్మకృత్,

**శాంకరభాష్యమ్।—**

(౩) ఏవం మన్వానస్యార్జునస్య కర్మానుష్ఠాన కర్మసంన్యాసయో రవిద్వత్పురుష కర్తృకత్వ మప్యస్తీతి పూర్వోక్తేన ప్రకారేణ తయోః పరస్పరవిరోధా దన్యతరస్య కర్తవ్యత్వే ప్రాప్తే ప్రశస్యతరంచ కర్తవ్యం నేతరదితి ప్రశస్యతరవివిదిషయా ప్రశ్నో నానుపపన్నః।

**శాంకరభాష్యతత్త్వబోధిని।—**

జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం" ఇత్యాదివాక్యములచే కర్మసంన్యాసము కర్తవ్యముగ భగవంతునిచే వివక్ష చేయబడుటవలన నట్టి కర్మసంన్యాసమునకు ప్రాధాన్యములేనిదే కర్తనుగూర్చి యాసంన్యాసము కర్తవ్యము కానందున జ్ఞాని అట్టిసంన్యాసమున కధికారియగు నట్లజ్ఞానికూడ కర్తగ పక్షమునందు ప్రాప్తించుచుండును అట్టి యజ్ఞానికూడ నిట్లే యనువదించబడును. పూర్వోక్త వచనములచే నాత్మవిత్తే సంన్యాసమునకు గర్తగ వివక్ష చేయబడలేదు. ఆత్మవేత్తయే సంన్యాసమునకు కర్తగ పూర్వోక్తవచనములచే వివక్షచేయబడినచో కర్త్రంతరపర్యుదాసయు (మరియొకడు సంన్యాసమునకు కర్త కాడనియు) సంన్యాసవిధియు అని అర్థభేదముచే వాక్యభేదము సంభవించెడిని.

(౩) కర్మానుష్ఠాన కర్మసంన్యాసముల కవిద్వత్కర్తృకత్వముగూడ కలదని తలచుచున్న (ప్రశ్నకుడగు) యర్జునుని "కర్మానుష్ఠాన కర్మసంన్యాసములకు స్థితిగతులకువలె పరస్పర విరోధమువలన నేకకాలమునం దేకపురుషానుష్ఠేయత్వము లేనందునను, భిన్నకాలమున ననుష్ఠాన విధి లేనందున నేకపురుషానుష్ఠేయత్వము సంభవింపనందునను, కర్మానుష్ఠానకర్మసంన్యాసములలో యేదోయొక టనుష్ఠేయమని ప్రాప్తించుచుండ నారెంటిలో నేది ప్రశస్యతరమో యది యనుష్ఠేయము, ఇతరమగున దనుష్ఠేయముకాదు" అని ప్రశస్యతరమును తెలుసుకొనునిచ్ఛచే ప్రశ్న మనుపపన్నముకాదు. యుపపన్నమే యగును.

"ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తః ప్రవ్రజన్తి" 'శాంతోదాన్త ఉపరత స్తితిక్షు స్సమాహితో భూత్వాత్మన్యేవాత్మానం పశ్యేత్' "త్యజతైవ హి తజ్జ్ఞేయం త్యక్తుః ప్రత్యక్పరంపదం" "సత్యానృతే సుఖదుఃఖే వేదా నిమం లోకమముంచ పరిత్యజ్యాత్మానమన్విచ్ఛేత్" ఇత్యాదిశ్రుతులు బోధించుచున్నవి. అందున ఆరాదుపకారకసన్నిపత్యోపకారకములగు ప్రయాజావఘాతములకు సముచ్చయము సంభవించనట్లు విరుద్ధములగుటచే యౌగపద్యముసంభవించనందున కర్మ, కర్మసంన్యాసములకు సముచ్చయము సంభవింపదు. "అతిరాత్రే షోడశినం గృహ్ణాతి, నాతిరాత్రేషోడశినం గృహ్ణాతి" అతిరాత్రయాగమునందు 'షోడశి' అనుగ్రహమును (పాత్రవిశేషమును) గ్రహించవలెను. అతిరాత్రయాగమునందు 'షోడశి' అనుగ్రహమును గ్రహించడు.' అని షోడశి గ్రహణాగ్రహణము లేకార్థములగుటచే వాటి కతిరాత్రయాగమునందు వికల్పము (కొందరు షోడశిగ్రహణముచేయుట, కొందరు మానుట) సంభవించినట్లు కర్మ, కర్మసంన్యాసములు రెండును యాత్మజ్ఞానమే ఫలముగాకలవగుటచే వికల్పము (కర్మాచరణముచేగాని, కర్మసంన్యాసముచేగాని, జ్ఞానమునుపొందవచ్చుననియు చెప్పుటకు, వీలుపడదు. ఎందువలననిన? కర్మకు పాపక్షయరూపమగు నదృష్టమే ద్వారము. కర్మసంన్యాసమునకు సర్వవిక్షేపరాహిత్యముగ వేదాన్తవిచారమునకు తగుసమయము నొసగుటయే. ఇదిదృష్టద్వారము. ఇట్టి దృష్టద్వారమే కర్మసంన్యాసమునకు జ్ఞానమును పొందుటయందు ద్వారము. కాన నవఘాతాదు లారాదుపకారకములైనను పండాపూర్వమునకు కారణమైనటుల

**శాంకరభాష్యమ్।—**

(1) ప్రతివచనవాక్యార్థనిరూపణేనాపి ప్రష్టు రభిప్రాయ మేవేతి గమ్యతే। కథం? "సంన్యాసకర్మయోగౌ నిశ్శ్రేయసకరౌ తయోస్తు కర్మయోగో విశిష్యత" (గీ3-౨2) ఇతి ప్రతివచన మేతన్నిరూప్యం కిమనేనాత్మవిత్కర్తృకయో స్సంన్యాసకర్మయోగయో ర్నిశ్శ్రేయసకరత్వం ప్రయోజన ముక్త్వా తయో రేవ కుతశ్చి ద్విశేషా త్కర్మసంన్యాసా త్కర్మయోగస్య విశిష్టత్వ ముచ్యతే? ఆహోస్వి దనాత్మవిత్కర్తృకయో స్సంన్యాసకర్మయోగయో స్తదుభయ ముచ్యత ఇతి। కించాతో యద్యాత్మవిత్కర్తృకయో స్సంన్యాసకర్మయోగయో ర్నిశ్శ్రేయసకరత్వంతయోస్తు కర్మసంన్యాసా త్కర్మయోగస్య విశిష్టత్వ ముచ్యతే? యదివాఽనాత్మవిత్కర్తృకయో స్సంన్యాసకర్మయోగయో స్తదుభయ ముచ్యత ఇతి?

**శాంకరభాష్యతత్త్వబోధినీ: —**

(4) అర్జునుని ప్రశ్నకు ప్రతివచనముగ చెప్పఁబడిన శ్రీకృష్ణునివాక్యముయొక్క యర్థ పర్యాలోచనచేగూడ ప్రష్టయగు యర్జునునియొక్క యభిప్రాయ మవిద్వత్కర్తృకకర్మయోగకర్మసంన్యాసములలో నేది శ్రేయస్సాధనమను ప్రశ్నయే తోచుచున్నది. శ్రీకృష్ణుని ప్రతివచనమేది? ఎట్లు తన్నిరూపణము? అనెదవా? "సంన్యాసకర్మయోగౌ నిశ్శ్రేయసకరౌ తయోస్తు కర్మయోగో విశిష్యతే" అనునదియే శ్రీకృష్ణుని ప్రతివచనము. ఈ వాక్యముచే ఆత్మవిత్కర్తృక కర్మసంన్యాస కర్మయోగములకు నిశ్శ్రేయసకరత్వమను ప్రయోజనమునుచెప్పి యారెంటిలో యేదో యొక విశేషమువలన కర్మసంన్యాసముకంటె కర్మయోగమునకు గొప్పతనము చెప్పఁబడెనా? లేక, అనాత్మవిత్కర్తృక కర్మసంన్యాస కర్మయోగములకు నిశ్శ్రేయసకరత్వమునుచెప్పి యేదోయొక విశేషమువలన నారెంటిలో కర్మయోగమునకుత్కృష్టత్వము చెప్పఁబడెనా? ఆత్మవిత్కర్తృక కర్మసంన్యాస కర్మయోగములకు నిశ్శ్రేయసకరత్వమును చెప్పి యేదో యొకవిశేషమువలన కర్మసంన్యాసముకంటె కర్మయోగమునకే యుత్కృష్టత్వము చెప్పఁబడెను. లేదా యనాత్మవిత్కర్తృక కర్మసంన్యాసకర్మయోగములకు నిశ్శ్రేయససాధనత్వమునుచెప్పి యేదో యొకవిశేషముచే కర్మసంన్యాసమునకుకంటె కర్మయోగమునకే యుత్కృష్టత్వము చెప్పఁబడెను. అననేమి? యెటులచెప్పిననేమి? దీనివలన నేమి ప్రయోజనము? అనెదవా?

కర్మనియమా పూర్వముగుటచే దృష్టసమవాయియే యగుటవలన (కర్మసంన్యాసమునకు ద్వారమగు వేదాంతవిచారాదిసరదానరూపమగు దృష్టార్థమునకే కారణమగుటవలన) జ్ఞానమునకు సాధనముకానందున కర్మ, కర్మసంన్యాసముల కేకార్థత్వము సంభవము కాదు. కానకర్మవలననైనను, లేక కర్మసంన్యాసమువలననైనను జ్ఞానముసంభవించునను వికల్పపక్షముసంభవించదు. మరియు ఆరాదుపకారకము, సంనిపత్యోపకారకము ఇక ప్రధానార్థమైనను వాటికివికల్పము (అనగా రెంటిలో యేదోయొకదాని నాచరించిన ప్రధానముసిద్ధించుట) సంభవించదు. అట్లైనచో ఆరాదుపకారసంన్నిపత్యోపకారకములగు ప్రయాజావఘాతములకుకూడ వికల్పముసంభవించవలసివచ్చును. అట్లెవరును యంగీకరించుట లేదు. కాన కర్మ, కర్మసంన్యాసము లుభయములు క్రమముగ ననుష్ఠింపదగినవి.

శాంకరభాష్యమ్:—

(5) అతోఽభిధీయతే, ఆత్మవిత్కర్తృకయో స్సంన్యాసకర్మయోగయో రసంభవా త్తయో ర్నిశ్శ్రేయసకరత్వవచనం, తదీయాచ్చ కర్మసంన్యాసా త్కర్మయోగస్య విశిష్టత్వాభిధాన మిత్యేత దుభయ మనుపపన్నమ్ । యద్యనాత్మవిదః కర్మసంన్యాస స్తత్ప్రతికూల శ్చ కర్మానుష్ఠానలక్షణః కర్మయోగ స్సంభవేతాం తదా తయోర్నిశ్శ్రేయసకరత్వోక్తిః, కర్మయోగస్యచ కర్మసంన్యాసా ద్విశిష్టత్వాభిధాన మిత్యేతదుభయ ముపపద్యతే । ఆత్మవిదస్తు సంన్యాసకర్మయోగయో రసంభవా త్తయో ర్నిశ్శ్రేయసకరత్వాభిధానం, కర్మసంన్యాసాచ్చ కర్మయోగో విశిష్యత ఇతి చానుపపన్నమ్ । అత్రాహ-కిమాత్మవిద స్సంన్యాసకర్మయోగయో రప్యసంభవః? ఆహోస్వి దన్యతరస్యాసంభవో? యదా చాన్యతరస్యా సంభవ స్తదా కిం కర్మసంన్యాసస్యోత కర్మయోగస్యే త్యసంభవే కారణంచ వక్తవ్యమితి ।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(5) ఈ విషయమున చెప్పెద వినుము. ఆత్మవిత్కర్తృక సంన్యాసకర్మయోగములు సంభవించనందున కర్మసంన్యాసకర్మయోగములకు నిశ్శ్రేయసకరత్వమును జెప్పుట, ఆత్మవిత్కర్తృక కర్మసంన్యాసముకంటె కర్మయోగమున కుత్కృష్టత్వమును జెప్పుటయు యనుపపన్నమే. అనాత్మవిత్తునకే కర్మసంన్యాసము, తద్విరుద్ధమగు కర్మయోగము కర్మానుష్ఠానరూపము సంభవించుచో నపుడా రెంటికి నిశ్శ్రేయసకరత్వమును జెప్పుట, కర్మసంన్యాసముకంటె కర్మయోగమున కుత్కృష్టత్వాభిధాన మనెడి యీ రెండును యుపపన్నమగును. ఆత్మజ్ఞునకు కర్మసంన్యాస కర్మయోగముల యసంభవ మింతకు పూర్వమునందు చూపించబడెను అందు ఇది యిట్లుండ ఆత్మవేత్తకు కర్మసంన్యాసకర్మయోగములు రెండును సంభవించవా? లేక ఈ రెంటిలో యేదో యొకటి సంభవించదా ? యేదో యొకటి సంభవించదనినచో అందు కర్మసంన్యాసము సంభవించదా ? లేక కర్మయోగము సంభవించదా ? అసంభవమునందు కారణము కూడ జెప్పదగియున్నది.

అందునను (1) కర్మసంన్యాసానంతరమున కర్మయాచరించదగినదా? (2) కర్మానుష్ఠానానంతరమున కర్మసంన్యాసమా! కర్మసంన్యాసానంతరమున కర్మాచరణమన్నచో పరిత్యజించబడిన పూర్వాశ్రమమును తిరుగ స్వీకరించుటచే నారూఢపతితుడగుటవలన కర్మానధికారిత్వము, ప్రాచీనమగు కర్మసంన్యాసమునకు వైయర్థ్యము ప్రాప్తించును. కాన కర్మ దృష్టార్థము కానందున మొదటస్వీకరించిన సంన్యాసముచేత నే జ్ఞానాధికారము లభించుచుండ కర్మసంన్యాసానంతరమున కర్మానుష్ఠానము వ్యర్థము. అందువలన మొదటనే భగవదర్పణబుద్ధిచే నిష్కామకర్మానుష్ఠానమువలన నంతఃకరణము శుద్ధినిపొంద తీవ్రవైరాగ్యముచే వివిదిష (ఆత్మజ్ఞానేచ్ఛ) దృఢమగుచుండ శ్రవణమననాదిరూపవేదాంతవిచారముకొరకు సంన్యాసము కర్తవ్యమని శ్రీకృష్ణపరమాత్మ మతము.

ఈవిషయమే "న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే" (కర్మల నాచరించనిదే పురుషుడు నైష్కర్మ్యసిద్ధినిపొందడు) డని శ్రీకృష్ణపరమాత్మ చెప్పియుండెను. మఱియు "ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణ ముచ్యతే! యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే" ఆరురుక్షువునకు యోగమునుగూర్చి కర్మ కారణమనియు, యోగారూఢుడగు యతనికే శమము కారణమనియు శ్రీకృష్ణపరమాత్మ చెప్పగలడు. యోగమనగా

శాంకరభాష్యమ్.—

(6) అతోఽభిధీయతే, ఆత్మవిదో నివృత్తమిథ్యాజ్ఞానత్వా ద్విపర్యయజ్ఞానమూలస్య కర్మయోగస్యాసంభవ స్స్యాజ్జన్మాదిసర్వవిక్రియారహితత్వేన నిష్క్రియ మాత్మాన మాత్మత్వేన యో వేత్తి తస్యాత్మవిద స్సమ్యగ్దర్శనే నాపాస్తమిథ్యాజ్ఞానస్య నిష్క్రియాత్మ స్వరూపావస్థానలక్షణం సర్వకర్మసంన్యాస ముక్త్వా తద్విపరీతస్య మిథ్యాజ్ఞానమూలకర్తృత్వాభిమానపురస్సరస్య సక్రియాత్మస్వరూపావస్థానరూపస్య కర్మయోగస్యేహ శాస్త్రే తత్ర తత్రాత్మస్వరూప నిరూపణప్రదేశేషు సమ్యగ్జ్ఞానమిథ్యాజ్ఞానతత్కార్యవిరోధా దభావః ప్రతిపాద్యతే యస్మాత్తస్మాదాత్మవిదో నివృత్తమిథ్యాజ్ఞానస్య విపర్యయజ్ఞానమూలః కర్మయోగో న సంభవతీతి యుక్తముక్తం స్యాత్। కేషు కేషు పునరాత్మస్వరూపనిరూపణప్రదేశే ష్వాత్మవిదః కర్మాభావః ప్రతిపాద్యతఇతి? అతోఽభిధీయతే, "అవినాశి తు తద్విద్ధీ"తి ప్రకృత్య "య ఏనం వేత్తి హంతారం" (గీ.2-19) "వేదావినాశినం నిత్యం" (గీ2-21) ఇత్యాదౌ తత్ర తత్రాత్మవిదః కర్మాభావ ఉచ్యతే।

శాంకరభాష్యతత్త్వబోధినీ.—

(6) ఈ విషయమున జెప్పెద వినుము- నివృత్తమిథ్యాజ్ఞానము కలవాడగుట నాత్మవేత్తకు భ్రమజ్ఞానము కారణముగా కల కర్మయోగము సంభవింపదు. జన్మాదిషడ్భావవికారరహితమగుటచే నిష్క్రియమగు నాత్మను యాత్మస్వరూపముగ నెవడు తెలిసుకొనునో సమ్యగ్దర్శనముచే నపాస్త మిథ్యాజ్ఞానము కల యా యాత్మవేత్తకు నిష్క్రియాత్మస్వరూపముచే నవస్థానరూపమగు సర్వకర్మసంన్యాసమును జెప్పి మిథ్యాజ్ఞానమూలక [illegible] కర్తృత్వాభిమానపురస్సరముగా కలిగినట్టియు, సంన్యాసవిరుద్ధమగునట్టి సక్రియాత్మ స్వరూపావస్థానరూపమగు కర్మయోగముయొక్క యభావ మీ గీతాశాస్త్రమునం దచ్చటచ్చట యాత్మస్వరూప నిరూపణప్రదేశములయందు సమ్యగ్జ్ఞానమిథ్యాజ్ఞానతత్కార్యవిరోధమువలన జెప్పఁబడుచుండెను. కాన నివృత్తమిథ్యాజ్ఞానముకల యాత్మజ్ఞానికి భ్రమజ్ఞానము కారణముగా కల కర్మయోగము సంభవించదని జెప్పుట యుక్తమే యగును. ఏయే యాత్మస్వరూపనిరూపణప్రదేశములయం దాత్మవేత్తకు కర్మాభావము చెప్పబడె ననెదవా ? ఈ విషయమున "అవినాశితు తద్విద్ధి" అబ్రహ్మ మవినాశి అని యాత్మస్వరూపమును ప్రకృతముగ జేసుకొని 'య ఏనం వేత్తి హంతారం'' 'వేదావినాశినం నిత్యం" ఇత్యాది స్థలములయం [illegible] దాత్మవేత్తకు కర్మాభావము జెప్పబడెను.

తీవ్రవైరాగ్యపూర్వకమగు వివిదిషయేయనిగ్రహింపనగును. ఈవిషయము నేవార్తికకారులు "ప్రత్యగ్వివిదిషాసిద్ధ్యై వేదానువచనాదయః। బ్రహ్మావాప్త్యైతు తత్త్యాగ మీప్సన్తీతిశ్రుతేర్బలాత్" (ఆత్మవివిదిష సిద్ధించుటకు వేదానువచనము, యజ్ఞము మొదలగువాటినాచరించవలయును. వివిదిషదృఢమైనపిదప కర్మపరిత్యాగమును శ్రుతిబలమువలన నిచ్ఛయించుచుండిరని స్పష్టపరచెను. స్మృతియు 'కషాయపక్తిః కర్మభ్యః జ్ఞానంతు పరమాగతిః। కషాయేకర్మభిః పక్వే తతో జ్ఞానం ప్రవర్తతే'' (కర్మలవలన సంతఃకరణము పక్వమగును. దీనికి పరమగతి జ్ఞానమే. కర్మలవలన

**శాంకరభాష్యమ్‌ —**

(7) నను చ కర్మయోగో ప్యాత్మస్వరూపనిరూపణప్రదేశేషు తత్ర తత్ర ప్రతిపాద్యత ఏవ, తద్యథా "తస్మా ద్యుధ్యస్వ భారత!" (గీ2-18) 'స్వధర్మ మపి చావేక్ష్య' (గీ2-31) 'కర్మణ్యేవాధికారస్తే' (గీ2-47) ఇత్యాదా వతశ్చ కథ మాత్మవిదః కర్మయోగస్యాఽసమ్భ

**శాంకరభాష్యతత్త్వబోధిని —**

(7) ఆత్మస్వరూపనిరూపణప్రదేశములయందు సంన్యాసము చెప్పబడుటవలన యాత్మజ్ఞానికి సంన్యాసము వివక్షిత మగుచో నట్టియాత్మస్వరూపనిరూపణప్రకరణములయందే యచ్చటచ్చట కర్మయోగముకూడ చెప్పఁబడెను. అదియెట్లనిన ? "తస్మాద్యుధ్యస్వభారత !, స్వధర్మ మపి చావేక్ష్య, కర్మణ్యేవాధికారస్తే" ఇత్యాది స్థలములయం దాత్మస్వరూపనిరూపణప్రకరణములయందే కర్మయోగముకూడ చెప్పఁబడుటవలన ప్రకరణమను ప్రమాణముచే నాత్మవేత్తకు కర్మయోగము సంభవించుచుండ నాత్మవిత్తునకు కర్మయోగము సంభవము కాదని

---

నంతఃకరణము పక్వమైనచో జ్ఞానము ప్రాప్తించును.) అనిబోధించుచున్నది. మోక్షధర్మములయందుంగూడ "కషాయంపాచయిత్వాశు శ్రేణీస్థానేషు చ త్రిషు। ప్రవ్రజేచ్చ పరం స్థానం పారివ్రాజ్యమనుత్తమమ్‌॥ భావితైఃకారణైశ్చాయం బహుసంసారయోనిషు। ఆసాదయతి శుద్ధాత్మా మోక్షంవై ప్రథమాశ్రమే। త మాసాద్యతు ముక్తస్య దృష్టార్థస్య విపశ్చితః। త్రిష్వాశ్రమేషు కోన్వర్థో భవే త్పర మభీప్సతః॥" బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థాశ్రమములయం దంతఃకరణను పరిపక్వ మొనరించి ఉత్కృష్టమగు పారివ్రాజ్యమును। సంన్యాసమును పొందవలసినది. అనేక సంసారయోనులయందు భావితమగు కారణములచే శుద్ధమైన యంతఃకరణము కలవాడు ప్రథమాశ్రమమునందే మోక్షము (వైరాగ్యము)ను పొందును. అట్టి వైరాగ్యమును బొంది ముక్తుడైనట్టియు, చూడబడిన తత్త్వముకలిగినట్టియు, పరము కోరునట్టి విద్వాంసునకు బ్రహ్మచర్య గార్హస్థ్య వానప్రస్థాశ్రమములయందేమి ప్రయోజనము ? (ఏమియుప్రయోజనములేదు.) అని బోధించుచున్నది. ఈ చెప్పుటవలనదేలిన యాశయమేమి ? క్రమసంన్యాసమని, అక్రమసంన్యాసమని, సంన్యాసములు రెండువిధములని చూపఁబడెను. 'బ్రహ్మచర్యం సమాప్య గృహీభవే ద్గృహీ వనీ భూత్వా ప్రవ్రజే ద్యది వేతరథా బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేద్గృహాద్వా వనాద్వా, యదహరేవ విరజే త్తదహరేవ ప్రవ్రజేత్‌" (బ్రహ్మచర్యాశ్రమమును సమాప్తి బొందించి గృహస్థుడు కావలెను. గార్హస్థ్యమువలన వానప్రస్థాశ్రమమును స్వీకరించినపిమ్మట సంన్యాసమును స్వీకరించవలెను.) అను నీశ్రుతివాక్యము క్రమసంన్యాసమును బోధించుచున్నది. లేక బ్రహ్మచర్యమునుండియే సంన్యాసమును స్వీకరించవలెను. లేక గార్హస్థ్యమునుండియైన సంన్యాసమును స్వీకరించవలెను. అనుశ్రుతివాక్యము క్రమసంన్యాసమును బోధించుచున్నది. (లేక వానప్రస్థాశ్రమమునుండియైన సంన్యాసమును స్వీకరించవలెను.) ఈ వాక్యముమాత్రము క్రమసంన్యాసబోధకము, (ఏదివసమునందు వైరాగ్యము ప్రాప్తించునో ఆ దివసమునందే సంన్యసింపవలయును.) ఈవాక్య మక్రమసంన్యాసమును బోధించుచున్నది. క్రమసంన్యాసమనగ బ్రహ్మచర్యాశ్రమము మొదలు క్రమముగ నుత్తరోత్తరాశ్రమములను స్వీకరించి చివరకు సంన్యాసమును స్వీకరించుటయే. అక్రమసంన్యాసమనగ వానప్రస్థాశ్రమమువరకు పోవక; బ్రహ్మచర్యాద్యాశ్రమముల యనంతరమే సంన్యాసమును స్వీకరించుట. కాన నజ్ఞాని వైరాగ్యము సంభవించనికాలమున కర్మలనే యాచరించవలయును. ఆవైరాగ్యము సంభవించినకాలమున శ్రవణాదుల కవకాశ మొసంగుటచే జ్ఞానార్థము సంన్యాసమును స్వీకరించవలయును. కాలభేదముచే నజ్ఞాని నుద్దేశించియే కర్మయు, కర్మసంన్యాసము అని వ్యాఖ్యానించుటకు పంచమా

శాంకరభాష్యమ్:—

వస్స్యా దితి। అతోఽభిధీయతే, సమ్యగ్జ్ఞాన మిథ్యాజ్ఞాన తత్కార్యవిరోధాత్। 'జ్ఞానయోగేన సాంఖ్యానాం' (గీ3-3) ఇత్యనేన సాంఖ్యానా మాత్మతత్త్వవిదా మనాత్మవిత్కర్తృక కర్మయోగ నిష్ఠాతో నిష్క్రియాత్మస్వరూపావస్థానలక్షణాయా జ్ఞానయోగనిష్ఠాయాః పృథక్కరణా

శాంకరభాష్యతత్త్వబోధినీ —

చెప్పుట యెట్లు పొసగును? ఈ విషయమున చెప్పెద వినుము-సమ్యగ్జ్ఞాన, మిథ్యాజ్ఞాన తత్కార్యములకు విరోధమువలన నాత్మజ్ఞానికి కర్మయోగము సంభవింపదు. అది యెట్లనిన? "జ్ఞానయోగేన సాంఖ్యానాం" అనుదానిచే నాత్మతత్త్వవేత్తలగు సాంఖ్యుల కనాత్మవిత్కర్తృక కర్మయోగముకంటె నిష్క్రియాత్మస్వరూపావస్థానరూపమగు జ్ఞానయోగనిష్ఠయొక్క పృథక్కరణము వలన నాత్మవేత్త కృతకృత్యుఁడగుటచే ప్రయోజనాంతరము లేనందున 'తస్య కార్యం న విద్యతే'

ధ్యాయము, ఆఱవయధ్యాయము లారంభింపఁబడుచుండెను. ఇంతవరకుచెప్పఁబడిన సంన్యాసము వివిదిషాసంన్యాసము. విద్వత్సంన్యాసమన్నచో జ్ఞానబలమువలననే యర్థాత్తు సిద్ధము. కావున దానివిషయమై సందేహము లేమిఁజేసి ఇచట విద్వత్సంన్యాసము విచారింపబడదు.

జిజ్ఞాసువు, అజ్ఞుడు అగునొక యర్జునునిగూర్చియే జ్ఞానార్థమై కర్మ, కర్మసంన్యాసములు విధించుటవలన నాకర్మ కర్మసంన్యాసములు విరుద్ధములగుటవలన నొకనిచే నేక కాలమునం దాచరించుట శక్యముకానందున జిజ్ఞాసువునగు నేను యిపుడు కర్మనాచరించవలయునా? లేక కర్మసంన్యాసము నాచరించవలయునా? అని సందేహముకలవాడై యర్జునుండు "సంన్యాసం" అని ప్రశ్నించుచుండెను.

"ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి" (ఈ యాత్మలోకమునే కోరెడివారై పరివ్రాజకులు కర్మసంన్యాసమును పొందుచుండిరనియు,) "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి యజ్ఞేన" బ్రాహ్మణులు వేదానువచనము, యజ్ఞము మొదలగుకర్మలచేతనే యాత్మస్వరూపమును తెలిసికొనుటకిచ్ఛయించుచుండిరనియు, వేదముఖముచేతనే యోసదానందరూప భక్తదుఃఖకర్షక శ్రీకృష్ణ! యావజ్జీవశ్రుతిచోదితమగు నిత్యనైమిత్తిక కర్మల త్యాగరూపమగు సంన్యాసమును, అట్టి కర్మసంన్యాసమునకు విరుద్ధమగు కర్మానుష్ఠానరూపమగు యోగమును జిజ్ఞాసువగు యర్జునకు దెలుపుచుంటివి. లేక "నిరాశీ ర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః। శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషం॥" అను గీతావాక్యముచే కర్మసంన్యాసమును, "ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత!" అను గీతావాక్యముచే కర్మయోగమును జిజ్ఞాసువగు యర్జునకే దెలుపుచుంటివి. ఒక యర్జునినిగూర్చియే కర్మ, కర్మసంన్యాసములు విధింపఁబడినవి. ఈ రెండును ఒక పురుషుడొక కాలమునందే యాచరించుట సంభవించదు. కావున నీకర్మ, కర్మసంన్యాసములలో యేది ప్రశస్తతరమో అనుష్ఠానమునకు నీకుసమ్మతమో అట్టికర్మయోగమును గాని, కర్మసంన్యాసమును గాని యేదో యొకదానిని నాకు చెప్పుము.॥౧॥

శంకరానందీయము:—

"కర్మ ణ్యకర్మ యః పశ్యేత్" అను మొదలుకొని కర్మసంన్యాసము నుపక్రమించి "జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం, శారీరం కేవలం కర్మ, యదృచ్ఛాలాభసన్తుష్టః, సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానాగ్నిః సర్వకర్మాణి, యోగసంన్యస్తకర్మాణం" అను వాక్యములచే బ్రహ్మవేత్తయగు బ్రహ్మనిష్ఠునకు సర్వకర్మ సంన్యాసమే చేయుదగినదని బోధించి, కర్మసంన్యాస కర్మయోగము లేకైక పురుషానుష్ఠేయములనియు (అనగా కర్మయోగమేకపురుషానుష్ఠేయము, కర్మసంన్యాసము మన్య పురుషానుష్ఠేయము కావనియు,) కర్మ, కర్మసంన్యాసముల కవ్యవహితవ్యవహితసాధనభావముచే నేకార్థోపయోగిత్వము, ఫల మేకమైనను కర్మ కర్మసంన్యాసములకు సాధ్య

**శాంకరభాష్యమ్‌:—**

తత్కృతకృత్యత్వేనాఽఽత్మవిదః ప్రయోజనాన్తరాభావాత్ ''తస్యకార్యం న విద్యతే' (గీ3-17) ఇతికర్తవ్యాన్తరాభావవచనాచ్చ। 'న కర్మణా మనారమ్భాత్' (గీ3-4) సంన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః' (గీ5-6) ఇత్యాదినా చాత్మజ్ఞానాంగత్వేన కర్మయోగస్య విధానాత్। 'యోగారూఢస్య 'తస్యైవ శమః కారణ ముచ్యతే' (గీ6-3) ఇత్యనేన చోత్పన్న సమ్యగ్దర్శనస్య కర్మయోగాభావవచనాత్।

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

(అట్టివానికి చేయదగిన కార్యమేమియులేదు) అని కర్తవ్యాంతరము లేదనిచెప్పెడి వాక్యము వలనను, ''న కర్మణా మనారమ్భాత్, సంన్యాసస్తు మహాబాహో దుఃఖ మాప్తు మయోగతః'' ఇత్యాదివాక్యములచే జిజ్ఞాసువున కాత్మజ్ఞానాంగముగ కర్మయోగముయొక్క విధానము వలన ''యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే'' అనుదానిచే సంప్రాప్తమైన సమ్యగ్దర్శనముకలవానికి కర్మయోగాభావవచనమువలనను,

సాధనభావముచే పూర్వాపరభావిత్వము, కర్మమనెడి సాధనముచే సాధ్యమగు జ్ఞానము ప్రాప్తించిన బ్రహ్మవేత్తకు సర్వకర్మసంన్యాసమే చేయదగినది. అనునవి మొదలగు విషయముల నిరూపణముకొరకయిదవ యధ్యాయము ప్రారంభించబడుచుండెను.

అందున మొట్టమొదట ''లోకసంగ్రహమేవాపి'' అనుదానిచే విద్వాంసునకు లోకహితముకొఱకు కర్మ కర్తవ్యమని కర్మయోగము నుపక్రమించి ''వర్త ఏవచ కర్మణి'' అనుదానిచే నుపక్రాంత కర్మయోగమున తన దృష్టాంతమును చెప్పి ''గుణాగుణేషు వర్తన్తే'' అనున్యాయముచే ననుష్ఠానము చేయదగినదని యనుష్ఠాన ప్రక్రియను సూచనచేసి, ''పూర్వైః పూర్వతరం కృతం'' అనుదానిచే శిష్టుల యభ్యనుజ్ఞను చూప, ఆ కర్మయోగమే ''కురు కర్మైవ తస్మాత్త్వం'' ''యోగ మాతిష్ఠోత్తిష్ఠ'' అనువాటిచే సంన్యాసముతో గూడ నుపదిష్టమైయుండ కర్మసంన్యాస కర్మయోగములు రెండును యేక కాలముననే కర్తవ్యములై ప్రాప్తించుచుండ నేత్రముల యున్మీలన నిమీలనములువలె పరస్పరవిరోధములన నేకపురుషునిచే నేక కాలమున ననుష్ఠించుట కశక్యమగుటవలన నారెంటిలో యేదోయొకటి కర్తవ్యమైయుండ నారెంటిలో నేది శ్రేష్ఠతరమో పురుషార్థసాధనమో దానిని తెలిసికొని యొకటియే చేయుటకు శక్యమైనదని ఆరెంటిలో శ్రేష్ఠమైనదానినినే తెలుసుకొను నిచ్ఛచే ''సంన్యాసం'' అని యర్జునుడు ప్రశ్నించుచుండెను.

ఇచట ''కర్మసంన్యాస కర్మయోగములలో నేదిశ్రేష్ఠతరమో దానిని నాకుజెప్పు'' మనెడి యర్జునుని ప్రశ్నము (1) విద్వత్కృతకర్మసంన్యాస కర్మయోగవిషయకమైనదా ? (2) అవిద్వత్కర్తృక కర్మసంన్యాస కర్మయోగవిషయకమైనదా ? (3) విద్వదవిద్వత్కర్తృక కర్మసంన్యాస కర్మయోగవిషయకమైనదా ? నిరంతరసమాధిసముత్పన్న సమ్యగ్జ్ఞానముచే ''నేను బ్రహ్మమునే'' అని నిష్క్రియమగు పరబ్రహ్మమునందే యాత్మభావమునుపొంది యెల్లప్పుడు పరమాత్మరూపముచేనుండు బ్రహ్మవేత్తకు జ్ఞానమునకు విరుద్ధమగు నాత్మాజ్ఞానము కారణముగాగల యనాత్మతాదాత్మ్యము సంభవించనందునవహంకారమే ముఖ్యకారణముగాగలకర్మయోగ మెట్లును సంభవించదు. తనకు విరోధియగు సమ్యగ్జ్ఞానము విజృంభించుచుండ సూర్యుడు విజృంభించుచుండ తమస్సునిల్వనివిధమున నజ్ఞానముసంభవించనందున విద్వాంసున కనాత్మ తాదాత్మ్యము సంభవించదు. అనాత్మతాదాత్మ్యము సంభవము కానితరి యనాత్మతాదాత్మ్యము కారణముగాగల యహంకారము సంభవము కాదు. కాన యహంకారమే ముఖ్యమగు నిబంధనముగాగల కర్మయోగము విద్వాంసునకు స్వప్నమునందైనను యూహించుటకు శక్యము కాదు. జాగ్రదవస్థను బొందినవానికి స్వప్నార్థసంబంధముండనటుల బ్రహ్మవిద్యయందు మెలుకవగాంచిన బ్రహ్మవేత్త కనాత్మతాదాత్మ్యము యొక్కయు, తత్కార్యముయొక్కయు సంబంధముసంభవించదు.

**శాంకరభాష్యమ్:—**

(8) "శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కల్బిషమ్" (గీ4-21) ఇతి చ శరీరస్థితి కారణాతిరిక్తస్య కర్మణో నివారణాత్ "నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్" (గీ5-8) ఇత్యనేనచ శరీరస్థితిమాత్రప్రయుక్తేష్వపి దర్శనశ్రవణాదికర్మ స్వాత్మయాథాత్మ్య విదః కరోమీతి ప్రత్యయస్య సమాహితచేతస్తయా సదాఽకర్తవ్యత్వోపదేశా దాత్మతత్త్వవిద స్సమ్యగ్దర్శనవిరుద్ధో మిథ్యాజ్ఞానహేతుకః కర్మయోగ స్స్వప్నేపి న సంభావయితుం శక్యశ్శ

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

(8) "శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్" అనుదానిచే సమ్యగ్జ్ఞానికి కర్మము లేనిచో శరీరస్థితికి హేతువగు కర్మముకూడ సంభవింపనందున నట్టివానికి శరీరస్థితి సంభవింపకపోవుటచే జీవన్ముక్తి సంభవింపదు. జీవన్ముక్తి లేనిచో నుపదేశము జేయువాడు సంభవింపకపోయెడిని. అట్లగుచో నుపదేశము లేమింజేసి జ్ఞానోదయ మెట్లు సంభవించునను శంకను తొలగించుచు శరీరస్థితికి కారణమగు కర్మముకంటె భిన్నమగు కర్మము సంభవించదని చెప్పుట వలనను, "నైవ కించి త్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్" అనుదానిచే శరీరస్థితిమాత్ర ప్రయుక్తమగు దర్శనశ్రవణాదికర్మలయం దాత్మజ్ఞాని సమాహితాంతఃకరణము కలవాడగుటచే నెల్లపుడు 'నేను జేయుచుంటిని' అను జ్ఞానము చేయదగినది కాదని యుపదేశించుట వలనను, ఆత్మజ్ఞానికి సమ్యగ్దర్శనవిరుద్ధము, మిథ్యాజ్ఞానము కారణముగాకల కర్మయోగము స్వప్నమునందైన తలచుటకు శక్యముకాదు. కాన, అనాత్మవిత్కర్తృక కర్మసంన్యాసకర్మయోగములకు నిశ్శ్రేయసకరత్వమును చెప్పుటయు, కర్త్రైకదేశము విషయముగాకలిగినట్టియు, పూర్వోక్తమగునాత్మవిత్కర్తృక సర్వకర్మసంన్యాసముకంటె విలక్షణము నగు యనాత్మవిత్కర్తృక కర్మసంన్యాసము, "ఆనృశంస్యం, క్షమా, సత్య, మహింసా, దమ, ఆర్జవమ్ । ప్రీతిః,

అట్టివాని కనాత్మతాదాత్మ్య తత్కార్యముల సంబంధమే యుండినచో కృతకృత్యతయే సంభవించకపోయెడిని. అట్టివాడు "బ్రహ్మైవాహమస్మీతికృతకృత్యోభవతి" (నేను బ్రహ్మము నే యని కృతకృత్యుడగుచున్నాడు.) "నైవాస్తికించిత్కర్తవ్యం" (అట్టివానికేదియు చేయదగినదిలేదు.) అను నిట్టి శ్రుతిస్మృతుల కప్రామాణ్య ప్రసక్తివలనను, ప్రత్యక్షవిరోధమువలనను, యెదుటనుండు వస్తువు శంకర, తొరటలు కలదని తెలిసినవాని కాస్థాణువుయందు తిరుగ చోరత్వబుద్ధి కలుగనటుల తనను బ్రహ్మస్వరూపముగ దెలిసికొని బ్రహ్మానందము ననుభవించునట్టియు, "సర్వము బ్రహ్మమే" అని తెలిసికొనిన బ్రహ్మవేత్త కనాత్మతాదాత్మ్యాపత్తియు, కర్తృత్వ బుద్ధియు, కామనయు, కర్మయందు బ్రవృత్తియు సంభవించదు. కాన ప్రథమమగు విద్వత్కర్తృక కర్మసంన్యాసకర్మయోగవిషయక ప్రశ్నము కానేరదు. విద్వత్త్వము, అవిద్వత్త్వము పరస్పరవిరుద్ధములగుటవలన నొకనికి సంభవింపవు కాన విద్వదవిద్వత్కర్తృకవిషయకమగు తృతీయప్రశ్నమున్నూడ సంభవించదు. పరిశేషన్యాయమున (అనగా మూడువిధములగు ప్రశ్నలలో నొందటిది, మూడవది కుదరనందున మిగిలిన ప్రశ్నమే సిద్ధించును. అను న్యాయమున) అవిద్వత్కర్తృక కర్మసంన్యాసకర్మయోగములు రెండును యొక కాలమునసే కర్తవ్యములయి యుండ నారెండును పరస్పరవిరుద్ధములగుటచే కూడాచేయుటకు వీలుకానందున నారెంటిలో నేదోయొకటి ప్రశస్తతరమగుచో ముముక్షు వాచరించుటకు శక్యమగునని కర్మసంన్యాస కర్మయోగములలో శ్రేష్ఠతరమైన దేదియని యర్జునుడు "సంన్యాసం కర్మణాం కృష్ణ" అని ప్రశ్నించుచుండెను.

శాంకరభాష్యమ్:—

యస్మాత్తస్మాదనాత్మవిత్కర్తృకయోరేవ సంన్యాసకర్మయోగయో ర్నిశ్శ్రేయసకరత్వవచనం, తదీయాచ్చ కర్మసంన్యాసా త్పూర్వోక్తాత్మవిత్కర్తృక సర్వకర్మసంన్యాసవిలక్షణా త్సత్యేవ కర్తృత్వవిజ్ఞానే కర్మైకదేశవిషయా ద్యమనియమాదిసహితత్వేన చ దురనుష్ఠేయత్వా త్సుకరత్వేన చ కర్మయోగస్య విశిష్టత్వాభిధాన మిత్యేవం ప్రతివచనవాక్యార్థనిరూపణేనాపి పూర్వోక్తః ప్రష్టు రభిప్రాయో నిశ్చీయత ఇతి స్థితమ్ ।

శాంకరభాష్యతత్త్వబోధిని.—

ప్రసాదో, మాధుర్య, మక్రోధశ్చ, యమా దశ॥" అను స్మృత్యుక్తమగు పదియమముల తోను, "దాన, మిజ్యా, తపో, ధ్యానం, స్వాధ్యాయో పస్థనిగ్రహౌ । వ్రతోపవాసౌ, మౌనంచ, స్నానంచ, నియమా దశ॥" అను స్మృత్యుక్తమగు పదినియమములతోకూడినదగు టచే ననుష్ఠించుటకు శక్యముకాదు. కాన యట్టి యనాత్మవిత్కర్తృక కర్మసంన్యాసముకంటె యనాత్మవిత్తునకు కర్మయోగము సుకరము. అందుచే కర్మయోగమున కుత్కృష్టత్వము చెప్పఁబడియున్న దని పరస్పరవిరుద్ధములు, సముచ్చిత్య అనుష్ఠానముచేయుట కశక్యములు అగు సంన్యాసకర్మయోగములలో నేదో యొకటి కర్తవ్యమైయుండ ప్రశస్తతర మనుష్ఠేయ మగు టవలన అట్టి ప్రశస్యతరము పూర్వగ్రంథముచే నిర్ధారణ చేయనందున తన్నిర్ధారణచేయు నిచ్ఛచే ప్రశ్నము చేయవచ్చునని ప్రశ్న ప్రతివచనవాక్యార్థపర్యాలోచనచే ప్రశ్నించువాని యభిప్రాయము అనగా అనాత్మవిత్కర్తృక కర్మసంన్యాసకర్మయోగములలో కర్మయోగ ముత్కృష్టమా? యని ప్రశస్యతరబుభుత్సచే ప్రశ్న ముపపన్నమే యని సిద్ధము.

సదానందరూపుడగుటవలన శ్రీకృష్ణుండు పరమాత్మయే. అతని సంబుద్ధి "హేశ్రీకృష్ణ" అని ఓశ్రీకృష్ణ! పూర్వోక్తవాక్యములచే విధ్యుక్తము, అవశ్యమాచరించదగిన కర్మల పరిత్యాగమును జెప్పుచుంటివి. తిరిగి "కురు కర్మైవ తస్మాత్త్వం" "యోగమాతిష్ఠ" అను వాక్యములచే కర్మయోగమును దెల్పుచుంటివి. క్రియ చేతను, అధికారముచేతను, సాధనసంపత్తిచేతను, జీవరూపముచేతను పరస్పరవిరుద్ధములు కర్మసంన్యాస కర్మయోగములు. అట్టికర్మసంన్యాస కర్మయోగము లేక కాలమున నొకడుజేయుట కశక్యములు. అట్టివాని కర్తవ్యములుగ నాకొఱకు విధించుచుంటివి. నాకీవిషయమున కర్మయోగము కర్తవ్యమా? కర్మసంన్యాసమా కర్తవ్యమా? అని సంశయము. ఆరెండును యాశ్రమాదిభేదముచే విరుద్ధములగుటవలన నొకనిచే నేక కాలమున నాచరించుటకు వీలు కానందున నారెంటిలో నేది శ్రేయస్సాధనమో అదియే ఆచరించదగినది. రెండును యాచరించదగినవి కావు. కాన నారెంటిలో మోక్షసాధనముగ నేది ప్రశస్తతరమో యట్టి యొకదానిని నీవు బాగుగ నిశ్చయించి నాకొఱకుపదేశింపుము. ॥౧॥

భాష్యోత్కర్ష దీపిక:— "నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః । శారీరం కేవలం కర్మ కుర్వ న్నాప్నోతి కిల్బిషమ్" "యదృచ్ఛాలాభసంతుష్టః" అనునవిమొదలగు గీతావాక్యములచే సర్వకర్మసంన్యాసమును, "ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత!" అనుదానిచే కర్మయోగమును యర్జునుండు విని యారెండును స్థితిగతులవలె పరస్పరవిరుద్ధములగుటచే నొకనిచే నొకపర్యాయ మనుష్ఠించుటకు శక్యము కానందున కాలభేదముచే విధింపఁబడనందున సర్వాత్త యారెంటిలో నేదో యొకటి చేయదగియుండ నపరశుద్ధమైన యంతఃకరణగల యర్జునకు సంన్యాసకర్మయోగములలో యేది శ్రేయస్కరమో దానిని తెలిసికొనునిచ్ఛచే యర్జునుఁడు "సంన్యాసం కర్మణాం కృష్ణ!" అని ప్రశ్నించుచుండెను.

శాంకరభాష్యమ్—

(౨) "జ్యాయసీ చే త్కర్మణ స్తే" (గీ.3-1) ఇత్యత్ర జ్ఞానకర్మణో స్సహాసంభవేన 'యచ్ఛ్రేయ ఏతయో రేకం త న్మే బ్రూహి" (గీ.-5-1) ఇత్యేవం పృష్టోఽర్జునేన భగవా న్సాఙ్ఖ్యానాం సంన్యాసినాం జ్ఞానయోగేన నిష్ఠా, పునః కర్మయోగేన యోగినాం నిష్ఠా ప్రోక్తేతి నిర్ణయం చకార। "న చ సంన్యసనా దేవ కేవలా త్సిద్ధిం సమధిగచ్ఛతి" (గీ.3-4) ఇతి వచనా జ్జ్ఞానసహితస్య సిద్ధసాధనత్వ మిష్టం కర్మయోగస్య చ విధానాత్।

శాంకరభాష్యతత్త్వబోధినీ—

(౨) విచారింప "జ్యాయసీ చే త్కర్మణ స్తే" అని తృతీయాధ్యాయమునందే జ్ఞానకర్మములు ఏకపురుషానుష్ఠేయములు కానందున "య చ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితం" ఈ జ్ఞానకర్మములలో నేదియుత్కృష్టమో దానిని చెప్పుమని యర్జునునిచే ప్రశ్నింపబడ శ్రీకృష్ణపరమాత్మ 'జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినాం" సాంఖ్యులగు సంన్యాసులకు జ్ఞానయోగముచే నిష్ఠయు, యోగులకు కర్మయోగముచే నిష్ఠయు చెప్పఁబడెనని నిర్ణయము చేసెను. కాన సాంఖ్యయోగములు భిన్నపురుషానుష్ఠేయములుగ తృతీయాధ్యాయమునందు నిర్ణయింపఁబడుటవలన తిరుగ నిచట నావిషయము ప్రశ్నింపదగినది కాదు. మరియు 'నచ సంన్యసనాదేవ కేవలా త్సిద్ధిం సమధిగచ్ఛతి" అని జ్ఞానసహితమగు సంన్యాసమునకే మోక్షసాధనత్వము, జ్ఞానరహితమగు సంన్యాసమునకు మోక్షసాధనత్వము లేదని భగవంతుని యభిప్రాయము 'న చ సంన్యసనా దేవ" అను స్థలమునందుకల ఏవకారముచే నిశ్చయింపబడుచున్నది "ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠ" అని కర్మయోగముయొక్క విధానమువలన కర్మయోగమునకుగూడ మోక్షసాధనత్వ మిష్టము. అని నిర్ణయించుటవలన నిచట కర్మసంన్యాస కర్మయోగములవిషయమై ప్రశ్నమే సంభవింపదు. అట్లగుచో నేయభిప్రాయముచే నిట ప్రశ్నము సంభవించు ననెదవా ?

అనుష్ఠానవిశేషరూపములగు శాస్త్రీయమైన కర్మల పరిత్యాగమును "ఏత మేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి" అను శ్రుతిమూలకమగు గీతావాక్యములచే దెలుపుచుంటివి. తిరిగి యట్టిశాస్త్రీయమగు కర్మల యనుష్ఠానమును "తమేతం వేదానువచనేన' అను శ్రుతిమూలకము అగు గీతావాక్యములచే బోధించుచుంటివి. 'యస్త్వాత్మరతిరేవ స్యా దాత్మతృప్తశ్చ మానవః' 'సర్వం కర్మాఖిలం పార్థ।" అనునవి మొదలగు వాక్యములచే జ్ఞానికి కర్మసంన్యాసమును జెప్పుచుంటివి. "జ్ఞానాసినా సంశయం ఛిత్త్వా యోగ మాతిష్ఠ" (జ్ఞానమనెడి ఖడ్గముచే సంశయమును ఛేదించి కర్మయోగము నాచరించుము.) అని తిరుగ కర్మయోగమును బోధించుచుంటివి.) విరుద్ధస్వరూపములగుటవలన కర్మసంన్యాసము, కర్మయోగమొకని కొక కాలమున సంభవింపవు. కాన నీరెంటిలో నేదోయొకటియే యాచరింపదగియుండ నాకేది సునిశ్చితమో యట్టిదానిని బోధించుము. ॥౧॥

శ్రీధరీయము:— "నివార్యసంశయంజిష్ణోః కర్మసంన్యాసయోగయోః। జితేన్ద్రియస్య చ యతేః పంచమే ముక్తి రబ్రవీత్" కర్మ, కర్మసంన్యాసయోగములవిషయమై యర్జునునకు కలిగినసంశయము నీపంచమాధ్యాయమున నివారించి జితేంద్రియుఁడగు యతికి ముక్తిని శ్రీకృష్ణపరమాత్మ పంచమాధ్యాయమునందు జెప్పెను.

**శాంకరభాష్యమ్:—**

(10) జ్ఞానరహిత స్సంన్యాస శ్శ్రేయా న్కింవా కర్మయోగ శ్శ్రేయా నిత్యేతయో ర్విశేషబుభుత్సయా- సంన్యాసం పరిత్యాగం కర్మణాం శాస్త్రీయాణా మనుష్ఠేయవిశేషాణాం శంససి కథయసీత్యేతత్ । పునర్యోగం చ తేషామేవానుష్ఠాన మవశ్యకర్తవ్యత్వం శంస స్యతో మే కతర చ్ఛ్రేయ ఇతి సంశయః కిం కర్మానుష్ఠానం శ్రేయః? కింవా తద్ధానం? ఇతి ప్రశస్య

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

(10) జ్ఞానరహితమగు సంన్యాసము శ్రేయస్కరమా? లేక కర్మయోగము శ్రేయస్కరమా? అని అవిద్వత్కర్తృక కర్మసంన్యాసకర్మయోగములలో విశేషమును తెలసికొనునిచ్ఛచే ప్రశ్నము సంభవించును ఓ శ్రీకృష్ణపరమాత్మ! అనుష్ఠానవిశేషములగు శాస్త్రీయ కర్మముల పరిత్యాగమును తెలుపుచుంటివి. తిరిగి యా శాస్త్రీయములగు కర్మముల యవశ్య కర్తవ్యతను తెలుపుచుంటివి. కాన నీరెంటిలో యేది శ్రేయస్సాధనమని సంశయము. కర్మా

అజ్ఞానసంభూతమగు సంశయమును జ్ఞానమనెడి ఖడ్గముచే ఛేదించి కర్మయోగమునాచరించుమని యింతకు పూర్వమునందు జెప్పఁబడెను. అందున పూర్వాపరవిరోధమును దలచినవాడై యర్జునుఁడు "సంన్యాసం కర్మణాం కృష్ణ" అని ప్రశ్నించుచుండెను. ॥౧॥

నీలకంఠీయము:— తృతీయాధ్యాయమున "లోకేఽస్మిన్ద్వివిధానిష్ఠా" అనువాక్యముచే విభిన్నాధికారికములగు జ్ఞాననిష్ఠ, కర్మనిష్ఠలను ప్రస్తుతముగజేసుకొని "నకర్మణామనారంభాన్నైష్కర్మ్యంపురుషోఽశ్నుతే" అను మొదలగు వాక్యములచే కర్మనిష్ఠను జ్ఞాననిష్ఠాంగముగ ననేక నిర్బంధనములచే ననుష్ఠేయమని చెప్పెను. మఱియు "కర్మణ్యేవాధికారస్తే" అనునది మొదలగు వాక్యములచే కర్మయందే నీకధికారము కలదనియు చెప్పెను. చతుర్థాధ్యాయమందన్నో జ్ఞానముచే కర్తృత్వము బాధిత మగుటవలన జ్ఞాననిష్ఠులచే నాచరించఁబడిన కర్మము అకృతమే (ఆచరింపఁబడనిదియే) యగును. కాన నట్టివారలు వృథాచేష్టవలె కర్మను చేయవలెను. లేక సంన్యాసమునైన యాచరించవలెనని యనాస్థచే జెప్పెను. ఈపంచమ షష్ఠాధ్యాయములయందు జ్ఞానార్థియగు యజ్ఞానివైరాగ్యోత్పత్తికిబూర్వమునందు కర్మనే యాచరించవలయును. వైరాగ్యము కలిగినపిదప చూడఁడు విక్షేపముల నివృత్తికొఱకు కర్మసంన్యాసమును స్వీకరించి జ్ఞానోత్పత్తినిమిత్తము యోగమనుష్ఠేయమని చెప్పుచుండెను. అందు చతుర్థాధ్యాయమునందు "త్యక్తసర్వపరిగ్రహః" అనుదానిచే సంన్యాసము, "యోగమాతిష్ఠ" అనుదానిచే కర్మయోగము యొక నన్నుగూర్చియే విహితములు. ఈ రెండును స్థితిగతులవలె పరస్పరవిరుద్ధములగుటచే యొకపర్యాయమే నాచే ననుష్ఠించుటకు శక్యములుకావు. అని తలచి యర్జునుఁడు "సంన్యాసం కర్మణాం కృష్ణ" అని ప్రశ్నించెను.

"హేకృష్ణ!" అను సంబుద్ధిచే భక్తుల పాపములను నశింపజేయువాడని సూచితమయ్యెను. ఓ శ్రీకృష్ణ! జ్ఞానమునుకోరెడి నాకొరకు సంన్యాసము, కర్మ యోగమనెడి పరస్పరవిరుద్ధములగు నీరెంటిని యెట్లు జెప్పుచుంటివి. "పునః" అని గీతయందు జెప్పుటచే పూర్వమునందుకూడ వేదకర్తవగు నీచే యీ రెండును విహితములనియే తోచుచున్నది. అట్లే "ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి" (ఈయాత్మలోకమునే సంన్యాసులు కోరుచు సంన్యసించుచుండిరి) "సంసారమేవ నిస్సారం దృష్ట్వా సారదిదృక్షయా! ప్రవ్రజన్త్యకృతోద్వాహాః పరం వైరాగ్య మాస్థితాః॥" (సంసారమును నిస్సారముగా దెలిసికొని సారమును దెలిసికొనునిచ్ఛచే పరమవైరాగ్యము నాశ్రయించి స్త్రీపరిగ్రహము చేయక సంన్యాసమును స్వీకరించుచుండిరి.) ఈసంన్యా

శాంకరభాష్యమ్:—

తరం చానుష్ఠేయ మతశ్చ యచ్ఛ్రేయః ప్రశస్యతర ం తయోః కర్మసంన్యాసకర్మానుష్ఠానయో ర్యదనుష్ఠానా చ్ఛ్రేయోవాప్తి ర్మమ స్యాదితి మన్యసే తదేక మన్యతర త్సహైకపురుషాను ష్ఠేయత్వాసంభవా న్మే బ్రూహి సునిశ్చిత మభిప్రేతం తవేతి। ॥౧॥

శాంకరభాష్యతత్త్వబోధిః—

నుష్ఠానము శ్రేయస్సాధనమా? కర్మపరిత్యాగము శ్రేయస్సాధనమా? అని (ఈరెంటిలో) ప్రశస్యతర మనుష్ఠేయము. కాన నీకర్మసంన్యాస కర్మయోగములలో యేది శ్రేయస్సాధనమో, ప్రశస్యతరమో, యేది యనుష్ఠించుటచే నాకు శ్రేయఃప్రాప్తి కలుగుననితలచెదవో కర్మసంన్యాసకర్మానుష్ఠానము లేకకాలమున నేకపురుషునిచే ననుష్ఠించుటకు శక్యముకానందున నారెంటిలో నీకభిప్రేతమగు నదేదో యొకదానిని నాకు చెప్పుము. ॥౧॥

సమునే శ్రుతిస్మృతులు దెలుపుచున్నవి. అట్లె "తమేతం వేదానువచనేన బ్రాహ్మణా వివిదిషన్తి! యజ్ఞేన దానేన తపసా౽నాశకేన" బ్రాహ్మణులు వేదానువచనము, (యజ్ఞము, దానము, తపస్సు, నిరశనవ్రతములచే నీయాత్మనే దెలిసికొనుట కిచ్ఛగించుచుండిరి.) "మహాయజ్ఞైశ్చ యజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః" పంచమహాయజ్ఞములచేతను, సోమయాగము మొదలగు మహాయజ్ఞములచేతను శరీరము బ్రహ్మజ్ఞానయోగ్యమై చేయఁబడును.) అనిశ్రుతిస్మృతులచే కర్మయు జెప్పబడెను. కానకర్మ కర్మసంన్యాసములురెండునుశ్రుతి స్మృతివిహితములగుటచే ప్రశస్తములు. అట్టికర్మ కర్మసంన్యాసములలోయేదిప్రశస్తతరమో అట్టిదానిని సునిశ్చితముగ జెప్పుము॥౧॥

గీతారహస్యవిమర్శనము:— "చతుర్థాధ్యాయమునందలి సిద్ధాంతముమీద సంన్యాసమార్గీయులు చేయదగిన శంక నర్జునిచే నడిగించి దానికి స్పష్టముగ సమాధానమును భగవంతుఁడీయధ్యాయమునందు చెప్పుచున్నాడు. అని గీతారహస్యకారులు తమగీతారహస్యమునందు పంచమాధ్యాయ ప్రథమశ్లోకవ్యాఖ్యానప్రస్తావమున మొదటనే వ్రాసియుండిరి. యిచట కొంచెము విచారించెదము. గీతారహస్యకారుల దృష్టిలో చతుర్థాధ్యాయమునందు జ్ఞానికి కూడ కర్మయోగమే జెప్పబడెననియూహ. ఇట్లు గీతారహస్యకారులు భ్రమజెందుటకు "తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః! ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత!" అను చతుర్థాధ్యాయాంతిమశ్లోకమే కారణము. అందున యేమికలదనెదరా! జ్ఞానాసిచే సంశయమును నశింపజేసుకొని కర్మయోగము నాచరించుము. యుద్ధముకొఱకు లెమ్మనుటచే జ్ఞానికిగూడ కర్మయోగమే చెప్పఁబడెనని గీతారహస్యకారులఅయభిప్రాయము.

గీతారహస్యకారులు చతుర్థాధ్యాయోపక్రమోపసంహారములను జక్కగా గుర్తించిన నిట్లు వ్రాయరు. ఉపక్రమమున "ఇమం వివస్వతే యోగం ప్రోక్తవా నహ మవ్యయమ్! వివస్వాన్మనవే ప్రాహమను రిక్ష్వాకవేబ్రవీత్" అని కర్మయోగము నుపక్రమించెను. ఆ కర్మయోగమునే చతుర్థాధ్యాయాంతిమ శ్లోకమున "ఆతిష్ఠోత్తిష్ఠ భారత!" అనువాక్యముచే నుపసంహరించెను. ఇందు గీతాకారుల దేమిపొరపాటు ఏమియు పొరపాటులేదు. ప్రథమమున నుపక్రాంతవిషయమును యంతిమభాగమున నుపసంహరించుట యుపన్యాసకునికి న్యాయమే. కాని యీ యుపన్యాసమువలన దేలినదేమి? కర్మయోగమే. అట్టికర్మయోగమునే జ్ఞానికూడ నవలంబించవలయునని చెప్పు గీతారహస్యకారుల దేమిపొరపాటు? అంతయు పొరపాటే? అదియెట్లనిన? గీతాకారులుపక్రమించిన కర్మయోగమును కొంతవరకుపన్యసించి మధ్యమార్గమున "నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతికిల్బిషమ్" అనుస్థలములయందు జ్ఞాని సర్వకర్మలను విడువవలెనని చెప్పిన

విషయమును గీతారహస్యకారులు కప్పిపుచ్చుటయే వారిపొరపాటు మరియు "శ్రేయాన్ద్రవ్యమయాద్యజ్ఞా జ్జ్ఞానయజ్ఞః పరంతప । సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే" అను నాల్గవయధ్యాయమునందు గల ముప్పదిమూడవశ్లోకము వీరిదృష్టిని ప్రవేశింపకయే అట్లు వ్రాసిరి. జ్ఞానికూడ తప్పక కర్మయోగమునే యనుసరించుట భగవన్మతమగుచో శ్రీకృష్ణపరమాత్మ "నిరాశీః" "సర్వం కర్మాఖిలం పార్థ! జ్ఞానే పరిసమాప్యతే।" జ్ఞాననిష్ఠునకు తురీయాశ్రమము నుపపాదించి 'అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః। సర్వంజ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి, యథైధాంసి" ఇత్యాదికముచేత జ్ఞానమును నుతించుట యెందులకు ? జ్ఞానమువలన నజ్ఞానమతొలగి తత్కార్యములగు నహంకారమమకారకర్తృత్వాదులు తొలగుననియేకదా! జ్ఞానమువలన నహంకారాదులు తొలగ నహంకారాదులవలన కలిగెడిప్రవృత్తి లేమింజేసి జ్ఞాని కర్మలనెటులాచరించును? ఆచరించడు. కనుకనే జ్ఞానికి కర్మలు సంధములు కావనియే శ్రీకృష్ణపరమాత్మ "యోగసంన్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్నసంశయం। ఆత్మవంతం న కర్మాణి నిబధ్నన్తి ధనంజయ!" (గీ-4-41) శ్లోకమునందు జ్ఞానికి సంన్యాసమునే జెప్పెను. అట్లగుచో "తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః। ఛిత్త్వైనం సంశయం యోగ మాతిష్ఠోత్తిష్ఠ భారత!" అని చతుర్థాధ్యాయాంతిమశ్లోకమున జ్ఞానికి కర్మయోగ ముపదేశించుట యెట్లు పొసగును ? చెప్పెదవినుము. "ఇమం వివస్వతే యోగం" అనునది మొదలుకొని కొంతవరకు కర్మయోగమును చతుర్థాధ్యాయమునందు మొదట యుపక్రమించెను. ఆ కర్మయోగోపక్రమము క్షత్రియపరంపరయందే యచట జూపఁబడెను. ఏందుకట్లుజూపబడెననెదవా ? క్షత్రియులకు సంన్యాసమునం దధికారము లేమిఁజేసి. కనుకనే యా యధ్యాయాంతిమమునందుగూడ క్షత్రియుడగు యర్జునునిగూర్చియే జ్ఞానమనెడి ఖడ్గముచే నజ్ఞానసంభూతమగు సంశయమును ఛేదించి కర్మయోగము నాచరించుమని బోధించెను. కనుకనే "అతిష్ఠ, ఉత్తిష్ఠ" అని మధ్యమపురుషప్రయోగముచేసెను. ఇట్లు చెప్పుటచే నర్జునునకే సంశయముకలుగవచ్చును. ఏమనిన ? ప్రథమమున అంతిమమున కర్మయోగమును చెప్పెను. మధ్యమమున జ్ఞానికి సంన్యాసమును జెప్పెను. కాన కర్మయోగముకర్తవ్యమా ? సంన్యాసము కర్తవ్యమా ? అందున జ్ఞాని తత్త్వజ్ఞానప్రభావముచే కర్తృత్వాదులు తొలగ కర్మయందు బ్రవర్తించడు. ఇక యజ్ఞానియే ప్రవర్తించును. అట్టి యజ్ఞానియగు ముముక్షువు కర్మయోగము నాచరించుట శ్రేయస్కరమా ? లేక సంన్యాసము నవలంబించుట శ్రేయస్కరమా యని యర్జుననికే స్వతః యీ సంశయము జనించి ప్రశ్నించుచుండ సంన్యాసిమార్గీయు లీసంశయమును యర్జునునిచే యడిగించిరని గీతారహస్యకారులు వ్రాయుట యెంత సాహసమో పాఠకులే గ్రహింతురుగాక.

మఱియు పంచమాధ్యాయప్రథమశ్లోకవ్యాఖ్యానసమయమందే గీతారహస్యకారులు "జ్ఞానమనునది సర్వకర్మలకును ఫలముగాన (౪-౩౩) జ్ఞానముచేతనే సర్వకర్మలును భస్మమగుటయు (౪-౩౭) ద్రవ్యమయమగు యజ్ఞముకంటె జ్ఞానయజ్ఞమే శ్రేష్ఠమగుటయు (౪-౩౩) సత్యమయినచో రెండవయధ్యాయమునందు 'ధర్మ్యమగు యుద్ధమును జేయుటయే క్షత్రియునకు శ్రేయస్కరము' అని చెప్పెను. (౨-౩౪) కాన నీవు కర్మయోగము నాశ్రయించి యుద్ధమునకు లెమ్ము (౪-౪౨) అని నాల్గవ యధ్యాయమున నేలయుపసంహారముచేసెను." అని నుడివియుండిరి. ఇట్టిసంశయము సంన్యాసమార్గీయుల కెన్నడును కలుగదు. ఎందువలననిన? సంన్యాసమార్గీయులు భగవద్గీతోపక్రమమగు "అశోచ్యా నన్వశోచస్త్వం.........నానుశోచంతి పండితాః" అనుశ్లోకమును ఉపసంహారశ్లోకమగు "సర్వధర్మాన్పరిత్యజ్య.........మా శుచ" అను శ్లోకమును జక్కగబరిశీలించినవారే. అట్టి యుపక్రమోపసంహారములను జక్కగబరిశీలించినసంన్యాసమార్గీయులు శ్రీభగవద్గీత జ్ఞానైకప్రధానమని యెరుగరా? యెరిగియేయుందురు. అట్లు భగవద్గీత జ్ఞానప్రధానమైనచో నట్టిజ్ఞానము కలుగుటకు మధ్యన శ్రీకృష్ణపర

మాత్రము కర్మయోగము నుపక్రమించెనని యేల నిర్ణయించరు? నిర్ధారణజేసిన సంన్యాసపక్షీయులకేల పైనుడివిన సందేహము కలుగును! కలుగదనియే యొప్పుకొనవలయును. మరిసందేహ మెవరలకు జనించెననిదవా! గీతారహస్యకారులకే యని చెప్పకతప్పదు. ఏలయన-వీరు కర్మజ్ఞానసముచ్చయపక్షీయులనుకొనువారు. వీరి కర్మజ్ఞానసముచ్చయ మెట్టులజూచినను సంభవించదని యిదివరకే మేము జెప్పియుంటిమి. కర్మపక్షముగ జూపిన వీరి యుపక్రమోప సంహారములు కుదరవని యిదివరకే మా శ్రీభగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని యుపోద్ఘాతమునందే జూపియుంటిమి.

పైవిధమున గలిగిన గీతారహస్యకారుల ప్రశ్నకు గీత యిట్లుత్తరమిచ్చుచున్నది. 'సర్వసంశయములు నశించి, మోక్షము గలుగుటకు జ్ఞానము యొక్కయు, మోక్షమునిమిత్తము గాకపోయినను నెప్పుడు వదలుటకు సాధ్యము గాకపోవుటచే లోకసంగ్రహము కొరకు కర్మలయొక్కయు, సముచ్చయము నెల్లప్పుడు నపేక్షింప బడుచునే యున్నది. (౪-౪౧)' అనియు గూడ గీతారహస్యకారులనుడివిరి. ఇచటగూడ కొంచెము విచారింతము. పైవాక్యములలో కర్మములు మోక్షమునిమిత్తము గావని గీతారహస్యకారులే యొప్పుకొనిరి. ఇక కర్మలు జ్ఞానము నిమిత్తమనిన జ్ఞానము కలిగిన యారూఢునకు కదియు పొసగదు. ఇట్లు ఎట్లుజూచినను యారూఢునకు కర్మలు పొసగకపోయినను మాటిమాటికి కర్మజ్ఞానసముచ్చయ మనుచుండిరి. ఈకర్మజ్ఞానసముచ్చయ మెట్టిది! లోకమున నెరెంటికి సముచ్చయము చెప్పెదరో అరెండు నేక కార్యమునకు కారణములని యర్థము. ఆరూఢునిచే చేయబడిన కర్మలు జ్ఞానసహభావులైనను జ్ఞానమువలనకలిగెడి మోక్షమునకు కారణముకావని గీతారహస్యకారులే యొప్పుకొని యుండ సముచ్చయ మెట్లుపొసగునో వారికేగోచరము. కర్మలు యెప్పుడువదలుటకు సాధ్యము కాకపోవుటచే లోకసంగ్రహముకొరకు కర్మలయొక్కయు సముచ్చయ మెల్లపుడు నపేక్షింపబడుచునేయున్నది. (౪-౪౧) అనుచుండిరి. వీరియభిప్రాయము కర్మలనగ శ్రౌతస్మార్తకర్మలా! లేక చలనాత్మకముగూడనా! శ్రౌతస్మార్తకర్మలేయన్నచో యవి బ్రహ్మరక్షస్సులా? కావు. యిపుడు యెంతమంది స్నానసంధ్యావందనాదిక కర్మలను వదలుటలేదు.? ఈకర్మలను వదలినవారల నాకర్మల జేయుమని యెవరుభాధించుచుండిరి. చలనాత్మకముగూడ కర్మయే. యదివదలుటకు శక్యముకాదందురా? "శారీరం కేవలం కర్మకుర్వన్నాప్నోతి కిల్బిషమ్!" అనువాక్యముచే భిక్షాటనాదికర్మలు యతికర్తవ్యనుజ్ఞాతములైయుండ వాటిని మానమని యెవరుచెప్పిరి? ఈచలనాదికర్మయూ లోకసంగ్రహమునిమిత్తము చేయదగినది. గీతలయందు బోధించబడుకర్మలు శ్రౌతస్మార్తకర్మలేగాని చలనాత్మకములగు ప్రతికర్మయు కాదు. చలనాత్మకకర్మస్వభావసిద్ధమే. మరియు "సంన్యాసం కర్మణాంకృష్ణ పునర్యోగంచ శంససి? యచ్ఛ్రేయ ఏతయో రేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥" అనువాక్యముచే యర్జునుడు కర్మ కర్మసంన్యాసములలో యేది మోక్షదాయకమై శ్రేష్ఠముగునో దానిని జెప్పుమని ప్రశ్నించెను. యీప్రశ్నకర్థమేమి? మోక్షమునిచ్చుట యందు కర్మశ్రేష్ఠమా! లేక కర్మసంన్యాసము శ్రేష్ఠమా! అనియేకదా! జ్ఞానికి కర్మమోక్షదాయకము కాదని చెప్పు గీతారహస్యకారులీప్రశ్న మెవరివిషయమునెదరు? జ్ఞానివిషయమన్నచో ఆట్టివానికి మోక్షమును గూర్చి కర్మ కారణముకాదనిచెప్పుచు మోక్షమునుగూర్చి కర్మశ్రేష్ఠకారణమా? సంన్యాసము శ్రేష్ఠకారణమా? యనుప్రశ్న మెట్లుపొసగును? యెట్టుజూచిన పొసగనేరదు. ఇక యజ్ఞానివిషయమేయని యొప్పుకొనవలయును. అట్లగుచో యజ్ఞానికి సాధనసంపత్తిలేక కేవల ప్రేషమాత్రోచ్చారణమాత్రమగు సంన్యాసముకంటె శ్రద్ధచే నాచరించు కర్మయోగము శ్రేష్ఠమా! లేక యట్టిసంన్యాసము శ్రేష్ఠమా? యనియే యర్జునుని ప్రశ్న మనక తప్పదు. ఇందుకు దగునట్లు శ్రీకృష్ణపరమాత్మయు ఆట్టియజ్ఞానివిషయముగనే కర్మ కర్మసంన్యాసములు రెండును మోక్షదాయకములైనను యజ్ఞుడు సాధనచతుష్టయసంపత్తి లేమిం జేసి యారూఢపతితు డగునని యోచించి సంన్యాసముకంటె కర్మయోగమే శ్రేష్ఠమని సమాధానము జెప్పెను. కాన గీతారహస్యకారుల యభిప్రాయము యెట్టుజూచినను సరిపడదని గ్రహింతురుగాక. ॥౧॥

శ్రీ భగవానువాచ:—

గీ॥ సంన్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరా వుభౌ ।
తయోస్తు కర్మసంన్యాసా త్కర్మయోగో విశిష్యతే ॥ ॥౨॥

పదవిభాగము:— శ్రీభగవాన్–ఉవాచ– సంన్యాసః– కర్మయోగః– చ– నిశ్శ్రేయసకరౌ– ఉభౌ– తయోః– తు– కర్మసంన్యాసాత్– కర్మయోగః– విశిష్యతే॥ ॥౨॥

ప్రతిపదార్థము:— శ్రీభగవాన్=శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=సమాధానము చెప్పెను. సంన్యాసః=సంన్యాసము; కర్మయోగశ్చ=కర్మయోగము అను; ఉభౌ=రెండును; నిశ్శ్రేయసకరౌ=మోక్షమును చేయును. వి. తయోస్తు=ఆకర్మసంన్యాస కర్మయోగములలో; కర్మసంన్యాసాత్=జ్ఞానరహితమగు కర్మసంన్యాసముకంటె; కర్మయోగః=కర్మయోగము; విశిష్యతే=ఉత్కృష్టమైనది. ॥౨॥

—• ౫వ అధ్యాయము— ౨వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— పూర్వశ్లోకోపపాదితమైన యర్జునప్రశ్నమునకు సమాధానమును శ్రీకృష్ణపరమాత్మ యీ శ్లోకమున జెప్పుచుండెను— సంన్యాసము, కర్మయోగము నీ రెండును జ్ఞానోత్పత్తి హేతువు లగుటచే మోక్షోపయోగులు. అందునను యనధికారికృతమగు సంన్యాసముకంటె కర్మయోగము అధికారసంపాదకమగుటచే శ్రేష్ఠమైనది.

శంకరానందీయము:— కర్మసంన్యాసము, కర్మయోగము నీరెంటిని యొకే కాలమున యొకే పురుషుడు యనుష్ఠించుట శక్యము కానందున నారెంటిలో నొక దానిని యుత్కృష్టమని నిర్ణయించుటకై "దేశ కాల వయోవస్థాబుద్ధి శక్త్యనురూపతః। ధర్మోపదేశో భైషజ్యం కర్తవ్యం ధర్మపారగైః" (దేశము, కాలము, వయస్సు, బుద్ధి, శక్తి వీటిననుసరించి రోగచికిత్సను, ధర్మోపదేశము జెప్పదగును) అను న్యాయానుసారము అధికార్యనురూపముగ శ్రీకృష్ణపరమాత్మ పైయర్జునప్రశ్నమునకు ప్రత్యుత్తరమును జెప్పుచున్నాడు— "బ్రహ్మణి నితరాం అసః సంన్యాసః" చిత్తమును బాహ్యవిషయములయందు ప్రవణము గాకుండ జేసి బ్రహ్మస్వరూపముగ నుండుటను నిర్వికల్పకసమాధి యనబడును. ప్రత్యగ్దృష్టిచే ననాత్మప్రత్యయనిరాసము సవికల్పకసమాధియనబడును, ఈ రెండును ముఖ్యసంన్యాసములు. ఇట్టి సమాధిద్వయమునకును, శ్రవణమననములకును నంగభూతము, వీటికి ప్రతికూలములగుకర్మలను పరిత్యజించుటరూపమునగు సంన్యాసము మూడవది ఇట్లు సంన్యాసశబ్దార్థము మూడువిధములుగ నిర్వచింపబడెను. ఇట ప్రధానములగు సంన్యాసములు రెండు నవివక్షితములు. ఇక నేమనిన నిట యంగభూతమగు సర్వకర్మసంన్యాసము వివక్షితము. అవిద్వత్కృతమగు సర్వకర్మసంన్యాసమే (వివిదిషాసంన్యాసమే) శ్రవణాదిజన్యజ్ఞానద్వారమున మోక్షహేతువగును. ఇట్లే యవిద్వత్కృతమగు కర్మయోగము స్వానుష్ఠానప్రాప్తచిత్తశుద్ధిజన్యజ్ఞానద్వారమున మోక్షహేతువగును. ఈ విధముగ సంన్యాసము, కర్మయోగము నీరెండును మోక్షహేతువులేయైనను యవిద్వాంసునకు నొకేకాలమున కర్తవ్యములుగ నుపపన్నములైన నీరెంటిలో నేదిచేయదగునని గుణదోషవిచారము చేసినచో సదసద్వివేకజన్యమగు తీవ్రవైరాగ్యము, తీవ్రమోక్షేచ్ఛ, యమ, నియమ, శమ, దమములు మొదలగు నంతరంగసాధన పౌష్కల్యముతో శూన్యము, కేవల ప్రైషమాత్రోచ్చారణరూపమునగు సంన్యాసముకంటె శ్రద్ధతో ననుష్ఠింపబడిన కర్మయోగము స్వానుష్ఠానజన్యములగు చిత్తశుద్ధ్యాదిగుణములచే నుత్కృష్టమైనదగును. శ్రౌతస్మార్తాదిరూపమగు కర్మమునే అవిద్వాంసుడు పరమేశ్వరప్రీతిగ శ్రద్ధతో నాచరించినచో నతనికి ఋణత్రయవిముక్తియు, నందుచే నింద్రియదేవతాప్రసాదము, ఈశ్వరానుగ్రహము, ఇంద్రియనైర్మల్యము, చిత్తశుద్ధి మొదలగు జ్ఞానసాధనసంపత్తి సిద్ధించును. కాన తీవ్రవైరాగ్యాద్యంతరంగసాధనశూన్యమగు సంన్యాసముకంటె శ్రద్ధాకృతమగు కర్మయోగము శ్రేష్ఠతరము కాన జ్ఞానసాధనసంపత్తిశూన్యుడగు యవిద్వాంసుడు యవిచారితముగ తొందరపడి సంన్యసింపక శ్రద్ధతో నీశ్వరార్పణముగ కర్మనే చేయదగునని సిద్ధించుచున్నది.

శాంకరభాష్యమ్:—

స్వాభిప్రాయ మాచక్షాణో నిర్ణయాయ— సంన్యాసః కర్మణాం పరిత్యాగః, కర్మయోగశ్చ తేషా మనుష్ఠానం తా వుభావపి నిశ్శ్రేయసకరౌ నిశ్శ్రేయసం మోక్షం కుర్వాతే జ్ఞానోత్పత్తిహేతుత్వేన ఉభౌ యద్యపి నిశ్శ్రేయసకరౌ తథాపి తయోస్తు నిశ్శ్రేయసహేత్వోః కర్మసంన్యాసా త్కేవలా త్కర్మయోగో విశిష్యత ఇతి కర్మయోగం స్తౌతి। ॥౨॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శ్రీకృష్ణపరమాత్మ తన యభిప్రాయమును చెప్పుచు పరుని సంశయనివృత్తికొరకు నిర్ణయమును చేసెను. శాస్త్రీయకర్మలపరిత్యాగము, అట్టి కర్మములయనుష్ఠానము అను నీరెండును జ్ఞానోత్పత్తి హేతువులగుటచే విచారింప మోక్షమును కలుగజేయునవి అయినను మోక్షహేతువులగునట్టి యాయవిద్వత్కర్తృక కర్మసంన్యాసకర్మయోగములలో జ్ఞానరహిత కర్మసంన్యాసముకంటె కర్మయోగ ముత్కృష్టమైనదని కర్మయోగమును స్తుతించుచుండెను. ॥౨॥

“న్యాసమేషాం తపసా మతిరిక్త మాహుః” (తపస్సులలో సంన్యాసమునే యుత్కృష్ట మైన దానినిగ జెప్పుచుండిరి.) అను శ్రుత్యనుసారము సంన్యాసమే యుత్కృష్టమని తెలియబడుచున్నను శ్రీకృష్ణపరమాత్మ తద్విరుద్ధముగ సంన్యాసమును ధిక్కరించి కర్మయోగమున కుత్కృష్టత్వమును జెప్పుటయుక్తము గాదు. అని శంకింపరాదు. ఏమన భగవంతుని ప్రవృత్తి సర్వలోకముల ననుగ్రహించుటయే ప్రయోజనముగ కలది. గాన పూర్వమునందు “నజాయతే మ్రియతేవా” అను మొదలగు వాక్యములచే విద్వాంసులకు ఆత్మతత్త్వమును, తత్సాధనమగు సర్వకర్మసంన్యాసమును యుపదేశించి ప్రస్తుతము “అజ్ఞాలు స్వీయమగు విద్యను, ప్రజ్ఞను, స్వభావమును, సంసారపారగమనశక్తిని తెలిసికొనకయే యేదోయొక స్వల్పకారణముచే త్వరపడి సంన్యసించి యనంతరము పతితులగుచుండిరి. అట్టివారిని యుద్ధరింపవలయు” నను నుద్దేశముతో నిట యప్రకృతమైనను కర్మయోగమును ప్రకృతమగుదానినిగ జేసియటిమూఢులకు కర్మయందే ప్రవృత్తి కలుగుటకై కర్మయోగమును “కర్మయోగోవిశిష్యతే” అని స్తుతి చేయుచుండెనేగాని సంన్యాసమును నిరాకరించుటలేదు. “న్యాసఇతి బ్రహ్మ బ్రహ్మ హిపరః” అనియు, “న్యాస ఏవా త్యరేచయత్” అనియు శ్రుతులు సంన్యాసము బ్రహ్మస్వరూపమేయనియు, సర్వశ్రేష్ఠమనియు చెప్పుటవలన “కర్మయోగో విశిష్యతే” అను వచనము కర్మయోగస్తుతిపరమేయని నిశ్చయింపదగును. ॥౨॥

శ్రీధరీయము:—శ్రీకృష్ణపరమాత్మ యర్జునప్రశ్నమునకు సమాధానము జెప్పుచున్నాడు. ఓయర్జునా! వేదాన్తవేద్యాత్మతత్త్వవేత్తకు కర్తవ్యముగ కర్మయోగమును నేను జెప్పుటలేదు. అట్లే చెప్పినచో బూర్వోక్తమగు కర్మసంన్యాసముతో విరోధము ప్రాప్తించెడిని. మరేమన? దేహాత్మాభిమానముకల నిన్నుజూచి బంధువధాదిశోకమోహాదికృతమగు నీసంశయమును దేహాత్మవివేకమనెడి కత్తిచే ఛేదించి పరమాత్మజ్ఞానోపాయభూతమగు కర్మయోగము నాచరింపుమని చెప్పుచుంటిని. కర్మయోగముచే చిత్తము శుద్ధమై యాత్మజ్ఞానము కల్గినయనంతరము అట్టి జ్ఞానపరిపాకమునిమిత్తమై జ్ఞానశ్రేష్ఠాంగముగ బూర్వము సంన్యాసము చెప్పంబడెను. ఇట్లగుటచే నంగప్రధానములకు వికల్పము సంభవింపదు కావ సంన్యాసము కర్మయోగము నీరెండును భూమికాభేదముచే సముచ్చితములై యై నిశ్శ్రేయస్సును సాధించును. అట్లైనను యారెండింటిలోను కర్మసంన్యాసముకంటె కర్మయోగ ముత్కృష్టమైనదని భావము. ॥౨॥

గీ॥ జ్ఞేయ స్స నిత్యసంన్యాసీ యో న ద్వేష్టి న కాంక్షతి ।
నిర్ద్వన్ద్వో హి మహాబాహో ! సుఖం బన్ధా త్ప్రముచ్యతే ॥ ॥3॥

పదవిభాగము:— జ్ఞేయః- సః- నిత్యసంన్యాసీ- యః- న- ద్వేష్టి- న- కాంక్షతి- నిర్ద్వన్ద్వః- హి- మహాబాహో ! సుఖం- బన్ధాత్- ప్రముచ్యతే ॥ ॥3॥

ప్రతిపదార్థము:— యః=ఎవడు; నద్వేష్టి=ద్వేషించడో; నకాంక్షతి=కోరడో; సః=అట్టికర్మయోగి; నిత్యసంన్యాసీ=నిత్యసంన్యాసిగ; జ్ఞేయః=తెలిసికొనదగినవాడు. హి=ఏకారణమువలన; నిర్ద్వన్ద్వః=ద్వన్ద్వరహితుఁడు; హేమహాబాహో !=ఓ గొప్పబాహువులుకల యర్జునా ! సుఖం=అనాయాసముగ; బన్ధాత్=సంసారమునుండి; ప్రముచ్యతే=విడబడుచున్నాడో ! ॥3॥

శాంకరభాష్యమ్:—

కస్మా దిత్యాహ— జ్ఞేయ ఇతి । జ్ఞేయో జ్ఞాతవ్య స్స కర్మయోగీ నిత్యసంన్యాసీతి యో న ద్వేష్టి కించి న్న కాంక్షతి సుఖదుఃఖే త త్సాధనే చై వంవిధో యః కర్మణి వర్తమానోఽపి స నిత్యసంన్యాసీతి జ్ఞాతవ్య ఇత్యర్థః । నిర్ద్వన్ద్వో ద్వన్ద్వవర్జితో హి యస్మా న్మహాబాహో ! సుఖం బన్ధా దనాయాసేన ప్రముచ్యతే ॥ ॥3॥

శాంకరభాష్యతత్త్వబోధ:—

కర్మ యనునది బంధకారణముగ ప్రసిద్ధము. అట్టికర్మ మేకారణమువలన మోక్షసాధనమగునెదవా? ఎవండు దుఃఖమునందుకాని, తత్కారణమునందుకాని ద్వేషమును పొందడో, సుఖమునుకాని, తత్కారణమునుకాని కాంక్షింపడో అట్టి కర్మయోగి కర్మములయందు ప్రవర్తించుచున్నను నిత్యసంన్యాసిగ తెలిసికొనదగినవాడు, అనియర్థము. అట్టివాడు సుఖదుఃఖాత్మక ద్వంద్వరహితుడగుటవలన నోయర్జునా! యట్టిపురుషుఁ డనాయాసముగ సుఖదుఃఖమోహాత్మకమగు సంసార మనెడి బంధమునుండి విముక్తుఁ డగుచున్నాడు ॥3॥

—• ౫వ అధ్యాయము— ౩వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— అకర్మయోగము నే యీదుశ్లోకములచే స్తుతించుచుండెను. ఎవడు కర్మయందు ప్రవృత్తుడైనను భగవదర్పణబుద్ధితో జేయబడుకర్మలను నిష్ఫలము అను యూహతో ద్వేషింపడో, స్వర్గాదిఫలమును కాంక్షింపడో రాగద్వేషరహితు డగునో యతని నెల్లప్పుడు సంన్యాసిగనే తెలిసికొనదగును. ఓమహాబాహూ! అట్టివాడు అంతఃకరణశుద్ధిరూపమగు జ్ఞానప్రతిబంధము నుండి యనాయాసముగ విడువబడి నిత్యానిత్యవస్తువివేకాది ప్రకర్షచే ముక్తుడగును. ॥3॥

శంకరానందీయము:— కర్మయోగిని "జ్ఞేయః" అను గీతిచే స్తుతించుచుండెను.— ఎవడకుశలమగు కర్మను ద్వేషించడో, అనగా యకుశలమగు కర్మయందప్రీతిని చేయడో మరేమనిన కుశలకర్మ అకుశలకర్మ యీ రెండును కర్మలేయను బుద్ధిచే నాచరించునో లేక, "నద్వేష్టి" ద్వేషమనగ నప్రీతి. అట్టియప్రీతిని యేప్రాణి కొఱకునుచేయడో (అనగా యేప్రాణివిషయమైనను యప్రీతినిపొందడో) కర్మవలన జనించెడి ఫలమును కొంచెమైన కోరడో, లేక ప్రాప్తించిన యనర్థముయొక్క నివృత్తిని, అప్రాప్తమగు నర్థముయొక్క ప్రాప్తిని కోఱడో "నిర్ద్వంద్వః" శీతోష్ణములు, సుఖదుఃఖములు, లాభాలాభములు, మానావమానములు, మొదలగు ద్వంద్వములనుండి సమబుద్ధిచే నిర్గతుడో (అనగాసమబుద్ధిచే ద్వంద్వరహితుడో) అట్టివాడు నిత్యసంన్యాసి. నిత్యముసంన్యాసముకలవాడు) అనిపండితులు తెలిసికొనదగినది. రాగాదిదోషరహితుడు, పరిపక్వచిత్తుడు, సమత్వబుద్ధ్యాదిగుణ విశిష్టుఁడు

గీ॥ సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదన్తి న పండితాః ।
ఏకమప్యాస్థిత స్సమ్య గుభయో ర్విన్దతే ఫలమ్ ॥ ॥౪॥

పదవిభాగము:— సాంఖ్యయోగౌ– పృథక్– బాలాః– ప్రవదన్తి– న– పండితాః– ఏకం– అపి– ఆస్థితః– సమ్యక్– ఉభయోః– విన్దతే– ఫలమ్ ॥ ॥౪॥

ప్రతిపదార్థము:— బాలాః=అజ్ఞానులు; సాంఖ్యయోగౌ=(సంఖ్యాయాత్మ సమీక్ష్యామ్యా తీతి సాంఖ్యం సంన్యాసః) కర్మసంన్యాస కర్మయోగములను; పృథక్=భిన్న ఫలములుకలవిగ; ప్రవదన్తి=చెప్పుచున్నారు; పండితాః=జ్ఞానులు; తథా=(ఈపదమధ్యాహార్యము) అట్లు; నప్రవదన్తి=చెప్పరు; ఉభయోః=కర్మసంన్యాస కర్మయోగములలో; ఏకమపి=ఒకదానినైన; సమ్యక్=లెస్సగ; ఆస్థితః=అనుష్ఠించువాడు; ఉభయోః=(ఈపద మావృత్తము) కర్మసంన్యాస కర్మయోగములయొక్క; ఫలం=ఫలమగుమోక్షమును; విన్దతే=పొందుచున్నాడు.

---

ఆగుటవలన నిష్ఠ గృహస్థుడు కర్మనిష్ఠుడైనను పరిగ్రహత్యాగ శీతవాతా ద్యుపద్రవ భిక్షాటనాది దుఃఖరహిత మగుటవలన యనాయాసముగ సంసారమునుండి ముక్తు డగును. పూర్వమునందు చెప్పబడిన కర్మయోగానుష్ఠాన ముచే చిత్తశుద్ధిని జ్ఞానమును పొంది కాలాంతరమున ముక్తు డగును. కాని యపక్వచిత్తుడగు యతి ముక్తుడు కాడు. ఈచెప్పుటవలన కర్మోపాసనలచే పరిపక్వమగుచిత్తముకలవానికే సంన్యాసమునందధికారమని సూచింపబడెను.॥3॥

శ్రీధరీయము:—ఎందువలన కర్మయోగ ముత్కృష్టమను శంకనుతొలగించుటకు కర్మయోగముకలవారిని సంన్యాసిగ స్తుతించుచు కర్మయోగమున కుత్కృష్టత్వమును "జ్ఞేయః" అనుగీతచే చూపుచుండెను. రాగద్వేషా దిరహితముగ పరమేశ్వరార్థము యెవడు కర్మలనాచరించునో అట్టివాడు కర్మానుష్ఠానకాలమునందుకూడ సంన్యాసియేయని తెలిసికొనదగినది. అందులకు హేతువేదనిన! అట్టివాడు రాగద్వేషాదిశూన్యుడై శుద్ధచిత్తుడై యనా యాసముగ సంసారము నుండిముక్తుడగును. కనుకనే అట్టివాడు నిత్యసంన్యాసి యనుపించుకొనును. ॥3॥

నీలకంఠీయము:—కర్మయోగులకు విక్షేపము ప్రత్యక్షసిద్ధమే. సంన్యాసులకైతే యట్టి విక్షేపశక్తి లేదు. కాన నెట్లు కర్మయోగముత్కృష్టమని చెప్పబడెను. అను శంకను "జ్ఞేయః" అనుశ్లోకముచే తొలగించు చుండెను.

ఎవడుం రాగద్వేషాదిరహితుడో అట్టివాడు కర్మలను స్వరూపతః పరిత్యజించినను, పరిత్యజించకున్నను నిత్యము సంన్యాసియేయని యనబడును. ఈచెప్పుటచే సాధనభూతములగు సాంఖ్యయోగములకు రాగద్వేషాది రాహిత్యము సామ్యమని చెప్పబడెను. ఫలభూతములకు సర్వవికల్పరాహిత్యరూపమగు సామ్యము ముందు రెండు శ్లోకములచేతను చెప్పుచుండెను. అస్థైనను చిత్తస్వభావమువలన నొకానొకసమయమున వివిదిషాసంన్యాసికిని రాగము జనించి పతనశంక కలుగవచ్చును. కర్మయోగికట్టి పతనశంక జనించదు. కాన కర్మయోగియే వివిదిషా సంన్యాసికంటె శ్రేష్ఠమైనవాడని భావము.

అస్థైనను నిర్ద్వంద్వుడు (అనగాసత్యానృతములు, ఆత్మానాత్మలమిథునీకరణము. (పరస్పరాధ్యాసము) ద్వంద్వశబ్దముచే చెప్పబడును. అట్టి పరస్పరాధ్యాసరహితుడగు సాంఖ్యుడు నిర్ద్వంద్వుడు) రాగద్వేషాదులు జనిం చుటకు హేతువగు నజ్ఞానము నశించుటచే కర్మల నాచరించుట యనెడి యాయాసము లేకుండగనే సంసారము నుండికేవలజ్ఞానముచేతనే ముక్తుడగును.అట్టివాడు కర్మలనపేక్షింపడు. "హి" ఈ విషయములోక వేదప్రసిద్ధమే.

లేక "ద్వంద్వం హై మిథునం తస్మాద్ద్వంద్వా న్మిథునం ప్రజాయతే" అను శ్రుతిచే బోధితంబగు స్త్రీపురుష మిథునమే ద్వంద్వశబ్దవాచ్యము. అట్టి ద్వంద్వరహితుడగు (స్త్ర్యాదిపరిత్యాగియగు) సంన్యాసి యనాయాసముగ ముక్తుడగును. కర్మయోగికి, సంన్యాసికి రాగాదులను జయించుట సమానమైనను సంన్యాసి కుటుంబపోషణవ్యగ్రుడు కాడు గాన నప్రాయాసముగ ముక్తు డగునని యర్థము.

**శాంకరభాష్యమ్.—**

(1) సంన్యాసకర్మయోగయో ర్భిన్నపురుషానుష్ఠేయయో ర్విరుద్ధయోః ఫలేపి విరోధో యుక్తో న తూభయో ర్నిశ్శ్రేయసకరత్వ మేవేతి ప్రాప్త ఇద ముచ్యతే—సాంఖ్యయోగా వితి। సాంఖ్యయోగౌ పృథ గ్విభిన్నఫలౌ బాలాః ప్రవదన్తి । న పండితాః । పండితాస్తు జ్ఞానినః ఏకం ఫల మవిరుద్ధ మిచ్ఛన్తి ఏక మేకమపి సాంఖ్యయోగయో స్సమ్యగాస్థిత స్సమ్య గనుష్ఠితవా నిత్యర్థః । ఉభయో ర్విన్దతే ఫల ముభయో స్తదేవ హి నిశ్శ్రేయసం ఫల మతో న ఫలే విరోధోస్తి॥

**శాంకరభాష్యతత్త్వబోధిని.—**

కర్మసంన్యాసకర్మయోగములు భిన్న (వేరువేరు) పురుషానుష్ఠేయములు, విరుద్ధమగు న ఫలములుకలవి. (అనగా సంన్యాసమునకు నిశ్శ్రేయస్సుఫలము, కర్మయోగమున కభ్యుదయము ఫలము,) అట్టి సంన్యాసకర్మయోగములకు ఫలమునందుకూడ విరోధము యుక్తము. ఆరెంటికి మోక్షసాధనత్వ మెంతమాత్రము ప్రాప్తించదను శంక ప్రాప్తించ నట్టి శంకను తొలగించుటకు "సాంఖ్యయోగా" అని చెప్పబడుచుండెను

శాస్త్రార్థము తెలియనట్టి యవివేకులు కర్మసంన్యాస కర్మయోగములు భిన్నమగు ఫలములు కలవని చెప్పుచుండిరి. కాని, జ్ఞానులు, యోగులు, కర్మసంన్యాసకర్మయోగములు భిన్నఫలములు కలవని చెప్పరు. పండితులు (జ్ఞానులు, యోగులు) కర్మసంన్యాస కర్మయోగముల కవిరుద్ధమగు ఫలమునే యిచ్ఛయించెదరు. అది యెట్లనిన ? కర్మసంన్యాస కర్మయోగములలో నేదో యొకదానిని లెస్సగ ననుష్ఠించినచో (అని యర్థము) ఆ రెంటిలో నొకదాని ననుష్ఠించినచో నొకదానిఫలమునే పొందునుగాని, రెంటిఫలము నెట్లు పొందెదర నెదవా ? కర్మసంన్యాసకర్మయోగములు తత్త్వజ్ఞానద్వారమున మోక్షరూపఫల మొక్కటియే కలవగుట వలన నా రెంటియొక్క ఫలమగు మోక్షమునే పొందుదురు. కాన నా రెంటికి ఫలమునందు విరోధము లేదు.

—• ౫వ అధ్యాయము— ౪వ శ్లోక వ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:—కర్మసంన్యాసములకు స్వరూపమువలన విరోధము ప్రాప్తించుచుండ ఎవడు కర్మయందు ప్రవృత్తుడో వాడు సంన్యాసియని యెట్లు తెలిసికొనదగినది? (తెలిసికొనుటకువీలులేదు) స్వరూపము వలన విరుద్ధములైనవాటికి ఫలమునందుకూడ విరోధమే యుచితముగుటచేత కర్మ కర్మసంన్యాసములకు ఫలమొక్కటియేగాన కర్మానుష్ఠానపరుడు సంన్యాసియేయని చెప్పుటకు వలనుపడదు. కాన "నిశ్శ్రేయసకరావుభౌ" కర్మ కర్మసంన్యాసములు రెండును మోక్షదాయకములేయని చెప్పుట యెట్లు పొసగుననుశంకను "సాంఖ్యయోగౌ" అను గీతచే తొలగించుచుండెను.

"సాంఖ్యః" సంఖ్యయనగ లెస్సగజనించిన యాత్మవిషయకబుద్ధి, అట్టిదానిని జ్ఞానాంతరంగ సాధనముగ వహించునదిగాన సంన్యాసము సాంఖ్యమనబడును. యోగమనగ కర్మయోగము. ఈరెండును విరుద్ధఫలములు కలవని శాస్త్రార్థవివేకజ్ఞానశూన్యులు చెప్పెదరు. పండితులన్నచో అట్లు చెప్పరు. మరేమని చెప్పెదరు? సంన్యాసకర్మయోగములు రెండింటిలో నేదోయొకదానిని స్వాధికారమునకు దగునట్లు లెస్సగ యథాశాస్త్రముగ ననుష్ఠించువాడు సంన్యాసకర్మయోగములకు ఫలమగు మోక్షమును జ్ఞానోత్పత్తి ద్వారమున పొందుచున్నాడు॥౪॥

శాంకరభాష్యమ్ :—

(2) నను సంన్యాసకర్మయోగశబ్దేన ప్రస్తుత్య సాంఖ్య, యోగయోః ఫలైకత్వం కథమిహ ప్రకృతం బ్రవీతి? నైష దోషః యద్యప్యర్జునేన సంన్యాసం కర్మయోగం చ కేవల మభిప్రేత్య ప్రశ్నః కృతో భగవాంస్తు తదపరిత్యాగేనైవ స్వాభిప్రేతం చ విశేషం సంయోజ్య శబ్దాంతరవాచ్యతయా ప్రతివచనం దదౌ। సాంఖ్యయోగా వితి। తావేవ సంన్యాసకర్మయోగౌ జ్ఞానతదుపాయసమబుద్ధిత్వాదసంయుక్తౌ సాంఖ్యయోగశబ్దవాచ్యా వితి భగవతో మత మతో నాప్రకృతప్రక్రియేతి ॥ ॥4॥

శాంకరభాష్యతత్త్వబోధిని: —

(2) సంన్యాస, యోగశబ్దములచే కర్మసంన్యాసకర్మయోగములను ప్రస్తుతముగ జేసుకొని సాంఖ్య, యోగములకు ఫలమొకటేయని యప్రకృతమగు ఫలైకత్వమును చెప్పుచుంటివేమి యని యనెదవా (ఇట్లప్రకృతార్థకథన మర్థాంతరదోష మనెడి నిగ్రహస్థానమనబడును.) అప్రకృతార్థకథనమనెడి దోషము ప్రాప్తించదు విచారింప నర్జుననిచే కర్మసంన్యాసమును, కర్మయోగము నుద్దేశించియే "సంన్యాసం కర్మణాం కృష్ణ" అనిప్రశ్నము చేయఁబడెను. శ్రీకృష్ణ

శంకరానందీయము:—"కర్మణా పితృలోకః" (కర్మచే పితృలోకము (ప్రాప్తించును) అను శ్రుతి కర్మానుష్ఠానపరులకు పితృలోకము ప్రాప్తించునని బోధించుచుండ "సుఖం బంధా త్ప్రముచ్యతే" అని కర్మకు శాస్త్రవిరుద్ధమగు భవబంధమోక్షణము కర్మఫలముగ నెట్లు చెప్పబడెనని శకింపజనదు. కామనచేకర్మలననుష్ఠించువారలకేకర్మఫలము పిత్రాదిలోకము. నిష్కామ కర్మానుష్ఠానపరులకు కాదని విరుద్ధఫలవాదిమత తిరస్కార పురస్సరముగ సంన్యాస కర్మయోగములకు ఫలమొకటియేయని నిశ్చయించి యారెంటిలో నొకదానిని నాశ్రయించినను రెంటిఫలము ప్రాప్తించునని "సాంఖ్యయోగౌ" అనుదానిచే చెప్పుచుండెను.

"సాంఖ్యయోగౌ" సమ్యక్తత్త్వరత్వేన ఖ్యాయతే ప్రతిపాద్యతఇతి సాంఖ్యం=లెస్సగా తెలుపుడు చేయబడు పరబ్రహ్మము సాంఖ్యమనబడును. అట్టి పరబ్రహ్మప్రాప్తికి కారణమగుటవలన జ్ఞాననిష్ఠాంగ భూతమగు సంన్యాసముకూడ సాంఖ్యమనబడును. అట్టిసాంఖ్యము కర్మయోగము క్రియచేతను అధికారిభేదముచేతను యెట్లు భిన్నములో అట్లే ఫలముచేతనుకూడ భిన్నములని సాధనములవలన, ఫలములవలన భేదమును వేదాంతశాస్త్రార్థరహస్యమును తెలియని కొందరు విద్వాంసులు చెప్పుచుండిరి. "కర్మణా పితృలోకః స్వర్గం వా ఏతే లోకం యన్తి" (కర్మచే పితృలోకమునుకాని స్వర్గలోకమునుకాని పొందెదరు.) అనువాక్యములచే కర్మలకు పితృలోకప్రాప్తిని "సంన్యాసయోగద్యతయశ్శుద్ధసత్త్వాః" "నైష్కర్మ్యసిద్ధిం పరమాంసంన్యాసే నాధిగచ్ఛన్తి" సంన్యాసముచే నైష్కర్మ్యసిద్ధినిపొందుదురు.) అను శ్రుతివచనములచే సంన్యాసమునకు నైష్కర్మ్యసిద్ధిని ఫలముగ జెప్పుచు సంన్యాసకర్మయోగములకు సాధనభేదమును ఫలభేదమును జెప్పుచుండిరని యర్థము. శ్రుతిస్మృతి ప్రమాణములవలన సంన్యాసకర్మయోగములకు ఫలభేదము యుక్తమేయను పండితంమన్యమానుల శంకను "నపండితాః" అను వాక్యముచే తొలగించుచుండెను. వేదాంత శాస్త్రపారంగతులు తద్రహస్యవేదులు నగు బ్రహ్మవేత్తలు సంన్యాసకర్మయోగుల కొకే ఫలమని చెప్పుచుండిరి. అదియెట్లనిన? తత్త్వమస్యాది మహావాక్యములు సాధకునకు చిత్తశుద్ధిలేనిచో బ్రహ్మతత్త్వమునుబోధించుటకు శక్యములు కానేరవు. అట్టిచిత్తశుద్ధియు కర్మోపాసనలు లేనిచో సిద్ధింపనేరదు. ఆకర్మోపాసనలయందు బ్రవృత్తియు కర్మయొక్కయు, ఈశ్వరునియొక్కయు, మహాత్మ్యమును స్తుతించినగాని సంభవింపనేరదు. కాన "పశ్యతిపుత్రం" "ఏషసర్వేశ్వర ఏషసర్వజ్ఞః" ఇత్యాది శ్రుతివాక్యము

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

పరమాత్మయైతే యట్టి ప్రశ్నను విడవకుండగనే స్వాభిప్రేతమగు యొకానొక విశేషమును సమకూర్చియే శబ్దాంతరవాచ్యముగ సమాధానమును చెప్పెను. అట్టి శబ్దమేదనిన "సాంఖ్యయోగౌ" అనునదియే. ఇట సాంఖ్యశబ్దము 'సంఖ్యామాత్మసమీక్షామర్హతీతి సాంఖ్యః' ఆత్మసమీక్షకుతగిన కర్మసంన్యాసమే సాంఖ్యశబ్దముచే చెప్పబడును. కాన "సాంఖ్యయోగౌ" అను శబ్దమునకు కర్మసంన్యాసకర్మయోగములే యర్థము. అట్టి కర్మసంన్యాసకర్మయోగములు జ్ఞాన, తదుపాయ, సమబుద్ధిత్వ శమదమాదులతో కూడి సాంఖ్యయోగశబ్దములచే చెప్పబడునని శ్రీకృష్ణపరమాత్మయొక్క మతము. కాన నీయప్రకృతార్థకథనరూపమగు యప్రకృతప్రక్రియ యను నిగ్రహస్థానరూపదోషమిందు సంభవింపదు. ॥౬॥

---

అచే కర్మయొక్కయు, ఈశ్వరునియొక్కయు, మహాత్త్వము ప్రతిపాదింపబడినచో గర్మయందును యీశ్వరోపాసనయందును ప్రవృత్తుడై వాటిచే శుద్ధమైన చిత్తముకలవానికే యుపదిష్టమగు తత్త్వజ్ఞానము ఫలమును (మోక్షము) చేకూర్చును. కానజ్ఞానసిద్ధికి చిత్తశుద్ధికారణము. తత్కారణమగు కర్మకుమోక్షమే ఫలము జ్ఞానసాధనమగుటచే సంన్యాసమునకుకూడ మోక్షమే ఫలము. "విద్యాంచావిద్యాంచ యస్తద్వేదోభయగ్ంసహ అవిద్యయామృత్యుం తీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే" అను శ్రుత్యుక్తరీతిని అవిద్యచే జ్ఞానప్రతిబంధము నతిక్రమించి జ్ఞానముచే మోక్షమును బొందును. కాన కర్మయోగము జ్ఞానమునకును, జ్ఞానము సంన్యాసమునకును కారణములని తెలియబడుటవలన జ్ఞానఫలమగు మోక్షమే కర్మయోగమునకుగూడ ఫలము కాన సాంఖ్యయోగములకు మోక్షమేఫలమని పండితులు తలచెదరు. అందుచే కారకాదులచే భేదముకాని సాంఖ్యయోగములకు ఫలమునుబట్టి భేదములేదని సిద్ధించుచున్నది. కనుక "ఏకమపి" అనుస్థలమునందుగల 'అపి' అనుపదమునకు 'వా' అనుశబ్దార్థమును గ్రహించి సాంఖ్యయోగములలో నేదోయొకటియగు సాంఖ్యయోగమును గాని కర్మయోగమును గాని, లెస్సగ ననుష్ఠించు ముముక్షువు సాంఖ్య, యోగములకు ఫలమగు మోక్షమును బొందుచుండెను. కాన సాంఖ్య, కర్మయోగములకు మోక్షము సమకూర్చు యంతరంగ బహిరంగ భావమునుబట్టియు, కాలముచేనైన యల్పత్వానల్పత్వముల ననుసరించియు, సాధ్యసాధనభావమునుబట్టియు గజాశ్వములకువలె తారతమ్యమున్నను సమత్వప్రతిపాదనచే యనధికారి కర్మయే చేయదగును కాని సంన్యసింపరాదని సూచితమయ్యెను. ॥౪॥

నీలకంఠీయము:—సంన్యాసము శ్రేష్ఠమనెదమా! ఎన్నడైన నొకానొకసమయమందు రాగాదులు జనించునేని పతనశంక, కర్మయోగము శ్రేష్ఠమనెదమా! అందు కర్మవాచరించుటవలన గలిగెడి శ్రమ. కాన కర్మసంన్యాసకర్మయోగములలో నేదిశ్రేష్ఠమైనది? యనుశంకమీద రెంటికి ఫలమొక్కటేయగుటవలన సామ్యము కలదని "సాంఖ్యయోగౌ" అనుశ్లోకముచే చెప్పుచుండెను.

"సాంఖ్యం" (సమిత్యేకీభావే ఇతియాస్క, "ఏకీభావేనాత్మానన్యత్వేన ఖ్యాయతే ప్రకాశ్యతే వస్తుస్వరూపమనయేతి సంఖ్యా" సం" అనుపద మేకీభావమునందు వర్తించునని యాస్కముని చెప్పెను. కాన ఆత్మానన్యత్వముచే వస్తుస్వరూపమును ప్రకాశింపజేయునట్టిది "సంఖ్యా" అని చెప్పబడును. అదియేమనిన? నిర్వికల్ప ప్రత్యగాత్మయందు స్థూలసూక్ష్మకారణప్రపంచముయొక్క ప్రవిలాపన ద్వారమున పుట్టిన చిత్తవృత్తి. తత్ప్రధానభూతమగునది సంన్యాసము. అట్టి సంన్యాసము సాంఖ్యమనబడును. ఆ సంన్యాసమెట్టిదనిన భార్యమొదలు బుద్ధివరకగుపదార్థము లాత్మకంటె వేరుకాని భార్యమొదలు బుద్ధ్యంతపదార్థముల పరిత్యాగము (ప్రవిలాపనము) సంన్యాసమనబడును. యోగమనగ నగ్నిహోత్రము, సంధ్యోపాసనమొదలు నిర్వికల్పసమాధ్యంత మనుష్ఠించుట అందు ముఖ్యమగు యోగలక్షణము "యోగశ్చిత్తవృత్తినిరోధః" (యోగమనగ చిత్తవృత్తినిరోధము) అని యోగసూత్రములయందు వక్కాణించబడెను. వృత్తులు "ప్రమాణ, విపర్యయ, వికల్ప,

గీ॥ యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగై రపి గమ్యతే।
ఏకం సాంఖ్యంచ యోగంచ యః పశ్యతి స పశ్యతి ॥ ॥౫॥

పదవిభాగము:— యత్ - సాంఖ్యైః - ప్రాప్యతే - స్థానం - తత్ - యోగైః - అపి - గమ్యతే - ఏకం - సాంఖ్యం - చ - యోగం - చ - యః - పశ్యతి - సః - పశ్యతి । ॥౫॥

ప్రతిపదార్థము:— సాంఖ్యైః=జ్ఞాననిష్ఠులగుసంన్యాసులచే; యత్=ఏ; స్థానం=మోక్షము; ప్రాప్యతే=పొందబడుచున్నదో; యోగైరపి=(ఇచట అర్శఆదిభ్యోఽచ్ అను అచ్ప్రత్యయముచేయుటచే యోగులను యర్థముకలది) ఫలనిరపేక్షులై యీశ్వరార్థము కర్మముల నాచరించు కర్మయోగులచేతను; తత్=ఆమోక్షము; గమ్యతే=పొందబడుచున్నది. యః=ఎవఁడు; సాంఖ్యంచ=సంన్యాసమును; యోగంచ=కర్మయోగమును; ఏకం=ఒకమోక్షఫలమే కలవాటినిగ; పశ్యతి=తెలిసికొనునో. సః=వాడు; పశ్యతి=లెస్సగ తెలిసికొనుచున్నాడు. ॥౫॥

---

నిద్రా, స్మృతయః” ప్రమాణమని, విపర్యయమని, వికల్పమని, నిద్రయని, స్మృతియని, యైదువిధములు. అదు ప్రత్యక్షమని, అనుమానమని, ఆగమమని ప్రమాణములు మూడువిధములు. అందును (1) ప్రత్యక్షమనగ నింద్రియము. ఇంద్రియములవలనగలిగిన శుక్తినిచూచి యిదిశుక్తి (ముత్యపుచిప్ప) అని యథార్థజ్ఞానరూపమగువృత్తియు ప్రత్యక్షమనఁబడును. (2) విపర్యయమనగ ముత్యపుచిప్పనుచూచి యిది రజితమని కలిగిన భ్రమరూపవృత్తియే. సంశయమనగ నిది శుక్తియా? రజితమా? (వెండియా?) అని నిర్ధారణలేని జ్ఞానరూపవృత్తియే. ఇట్టిసంశయముకూడ విపర్యయమునందే యంతర్భవించును. (అనగా సంశయముకూడ విపర్యయమేయనఁబడును.) (3) వికల్పమనగ వస్తుశూన్యము, శబ్దజ్ఞానానుపాతి. అది యెట్లనిన? పురుషునకు చైతన్యము వంధ్యాపుత్రుడే అనునదియే వికల్పము. పురుషునకు, చైతన్యమునకు, తత్సంబంధమునకు భేదములేదు. చైతన్యముమాత్రమే శబ్దత్రయముచే (పురుషుడు, సంబంధము, చైతన్యము అనెడి మూడుశబ్దములచే) చెప్పఁబడుచున్నది. వంధ్యాపుత్రునకు స్వరూపములేదు. అయినను వంధ్యాపుత్రుడు అనుశబ్దముచే చెప్పఁబడుచుండెను. ఈ వికల్పమే శబ్దజ్ఞానానుపాతి వస్తుశూన్యమనఁబడును. ఒక దానియందనేకత్వబుద్ధియు, లేనిదానియందు సద్బుద్ధియు వికల్పమనఁబడును. నిద్రయు, స్మృతియు లోకప్రసిద్ధములే. అట్టి యయిదువృత్తులను నిరోధించినచో నిర్వికల్పమగు ప్రత్యగాత్మయే మిగులును. ఈ చెప్పఁబడిన రెండును ఫలభూతములగు సాంఖ్యయోగములనఁబడును. సాధనభూతములగు సాంఖ్యయోగములు సంన్యాసకర్మయోగములు. అందు సాధనభూతములగు సాంఖ్యయోగములకు సామ్యము “జ్ఞేయ స్సనిత్యసంన్యాసీ” అనశ్లోకముచే సూచించబడెను. ఫలభూతములగు సాంఖ్యయోగములకైక్యమిచట చెప్పఁబడెను. ఈ రెంటిలో దేనిని యనుష్ఠించినను నిర్వికల్పాత్మస్వరూపముచే నేకస్థానమును పొందును అని చెప్పఁబడెను. ॥౪॥

—♦ ౫వ అధ్యాయము— ౫వ శ్లోక వ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము;— సంన్యాసకర్మయోగములలో నేదోయొకదాని నాచరించిన రెంటిఫలమెట్లుపొందునను శంకను “యత్సాంఖ్యైః” అనుగీతచే తొలగించుచుండెను.

జ్ఞాననిష్ఠులగు సంన్యాసు లైహికకర్మానుష్ఠానశూన్యులైనను సంన్యాసాశ్రమమునకు పూర్వమునఁ దాచరించబడిన కర్మలచే సంస్కృతమైన యంతఃకరణముకలవారై శ్రవణాదిపూర్వకమగు జ్ఞాననిష్ఠచే ప్రసిద్ధమైన మోక్షమనెడి యేస్థానమును పొందుచుండిరో! (అపద లేమిఁజేసి పొందబడుచున్నదివలె మోక్షము నిత్యప్రాప్తమగుటవలనయని గ్రహింపనగును.) భగవదర్పణబుద్ధిచే ఫలాభిసంధిరహితముగ నాచరించబడిన శాస్త్రీయమగుకర్మలు యోగము లనఁబడును. అట్టి కర్మల నాచరించువారలుకూడ “యోగ” అనుశబ్దముచే జెప్పఁబడుదురు. యోగిశబ్దము కర్మపరమైయుండ కర్మల నాచరించువారుకూడ యోగశబ్దముచే నెట్లు జెప్పఁబడెదరని

శాంకరభాష్యమ్:—

ఏకస్యాపి సమ్యగనుష్ఠానాత్కథ ముభయోః ఫలం విన్దత ఇత్యుచ్యతే- యదితి। యత్సాంఖ్యైర్జ్ఞాననిష్ఠైస్సంన్యాసిభిః ప్రాప్యతే స్థానం మోక్షాఖ్యం తద్యోగైరపి జ్ఞానప్రాప్త్యుపాయత్వేనేశ్వరే సమర్ప్య కర్మాణ్యాత్మనః ఫల మనుతిష్ఠన్తి యే తే యోగినస్తైరపి పరమార్థజ్ఞానసంన్యాసప్రాప్తిద్వారేణ గమ్యత ఇత్యభిప్రాయోఽత ఏకం సాంఖ్యం యోగంచ యః పశ్యతి ఫలైకత్వాత్స సమ్యక్పశ్యతీత్యర్థః। ॥౫॥

శాం. భాష్యతత్త్వబోధః:—

కర్మసంన్యాసకర్మయోగములలో నేదో యొకదానియొక్కసమ్యగనుష్ఠానమువలన కర్మసంన్యాసకర్మయోగములనెడి రెంటియొక్క ఫలమునెట్లు పొందును? అని శంకించెదవా? వినుము చెప్పెద. జ్ఞాననిష్ఠులచే పొందబడెడి మోక్షమనెడి యేస్థానముకలదో జ్ఞానప్రాప్తికుపాయమగుటచే నిఖిలకర్మలను యీశ్వరునియం దర్పించి యాత్మ కాకర్మముల ఫలమును కోరక యెవరు కర్మల నాచరించెదరో యట్టి యోగులచేతను పరమార్థజ్ఞానరూపమగు సంన్యాసము యొక్క ప్రాప్తిద్వారమున నట్టి మోక్షమనెడి స్థానము పొందబడుచున్నదని యభిప్రాయము. కనుకనే కర్మసంన్యాసకర్మయోగములు రెండును మోక్షమనెడి ఫలమొక్కటియే కలువగుటవలన జ్ఞానమును, కర్మయోగమును నొక్కటిగ నెవరు తెలిసికొనెదరో యట్టివాడే లెస్సగ (నాత్మను) తెలిసికొనుచున్నాడు. ॥౫॥

శంకింపఁజనదు, "అర్శఆదిభ్యో అచ్" అనుసూత్రానుసారము యోగశబ్దము 'అచ్' అను ప్రత్యయ మంతమందు కలది. ఆఅచ్ ప్రత్యయము మత్ బర్థముకలది. అనగ యోగశబ్దముచేతనే నిష్కామకర్మానుష్ఠానపరులుకూడ చెప్పఁబడెదరు. కాన నిచటయుండు "యోగైః" అనుశబ్దమునకు నిష్కామకర్మానుష్ఠానపరులర్థము. అట్టి యోగులచేగూడ సత్త్వశుద్ధిద్వారమున సంన్యాసపూర్వకశ్రవణాదిపురస్సరముగ వర్తమానజన్మమునందు గాని, భవిష్యత్ (రాబోవు) జన్మమునందు గాని జనించుజ్ఞాననిష్ఠచే యా మోక్షమనెడి ఫలము పొందబడును. కాన సంన్యాస కర్మయోగములు రెండును యొకఫలమే కలవి. కనుకనే సంన్యాసము కర్మయోగ మొకఫలమే కలవని యెవడు తెలిసికొనునో వాడే లెస్సగ తెలిసికొనినవాడు.

యిచట యాశయమిది. ఎవరు సంన్యాసపూర్వకమగు జ్ఞాననిష్ఠయందుండిరో కార్యమనునది కారణము లేనిదే సంభవించనందున వారిజ్ఞాననిష్ఠకు కారణమగు భగవదర్పితకర్మనిష్ఠ వారిచే పూర్వజన్మమునం దాచరించబడెనని యూహింపనగును. ఈ విషయమే "యాన్యతోఽన్యాని జన్మాని తేషు నూనం కృతం భవేత్। సత్కృత్యం పురుషేణేహ నాన్యథా బ్రహ్మణి స్థితిః" ఎవడు బ్రహ్మనిష్ఠుడో వాడీజన్మమునకు పూర్వమందైన జన్మములయందు సత్కృత్యముల నాచరించువాడే. అట్లాచరించనిచో బ్రహ్మమునందు స్థితియే సంభవించదని చెప్పఁబడెను. అట్లే యెవరీజన్మమునందు భగవదర్పితకర్మనిష్ఠాపరులై యుండెదరో కారణమనునది తప్పక కార్యమును పుట్టించును గాన నట్టివారలకు తప్పక సంన్యాసపూర్వక జ్ఞాననిష్ఠకలుగునని యూహింపనగును. కాన నజ్ఞానియగుముముక్షువు యంతఃకరణపరిశుద్ధికొరకు మొట్టమొదట కర్మయోగమాచరించవలయును. కాని సంన్యాసమును స్వీకరించవలదు. సంన్యాసమనునది తీవ్రమైనవైరాగ్యముకలిగినపిదప స్వయముగనే సంభవించును. ॥౫॥

శంకరానందీయము:— సాంఖ్య, కర్మయోగములు రెండును యొకే ఫలముకలవని పూర్వమునందు చెప్పబడిన విషయమునే యీ శ్లోకమున స్పష్టముజేయుచు సాంఖ్య, యోగముల ఫలైకత్వ దర్శనస్తుతి చేయు

చున్నాడు:—సాంఖ్యమనగ, పరబ్రహ్మము. దానిని యాత్మస్వరూపముగ తెలిసికొనువారు సాంఖ్యులు. బ్రహ్మనిష్ఠులగు నట్టి యతులచే— "యత్ స్థానం సద్గైకరూపేణైవ తిష్ఠతి న క్వచిత్కించిదపి వికరోతీతి స్థానం" (ఎల్లపుడు నొకేవిధముగనుండి యెన్నడును కొంచెమైన వికారము పొందని కేవలభావాత్మకమగు స్వరూపము స్థానమనబడుచుండును.) ఎట్టి స్థానము పొందబడునో (స్వరూపముగ తెలియబడునో) అట్టి మోక్షరూపమగు స్థానమే ఫలాభిసంధివర్జితముగ నీశ్వరప్రీత్యర్థము కర్మలను చేయువారిచే పొందబడు చున్నది. (ఇట యోగశబ్దమునకు మతుబర్థము. "అచ్" ప్రత్యయముచే యోగు అను యర్థముసంభవించును.) కర్మ యోగులు యెల్లపుడు పమనుష్ఠీయమానములగు కర్మలచే చిత్తశుద్ధిగలిగి దానిచే జ్ఞానము కలిగి స్వస్వరూప మును తెలిసికొనిన వారగుదు రని భావము. "ఏష పంథా ఏతత్కర్మైతద్బ్రహ్మ" అను శ్రుతిచొప్పున సాంఖ్య, కర్మయోగములు యొకే ఫలముకలవగుట ప్రమాణసిద్ధము కాన జ్ఞానయోగమును, కర్మయోగమును యొక మోక్షమే ఫలము కలవగుటచే యొకటిగనే (ఏకార్థకముగనే) యెవడు తెలిసికొనునో యతడే సమ్యగ్దర్శి యగును గాని మరియొకడు కానేరడు.

భాష్యోత్కర్ష దీపిక:— సంన్యాసకర్మయోగములలో నేదోయొకదాని నాచరించిన రెండిటి ఫల మును యెట్లు పొందుదురను శంకను "యత్సాంఖ్యైః" అనుదానిచే తొలగించుచుండెను. విశుద్ధమైన యంతః కరణముకల జ్ఞాననిష్ఠులగు సంన్యాసులచే తత్త్వసాక్షాత్కారమాత్రముచే మోక్షమనెడి యేస్థానము పొంద బడునో (అనగా నదివరకు లేనిదానిని పొందుటయని యర్థముకాదు. మరేమనిన? కంఠమునందు ధరియించిన కంఠాభరణమును మరచినవాడు కాలాంతరమున మిత్రునిచే స్మరింపజేయబడి తిరిగి యాకంఠాభరణము దక్కిన దనుకొనినటుల లబ్ధమైన మోక్షముయొక్క లాభమని గ్రహింపనగును), అట్టిపరమార్థజ్ఞానరూప మగు మోక్షము జ్ఞానప్రాప్త్యుపాయము, శాస్త్రీయము, ఫలాభిసంధివర్జితములగు కర్మలచేగూడ సంన్యాస ప్రాప్తి ద్వారమున పొందబడును. "ఆయుర్వై ఘృతం" (ఘృతమాయుస్స్వరూపము) అనిచెప్పినటుల సాధ్య మగు మోక్షమునకు, సాధనమగుజ్ఞానమునకు భేదమునను సరించి మొదట మోక్షమని, తరువాత పరమార్థజ్ఞాన మని చెప్పబడెను.

సంన్యాసకర్మయోగములకు మోక్ష మనెడి ఫల మొక్కటియే యగుగాక. ప్రాప్యముగ్రాము మొక్క టియైనను పరస్పరసాపేక్షలేని మార్గములవలె సంన్యాసకర్మయోగములకు పరస్పరసాపేక్షయుక్తము కాదను శంకను "యత్సాంఖ్యైః" అనుదానిచే తొలగించుచుండెను. (1) సంన్యాసకర్మయోగములు వ్యక్తులచే భిన్నము లగుటవలన పరస్పరనిరపేక్షత్వమును జెప్పెదవా? (2) లేక యుభయమునకు కోరదగినది మరేమియులేనందున పరస్పరము నిరపేక్షత్వమును జెప్పెదవా? 'సాంఖ్యైః' అని బహువచనమువలన సంన్యాసము అనియర్థము. సం న్యాసమువలన తత్తత్కర్మపరిత్యాగములు. అట్టికర్మపరిత్యాగరూపములగు సంన్యాసము లెట్లు పరస్పరసాపేక్ష గలిగి మోక్షమును సాధించుచున్నవో అట్లే భిన్నములగు సంన్యాస కర్మయోగములుగూడ పరస్పరాపేక్షిత ములై సాధనములగును గాన మొదటియాశంక పొసగదు. పూర్వశ్లోకమునందు పరస్పరసాపేక్షత్వము చెప్పబ డనందున ఈశ్లోకమునందుగల స్థానశబ్దముచే వాచకమగుజ్ఞానము జెప్పనొప్పదు. కర్మయోగసాధ్యమగు నిరపేక్ష మైన జ్ఞానమువలననే మోక్షము ప్రాప్తించినటుల శమదమాదులతోగూడిన సంన్యాసము కర్మసాధ్యమైనను అట్టిసంన్యాసముచే జ్ఞానము కలుగదలచియుండ కర్మాపేక్షలేనందున సంన్యాసకర్మయోగములకు సాపేక్షత్వ ము సిద్ధించదు. అట్టి సాపేక్షత్వము సిద్ధించినచో "ఏకం" అనుదానిస్థానమున "సాంఖ్యయోగంచ పరస్పర సాపేక్షం" అని గీతాకారులు చెప్పవలసివచ్చును. కాన సాక్షాత్తు గాని, పరంపరచే గాని, యేకఫలజనకము లగుటచే "సాంఖ్యము, యోగము ఏకమే" అని యెవరు తెలిసికొనునో అట్టివారు లెస్సగ తెలిసికొనువారని యర్థమే రమణీయము. ॥ ౫ ॥

గీ॥ సంన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తు మయోగతః ।
యోగయుక్తో మునిర్బ్రహ్మ నచిరేణాధిగచ్ఛతి ॥ ॥౬॥

పదవిభాగము:—సంన్యాసః–తు–మహాబాహో–దుఃఖం–ఆప్తుం–అయోగతః–యోగయుక్తః– మునిః – బ్రహ్మ–న–చిరేణ–అధిగచ్ఛతి. ॥౬॥

ప్రతిపదార్థము:—హేమహాబాహో?=ఓగొప్పబాహువులుకల యర్జునా? అయోగతః=ఫలనిరపేక్షము, ఈశ్వరసమర్పితము నగు కర్మయోగము లేనిదే; సంన్యాసస్తు=పారమార్థిక సంన్యాసము; ఆప్తుం=పొందుటకు; దుఃఖం=కష్టసాధ్యము; యోగయుక్తః=ఫలనిరపేక్షము, ఈశ్వరసమర్పితము అగు వైదికకర్మయోగము కల; మునిః=పరమేశ్వరస్వరూపమును మననము జేయువాడు; నచిరేణ=శీఘ్రముగనే; బ్రహ్మ=జ్ఞాననిష్ఠారూపమగు పరమార్థ సంన్యాసమును; అధిగచ్ఛతి=పొందుచున్నాడు. ॥౬॥

---

శాంకరభాష్యమ్:—

(1) ఏవం తర్హి యోగాత్సంన్యాస ఏవ విశిష్యతే । కథం తర్హీద ముక్తం తయోస్తు కర్మసంన్యాసాత్కర్మయోగో విశిష్యత ఇతి । శృణు తత్ర కారణం । త్వయా పృష్టం కేవలం కర్మసంన్యాసం కర్మయోగం చాభిప్రేత్య తయో రన్యతరః కశ్శ్రేయా౯ । తదనురూపం ప్రతివచనం మయోక్తం కర్మసంన్యాసాత్కర్మయోగో విశిష్యత ఇతి జ్ఞాన మనపేక్ష్య । జ్ఞానాపేక్ష స్తు సంన్యాస స్సాంఖ్య మితి మయాభిప్రేతః । పరమార్థయోగశ్చ స ఏవ ।

యస్తు కర్మయోగో వైదికః స తాదర్థ్యా ద్యోగ స్సంన్యాస ఇతి చోపచర్యతే । కథం తాదర్థ్యమిత్యుచ్యతే—

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(1) జ్ఞానపూర్వకసంన్యాసద్వారమున కర్మలుకూడ శ్రేయస్సాధనములగుచో కర్మయోగముకంటె దేనిని ద్వారముగ నపేక్షించని సంన్యాసమే యుత్కృష్టము. ఇట్లు సంన్యాసమే యుత్కృష్టమైయుండ "తయోస్తు కర్మసంన్యాసా త్కర్మయోగో విశిష్యతే" కర్మసంన్యాసముకంటె కర్మయోగమే యుత్కృష్ట మని యెట్లు చెప్పెద వనెదవా ? కర్మసంన్యాసముకంటె కర్మయోగమే యుత్కృష్టమైనదని చెప్పుటకు కారణమును చెప్పెదవినుము. ఓఅర్జునా! నీవు జ్ఞానరహితకర్మసంన్యాసమును, కర్మయోగము నుద్దేశించి యీరెంటిలో నేది శ్రేయస్కరము? అని ప్రశ్నించితివి. జ్ఞానము నపేక్షింపక (జ్ఞానరహిత)కర్మసంన్యాసముకంటె కర్మయోగ ముత్కృష్టమైనదని ప్రశ్నమునకు దగు ప్రతివచనమే (సమాధానమే) నాచేచెప్ప

---

—:౫వ. అధ్యాయము ౬వ.శ్లోకవ్యాఖ్యానిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— "సంన్యాసమనునది జ్ఞాననిష్ఠకు హేతువగుటచే నత్యావశ్యకము. కావున పరిశుద్ధముకాని యంతఃకరణకలవాడుకూడ మొట్టమొదటనే యట్టి సంన్యాసమును యెందుకు స్వీకరించడు?" అను యాశంకను "సంన్యాసస్తు" అనుశ్లోకముచే దొలిగించుచుండెను.

"అయోగతః" యోగమనగ నంతఃకరణపరిశోధకము, శాస్త్రీయమునగు కర్మము. అట్టికర్మ నాచరింపకయే హఠాత్తుగ సంన్యాసమునే స్వీకరించినచో నట్టి సంన్యాసము దుఃఖమునకొఱకే యగును. అనగా నట్టి వాడు పరిశుద్ధాంతఃకరణము కలవాడగుటచే తత్ఫలమగు జ్ఞాననిష్ఠ సంభవించదందున, చిత్తశోధక మగు కర్మయందధికారి

**శాంకరభాష్యమ్:—**

(2) సంన్యాస స్తు పారమార్థికో దుఃఖ మాప్తుం ప్రాప్తు మయోగతో యోగేన వినా। యోగయుక్తో వైదికేన కర్మయోగేనేశ్వరసమర్పితరూపేణ ఫలనిరపేక్షేణ యుక్తో మునిర్మననాదీశ్వరస్వరూపస్య మునిర్బ్రహ్మ పరమాత్మజ్ఞానలక్షణత్వా త్ప్రకృతస్సంన్యాసో బ్రహ్మో

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

బడెను. జ్ఞానసహితసంన్యాసమే సాంఖ్యమని నాయభిప్రాయము. అట్టి జ్ఞానసహితసంన్యాసమే పరమార్థయోగము. వైదికమగు కర్మయోగమే పరమార్థసంన్యాసయోగము నిమిత్తమగుటవలన సంన్యాసమని యోగమనియు యుపచరించబడును. జీవజ్ఞాపక కర్మసంన్యాస శబ్దముచేచెప్పబడని కర్మయోగమును బోధించుటకు సంన్యాసశబ్దమును ప్రయోగించుటే యౌపచారిక ప్రయోగమనబడును. కర్మయోగము పరమార్థసంన్యాసయోగమునిమిత్త మెట్లగుననెదవా?

(2) కర్మానుష్ఠానము లేనిచో నంతఃకరణము శుద్ధము కానేరదు. అంతఃకరణపరిశుద్ధి లేనిచో సమ్యగ్జ్ఞానరూపమగు సంన్యాసమును పొందుట శక్యము కాదని 'సంన్యాసస్తు మహాబాహో! దుఃఖమాప్తు మయోగతః' అను పూర్వార్థముచే వ్యతిరేకము నుపన్యసించి 'యోగయుక్తః' అను యుత్తరార్థముచే అన్వయము నుపన్యసించుచుండెను. ఫలనిరపేక్షముగ నీశ్వరసమర్పితమగు వైదికకర్మయోగముతో గూడినట్టియు, ఈశ్వరస్వరూపముయొక్క మననమువలన ముని యనఁబడువాడు - పరమాత్మజ్ఞానరూపమగుటవలన ప్రకృతసంన్యాసము 'బ్రహ్మ' అని యనఁబడును. మరియు 'న్యాస ఇతి బ్రహ్మ, బ్రహ్మ హి పరః' అను శ్రుతివలనగూడ పరమార్థసంన్యాసము బ్రహ్మమనఁబడును. అట్టి పరమాత్మజ్ఞాననిష్ఠారూపమగు సంన్యాసమును శీఘ్రముగనే పొందుచున్నాడు. కాన నాచే 'కర్మయోగో విశిష్యతే' కేవల కర్మసంన్యాసముకంటె కర్మయోగమే యుత్కృష్టమని చెప్పఁబడెను. ఇచట తత్త్వ మిది. సంన్యాసము విద్వత్సంన్యాసమనియు, వివిదిషాసంన్యాసమనియు రెండువిధములు. అందు విద్వత్సంన్యాసము జ్ఞానికి సంభవించు పరమాత్మజ్ఞానరూపసంన్యాసము. కనుకనే 'జ్ఞానం సంన్యాసలక్షణం' అని చెప్పఁబడెను. జ్ఞానికి కర్మయోగము మంచిదా? లేక కర్మసంన్యాసము మంచిదా? యనిన కర్మయోగము

**కాపలయును, కర్మబ్రహ్మభియుభ్రష్టుడగుటచే పరమసంకటమును పొందు నని యాశయము. కర్మయోగముతో గూడినవాడు పరిశుద్ధాంతఃకరణము కలవా డగుటవలన మననశీలు డగు సంన్యాసియై ప్రతిబంధకము లేమింజేసి శీఘ్రముగనే సత్యజ్ఞానాదిలక్షణ మగు యాత్మను సాక్షాత్కరింపఁజేసికొనును. ఈవిషయమే "న కర్మణా మనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే, న చ సంన్యసనా దేవ సిద్ధిం సమధిగచ్ఛతి" అను గీతావాక్యమునం దింతకు పూర్వమునందే చెప్పఁబడెను. కానసాంఖ్యయోగములు (సంన్యాసకర్మయోగములు)రెండును నేకఫలముకలవైనను కర్మసంన్యాసముకంటె కర్మయోగమే యుత్కృష్టమని పూర్వమునందుచెప్పబడినవిషయము సమంజసము. ౬.**

**శంకరానందీయము:— సంన్యాసకర్మయోగములు రెండును పూర్వోక్తన్యాయముచే మోక్షైకఫలకములు కావ నపక్వమగు నంతఃకరణముకల మోక్షార్థి కర్మనే యాచరించవలయును. సంన్యాసము స్వీకరింపవలదు. అట్టివానికి సంన్యాసము దుర్ఘట మని యుపదేశించుచు కర్మలచే పక్వమగు నంతఃకరణకలవాడు సంన్యాసమును స్వీకరించవలయునని "సంన్యాస స్తు" అను శ్లోకముచే నుపదేశించుచుండెను.**

**శాంకరభాష్యమ్ః—**

చ్యతే 'న్యాస ఇతి బ్రహ్మ బ్రహ్మ హి పరః' ఇతి శ్రుతేః । బ్రహ్మ పరమార్థసంన్యాసరూపం పరమాత్మజ్ఞాననిష్ఠాలక్షణం న చిరేణ క్షిప్రమేవాధిగచ్ఛతి ప్రాప్నోత్యతో మయో క్తం కర్మయోగో విశిష్యత ఇతి । ॥౬॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

వలన ప్రాప్తించెడి చిత్తశుద్ధిని పొందియే జ్ఞాని యగుటవలన నట్టివిద్వాంసునకు కర్మయోగము వలన సాధింపఁదగినదేదియు లేనందున కర్మయోగమవసరము లేదు. మరియు కర్తృత్వాభిమానము కలవాడే కర్మయందు ప్రవృత్తు డగుటంబట్టి విద్వాంసునకు కర్తృత్వాభిమానాదులు నష్టము లగుటచే కర్మమునందు ప్రవృత్తియే సంభవింపదు. ప్రారబ్ధకర్మశేషముచే బాధితమగు నవిద్యానువృత్తిచే కర్మముల నాచరించినను నవి - అహంకారాభిసంధ్యాదులు లేమింజేసి కర్మాభాసములే యగును. అనగా జ్ఞానికృతమగు కర్మము కర్మమే కాదు, కర్మాభాసమే యగును. కాన నట్టికర్మ మజ్ఞానికి మోక్షము ప్రాప్తించుటయందు జ్ఞానమునకు సహకారి కానందున కర్మసహకృతజ్ఞానమే మోక్షమునకు కారణమనెడి సముచ్చయవాది యగు తిలకమహాశయునిమతము నిరస్తము.

ఈయధ్యాయమునందు వివిదిషాసంన్యాసికే కర్మసంన్యాసము శ్రేష్ఠమా? లేక కర్మయోగము శ్రేష్ఠమా? యని వివిదిషాసంన్యాసివిషయమునవే యర్జునునిచే ప్రశ్నింపఁబడెను. వివిదిషాసంన్యాసికి రాగాదులు సంపూర్ణముగ తొలగనందున నతడు కర్మసంన్యాసి యగుటకంటె కర్మయోగి యగుటయే శ్రేష్ఠమని శ్రీకృష్ణపరమాత్మ బోధించెను. ఏలయన? వివిదిషాసంన్యాసి కర్మములనువదలినచో నతనికి విషయములయందభిరుచి యవిద్యాసంబంధమువలన తప్పకకలుగును. అంతఃకరణము విషయాభిముఖమగుచో సంసారకూపపతనము తప్పదు. ఆశ్రమము భ్రష్టమగుట తప్పక సంభవించునని యతనికి కర్మసంన్యాసముకంటె కర్మయోగము శ్రేష్ఠమని బోధించెనని గ్రహింపనగును. ఈవిషయమే ముందుశ్లోకములయందు స్పష్టమగును. ॥౬॥

"అయోగతః" కర్మయోగానుష్ఠానజన్యచిత్తశుద్ధి లేనిచో జ్ఞాననిష్ఠారూపమగు సంన్యాసము పొందుట దుర్ఘటము. ఎందులకనగా జ్ఞాననిష్ఠారూపమగు సంన్యాసము కేవలచిత్తశుద్ధిసాధ్యము కాన కారణము లేనిచో కార్యము సంభవింప దను న్యాయమున కర్మసంభావిత మగు చిత్తశుద్ధి లేనిచో కార్యమగు జ్ఞాననిష్ఠారూపమైన సంన్యాసము సంభవింపదు. ఇట్లు సంన్యాసము కర్మయోగానుష్ఠానమువలన ప్రాప్తించినయొక చిత్తప్రసాదమువలననే లభ్యమని నిశ్చయించి కర్మయోగముచే పక్వమైన నంతఃకరణము కల ముముక్షువు సంన్యాసమును స్వీకరింప వలయునని యాశయముచే 'యోగయుక్తః' అని చెప్పఁబడలిడెను.

ఈశ్లోకముయొక్క యుత్తరార్ధముచే వివిదిషాసంన్యాసము చెప్పఁబడెను. కర్మయోగానుష్ఠానమువలన కలిగినచిత్తప్రసాదముతోగూడిన ముని (గృహస్థుడు) "న్యాస ఇతి బ్రహ్మ బ్రహ్మ హి పరః" అను శ్రుతి ననుసరించి యిచట బ్రహ్మశబ్దము సంన్యాసవాచకము. అనగా బ్రహ్మస్వరూపముగ నవస్థానరూపమగు ప్రధాన సంన్యాసమును పరిపక్వాంతఃకరణముకలవాడై యగుటవలన ముముక్షువై యధికారియై శీఘ్రముగ నే పొందుచున్నాడు.

లేక, "యోగయుక్తః" కర్మయోగసంభావితచిత్తశుద్ధియుక్తుడై స్వయముగ ముముక్షువై నిరుక్తలక్షణసంన్యాసియై తన్నిష్ఠచేతనే శీఘ్రముగ "బ్రహ్మైవాహం" నేను బ్రహ్మస్వరూపమే యనెడి యప్రతిబద్ధ

గీ॥ యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః ।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే ॥ ॥౭॥

పదవిభాగము:— యోగయుక్తః-విశుద్ధాత్మా-విజితాత్మా - జితేన్ద్రియః - సర్వభూతాత్మభూతాత్మా - కుర్వన్-అపి-న-లిప్యతే॥ ॥౭॥

ప్రతిపదార్థము:—యోగయుక్తః=కర్మయోగముతో గూడినట్టియు; విశుద్ధాత్మా=పరిశుద్ధమైన యంతఃకరణము కలిగినట్టియు; విజితాత్మా=జయించబడిన శరీరము కలిగినట్టియు; జితేన్ద్రియః=జయించబడిన యింద్రియములు కలిగినట్టియు; సర్వభూతాత్మభూతాత్మా=సర్వభూత=బ్రహ్మాదిస్తంబపర్యంత భూతములకు; ఆత్మభూత=ఆత్మస్వరూపమగు; ఆత్మా=ప్రత్యగాత్మ కలవాడు; (సమ్యగ్జ్ఞానము కలవాడు) కర్మ=(ఈపదమధ్యాహార్యము) కర్మమును; కుర్వన్నపి=చేయువాడైనను; నలిప్యతే=కర్మలచే బంధింపబడడు. ॥౭॥

---

వృత్తిచే తనను బ్రహ్మస్వరూపముగ దెలిసికొనును. ఈచెప్పుటవలన దేలిన యాశయమేమి? అపక్వాంతఃకరణము కలవాడు కర్మసంన్యాసమును స్వీకరించినను, ముఖ్యసంన్యాసము సిద్ధించదు. పరిపక్వాంతఃకరణముకలవానికి బాహ్యసంన్యాసము, ఆంతరసంన్యాసముకూడ సిద్ధించుటయే కాక తత్ఫలమగు సర్వాత్మత్వప్రతిపత్తిగూడ సిద్ధించు నని యీశ్లోకముచే సూచింపఁబడెను. ॥౬॥

శ్రీధరీయము:— కర్మయోగము లేనిదే సంన్యాసము స్వీకరించుట దుఃఖహేతువు. అనగాచిత్తశుద్ధి లేనందున జ్ఞాననిష్ఠ లేమింజేసియు, దుఃఖహేతువు. అనగా నశక్యమని యర్థము. కర్మయోగయుక్తుడన్నచో శుద్ధమైన చిత్తముకలవాడగుటఁజేసిసంన్యాసియై శీఘ్రముగ నపరోక్షరూపమగు బ్రహ్మమును దెలిసికొనుచున్నాడు. అందువలన చిత్తశుద్ధిలేనివానికి ప్రథమమున సంన్యాసముకంటె కర్మయోగమే యుత్కృష్టమని "తయోస్తుకర్మసంన్యాసాత్కర్మయోగో విశిష్యతే" అనిశ్రీకృష్ణపరమాత్మ చెప్పిన విషయమే యిచటను సిద్ధము ఈవిషయముచే "ప్రమాథినో బహిశ్చిత్తాః పిశునాః" కలహోత్సుకాః సంన్యాసినోఽపి దృశ్యన్తె దైవసందూషితాశయాః" కొందఱు సంన్యాసులు ప్రమాదముకలవారై అనగా భాష్యప్రవచనము మాయధీనమే యని యహంకృతిచే భాష్యకారులనుకూడ లెక్కింపక అనుశయశబ్దార్థమున కన్యథా వ్యాఖ్యానించుచు యెవరైన భాష్యకారుల యాశయ మదియేనా యని శంకించినవారిని దూషించుటయే కాక భాష్యకారు లెంత? నీగురువెంత? యని కోపావిష్టులై ప్రమాదమును బొందుచుందురు. మరియు నిషిద్ధమగు పాదరక్షలను యుద్ధభటులవలె స్వీకరించుచు కంచుకతాంబూలచర్వణాదులయందు చిత్తముకలవారై పరునియందు లేని దోషములను సూచించుచు దైవసంపద్విశిష్ట బ్రాహ్మణులయందు మఠాధీశ్వరులయందాంధ్రపత్రికాప్రేషణద్వారమున తనఖలరూపమునుప్రకటించుచు దైవదూషితాశయములు కలవారగు కొందరు సంన్యాసులు గలరని వార్తికకారు లీయనధికారిసంన్యాసులనే స్పష్టపరచిరి.

—: ౫వ అధ్యాయము ౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— కర్మలు బంధహేతువులుకదా ! అట్టి కర్మయోగముకలవాడచిరకాలమునసే మోక్షమును బొందునని చెప్పుట యెట్లుపొసగునను శంకను "యోగయుక్తః" అనుశ్లోకముచే తొలిగించుచుండెను.

భగవదర్పణము, ఫలాభిసంధిరాహిత్యము మొదలగు గుణములతోగూడిన శాస్త్రీయకర్మమే యోగమనుపించుకొనును. అట్టి కర్మయోగముతో గూడిన పురుషుడు ప్రథమమున "విశుద్ధాత్మా" రజస్తమస్సులచే నకలుషితమైన యంతఃకరణ కలవాడై, యనంతరమున "విజితాత్మా" స్వాధీనమొనరించుకొనిన దేహముకలవాడై "జితేంద్రియః" స్వాధీనమొనరించుకొనిన సర్వబాహ్యేంద్రియములుకలవాడై, ఈచెప్పుటవలన "వాగ్దండోథమనో దండః కాయదండ స్తథైవ చ। యస్యైతే నియతా దండా స త్రిదండీతి కథ్యతే" అని మనువు చెప్పిన రీతిని

శాంకరభాష్యమ్:—

యదా పున రయం సమ్యగ్దర్శనప్రాప్త్యుపాయత్వేన యోగేన యుక్తో యోగయుక్తో విశుద్ధాత్మా విశుద్ధసత్త్వో విజితాత్మా విజితదేహో జితేన్ద్రియశ్చ సర్వభూతాత్మభూతాత్మా సర్వేషాం బ్రహ్మాదీనాం స్తంబపర్యంతానాం భూతానా మాత్మభూత ఆత్మా ప్రత్యక్చేతనో యస్య స సర్వభూతాత్మభూతాత్మా సమ్యగ్దర్శీత్యర్థః । స తత్రైవం వర్తమానో లోకసంగ్రహాయ కర్మ కుర్వన్నపి న లిప్యతే న కర్మభి ర్బధ్యత ఇత్యర్థః । ॥౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సంన్యాసమును గ్రహియించి శ్రవణమనననిదిధ్యాసనరూపాదిసాధనముల ననేక సారు లనుష్ఠించి సమ్యగ్దర్శనమును పొందినవాడుగూడ పూర్వమునందువలె కర్మములనాచరించుచునే యుండును. అట్టివాని కాకర్మములు బంధహేతువు లెందుకు కావు? అని శంకింపవలదు ఎపుడు సమ్యగ్దర్శనప్రాప్త్యుపాయముగ నిత్యనైమిత్తికకర్మల నాచరించునో అట్టివాని యంతఃకరణము నిత్యకర్మముల నాచరించుటవలన రజస్తమస్సులచే కలుషితము కాదు. కనుక అట్టిపురుషుడు పరిశుద్ధమైన యంతఃకరణము కలవాడగును. కనుకనే దేహమును జయించువాడగును. అనగా దేహాదులయందు మమత్వాద్యభిమానము లేనివాడగును. కనుకనే జితేంద్రియుడగును. కనుకనే బ్రహ్మాది స్తంబపర్యంతమగు భూతముల కాత్మభూతుఁడగు పరమాత్మకలవాడగును. అనగా సమ్యగ్దర్శి యగుననుట. అట్టి సమ్యగ్దర్శననిష్ఠుఁడగువాడు లోకసంగ్రహార్థము నిత్యనైమిత్తికకర్మముల నాచరించువాడైనను కర్మములచే వాడు బంధింపఁబడఁడని యర్థము. ॥౭॥

త్రిదండియై "సర్వభూతాత్మభూతాత్మా - సర్వే భూతాః ఆత్మభూతశ్చ ఆత్మా స్వరూపం యస్య సః" జడాజడాత్మకమగు నిఖిలమును ఆత్మమాత్రముగ చూచువాడై (ఇచట "సర్వేషాం భూతానామాత్మభూతః ఆత్మా యస్య" సర్వభూతముల కాత్మభూతమైన యాత్మకలవాడై యని కొందరు వ్యాఖ్యానించిరి. ఇట్టి వ్యాఖ్య నాదరించినచో "సర్వభూతాత్మా" అనునంతమాత్రముచేతనే పై యర్థము లభించుచుండ "ఆత్మభూత" అను పద మధికము (వ్యర్థము) కావలసివచ్చును. సర్వపదము, ఆత్మపదము జడాజడపర మన్నచో సమంజసమగును) అనగా పరమార్థదర్శియై పరదృష్టిచే కర్మల నాచరించుచున్నను తన దృష్టిచే కర్మలు లేనందున నాకర్మలచే బంధింపబడడు. ॥౭॥

శంకరానందీయము:— సత్కర్మానుష్ఠానశుద్ధచిత్తుడు, సర్వాత్మభావాపన్నుడు నగు బ్రహ్మవిత్తు శారీరకమగు యత్కించిత్కర్మమును జేసినను లేపమును పొందనేరడని యీశ్లోకమున జెప్పుచున్నాడు.— "యోగయుక్తః" చిరానుష్ఠితమగు కర్మయోగముకలవాడు లేక బ్రహ్మనిష్ఠారూపమగు సంన్యాసయోగముతో కూడినవాడు (అనగ చిరానుష్ఠితసమాధియోగ్యుడని యర్థము) కనుకనే "విశుద్ధాత్మా" రాగద్వేషాదిదోషములచే నిశ్శేషముగ వియుక్తమగు మనస్సు కలవాడు. కనుకనే "జితేంద్రియః" విషయగ్రహణమునందు విముఖములుగా జేయబడిన జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు కలవాడు; (ఇట్టి విశుద్ధాత్మత్వము, జితేంద్రియత్వము చిరకాలసమనుష్ఠితసమాధిలభ్యములు.) కనుకనే "విజితాత్మా" నిర్జితమైన బాహ్యవాసనారూపమగు స్వభావము కలవాడు; (సమాధిచే నిర్మూలితమగు అనాత్మవాసన కలవాడనియర్థము.) కనుకనే "సర్వభూతాత్మభూతాత్మా" బ్రహ్మాదిస్తంబపర్యంతమగు సర్వభూతములకు స్వరూపభూతమగు ప్రత్యగ్రూప బ్రహ్మము స్వాత్మగ కలవాడు; "ప్రాణోహ్యేష సర్వభూతైర్విభాతి" "అహమేవేదం సర్వం" ఇత్యాదిశ్రుత్యర్థానుభవముచేతను, స్వానుభవముచేతను సర్వాత్మత్వమును పొందినట్టి పైవిశేషణవిశిష్టుడగు బ్రహ్మవేత్త— "కుర్వన్నపి న లిప్యతే" విధివిహి-

శ్లో॥ నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్ ।
పశ్యన్శృణ్వన్స్పృశన్ జిఘ్రన్నశ్నన్గచ్ఛ న్స్వప న్శ్వసన్ ॥ ॥౮॥
శ్లో॥ ప్రలప న్విసృజ న్గృహ్ణ న్నున్మిష న్నిమిష న్నపి ।
ఇన్ద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్ ॥ ॥౯॥

**పదవిభాగము :—** న-ఏవ-కిం-చిత్-కరోమి-ఇతి-యుక్తః-మన్యేత-తత్త్వవిత్-పశ్యన్-శృణ్వన్-స్పృశన్-జిఘ్రన్-అశ్నన్-గచ్ఛన్-స్వపన్-శ్వసన్ ॥ ॥౮॥

ప్రలపన్-విసృజన్-గృహ్ణన్-ఉన్మిషన్-నిమిషన్-అపి-ఇన్ద్రియాణి-ఇన్ద్రియార్థేషు-వర్తన్తే-ఇతి-ధారయన్ ॥

**ప్రతిపదార్థము :—** యుక్తః=సమాహితాంతఃకరణముకలి; తత్త్వవిత్=ఆత్మయాథాత్మ్యమును తెలిసికొనినవాడు; పశ్యన్=చూచువాడైనను; శృణ్వన్=వినుచుండినవాడైనను; స్పృశన్=స్పృశించువాడైనను; జిఘ్రన్=అఘ్రాణించువాడైనను; అశ్నన్=భక్షించువాడైనను; గచ్ఛన్=నడచువాడైనను; స్వపన్=నిద్రించువాడైనను; శ్వసన్=నిట్టూర్పువిడుచువాడైనను; ప్రలపన్=మాట్లాడువాడైనను; విసృజన్=విసర్జనచేయువాడైనను; గృహ్ణన్=గ్రహించువాడైనను; ఉన్మిషన్=కనురెప్పలను తెరచువాడైనను; నిమిషన్నపి=కనురెప్పలను మూయువాడైనను; ఇన్ద్రియాణి=ఇన్ద్రియములు; ఇన్ద్రియార్థేషు=విషయములయందు; వర్తన్తే=ప్రవర్తించుచున్నవి; ఇతి=ఈవిధము; ధారయన్ = నిశ్చయము కలవాడై; కించిత్ = కొంచముకైన; నైవకరోమి = చేయువాడను కాను; ఇతి = ఇట్లు; మన్యేత=తలచును. ॥౮-౯॥

---

తమైనట్టిది కాని. విధివిహితయుకొంట్టిది కాని, యెట్టి కర్మను జేసినను కర్మమునందకర్మత్వజ్ఞానము కలవాడగుటచే పుణ్యకర్మచే గాని పాపకర్మచే గాని లేపమును బొందడు.

"లోకసంగ్రహ మేవాపి" అనువాక్యముచే కర్తవ్యములుగ బ్రాప్తములగు శాస్త్రీయకర్మములనే బ్రహ్మవేత్త జేయదగియుండ, శరీర యాత్రార్థమగు కర్మను జేసినను బ్రహ్మవేత్త లేపమును బొందనేరడని చెప్పుట శాస్త్రవిరుద్ధముకాదా' యని శంకింపవలదు. బ్రహ్మవేత్త— స్వీయమగు అవిక్రియబ్రహ్మాత్మజ్ఞానముచే నిశ్శేషవినష్టమిథ్యాజ్ఞానము కలవాడు కావున బ్రహ్మాత్మవిజ్ఞానమునకు విపరీతమగుయజ్ఞానమే కారణముగా కల కర్మయోగము బ్రహ్మవేత్తకు సంభవింపనేరదు. అధిష్ఠానమగు కూటస్థాసంగచిద్రూపమునే యాత్మనుగ తెలుసుకొనిన విద్వాంసునకు తద్విపరీతమగు అనాత్మతాదాత్మ్యము సంభవింపదు కావున యనాత్మతాదాత్మ్యభినివేశనిష్పాద్యమగు కర్మయోగము స్వప్నమందునను సంభవింపనేరదు. మఱియు విధివాక్యము విధానము పొందదగు నన్నిటిని మిథ్యగా దెలిసికొనిన బ్రహ్మవేత్తకు విధేయమగు కర్మయోగము సంభవింపనేరదు; మరియు, "యోగయుక్తో మునిర్బ్రహ్మాధిగచ్ఛతి" అను వాక్యముచే సర్వకర్మసంన్యాసమే యవగతమగుటచేకూడ కర్మయోగము బ్రహ్మవేత్తకు సంభవింపనేరదు. "పశ్యన్ శృణ్వన్" అనుస్థలమున కర్మక్రియ పదమూడు విధములుగ కూర్చియవాణ మగుచున్నను దీనిని వైదికమనుటకు వీలులేదు. ఏలన వైదికకర్మ పదమూడువిధములుగ జేయుటకు సంభవింపదు. కావున "పశ్యన్శృణ్వన్" అనుస్థలమున చెప్పబడిన కర్మక్రియ వైదికము కానేరదు. ఇక బ్రహ్మవేత్తకు అహారాదికమునందు అట్టి పదమూడువిధములైన కర్మ సంభవించును గాని విధివిహిత కర్మలేశముచే లేపము కల్గునని యూహించుటకు వీలులేదు. కనుకనే "తస్య కార్యం న విద్యతే" అని చెప్పబడెను. గాన నిట శాస్త్రవిరోధ మేమియు లేదు.

## —:౫వ అధ్యాయము — ౮, ౯ శ్లోకవ్యాఖ్యా విశేషములు—

మధుసూదనసరస్వతీయము:—

బ్రహ్మవేత్త కర్మలచే లేపమును బొందడనువిషయమునే రెండుశ్లోకముచే వివరించుచున్నాడు. — చక్షురాదిజ్ఞానేంద్రియములు, వాగాదికర్మేంద్రియములు, ప్రాణాదివాయువులు, అంతఃకరణచతుష్టయము వీటిచే నానాచేష్టలు చేయబడుచుండగ "ఇంద్రియా ణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్" ఇంద్రియములు పొందదగిన వన్నియు వాటి వాటి విషయములయందు ప్రవర్తించుచున్నవి గాని నేను ప్రవర్తించుట లేదని నిశ్చయించి

శాంకరభాష్యమ్ :—

నచాసౌ పరమార్థతః కరోత్యతః — నైవ కించిత్కరోమీతి యుక్తః సమాహితస్సన్మన్యేత చింతయేత్ తత్త్వవిదాత్మనో యాథాత్మ్యం తత్త్వం వేత్తీతి తత్త్వవిత్పరమార్థదర్శీత్యర్థః । కదా కథం వా తత్త్వమవధారయన్మన్యేతేత్యుచ్యతే—మన్యేతేతి పూర్వేణసంబంధః । యస్యైవం తత్త్వవిదః సర్వకార్యకరణచేష్టాసు కర్మస్వకర్మైవ పశ్యతః సమ్యగ్దర్శినస్తస్య సర్వకర్మసంన్యాస ఏవాధికారః కర్మణోఽభావదర్శనాత్ । నహి మృగతృష్ణికాయా ముదకబుద్ధ్యా పానాయ ప్రవృత్త ఉదకాభావజ్ఞానేపి తత్రైవ పానప్రయోజనాయ ప్రవర్తతే । ॥౮-౯॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—

ఇంతకు పూర్వమునందు విద్వాంసునకు కర్మల నంగీకరించి యట్టికర్మములు విద్వాంసునకు బంధకములు కావని చెప్పఁబడెను. ఈశ్లోకమునందు వస్తుతః విద్వాంసునకు కర్మములే లేవని చెప్పుచుండెను.

సమాహితచిత్తముకల విద్వాంసుఁడు ఆత్మయాథార్థ్యము తెలిసినవాడు అనగా పరమార్థదర్శి రూపమును చూచుచున్నను, శబ్దమును వినుచున్నను, వస్తువులను స్పృశించుచున్నను, గంధము నాఘ్రాణించుచున్నను, ఫలాదులను భక్షించుచున్నను, నడచుచున్నను, నిద్రించుచున్నను, నిట్టూర్పువిడుచుచున్నను, మాటలాడుచున్నను, పాయ్వింద్రియాదులచే విసర్జనము చేయుచున్నను, హస్తములచే గ్రహించుచున్నను, ఉన్మేషనిమేషములను చేయుచున్నను, అనగా త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణరూప జ్ఞానేంద్రియపంచకముచేతను, వాక్పాదపాణిపాయూపస్థరూపమగు కర్మేంద్రియపంచకముచేతను, మనోబుద్ధిచిత్తాహంకారములచేతను, ప్రాణాపానవ్యానోదానసమానములచేతను, తత్తచ్చేష్టలను చేయుకాలమందుకూడ నాయావిషయములయం దింద్రియాదులే ప్రవర్తించుచున్నవి అను నిశ్చయము కలవాఁడై నేనేమియు చేయుటలేదని తలచును. సర్వకార్యకరణచేష్టారూపమగు కర్మములయం దకర్మమును చూచునట్టి సమ్యగ్దర్శి యగునట్టి వానికి కర్మల యభావదర్శనమువలన సర్వకర్మసంన్యాసమునందే యధికారము. మృగతృష్ణికయందుదకబుద్ధిచే పానముకొఱకు ప్రవృత్తుఁడైనవాఁ డుదకాభావజ్ఞానము కలిగినపిమ్మట నామృగతృష్ణికయందు పానప్రయోజనమునకు ప్రవర్తించడు. (అట్లే సర్వజగము మిథ్యాభూతమను జ్ఞానము కలవానికి కర్మమునందు ప్రవృత్తి సంభవింపనందున సంన్యాసమునందే యధికారము నిశ్చితమగుచున్నది) ॥౮-౯॥

"నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్" పరమార్థదర్శియగు సమాహితచిత్తుడు నేనేమియు చేయుట లేదని తలచును. లేక "యుక్తః" కర్మయోగయుక్తుఁడై యనంతర మంతఃకరణశుద్ధిద్వారమున తత్త్వవేత్తయై నేనేమియు చేయుట లేదని తలంచునని సంబంధము. ఇట దర్శనశ్రవణస్పర్శనాఘ్రాణాశనములు క్రమముగా చక్షుశ్శ్రోత్రత్వగ్ఘ్రాణరసనరూపములగు పంచజ్ఞానేంద్రియములయొక్క వ్యాపారములు. ఇట్టి వ్యాపారములు "పశ్యన్ స్పృశన్ శృణ్వన్ జిఘ్రన్నశ్నన్" అనుపదములచే చెప్పబడెను. గమనము పాదములయొక్కయు, ప్రలాపము వాగింద్రియముయొక్కయు, విసర్గము పాయూపస్థలయొక్కయు, గ్రహణము హస్తముల యొక్కయు వ్యాపారములు. వీటిని 'గచ్ఛన్ ప్రలప న్విసృజ న్గృహ్ణన్' అనుపదములచే జెప్పెను. "శ్వసన్" అనుపదముచే ప్రాణాదిపంచకవ్యాపారము ఉపలక్షణవిధముగ గ్రహింపవగును. "ఉన్మిష న్నిమిషన్" అనుపదములచేనాగ

గీ॥ బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వా కరోతి యః ।
లిప్యతే న స పాపేన పద్మపత్ర మివామ్భసా ॥ ॥౧౦॥

పదవిభాగము :— బ్రహ్మణి-అధాయ-కర్మాణి-సంగం-త్యక్త్వా-కరోతి-యః-లిప్యతే-న-సః-పాపేన-పద్మపత్రం-ఇవ-అమ్భసా ॥

ప్రతిపదార్థము:— యః=ఏయజ్ఞాని; సంగం=ఫలమును; త్యక్త్వా=విడచి; కర్మాణి=సర్వకర్మములను; బ్రహ్మణి-బ్రహ్మమునందు; అధాయ=ఉంచి; కర్మాణి=(ఈపదమావృత్తము) సర్వకర్మములను; కరోతి=చేయునో; సః=అట్టివాడు; అమ్భసా=ఉదకముచే: పద్మపత్రమివ=తామరాకువలె; పాపేన=ధర్మాధర్మరూపమగుపాపముచే; నలిప్యతే=బంధించఁబడడు. ॥౧౦॥

---

కూర్మాదిపంచవాయువులయొక్కయు, 'స్వపన్' అనుపదముచే అంతఃకరణచతుష్టయముయొక్కయు వ్యాపారము గ్రహింపనగును. ఈశ్లోకము అర్థక్రమమును బట్టి పాఠక్రమమును విడదీసి వ్యాఖ్యానింపబడెను. బ్రహ్మవేత్త సర్వవ్యాపారములయందును తన నకర్తనుగా తెలిసికొనును గాన శరీరనిర్వర్త్యమగు కర్మము చేసినను నాకర్మచే లేపమును పొందడనుట యుక్తమని భావము.

శంకరానందీయము:— యోగయుక్తత్వము మొదలగు నైదు విద్వల్లక్షణములతో గూడిన బ్రహ్మవేత్త యాహారాదికమునందు ప్రవృత్తుడైనను దర్శనాదీంద్రియవ్యాపారములయందు "నేను కర్తను గాను" అను బుద్ధితో నుండదగునని రెండుశ్లోకములచే చెప్పుచున్నాఁడు. "తత్త్వవిత్" ఆత్మయాథార్మ్యజ్ఞుడగు బ్రహ్మవేత్త; "యుక్తః" తాను కూటస్థత్వాసంగత్వాంతర్బహిఃపూర్ణత్వజ్ఞానరూపమగు ప్రజ్ఞతో గూడినవాడై, స్వయముగ వ్యావహారిక దృష్ట్యా "పశ్యన్—నిమిషన్నపి" చూచుచున్నను, భక్షించుచున్నను, నిద్రించుచున్నను, శ్వసించుచున్నను, నిశ్వసించుచున్నను, ఉన్మేషనిమేషములజేయుచున్నను, "ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్" చక్షుగాదీంద్రియములు తత్తద్విషయములయందు ప్రవర్తించుచున్నవిగాని 'నేనుద్రష్టను, శ్రోతను, స్ప్రష్టను, ఘ్రాతను, భోక్తను, కర్తను గా' నను యంతఃకరణవృత్తిని సర్వథా ధరించుచు "నైవ కించిత్కరో మీతి—మన్యేత" ఆయాకర్మల నాయా యింద్రియములే చేయుచున్నవిగాని నేను నిష్క్రియుడ నగుట నేమియు చేయుటలేదు ఇక నేమనః—నాయా క్రియలకు సాక్షిమాత్రుడనై నిష్క్రియాత్మస్వరూపముగ నూరక యుందునని తలచును. తనను ఆయాకర్మలయందు నిష్క్రియునిగ నెఱుగును. దేహేంద్రియవ్యాపారములయందు 'నేను, నాది' యను భావననువిడచి బ్రహ్మవేత్త యుదాసీనుడుగ నుండవలయును. ఈవిధముగ తననుగూడ బ్రహ్మనుగ దెలిసికొనిన బ్రహ్మవేత్తకు దుష్టాదుష్టాన్నస్వీకారమువలన ప్రాప్తించెడు పాపపుణ్యలేపముండ దని భావము.

—: ౫వ అధ్యాయము—౧౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— నిరుక్తవిధమున బ్రహ్మవేత్త "కర్తృత్వాభిమానశూన్యుడగుటచే గర్మలేపమును బొందకుండునుగాని యవిద్వాంసుడు కర్తృత్వాభిమానముకలవాడగుటవలన కర్మలేపమును బొందునుకదా! అట్టివానికి సంన్యాసపూర్వకమగు జ్ఞాననిష్ఠ యెట్లు పొసంగును?" అను నాశంకమీదచెప్పుచున్నాడు—

భృత్యుడు ప్రభువునిమిత్త మాచరించినట్లు ఫలమునందుకోరికను వీడి పరమేశ్వరార్థ మెవడు లౌకికవైదిక కర్మల నాచరించునో పద్మపత్రముయొక్క పైభాగమున కొంతమాత్ర ముదకమంటనట్టుల యట్టివానిని యాపుణ్యపాపకర్మలు బంధించ నేరవు. ఫలమునపేక్షించక ఈశ్వరార్పణబుద్ధిచే ననుష్ఠించిన కర్మలు బుద్ధిశుద్ధిని కలుగజేయును. ॥౧౦॥

శంకరానందీయము:— అవిక్రియ మగు పరబ్రహ్మమును దెలిసికొనిన బ్రహ్మవేత్తకు కర్మసంబంధము లేకపోవుగాక కర్మలయందు ప్రవృత్తుడు, ముముక్షువు నగు యవిద్వాంసునకు కర్మసంబంధము సంభవించును. అట్టివాని గతి యేమి? అను శంకను "బ్రహ్మ ణ్యాధాయ" అను శ్లోకముచే దొలగించుచుండెను. ఆత్మజ్ఞానశూన్యుడగు ముముక్షువు కర్మఫలమునందు దుఃఖము ప్రాప్తించినను దాని నివృత్తియందుకూడ కోరికను విడచి సగుణము,

**శాంకరభాష్యమ్:—**

యస్తు పున రతత్త్వవి త్ప్రవృత్తశ్చ కర్మయోగే — బ్రహ్మణీశ్వర ఆధాయ నిక్షిప్య తదర్థం కరోమీతి భృత్య ఇవ స్వామ్యర్థం సర్వాణి కర్మాణి మోక్షేపి ఫలే సంగం త్యక్త్వా కరోతి య స్సర్వకర్మాణి, లిప్యతె న స పాపేన న సంబధ్యతే పద్మపత్ర మివాంభసోదకేన । ॥౧౦॥

**శాం: భాష్యతత్త్వబోధిని:—**

అట్లగుచో 'విద్వాంసుఁడువలె నవిద్వాంసుఁడుకూడ పాపము సంభవించునని కర్మలయందు ప్రవర్తించకుండెడిని' అని శంకింపవలదు. ఎవఁడు కర్మల నీశ్వరునియందుంచి అనగా భృత్యుడెట్లు తనప్రభువునిమిత్తము కర్మలనాచరించుచు తత్ఫలమును కోరడో అట్లే యేయజ్ఞాని మోక్షఫలము నందుకూడసక్తి నివదలి భగవదర్థమై సర్వకర్మముల నాచరించునో, అట్టివాడు పద్మపత్రముదకము చేతవలె ధర్మాధర్మాత్మకమగు పాపముచే లేపమునుపొందదు. అనగా ధర్మాధర్మసంబంధ మట్టి వానికిసంభవించదు, ॥౧౦॥

పరమేశ్వరుఁడను నగు నాయందు సర్వకర్మలనుంచి అనగా కర్తృత్వమును, కారయితృత్వమును, భోక్తృత్వమును, భోజయితృత్వమును నాయందే స్థాపనజేసి పరమేశ్వరార్పణబుద్ధిచేతను, శ్రద్ధచేతను, భక్తిచేతను నిత్యనైమిత్తిక కర్మల నెవ డాచరించునో అట్టి సాధకుడు— (పాప మెట్లు జన్మాదికారణమగునో అట్లే పుణ్యముకూడ జన్మాదులకు కారణమగుటచే బంధకముకాన వైదికకర్మరూపమగు పుణ్యముకూడ పాపమేయగును) అట్టిపుణ్యపాపరూపమగు కర్మలచే బంధింపఁబడడు. ॥౧౦॥

పరమార్థప్రపా:—ఎవడు కర్తృత్వాభిమానమును విడిచి దర్శనశ్రవణస్పర్శనాది కర్మలనర్థప్రతీతిరూపమగు బ్రహ్మయం దారోపించి (అనగా యీదర్శన శ్రవణస్పర్శనాదికర్మల నన్నిటిని పరబ్రహ్మమే జేయువాడని నిశ్చయించి) చేయువాడో యట్టివాడు బంధహేతువగు పాపపుణ్యాత్మకమైన కర్మలచే బంధింపఁబడడు. "వద న్వాక్, పశ్యం శ్చక్షుః, శృణ్వ ఞ్ఛ్రోత్రం, మన్వానో మనః, తాన్యస్యైతాని కర్మనామాని" అను శతపథబ్రాహ్మణముకూడ వదన దర్శన శ్రవణ మననాదు లాత్మకర్మలని స్పష్టపరచెను. మఱియు ఋగారణ్యకమునందుగూడ "కోఽయమాత్మేతి వయ ముపాస్మహే కతర స్స ఆత్మా యేన వా పశ్యతి, యేన వా శృణోతి, యేన వా గంధా నాజిఘ్రతి, యేన వాచం వ్యాకరోతి, యేన వా స్వాదు చాస్వాదు విజానాతి, యదేత ద్ధృదయం మన శ్చైత త్సంజ్ఞాన మజ్ఞానం విజ్ఞానం ప్రజ్ఞానం మేధా ధృతి ర్మనీషా జ్యోతి స్స్మృతి స్సంకల్పః క్రతు రసుః కామో వశ ఇతి సర్వా ణ్యేతాని ప్రజ్ఞానస్య నామధేయాని భవన్తి" ఈయాత్మ యెట్టిదని మన ముపాసించవలెను? ఆయాత్మయెట్టివాడు? అని ప్రశ్నించి దేనిచే చూచుచుండెనో, దేనిచే వినుచుండెనో, దేనిచే గంధముల నాఘ్రాణించుచుండెనో, దేనిచే వాక్కును పలుకుచుండెనో, దేనిచే రుచికలదానిని రుచిలేని దానిని తెలిసికొనుచుండెనో అట్టిప్రజ్ఞానమునకు హృదయమని, మనస్సని, సంజ్ఞానమని, అజ్ఞానమని, విజ్ఞానమని, ప్రజ్ఞానమని, ధృతి యని, మనీష యని, జ్యోతిస్సని, స్మృతి యని, సంకల్పమని, క్రతువని, అసువని, కామమని, వశమనియు నామధేయములు. "పశ్య న్ఛృణ్వన్" అనుస్థలమున స్వాపమనగ మనస్సన కింద్రియరహితప్రదేశమందు స్థితియే. అట్టి స్థితి అకస్మాత్తుగ సంకల్పరహితముగనే సంభవించును. అట్లే శ్వాసయు, ఉచ్ఛ్వాసయు, నిమేషము, (రెప్పపాటు) ఉన్మేషము (కనురెప్పలుతెరచుట) సంకల్పరహితముగనే అకస్మాత్తుగ సంభవించును. అట్లే దర్శనస్పర్శనాదులుగూడసంకల్పరహితముగ నకస్మాత్తు సంభవించు నని తత్త్వవేత్త నిశ్చయించుకొనును. బుద్ధిపూర్వకకర్మ లచట కర్తృత్వాభిమానశూన్యత్వమునందు దృష్టాంతముగ చెప్పఁబడెను. కనుకనే యచట "తత్త్వవిత్" అని విశేషణమీయబడెను. కాన దర్శనశ్రవణాదిలౌకికకర్మలన్నియు యాత్మవే యని నిశ్చయించువానికి —పద్మపత్రమునం దుదకముంచినను యాయుదకసంబంధ మాపద్మపత్రముకంటనటుల కర్మసంబంధముండదు. అనగా నట్టివానికి కర్మబంధకము కానేరదని యాశయము. ॥౧౦॥

గీ॥ కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియై రపి ।
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే ॥ ॥౧౧॥

**పదవిభాగము :— కాయేన-మనసా-బుద్ధ్యా-కేవలైః-ఇన్ద్రియైః-అపి-యోగినః-కర్మ-కుర్వన్తి-సఙ్గం-త్యక్త్వా-ఆత్మశుద్ధయే॥** ॥౧౧॥

**ప్రతిపదార్థము:—యోగినః=కర్మానుష్ఠానపరులు; కేవలేన=మమతాజ్ఞానశూన్యమగు; కాయేన=శరీరముచేతను; కేవలేన=మమతాజ్ఞానశూన్యమగు; మనసా=మనస్సుచేతను; కేవలయా=మమతాజ్ఞానశూన్యమగు; బుద్ధ్యా=నిశ్చయాత్మక జ్ఞానముచేతను; కేవలైః=మమతాజ్ఞానశూన్యమగు; ఇన్ద్రియైరపి=ఇంద్రియములచేతను; ఆత్మశుద్ధయే=అంతఃకరణపరిశుద్ధికొఱకు; సఙ్గం=ఫలవిషయకవాంఛను; త్యక్త్వా=విడచి; కర్మ=కర్మను; కుర్వన్తి=చేయుచున్నారు.** ॥౧౧॥

**శాంకరభాష్యమ్—**

కేవలం సత్త్వశుద్ధిమాత్రఫల మేవ తస్య కర్మణస్స్యాత్, యస్మాత్—కాయేన దేహేన మనసా బుద్ధ్యాచ కేవలై ర్మమత్వవర్జితై రీశ్వరాయైవ కర్మ కరోమి న మమ ఫలాయేతి మమత్వబుద్ధిశూన్యై రింద్రియై రపి కేవలశబ్దః కాయాదిభి రపి ప్రత్యేకం సంబధ్యతే। సర్వవ్యాపారేషు మమతావర్జనాయ, యోగినః కర్మిణః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వా ఫలవిషయ మాత్మశుద్ధయే సత్త్వశుద్ధయ ఇత్యర్థః । తస్మాత్తత్రైవ తవాధికార ఇతి కురు కర్మైవ । ॥౧౧॥

**శాంకరభాష్యార్థప్రబోధినీ—**

ఏకారణమువలన—కర్మానుష్ఠానతత్పరులు-మమతాబుద్ధిశూన్యమగు దేహముచేతను,మమతాబుద్ధిరహితంబగు మనస్సుచేతను, మమతాబుద్ధివిహీనమగు బుద్ధిచేతను, మమతాబుద్ధిశూన్యములగు నింద్రియములచేతను అని యీశ్లోకమునందు కల కేవలశబ్దము "కాయేన, మనసా, బుద్ధ్యాచ, ఇంద్రియైరపి" అను శబ్దములతో ప్రత్యేకప్రత్యేక మన్వయింపదగును. అట్లన్వయించుటచే సర్వవ్యాపారములయందు మమత్వమువర్జితమని చెప్పినట్లగును. అట్టి దేహాదులచే నీశ్వరునికొఱకే కర్మనాచరించుచుంటిని, నాయొక్కఫలముకొఱకుకాదని ఫలవిషయకకామనను విడచి యంతఃకరణశుద్ధికొఱకే కర్మనుచేయుచుండిరో, కాన నజ్ఞానిచే నాచరించఁబడిన కర్మము కేవలసత్త్వశుద్ధికొఱకె యగును. అందువలన నోయర్జునా! నీకాకర్మయందే యధికారము కలదు. కాన నీవు కర్మమునే చేయుము. ॥౧౧॥

—:౫వ అధ్యాయము. ౧౧వ. శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

**మధుసూదనసరస్వతీయము:— కనుకనే కర్మయోగులు చిత్తసత్త్వశుద్ధికొఱకు కేవలశరీరముచేతను, కేవలమనస్సుచేతను, కేవలబుద్ధిచేతను, కేవలయింద్రియములచేతను, (అనగా మమతాశూన్యమైన శరీరాదులచేతను) ఈశ్వరునికొఱకే నే నీకర్మల నాచరించుచుంటిని. నానిమిత్తము కాదు. అని కర్మఫలమునందు సంగమును వదలి కర్మలను జేయుచుండిరి "కేవలైః" అనుపదము 'కాయేన, మనసా, బుద్ధ్యా, ఇంద్రియైః' అనుపదములకు విశేషణమగుటచే నిట్టి యర్థము ప్రాప్తించుచున్నది. ॥౧౧॥**

**శంకరానందీయము:—కామనారహితముగ గర్మల నాచరించువారల కేమిఫలము ప్రాప్తించును? అశంకపై యట్టివారల కాత్యంతికసంసారవిధ్వంసవిజ్ఞానమును జనింపజేయు చిత్తశుద్ధియే ఫలముగ ప్రాప్తించు నని జ్ఞాపనమునిమిత్తము"కాయేన" అనుశ్లోకముచే ముముక్షువులు చిత్తశుద్ధినిమిత్తమే కర్మల నాచరించెద రని చెప్పుచుం**

గీ॥ యుక్తః కర్మఫలంత్యక్త్వాశాన్తి మాప్నోతి నైష్ఠికీం ।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే ॥ ॥౧౨॥

పదవిభాగము:—యుక్తః-కర్మఫలం-త్యక్త్వా-శాన్తిం-ఆప్నోతి-నైష్ఠికీం-అయుక్తః-కామకారేణ-ఫలే-సక్తః-నిబధ్యతే ॥ ॥ ౧౨ ॥

ప్రతిపదార్థము:—యుక్తః="ఈశ్వరునికొఱకు కర్మల నాచరించుచుంటిని, నాకుఫలముకొఱకుకాదు" అని సమాహితాంతఃకరణము కలవాడు; కర్మఫలం=కర్మఫలమును; త్యక్త్వా=విడచి; నైష్ఠికీం=నిష్ఠయందగు; శాన్తిం=మోక్షమనెడిశాంతిని; ఆప్నోతి=పొందుచున్నాడు; అయుక్తః=చిత్తసమాధానము లేనివాడు; కామకారేణ=కామప్రేరితుడగుటచే; ఫలే=కర్మఫలముయందు; సక్తః-ఆసక్తుడై (కోరికకలవాడై) నిబధ్యతే=బంధింపబడుచున్నాడు.

---

శాంకరభాష్యమ్:—

యస్మాచ్చ-యుక్త ఈశ్వరాయ కర్మాణి న మమ ఫలా యేత్యేవం సమాహిత స్కర్మఫలం త్యక్త్వా పరిత్యజ్య శాన్తిం మోక్షాఖ్యా మాప్నోతి నైష్ఠికీం నిష్ఠాయాంభవాం సత్త్వశుద్ధిజ్ఞానప్రాప్తిసర్వకర్మసంన్యాసజ్ఞాననిష్ఠాక్రమేణేతి వాక్యశేషః। యస్తు పున రయుక్తోఽసమాహితః కామకారేణ కరణం కారః కామస్య కారః కామకార స్తేన కామకారేణ కామప్రేరిత తయేత్యర్థః। మమ ఫలా యేదం కరోమి కర్మేత్యేవం ఫలే సక్తో నిబధ్యతేతస్త్వం యుక్తోభవేత్యర్థః॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏకారణమువలన 'నీశ్వరునికొఱకు కర్మములు. నాకు ఫలముకై కావు' అని సమాహితుఁడై కర్మఫలమును పరిత్యజించి కర్మల నెవడాచరించునో అట్టివాడు కర్మయోగమువలన సత్త్వశుద్ధిని పొంది తద్ద్వారమున జ్ఞానమును పొంది యటుపిమ్మట సర్వకర్మములను పరిత్యజించి జ్ఞాననిష్ఠాక్రమముచే మోక్షమనెడి శాంతిని పొందుచున్నాడో. ఎవ డసమాహితచిత్తుఁడై కనుక నే కామప్రేరితుఁడు. అట్టివాడగుటచే నాయొక్కఫలముకొఱకీకర్మము నాచరించుచుంటినని ఫలము నందాసక్తుడగునో! అట్టివాడు కర్మలచే బంధింపఁబడుచుండెనో, అందువలన నోయర్జునా! నీవు యుక్తుడవగుము అనియర్థము (అనగా ఫలమును కోఱక నీశ్వరార్థ మీకర్మల నాచరించుచుంటినని కర్మల నాచరించుము అని భావము.) ॥౧౨॥

---

డెను. దేనిచే పురుషుఁడు కర్మఫలములయందు కట్టబడునో యట్టి కామము సంగ మనుపించుకొనును. కర్మయోగు లగు ముముక్షువులు ఫలవిషయకమగు కామమును విడచి పరమేశ్వరప్రీతికొఱకు శరీరముచేతను, మనస్సుచేతను, కేవలయింద్రియములచేతను ఆత్మశుద్ధికొఱకు (సత్త్వశోధనకొఱకే) నియమముగ వైదికకర్మ నాచరించుచుండిరి.

లేక:- చేయదగిన కర్మను మనస్సుచే సంకల్పించి, దానినే రాగద్వేషవివర్జితములైన యింద్రియములచేతను, శరీరముచేతను చేయుచుండిరి.

లేక:—బుద్ధిచే నిశ్చయించబడిన విష్ణ్వాదిదేవతలను మనస్సుచే ధ్యానించుట. కేవలశ్రోత్రేన్ద్రియముచే విష్ణ్వాదుల కథాశ్రవణము, కేవలచక్షుస్సుచే మహాత్ముల దర్శనము, కేవలవాక్కుచే వేదపఠనము, పాదములచే తీర్థాటనాదికము మొదలగు వైదికకర్మలను పరమేశ్వరప్రీతినిమిత్త మాచరించుచుండిరి. ॥౧౧॥

పరమార్థప్రి:— "బ్రహ్మ ణ్యాధాయ కర్మాణి" అను శ్లోకమునందు కర్మయోగమునకు బంధకత్వము లేదని చెప్పి సదాచారముచే మోక్షహేతుత్వము నీశ్లోకమునందు తెప్పుచుండెను.

శరీరముచే స్నానము, ఉపవాసాదులను, మనస్సుచే ధ్యానాదులను, బుద్ధిచే తత్త్వనిశ్చయాదులను, కర్మలయం దభినివేశముతో శూన్యములైన యింద్రియములచే శ్రవణకీర్తనాదిరూపమగు కర్మను కర్మయోగులు ఫలము నందు కాంక్షను (కోరికను) విడచి చిత్తశుద్ధికొఱకై చేయుచుండిరి. ॥౧౧॥

గీ॥　సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వ న్న కారయన్ ॥ ॥౧౩॥

పదవిభాగము:— సర్వకర్మాణి-మనసా-సంన్యస్య-ఆస్తే-సుఖం-వశీ-నవద్వారే-పురే-దేహీ-న-ఏవ-కుర్వన్-న-కారయన్. ॥౧౩॥

ప్రతిపదార్థము:—వశీ=జితేంద్రియుడగు; దేహీ=శరీరసంబంధముకల జీవుడు; మనసా=కర్త్రాదులయం దకర్మదర్శనమనెడి వివేకబుద్ధిచే; సర్వకర్మాణి=నిఖిలకర్మలను; సంన్యస్య=పరిత్యజించి; నవద్వారే=తొమ్మిదిద్వారములుకల; పురే=పట్టణసదృశమగు నీదేహమునందు; నైవ కుర్వన్=దేనిని చేయనివాడై; న కారయన్=దేనిని చేయించనివాడై; సుఖం=సుఖముగ; ఆస్తే=ఉంటున్నాడు. ॥౧౩॥

---

—:౫వ. అధ్యాయము ౧౨వ. శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:—ముముక్షువునకు, తదితరునకు కర్తృత్వాభిమానము సమానమైనను ముముక్షువు కర్మచే ముక్తుడగును; ఇతండు కర్మచే బద్ధుడగు ననుటయం దేమి కారణ మనెదవా?

నేనాచరించు కర్మలు యీశ్వరార్థమే. నాకు ఫలముకొఱకు కాదను యభిప్రాయముకలవాడు యుక్తు డనబడుచున్నాడు. అట్టి యుక్తుడు కర్మఫలమును వదలి కర్మలనాచరించుచు సత్త్వశుద్ధి, దానివలన నిత్యానిత్యవస్తువివేకము, దానివలన సంన్యాసము, అనంతరమున జ్ఞాననిష్ఠ, దానివలన ప్రాప్తమగు మోక్షమనెడి శాంతిని పొందుచున్నాడు. ఎవడు "నేను చేయు కర్మలు యీశ్వరార్థమే, నాకు ఫలముకొఱకు కాదను యభిప్రాయము లేనివాడో అట్టివా డయుక్తు డనిపించుకొనును. అట్టివాడు కామమువలన ప్రవృత్తిచే నాఫలముకొఱకే కర్మ నాచరించుచుంటి నని ఫలమునందు సక్తుడై కర్మచే బంధింపబడుచున్నాడు. అనగా నత్యంతము సంసారబంధమును పొందుచున్నాడు. కాన నోయర్జునా! నీవు కూడ యుక్తుడవై కర్మల నాచరించుము. ॥౧౨॥

శంకరానందీయము:—శ్రద్ధచేతను, భక్తిచేతను, ఈశ్వరప్రీతికొఱకే నిష్కామముగ కర్మల నాచరించువారలకు పైని చెప్పంబడిన రీతికి వ్యతిరేకముగ కర్మల నాచరించువారలకు ఫలవిశేషమును "యుక్తః" అను శ్లోకముచే చెప్పుచుండెను. సదసద్వివేకముగల యెవండు మోక్షేచ్ఛచే తనచే నాచరింపబడు కర్మల ఫలము నపేక్షించక యుక్తుడగునో అనగా లాభాలాభములయందు, సిద్ధ్యసిద్ధులయందు సముడై యెవడు పరమేశ్వరప్రీతికొఱకు కర్మల నాచరించునో, అట్టివాడే కర్మనిష్ఠవలన జనించిన చిత్తశుద్ధిని పొందుచున్నాడు. లేక- కర్మనిష్ఠవలన చిత్తశుద్ధియు, దానివలన జ్ఞానమును పొంది యట్టిజ్ఞాన ప్రకాశితమగు ముక్తిని పొందుచున్నాడు. ఏయవివేకి కామనచే కర్మఫలమునం దాసక్తుడై అయుక్తు డగునో అనగా పైన చెప్పిన విధమున కర్మల నాచరించడో అట్టివాడు జ్ఞానశూన్యుడగుటంజేసి జన్మమరణరూపమగు బంధమును పొందుచున్నాడు.

ఈచెప్పుటవలన దేలిన యాశయ మేమి? కామన లేకుండగ నాచరించబడిన కర్మ మోక్షముకొఱకు సమర్థమగును. కామనచే నాచరించబడిన కర్మ బంధకమగును. అని సూచించబడెను. ॥౧౨॥

—:౫వ. అధ్యాయము ౧౩వ. శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:—పరిశుద్ధముకాని యంతఃకరణకలవానికి కేవలకర్మసంన్యాసముకంటె కర్మయోగమే శ్రేయస్కరమని పూర్వమునందు చెప్పినదానినే విస్తారముగ చెప్పి ప్రస్తుతము పరిశుద్ధాంతఃకరణునకు సర్వకర్మసంన్యాసమే శ్రేయస్కరమని "సర్వకర్మాణి మనసా" అను శ్లోకముచే చెప్పుచుండెను.

ప్రవాసము వెళ్లువాడు పరగృహమునందు గృహపతిపూజాదులచే సంతోషము, తిరస్కారాదులచే నవమానము లేనివాడై అహంకారమమకారశూన్యుడై యెట్లు కాలమును వెళ్లబుచ్చునో అట్లె దేహముకంటె నేను వేరను జ్ఞాన

**శాంకరభాష్యమ్:—**

(1) యస్తు పరమార్థదర్శీ సః—సర్వాణి కర్మాణి సర్వకర్మాణి సంన్యస్య పరిత్యజ్య నిత్యం నైమిత్తికం కామ్యం ప్రతిషిద్ధం చ సర్వకర్మాణి తాని మనసా వివేకబుద్ధ్యా కర్మాదావకర్మ సందర్శనేన సంత్యజ్యేత్యర్థః। ఆస్తే తిష్ఠతి సుఖం త్యక్తవాఙ్మనఃకాయచేష్టో నిరాయాసః ప్రసన్నచిత్త ఆత్మనోఽన్యత్ర నివృత్తబాహ్యసర్వప్రయోజన ఇతి సుఖమాస్త ఇత్యుచ్యతే। వశీ జితేంద్రియ ఇత్యర్థః। క్వ కథమాస్త ఇత్యాహ నవద్వారే పురే సప్తశీర్షణ్యాన్యాత్మన ఉపలబ్ధిద్వారాణ్యర్వాగ్ద్వే మూత్రపురీషవిసర్గార్థే తైర్ద్వారైర్నవద్వారం పురముచ్యతే, శరీరం పురమివ పురమాత్మైకస్వామికం తదర్థప్రయోజనైశ్చేంద్రియమనోబుద్ధివిషయై రనేకఫలవిజ్ఞానస్యోత్పాదకైః పౌరైరివాధిష్ఠితం తస్మిన్నవద్వారే పురే దేహే సర్వం కర్మసంన్యస్యాస్తే।

**శాంకరభాష్యతత్త్వబోధని.—**

(1) అట్లగుచో యెల్లరుఫలమును పరిత్యజించి కర్మలనే యాచరించుగాక, సంన్యాసముతో నేమిప్రయోజనమని శంకింపజనదు. పరమార్థదర్శి (ఆత్మదర్శి) జితేంద్రియుడై కర్మాదులయందకర్మదర్శనమనెడి వివేకబుద్ధిచే నిత్యనైమిత్తిక కామ్యప్రతిషిద్ధములగు నిఖిలకర్మలను పరిత్యజించి, వాఙ్మనఃకాయచేష్టలను పరిత్యజించి, ఆయాసరహితుడై, ప్రసన్నమైన చిత్తముకలవాడై, శిరమునందు యేడుద్వారములు, అధోభాగమునందు మూత్రపురీష విసర్జననిమిత్తమగు ద్వారములు రెండుమొత్తము తొమ్మిదిద్వారములుకల శరీరమనెడి పురము. యీపురము ఆత్మైకస్వామికము, తదర్థమగు ప్రయోజనములు కలిగి నట్టియు, అనేకఫలవిజ్ఞానోత్పాదకములైన యింద్రియమనోబుద్ధివిషయములచే పౌరులచేతను వలె నధిష్ఠించబడిన శరీరమునందు—ప్రవాసి పరగృహమునందువలె పూజాపరిభవాదులచే సంతోషవిషాదరహితుడై, వ్యామోహాదిశూన్యుడై యుండును.

ముకలవాడై స్వేచ్ఛగల కార్యకరణములను స్వాధీన మొనరించుకొనినవా డగుటచే నాయాసహేతువగు కాయవాఙ్మనస్సుల వ్యాపారముతో శూన్యుడగుటవలన ననాయాసముగ నవద్వారములు కల దేహమునందు—నిత్యనైమిత్తిక కామ్య ప్రతిషిద్ధరూపములగు సర్వకర్మలను ‘కర్మణ్యకర్మ యః పశ్యేత్’ అనుస్థలమునందు జెప్పబడినతీరున నకర్త్రాత్మ దర్శనముచే పరిత్యజించి యహంకారమమకారశూన్యుడై ప్రారబ్ధకర్మవశమున నుండును. అజ్ఞానియన్నచో దేహతాదాత్మ్యాభిమానమువలన దేహమునందే యుండును. కార్యకరణసంఘాతవ్యతిరిక్తాత్మదర్శియగు దేహి యట్లు కాడు. అజ్ఞుడు దేహతాదాత్మ్యాభిమానముకలవా డగుటవలన దేహాధికరణమే తనకు కూడ యధికరణమని తలచి దేహము గృహమునందుకాని, భూమియందుకాని, ఆసనమునందుకాని, యుండినచో “నేను గృహమునందు కాని, భూమియందుకాని, ఆసనమునందుకాని యుంటిని” అని తలచును. కాని కార్యకరణసంఘాతాతిరిక్తాత్మ దర్శనము లేమింజేసి “దేహమునందుంటిని” అని మాత్రము తలపడు సర్వకర్మసంన్యాసి యగు కార్యకరణసంఘాతవ్యతిరిక్తాత్మదర్శి యన్నచో కార్యమగు దేహముకంటెను. కరణములగు నింద్రియాదులకన్నను నేను వేరని భేదజ్ఞానము కలవాడగుటవలన “నేను దేహమునందుంటిని” అని తెలిసికొనును. కనుకనే యక్రియమగు నాత్మయందవిద్యచే నారోపితములగు దేహాదివ్యాపారములకు విద్యచే బాధయే సర్వకర్మసంన్యాస మనఁబడును. ఇట్టి యజ్ఞానివైలక్షణ్యముచే తొమ్మిదిద్వారములు కల పురమునందు దేహి యుండును. అను విశేషణము యుక్తమే యగును. వారియందుండు వ్యాపారములుతీరస్థములగు వృక్షములయం దారోపించబడి విద్యచే వాటికి బాధకలిగి.

**శాంకరభాష్యమ్ :—**

(2) కిం విశేషణేన? సర్వో హి దేహీ సంన్యాస్యసంన్యాసీ వా దేహ ఏవాస్తే. తత్రానర్థకం విశేషణమితి। ఉచ్యతే, యస్త్వజ్ఞో దేహీ దేహేంద్రియసంఘాతమాత్రాత్మదర్శీ స సర్వో గేహే భూమావాసనే వాఽఽసఇతి మన్యతే। నహి దేహమాత్రాత్మదర్శినో గేహ ఇవ దేహ ఆస ఇతి ప్రత్యయ స్సంభవతి। దేహాదిసంఘాతవ్యతిరిక్తాత్మదర్శినస్తు దేహ ఆస ఇతి ప్రత్యయ ఉపపద్యతే। పరకర్మణాం చ పరస్మిన్నాత్మ న్యవిద్యాయాఽధ్యారోపితానాం విద్యయా వివేకవిజ్ఞానేనమనసా సంన్యాస ఉపపద్యతే। ఉత్పన్నవివేక జ్ఞానస్య సర్వకర్మసంన్యాసినోపి గేహ ఇవ దేహ ఏవ నవ ద్వారే పురే ఆసనం ప్రారబ్ధఫలకర్మసంస్కారశేషానువృత్త్యా దేహ ఏవ విశేషవిజ్ఞానోత్పత్తేర్దేహ ఏవాఽఽస్త ఇత్యస్త్యేవ విశేషణఫలం విద్వ దవిద్వత్ప్రత్యయ భేదాపేక్షత్వాత్।

**శాంకరభాష్యతత్త్వబోధినీ:—**

(2) సంన్యాసియగు దేహియు, అసంన్యాసియగు దేహియు, అందరుదేహమునందే యుందెదరు. కాన దేహమునందుండుట సర్వసాధారణమైయుండ "విద్వాంసుఁడు సంన్యసించి దేహమునందుండును' అనువిశేషణముచే నేమిప్రయోజనము? వ్యర్థమీవిశేషణమనెదవా? చెప్పెదవినుము. అజ్ఞానినికూర్చి యీవిశేషణము వ్యర్థమనెదవా? లేక జ్ఞానినికూర్చి వ్యర్థమనెదవా? అజ్ఞానియగు దేహి దేహేంద్రియ సంఘాతము నాత్మగదెలిసికొనువాఁడు. అట్టి సర్వులు గృహమునందుగాని, భూమియందుకాని, ఆసనమునందుకాని యుంటిమి అని తలచెదరు. కాన నజ్ఞానినికూర్చి యీవిశేషణము వ్యర్థమే, దేహేంద్రియాదులకంటె యాత్మలేదు. అను జ్ఞానము కలవానికైతే "నేనుదేహమునందుంటిని" అను జ్ఞానము సంభవించును. శరీరేంద్రియాదులయందు కల కర్మలు శరీరేంద్రియాదులకంటె భిన్నమగు నాత్మయందవిద్యచే నధ్యారోపితములు. అట్టి కర్మములకు వివేకవిజ్ఞానరూపమగు విద్యచే మనస్సుచే సంన్యాముపసన్నము. కలిగిన వివేకజ్ఞానముకల సర్వకర్మసంన్యాసికి గృహమునందువలె నవద్వారములుకలపుగసదృశమగు దేహమునందు స్థితి ప్రారబ్ధఫలకర్మసంస్కారవిశేషానువృత్తిచే సంభవించును. దేహమునందే విశేషవిజ్ఞానము జనించుటవలన "విద్వాంసుఁడు దేహమునందే యుండెను;" అను విశేషణము విద్వదవిద్వత్ప్రత్యయ భేదాపేక్షకలదగుటవలన విద్వాంసునిగూర్చి యర్థవత్తు అగును.

**నటుల నవిద్యచే నాత్మయందారోపించబడిన దేహాది వ్యాపారములకు విద్యచేబాధప్రాప్తించినను యాత్మవ్యాపారము నందాత్మకు కర్తృత్వము, దేహాది వ్యాపారములందు కారయితృత్వము తప్పదని శంకింపవలదు. దేహి దేహమునందు కర్తృత్వ కారయితృత్వములు లేనివాడై సుఖముగనే ప్రారబ్ధకర్మవశమున నుండును.**

**శంకరానందీయము:- కామనారహితునకు కర్మయోగముచేతనే ముక్తి ప్రాప్తించుచో "సర్వులు కామనారహితులై కర్మమునే యాచరించుగాక" యని శంకింపవలదు. "నిత్యనైమిత్తికై రేవ కుర్వాణో దురితక్షయం। జ్ఞానం చ విమలీకుర్వ న్నభ్యాసేనచ పాచయేత్ ॥ అభ్యాసా త్పక్వవిజ్ఞానః కైవల్యంలభతే నరః" (నిత్యనైమిత్తికములచే పాపక్షయమొనరించి తద్ద్వారమున చిత్తశుద్ధిని బొందినద్దానివలన వైరాగ్యాదులను దృఢపరచి జ్ఞానమును పొందవలెను. అట్టిజ్ఞానమును అభ్యాసముచే విమలమొనరింపవలయును. అభ్యాసమువలన పక్వమైన విజ్ఞానముకలవాడై మోక్షమును పొందు)నను న్యాయముచే ననేకజన్మార్జితసుకృతపరిపాకముచే సంప్రాప్త చిత్తశుద్ధికలవానికి పరావరైకత్వవిజ్ఞానము ప్రాప్తించును. అట్టి సర్వాత్మదర్శియగు బ్రహ్మవిద్వర్యునకు కారణము లేమిజేసి ఈషన్మాత్ర**

శాంకరభాష్యము:—

(౩) యద్యపి కార్యకరణకర్మాణ్యవిద్యయాత్మ న్యధ్యారోపితాని సంన్యస్యాస్త ఇత్యుక్తం, తథా ప్యాత్మసమవాయి తు కర్తృత్వం కారయితృత్వం చ స్యాదిత్యాశంక్యాహ-నైవకుర్వ న్స్వయం నకార్యకరణాని కారయ న్క్రియాసు ప్రవర్తయన్।కింయత్త త్కర్తృత్వం కారయితృత్వంచ దేహిన స్స్వాత్మసమవాయి స త్సంన్యాసా న్న భవతి యథా గచ్ఛతో గతి గ్గమనవ్యాపారపరిత్యాగే న స్యా త్తద్వత్ । కింవా స్వతఏవాత్మనో నాస్తీతి? అత్రోచ్యతే-నాస్త్యాత్మన స్స్వతః కర్తృత్వం, కారయితృత్వంచ । ఉక్తంహి—'అవికార్యోఽయముచ్యతే' గీ-2-25 'శరీరస్థోపి కౌంతేయ నకరోతి న లిప్యతే' ఇతి గీ-13-31. ధ్యాయతీవ లేలాయతీవ 'బృ-4-3-7 ఇతిచశ్రుతేః॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(౩) విచారింప శరీరేంద్రియనిష్ఠకర్మ లవిద్యచే నాత్మయం దారోపితములు. అట్టికర్మలను సంన్యసించి దేహమునం దుండును. అని చెప్పఁబడెను. అయినను ఆత్మసమవాయులగు కర్తృత్వము, కారయితృత్వము దేహికి సంభవించునను శంకను తొలగించుటకు "నైవ కుర్వ న్న కారయన్" అని చెప్పెను. స్వయముగ తా నేకర్మయును చేయనివాడై, శరీరేంద్రియములను క్రియలయందుప్రవర్తింపచేయనివాడై దేహమునందే సుఖముగ నుండును. అని యాశయము. నడచునట్టి పురుషునకు గమనవ్యాపారముయొక్క యుపరమమగుచో నాగమనము సంభవింపనట్లు దేహికి కర్తృత్వకారయితృత్వములు స్వాత్మసంబంధమై సంన్యాసమువలన సంభవింపవనియా? లేక స్వతః ఆత్మకు కర్తృత్వకారయితృత్వములు లేవనియా? ఈవిషయమున చెప్పెద వినుము. ఆత్మకు స్వతః కర్తృత్వకారయితృత్వములు లేవు. ఈవిషయమే యుపక్రమమునం దీగీతలయందే "అవికార్యోఽయ ముచ్యతే" ఈయాత్మ వికారి కాడని చెప్పబడుచుండెను. అని కర్తృత్వాదివికారము లాత్మయందు నిషేధింపఁబడెను. ఈవిషయమే యుపసంహారమునందుగూడ 'శరీరస్థోపి కౌన్తేయ! న కరోతి న లిప్యతే' ఆత్మ శరీరమునందుండినను దేనిని చేయదు, ఏకర్మవలన లేపమును పొందదని చెప్పఁబడెను. ఈవిషయ మీగీతయందే కాక బృహదారణ్యకశ్రుతియందుగూడ "ధ్యాయతీవ లేలాయతీవ" అని ఇవ శబ్దములవలన కర్తృత్వాదిక మాత్మయందు నిషేధింపఁబడెను. ॥౧౩॥

మైనను కర్మ సంభవింపదు. అట్టి బ్రహ్మవిద్వర్యుడు సర్వకర్మలను సంన్యసించి యవిక్రియబ్రహ్మస్వరూపముచే నుదాసీనముగ నుండునని "సర్వ కర్మాణి మనసా "అను శ్లోకమున చెప్పుచుండెను. నిత్య నిరంతరసమాధినిష్ఠచే నిర్మూలింపఁబడిన సర్వవాసనాపటలముగలవా డగుటచే సుప్రసన్నమగు బాహ్యాభ్యంతరకరణములు కలవాడు. అట్టివాడగుటవలననే "వశీ" స్వాధీన మొనరించుకొనిన సర్వేంద్రియములు కలవాడు. అట్టి పరిశుద్ధమైన యంతఃకరణము గల బ్రహ్మవేత్త "సర్వకర్మాణి" నిత్యములు, నైమిత్తికములు, కామ్యములు, నిషిద్ధము లనెడి శాస్త్రీయాశాస్త్రీయము లగు సర్వకర్మలను "మనసా" అధిష్ఠానసందర్శనముచేత జనించిన యారోపిత నిఖిలదృశ్యవస్తుమిథ్యాత్వజ్ఞానముతోగూడిన మనస్సుచే "సంన్యస్య" కర్మ, తత్కర్త, తత్సాధనము, తత్ఫలము, ఇదంతయు మిధ్యయే యను విజ్ఞానముచే పరిత్యజించి దేహమునందు సుఖముగ నుండును. ఇచట "సర్వకర్మాణి మనసా" అని చెప్పుటచే సర్వకర్మలకు మనస్సుచే పరిత్యాగమేకాని విహితములకు పరిత్యాగము సంభవింపనందున బహిః

క్రియలచే కర్మలకు బరిత్యాగము లేదు. అనగా మనస్సుచే కర్మలను బరిత్యజించియు బహిఃకరణములచే కర్మలను జేయుచునే యుండవలెనని శంకింపఁజనదు. “వికల్పో న హి వస్తు” అను న్యాయమున మరుస్వరూపమును దెలిసికొనినవానికి మరుప్రదేశమునందు జనించిన జలజ్ఞానవిషయమగు జలము మిథ్యయగునట్లు జలపానవిధివాక్యము గూడ మిథ్యయేయగును. అట్లే “మాయామాత్ర మిదం ద్వైతం” అని సర్వమునందు మిథ్యాత్వజ్ఞానము గల విద్వాంసునకు—“అహ రహ స్సంధ్యా ముపాసీత” అనువిధివాక్యముగూడ దృశ్యాంతర్గతంబగుటఁజేసి కర్మవలెనే కర్మవిధియు సంభవింప నేరదు. కాన బ్రహ్మవేత్త బహిఃకరణములచే కర్మల నాచరించునని చెప్పుటకు వీలులేదు.

మరియు అట్టి బ్రహ్మవేత్త సర్వము మిథ్యయే యని కర్మలయందు ప్రవర్తించుగాక అనియుశంకింపజనదు. సర్వమిథ్యాత్వబుద్ధిప్రవృత్తికి బరస్పరవిరోధమువలన యేపురుషునకు సర్వమిథ్యాత్వబుద్ధి జనించునో ఆట్టిబ్రహ్మవేత్తకుప్రవృత్తి సంభవింపదు.

బ్రహ్మవేత్తయు యంతఃకరణమున సర్వము మిథ్యయే యని నిశ్చయముగలవాడైనను బహిస్సత్యత్వజ్ఞానముచే కర్మల నాచరించుగాక యనియు శంకింపజనదు.

మరుప్రదేశమును జూచినవానికి జలమిథ్యాత్వజ్ఞానము, జలసత్యత్వజ్ఞానము సంభవింపనట్లు సర్వదృశ్యమిథ్యాత్వజ్ఞానము, తత్సత్యత్వజ్ఞానము పరస్పరవిరోధమువలననొకపురుషునకే సంభవింపవు. కానసర్వపదార్థసత్యత్వజ్ఞానమువలన ప్రాప్తించెడి ప్రవృత్తి సర్వమిథ్యాత్వదర్శికి ప్రాప్తించదు “యద్ధి మనసా ధ్యాయతి తద్వాచావదతి తత్కర్మణా కరోతీతి” వాగాదీంద్రియప్రవృత్తి మనోవ్యాపార పూర్వకమగుటచే మనస్సుచే కర్మలను పరిత్యజించినవానికి వాగాదీంద్రియములచే కర్మల నాచరించుటయు సంభవింపదు. కాన బ్రహ్మవిద్వర్యుడు సర్వదృశ్యమిథ్యాత్వనిశ్చయ పూర్వకముగ సర్వకర్మలను మనస్సుచే బరిత్యజించి తాను అవిక్రియ బ్రహ్మ స్వరూపముచే నుండును, యెచటనుండును? “నవద్వారే పురే దేహే” రెండునేత్రములు, రెండుశ్రోత్రములు, రెండునాసికలు, ముఖము, పాయూపస్థలు అనెడి తొమ్మిదిద్వారములు. ఈతొమ్మిదిద్వారములు సూర్యాద్యధిదైవతములచే రక్షింపఁబడుచున్నవి. అట్టి నవద్వారములు గలిగినట్టియు, ప్రత్యగాత్మయే రాజుగా గలిగినట్టియు, బుద్ధియే మంత్రిగా గలిగినట్టియు, పంచకర్మేంద్రియములు పంచజ్ఞానేంద్రియములు, మనస్సు అనెడి పరిచారకులతో గూడినట్టియు, ప్రాణాపానాదిదశవాయువులనెడి గ్రామపాలకులతో గూడినట్టియు, బ్రహ్మవిష్ణ్వాదిసర్వదేవతాయతనంబగు యీదేహమునందు “సుఖమాస్తే” స్వసుఖావిర్భావ మగునట్లు సుఖస్వరూపమున నుండును.

విద్వాంసుడు, అవిద్వాంసుడు, యతియు, యతికానివాడును “నేను దేహమునందుంటినని” యనుభవము. వలన దేహమునందే యుండి విద్వాంసుడే దేహమునందుండు నని చెప్పుట యెట్లుపొసగు నని శంకింపఁజనదు.

యెవడు దేహమాత్రమునం దాత్మబుద్ధికలవాడో యట్టిమూఢతమునకు “నేనుగేహమునందు, దేహాలి (గడప) యందు యుంటిని” అను జ్ఞానము లేనిదే దేహమునందుంటిని అను జ్ఞానము సంభవింపదు. బ్రహ్మవేత్తకన్ననో బ్రహ్మాండమునందు జంగమస్థావరాత్మకమగు నిఖిలప్రపంచమును తన తేజస్సుచేసూర్యునివలెప్రకాశింపజేయుచున్నట్టియు, అనాత్మకంబగు బుద్ధ్యాదిసర్వదృశ్యమును తనకాంతిచే ప్రకాశింపజేయుచున్నట్టియు, స్వప్రకాశము, ఏకరసము, సర్వసాక్షి, అసంగము, ఉదాసీనము, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావము, ఆనందఘనము నగు ఆత్మను స్వాత్మరూపముగ “సాక్షాత్తు ఈయాత్మయే నేను” అని యెవడు తెలిసికొనునో వాడే దేహవ్యతిరిక్తాత్మదర్శియు, విద్వాంసుడు అనిపించుకొనును. అట్టివాడే-అజ్ఞాని యగు దేవదత్తుడు గృహమందుండునట్లు దేహమునందు నిష్క్రియబ్రహ్మస్వరూపముచే సుఖముగ నుండును, ఇతరు డట్లుండజాలడు. కనుకనే శ్రీకృష్ణపరమాత్మచే “సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖం వశీ। నవద్వారే పురేదేహే” అని చెప్పబడెను. లేక “వశీ” నిత్యనిరంతరబ్రహ్మనిష్ఠచే వశీకృతమగు బాహ్యాభ్యంతరకరణములుగల నిశ్చలాత్మయగు బ్రహ్మవిద్వర్యుడు “సర్వకర్మా

ణి" శాస్త్రవిహితములు, శాస్త్రనిషిద్ధములు, తద్విలక్షణములు నగు దేహచేష్టారూపములు అగు సర్వకర్మలు అతీతానేక కల్పములయందును, వర్తమానమునందును సర్వావస్థలయందు నెల్లపుడు దేహేంద్రియవ్యాపారరూపముగ బరిణమించిన ప్రకృతిచేతనే చేయబడినవి. కూటస్థాసంగచిద్రూపమగు నాచే జేయబడలేదు. అని ఆత్మానాత్మల స్వరూపవిజ్ఞానముగల మనస్సుచే స్థూలమగు పుర్యష్టకముచే "నవద్వారే" తొమ్మిది ద్వారములుగల "పురే" పూర్ణమగుటచే పురసదృశమగు 'దేహే' కారణమునందు అనగా దేహశబ్దోపలక్షితమగు ప్రకృతియందే 'సంన్యస్య' జననమరణాది వికారములు, కర్తృత్వభోక్తృత్వసుఖిత్వదుఃఖిత్వాదులు, జాగ్రదాద్యవస్థావిశేషములు ప్రకృతిధర్మములే కాని కూటస్థాసంగచిద్రూపమగు నావి కావు అనితలచి అనాత్మాధ్యాసను లెస్సగ బరిత్యజించి తాను నిష్కలనిష్క్రియనిత్యశుద్ధబుద్ధినిరంతరానందైకరసాద్వితీయబ్రహ్మస్వరూపముచే స్వాత్మయందే తూష్ణీంభావముచే సుఖముగనుండును. యించుకేని వికారమును బొందడు.

గృహమధ్యయందుండు ప్రదీపమునకు వాయువు మొదలగువాటివలన సంభవించెడి క్రియ సంభవింపకున్నను దీపము తైలమును స్వీకరించెడిక్రియ దీపమునకు సంభవించినట్లు, గజము నధిష్ఠించి వెళ్లెడి ప్రభువునకు గజకర్తృక గమనక్రియ సంభవింపకున్నను ప్రభునిష్ఠమగు చలనాదిక్రియ గజప్రేరణాదిక్రియ సంభవించినట్లు జపాకుసుమసాన్నిధ్యమువలన స్ఫటికమునందు రక్తిమ భాసించినట్లు అనాత్మసాన్నిధ్యమువలన ఆత్మయందు ప్రతీయమానములగు యనాత్మకర్తృకములగు సర్వమును ప్రకృతియే జేయుచున్నది, నేను జేయుటలేదు అనెడివిద్యచే స్వయముగ బ్రహ్మభావమును బొంది విద్వాంసుడుండుగాక, అయినను ఆట్టివిద్వాంసునకు అన్యకర్తృకక్రియ సంభవింపకున్నను స్వాశ్రయక్రియ సంభవించుటచే నిష్క్రియాత్మస్వరూపముగనుండుట సంభవింపదని శంకింపజనదు.

ప్రభువు సావయవుడగుటంబట్టి స్వాశ్రయక్రియ సంభవింపవచ్చును. ఆత్మయన్ననో "నిష్కలంనిష్క్రియం శాంతం" ఇత్యాది శ్రుతులవలన పరమాత్మకు నిరవయవత్వనిష్క్రియత్వములు శ్రూయమాణమగుటంజేసి యాత్మయందు క్రియ సంభవింపదు. అట్లు క్రియ సంభవించుననుట సర్వవాదివిరుద్ధము. అట్లు క్రియయే సంభవించుననినచో శ్రుతివిరోధముకూడ ప్రాప్తించుగాన యెట్టిక్రియయు ఆత్మకు సంభవింపదని "నైవ కుర్వన్న కారయన్" అను వాక్యముచే బోధించుచుండెను.

సర్వగతము, నిరవయవము నగు ఆకాశమునందు క్రియ సంభవించనట్లు "నిత్య స్సర్వగత స్థాణుః" ఇత్యాది శ్రుతులచే పరమాత్మకు నిత్యత్వము, సర్వగతత్వము చెప్పబడుటవలన నిరవయవము, పరిపూర్ణము అగు పరమాత్మయందు క్రియను కల్పించుట శక్యము కాదు. అట్లు కల్పించిన విరోధము ప్రాప్తించును. కాన పరమాత్మ దేనిని చేయడు; దేనిచేతను చేయించడు. అనగా పరమాత్మకు కర్తృత్వము, కారయితృత్వము లేదన్నమాట.

పరమాత్మకు కర్తృత్వకారయితృత్వములు లేనిచో "సర్వాధిపత్యం కురుతే మహాత్మా । ఏష ఏవ సాధు కర్మ కారయతి । ఏష త ఆత్మాఽన్తర్యామ్యమృతః" ఇత్యాది కర్తృత్వ కారయితృత్వబోధకములగు శ్రుతుల కప్రామాణ్యము ప్రాప్తించునని శంకింపంజనదు.

సూర్యునిసాన్నిధ్యమాత్రమున చీకటి నివర్తించుచుండ సూర్యుడు చీకటిని పోగొట్టుచుండెను, అయస్కాంతసాన్నిధ్యమువలన అయస్సు (ఇనుము) చలించుచుండ నయస్కాంతము ఇనుమును చలింపజేయుచున్నదని సాన్నిధ్యమాత్రమువలననే కర్తృత్వకారయితృత్వములారోపించినట్లు ఆత్మసాన్నిధ్యమాత్రమువలన ప్రకృతి విజృంభించుచుండ తద్విజృంభణము, సర్వాధిపత్యము "పరమాత్మ జేయుచున్నది, చేయించుచున్నది" అని అవికారియగు పరమాత్మయం దౌపచారికముగ జెప్పబడుచున్నది. అట్లే ఆత్మసాన్నిధ్యమువలన బుద్ధ్యాదులు ప్రవర్తించుచుండ బుద్ధ్యాదుల నాత్మ ప్రవర్తింపజేయుచుండెనని బుద్ధ్యాదుల ప్రవృత్తిని యవిక్రియమగు నాత్మయం

డౌపచారికముగ పెట్టుచుండిరి. కాని పరమార్థముగ పరమాత్మకు ఇట్టి ఔపచారిక కర్తృత్వకారయితృత్వములే కాని వాస్తవికమగు కర్తృత్వకారయితృత్వములు లేవు. ఇట్టి యారోపిత కర్తృత్వాదుల నవలంబించియే ప్రాణుల కస్వాతంత్ర్యము సిద్ధించియుండ పరమాత్మకు కర్తృత్వకారయితృత్వములను శ్రుతులు చెప్పుచుండెను. అందుచే నారోపితకర్తృత్వాదుల నవలంబించియే పరమాత్మకు సృష్ట్యాదిక్రియలను జెప్పెడి శ్రుతులకు ప్రామాణ్యము చెప్పదగును. అట్లుకాక వాస్తవిక కర్తృత్వాదులే పరమాత్మకున్నవన్నచో పరమాత్మకు నిర్వికారిత్వప్రతిపాదకమగు "నిష్కలం నిష్క్రియం శాన్తం, న తదశ్నాతి కించ న న తదశ్నాతి కశ్చన" ఇత్యాదిశ్రుతులకప్యారోపము (అప్రామాణ్యము) ప్రాప్తించెడిని. కాన యాత్మ కర్తయుకాదు, కారయితయు కాదని స్పష్టము. ॥౧౩॥

భాష్యోత్కర్షదీపిక :— కొందఱు— "వశీ" వివేకవైరాగ్యసంపన్నుడు "నవద్వారే పురే" మనుష్య దేహమునందు "సుఖం ఆస్తే" సుఖముగ నుంటున్నాడు. అని యర్థము.

విచారింప శునకమార్జారాది దేహములుగూడ నవద్వారములు గలవి. అయినను ఇచట "వశీ" అను శబ్దసంబంధమువలన మనుష్యశరీరము లభ్యమగుచున్నది. "సుఖం" అనునది క్రియావిశేషణము. సుఖముగ నుంటున్నాడు అని యర్థము ఈచెప్పుటచే నంతఃకరణకు హర్షశోకాదిపరిణామములు లేవని స్పష్టమగుచున్నది. "వశీ" అను స్థలమున వైరాగ్యము చెప్పబడుటచే రాగాద్యపరపర్యాయమగు కామము, తదవస్థావిశేషమగు క్రోధరూపము నగు నంతఃకరణపరిణామములు నిరాకృతములు (లేవనిస్పష్టమగుచున్నది.) "వశీ" అను స్థలమునందే వివేకము చెప్పబడుటచే అహంకారాధ్యాస, తన్నిబంధనమగు మమకారాధ్యాస, చింతనాత్మకమగు చిత్తపరిణామము లేవని స్పష్టపరచుచు విశుద్ధ చిదాకారస్వరూపముగ నుండుట చెప్పబడెను. ఈచెప్పుటవలన నిష్కృష్టమగు విశుద్ధచిదాకారబుద్ధిపరిణామము "వశీ" అను శబ్దముచే చెప్పబడెను. వివేకవైరాగ్యసంపన్నుడేమిచేసి సుఖముగనుండును? అనుశంకపై "మనసా సహ సర్వకర్మాణి సంన్యస్య" అనిచెప్పబడెను. ఇచట సంన్యాసశబ్దార్థమగు త్యాగముచే జ్ఞానముకూడ చెప్పబడుచుండెను. అందుచే సర్వకర్మలను సంన్యసించి ఆత్మను తెలిసికొని సుఖముగ నుండునని గ్రహింపనగును. వివేకవైరాగ్యసంపన్నుడెట్టివాడై యుండును? 'అదేహీ' లింగదేహశూన్యుడై యుండును. అనగా షోడశకలలు కలవాడు పురుషుడు. అందు భూతేంద్రియప్రాణములు ప్రవర్త్యములు. అందు బుద్ధి సంకల్పించినచో నంతఃకరణము భూతేంద్రియప్రాణములకు ప్రవర్తకమగును. ప్రతివాడును బుద్ధిచే నిశ్చయించి మనస్సుచే సంకల్పించి ప్రవర్తించును. అందు "మనస్సుతోకూడ సర్వకర్మలను సంన్యసించి" అని చెప్పుటచే మనస్త్యాగము చెప్పబడెను. అట్టి మనస్త్యాగముచే విజ్ఞానకర్మత్యాగము సంభవించుచున్నది. అందుచే లింగదేహలయము స్పష్టమగుచున్నది. శిరస్సును ఛేదించిన మిగిలిన కబంధము దేహరూపము కానేరదు. అట్లే లింగదేహమున బ్రధానమగు మనస్సుయొక్క త్యాగమును చెప్పుటచే లింగదేహశూన్యత్వము స్పష్టమగునని 'మనసా సహ' అని చెప్పబడెను. బుద్ధియైతే సర్వాకారపరిత్యాగపూర్వకముగ చిన్మాత్రమునం దుపసంహరింతము. వివేకముచే నహంకారాదుల మాట చాలదూరము త్రోసివేయబడెను. అని కొందఱు యీశ్లోకమును వ్యాఖ్యానించిరి.

ఇచట కొంచము విచారింతము. "వశీ" అను శబ్దసంయోగము లేకున్నను "సర్వకర్మాణి" అను శబ్దసంయోగమాత్రముచేతను, ప్రకరణమువలనను ఇచట "దేహే" అను శబ్దమునకు మనుష్యశరీరమే లభించుచుండ "సర్వకర్మాణి సంన్యస్య" అనుదానివలన నిషిద్ధకర్మ మననరూప మానసకర్మత్యాగము లభింప నద్దానివలన మనస్త్యాగము సిద్ధించుచుండ "సంన్యస్య" సంన్యసించి అని చెప్పుటచే దేనిచేతను ? అను కరణాశంక జనింప తన్నివృత్తికొఱకు "మనసా" మనస్సుచే అని కరణమును జెప్పవలసియుండ "సహ" అనుశబ్దము మూలమునందు లేకున్నను యెట్లో క్లిష్టపడి "సహ" అనుశబ్దము నధ్యాహృతముచేసి "మనసాసహ" మనస్సుతోకూడ సర్వకర్మలను బరిత్యజించి అనియర్థమును వర్ణించుట యసంగతము.

మఱియు మనస్త్యాగమనగ మనస్సు వివేకయుక్తమగుటయే కాన "వివేకయుక్తుడై సర్వకర్మలను బరిత్యజించి" అనునంతమాత్రమే సరిపడుచుండ "వశీ" అనుశబ్దమునకు "వివేకవైరాగ్యయుక్తుడు" అని యర్థమును వర్ణించుట యయుక్తము. మఱియు "వశీ" అనుశబ్దము స్వాతంత్ర్యమును జెప్పునదగుటచే జితేంద్రియత్వము ప్రతీయమానమగుచుండ "వివేకవైరాగ్యసంపన్నుడై" అని యార్థికార్థమును జెప్పుటయు నసంగతమే.

మఱియు "దేహీ" అనునది దేహశబ్దముపై ఇనిప్రత్యయముకలది. దేహశబ్దమునకు దేహమర్థము. ఇని ప్రత్యయమునకు తత్సంబంధముకలవాడని యర్థము. ఈ "దేహీ" అనుశబ్దముచేతన దేహముకంటె వేరగు నాత్మదర్శియను యర్థములభించును. ఇట్టి యర్థమును వర్ణించుటయే "నవద్వారే పురే ఆస్తే" అనువాక్యసంబంధముచే స్వారసికమైయుండ "నవద్వారేపురేదేహీ" అనుచోట "పురేऽదేహీ" అని అకారప్రశ్లేషగుర్తును జేర్చి క్లిష్టకల్పనచే యర్థమును వర్ణించుట యన్యాయము. ఇట్టి యస్వరసలనే మనస్సునందిడుకొని యీ వ్యాఖ్యాత మరియొకవిధముగ యీ శ్లోకమున కర్థము వర్ణించెనని గ్రహింపనగును.

మఱియు:- "వశీ" జితచిత్తుడై సమాధిస్థుడైన యోగి "నవద్వారే" అయిదు జ్ఞానేంద్రియములు, ప్రాణములు, బుద్ధి, అహంకారము, చిత్తము అనునీతొమ్మిదియు పురపతియగు జీవునకు భోగార్థము విషయ ప్రవేశస్థానములుగాన ద్వారములవంటివి. ఇచట పంచజ్ఞానేంద్రియములచేతనే తత్ప్రవర్త్యమగు కర్మేంద్రియములకు గ్రహణముగాన వేరుగ జెప్పబడలేదు. అట్టి ద్వారములుగల "పురే" విచిత్రవాసనా కల్పితానంత విషయములుగల కర్మలనెడి యనేక సచివులచే నధిష్ఠితమైనట్టియు, సుఖదుఃఖాదినానాపణ్యవస్తువులతోగూడి నట్టియు, శరీరమనెడి పట్టణమునందు సర్వద్వారోద్ఘాటనసమర్థమంచికొస్వరూపమగు మనస్సుతోగూడ- పురపతి రాజ్యకర్మలను వదలి సుఖముగ కూర్చుండినట్లు సర్వకర్మలను సన్యసించి సుఖముగ నిర్వికల్పసంవిన్మాత్రస్వరూపముగ నుండునని కొందరు వ్యాఖ్యానించిరి.

ఇట్టి వ్యాఖ్యానముగూడ యసంగతమే. "వశీ" అనుశబ్దమునకు జితచిత్తుడగు=సమాధిస్థుడైన యోగి యని యీ వ్యాఖ్యాత మొట్టమొదట వ్యాఖ్యానించి "మనసా సహకర్మాణి సంన్యస్య" మనస్సుతోగూడ కర్మలను బరిత్యజించి అని "సహ" శబ్దాధ్యాహారపూర్వకముగ నర్థమును వర్ణించెను. ఇచట మనస్సును బరిత్యజించుట యనగానేమి ? వస్త్రాదులనువలె బరిత్యజించియనియా ? లేక వృత్తినిరోధమా ? వస్త్రాదులవలె మనస్సును బరిత్యజించుట సంభవించదు. కాన వృత్తినిరోధమే మనస్సును బరిత్యజించుటయని యర్థము జెప్పవలెను. యీ యర్థమును "వశీ" అనుశబ్దమువద్ద జితచిత్తుడై అనగా వృత్తినిరోధముకలవాడై అని వర్ణించి తిరుగ "మనసాసహ సర్వకర్మాణి సంన్యస్య" అనుచోట వర్ణించుట పునరుక్తియగును. కాన నిట్టియర్థమును వర్ణించుట యసంగతమే. మృతశరీరరూపమగు పురముండినను యీ వ్యాఖ్యాతవర్ణించిన పంచజ్ఞానేంద్రియములు, ప్రాణము, బుద్ధ్యహంకార చిత్తమనెడి నవద్వారములు కానిపింపనందున ద్వారశబ్దమునకు పైయర్థము వర్ణించుటయు యసంగతమే. మఱియు "వశీ" అనుచోట నిర్వికల్పసమాధినిష్ఠుడు -నియర్థము వర్ణించినపుడట్టి సమాధినిష్ఠునకు భోగప్రాప్తిద్వారము లయమగుటంబట్టి "నేను దేహముకంటెభిన్నుడను" అనుభావముగూడ లేమింజేసి "నవద్వారే పురే ఆస్తే" అనిచెప్పుటయు వ్యర్థమగును. కాన నీవ్యాఖ్యయిన్ని దోషములతోగూడినది కాన గ్రహింపదగినది కాదు.

నీలకంఠీయము:—అవిద్వాంసుఁడు ఫలమునం దాసక్తికలవాడై కర్మల నాచరించినచో వాడట్టికర్మలచే బద్ధుడగుననియు, ఫలమునం దాసక్తుడు కానిచో కర్మలచే బంధింపబడడనియు యింతవరకు చెప్పబడెను. విద్వాంసుఁడవిద్వాంసునికంటె విపరీతుఁడని "సర్వకర్మాణి" అను శ్లోకముచే చెప్పుచుండెను.

జయించబడినచిత్తముకల సమాధిస్థుఁడగు యోగి "నవద్వారే" పంచజ్ఞానేంద్రియములు, అరవది ప్రాణము, ప్రాణముచేతనే ప్రవర్తింపఁజేయబడు కర్మేంద్రియములు గ్రహింపఁబడుచుండ కర్మేంద్రియము

గీ॥ న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః ।
న కర్మఫలసంయోగం స్వభావ స్తు ప్రవర్తతే ॥ ॥౧౪॥

పదవిభాగము:—న-కర్తృత్వం-న-కర్మాణి-లోకస్య-సృజతి-ప్రభుః-న-కర్మఫలసంయోగం- స్వభావః-తు-ప్రవర్తతే॥ ॥౧౪॥

ప్రతిపదార్థము:—ప్రభుః=ఆత్మ; లోకస్య=లోకమునకు; కర్తృత్వం=స్వతః చేయుము అనెడి కర్తృత్వమునుకాని; కర్మాణి=ఇష్టములగు రథఘటప్రాసాదాదులను కాని; నసృజతి=సృజింపబడు. కర్మఫలసంయోగం=రథఘటప్రాసాదాదిరూపకర్మఫలసంబంధమును కాని; నసృజతి= సృజింపదు. స్వభావస్తు= అవిద్యాస్వరూపమగుప్రకృతియనబడుమాయయైతే; ప్రవర్తతే=ప్రవర్తించుచున్నది. ॥౧౪॥

శాంకరభాష్యమ్.—

న కర్తృత్వ మితి । న కర్తృత్వం స్వతః కుర్వితి నా పి కర్మాణి రథఘటప్రాసాదాదీనీప్సితతమాని లోకస్య సృజ త్యుత్పాదయతి ప్రభు రాత్మా ,నాపి రథాది కృతవత స్తత్ఫలేన

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆత్మ, లోకమునకు స్వయముగ 'నీవు చేయుము' అని కర్తృత్వమునుకాని, ఈప్సితతమములగు రథఘటప్రాసాదాదులనుకాని సృజింపదు. రథఘటాదులను నిర్మించినవాని కారథఘటాది

లను చేయగ గ్రహింప నవసరము లేదు. బుద్ధి, అహంకారము, చిత్తములు మూడు మొత్తమివియే తొమ్మిదిద్వారములవంటివి. శరీరమనెడి పురమునకు ప్రభువగు జీవునకు భోగార్థము విషయప్రవేశస్థానములు. ఇట్టి నవద్వారములుకల శరీరమనెడి పట్టణమునందు. మరియు యీ పట్టణమెట్టిది? విచిత్రవాసనాకల్పితానంత విషయములు కలది. అనేకకర్మలనెడి మంత్రులచే నధిష్ఠితము, సుఖదుఃఖాదులనెడి కొనదగిన పణ్యవస్తుపరిపూరితము. ఇట్టి దాదేహమునందు సర్వద్వారోద్ఘాటన సమర్థమగు తాళముచెవియగు మనస్సుచే పురపతి రాజకార్యములను వదలినటుల సర్వకర్మలను సన్యసించి సుఖముగ నిర్వికల్ప సంవిన్మాత్రస్వరూపముచే నుండును. కర్మలు క్షేత్రసంబంధమైనధర్మములు. ఆత్మధర్మములు కావని క్షేత్రమునందు సర్వకర్మలు విడుచుటకు శక్యమైనవి. ఈ విషయమునే "శరీరే పాప్మనో హిత్వా" (శరీరమునందు పాపములను విడచి) అను శ్రుతియు బోధించుచున్నది. దేహియై యుండియు దేహాభిమానకాలమునందు వ్యుత్థానమునందును మంత్రులయందుంచబడిన భారముకలవాడై యుండినటుల క్షేత్రముతో నాత్మకు సంబంధాభావజ్ఞానముకలవాడగుటవలన కర్మలను చేయనివాడై చేయించనివాడై యుండును.

లేక "నవద్వారాణి" చక్షురింద్రియ బిలములురెండు, శ్రోత్రేంద్రియబిలములురెండు, నాసికాబిలములురెండు, మొత్తమారు, ముఖమొకటి, క్రిందనుండునవి రెండుబిలములు, మొత్తమీబిలములు తొమ్మిదిద్వారములు. ఈ పక్షమున నింద్రియములు పరిచారకస్థానీయములు. బుద్ధి మంత్రి స్థానీయుడు. అహంకారము యువరాజు. ఇట్లే యూహింపనగును. విద్వాంసునకు కర్మసంబంధమే లేదు. తత్ఫలాసక్తి కాని, సబంధము గానిదూరతః నిరస్తములు. ॥౧౩॥

—: ౫వ అధ్యాయము. ౧౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— దేవదత్తుడు నడచునపుడు తనయందు గమనక్రియయుండి నడవనపుడాగమనక్రియ సంభవింపనట్లు యాత్మకుకూడ కర్తృత్వకారయితృత్వములుండి సంన్యసించినపుడాకర్తృత్వకారయితృత్వాలు సంభవింపవా? లేక వస్తుగతిచేతనే యాకాశమునందు తలమలినతాదులు సంభవింపనట్లాత్మకుకూడ

శాంకరభాష్యమ్:—

సంయోగం న కర్మఫలసంయోగమ్। యది కించిదపి స్వతో న కరోతి న కారయతి చ దేహీ క

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఫలసంబంధమునుకూడ సృజింపడు. అనగా నట్టి రథఘటాదిఫలభోక్తృత్వముకూడ నాత్మకు లేద నుట. దేహి యగు నాత్మ దేనినికూడ చేయనిచో, చేయించనిచో మరేది చేయుచు, చేయించుచు

కర్తృత్వకారయితృత్వములు సంభవింపవా? అను సందేహమును 'న కర్తృత్వం' అనుశ్లోకముచే తొలగించుచుండెను.

స్వామియగు ఆత్మ దేహాదులకు కర్తృత్వమును సృజింపడు. "నీవుచేయుము" అనునియోగముచే దేహాదులకు కారయితయుగాడు. లోకమున కత్యంతాభీష్టమగు ఘటాదులను సృష్టించడు. కర్మ నాచరించిన వానికి ఆయా కర్మఫలసంబంధమును కలుగజేయడు. అనగా భోక్తయుకాడు. భోజయితయుగాడు. ఈ విషయమునే "సమానస్సన్నుభౌ లోకావనుసంచరతి" "ధ్యాయతీవ లేలాయతీవ" అనునవి మొదలగుగాగల శ్రుతులు బోధించుచున్నవి "శరీరస్థోపి కౌన్తేయ న కరోతి నలిప్యతే" అనుచోటను, యిచటను "ఆత్మ కించిత్తయినను చేయడు. చేయించడు" అని చెప్పబడెను. ఇక యెవడు కర్త? యెవడు కారయిత? అను శంకను "స్వభావస్తు ప్రవర్తతే" అనువాక్యముచే తొలగించుచుండెను. అజ్ఞానాత్మకము దైవీమాయయగు ప్రకృతియే యిట్టివిధమున ప్రవర్తించుచున్నది ॥౧౪॥

శంకరానందీయము:— ఆత్మ నిరవయవమగుటచే క్రియ యాత్మయందు సంభవింపనందున కర్తృత్వ మాత్మకు సంభవింపకున్నను అయస్కాంతమునకయశ్చాలకత్వ మెట్లుకలదో అట్లే యాత్మకు కారయితృత్వము యెందుకు సంభవింపదని శంకింపదగదు. అట్లు కారయితృత్వ మాత్మకున్నచో ప్రాణులకును, ఆత్మకు సాన్నిధ్యము నిత్యమగుటంబట్టి యెల్లపుడు సర్వులకు ప్రవృత్తియే సంభవించెడిని. అట్లు కాన్పించనందున యాత్మకు కారయితృత్వముగూడ యప్రామాణికమే యని "నకర్తృత్వం" అనుశ్లోకముచే బోధించుచుండెను.

"ప్రభుః" ప్రకర్షగ తానే సర్వస్థలములయందు భాసించువాడుగాన ప్రభువనిపించుకొనును. లేక సర్వమును ప్రకర్షగ భాసింపజేయువాడు గాన ప్రభువు. లేక సర్వాత్మగ తానే భాసించువాడుగాన ప్రభువు. అట్టి యాత్మ "లోకస్య" ప్రాణికి కర్తృత్వమునుగాని, "నీవుదీని నాచరించుము" అని కర్మయందు ప్రవృత్తినిగాని "నసృజతి" సృజింపడు. అనగా యేప్రాణిని ప్రవర్తింపజేయడు. అట్లే "కర్మాణి" కర్మయనగా కర్త కత్యంతము క్రియచే బొందుట కిష్టతమమగునది. అట్టి ఘటపటాదిరూపమగు కర్మలను, అనగా యిష్టప్రదము, అనిష్టప్రదము క్రియచే బొందుటకు యోగ్యమగునట్టి వస్తువులను సంపాదింపడు. ఆయా ప్రాణులచే శుభాశుభకర్మఫలములగు సుఖదుఃఖముల ననుభవింపజేయడు.

ఆత్మకు కారయితృత్వము, ప్రాపయితృత్వము, భోజయితృత్వములు లేనిచో యిక కారయిత, ప్రాపయిత, భోజయిత, యెవడను శంకను "స్వభావస్తు ప్రవర్తతే" అనువాక్యముచే తొలగించుచుండెను.

స్వయముగనే సర్వమును భావనచేయునదిగాన స్వభావమనబడును. లేక తానే భావనచేయించునది గాన స్వభావమనిపించుకొనును. వాసనామయమగు ప్రకృతియే ప్రవర్తింపజేయును. అనగా కర్మరూపమగు ప్రకృతియే యిష్టానిష్టములను సంపాదించి ప్రాణులచే సుఖదుఃఖముల ననుభవింపజేయును. ఆత్మయన్ననో స్వయముగ నవిక్రియుడై ప్రాణి ప్రకృతి తచ్చేష్టాతత్సుఖదుఃఖానుభూతులకు సాక్షియే యగును. ॥౧౪॥

శ్రీధరీయము:— "ఏషఏవ సాధు కర్మ కారయతి తం య మేభ్యో లోకేభ్య ఉన్నినీషతే। ఏషఏవాసాధు కర్మ కారయతి తం య మేభ్యో లోకేభ్యోఽధో నినీషతే" పరమేశ్వరు డీలోకములనుండి యెవరిని యూర్ధ్వముగ తీసుకువెళ్ళుట కిచ్ఛయించునో వానిచే పుణ్యకర్మలను చేయించును. యెవరినీలోకములనుండి క్రిందకుతీసుకువెళ్ళుట కిచ్ఛయించునో వానిచే పాపకర్మలను చేయించును. అనుశ్రుతిచే శుభాశుభకర్మలయందు

శాంకరభాష్యమ్:—

స్తర్హి కుర్వ న్కారయంశ్చ ప్రవర్తత ఇత్యుచ్యతే—స్వభావస్తు స్వో భావః స్వభావోఽవిద్యాలక్షణా ప్రకృతి ర్మాయా ప్రవర్తతే దైవీహీ త్యాదినా వక్ష్యమాణా ॥౧౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ప్రవర్తించుచున్నది ? అనెదవా ? చెప్పెద వినుము. స్వభావము అనగా అవిద్యారూపము "దైవీహ్యేషా" అనిసప్తమాధ్యాయమున చెప్పఁబడు ప్రకృతి శబ్దవాచ్యమగు మాయయే కర్తృత్వ కారయితృత్వ రూపమున బ్రవర్తించుచున్నది. ॥౧౪॥

పరమేశ్వరునిచే కర్తగ ప్రయుక్తుఁడగు పురుషుడు స్వతంత్రుఁడు కాడు. అట్టి యస్వతంత్రుఁడగు పురుషుడెట్లు శుభాశుభకర్మలను బరిత్యజించును ? పరిత్యజించలేడు. మఱియు పరమేశ్వరునిచేతనే జ్ఞానమార్గమునందు ప్రయుజ్యమానుడై శుభాశుభకర్మలను బరిత్యజించునెదవా ? అట్లగుచో వైషమ్యనైర్ఘృణ్యములచే యీశ్వరుడు ప్రయోజకకర్తయగుటవలన నీశ్వరునకు కూడ పుణ్యపాపసంబంధముండవలసివచ్చుననను శంకను "నకర్తృత్వం" అనునదిమొదలగు రెండుశ్లోకములచే దొలగించుచుండెను.

ఈశ్వరుడు జీవలోకమునకు కర్తృత్వాదికమును సృజింపడు. మఱేమనిన జీవునిస్వభావమగు యవిద్యయే కర్తృత్వాదిరూపమున ప్రవర్తించును. అనాద్య విద్యాకామవశమున ప్రవృత్తిస్వభావముగల జీవలోకమును యీశ్వరుడే కర్మలయందు నియోగించును కాని స్వయముగ యీశ్వరుడే జీవునకు కర్తృత్వాదికమును పుట్టించడు. కాన యీశ్వరునకు వైషమ్య నైర్ఘృణ్యములు లేవు కనుకనే ప్రయోజకకర్తృత్వముగూడ సంభవింపదు. అందు వలననే యీశ్వరునకు పుణ్యపాపసంబంధముగూడ సంభవింపవలసివచ్చునను శంకయు తొలగించబడెను. ॥౧౪॥

భాష్యోత్కర్ష దీపిక:— "స్వస్మిన్భావ ఆరోపితా సత్తా అస్యేతి స్వభావః" తనయందారోపితమగు సత్తగల యంతఃకరణమే స్వభావము. అట్టి యంతఃకరణమే కృత్యములకొఱకు, ముక్తికొఱకు ప్రవర్తించుచున్నది. అని కొందఱువ్యాఖ్యానించిరి. అంతఃకరణముగూడ ప్రకృత్యధీనమగు ప్రవృత్తిగలది కాన కాంక్షితమగు నిట్టి క్లిష్టకల్పన యన్యాయముగాన నిట్టివ్యాఖ్యానము గ్రహింపదగినది కాదు. ॥౧౪॥

పరమార్థప్రపా:— "జానామి ధర్మం నచమే ప్రవృత్తిః జానామ్యధర్మం, నచమే నివృత్తిః" ధర్మమునెఱుగుదును కాని నాకాధర్మమునందు ప్రవృత్తిలేదు. అధర్మమునుకూడ నేనెఱుగుదును కాని నాకా యధర్మమునందు నివృత్తియు లేదు. అని చెప్పబడుటచే అస్వతంత్రుఁడగు పురుషునకు "నైవకుర్వన్న కారయన్" ఇత్యాదికముచే స్వాతంత్ర్యమెట్లు చెప్పబడెను. పురుషునకు స్వాతంత్ర్యములేదు. ఈశ్వరునకే ప్రయోజకకర్తృత్వమునెదవా ? అట్లగుచో "యీశ్వరుడు సదసత్కార్య ప్రవర్తకుడగుటచే నస్మదాదులవలె నీశ్వరునకుకూడ విషమత్వము ప్రాప్తించెడిని" అనుశంకను తొలగించుటకు "నకర్తృత్వం" అనిచెప్పబడెను.

ఈశ్వరుడును జీవలోకమునకు కర్తృత్వమును, కర్మలను, కర్మఫలసంయోగమును సమకూర్చడు. మఱే దనిన ? అనాద్యవిద్యా గుణోత్పన్న సదసత్సంస్కార రూపమగు స్వభావమే లోకములందు ప్రవృత్తి జనకమగుచున్నది. అట్టిస్వభావమే యీశ్వరానుగ్రహరూపమని, యీశ్వరనిగ్రహరూపమని కాని కల్పింపబడుచున్నది. ॥౧౪॥

నీలకంఠీయము:— భృత్యునివలె యాత్మకు కర్తృత్వముకాని, ప్రభువువలె కారయితృత్వముకాని లేకుండుగాక, వికారములేకయే యయస్కాంతము లోహములయందు చలనాదులను కలుగజేసినటుల యవికారి యగు నాత్మ కర్త్రాది ధర్మములుకల యహంకారాదులకు ప్రవర్తకమగుగాక యను యాశంకను "న కర్తృత్వం" అను శ్లోకముచే తొలగించుచుండెను. కర్తృత్వ మహంకారనిష్ఠము. వచనాదానవిసర్గాదులు, శ్రవణదర్శనాదులు యింద్రియనిష్ఠధర్మములు. "లోక్యతే ప్రకాశ్యత ఇతి లోకః" జడవర్గము. సూర్యుఁడెట్లస్మదాదులకు ప్రకాశకుండైనను కర్మాదులయందు ప్రవర్తకుఁడు కాడో, అట్లే చిదాత్మయు జడవర్గమునకు ప్రకాశకుఁడైనను ప్రవర్తకుఁడు కాడు. ఈ లోకమునకు కర్మఫలసంయోగమునుకూడ సృజించడు. మరేమనిన : ఎవనికట్టి స్వభావము కలదో, అట్టి స్వభావానుగుణముగ వాడు ప్రవర్తించును. సూర్యోదయమయినచో కమలములకు వికా

గీ॥ నాఽఽదత్తే కస్యచిత్పాపం నచైవ సుకృతం విభుః ।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః॥ ॥౧౫॥

పదవిభాగము:—న-ఆదత్తే-కస్య-చిత్-పాపం-న-చ-ఏవ-సుకృతం-విభుః-అజ్ఞానేన-ఆవృతం-జ్ఞానం-తేన-ముహ్యన్తి-జన్తవః॥ ॥౧౫॥

ప్రతిపదార్థము:— విభుః=పరమేశ్వరుఁడు; కస్య చిత్=భక్తునియొక్కయు; పాపం=పాపమును; నాదత్తే= స్వీకరించడు. సుకృతం = (భక్తసమర్పితమగు) పూజాదికమును; నాదత్తే=(ఈపదమూనువృత్తము) స్వీకరించడు. అజ్ఞానేన=అజ్ఞానముచే; జ్ఞానం=వివేకవిజ్ఞానము; ఆవృతం=కప్పఁబడినది; తేన=ఆయజ్ఞానముచే; జన్తవః=సంసారులు; ముహ్యన్తి="నేను చేయుచుంటిని, నేను భుజించుచుంటిని, నేను భోజనమును చేయుచుంటిని" అని మోహమును పొందుచుండిరి. ॥౧౫॥

శాంకరభాష్యమ్:—

పరమార్థతస్తు—నాదత్తే నచ గృహ్ణాతి భక్తస్యాపి కస్యచిత్పాపం న చైవాదత్తే సుకృతం భక్తైః ప్రయుక్తం విభుః । కిమర్థం తర్హి భక్తైః పూజాదిలక్షణం యాగదానహోమాదికం చ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కర్తృత్వభోక్తృత్వాదు లాత్మ కవిద్యాకృతములని చెప్పఁబడెను. ఇపుడు ఈశ్వరుని యందు సంన్యస్తమగు సమస్తవ్యాపారములు కలిగినట్టియు, ఈశ్వరుఁడే శరణగా గలిగినట్టి భక్తునియొక్క దురితమునుకాని, సుకృతమునుకాని, భగవంతుడు 'మదేకశరణుడై మత్ప్రీతి

నయుః కలువలకు ముకుళీభావము స్వభావము. అట్లే యాత్మప్రకాశించుచుండ ఘటాదులుచలించవు. మనుష్యాదులు చలించును. ఆత్మయైతే దేనికిని ప్రవర్తకుఁడు కాదు నివర్తకుఁడును కాదు. అది యెట్లనిన? అయస్కాంతము ప్రవర్తకమగును (అయస్కాంతసాన్నిధ్యముచే నయస్సు (ఇనుము) చలించును. అట్లే ఆత్మాపాత్మలకు సంబంధములేనందున నాత్మ ప్రవర్తకము కాదు. ఆత్మ ప్రకాశించుచుండ జడములకు క్రియలేకుండుటయు, మనుష్యాదులు చలించుటయు స్వభావమని గ్రహింపనగును. ॥౧౪॥

—: ౫వ అధ్యాయము ౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— "ఏష ఉహ్యేవ సాధు కర్మ కారయతి తం య మున్నినీషతే: ఏష ఏవాసాధు కర్మ కారయతి తం య మధో నినీషతే। ఇత్యాదిశ్రుతులు, "అజ్ఞో జంతు రనీశోఽయ మాత్మన స్సుఖదుఃఖయోః । ఈశ్వరప్రేరితో గచ్ఛే త్స్వర్గంవా శ్వభ్ర మేవ వా" అజ్ఞుడగు జీవుడు తన సుఖదుఃఖములకసమర్థుడై యీశ్వరప్రేరితుడై స్వర్గమును కూర్చిగాని, నరకమును గూర్చిగాని వెళ్ళును. అనెడిస్మృతులు జీవేశ్వరులకు కర్తృత్వకారయితృత్వములను, భోక్తృత్వ భోజయితృత్వములను బోధించుచున్నవి. అట్టి కర్తృత్వకారయితృత్వములవలనను, భోక్తృత్వభోజయితృత్వములవలనను జీవేశ్వరులకు పాపపుణ్యలేపము సంభవించుచుండ "స్వభావస్తు ప్రవర్తతే" స్వభావము ప్రవర్తించుచున్నది అని చెప్పుట యెట్లు సమంజసమగును అను శంకను "నాదత్తే" అను శ్లోకముచే తొలిగించుచుండెను.

పరమార్థమువలన జీవునకు కర్తృత్వము లేమిఁజేసి పరమేశ్వరునకు కారయితృత్వము లేమిఁజేసి పరమేశ్వరుఁడు పరమార్థముగ నేజీవులయొక్కయు పాపములను, పుణ్యములను స్వీకరించడు.

అట్లగుచో పైనుదహరించబడిన శ్రుతిస్మృతులు, వ్యవహారము లెట్లు ప్రమాణములగునను శంకను "అజ్ఞానేన"అను వాక్యముచేతొలిగించుచుండెను. ఆవరణ విక్షేపశక్తి గలిగినట్టియు, మాయ యను పేరుగల యనృతమగు తమస్సుచే జీవేశ్వర జగద్భేద భ్రమాధిష్ఠానము, నిత్యము, స్వప్రకాశము, సచ్చిదానంద రూపము, అద్వితీయము నగు పరమార్థసత్యము కప్పబడినది. అట్టి స్వరూపావరణముచే జననశీలురగు వస్తుస్వరూపజ్ఞానములేనట్టి జీవులు

**శాంకరభాష్యమ్ :—**

సుకృతం ప్రియుజ్యత ఇత్యాహ— అజ్ఞానేనావృతం జ్ఞానం వివేకవిజ్ఞానం తేన ముహ్యంతి కరోమి కారయామి భోక్ష్యే భోజయామీత్యేవం మోహం గచ్ఛంత్యవివేకిన స్సంసారిణో జంతవః ॥౧౫॥

**శాంకరభాష్యార్కప్రకాశ బోధిని :—**

నిమిత్తము కర్మమును చేయుచున్నాడుకాన నీభక్తుఁడు నాచే యనుగ్రహింపఁదగినవా" డను జ్ఞానముకలవాడై భక్తానుగ్రహార్థము స్వీకరించును. అనిన పరమార్థమువలన నాపరమేశ్వరుఁడును యవిక్రియుడే యగుటవలన భక్తునియొక్క పాపమునూ గ్రహించడు. భక్తులచే నాచరింపఁబడిన పూజాదికమునూ గ్రహింపడు.

అట్లగుచో భక్తులు పూజాదికమును, యాగదానహోమాదికము నెందుల కాచరించెదరు ? అను శంకను "అజ్ఞానేన" అను యుత్తరార్థముచే దొలిగించుచుండెను. వివేకవిజ్ఞాన మజ్ఞానముచే గప్పఁబడెను. అందుచే సంసారులు నేను చేయుచుంటిని, నేను చేయించుచుంటిని, నేనుభోజనముచేయగలను, నేనుభోజనముచేయుచుచుంటిని అని మోహమును బొందుచుండిరి.॥౧౫॥

"ముహ్యన్తి" 1ప్రమాత 2ప్రమేయము 3ప్రమాణము 4కర్త 5కర్మ 6కరణము 7భోక్త 8భోగ్యము 9భోగము అనెడి నవవిధసంసార రూపమగు మోహమును (అది లేనిదానియందు తదవభాసరూపమగు విక్షేపమును) పొందుచుండిరి అకర్త. అభోక్త, పరమానందరూపము, అద్వితీయము నగు ఆత్మయొక్క స్వరూపాదర్శనమువలన జీవేశ్వరజగద్భేదభ్రమ మూఢులకు ప్రతీయమానమగుచున్నది. అట్టి యవస్థయందే మూఢులయొక్క మూఢప్రత్యయము ననువదించుచు పైశ్రుతిస్మృతులు వాస్తవాద్వైతబోధక వాక్యములకు శేషభూతములై ప్రమాణములగును కాన నాశ్రుతిస్మృతుల ప్రామాణ్యము ప్రాప్తించదు. ॥౧౫॥

శంకరానందీయము:— "ఏషఏవసాధు కర్మ కారయతి। సత్త్వస్యేషప్రవర్తకః। ఈశ్వరస్సర్వభూతానాం సర్వాధిపత్యంకురుతేమహాత్మా। ధర్మావహంపాపనుదంభగేశం। వరదం దేవమీడ్యం। ప్రభుఃప్రీణాతివిశ్వభుక్।"। ఇత్యాదిశ్రుతిస్మృతులచే పరమాత్మకు కర్తృత్వము, కారయితృత్వము, ధర్మావహత్వము, పాపనోదకత్వము, సమర్పితపూజాదులచేసంతోషించుట చెప్పబడుచున్నవి ఇట్లుపరమాత్మకు కర్తృత్వాదులు చెప్పబడుచుండ "నకర్తృత్వం నకర్మాణి" అను శ్లోకముచే శ్రుతిస్మృత్యుక్తధర్మాభావ మెట్లు చెప్పబడెనని శంకింపజనదు. శ్రుతిస్మృతులచే ఆత్మయందుపాధికృతమగు కర్తృత్వాద్వికము నారోపించియే చెప్పబడెను. అట్లెందుకు చెప్పబడెనందువా? ముముక్షువులకు సత్వశుద్ధినిమిత్తమై పరమేశ్వరోపాసనయందు ప్రవృత్తినిద్ధించుటకై జెప్పబడెను. కాని పరమేశ్వర యాథార్థ్యము మాత్రము చెప్పబడలేదు. వస్తుగతివిగిచారించినచో పరమాత్మ కూటస్థుడు, అసంగుడు,చిన్మాత్రుడు నగుటవలన నతనియందు కర్తృత్వముకాని, కారయితృత్వముకాని, ఆదానము (స్వీకరించుట) కాని సంభవింపదు. ఈవిషయిమునే "నాదత్తే" అను శ్లోకము స్పష్టపరచుచున్నది. పరమాత్మ నిరవయవుడు, నిష్క్రియుడగుట వలన సర్వవ్యాపకుడు. అట్టి పరమాత్మ భక్తునియొక్కగాని, యితరుని యొక్కగాని పాపమును బ్రాహ్మణుడు సాళగ్రామమును గ్రహించినట్లు గ్రహింపడు. "హరి ర్హరతి పాపాని దుష్టచిత్తై రపి స్మృతః" "అనేకజన్మార్జిత పాపసంచయం హరత్యశేషం స్మృతమాత్ర ఏవ" ఇత్యాదివాక్యములు భక్తులచే చేయబడిన పాపములను భగవానుడు హరించునని బోధించుచుండ పరమేశ్వరు డెవనిపాపములను స్వీకరింపడని చెప్పుట యెట్లుపొసగును? సత్యమే పైనుదహరింపబడిన వాక్యములు నీవుచెప్పినట్లు బోధించుచున్నవి. కాని వాటియభిప్రాయము వేరు. అదేదనిన? పాపాత్ముడు పరమేశ్వరనామోచ్చారణము జేసిన అట్టినామోచ్చారణమే వాడాచరించినపాపములకు ప్రాయశ్చిత్తమై వానిచే నాచరించబడిన పాపములను తొలగించునని యభిప్రాయము. అంతియేకాని అట్టిపాపముల నన్నిటిని వికారియై పరమేశ్వరుడు స్వీకరించునని యాశయము కాదు. "తస్మాత్సంకీర్తనం శంభోర్జగన్మం

గణ మంహసామ్। మహతా మపి కారణ్య విధ్వైకాన్తికనిష్కృతిమ్" "ఏకా వినిష్కృతి శ్శంభో స్సకృ దేవ హి కీర్తనమ్" ఇత్యాదివాక్యములచే పైచెప్పినవిషయము స్పష్టమగుచున్నది. అట్లుకాక పరమేశ్వరుడు భక్తుని పాపములనే గ్రహించుననిన పరమేశ్వరునకు నిర్వికారిత్వప్రతిపాదకానేకశ్రుతులకు విరోధము ప్రాప్తించెడిని. మఱియు భక్తిచే సమర్పింపబడిన యేభక్తునియొక్కయు శ్రౌతస్మార్తకర్మానుష్ఠానజన్యమగు పుణ్యమునుగూడ అగ్ని హోత్రుడావంతిని గ్రహించినట్లు పరమేశ్వరుడు గ్రహింపడు. అట్లగుచో "ధర్మావహం పాపనుదం వరదం దేవమీడ్యమ్" "ప్రభుం ప్రీణాతి" "పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి। తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః" ఇత్యాదివాక్యముల కప్రామాణ్యము ప్రాప్తించెడినని శంకింపజనదు. సత్త్వశుద్ధిని కోరెడి ముముక్షువునకు పరమేశ్వరోపాసనయందు రుచిని కలిగించుటయే ఆవాక్యములకు తాత్ప ర్యము. వాయవ్యపశ్వాలంభనమందు రుచిపుట్టించు "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా" ఇత్యాద్యర్థవాద వాక్యములు వాయవ్యపశ్వాలంభనము శ్రేష్ఠమని విధేయప్రాశస్త్యప్రతీతిజననద్వారా ప్రమాణములగునట్లు పైనుదహరించబడిన వాక్యములుగూడ పరమేశ్వరోపాస్తియందు తన్మహత్త్వప్రతిపాదనద్వారా యభిరుచి గలిగించుటవలన ప్రమాణ ములే యగును.

పరమేశ్వరుడే పుణ్యమును గ్రహింపనిచో విద్వాంసులు, అవిద్వాంసులుగూడ తమచే నాచరింపబడిన స్నానసంధ్యానుష్ఠానయజ్ఞదానాదికములవలన జనించిన ఫలమును పరమేశ్వరున కర్పించుచుండిరి. దానిని పరమేశ్వ రుడు గ్రహించుచుండెను అనువిషయ మెట్లుపొసగునని శంకింపజనదు. అట్టివారు వేదాన్తవిచారమువలన జనిం చెడి జ్ఞానములేనివారు. కనుకనే యట్లుచేయుచుండిరి. అనువిషయమును "అజ్ఞానే నావృతం జ్ఞానం" అనువాక్య ముచే స్పష్టపరచుచుండెను.

"జ్ఞానం" "ఆత్మ దేహేంద్రియాదులకంటె భిన్నము, అవిక్రియము, చిద్రూపము, పరిపూర్ణము, అఖం డానందైకరసస్వరూపము" అని తెలిసికొనుటయే జ్ఞానము. తద్విపరీతమజ్ఞానము. అట్టి యజ్ఞానముచే పైని జెప్ప బడిన జ్ఞానము రాహువుచే సూర్యబింబము కప్పబడినట్లు కప్పబడెను. కాన సర్వప్రాణులు పరమాత్మతత్త్వమును తెలిసికొనకపోవుటచేతనే "నేను, నాసంబంధమైనది" అను యహంకార మమకారములచే నేనొసగినదానిచే పర మేశ్వరుడు సంతోషించును; సంతోషించి నేను కోఱినదానిని నాకిచ్చును; దానిని నేను భుజించగలను; భుజింప జేయగలను అని మోహమును జెందుచు పరతత్త్వము నెఱుంగనివారై సంసారసముద్రమునందు మునుగుచుండిరి.

శ్రీధరీయము :— భక్తుల ననుగ్రహించునట్టియు, అభక్తులను నిగ్రహించునట్టి పరమేశ్వరునకు వైషమ్యము సంభవించుచున్నది. అట్టి పరమేశ్వరున కాప్తకామత్వహేతుల ప్రాప్తించుననుశంకను "అజ్ఞానేన" అనువాక్య ముచే తొలిగించుచుండెను.

"నిగ్రహముకూడ దండరూపమగు నీశ్వరానుగ్రహమే" అను యజ్ఞానముచేతను "పరమేశ్వరుడు సర్వ సముడు" అను జ్ఞానమును కప్పిపుచ్చి యాహేతువుచేతనే జీవులు భగవంతునియందు వైషమ్యమును తలచుచుండిరి.

నీలకంఠీయము:— "ఏష హ్యేవ సాధు కర్మ కారయతి తం య మేభ్యో లోకేభ్య ఉన్నినీషతే ఏష హ్యేవాఽసాధుకర్మ కారయతి తం యమధో నినీషతే" (ఈయాత్మయే యెవరిని యూర్ధ్వలోకములను బొందించు యిచ్ఛకలవాడగునో వానిని (చే) పుణ్యకర్మను చేయించును. ఎవరిని యధోలోకమును పొందించు యిచ్ఛకలవా డగునో వానిని (చే) పాపకర్మలను చేయించును) అను శ్రుతిచే పరమేశ్వరునియందు కారయితృత్వము బోధించు చుండ "స్వభావస్తు ప్రవర్తతే" స్వభావమే ప్రవర్తించుచున్నదని యెట్లుచెప్పెద వనుశంకను "నాదత్తే" అను శ్లోకముచే తొలిగించుచుండెను.

పరమాత్మ విభువు నిష్క్రియు డగుటవలన కారయితృత్వము లేమిఁజేసి యెవనియొక్క పాపమును కాని పుణ్యమునుకాని స్వీకరింపడు సక్రియుఁడే ప్రవర్తకుఁడగును. అట్టివాడే తదీయమగు పుణ్యమునుకాని పాపమునుకాని పొందును. ఈయాత్మ యట్టివాడుకాడు. మరేమనిన? సూర్యునివలె ప్రకాశించును. కాని తనచే

గీ॥ జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశిత మాత్మనః।
తేషా మాదిత్యవ ద్జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్॥ ॥౧౬॥

పదవిభాగము:—జ్ఞానేన–తు–తత్–అజ్ఞానం–యేషాం–నాశితం–ఆత్మనః–తేషాం–ఆదిత్యవత్–జ్ఞానం–ప్రకాశయతి–తత్–పరమ్॥ ॥౧౬॥

ప్రతిపదార్థము:— యేషాం=యెవరియొక్క; ఆత్మనః=ఆత్మవిషయకమైన; తత్=ఆ; అజ్ఞానం=అజ్ఞానము; జ్ఞానేన=ఆత్మజ్ఞానముచే; నాశితం=నశింపఁజేయబడెనో; తేషాం=వారలకు; జ్ఞానం=ఆత్మజ్ఞానము; ఆదిత్యవత్=సూర్యుఁడువలె; తత్=ఆ; పరం=పరమార్థతత్త్వమును; ప్రకాశయతి=ప్రకాశింపఁజేయుచున్నది. ॥౧౬॥

---

ప్రకాశింపఁజేయఁడు కర్త్రాదుల కర్మచే సంబంధించబడడని భావము. ఈయాత్మకు కారయితృత్వముకూడ సూర్యునివలె సత్తామాత్రముచేతనే యని గ్రహింపనగును. (సూర్యుఁడు ప్రకాశించుచుండ ప్రాణులు తమతమ కృత్యములను నెరవేర్చుకొనెదరు. అట్టికర్మలయందు సూర్యునకు కారయితృత్వము కలదా? లేదు. అయినను సూర్యప్రకాశ యున్నపుడే కర్మల నాచరించుటచే సూర్యునకు కారయితృత్వము కలద నెదరు. అది సూర్యుని సత్తామాత్రముచేతనేకాని వాస్తవికముగ సూర్యునికి కారయితృత్వము లేదు. అట్లే పరమాత్మకుకూడ స్వసత్తామాత్రముచేతనే కారయితృత్వమని గ్రహింపదగును. కాన పైనుదహరింపబడిన శ్రుతికి విరోధములేదు.

అట్లగుచో యీశ్వరారాధనార్థము కర్మల నెందులకు చేసెదరు? ఈశ్వరారాధనార్థము కర్మల నాచరింపనిచో భయపడెదరు. అను శంకను "అజ్ఞానే నావృతం" అనుదానిచే తొలిగించుచుండెను.

సార్వభౌముఁడగు మహారాజానకు "నేను సర్వేశ్వరుఁడను" అనుజ్ఞానము నిద్రాసంబంధమగు నజ్ఞానముచే నావరించఁడు నపుడు అట్టిసార్వభౌముఁడు వివిధమగు పరరాజ్యములను, గొప్ప సంకటశతములను చూచును.. ఎంత ఆశ్చర్యము! "నేను దీనుడనైతిని, దుఃఖితుడనైతిని" అని మోహపడును. అట్లేయీజీవులును తనకు "అహంబ్రహ్మాస్మి" అను ప్రమాణముచే సిద్ధించెడిబ్రహ్మభావమునుయెఱుంగనివారై యీశ్వరునికంటెతనను వేరుగతలచువారై యీశ్వరుఁడు సేవ్యుఁడు, నేను సేవకుఁడను అని యీశ్వరునకు తనకు సేవ్య సేవకభావమునుమాచుచు మోహపడుచుండిరి. ఈవిషయమునే "అథ యో౽న్యాందేవతా ముపాస్తే ౽న్యో౽సావన్యో౽హమస్మీతి న సవేదయథా పశురేవ సదేవానాం" ఎవడు నేనువేరు దేవతవేరని యభిప్రాయము కలవాడై యన్యదేవత నుపాసించునో వాడాత్మతత్త్వమును తెలిసినవాడుకాడు. అట్టివాడు మనచే నొసగబడు తృణజలాదులను స్వీకరించి పశు వెట్లుసంతసించునో అట్లేదేవాదులచే నివ్వఁబడు యాహారాదులను స్వీకరించి యంతమాత్రముచే తృప్తుడై సంతసించును. అనగా నట్టి యాత్మస్వరూపానభిజ్ఞుడుకూడ పశుతుల్యుడనిశ్రుతియు బోధించుచున్నది. "ఏషహ్యేవ" అను శ్రుతియు భ్రాంతజనవ్యవహారవిషయుమే యనిభావము. ॥౧౫॥

## —: ౫వ అధ్యాయము. ౧౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. :—

మధుసూదనసరస్వతీయము :— అజ్ఞానముచే జ్ఞానమావరింపబడినచో సర్వులు అనాద్యజ్ఞానావృతులగుటం జేసి యెవరికిని సంసారమునుండి నివృత్తి లేకపోయెడిని అనుశంకను "జ్ఞానేన" అనుశ్లోకముచేతొలిగించుచుండెను

ఆవరణవిక్షేపశక్తులు కలది, అనాది, అనిర్వాచ్యము, అనృతము, అనర్థసమూహమునకు కారణము, ఆత్మయే యాశ్రయముగాగలది, ఆత్మవిషయకము అజ్ఞానము. అట్టి యజ్ఞానము అవిద్య, మాయా అనుశబ్దములచే చెప్పఁబడును. అట్టియజ్ఞానము "జ్ఞానేన" గురూపదిష్ట వేదాన్తమహావాక్యజన్యము, శ్రవణమననినిదిధ్యాసనపరిపాకముకలన నిర్మలమైన యంతఃకరణవృత్తిరూపము; నిర్వికల్పకసాక్షాత్కారరూపము, శోధితతత్త్వం పదార్థాభేదరూప శుద్ధసచ్చిదానందాఖండైకరసవస్తుమాత్రవిషయకము నగు జ్ఞానముచే "యేషాం" శ్రవణమననాది సాధనసంపన్నులు, భగవదనుగృహీతులు నగు యేముముక్షువుల "తదజ్ఞానం" యాయజ్ఞానము శుక్తియందు రజ

**శాంకరభాష్యమ్:—**

జ్ఞానేనేతి । జ్ఞానేన తు యేనాజ్ఞానేనావృతా ముహ్యంతి జంతవ స్తదజ్ఞానం యేషాం జంతూనాం వివేకజ్ఞానేనాత్మవిషయేణ నాశిత మాత్మనో భవతి తేషా మాదిత్యవ ద్యథాదిత్య స్సమస్తం రూపజాత మవభాసయతి తద్వజ్జ్ఞానం జ్ఞేయం వస్తు సర్వం ప్రకాశయతి తత్పరం పరమార్థతత్త్వమ్ ॥౧౬॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

ఏ యజ్ఞానముచే నావరింపఁబడినవారై సంసారులు మోహమును బొందుచుండిరో, అట్టివారల యాత్మవిషయకాజ్ఞాన మాత్మజ్ఞానముచే నశింపచేయబడునో, అట్టివారలకు సూర్యుఁడు నిఖిలరూపజాతమును ప్రకాశింపజేయునటుల యాత్మజ్ఞానము జ్ఞేయమగు నిఖిలవస్తువును, అనగా ప్రసిద్ధమగు పరమార్థతత్త్వమును ప్రకాశింపఁజేయును. ॥౧౬॥

తమువలె కాలత్రయమునం దసత్తయై, అసత్తగుటచే యధిష్ఠానచైతన్యమాత్రత్వమును పొందించబడి శుక్తిజ్ఞానముచే శుక్త్యజ్ఞానము నశించునో అట్లే నశించును. సూర్యుడు తానుదయించుటమాత్రముచేతనే నిరవశేషముగ తమస్సును నివర్తింపఁజేయును. ఏసహాయాంతరము నపేక్షింపదు. అట్లే శుద్ధసత్త్వపరిణామరూపమగుటఁజేసి బ్రహ్మజ్ఞానముకూడ వ్యాపకప్రకాశరూపము. తానుదయించినంతమాత్రముననే సహకార్యంతరము నపేక్షింపకయే కార్యముతోగూడిన యజ్ఞానమును నివర్తింపఁజేయుచు సత్యజ్ఞానానంతాదిరూపము, సజాతీయ విజాతీయ స్వగతభేద శూన్యము నగు పరమాత్మతత్త్వమును ప్రతిఛాయాగ్రహణమాత్రరూపమగు కర్మాంతరముచేతనే అభివ్యక్తము జేయుచున్నది.

ఇచట "అజ్ఞానం" అను శబ్దమునకు జ్ఞానాభావమని యర్థమా? లేక యజ్ఞానమనగా సవిషయకము, భావరూపము నగు నొకానొకపదార్థమని యర్థమా? అభావరూపమే యన్నచో అట్టి యభావము దేనిని యావరింపలేదు. మఱియు జ్ఞానాభావరూపమగు యజ్ఞానము స్వభావముచే నాశరూపమగుటంజేసి జ్ఞానముచే నశింపదు. కాన సవిషయకమగు భావరూపమే యజ్ఞానమని యొప్పుకొనవలయును. ఈవిషయమునే "అజ్ఞానే నావృతం, జ్ఞానేన నాశితం" అనువాక్యద్వయముచే స్పష్టపరుపబడెను. అభావరూపమగునది దేనికిని ఆవరకము కాదు. జ్ఞానముచే నశించునదియు కాదు. "అజ్ఞానే నావృతం" అనిచెప్పుటవలన జ్ఞానమునకజ్ఞాన మావరకమని చెప్పుటచేతను "జ్ఞానేన నాశితం" అని చెప్పుటచే జ్ఞానముచే నశించునది యని చెప్పుటవలనను అజ్ఞానమభావరూపము కాదు సవిషయకమగు భావపదార్థమేయని స్పష్టమగుచున్నది. ఇదియే భగవన్మతము. దీనిని విస్తారముగ దెలిసికొనతలచినవారు నాచే రచియింపబడిన యద్వైతసిద్ధిని గమనింపుడు.

"యేషాం" అని బహువచనముచే యట్టిజ్ఞానము సర్వులకు కలుగదు; యొవరికో కొందఱికే కలుగుననునియమముచూపబడెను. ఈవిషయమునే "తద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ త దభవ త్తథర్షీణాం తథా మనుష్యాణాం తదిద మప్యేతర్హి య ఏవం వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదం సర్వం భవతి" ఈశ్రుతియు బోధించుచున్నది. మరియు నీశ్రుతియే యజ్ఞానము యద్విషయకము యేది యాశ్రయముగా కలదో తద్విషయకము తదాశ్రయకము నగు ప్రమాణజన్యజ్ఞానమువలన నట్టి యజ్ఞానము నశించుననను న్యాయప్రాప్తమగు నియమమును సూచించుచున్నది.

అందజ్ఞానగతమగు యావరణము—సత్తునకసత్త్వాపాదకమనియు, భాసించుదానికభావాపాదకమనియు రెండువిధములు. ఆరెంటిలో సత్తునకసత్త్వాపాదకమగు యావరణము పరోక్షాపరోక్షసాధారణప్రమాణజ్ఞానమాత్రమువలన నివర్తించును. ధూమముచే పర్వతమునందు వహ్నినూహించుట యనుమితి యనఁబడును. అట్టి యను

మిటి కలవానికి "పర్వతమునందు వహ్ని లేదు" అను భ్రమ తొలఁగును. అట్లే "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను వాక్యమువలన పరోక్షజ్ఞాన (నిశ్చయ) ముండినను "బ్రహ్మ లేదు" అనుభ్రమ నివర్తించును. బ్రహ్మము కలదు కాని నాకు భాసించుటలేదు అనెడి భ్రమజనకము రెండవదియగు అభానావరణము బ్రహ్మసాక్షాత్కారము వలననే నివర్తించును. అట్టి నిర్వికల్పక సాక్షాత్కారము వేదాన్తవాక్యములచేతనే జనించును. అను నిట్టివిషయము లద్వైతసిద్ధియనుగ్రంథమునందు దెలియనగును. ॥౧౬॥

శంకరానందీయము :— సర్వులు యజ్ఞానముచే నావరింపబడిన జ్ఞానము కలవారై యుండ ముముక్షువుల కాత్మజ్ఞానావిర్భావ మెట్లు సంభవించును ? యెట్లు వారలకు ముక్తి సంభవించును ? అని శంకింపఁజనదు ఈశ్వర ప్రీతికొఱ కాచరింపబడిన నిత్యనైమిత్తికకర్మల యనుష్ఠానముచే యెపుడు చిత్తపరిపాకము సంభవించునో అట్టితరి సమ్యగ్జ్ఞాన మదయించును. అసమ్యగ్జ్ఞానమే యజ్ఞానమును నశింపజేసి పరతత్త్వమును ప్రకాశింపజేయును. అపుడు వారు ముక్తిని పొందుదురని "జ్ఞానేనతు" అనునది మొదలుగా గల రెండుశ్లోకములచే జెప్పుచుండెను.

జ్ఞానవ్యతిరిక్తమున కజ్ఞాననాశకత్వము సంభవింపదని సూచించుటకిచట "తు" అనుశబ్దము ప్రయోగింపబడెను.

కర్మోపాసనలచే పరిపక్వమైన చిత్తముకలవారలకు శ్రవణాదులచే జనించిన యాత్మవిషయకజ్ఞానముచే "ఆత్మనః" జ్ఞానాజ్ఞానములు బుద్ధిధర్మములగుటవలన బుద్ధిసంబద్ధము, బుద్ధినిష్ఠము అగునది యజ్ఞానము. పటలముచే (పొరచే) ఆవృతి, అనావృతి చక్షుస్సుకేకాని ఘటమునకు కాదు. అట్లే జ్ఞానాజ్ఞానములు బుద్ధిధర్మములేకాని యాత్మధర్మములు కావు. అట్లగుచో "అహం" అనుప్రత్యయమే లేకపోయెడిని. యేయజ్ఞానముచే ప్రాణులు మోహపెట్టబడినవారై సంసారమును బొందుచుండిరో అట్టి బుద్ధిసంబంధి సర్వానర్థబీజము నగు యజ్ఞానము సూర్యోదయముచే చీకటివలె నశింపజేయబడునో అట్టి శుద్ధాత్మకు జనించిన యాయాత్మజ్ఞానము ఉదయించిన సూర్యుడు పదార్థముల నెట్లు ప్రకాశింపజేయునో అట్లే సర్వవేదాన్తప్రసిద్ధము, సత్యజ్ఞానాదిస్వరూపము, ప్రత్యగభిన్నమునగు పరబ్రహ్మమును ప్రకాశింపజేయును. సూర్యప్రకాశచే "ఇది స్థాణువే" అని జ్ఞానము కలిగినట్లు జ్ఞానప్రకాశచే "బ్రహ్మైవాహం" నేను బ్రహ్మస్వరూపుడనే అని తనను బ్రహ్మముగ దెలిసికొందురు. ॥౧౬॥

పరమార్థప్రప :— జ్ఞానులై మోహమును పొందరని "జ్ఞానేనతు" అనుశ్లోకముచే బోధించుచుండెను.

పూర్వమునందు జ్ఞానావరక మజ్ఞానమని చెప్పబడెను. అట్టియజ్ఞానము యెవరికి పరమేశ్వరవిషయకమగు జ్ఞానముచే తేజస్సుచే తమస్సభిభూతమగునట్లజ్ఞానము నశించునో వారల జ్ఞానము సూర్యుడువలె పరమేశ్వరుని ప్రకాశింపఁజేయును. ఎట్లాదిత్యతేజస్సు నిఖిలతమస్సును తిరస్కరించి ఆదిత్యుని ప్రకాశింపఁజేయునో అట్లే జ్ఞానము ఆవరకమగు యజ్ఞానమును తొలిగించి పరమేశ్వరుని ప్రకాశింపఁజేయును.

లేక సూర్యకిరణములే మేఘరూపమై సూర్యునే కప్పిపుచ్చును. కాని సూర్యునిచే చేయబడు దివసమున కుండు దినత్వమునుమాత్రము పోఁగొట్టనేరవు. ఈవిషయమే "ఘనచ్ఛన్న దృష్టిర్ఘనచ్ఛన్న మర్కం యథా నిష్ప్రభం మన్యతే చాతి మూఢః" (మేఘచ్ఛన్నదృష్టిగల మూఢుడు మేఘచ్ఛన్నమగు సూర్యుని కాంతిరహితుని గ తలచును) అవి యీ వాక్యమునందు జెప్పబడెను. పైవిషయమే యజ్ఞానమునందుండావరణశక్తికి యుదాహరణము. ఇట్లే యాత్మవిషయకమగు యజ్ఞాన మాత్మకే తిరోధాయకమగును. కాని యనుభూయమానమగు చిత్సంవిత్సుఖరూపత్వమునకుమాత్ర మభిభావకముకాదు. ఇదియే జ్ఞానోపాయము. వాజసనేయసంహితయందుండు "ఈశావాస్య మిదగ్ం సర్వం యత్కించ జగత్యాం జగత్ । తేన త్యక్తేన భుంజీథాః మాగృధః కస్య స్విద్ధనమ్ ॥ అను శ్రుతియు యీయర్థమునే స్పష్టపరచుచున్నది. ఈపృథివియందు శుక్తిరజతమువలె కాన్పించుచున్నట్టియు, నశ్వరము అగు నామరూపకర్మాత్మకమగు జగత్తును సత్యత్వాద్యైశ్వర్యములుగల పరమేశ్వరస్వరూపముచే నాచ్ఛాదింపవలెను. అనగా తిరస్కరింపవలెను. ఈశ్రుతియందుగల 'ఈశా' అనుశబ్దముచే తిరస్కారము ద్యోతితము. అదెట్లు తిరస్కరింపవలెననిన దీపముచ్చే తమస్సు తిరస్క-

గీ॥ తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠా స్తత్పరాయణాః।
గచ్ఛ న్త్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూత కల్మషాః॥ ॥౧౭॥

పదవిభాగము:—తద్బుద్ధయః-తదాత్మానః-తన్నిష్ఠాః-తత్పరాయణాః-గచ్ఛన్తి - అపునరావృత్తిం-జ్ఞాననిర్ధూతకల్మషాః॥ ॥౧౭॥

ప్రతిపదార్థము: — తద్బుద్ధయః=అపరమాత్మవిషయకజ్ఞానముకలవారై; తదాత్మానః=అపరబ్రహ్మమేయాత్మగాగలవారై; తన్నిష్ఠాః=అబ్రహ్మమునందేయకస్థానముగలవారై; తత్పరాయణాః=అపరబ్రహ్మమెయుత్కృష్టమైనగతికలవారైయుండెదరో; తే=వారు; జ్ఞాననిర్ధూతకల్మషాః=జ్ఞాన=జ్ఞానముచే, నిర్ధూత=నశింపజేయబడిన, కల్మషాః=సంసారకారణమైన దోషముకలవారై; అపునరావృత్తిం=పునరావృత్తిరాహిత్యమును; (మోక్షమును) గచ్ఛన్తి=పొందుచున్నారు. ॥౧౭॥

శాంకరభాష్యమ్‌:—

యత్పరం జ్ఞానం ప్రకాశితం తస్మి న్గతా బుద్ధి ర్యేషాం తే తద్బుద్ధయ స్తదాత్మాన స్తదేవ పరం బ్రహ్మాత్మా యేషాం తే తదాత్మాన స్తన్నిష్ఠా నిష్ఠాభినివేశ స్తాత్పర్యం సర్వాణి కర్మాణి సంన్యస్య బ్రహ్మణ్యేవావస్థానం యేషాం తే తన్నిష్ఠా స్తత్పరాయణాశ్చ తదేవ పర మయనం

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యత్పరమగు జ్ఞానము ప్రకాశితమో అట్టి బ్రహ్మమునందనేకసార్లనుష్ఠింపఁబడిన శ్రవణమనననిధిధ్యాసనములచే ప్రవృత్తమగు సాక్షాత్కారముకలవారు. అట్లగుచో తెలిసికొనువాడొకడు, తెలియబడువా డొకడు అని చెప్పుటవలన జీవబ్రహ్మములకు భేదము సిద్ధించునుకాని, జీవబ్రహ్మభేద మెట్లుసిద్ధించు నని శంకింపవలదు. జీవునియందుండు బోద్ధృత్వము, బ్రహ్మమునందుండు బోద్ధవ్యత్వము కల్పితములు. వస్తుతః భేదము లేదనిచెప్పుటకే "తదాత్మానః" అని చెప్పఁబడెను. అపరబ్రహ్మమే ఆత్మగాకలవారు. దేహాదులయందాత్మాభిమానమును వదలి బ్రహ్మమునందే "నేను బ్రహ్మస్వరూపమైతిని" అని యవస్థానము అనుష్ఠీయమానతత్తత్కర్మప్రతిబంధ

రింపబడును కాని తమస్సుచే దీపము తిరస్కరింపబడదు. అట్లే యని గ్రహింపనగును. దూరముగ పారద్రోలిన జగదాభాసచేతను అనగా జగత్తును పరమేశ్వరరూపముచే నాచ్ఛాదన చేసినచో జగత్తు త్యక్తమగును. అట్టిరీతిన జగత్తునుచేసి యవశిష్టమగు 'కస్య' పరబ్రహ్మముయొక్క 'ధనం' సుఖమును 'భుంజీథాః' అనుభవించుము. 'స్విత్' విషయసుఖమునుమాత్రము 'మాగృధః' కోరకుము అని యర్థము. ॥౧౬॥

—: ౫వ అధ్యాయము ౧౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— జ్ఞానముచే పరమాత్మతత్త్వప్రకాశ గలిగియుండ నట్టిజ్ఞానప్రకాశితము, పరమాత్మతత్త్వము నగు సచ్చిదానందఘనమునందె బాహ్యసర్వవిషయపరిత్యాగపూర్వకముగ సాధనపరిపాకమువలన పర్యవసితమగు సాక్షాత్కారస్వరూపమైనట్టి యంతఃకరణవృత్తిగలవారు 'తద్బుద్ధయః' అని యనిపించుకొనెదరు. యెల్లపుడు నిర్బీజసమాధిని పొందినవారు.

తెలిసికొనెడివారు జీవులు, తెలియబడునది బ్రహ్మతత్త్వ మగుచో బోద్ధృబోద్ధవ్యరూపమగు భేదము కలదుకదా అను శంకను తొలిగించుటకు "తదాత్మానః" అనిచెప్పబడెను. అపరబ్రహ్మమే యాత్మగా కలవారని యర్థము. ఈచెప్పుటచే బోద్ధృబోద్ధవ్యభావము మాయావిజృంభితము. అట్టిది వాస్తవికాభేదవిరోధి కానేరదని యాశయము.

శాంకరభాష్యమ్.—

పరా గతి ర్యేషాం భవతి తే తత్పరాయణాః కేవలాత్మరతయ ఇత్యర్థః । యేషాం జ్ఞానేన నాశిత మాత్మనోఽజ్ఞానం తే గచ్ఛంత్యేవంవిధా అపునరావృత్తి మపునర్దేహసంబంధం జ్ఞాననిర్ధూతకల్మషా యథోక్తేన నిర్ధూతో నాశితః కల్మషః పాపాదిసంసారకారణదోషో యేషాం తే జ్ఞాననిర్ధూతకల్మషా యతయ ఇత్యర్థః ॥౧౭॥

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

మువలన సిద్ధింపదను శంకను తొలిగించుటకు "తన్నిష్ఠాః" అని చెప్పఁబడెను. నిష్ఠయనగ నభినివేశము అనగా తాత్పర్యము. సర్వకర్మలను సంన్యసించి బ్రహ్మమునందే స్థితి కలవారని యర్థము. అట్లైనను మరియొకపురుషార్థమునం దపేక్ష యనెడి ప్రతిబంధమువలన బ్రహ్మమునందే స్థితిని పొందుటకు సమర్థులు కారను శంకను తొలిగించుటకు 'తత్పరాయణాః' అని చెప్పఁబడెను. ఆ పరబ్రహ్మమే యుత్కృష్టమైన గతిగా కలవారు తత్పరాయణులనంబడుదురు. అనగా ఒక యాత్మయందే రతి కలవారు అని యర్థము. తద్బుద్ధులు, తదాత్మలు, తన్నిష్ఠులు, తత్పరాయణులు అయినను ఇట్టివారల కీదేహపాతానంతరమున దేహాంతరపరిగ్రహవ్యగ్రులగుటచే ఎట్లు బ్రహ్మమునం దవస్థానము సంభవించు ననెదవా ? ఎవరలకు జ్ఞానముచే నాత్మయొక్క యజ్ఞానము నశింపఁచేయబడెనో అట్టియతులు సంన్యాసులు జ్ఞానముచేనశింపఁజేయబడిన పాపాదిరూపసంసారకారణము కలవారగుటచే (పునరావృత్తికిహేతువగు పాపాదికర్మము జ్ఞానముచే నష్టమగుటచే) అపునరావృత్తిని (తిరిగి దేహసంబంధములేమిని) అనగా మోక్షమును పొందుచున్నారు. ॥౧౭॥

"తదాత్మానః" అను విశేషణము రెండర్థములు గలది. అవిద్వద్వ్యావర్తకమగును. విద్వద్విశేషణమగును. అనగా అవిద్వాంసులు తదాత్ములు కారనియు, విద్వాంసులు తదాత్ములనియు బోధించును. వస్తుగతిని విచారించిన యవిద్వాంసులుగూడ బ్రహ్మమే యాత్మగాగలవారై యుండ "తదాత్మానః" అనువిశేషణ మజ్ఞానుల నెటు వ్యావర్తింపజేయునని శంకింపజనదు. ఈవిశేషణమున కితరాత్మత్వవ్యావృత్తియందు తాత్పర్యము. అనగా అజ్ఞు లనాత్ములగు దేహాదులం దాత్మాభిమానము గలవారుకాన తదాత్ములు కారని గౌణీవృత్తిచే చెప్పఁబడెదరు. విజ్ఞులన్ననో నివర్తించిన దేహాద్యభిమానము కలవారు (దేహాద్యభిమానము లేనివారు) అగుటచే "తదాత్ములు" (అబ్రహ్మమే యాత్మగా గలవా) రని చెప్పబడుచుండిరి. అందుచే "తదాత్మానః" అను విశేషణము సరియైనదే యని గ్రహింపనగును.

కర్మానుష్ఠానమునందు విక్షేపశక్తి కలిగియుండ దేహాదులయం దభిమానమెట్లు నివర్తించునను శంకను తొలిగించుటకు "తన్నిష్ఠాః" అని చెప్పబడెను. సర్వకర్మానుష్ఠానవిక్షేపనివృత్తిపూర్వకముగ అపరబ్రహ్మమునందే స్థితిగలవారని యర్థము. అనగా సర్వకర్మసంన్యాసపూర్వకముగ బ్రహ్మవిచారపరులని యర్థము. ఫలమునందు కోరికయుండ యాఫలసాధనమగు కర్మలను బదిత్యజించుట యెట్లుపొసగును ? అనుశంకను తొలిగించుటకు "తత్పరాయణాః" అనువిశేషణము చెప్పబడెను. "తదేవ" అపరబ్రహ్మమే పొందదగిన ముఖ్యస్థానముగా గలవారు తత్పరాయణు లనఁబడుదురు. అన్నిటియందు విరక్తులని యర్థము.

ఈశ్లోకమునందు "తద్బుద్ధయః అను పదముచే బ్రహ్మసాక్షాత్కారము చెప్పబడెను. "తదాత్మానః" అను దానిచే అనాత్మాభిమానరూపవిపరీత భావనానివృత్తి ఫలముగా గలనిదిధ్యాసన పరిపాకము, "తన్నిష్ఠాః" అనుదానిచే సర్వకర్మ సంన్యాసపూర్వకము, ప్రమాణప్రమేయగతాసంభావనానివృత్తిఫలకము, అగు శ్రవణ

మననపరిపాకరూపమగు వేదాన్తవిచారము చెప్పబడెను. "తత్పరాయణాః" అను దానిచే వైరాగ్య ప్రకర్ష చెప్పబడెను. ఇందుత్తరోత్తరము పూర్వపూర్వమునకు హేతువులు. అనగా తత్పరాయణులు కనుకనే తన్నిష్ఠులు, తన్నిష్ఠులు కనుకనే తదాత్ములు. తదాత్ములు, కనుకనే తద్బుద్ధులు. అనగా వైరాగ్యముచే శ్రవణమననపరిపాకరూపమగు వేదాంతవిచారము, అద్దానివలననిదిధ్యాసనము, దానివలన బ్రహ్మసాక్షాత్కారము కలుగువనియాశయము. పైనచెప్పబడినవిశేషణములుగల యతులు పునర్దేహసంబంధాభావరూపమగు ముక్తిని పొందుచున్నారు.

సకృన్ముక్తులకు పునర్దేహ సంబంధ మేకారణమువలన సంభవింపదు.? అనుశంకను "జ్ఞాననిర్ధూత కల్మషాః" అనుపదముచే తొలిగించుచుండెను, జ్ఞానముచే అనాద్యజ్ఞానము నివర్తింప అట్టియజ్ఞాన కార్యమగు పునర్దేహగ్రహణమునకు కారణమగు పుణ్యపాపాత్మకకర్మ నశించును. అట్టి కర్మనశింప తన్మూలకమగు పునర్దేహగ్రహణ మెట్లు సంభవించును? సంభవింపదని యాశయము. ॥౧౭॥

శంకరానందీయము:—"తేన త్యక్తేన భుంజీథాః మాగృధః కస్యస్విద్ధనమ్" అను శ్రుత్యుక్తరీతిని విదేహకైవల్యార్థులు తమకుకలిగిన యాత్మజ్ఞానమును రక్షింపవలయును. స్వాత్మనిష్ఠనుండి బాహ్యమగు దేనిని తెలిసికొనరాదని "తద్బుద్ధయః" శ్లోకముచే బోధించుచుండెను.

"తద్బుద్ధయః" సూర్యునిచే రూపమును ప్రకాశింపజేసినట్లు శ్రవణాది జన్యజ్ఞానముచే ప్రకాశింపజేయనట్టియు, సర్వవేదాన్తప్రసిద్ధము, సచ్చిదానందైకరసము, సర్వాత్మకము నగు పరబ్రహ్మమే విషయముగాగలజ్ఞానముకలవారు "తద్బుద్ధయః" అని చెప్పబడుదురు. అనగా సర్వత్ర బ్రహ్మమునే చూచువారు. ముముక్షువులు కల్పితమగు భేదమును గ్రహింపక చక్షుస్సుచే రూపమును గ్రహించినట్లు ప్రత్యగ్దృష్టిచే యెల్లపుడు అంతటను బ్రహ్మమునే తెలిసికొనవలయునని యర్థము.

"సర్వము బ్రహ్మమే" అని సర్వత్ర బ్రహ్మమే గ్రహింపబడుచున్నను గ్రహించువాడు, గ్రహింపబడునది అను భేదమే సంభవించెడిని. అట్లగుచో "ఏతస్మిన్నుదర మన్తరం కురుతే। అథ తస్య భయం భవతి" అనుశ్రుతి భేదద్రష్టకు భయమును బోధించుటచే అభేదముగనే బ్రహ్మమును తెలిసికొనవలయునని 'తదాత్మానః' అనుపదముచే జెప్పుచుండెను. అపరబ్రహ్మమే అహంప్రత్యయార్థముగాగలవారు "తదాత్మానః" అనబడుదురు. "బ్రహ్మైవాహం" అని స్వాత్మచే సాక్షాత్కృతమగు బ్రహ్మమునందే 'అహం' అను ప్రత్యయముగలవారు. కాని దేహమునం దహంప్రత్యయముకలవారు కారని యర్థము.

బాహ్యధ్వనిచే నాదధ్వని నశించినట్లు విద్వాంసునకు సమాధిదశయందు "నేను బ్రహ్మనే" అని బ్రహ్మయం దహంప్రత్యయమున్నను సమాధివ్యుత్థానదశయం దాహారాదులయందు, దేహమునందును యహంప్రత్యయముండును. అట్టి చిరకాలికము, ప్రబలము, స్థూలము నగు దేహాత్మప్రత్యయముచే బ్రహ్మాత్మప్రత్యయము నశించును. కాన బాహ్యమగు సర్వకర్మలను సంన్యసించి యాహారాది సర్వావస్థలయందును దృశ్యమగు బాహ్యపదార్థము లగ్రహింపని బ్రహ్మాత్మబుద్ధిచేతనే యుండవలయునని "తన్నిష్ఠాః" అనుదానిచే బోధించుచుండెను. బ్రహ్మమునం దాత్మాకారప్రత్యయకరణమే తన్నిష్ఠ. అనగా బ్రహ్మమునం దహంబుద్ధికి నిశ్చలత్వము. అట్టి నిశ్చలత్వము కలవారు తన్నిష్ఠులనంబడుదురు తనకు బ్రహ్మాత్మచే నవస్థితత్వదర్శులగు స్థిరీభూతవృత్తులు కలవారు అని యర్థము.

బ్రహ్మాత్మత్వదర్శనమునందు స్థిరీభూతచిత్తవృత్తులు కలవారైనను యొకానొకదానియందు ప్రయోజనాంతరాపేక్ష యుండెనచో నద్దానిచే బ్రహ్మాత్మత్వదర్శననిష్ఠ ప్రతిబంధింపబడి బ్రహ్మాత్మత్వము సంభవించెడిని. కాన ముముక్షువు బాహ్యమగు నేకార్యము నపేక్షింపక యెల్లపుడు బ్రహ్మాత్మత్వదర్శనపరుడై యుండవలెనని "తత్పరాయణాః" అనుదానిచే బోధించుచుండెను. తనచే తెలియబడినట్టియు, అద్వితీయము, చిదానందైకరసము నయిన చక్షుస్సునకు రూపమువలె లోపల వెలుపల బుద్ధివృత్తికి నియతమైన యాబ్రహ్మమే గతిగాగలవారు తత్పరాయణులనంబడుదురు. చిదాకారవృత్తిచే నెల్లపు డాహారవిహారాదులయందు బ్రహ్మాత్మదర్శనమును విడువనివారు. అనగా యెల్లపు డాత్మపరాయణులని యర్థము. ఇట్టిరీతిగ నంతటను బ్రహ్మదర్శనము, బ్రహ్మయం దాత్మత్వదర్శనము, తన్నిష్ఠత్వము, తత్పరాయణత్వము అను నీనాలుగింటిని యెవరనుష్ఠించెదరో అట్టి జ్ఞాననిర్ధూత-

గీ॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ పణ్డితా స్సమదర్శినః॥ ॥౧౮॥

పదవిభాగము:—విద్యావినయసమ్పన్నే - బ్రాహ్మణే-గవి-హస్తిని-శుని-చ-ఏవ-శ్వపాకే- చ- పణ్డితాః- సమదర్శనః ॥ ॥౧౮॥

ప్రతిపదార్థము:—పండితాః=ఆత్మజ్ఞానులు; విద్యావినయసమ్పన్నే=విద్య (వేదార్థవిజ్ఞానము)తోను, వినయము (నిరహంకారము) తోగూడిన; బ్రాహ్మణే=బ్రాహ్మణునియందును; గవి=గోవునందును; హస్తిని=గజమునందును; శునిచైవ=శునకమునందును; శ్వపాకేచ=శ్వప (మాదిగవాని) యందును; సమదర్శినః=ఏకము, అవిక్రియము నగు బ్రహ్మమునే చూచు స్వభావము కలవారు. ॥౧౮॥

శాంకరభాష్యమ్:—

యేషాం జ్ఞానేన నాశితమాత్మనోఽజ్ఞానం తే పండితాః కథం తత్త్వంపశ్యంతీత్యుచ్యతే-విద్యేతి। విద్యావినయసమ్పన్నే విద్యాచ వినయశ్చ విద్యావినయౌ, వినయ ఉపశమ స్తాభ్యాం విద్యావినయాభ్యాం సమ్పన్నో విద్యావినయసమ్పన్నో విద్వా న్వినీతశ్చ యో బ్రాహ్మణ స్తస్మిన్బ్రాహ్మణే గవి హస్తిని శునిచైవ శ్వపాకేచ పండితా స్సమదర్శినో విద్యావినయసంపన్న ఉత్తమసంస్కారవతి బ్రాహ్మణే సాత్త్వికే మధ్యమాయాంచ రాజస్యాం గవి సంస్కారహీనాయా మత్యంతమేవ కేవలతామసే హస్త్యాదౌచ సత్త్వాదిగుణైః స్తజ్జైశ్చ సంస్కారై స్తథా రాజసై స్తథా తామసైశ్చ సంస్కారై రత్యంత మేవాస్పృష్టం సమ మేక మవిక్రియం బ్రహ్మ ద్రష్టుం శీలం యేషాం తే పండితా స్సమదర్శినః ॥౧౮॥

శాంకరభాష్యార్థతత్త్వబోధినీ—

ఎవరియొక్క యాత్మజ్ఞానముచే యజ్ఞానము నశింపఁజేయబడునో, అట్టిపండితులు తత్త్వము నెట్లుతెలిసికొనెదరు ? వినుము చెప్పెద. విద్యయనగ వేదార్థవిజ్ఞానము. వినయమనగ నిరహంకారము. అట్టి విద్యావినయములతోగూడిన బ్రాహ్మణునియందును, గోవుయందును, గజమునందును, శునకమునందును, శ్వపాకునియందును, పండితులు సమదర్శులు. (అనగా) విద్యావినయసంపన్నుడు, ఉత్తమసంస్కారముకలవాడు, సాత్త్వికుఁడు నగు బ్రాహ్మణునియందును, మధ్యమము, రాజసము, సంస్కారవిహీనము, అగు గోవుయందును, అత్యంతము కేవల తామస మగుహస్త్యాదులయందును సత్త్వ రజస్తమోగుణములచేతను సత్త్వజన్య సంస్కారములచేతను, రజోగుణజన్య సంస్కారములచేతను, తమోగుణజన్య సంస్కారములచేత నత్యంతమసంస్పృష్టము, అద్వితీయము, కూటస్థము, అసంగము నగు బ్రహ్మమును తెలిసికొనుస్వభావముకలవారు పండితులు. (సాత్త్విక రాజస తామస ప్రకృతులయం దంతటను వ్యాపించియున్నది యొక్క బ్రహ్మమేయని జ్ఞానముకలవారగుదురు పండితులని యాశయము.) ॥౧౮॥

కల్మషులు. అనగా పైనచెప్పబడిన యంతరంగసాధన చతుష్టయానుష్ఠానముచే నప్రతిబద్ధముగ పొందిన బ్రహ్మజ్ఞానముచే నిశ్శేషముగ తొలిగించబడిన జగద్బ్రహ్మభేదము, జీవబ్రహ్మభేదము కలవారగుదురు. అట్టివారై పునఃదేహ సంబంధరాహిత్యరూపమగు ముక్తిని పొందెదరు. అనగా బ్రహ్మస్వరూపముగ స్థితిదశయందే వర్తమానదేహము పతితమైనను బ్రహ్మమునందు వృత్తిలీనమైయుండ బ్రహ్మాకారముగనే యుండెదరని యర్థము.॥౧౭॥

—: ౫వ అధ్యాయము. ౧౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— జ్ఞానికి వర్తమానదేహపతనానంతరమున జ్ఞానఫలమగు విదేహకైవల్యమును

గీ॥ ఇహైవ తై ర్జిత స్సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మా ద్బ్రహ్మణి తే స్థితాః॥ ॥౧౯॥

పదవిభాగము:—ఇహ—ఏవ—తైః—జితః—సర్గః—యేషాం—సామ్యే—స్థితం—మనః—నిర్దోషం—హి—సమం—బ్రహ్మ—తస్మాత్—బ్రహ్మణి—తే—స్థితాః॥ ॥౧౯

ప్రతిపదార్థము:— యేషాం=ఎవరియొక్క; మనః=మనస్సు; సామ్యే=సర్వభూతములయందు సమభావము కల బ్రహ్మమునందు; స్థితం=ఉండినదో; ఇహైవ=ఈలోకమునందే, (జీవించియున్నట్టియే) తైః=ఆ సమదర్శులగు పండితులచే; సర్గః=జన్మము; జితః=జయింపబడినది. హి=ఏ కారణమువలన; బ్రహ్మ=బ్రహ్మము; నిర్దోషం=దోషరహితము; సమం=అద్వితీయమే; తస్మాత్=ఆ కారణమువలన; తే=ఆ సమదర్శులగు పండితులు; బ్రహ్మణి=బ్రహ్మమునందు; స్థితాః=ఉండిరి. ॥౧౯॥

---

పూర్వ శ్లోకముచే చెప్పి ప్రారబ్ధకర్మవశమున నిదేహమున్నను జీవన్ముక్తి ప్రాప్తించునని "విద్యావినయసంపన్నే" అను శ్లోకముచే చెప్పుచుండెను.

వేదార్థపరిజ్ఞానముకాని, బ్రహ్మవిద్యకాని "విద్యా" అను శబ్దముచే చెప్పనొప్పును. వినయమనగ యహంకారము లేకపోవుట. అనగా ఔద్ధత్యరాహిత్యము. అట్టివిద్యావినయములతో గూడినట్టియు, బ్రహ్మవేత్తయు, వినీతుడు, సాత్వికుడు, సర్వోత్తముడు అగునట్టి బ్రాహ్మణునియందును; సంస్కారవిహీన మైనట్టియు, రాజసమైనట్టియు, మధ్యము మగు గోవుయందును, అట్లేఅత్యంతతామసము, సర్వాధమము అగునట్టి గజమునందు, శునకమునందు, శ్వపాకుని (షష్ఠుని) యందును సత్త్వరజస్తమోగుణములచేతను, వాటివలనజనించెడి సంస్కారములచేతను స్పృశింపబడని బ్రహ్మమును చూచునట్టి స్వభావముకలవారు పండితులు. అనగా గంగోదకమునందు, తటాకోదకమునందు, మద్యమునందు, మూత్రమునందును ప్రతిబింబించిన సూర్యునకు ఉపాధిభూతములగు గంగోదక, తటాకోదక, మద్య, మూత్రముల గుణదోష సంబంధము లేనట్లు చిదాభాసద్వారమున ప్రతిబింబించిన బ్రహ్మమునకును ఉపాధిసంబంధమగు గుణదోషముల సంబంధము లేదని తెలిసికొనినవారై అంతటను బ్రహ్మమునే తెలిసికొని రాగద్వేషరహితులగుటచే పరమానందస్ఫూర్తిచే జీవన్ముక్తిని యనుభవించుచుండిరి. ॥౧౮॥

శంకరానందీయము:—"తద్బుద్ధయస్తదాత్మానః" అను శ్లోకముచే బ్రహ్మవేత్తలగు యతులు కల్పితములగు నామరూపాత్మక ప్రపంచకమును తెలిసికొనక యెల్లపుడు అంతట బ్రహ్మమునే చూచుచుండవలెనని విధించి అట్టి బ్రహ్మదర్శనమునే "విద్యావినయసంపన్నే" అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను.

నిఖిలవేద శాస్త్రాధ్యయనము, లేక తదర్థ జ్ఞానముకాని విద్య యనబడును. వినయమనగ నమ్రత్వము, లేక ఉపశాంతి. ఇట్టివిద్యా వినయములచేతను, స్వధర్మపరత్వము, ప్రతిగ్రహవిముఖత్వము, సత్యము, శౌచము, దయా మొదలగు సుగుణములచేతను కూడినట్టి జగత్పూజ్యుడగు బ్రాహ్మణుని యందును; జాతిచేతను, గుణముచేతను, ధర్మముచేతను పరమనికృష్టతను బ్రతుకుటకు శునకమునైన పచనముచేయునట్టి లేక రేపటికైన ఆహారమునకుండునని వంటచేయునట్టి చండాలురయందును; జాతిచేతను, సంచారముచేతను, క్షీరాదులచేతను జగత్పావనియగు ధేనువుయందును; జాత్యాదులచే అతినికృష్టము తుచ్ఛపదార్థములను భుజించెడి శునకమునందును; రాజపూజ్యమగు భద్రగజమునందును చకారప్రాప్తమగు లోష్టాశ్మకాంచనాదులయందును; అంతటను తత్తద్ద్రవ్యములచేతను, తత్తద్గుణములచేతను, తత్తద్ధర్మములచేతను, తత్తత్కర్మలచేతను అసంస్పృష్టమైనట్టియు, ఎల్లపుడు ఆకాశమువలె నేకరూపమున సమరసముచేనుండు పరబ్రహ్మమును చూచు స్వభావము గలవారు. ఆరోపితములగు నామరూపాదులను గ్రహింపకయే అంతటను అధిష్ఠానభూత బ్రహ్మమాత్రదర్శనపరులు పండితులని యర్థము. పరావరైకత్వ విజ్ఞానముచే పుష్కలులగు పండితులు సర్వదా సమదర్శులే యగుదురు. ఒకానొకప్పుడును విషమదర్శులు కారు. అందుచే పండితులకు సమదర్శిత్వము ధర్మమని సూచింపబడెను. ॥౧౮॥

—: ౫వ అధ్యాయము ౧౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:—సాత్విక, రాజస, తామస, రూపములైనట్టియు, స్వభావముచే క్లిష్టము

శాంకరభాష్యమ్ :—

నన్వభోజ్యా న్నాస్తే దోషవంతః 'సమాసమాభ్యాం విషమసమే పూజాతః' ఇతి స్మృతేర్న తే దోషవంతః । కథం—ఇహైతి। ఇహైవ జీవద్భి రేవ తైస్సమదర్శిభిః పండితై ర్జితో వశీకృత స్సర్గో జన్మ యేషాం సామ్యే సర్వభూతేషు బ్రహ్మణి సమభావే స్థితం నిశ్చలీభూతం మనోఽన్తఃకరణం నిర్దోషమ్ । యద్యపి దోషవత్సు శ్వపాకాదిషు మూఢై స్తద్దోషై ర్దోషవదివ విభావ్యతె, తథాపి తద్దోషై రస్పృష్ట మితి నిర్దోషం దోషవర్జితం హి యస్మా న్నాపి స్వగుణభేదభిన్నం నిర్గుణత్వా

శాంకరభాష్యార్థబోధిని :—

'సమాసమాభ్యాం విషమసమే పూజాతః' అని గౌతమసూత్రము. అధ్యయనాదులచే సమానధర్మము కలవారలకు అనగా నొకగృహస్థుయింటికి యొక వేదమును మాత్రము చదివిన ముగ్గురు పురుషులు వచ్చినపుడాపురుషులకు వస్త్రాలంకారాదిపూజచే హెచ్చుతగ్గుగ నా ముగ్గురిపురుషులను యజమాని గౌరవించినచో, లేక, అసమానధర్మములుకల యతిథులుప్రాప్తించినపుడు అనగా బ్రహ్మవేత్త, షడంగాధ్యాయి, చతుర్వేదవిత్తు, త్రివేదవిత్తు, ద్వివేదవిత్తు, ఏకవేదవిత్తు ప్రాప్తించినపు డాయతిథులకు వస్త్రాలంకారాదిపూజచే సమానగౌరవము గావించినపు డా యజమాని ప్రత్యవాయము కలవాడగును. అందుచే నట్టి గృహస్థుని యన్నము నెవరును భుజింపరాదు. అనగా నట్టి యజమాని పంక్తిబాహ్యుడగుననుట అని గౌతమసూత్రము బోధించు

లగు ప్రాణులయందు సమత్వదర్శనము ధర్మశాస్త్ర నిషిద్ధము. గౌతమస్మృతియందు "సమాసమాభ్యాం విషమసమే పూజాతః" ఒక గృహస్థునియింటికి చతుర్వేదపారగులు, సదాచారసంపన్నులు యిద్దరుప్రాప్తించినపుడు వారిరువురికి పూజచేయు సమయమున ఒకనికి అధికపూజ రెండవవానికి తక్కువపూజ చేసినను, చతుర్వేదపారగుడగు సదాచారసంపన్నుడొకడు, ఒక వేదముమాత్రమే చదువుకున్న పురుషుడొకడు ప్రాప్తించినవాడు వారిరువురికి పూజచేయునపుడు ఒక వేదముచదువుకున్నవాని కధికపూజయు, చతుర్వేదపారగునకు తక్కువపూజయు చేసినచో ఆట్టిపూజ నొనరించిన యజమాని యన్నమును యెవరును భుజింపరాదు. అట్టియజమాని ధర్మహీనుడు, ధనహీనుడునగునని ఘోషించుచుండ పైనుడివిన సమత్వదర్శనము శాస్త్రనిషిద్ధమై యుండ నెట్లు సమంజసమగును ? యతులకు తాము నిర్వర్తించు పాకము, ధనములేదుకదా ? వారలకీవిషయము అనగా సమదర్శనము సంభవింపవచ్చుననెదవా ? వారలకు పాకము, ధనములేకున్నను ధర్మహానిరూపమగు దోషము ప్రాప్తించును కదా ? మరియు అభోజ్యాన్నత్వమనగా అశుచిత్వము. అట్టి యశుచిత్వము, తపోధనులకు తపస్సేధనము. అట్టి తపోధనహానిత్వముకూడ యతులకు సమదర్శిత్వమున్నచో సంభవించును కదా ? ఇట్టిదోషములు ప్రాప్తించుచుండ "అంతటను సమదర్శులగు పండితులు జీవన్ముక్తులు" అని చెప్పుటయెట్లు పొసగునను శంకను "ఇహైవ" అను శ్లోకముచే తొలిగించుచుండెను.

యెవరియొక్కమనస్సు విషమమగు సర్వభూతములయందుండునట్టి బ్రహ్మయొక్క సమభావమునందుండునో అట్టి సమదర్శులగు పండితులచే బ్రతికియుండగనే ద్వైతప్రపంచమతిక్రమింపబడెను. దేహపతనానంతరమతిక్రమించబడును. ద్వైతప్రపంచమని వేరుగ చెప్పనవసరములేదు. ఏందువలననిన ? బ్రహ్మము సర్వవికారశూన్యము, కూటస్థనిత్యము, ఏకము. కాననట్టి బ్రహ్మము నుత్తమమధ్యమాధమరూపోపాధులయందు చూచు సమదర్శులు బ్రహ్మమునందే యుండిరి. అనగా బ్రహ్మనిష్ఠులయి జీవన్ముక్తులగుదురని యర్థము.

ఈ శ్లోకమునకు నిష్కృష్టాశయమేమన? అదుష్టమగుదానికి దుష్టసంబంధమువలన సంభవించెడి దుష్టత్వమొకటి. స్వభావముచేతనే దుష్టమగుట రెండవవిధము. గంగోదకము స్వతఃపవిత్రమైనను మూత్రగర్తమునందు

**శాంకరభాష్యమ్॥—**

చ్చైతన్యస్య। వక్ష్యతిచ భగవా నిచ్ఛాదీనాం క్షేత్రధర్మత్వ మనాదిత్వా న్నిర్గుణత్వా దితిచ। నాప్యంత్యా విశేషా ఆత్మనో భేదకా స్సంతి ప్రతిశరీరం తేషాం సత్త్వే ప్రమాణానుపపత్తే రత స్సమం బ్రహ్మైకం చ తస్మా ద్బ్రహ్మణ్యేవ తే స్థితా స్తస్మాన్న దోషగంధమాత్ర మపి తా న్స్పృశతి దేహాదిసంఘాతాత్మదర్శనాభిమానాభావాత్। దేహాదిసంఘాతాత్మదర్శనాభిమాన

**శాంకరభాష్యతత్త్వబోధిని॥—**

చున్నది. కాన, సాత్త్వికుడగు బ్రాహ్మణుని యందును, రాజస మగు గోవు నందును, తామస మగు గజ శునక శ్వపాకుల యందును సమదర్శులు దోషవంతులు. కాన వారభోజ్యాన్నులు అని శంకింపవలదు. వారు దోషముకలవారు కారు. ఎందుల కట్టివారికి దోషము ప్రాప్తించ దనెదవా?

ఎవరి మనస్సు సర్వభూతములయందు సమానముగకల బ్రహ్మము నందుండునో జీవించి యున్నయట్టి సమదర్శు లగునట్టి పండితులచే జన్మము వశీకృతము. ఎందువలననిన, నద్వితీయము కూటస్థము నగు బ్రహ్మము దోషవర్జితము. కాన నట్టి బ్రహ్మనిష్ఠులు జన్మమును స్వాధీనమొన రించుకొనిరి. అనగా వారికి "సమాసమాభ్యాం" అను సూత్రోక్తమగు ప్రత్యవాయము ప్రాప్తింపదనుట.

దోషవంతులగు శ్వపాకాదుల యందుండు బ్రహ్మమునకు కూడ శ్వపాకాదిదోషము లుపలభ్యమానములగుటచే నిర్దోషము బ్రహ్మమనిచెప్పుటయసంగతమనెదవా? దోషముకలశ్వపా కాదులయందు బ్రహ్మము మూఢులచే శ్వపాకాదిదోషములచే దోషము కలవాడుగ విచారింప తలవబడుచుండెను. అయినను శ్వపాకాదిదోషములచే నసంస్పృష్టమే యగును బ్రహ్మము. కను కనే బ్రహ్మము దోషవర్జితమనఁబడును. దోషవత్త్వమనగ స్వగుణ విశేషముచే భిన్నమగుటకదా! ఆత్మచైతన్యము నిర్గుణమగుటవలన తనయందుండు గుణవిశేషమే లేనందున స్వగుణవిశేషముచే వేరగుటయను దోషవత్త్వమాత్మకు ప్రాప్తింప నేరదు. ఈవిషయమునే శ్రీకృష్ణపరమాత్మయు ఆత్మ యనాదియు, నిర్గుణమగుట వలన నిచ్ఛాదులంతఃకరణ ధర్మములని (క్షేత్రధర్మము లని) మున్ముందు చెప్పగలడు.

ప్రవేశించుటచే దుష్టమగును. మాత్రముస్వతఃదుష్టము. అందు దుష్టమగు శ్వపాకాదులయందున్న బ్రహ్మము శ్వపాకాది దోషములచే దుష్టమగునని మూఢులు తలచినను బ్రహ్మము ఆకాశమువలె అసంగమగుటవలన ఏదోష ములచేతను సంస్పృష్టము కాదు. ఈ విషయమునే "అసంగోహ్యయంపురుషః" ఆత్మ దేనితోటి సంబంధము లేనిది. "సూర్యోయథా సర్వలోకస్య చక్షు ర్నలిప్యతే చాక్షుషైర్బాహ్యదోషైః" ఏకస్తథా సర్వభూతాంత రాత్మా నలిప్యతే లోకదుఃఖేనబాహ్యః" సూర్యుడు సర్వలోకములకు చక్షుస్సై యెట్లుస్మదాది చక్షుస్సం బంధములైన బాహ్యదోషముల సంబంధములేనివాడగునో అట్లే ఒక పరమాత్మయే సర్వుల కంతరాత్మయై లోక దుఃఖముల సంబంధములేనివాడగును. అని శ్రుతులు ఘోషించుచున్నవి. ఈ చెప్పుటవలన యితరప్రయుక్త దోషము లాత్మకు సంభవించవని దేలినది. కామనాదిక మంతఃకరణధర్మమని "కామస్సంకల్పోవిచికిత్సా" ఇత్యాదిశ్రుతులు బోధించుటచే స్వతఃదోషములుకూడ లేనందున మాత్రాదులవలె స్వతఃదుష్టముకాదు. ఇట్టి

శాంకరభాష్యమ్:—

వద్విషయం తు తత్సూత్రం "సమాసమాభ్యాం విషమసమే పూజాతః" ఇతి పూజావిషయత్వ విశేషణాత్ । దృశ్యతే హి బ్రహ్మవిత్షడంగవిచ్చతుర్వేదవిదితిపూజాదానాదౌ గుణవిశేషసంబంధః కారణం బ్రహ్మతు సర్వగుణదోషసంబంధవర్జిత మిత్యతో బ్రహ్మణి తే స్థితా ఇతి యుక్తం। కర్మవిషయంచ సమాసమాభ్యా మిత్యాదిదం తు సర్వకర్మసంన్యాసివిషయం ప్రస్తుతం సర్వకర్మాణి మనసేత్యారభ్యాఽఽధ్యాయపరిసమాప్తేః । ॥౧౯॥

శాంకరభాష్యార్థబోధిని.—

ఆత్మకు స్వగుణ విశేషమువలన భేదము లేకున్నను. అంత్యవిశేషమువలన భేదము సిద్ధించునని శంకింపజనదు. ప్రతిశరీరమునం దాత్మభేదము సిద్ధించి చో తద్ధేతువులుగ నంత్యవిశేషములు సిద్ధించును. అంత్యవిశేషములు సిద్ధించినగాని ప్రతిశరీరమునం దాత్మభేదము సిద్ధించదు. వెర్రి కుదిరినకాని పెండ్లికాదు. పెండ్లియైనకాని వెర్రికుదర దనునటుల యన్యోన్యాశ్రయ దోషము ప్రాప్తించును. కానఅట్టి అంత్యవిశేషములు ప్రతిదేహమునం దుండుటయందు ప్రమాణము లేమింజేసి ప్రతిదేహమునం దాత్మభేదసిద్ధికి హేతువగు నంత్యవిశేషములు సంభవింపవు. కాన బ్రాహ్మణాది నిఖిలోపాధులయం దద్వితీయకూటస్థబ్రహ్మదర్శు లగు పండితులను దేహాది సంఘాతమునం దాత్మదర్శన రూపమగు యభిమానము లేనందున దోషలేశమైన స్పృశింపదు.

సర్వజీవులయందు సమత్వదర్శనమే యిష్టమగుచో 'సమాసమాభ్యాం విషమసమే పూజాతః'' అను గౌతమసూత్రము వ్యర్థమేయగునా? అని శంకింపఁజనదు. దేహాదిసంఘాతమే యాత్మయను జ్ఞానాభిమానము కలవారివిషయమై "సమాసమాభ్యాం'' అను గౌతమసూత్రము చెప్పఁబడెను. ఎందువలననిన? ఆసూత్రము నందు "పూజాతః'' అని పూజావిషయత్వ విశేషణము కలదు. పూజాదానాదుల యందు "ఇతడు బ్రహ్మవేత్తయనియు, షడంగవేత్త యనియు, చతుర్వేద వేత్తయనియు గుణవిశేష సంబంధము కారణముగ చూడబడుచున్నది. అతిథులందరు చతుర్వేదులగుచో వారలకు పూజచే వైషమ్యము ప్రాప్తించినచో, లేక, చతుర్వేదులు, షడంగవేత్తలు, బ్రహ్మవేత్తలు ప్రాప్తించినపుడు వారలకు పూజచే సామ్యముండినను వారలలో నెవరి

రెండువిధములగు దుష్టత్వము లాత్మకు లేనందున ఆత్మ "నిర్దోషం'' అని చెప్పబడెను. అట్టినిర్దోష బ్రహ్మ రూపమును తెలిసికొనిన యతులును నిర్దోషబ్రహ్మరూపులే. అట్టివారు కనుకనే జీవన్ముక్తులు. అట్టివారు "అభోజ్యాన్నాది దోషదుష్టులు'' అనిచెప్పుట యసంగతము.

అట్లగుచో "సమాసమాభ్యాం విషమసమే పూజాతః'' అనుస్మృతి గతి యేమనెదవా ? "తస్యాన్నమభోజ్యం'' అనిమొదటను, "పూజాతః'' అనిమధ్యను, అట్టి విషమపూజచేసిన వాడు "ధనాద్ధర్మాచ్చహీయతే'' అని యంతిమభాగమున దోషాంతరము శ్రూయమాణమగుటచే యీ పూజాదికర్త గృహస్థుడేయని తేలుచున్నది. కాన పైనుదహరించబడిన స్మృతి గృహస్థువిషయముకొని యతివిషయము కాదు. అని యాశయము. ॥౧౯॥

శంకరానందీయము:—ఎల్లప్పుడు సర్వస్థలములయందును బ్రహ్మమునే చూచువారై బ్రహ్మస్వరూపము చేతనే యుండెదరో అట్టివారలకే విదేహముక్తి. ఇతరులకు విదేహముక్తి సంభవించదని సూచించుటకు బ్రహ్మనిష్ఠులగు యతులకు బ్రతికియున్నపుడే ముక్తిసంభవించునని "ఇహైవ'' అను శ్లోకముచే జెప్పుచుండెను.

పరావరైకత్వ విజ్ఞానము, తదుద్బుద్ధిత్వాద్యన్తరంగసాధనములు గలిగినట్టి సర్వకర్మసంన్యాసులగు శ్రో బ్రహ్మవేత్తల మనస్సుయెల్లపుడు "సామ్యే'' సమరసమగు పరబ్రహ్మమునందే నిశ్చలముగనుండునో, ఎవ

శాంకరభాష్యతత్త్వబోధః:—

ౖకైన మనస్సు వికారమును పొందిన యెడల పూజచే చేయు గృహస్థు ప్రత్యవాయమును పొందునని యాసూత్రమవిద్వద్విషయముగ సమన్వయించుకొనవలయును. బ్రహ్మము సర్వగుణదోషవర్జితము. కాని గుణదోషములు లేని బ్రహ్మమునందు స్థితికలవారు సమదర్శులగు విద్వాంసులు. కాన బ్రహ్మాత్మ దర్శనాభిమాన వంతులకు గుణ దోష సంబంధము లేమింజేసి "సమాసమాభ్యాం" అను సూత్రము జ్ఞాని విషయము కాదు. "సమాసమాభ్యాం" అను సూత్రము కర్మి విషయము. ఈప్రస్తుతమగు సమత్వ దర్శనమన్ననో "సర్వకర్మాణి మనసా" అని యారంభించి యధ్యాయ పరిసమాప్తివరకు నచటచట సర్వకర్మమే చెప్పుటవలన సమత్వదర్శనము సర్వకర్మ సంన్యాస విషయము. కాన నిరహంకారి యగు సమదర్శివిషయమై "సమాసమాభ్యాం విషమసమే పూజాతః" అను సూత్రము నిరవకాశము. ॥౧౯

సర్వత్ర బ్రహ్మమును చూచెదరో, చూచియు ఆదాత్మ్యమును బొంది బ్రహ్మమునందే నిష్ఠను చేయుదురో, అనగా తదాత్మతాపన్నమగు వృత్తిచే కాలమును వెళ్ళబుచ్చెదరో అట్టి లక్షణములుగల బ్రహ్మవేత్తలచే బ్రతికియుండగనే భవిష్యద్దేహసంబంధరూపమగు జన్మ పరిహరింపబడుచున్నది. అవిద్యాకామకర్మలు శరీరారంభకములు. అద్వితీయ బ్రహ్మమునందు జగద్బుద్ధిని, దేహాదులయందు అహం మమాభిమాన బుద్ధిని సంపాదించు వాసనయే యవిద్యయనఁబడును. అట్టి యవిద్యవలననే కామములు, అట్టి కామములవలననే కర్మలు సంభవించును. అట్టి యవిద్యాకామకర్మలు నిత్యనిరంతర బ్రహ్మనిష్ఠచే నిశ్శేషముగ నశించుచుండ "కారణనాశముచే కార్యము నశించు" ననున్యాయముచే అవిద్యాకామకర్మల కార్యమగు భావిదేహసంబంధముకూడ నశించునని "ఇహైవ తైర్జితస్సర్గః" అనుదానిచే జెప్పుచుండెను. బ్రహ్మవేత్తలకు యేదో యొకచోట బాహ్యాలంబనము లేనిదే యెల్లపుడు బ్రహ్మమునందే బ్రహ్మస్వరూపముచే నవస్థానమెట్లు సంభవించును? అని శంకింపజనదు. వారల మనస్సు అతినిర్మలమగుటవలనను, బ్రహ్మసుఖానుభూతిరసికమగుటవలనను, అట్టి బ్రహ్మనిష్ఠను సంపాదించు పుణ్యసంపత్తికలదగుటవలనను సదానందైకరసస్వరూపమగు బ్రహ్మమునందు స్థితి సంభవించునని సూచించుటకు బ్రహ్మకానందరూపత్వమును "నిర్దోషం హి" అనుపదముచే జెప్పుచుండెను.

ఇచట దోషశబ్దముచే దుఃఖము చెప్పబడును ఏకారణమువలన బ్రహ్మము దుఃఖలేశముకూడ లేనిదో అనగా ఆనందరూపమోయని యర్థము. ఈ ఆనందరూపత్వమునే "ఆనందో బ్రహ్మ విజ్ఞాన మానందంబ్రహ్మ। స్వప్రకాశమానందఘనం" ఇత్యాదిశ్రుతులు బోధించుచున్నవి.

బ్రహ్మమానందరూపమైనను అనృత జడదుఃఖాత్మకమగు ప్రపంచసంబంధముకూడ సంభవించుటచే ఒకనొక ప్రదేశమున బ్రహ్మమునకు దుఃఖలేశముకూడ సంభవించునని శంకింపజనదు. "మాయామాత్రమిదం ద్వైతం: అసత్త్వాదన్యస్య నహ్యస్తి ద్వైతసిద్ధిరాత్మైకసిద్ధోఽద్వితీయః। ఏకమేవాద్వితీయం। అద్వయోహ్యయమాత్మైకఏవ" ఇత్యాదిశ్రుతులుచే జగత్తునకసత్త్వము, బ్రహ్మమునకద్వితీయత్వము బోధింపబడుచున్నది. కాన మరుప్రదేశమునకు జలసంబంధమువలె బ్రహ్మమునకు మిథ్యాభూతప్రపంచము సంభవించును కాని (మిథ్యాప్రపంచరూపదుఃఖముయొక్క లేశముగూడ సంభవించదు) కాన యెల్లపుడు అంతటను బ్రహ్మమేకరసమేయని "సమం" అనుపదముచే బోధించుచుండెను. "సద్ఘనోఽయంచిద్ఘన ఆనందఘన ఏకరసః" ఇత్యాదిశ్రుతులచే, నంతటను పరబ్రహ్మము ఎల్లపుడేకస్వభావమే యగుచున్నది. లవణపిండమువలె సమరసమగుటవలన సజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యమై యగుచున్నది. కాన సదానందైకరసమే పరబ్రహ్మము. కాని అవిద్యాతత్కార్య తద్ధర్మ తత్కర్మలేశసంపృక్తము కాదు. కాన బ్రహ్మవేత్తల మనస్సు బ్రహ్మనందామృతరసాస్వాదాసక్తిచే బ్రహ్మమునందే యుండును. యెల్లపుడు యే బ్రహ్మవేత్తలగు యతీశ్వరుల మనస్సు ఆనందఘనమగు బ్రహ్మమునందే యుండునో అట్టివారలే విదేహముక్తిని బొందుదురని యాశయము. ॥౧౯॥

గీ॥ న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య నోద్విజే త్ప్రాప్య చాప్రియమ్।
స్థిరబుద్ధి రసంమూఢో బ్రహ్మవి ద్బ్రహ్మణి స్థితః॥ ॥౨౦॥

పదవిభాగము:—న-ప్రహృష్యేత్-ప్రియం-ప్రాప్యం-న-ఉద్విజేత్-ప్రాప్య-చ-అప్రియం-స్థిరబుద్ధిః-అసంమూఢః-బ్రహ్మవిత్-బ్రహ్మణి-స్థితః॥ ॥౨౦॥

ప్రతిపదార్థము:— బ్రహ్మణి=బ్రహ్మమునందు; స్థితః=అవస్థానముకల; (బ్రహ్మనిష్ఠుడగు) బ్రహ్మవిత్=బ్రహ్మజ్ఞానముకలయతి; స్థిరబుద్ధిః=స్థిర=సందేహరహితమైన, బుద్ధిః=నిశ్చయాత్మకజ్ఞానముకలవాడై; అసంమూఢః=సంమోహములేనివాడై; ప్రియం=ఇష్టమైనవస్తువును; ప్రాప్య=పొంది; నప్రహృష్యేత్=సంతోషింపరాదు; అప్రియంచ=ఇష్టముకానివస్తువును; ప్రాప్య=పొంది; నోద్విజేత్=ఖేదమునుపొందవలదు. ॥౨౧॥

శాంకరభాష్యమ్:—

యస్మా న్నిర్దోషం సమం బ్రహ్మాత్మా తస్మాత్— న ప్రహృష్యే న్న ప్రహర్షం కుర్యా త్ప్రియ మిష్టం ప్రాప్య లబ్ధ్వా నోద్విజే త్ప్రాప్యైవ చాప్రియ మనిష్టం లబ్ధ్వా దేహమాత్రాత్మ దర్శినాం హి ప్రియాప్రియప్రాప్తి హర్ష విషాదస్థానే న కేవలాత్మదర్శిన స్తస్య ప్రియాప్రియ ప్రాప్త్యసంభవాత్। కించ సర్వభూతే ష్వేకః సమో నిర్దోష ఆత్మేతి స్థిరా నిర్విచికిత్సా బుద్ధి ర్యస్యసఃస్థిరబుద్ధిరసమూఢస్సన్మోహవర్జితశ్చస్యాద్యథోక్తబ్రహ్మవిద్బ్రహ్మణి స్థితోఽకర్మకృ త్సర్వ కర్మసంన్యాసీత్యర్థః ॥౨౦॥

శాంకరభాష్యతత్త్వబోధినీ—

ఇష్టప్రాప్తిచే హర్షమును, అనిష్టప్రాప్తిచే విషాదమును పొందుచున్న విద్వాంసుడుకూడ నెట్లు దోషరహితమగు బ్రహ్మమునందు స్థితిని పొందును? (పొందడని) శంకింప వలదు. పరమాత్మ దోషరహితము, అద్వితీయము. కాన, అట్టి యాత్మజ్ఞాన నిష్ఠావంతుడు ప్రియమును పొందిహర్షమును చేయడు. అప్రియమును పొంది యుద్వేగమును పొందడు. విద్వాంసునకుకూడ హర్ష

—: ౫వ అధ్యాయము. ౨౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. :—

మధుసూదనసరస్వతీయము:— నిర్దోషము, సమము బ్రహ్మము. అట్టియాత్మను సాక్షాత్కరింపజేసుకొనువాడు దుఃఖములయందనుద్విగ్నమనస్సుకలవాడై, సుఖములయందు కోరికలేనివాడై" అనుశ్లోకమునందే యీ శ్లోకపూర్వార్థము వ్యాఖ్యానించబడెను. ప్రియము ప్రాప్తించినపుడు సంతోషపడకపోవుట, అప్రియము ప్రాప్తించినపుడుద్వేగమును పొందకపోవుట జీవన్ముక్తుల స్వాభావికచరితమే. ఇక ముముక్షువులు ప్రయత్న పూర్వకముగ ప్రియముప్రాప్తించినపుడు సంతోషపడకపోవుట. అప్రియము ప్రాప్తించినపుడుద్వేగమును పొందకపోవుట నభ్యసింపవలెనని చెప్పుటకు "ప్రహృష్యేత్, ఉద్విజేత్" అని లిఙ్ ప్రత్యయములిచట ప్రయోగింపబడెను. అద్వితీయాత్మ దర్శనశీలునకు వ్యతిరిక్తమగు ప్రియాప్రియములు ప్రాప్తించనందున తన్నిమిత్తములు హర్షవిషాదములుకావని యర్థము. అట్టి యద్వితీయాత్మ దర్శనమునే "స్థిరబుద్ధిః" అనుదానిచే వివరించుచుండెను.

"స్థిరబుద్ధిః" నిశ్చలమైనబుద్ధికలవాడు. అనగా సర్వకర్మసంన్యాసపూర్వక వేదాన్తవాక్య విచార పరిపాకముచే సర్వసంశయములు లేనివాడగుటచేత బ్రహ్మమునందు నిశ్చితమైననిర్విచికిత్సాత్మకమగు బుద్ధికలవాడు. పొందబడిన శ్రవణ మనన ఫలముకలవాడు అని నిష్కృష్టాశయము. అట్టివానికి శ్రవణమననములచే సంశయాసంభావనలు సంభవింపకున్నను విపరీత భావనారూపప్రతిబంధము వలన సాక్షాత్కారము సంభవించదు. కాన అట్టివిపరీత భావనా రూపప్రతి బంధనను తొలగించుటకు నిదిధ్యాసనను "అసంమూఢః" అనుపదముచే చెప్ప

శాంకరభాష్యతత్త్వబోధిని:—
విషాదప్రాప్తికి హేతువులగు ప్రియాప్రియములు ప్రాప్తించుచుండ హర్షవిషాదములను విద్వాంసుఁడు చేయఁడని చెప్పుట యెట్లు సమంజసమగునని శంకింపఁజనదు. దేహమాత్రము నాత్మగ జూచువారల కీప్రియాప్రియములు ప్రాప్తించును. అట్టి హర్షవిషాదము లాదేహమాత్రాత్మదర్శికే హర్షవిషాదములకు హేతువులగును. కేవలాత్మదర్శియగు బ్రహ్మనిష్ఠునకు ప్రియాప్రియప్రాప్తియే సంభవింపనందున నట్టిబ్రహ్మనిష్ఠుఁడు హర్షవిషాదములను పొందఁడు. అనగా సద్వితీయ బ్రహ్మజ్ఞానము కలవానికి బ్రహ్మము కంటె వేరుగ నేదియు లేనందున బ్రహ్మవ్యతిరిక్త ప్రియాప్రియప్రాప్తి సంభవింపదు. హేతువులగు ప్రియాప్రియములు సంభవించనిచో తత్కార్యములగు హర్షవిషాదములు శశవిషాణములే యగును.

మరియు సర్వభూతములయందు సముడు, అద్వితీయుడు, దోషరహితుడు, బ్రహ్మ మొక్కఁడే, అని నిర్దోష బ్రహ్మమునందు దృఢమగు జ్ఞానము కలిగినట్టియు, హర్షవిషాదములకు హేతువగు సంమోహము లేనట్టి విద్వాంసుఁడు అశేషదోషశూన్యమగునట్టి యాబ్రహ్మమునందే స్థితికలవాఁడై బ్రహ్మస్థిత్యనురోధమువలన కర్మలను సహింపనివాఁడై సర్వకర్మసంన్యాసియై యుండ నట్టివానికి హర్షవిషాదములు తలచుటకైన శక్యములుకావు. ॥౨౦॥

చుండెను. నిదిధ్యాసనమనగ విజాతీయ ప్రత్యయములు లేకుండగనుండు సజాతీయ ప్రత్యయ ప్రవాహము. అట్టి నిదిధ్యాసనముయొక్క పరిపాకముచే విపరీతభావనయనే సమ్మోహములేనివాడు. అట్టి నిదిధ్యాసనము వలన సర్వ ప్రతిబంధములు తొలఁగుట వలన బ్రహ్మసాక్షాత్కారము కలవాడు సమాధిపరిపాకముచే నిర్దోషము, సమము అగు బ్రహ్మమునందే స్థితుడై జీవన్ముక్తుడై స్థితప్రజ్ఞుడగును. అనియర్థము. ఇట్టివానికి ద్వైతదర్శనము లేనందున ప్రహర్షము, ఉద్వేగము సంభవించవు అనిచెప్పుట న్యాయమే. సాధకుడన్నచో ద్వైతదర్శనము సంభవించినను విషయములయందు దోషదర్శనాదులచే హర్షవిషాదములను విడువవలయునని భావము. ॥౨౧॥

శంకరానందీయము:— విదేహముక్తికాముడు; బ్రహ్మవేత్త. సర్వమును సన్యసించి యెల్లపుడు బ్రహ్మమునందే బ్రహ్మస్వరూపముచే నుండునట్టి యతికి భావిజన్మహేతువులు అనిష్టములు అగునవి సర్వకామములు, సర్వవాసనలు. వాటినివృత్తియే సర్వవాసనా సంక్షయము, సర్వకామ పరిత్యాగము (త్యాగము), సర్వ కర్మప్రవిలయ మనెడి యీమూడును ఆశ్లేష్ఠ బ్రతికియున్న కాలమునందు దృష్టదుఃఖానుపలబ్ధియు, సదానందానుభూతియు, విదేహకైవల్య ప్రాప్తియనెడి ఇష్టముయొక్క ప్రాప్తి. యిట్టి పురుషార్థము సిద్ధించును. కానశ్రవణాదులచే లెస్సగ దెలియబడిన ఆత్మతత్త్వముగల ముముక్షువగు యతికి బ్రహ్మనిష్ఠ అవశ్యకర్తవ్యమని సూచించుటకు బ్రహ్మయోగము నాచరించువానికి కర్తవ్యమని "నప్రహృష్యేత్ప్రియం" అనుశ్లోకముచే బోధించుచుండెను.

"బ్రహ్మణి స్థితః" సర్వత్ర బ్రహ్మమాత్ర దర్శన మనెడి సమాధియందు ప్రవృత్తమైన బ్రహ్మవేత్త యగునట్టి యతి "ప్రియం ప్రాప్య" భిక్షాటనాదికమునందు యదృచ్ఛచేగాని ప్రారబ్ధ కర్మఫలము వలనగాని ప్రాప్తమైన ఇష్టవస్తువును పొందిగాని, ఇష్టమగు వాక్యమును వినిగాని, పూజాదిరూపమగు ఇష్టకర్మను చూచిగాని, స్పృశించి కాని, రమ్యబుద్ధిచే కాని, ఇష్టమనెడి బుద్ధిచేకాని సంతోషమును పొందరాదు. ఎందువలననిన ప్రహర్షమనునది యనాత్మధర్మము. అట్టి యనాత్మ ధర్మమగు ప్రహర్షమును పొందిన తనకనాత్మతాదాత్మ్యము సంభవించును. అట్టి యనాత్మ తాదాత్మ్యము సంభవించిన ఆసదారోపణము సంభవించెడిని. వస్తువుయొక్క నామరూప గుణవిశేషముల విమర్శనము లేనిదే సమీచీనత్వ బుద్ధి, ఇష్టతాబుద్ధి జనింపదు. సమీచీనత్వబుద్ధి

గీ॥ - బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా విన్ద త్యాత్మని య త్సుఖమ్।
స బ్రహ్మయోగయుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే॥ ॥౨౧॥

పదవిభాగము:—బాహ్యస్పర్శేషు-అసక్తాత్మా-విన్దతి-ఆత్మని-యత్-సుఖం-సః - బ్రహ్మయోగయుక్తాత్మా-సుఖం-అక్షయం-అశ్నుతే।

ప్రతిపదార్థము:— ఆత్మని=ఆత్మయందు; యత్=ఏ; సుఖం=సుఖము; వర్తతే = (ఈపదమధ్యాహార్యము) ఉంటున్నదో. తత్=(ఈపదమధ్యాహార్యము) ఆసుఖమును; బాహ్యస్పర్శేషు= బాహ్యములగు శబ్దస్పర్శరూపరసగంధములనెడివిషయములందు; అసక్తాత్మా=అసక్త=తగులుకొననట్టి, ఆత్మా=యంతఃకరణముకలవాడు: విన్దతి = పొందుచున్నాడు. సః=అట్టి; బ్రహ్మయోగయుక్తాత్మా-బ్రహ్మ=బ్రహ్మమునందు, యోగ=సమాధిచే,యుక్త= కూడిన, ఆత్మా=అంతఃకరణముకలవాడు; అక్షయం=నాశరహితమగు; సుఖం=సుఖమును; అశ్నుతే = పొందుచున్నాడు. ॥౨౧॥

---

లేనిదే ప్రహర్షము కూడ జనించదు. ద్రష్టయందు, భోక్తయందు ఆత్మత్వాభిమానము లేనిదే దేహారక్షణము సంభవించదు. కాన నిట్టిరీతిన పదార్థ విమర్శనము అనర్థమునకు కారణమగును. వస్తువునందు రమ్యతాబుద్ధియు, ఇష్టతాబుద్ధియు జనించును. కాన ప్రత్యగ్దృష్టిని విడచి పదార్థవిమర్శనమును, రమ్యతాబుద్ధిని, ఇష్టత్వాదిబుద్ధిని, ప్రహర్షమును బ్రహ్మవేత్త చేయరాదు. మఱేమనిన అంతటను ప్రత్యగ్దృష్టిచేతనే యుండవలయునని యర్థము.

మఱియు అప్రియం ప్రాప్య నో "ద్విజేత్" ఆధ్యాత్మికమగు జ్వరాదికారణములను ఆధిభౌతికమగు సర్పచోరాదికారణములను అధిదైవిక వర్షవాతాద్యనర్థకారణములను పొందియు అధైర్యమును, భయమును పొందరాదు. అనగా "హా హతోస్మి" (చంపబడితిని) అని యోపాధికానర్థమునకు తాను విషయుడు కాకూడదని నిశ్చితార్థము.

మఱేమనిన ? "భవితవ్యం భవత్యేవ" (కాదలచినది తప్పక యగును) అను దృఢబుద్ధిచే ఉపాధిని ప్రారబ్ధములకు సమర్పణచేసి తాను ఆధ్యాత్మికాద్యనర్థావిషయకమగు నిర్విశేషబ్రహ్మాకారముతో నుండవలయును. ఆత్మదృష్టితోనుండు వానికి ముక్తి కన్నదు ప్రమాదములేదు. బాహ్యదృష్టిచే నుండువానికి ఉపాధియు నశించదు. ముక్తియుసంభవింపదు. కాన ప్రత్యగ్దృష్టినివిడచి బాహ్యములను గ్రహించుటను, బాహ్యములయందు యిష్టతాబుద్ధిని. తనకనర్థవిషయత్వమును, ఉద్వేగమును విద్వాంసుడు చేయరాదనియర్థము.

ఇష్టానిష్టములు ప్రాప్తించినపుడు హర్షోద్వేగములను చేయక యెట్లుండవలయు ననుశంకను "అసంమూఢః" అనుదానిచే తొలిగించుచుండెను. సంమూఢుడనగా విపరీతగ్రాహియని యర్థము. విపరీతగ్రాహి కాని వాడసంమూఢు డని గ్రహింపవలయును. అనగా ఆత్మసాక్షాత్కారముకలవాడే అసంమూఢుడు. బ్రహ్మమునందే ఆత్మప్రత్యయముకలవాడై "బ్రహ్మైవాహ మస్మి" అను ప్రత్యయముకలవాడై దానియందే స్థిరబుద్ధికలవాడై అనగా బ్రహ్మాకారత్వమును విడవని నిశ్చలమైన బుద్ధికలవాడై "బ్రహ్మైవాహమస్మి" సర్వంఖల్విదం బ్రహ్మ" అనెడి బ్రహ్మమాత్రదర్శనమునందే యుండవలెనని యర్థము. ॥౨౦॥

పరమార్థప్రప:— బ్రహ్మమునందు స్థిరీభూతునకు పరీక్షను "నప్రహృష్యేత్" అను శ్లోకముచే బోధించుచుండెను. బ్రహ్మవిత్తయి బ్రహ్మమునందే యెవడుండునో అట్టివాడు ప్రియముప్రాప్తించిన హర్షమును పొందడు. అట్లే అప్రియము ప్రాప్తించినను ఉద్వేగమును పొందడు. కనుకనే స్థిరబుద్ధికలవాడు. అసంమూఢుడు. ప్రియత్వాప్రియత్వములు లేనివాడు. ॥౨౦॥

—: ౫వ అధ్యాయము. ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. :—

మధుసూదనసరస్వతీయము:— బాహ్యములగు విషయములందు ప్రీతి అనేకజన్మానుభూతమగుటచే అతిప్రబలమగుటవలన తదాసక్తమగు చిత్తమునకు దృష్టసర్వసుఖరహితము అలౌకికము నగు బ్రహ్మమునందు స్థితి

**శాంకరభాష్యమ్‌—**

కించ బ్రహ్మణి స్థితః— బాహ్యాస్పర్శేషు బాహ్యాశ్చ తే స్పర్శాశ్చ బాహ్యాస్పర్శాః స్పృశ్యంత ఇతి స్పర్శా శ్శబ్దాదయో విషయా స్తేషు బాహ్యాస్పర్శే ష్వసక్త ఆత్మాంతఃకరణం యస్య సోఽయ మసక్తాత్మా విషయేషు ప్రీతివర్జితః సన్విన్దతి లభత ఆత్మని యత్సుఖం తద్విందతీ త్యేతత్‌ । స బ్రహ్మయోగయుక్తాత్మా బ్రహ్మణి యోగ స్సమాధి ర్బ్రహ్మయోగ స్తేన బ్రహ్మ యోగేన యుక్త స్సమాహిత స్తస్మి న్వ్యాపృత ఆత్మాంతఃకరణం యస్య స బ్రహ్మయోగ యుక్తాత్మా సుఖ మక్షయ మశ్నుతే వ్యాప్నోతి । తస్మా ద్బాహ్యవిషయప్రీతేః క్షణికాయా ఇంద్రియాణి నివర్తయే దాత్మ న్యక్షయసుఖార్థీత్యర్థః । ॥౨౧॥

**శాంకరభాష్యతత్త్వబోధిని—**

శబ్దాదివిషయములయందు ప్రీతియనెడి ప్రతిబంధమువలన నెవనికిని బ్రహ్మమునందు స్థితి సిద్ధింపదని శంకింపఁజనదు. కేవలము పూర్వోక్తమగు విధానముచేతనే బ్రహ్మమునందు స్థితికల వాడు హర్షవిషాదరహితుడు కాడు. మరేమనిన ? మరియొక విధానముచేగూడ హర్షవిషాద రహితుఁడగును. అట్టి విధానమేది? అనిన బ్రహ్మనిష్ఠుడై బాహ్యములగు స్పర్శలయందు-అనగా స్పృశింపఁబడునవి స్పర్శలనఁబడును. అట్టి బాహ్యాస్పర్శలు శబ్దస్పర్శరూపరస గంధములు. అట్టి శబ్దాదివిషయముల యందసక్తమగు నంతఃకరణము కలవాడు. (అనగా) విషయములయందుప్రీతి వర్జితుఁడైన వాడాత్మయం దేసుఖముకలదో దానిని పొందుచున్నాడు. విషయముల యందెం తెంతవరకు రాగరూపమగు యావరణము నివర్తించునో ఆత్మస్వరూపసుఖ మంతంతయావిర్భ వించుననుట.

కేవలము విషయముల యందసక్తమగు నంతఃకరణము కలవాడై, శమమువలననే సుఖ మును పొందడు. మరేమన బ్రహ్మమునందు సమాధి యనెడి యోగముచే వ్యాపృతమగు నంతః కరణముకలవాడక్షయమగు సుఖమును పొందుచున్నాడు. అనగా బ్రహ్మమునందు చిత్తసమా ధానాధీనమగు సమ్యగ్జ్ఞానద్వారా నిరతిశయ సుఖమును (మోక్షమును) పొందుచున్నాడనుట.

కాన నాత్మయం దక్షయసుఖమును కోరువాడు క్షణికమగు బాహ్యవిషయములయందైన ప్రీతినుండి నింద్రియములను మరలింపవలయును. అనగా శబ్దాదివిముఖున కనంతసుఖము ప్రా ప్తించుటవలన నట్టి సుఖార్థిచే ప్రయత్నపూర్వకముగ విషయవైముఖ్యము చేయదగినదని శిష్య శిక్షార్థము చెప్పఁబడెను ॥౨౧॥

ట్లెట్లు సంభవించును ? పరమానందరూపముగాన సంభవించుననెదవా ? అట్టి పరమానందము అననుభూత ప్రాయముగాన చిత్తస్థితికి హేతువుకానేరదు. ఈ విషయమే "అప్యానందః శ్రుతస్స్వాత్మా నేనాయవిషయీ కృతః । దృష్టానంతాభిలాషస్య న మన్దీకర్తుమప్యలమ్‌" అను వార్తికముచే స్పష్టపరుపబడుచున్నది. అను యాశం కను "బాహ్యస్పర్శేషు" అను శ్లోకముచే తొలిగించుచుండెను.

ఇంద్రియములచే స్పృశింపబడు శబ్దస్పర్శరూపరసగంధములు స్పర్శలనఁబడును. అట్టి శబ్దాదులనాత్మ ధర్మములుగాన బాహ్యములు. అట్టిబాహ్యములగు శబ్దస్పర్శాదులయందు తృష్ణారహితుడగుటచే అనాసక్తమగు చిత్తముకలవాడై (విరక్తుడై) అంతఃకరణమునందే బాహ్యవిషయనిరపేక్షమైన ఉపశమమనెడి సుఖమును నిర్మల సత్త్వవృత్తిచేబొందుచున్నాడు. ఈ విషయమే మహాభారతమున "యచ్చ కామసుఖంలోకే యచ్చ దివ్యం మహ

త్సుఖమ్ । తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్'' (లోకమునందుండు కామసుఖము, స్వర్గమునందుండు మహత్సుఖమున్ను ఈ రెండున్ను తృష్ణాక్షయముచే ప్రాప్తించు సుఖముయొక్క పదునారవ కళనైన పొందుటకు తగవు) అని స్పష్టముగ జెప్పబడెను.

లేక, త్వంపదార్థమగు ప్రత్యగాత్మయందు స్వభూతరూపమగు యేసుఖము సుషుప్తి యందనుభూయమానమై బాహ్యవిషయాసక్తిప్రతిబంధమువలన అలభ్యమాన మగుచున్నదో అసుఖమే బాహ్యవిషయప్రతిబంధము లేమివలన పొందబడుచున్నది. ఒక త్వంపదార్థసుఖమే పొందఁడుటలేదు. మఱేమనిన ? తత్పదార్థైక్యముచే సంపూర్ణసుఖము కూడ పొందబడు చున్నదని "స బ్రహ్మయోగయుక్తాత్మా'' అనుదానిచే చెప్పుచుండెను.

"సః'' తృష్ణాశూన్యుడై "బ్రహ్మయోగయుక్తాత్మా'' పరమాత్మయందు సమాధిచే వ్యాపృతమైన యంతఃకరణ కలవాడు. లేక, తత్పదార్థమునందు వాక్యార్థానుభవరూపమగు సమాధిచే నైక్యమును పొందిన త్వంపదార్థస్వరూపము కలవాడు. అనంతము, స్వస్వరూపమనగు సుఖమును పొందుచున్నాడు. ఎల్లపుడు సుఖానుభవస్వరూపుడగుచున్నాడు. నిత్యమగు నాత్మయందు అవిద్యానివృత్త్యభిప్రాయముచే యుఙ్ధాత్వర్థ సంబధ మౌపచారికము. కాన, ఆత్మయం దక్షయ సుఖానుభవార్థియై మహానర్థానుబంధియు, క్షణికము నగు బాహ్యవిషయప్రీతినుండి నిందిృయములను మరలించవలెను. ఇంతమాత్రముచేతనే బ్రహ్మమునందు స్థితి సంభవించునని యభిప్రాయము. ॥౨౧॥

శంకరానందీయము:— "న ప్రహృష్యేత్ప్రియం ప్రాప్య'' అనిచెప్పుటచే విషయసుఖము పరిత్యజింపదగినదని సూచింపబడెను. అట్లు విషయసుఖమును పరిత్యజించినచో బ్రహ్మవేత్తకు సుఖమే లేనందున బ్రహ్మవేత్తయొక్క స్థితి పిచ్చివానివంటిది కాదాయని శంకింపజనదు. "రసగ్ం హ్యేవాయం లబ్ధ్వాఽనందీభవతి'' అను శ్రుత్యుక్తరీతిని బ్రహ్మనిష్ఠయందున్నవానికి నిత్యనిరన్తరనిరతిశయ బ్రహ్మసుఖముకలదని "బాహ్యస్పర్శేషు'' అను శ్లోకముచే జెప్పుచుండెను.

సమాధిస్థుడు మాథులచే వాత్మకంటెబాహ్యములుగ కల్పించబడినట్టియు, శ్రోత్రాదులచే గ్రహించబడునట్టి శబ్దస్పర్శరూపరసగంధాదులయందు తుచ్ఛత్వబుద్ధిచేతను, బంధకత్వబుద్ధిచేతను యసక్తముగునంతఃకరణకలవాడై తీవ్రవైరాగ్యముచేత మనస్సుచే విషయములను గ్రహింపక గుహాయందుకాని, మరియొకరహస్యస్థలమునందుగాని కూర్చుండి సమాహితుడై బుద్ధ్యాదిసాక్షియగు ప్రత్యగాత్మను సాక్షాత్కరింపజేసుకొని ఆత్మసాక్షాత్కారమువలన ప్రాప్తించెడి యేసుఖమును పొందునో బ్రహ్మవేత్త యట్టి పరిపూర్ణము, అద్వైతరసము నగు బ్రహ్మమును చూచువాడై (బ్రహ్మమాత్రదర్శనపరుడై) సదానందుడై యగును.

అనగా గుహాదులయందు సమాధిని జేయువానికి సమాధికాలమునందే ఆత్మానందానుభవము. సర్వత్ర, సర్వదా ఆత్మానందానుభవ మట్టివానికి లేదు. బ్రహ్మవేత్తకన్ననో సర్వదా సర్వత్ర బ్రహ్మానందానుభవము ప్రాప్తించునని యాశయము. ॥౨౧॥

భాష్యోత్కర్ష దీపిక:— విషయసుఖము బ్రహ్మానందముకంటె, యతితుచ్ఛమగుటవలన బ్రహ్మనిష్ఠుడై శబ్దాది విషయములయందు ప్రీతిలేని యంతఃకరణకలవాడై త్వం పదలక్ష్యమునం దెట్టి సుఖమునుపొందునో వాడె తత్పదలక్ష్యమగు పరమాత్మయందు- త్వం పదలక్ష్యమును తత్పదలక్ష్యముతో ఏకత్వాపాదనమును పొందిన యంతఃకరణగలవాడై అనగా అఖండ సాక్షాత్కారాంతఃకరణవృత్తికలవాడై అక్షయ్యమగు బ్రహ్మానందరూపసుఖమును పొందుచున్నాడు. కాన జీవించియుండగనే ఆత్మయందక్షయసుఖమును గోరువాడు క్షణికమగు విషయప్రీతినుండి నిందిృయములను మరలింపవలయునని యాశయము. ॥౨౧॥

గీ॥ యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే।
ఆద్యన్తవన్తః కౌన్తేయ! న తేషు రమతే బుధః ॥ ॥౨౨॥

పదవిభాగము:— యే-హి-సంస్పర్శజాః-భోగాః-దుఃఖయోనయః-ఏవ-తే-ఆద్యన్తవన్తః-కౌన్తేయ!-న-తేషు-రమతే-బుధః।

ప్రతిపదార్థము:— హి=ఏకారణమువలన; యే=ఏ; సంస్పర్శజాః=విషయేంద్రియసంబంధమువలన జనించిన; భోగాః=భోగములు: (అనుభవములు) విద్యన్తే=(ఈపదమధ్యాహార్యము) కలవో, తే=ఆభోగములు; దుఃఖయోనయః ఏవ=దుఃఖములకు కారణములే యగుచున్నవి; హే కౌన్తేయ=ఓ కున్తీపుత్రుడగు యర్జునా! తే=(ఈపదమధ్యాహార్యము) ఆవిషయేంద్రియ సంయోగము కాని, భోగములు కాని; ఆద్యన్తవన్తః=ఉత్పత్తి, వినాశములు కలవి. తేషు=అట్టిభోగములయందు; బుధః=పరమార్థతత్త్వజ్ఞానము కలవాడు; న రమతే=ఆసక్తిని పొందడు. ॥౨౨॥

శాంకరభాష్యమ్:—

ఇతశ్చ నివర్తయేత్— యేహి యస్మా త్సంస్పర్శజా విషయేంద్రియసంస్పర్శేభ్యో జాతా భోగా భుక్తయో దుఃఖయోనయ ఏవ తేఽవిద్యాకృతత్వాత్। దృశ్యంతే హ్యాధ్యాత్మికాదీని దుఃఖాని తన్నిమిత్తాన్యేవ, యథేహ లోకే తథా పరలోకేపీతి గమ్యత ఏవశబ్దాత్। న సంసారే సుఖస్య గంధమాత్ర మప్యస్తీతి బుద్ధ్వా విషయమృగతృష్ణికాయా ఇంద్రియాణి

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈచెప్పబోవు కారణమువలనకూడ నింద్రియములను విషయములనుండి మరలింపవలెను. శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయములకు, త్వక్చక్షు శ్రోత్ర జిహ్వాఘ్రాణములనెడి యింద్రియములకు నగు సంబంధమువలన కలిగెడివి భోగములు (విషయానుభవములు). అట్టి భోగము లవిద్యాకృతములుకాన దుఃఖమునకే కారణము లగుచున్నవి. (లోకమున) దుఃఖము లవివేకాత్మకము లై యవివేకమువలననే జనించుచున్నటుల చూడబడుచునే యున్నవి. ఇహలోకమునందు భోగములు దుఃఖహేతువు లైనను, పరలోకమునం దట్లు కానేరవని శంకింపవలదు. ఈలోకమునందెట్లు భోగములు విషయేంద్రియ సంపర్కజనితములై యవిద్యాత్మకము లగుటచే దుఃఖహేతువులో అట్లే పరలోకమునందుకూడ విషయక భోగములు విషయేంద్రియ సంబంధజనితములగుటచే దుఃఖహేతువులేయగును. ఈవిషయమును శ్రీకృష్ణపరమాత్మ ఈగీతయందే 'దుఃఖయోనయఏవ' అను స్థలమునందుగల నిశ్చయార్థకమగు 'ఏవ' అను పదముచే స్పష్టపరచెను. కాన, సంసారమునందు సుఖముయొక్క లేశమైనలేదని తెలిసికొని విషయములనెడి మృగతృష్ణిక

—: ౫వ అధ్యాయము. ౨౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— బాహ్యమగు విషయములయందు ప్రీతి తొలగిన ఆత్మయం దక్షయ సుఖము ప్రాప్తించును. ఆత్మయం దక్షయసుఖానుభవ మాత్మానుగ్రహమువలన ప్రాప్తించి బాహ్యవిషయములయందు ప్రీతి నివర్తించును. ఇట్లగుచో అన్యోన్యాశ్రయదోషము ప్రాప్తించుటచే పై రెంటిలో నొకటియు ప్రాప్తించకపోయెడిని? అనుయాశంకపై విషయదోషదర్శనాభ్యాసముచేతనే బాహ్యములగు విషయములయందు ప్రీతి నివర్తించునని "యే హి సంస్పర్శజా భోగాః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

ఈ లోకమునందు కాని, పరలోకమునందు కాని, విషయేంద్రియసంబంధమువలన జనించెడి క్షుద్ర సుఖలేశానుభవము లెన్ని కలవో అవన్నియు రాగద్వేషాదిదోషవ్యాప్తములగుటచే బ్రహ్మలోకపర్యంతము దుఃఖ

శాంకరభాష్యమ్:—

నివర్తయేత్ । న కేవలం దుఃఖయోనయ ఆద్యంతవంతశ్చా౽౽దిః ర్విషయేన్ద్రియసంయోగో భోగానా మన్తశ్చ తద్వియోగ ఏవాత ఆద్యన్తవన్తో౽నిత్యా మధ్యక్షణభావిత్వా దిత్యర్థః । కౌన్తేయ! న తేషు రమతే బుధో భోగేషు వివేక్యవగతపరమార్థతత్త్వో౽త్యన్తమూఢానామేవ హి విషయేషు రతి ర్దృశ్యతే యథా పశుప్రభృతీనామ్ । ॥౨౨॥

శాంకరభాష్యార్థప్రబోధిని:—

వలన నింద్రియములను మరల్చవలయును. విషయేంద్రియ సంబంధమువలన జనించిన భోగములయందు జీవులకభిరుచి కనపడుటవలన భోగములెట్లు దుఃఖకారణమగును? అని శంకింపజనదు. కేవలముభోగములు దుఃఖకారణములేకాదు. మఱేమన విషయేంద్రియ సంబంధముకాని, భోగములుకాని ఆద్యంతవత్తులు (ఉత్పత్తివినాశనములుకలవి). అనగా మధ్యక్షణభావులు. కనుకనే యనిత్యములు. అట్టి ఆధివ్యాధిజరామరణాదులతోగూడినట్టియు, సమాగమాది క్లేశములతోగూడినట్టి విషయేంద్రియ సంబంధమువలన జనించెడి భోగములు సుఖలవానుభవరూపములై జనించును. కాన, అట్టి భోగములు దుఃఖహేతువులే యగును. కాన నోయర్జునా! పరమార్థతత్త్వమును తెలిసికొనిన విద్వాంసు డాభోగములయం దాసక్తికలవాడుకాడు. పశువులు మొదలగు తిర్యగ్జంతువులకు విషయములయం దాసక్తియున్నటుల మూఢులకే విషయములయం దాసక్తి గన్పట్టుచున్నది. ॥౨౨॥

హేతువులే యగును. ఈ విషయమే విష్ణుపురాణమునందు "యావతః కురుతే జన్తుః సంబన్ధాన్మనసః ప్రియాన్ । తావన్తో౽స్య నిఖన్యన్తే హృదయే శోకశంకవః" (జీవుడు మనస్సునకిష్టమగు యెన్నిసంబంధములను సమకూర్చుకొనునో అన్ని దుఃఖశంకువులు హృదయమునందు నాటబడుచున్నవి.) అని చెప్పబడెను భోగములిట్టివైనను స్థిరములు కానేరవు. మఱేమనిన అద్యన్తవత్తులు (ఆదియనగ విషయేంద్రియసంయోగము, అన్తమనగ తద్వియోగము. యీ రెండుకలవి) పూర్వాపరములయందు లేమిచేసి మధ్యమందు స్వప్నమువలె యావిర్భూతములు, క్షణికములు, మిథ్యాభూతములు. యీ విషయమే గౌడపాదాచార్యులవారిచే "ఆదావన్తే చ యన్నాస్తి వర్తమానే౽పి తత్తథా" అను కారికచే స్పష్టపరుపబడెను. కాన నిట్టి భోగములయందు వివేకి భోగములు ప్రతికూలవేదనీయములగుటచే ప్రీతిని పొందడు. ఈ విషయమునే పతంజలి "పరిణామతాపసంస్కారదుఃఖైర్గుణవృత్తివిరోధాద్దుఃఖమేవ సర్వం వివేకినః" (విద్వాంసుడు నేత్రేంద్రియ గోళసదృశుడు, కనుకనే నేత్రేంద్రియగోళమున సాలిపురుగుచే నిర్మింపఁబడిన తంతువు తాకినను సహింపలేడు. అట్లే వివేకికి నిఖిలభోగసాధనములు కాలత్రయమునందు క్లేశానువిద్ధమగుటచే విషసంపృక్తాన్నభోజనమువలె దుఃఖరూపమే యగును. అనేకవిధములగు దుఃఖములను సహించు యజ్ఞానికి సాలితంతువు యితరావయవములయందు లౌకిక దుఃఖప్రదము కానట్లు దుఃఖప్రదములు కానేరవు.) అనిస్పష్టపరచెను.

అందు విషయసుఖము భూతభవిష్యద్వర్తమాన కాలములయందున్న దుఃఖానువిద్ధమగుటంజేసి యౌపాధిక దుఃఖమనఁబడునని "పరిణామతాపసంస్కారదుఃఖైః" అను పదముచే జెప్పబడుచున్నది. "గుణవృత్తివిరోధాచ్చ" అను సూత్రశేషముచే విషయసుఖము స్వరూపముచేగూడ దుఃఖరూపమే యని చెప్పబడెను. "పరిణామతాప సంస్కారదుఃఖైః" అను స్థలమున పరిణామశ్చ, తాపశ్చ, సంస్కారశ్చ 'పరిణామతాపసంస్కారాః త ఏవ దుఃఖాని– పరిణామతాపసంస్కారదుఃఖాని" అని విగ్రహము. ఈవిగ్రహమున కర్థమేమనిన పరిణామము, తాపము

సంస్కారము లనెడి దుఃఖములు సూత్రస్థమగు "దుఃఖైః" అను తృతీయావిభక్తికి వైశిష్ట్య మర్థము. అనగా పరిణామ తాపసంస్కారము లనెడి దుఃఖములతో గూడిన సర్వము దుఃఖరూపమే యని విషయసుఖమునకు యౌపాధిక దుఃఖరూపత్వము చెప్పఁబడెను. "గుణవృత్తివిరోధాచ్చ" అను సూత్రపదముచే విషయసుఖము స్వరూపముచే కూడ దుఃఖరూపమే యని చెప్పబడెను. అది యెట్లనిన? సర్వసుఖానుభవములు రాగముతో గూడినవి. అట్టి సుఖానుభవములయందు రక్తుఁడే యగును. అట్టి సుఖానుభవములచే సుఖవంతుడును యగును. కాని రాగము పుట్టినందట జనించినదైన విషయ(గంధాది) ప్రాప్తిచే సుఖరూపమున బరిణమించి ప్రతిక్షణము వృద్ధిని బొంది స్వ(రాగ) విషయముయొక్క యప్రాప్తిచే దుఃఖము ప్రాప్తించి దుఃఖరూపమే యగును. పరితృప్తివలన నింద్రియములకు భోగములయం దుపశాంతియే సుఖము. ఇంద్రియలౌల్యముచే భోగములయం దుపశాంతి లేకపోవుటయే దుఃఖము. భోగాభ్యాసముచే యింద్రియములకు తృష్ణ లేకపోవుట సంభవించదు. భోగాభ్యాసము ననుసరించి రాగములు, కౌశల్యములు, స్మృతి యింద్రియములకు వృద్ధినొందును. ఈవిషయమే "న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి" స్రక్చందనవనితాదిభోగము అనుభవించుటచే కాముడు శాంతించడు అని చెప్పబడెను. కాన దుఃఖస్వరూపతాగపరిణామరూపమగుటంజేసి కార్యకారణముల కభేదమగుటంజేసి విషయసుఖమున్ను దుఃఖస్వరూపమే. అందుచే విషయసుఖమున్ను పరిణామదుఃఖమే. అట్లే సుఖానుభవకాలమున దానికి విరుద్ధమగు దుఃఖసాధనములను ద్వేషించును. భూతములను హింసించనిదే యుపభోగము సంభవించదని భూతములను హింసించును. దుఃఖసాధనము లన్నియు నాకు సంభవింపకుండుగాక యనెడి సంకల్ప విశేషమే ద్వేషము. దుఃఖసాధనము లన్నిటిని పరిహరించుకొనుట కెవడును సమర్థుడు కాడు. కాన సుఖానుభవకాలమునందుకూడ సుఖానుభవమునకు విరోధి యగుదానినిగూర్చి ద్వేషము సర్వదా ఉండుటచే తాపదుఃఖము అవశ్యంభావి. తాప మనగ ద్వేషమే. ఇట్టిదుఃఖసాధనములను పరిహరించుట కశక్తుఁడై మోహమును చెందును. దీనికే మోహదుఃఖమని పేరు. ఈవిషయమే యోగభాష్యకారులచే "సర్వస్య ద్వేషానువిద్ధశ్చేతనాచేతనసాధనాధీనస్తాపానుభవః" (చేతనాచేతనాధీనమగు తాపానుభవము సర్వులకు ద్వేషానువిద్ధమని) చెప్పబడెను. అందు ద్వేషమువలన గలిగెడి కర్మాశయ మొకటి కలదు. అట్టి కర్మాశయము సుఖసాధనములను ప్రార్థించుచు శరీరముచేతను, వాక్కుచేతను, మనస్సుచేతను చలించును. అట్టి చలనమువలన పరుని యనుగ్రహించును. మరియు పరుని హింసించును. అట్టి పరానుగ్రహపీడలచే ధర్మాధర్మములను వృద్ధినొందించును. అట్టికర్మాశయము లోభమువలన, మోహమువలనను సంభవించును. కాన నిదియే తాపదుఃఖత యని యనుపించుకొనును.

ఇపుడు గలిగెడి సుఖానుభవము తాను నశించుకాలమున సుఖసంస్కారమును కలుగజేయును. అట్టి సంస్కారమువలన సుఖస్మరణ సంభవించును. దానివలన రాగము; రాగమువలన మనఃకాయవాక్చేష్టలు, వాటివలన పుణ్యపాపకర్మాశయములు, వాటివలన జన్మాదులు సంభవించును. దీనినే సంస్కారదుఃఖతయని యందురు. ఇట్లే తాపమోహములకుగూడ సంస్కారములు వ్యాఖ్యానించుకొనవలెను. ఇట్లు కాలత్రయమునందు దుఃఖానువిద్ధమగుటచే విషయసుఖము దుఃఖస్వరూపమే యని చెప్పి విషయసుఖము స్వరూపముచేతనుగూడ దుఃఖస్వరూపమే యని "గుణవృత్తి విరోధాచ్చ" అను సూత్రశేషముచే జెప్పుచుండెను. సత్త్వరజస్తమస్సులు గుణము లనఁబడును. అవి సుఖదుఃఖమోహాత్మకములు, పరస్పరవిరుద్ధ స్వభావములు కలవైనను తైలము, వత్తి, అగ్నులు దీపమునకు హేతువగునటుల పురుషభోగప్రయుక్తములగుటచే త్రిగుణాత్మకమగు నేక కార్యము నారంభించును. ఆ మూటిలో నొకదానికి ప్రాధాన్యము, మిగిలిన రెండింటి కప్రాధాన్యము (గుణభావము) సంభవించుటచే ప్రధానగుణమునుబట్టి సాత్త్వికము, రాజసము, తామసము అని కార్యము త్రిగుణాత్మకమైనను ఒక్కొక్కగుణముచే వ్యవహరించఁబడును. అందు సుఖోపభోగరూపమైన ప్రత్యయము (అనుభవము) ఉద్భూత

గీ॥ శక్నోతీహైవ యస్సోఢుం ప్రాక్ఛరీరవిమోక్షణాత్ ।
కామక్రోధోద్భవం వేగం స యుక్తస్స సుఖీ నరః ॥ ॥౨౩॥

పదవిభాగము:— శక్నోతి- ఇహ- ఏవ- యః- సోఢుం- ప్రాక్- శరీరవిమోక్షణాత్- కామక్రోధోద్భవం- వేగం- సః- యుక్తః- సః- సుఖీ- నరః॥ ॥౨౩॥

ప్రతిపదార్థము:— యః=ఎవఁడు; కామక్రోధోద్భవం= కామక్రోధములవలన జనించెడి; వేగం= వేగమును; శరీరవిమోక్షణాత్=మరణమునకంటే; ప్రాక్=పూర్వమునందే; సోఢుం=సహించుటకు; ఇహైవ= బ్రతికియుండగనే; శక్నోతి=సమర్థుడగుచున్నాడో. సః=ఆ; నరః=మనుష్యుడు; యుక్తః=యోగియై; సుఖీ= సుఖవంతుడై; భవతి=(ఈపదమధ్యాహార్యము) అగుచున్నాడు. ॥౨౩॥

---

సత్త్వకార్యమైనను అనుద్భూతరజస్తమఃకార్యమగుటంజేసి త్రిగుణాత్మకమే యగును. అందుచే సుఖానుభవము ఉద్భూతసత్త్వకార్యమగుటచే సుఖాత్మకమగునటుల యనుద్భూతరజస్తమఃకార్యమగుటచే దుఃఖాత్మకము, విషాదాత్మకము నగును. అందుచే జ్ఞానికి సర్వము దుఃఖస్వరూపమే. ఇట్టి జ్ఞానము (ప్రత్యయము) "చలంచ గుణవృత్తం" (క్షిప్రపరిణామిచిత్తమని చెప్పబడుటచే) స్థిరము కాదు.

ఒక ప్రత్యయమే ఏకకాలమునందు పరస్పరవిరుద్ధములగు సుఖదుఃఖమోహాత్మకత్వములను యెటుల బొందునని శంకింపఁజనదు. అభ్యుత్థితములగు ధర్మజ్ఞాన, వైరాగ్యైశ్వర్యములు అభ్యుత్థితములగు యధర్మజ్ఞానా వైరాగ్యానైశ్వర్యములతో విరోధముకలవి కాన "ప్రధానము ప్రధానముతో విరోధించును కాని, యప్రధానముతో విరోధించదు." అను న్యాయమున గుణత్రయ మదుద్భూతమైనపుడే విరుద్ధములగును కాని, ఒకటి యుద్భూతము, మిగిలినరెండును యనుద్భూతములైనపుడు విరోధము లేమింజేసి ఒక ప్రత్యయమునకే త్రిగుణకార్యములగు సుఖదుఃఖమోహాత్మకత్వములు సంభవించును. ఈ చెప్పుటవలన పరిణామతాప, సంస్కార, దుఃఖములను యేకకాలమున గుణత్రయకార్యమగు రాగద్వేషమోహాత్మకత్వము జెప్పబడెను.

"అవిద్యాఽస్మితారాగద్వేషాభినివేశాః పంచ క్లేశాః, అవిద్యాక్షేత్ర ముత్తరేషాం ప్రసుప్తతనువిచ్ఛిన్నోదారాణాం, అనిత్యాశుచిదుఃఖానాత్మసు నిత్యశుచిసుఖాత్మఖ్యాతిరవిద్యా, దృగ్దర్శనశక్త్యోరేకాత్మతైవాస్మితా, సుఖానుశాయినీ రాగః, దుఃఖానుశాయినీ ద్వేషః, స్వరసవాహీ విదుషోఽపి తథా రూఢోఽభినివేశః, తే ప్రతిప్రసవహేయా స్సూక్ష్మాః, ధ్యానహేయా స్తద్వృత్తయః, క్లేశమూలః కర్మాశయో దృష్టాదృష్టజన్మవేదనీయః, సతిమూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః" అని పతంజలి యీ సూత్రములను జెప్పియుండెను.

క్లేశములు— 1 ప్రసుప్తము, 2 తనువు, (సూక్ష్మము) 3 విచ్ఛిన్నము, 4 ఉదారము అనెడి నాల్గు యవస్థలు కలవి. అది యెట్లనిన? అవిద్య 1 అస్మితము, 2 రాగము, 3 ద్వేషము, 4 అభినివేశము; 5 అని క్లేశములయిదువిధములు. అందవిద్య- ప్రసుప్త, తను, విచ్ఛిన్న, ఉదారములకు క్షేత్రము. అవిద్య యనగ నదికాని దానియం దదియను బుద్ధి దీనినే విపర్యయమని, మిథ్యాజ్ఞానమనియు యనెదరు. అట్టి యవిద్యావిశేషమే సంసారకారణము. అందు అనిత్యమగు పృథివియందు (ధ్రువా పృథివీ) అని నిత్యత్వబుద్ధి (ధ్రువా స చంద్రతారకా ద్యౌః) చంద్రునితోను, నక్షత్రములతోను గూడియున్న యాకాశము నిత్యమను బుద్ధి, దేవతలు మరణము లేనివారు అని యనిత్యులగు దేవతలయందు నిత్యత్వబుద్ధి యవిద్య. మరియు అపవిత్రము, అతిభీభత్సము యగు శరీరమునందు పవిత్రము అనుబుద్ధి. అది యెట్లనిన "నూతనమైన చంద్రరేఖవలె సుందరమై దీకన్యక అమృతావయవనిర్మితమువలె, చంద్రుని భేదించుకొని బయలువెడలినదివలె, నున్నది. మరియు నల్లకలువరేకులవలె విశాలమైన నేత్రములుకలది. హావగర్భితమగు నేత్రములచే జీవలోకము నూరటించుచున్నదివలె నున్నది. అని. ఇచ్చట దేనికి దేనితో సంబంధమున్నది? దేనికిని దేనితోటియు సంబంధములేదనుట. ఏమనిన "స్థానాద్బీజా దుపష్టంభా న్నిష్పందా న్నిధనా దపి । కాయ మాధేయశౌచత్వా త్పండితా హ్యశుచిం విదుః" పండితులు- కాయమును (శరీరమును) స్థానమువలన, కారణమగు బీజమువలన, నిష్పందమువలన (చలించకపోవుట

ఫలని) వరణము వలన, చేయదగి శుద్ధికలదగుటలనను యుపవిత్రము దెలిసికొనుచున్నారు. అని వ్యాసమహర్షి చెప్పియుండెను. ఈ చెప్పటచే పాపమునందు పుణ్యబుద్ధియు, అనర్థమునం దర్థబుద్ధియు యవిద్యయే యని గ్రహింపనగును. దుఃఖమునందు సుఖఖ్యాతి "పరిణామతాపసంస్కారదుఃఖైః... దుఃఖమేవ సర్వం వివేకినః" అను పతంజలి సూత్రముచే నిదివరకే జూపఁబడెను. శరీరమునందు "మనుష్యోఽహం" నేనుమనుష్యుడను అనునది యనాత్మయం దాత్మఖ్యాతి యనుపించుకొనును. ఈచెప్పుటవలన తేలిన యాశయ మేమనిన సర్వక్లేశములకు కారణమగు యవిద్యయే తమస్సని చెప్పనొప్పును. బుద్ధిపురుషుల కభేదాభిమానమే యస్మిత యనఁబడును సాధన సంపత్తి లేనివానికిఁగూడ "సర్వం సుఖజాతీయం మే భూయాత్" సర్వసుఖజాతీయము నాకు సంభవించుగాక అనుఅనురాగమే మహామోహమనఁబడును. దుఃఖసాధన మున్నను రేదుఃఖము నాకు ప్రాప్తించకుండుగాక యను భ్రమ (విపర్యయ) విశేషమే ద్వేషము. అట్టి ద్వేషమే తామిస్రమనఁబడును. ఆయువు లేకున్నను శరీరేంద్రియాదు లనిత్యమైనను వీటితో వియోగము నాకు లేకుండుగాక అనెడి విద్వాంసులు మొదలు స్త్రీలు బాలుర పర్యంతము స్వాభావికమగు మరణత్రాసరూపమగు విపర్యయ (భ్రమ) విశేషరూపమైన యభినివేశము అంధతామిస్రము. ఈ క్లేశములు సుప్తావస్థ, తన్వవస్థ, విచ్ఛేదావస్థ, ఉదారావస్థ యనెడి నాలుగవస్థలు కలవి.

అందు అసత్తుయొక్క యనుత్పత్తివలన యనభివ్యక్తరూపముచే యవస్థానము సుప్తావస్థ. అభివ్యక్తమైనదానికి సహకారిలాభము లేమిఁజేసి కార్యాజనకత్వము తన్వవస్థ. అభివ్యక్తమైన జనితకార్యమునకు బలవంతమగు నొకానొకదానిచే యభిభవము విచ్ఛేదావస్థ. అభివ్యక్తమైనదానికి సంప్రాప్తసహకారిసంపత్తివలన నప్రతిబంధముగ స్వకార్యకర్తృత్వము ఉదారావస్థ. ఇట్టి నాలుగవస్థలతో గూడిన విపర్యయరూపమగు నాలుగు విధములైన యస్మితాది క్లేశములకు ప్రసవభూమి (క్షేత్రము) అవిద్యయే. అందుచే నవిద్య నివర్తించిన సర్వక్లేశములు నివర్తించును. అట్టి క్లేశములు ప్రకృతియందు విలీనమగువాటి క్లేశములవలె ప్రసుప్తము అనియు, యోగుల క్లేశములవలె ప్రతిపక్షభావముచే తనూకృతములై తనువులనియు చెప్పబడును. అట్టి రెండువిధములగు సూక్ష్మములైన క్లేశములు ప్రతిప్రసవమగు మనోనిరోధరూపమైన నిర్బీజసమాధిచే హేయములు. ఏ సూక్ష్మవృత్తులు, తత్కార్యములగు స్థూలములు విచ్ఛిన్నములనియు, ఉదారములనియు, రెండువిధములు. విచ్ఛేదమును పొందిపొంది అయా స్వరూపముచే నుద్భవించుటవలన విచ్ఛిన్నము అనబడును. అది యెట్లనిన? అనురాగకాలమున క్రోధమున్నను యట్టి క్రోధము ప్రాదుర్భవించవందున విచ్ఛిన్న మనబడును. చైత్రు డొక స్త్రీయం దనురాగముకలవాడైనపు డితరస్త్రీలయందు విరాగుడు కాడు. మరేమనిన? ఒకస్త్రీయం దనురాగము పొందబడిన వృత్తికలది. ఇతరస్త్రీలయందు వృత్తి ముసుమ్ముందు జనించగలదు. కాన యట్టి రాగము విచ్ఛిన్నమనఁబడును. ఎపుడు యేరాగములు విషయములయందు పొందబడిన వృత్తులుకలవో అపుడారాగములు సర్వాత్మనా ప్రాదుర్భూతములు కాన యవి యుదారములనఁబడును. ఇట్టి రెండువిధములగు విచ్ఛిన్నోదారరూపములగు రెండురాగము లతిస్థూలము లగుటవలన శుద్ధసత్త్వమయమగు భగవద్ధ్యానముచే హేయములు. మనోనిరోధముచే హేయములు (తొలిగింపదగినవి) కావు. మనోనిరోధముచే తొలిగింపదగినవి సూక్ష్మములే. ఈచెప్పుటవలన దేలిన యాశయమేమనిన? సర్వక్లేశములు—పరిణామతాపసంస్కారములయందు ప్రసుప్త, తను, విచ్ఛిన్నరూపమున యెల్లపుడు కలవు. వాటిలో యొకానొకప్పుడు యొకానొకదానికే యుదారత్వము ప్రాప్తించును. ఇదియే విశేషము. ధర్మాధర్మములనెడి కర్మాశయము క్లేశమూలకమగుట ఇది బాధనరూపమగు దుఃఖమును కలుగజేయుచు క్లేశములనఁబడును. మూలభూతమగు క్లేశమున్నపు డట్టికర్మాశయవిపాకములగు ఫలభూతమైన జన్మ, ఆయువు, భోగము తప్పక సంభవించును. ఇట్టి కర్మాశయము ఇహలోకపరలోకములయందు తనఫలము నారంభించునది యగుటచే దృష్టాదృష్టజన్మలచే తెలిసికొనదగినది. ఇట్లే క్లేశసంతతి ఘటీయంత్రమువలె యెల్లపుడు తిరుగుచుండును కాన "యోహి సంస్

ర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే'' అని లెస్సగ చెప్పఁబడెను. కాన సంస్పర్శజములైన జనించెడి భోగములకు పరిణామాదులచేతను, గుణవృత్తివిరోధముచేతను దుఃఖయోని (కారణ) త్వము, గుణవృత్తము చలమగుటవలన అద్యంతవత్త్వమని యోగిమతానుసార మిట్టిశ్లోకము సమన్వయింప నగును.

వేదాన్తిమతానుసార మన్నచో అవిద్య యనునది యనాదిభావరూపము అదియే యజ్ఞాన మనఁబడును. అహంకారధర్మాధ్యాసయే యస్మిత యనఁబడును. రాగద్వేషాభినివేశములు యస్మితావృత్తివిశేషములు. కాన వీటియన్నిటికి యవిద్య మూలమగుటంజేసి యివన్నియు యవిద్యాత్మకములే. మిథ్యాభూతములే. రజ్జుసర్పాధ్యాసవలె మిథ్యాభూతములైనను దుఃఖయోను (కారణము) లే. స్వప్నమువలె దృష్టిసృష్టిమాత్రములగుటచే నాద్యన్తవన్తములు. ఇట్టివాటియందు అధిష్ఠానసాక్షాత్కారముచే నివృత్తమగు భ్రమకల విద్వాంసుడు మృగతృష్ణికా స్వరూపజ్ఞానముకల యుదకార్థి మృగతృష్ణికలయందు ప్రవర్తించనట్లు ప్రవర్తింపడు. సంసారమునందు సుఖలేశమైన లేదని తెలిసికొని సంసారమునుండి సర్వేంద్రియములను విద్వాంసుడు మరలించు నని యర్థము.

శంకరానందీయము:— బ్రహ్మవేత్తకు బ్రహ్మసుఖము కలదు. ఒకానొకకాలమునందు బాహ్యసుఖము కూడ సంభవించుగాక కాన "బాహ్యస్పర్శే ష్వసక్తాత్మా'' విషయములయం దసక్తుడగు నట్టి యంతఃకరణము కలవాడై యుండవలె నని చెప్పుట యసంగత మను శంకను తొలిగించుటకు విషయసుఖ మాద్యంతవత్తగుట చేతను, తుచ్ఛమగుటచేతను తత్త్వజ్ఞాని దానియందు ప్రవర్తించడని "యే హి'' అను శ్లోకముచే చెప్పుచుండెను.

విషయేంద్రియసంపర్కజన్యమగు విషయసుఖములు ఉత్పత్తివినాశనములుకలవి. కనుకనే క్షణికములు. ఇట విషయసుఖములు జన్యములుకనుకనే యనిత్యములని సిద్ధించుచుండ తిరిగి "ఆద్యంతవన్తులు'' అని చెప్పుట నిరర్థకము కాదా యని శంకింపజనదు. తార్కికమతమున ప్రధ్వంసాభావము జన్యమైనను నిత్యము. మీమాంసకమతమున చాతుర్మాస్యయాగజన్యమైన సుకృతము నిత్యము. అట్లే విషయేంద్రియజన్యసుఖముకూడ నిత్యమేల కాదను శంకను తొలగించుటకు వైషయికసుఖ మాద్యంతవత్తు అని చెప్పబడెను. విషయేంద్రియసంయోగమునకు పూర్వమునందును విషయేంద్రియసంయోగకాలానంతరమునందును అవిలేనందున భోగరూపములగుసుఖములు దుఃఖహేతువులే కాన విషయసుఖము సాపేక్షము, క్షణికము, అల్పము, దుఃఖము నిమ్పునది అని తెలిసికొని విద్వాంసుడు బాహ్యసుఖములయందు ప్రీతిని పొందడు. భుక్తిదశయందు కూడ స్వయముగ తన దృష్టిచే బ్రహ్మానందామృతమునే పానము చేయును. బాహ్యసుఖము నెంతమాత్రము స్మరింపడు. ॥౨౨॥

శ్రీధరీయము:— మోక్షదశయందు యిష్టమైనవిషయభోగములుకూడ నివర్తించిన మోక్షము పురుషార్థమెట్లగును ? అను శంకను "యేహి'' అను శ్లోకముచే తొలిగించుచుండెను.

విషయములవలన కలిగెడి సుఖములు తత్కాలమునందుకూడ స్పర్ధాసూయాదులచే వ్యాప్తమగుటంజేసి దుఃఖకారణములే యగుచున్నవి. మరియు అద్యంతవత్తులు. అందుచే వాటియందు వివేకముకలవాడు క్రీడించడు. ॥౨౨॥

సదానందీయము:— బాహ్యరుచిత్యాగ ముండినకాని యాత్మసుఖానుభవము ప్రాప్తింపదు. ఆత్మసుఖానుభవ ముండినకాని బాహ్యరుచిత్యాగము సంభవించదు. ఈ విషయమును విచారించిన పెరిగి కుదిరినకాని పెండ్లి కానేరదు. పెండ్లి యయిన కాని పెరిగి కుదరదను నట్లన్యోన్యాశ్రయదోషము ప్రాప్తించునని శంకింపఁజనదు. బాహ్యరుచిత్యాగమునందు దోషజ్ఞానము కారణము. ఇహలోకమున, పరలోకమున సంభవించెడి సుఖాంశానుభవరూపములగు భోగములు రాగద్వేషాదిదోషవిద్ధములగుటఁజేసి దుఃఖహేతువులు. విషయేంద్రియసంయోగమువలన జనించుటచే అది కలవి. విషయేంద్రియవియోగమువలన అంతవత్తులు. స్వప్నమువలె మధ్యకాలమున ప్రాదుర్భూతములు, మృషాత్మకములు. "ఆదా వన్తే చ యన్నాస్తి వర్తమానేఽపి తత్తథా'' (ఆది

**శాం. భాష్యము:—**

అయం చ శ్రేయోమార్గప్రతిపక్షః కష్టతమో దోష స్సర్వానర్థప్రాప్తి హేతు ర్దుర్ని వార్య శ్చేతి తత్పరిహారే యత్నాధిక్యం కర్తవ్య మిత్యాహ భగవాన్—శక్నో త్యుత్సహత ఇహైవ జీవన్నేవ య స్సోఢుం ప్రసహితుం ప్రాక్పూర్వం శరీరవిమోక్షణా దామరణాత్। మరణసీమాకరణం జీవతోఽవశ్యంభావీ హి కామక్రోధోద్భవో వేగోఽనంతనిమిత్తవా న్నిహా న ఇతి। యావన్మరణం తావ న్న విస్రంభణీయ ఇత్యర్థః। కామ ఇన్ద్రియగోచరప్రాప్తే ఇష్టే

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

ఏ కామక్రోధములవలన జనించెడి వేగముచే తల్లినికూడ పరిభవించునో, తండ్రిని కూడ సంహరించునో అట్టి యీ కామక్రోధోద్భవమగు వేగము మోక్షమార్గమునకు ప్రతిపక్షి,(శత్రువు) సర్వానర్థ ప్రాప్తికి హేతువు. కనుకనే కష్టతమమగు దోషమనంబడును. నివారించుటకుకూడ శక్యమైనదికాదు. అందుచే నట్టి కామక్రోధోద్భవవేగమును పరిహరించుట కధికయత్నము చేయ దగినదని శ్రీకృష్ణపరమాత్మ యీశ్లోకమునందు చెప్పుచుండెను.

మరణముకంటె ప్రాక్కాలమునందే ఎవఁడు బ్రతికియుండగనే కామక్రోధోద్భవమగు వేగమును సహించుటకు సమర్థుడగుచున్నాడో, ఇట మరణమును హద్దుగచేయుట యెందుల కనిన కామక్రోధోద్భవమగు వేగము పుట్టుట్ట కనేకకారణములు కలవు. కాననట్టి వేగము జీవించి యున్నవాని కవశ్యము సంభవించును. అందుచే మరణమునకు ప్రాక్కాలమునందే యెవడా

యందు అంతమునందు యేది లేదో వర్తమానకాలమునందుకూడ యది లేనిదే అను న్యాయమున మిథ్యాక్షణికా నందకారులు. కాన నట్టి సుఖములయందు విద్వాంసుడు ప్రీతిని పొందడు. భోగములు రజ్జుసర్పమువలె యవ్యవస్థ ములు, స్వప్నమువలె దృష్టిసృష్టిరూపములగుటఁజేసి మిథ్యాభ్రమాకారములు, అవిద్యామూలకములు, జడములు. అధిష్ఠానసాక్షాత్కారముచే నష్టమయిన యవిద్యాభ్రమకల విద్వాంసుడు– మరుమరీచికల యాథార్థ్యమును తెలిసిన వాడు ఊషరవారియందు ప్రవర్తించనట్లు వైషయికసుఖములయందు రతిని పొందడు. మరేమిచేయు ననెదవా? బాహ్యసుఖములయందు పైనిచెప్పిన విధమున దోషజ్ఞానముకలవాడై సంసారమునందు సుఖలేశమైనలేదని బాహ్య భోగములయందు రుచినివదలి యాత్మ సుఖానుభవము కలవాడగును. ||౨౨||

పరమార్థప్రపా:—"లోక ఏష విషయానురంజనం దుఃఖగర్భమపి మన్యతే సుఖమ్। ఆమిషం బడిశగర్భ మప్యహో! మోహతో గ్రసతి యద్వ దండజః" గాలము గర్భమునందుగల మాంసఖండమును మోహమువలన మత్స్యము మ్రింగినటుల దుఃఖముగర్భమునందుగల విషయానురంజనమును సుఖరూపముగ నీలోకము తలచు చున్నది. అట్టి భోగములను దుఃఖకారణముగ, లేక దుఃఖము కారణముగాకలవాటినిగనో, ఆద్యంతవత్తులుగను తెలిసికొని విషసంపృక్తాన్నమునువలె విద్వాంసుడు పరిత్యజించును. ||౨౨||

—: ౫వ అధ్యాయము. ౨౩ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— సర్వానర్థప్రాప్తికి హేతువు, శ్రేయోమార్గప్రతిబంధకము నగు దోషము వారించుటకు శక్యము కానిది. అట్టి దోషమును ముముక్షువు గొప్ప ప్రయత్నముచే నివారింపవలయునని "శక్నోతి" అను శ్లోకముచే ప్రయత్నాధిక్యమును బోధించుచుండెను.

**శాంకరభాష్యమ్—**

విషయే శ్రూయమాణే స్మర్యమాణే వాఽనుమితే సుఖహేతౌ యా గర్ధి స్తృష్ణా స కామః, క్రోధ శ్చాత్మనః ప్రతికూలేషు దుఃఖహేతుషు దృశ్యమానేషు, శ్రూయమాణేషు, స్మర్యమాణేషు వా యో ద్వేష స్స క్రోధ స్తౌ కామక్రోధా వుద్భవో యస్య వేగస్య స కామక్రోధోద్భవో వేగః, రోమాఞ్చనహృష్టనేత్రవదనాదిలింగోఽన్తఃకరణప్రక్షోభరూపః కామోద్భవో

**శాంకరభాష్యతత్త్వబోధిని—**

వేగమును సహించునో అని మరణమును హద్దుగ చెప్పవలసిన యవసరము కలిగినది. అనగా మరణపర్యంతము కామక్రోధోద్భవమగు వేగము నమ్మదగినది కాదని యర్థము.

కామమనగ నింద్రియగోచరమై ప్రాప్తమైన యిష్టవిషయము శ్రూయమాణమైనను,స్మరింపఁబడినను, అనుభూతమైనను, అట్టి సుఖహేతువునం దేతృష్ణకలదో అది కామమనఁబడును. క్రోధమనగ తనకుప్రతికూలమగు దుఃఖహేతువులు చూడబడుచుండినను, శ్రూయమాణములైనను, స్మరింపఁబడుచుండినను, అట్టి దుఃఖహేతువులయందు యేద్వేషము కలదో అదియే క్రోధమనఁబడును. అట్టి కామక్రోధములే కారణముగా కలది వేగము. (అనగా అట్టికామక్రోధముల వలన వేగము జనించుననుట.) అందు కామోద్భవమగు వేగమెట్టిదనిన రోమాంచనము (గరిపొడుపు) ప్రహృష్టమగు నేత్రవదనాదులే చిహ్నముగాకల యంతఃకరణ ప్రక్షోభరూపము కామోద్భవవేగమనంబడును. అనగా కామమువలన నంతఃకరణమునకు క్షోభసంభవించును. అదియే వేగమనఁబడును. అట్టి వేగము ప్రాప్తించినపుడు గరిపొడుపు, నేత్రములు, ముఖములు

ఆత్మకనుకూలమైన సుఖహేతువులు దృశ్యమానములైనను, శ్రూయమాణములైనను, స్మర్యమాణములైనను తద్గతగుణానుసంధానాభ్యాసముచే రతిరూపము, గర్ధ్యమనగు అభిలాషరూపమైన తృష్ణాలోభము కామమనఁబడును. కామశబ్దము స్త్రీపురుషుల పరస్పరవ్యతికరాభిలాషయందు అత్యంతనిరూఢము. ఈ యభిప్రాయముచేతనే "కామః క్రోధ స్తథా లోభః" అనుస్థలమున ధనతృష్ణ లోభ మనియు, స్త్రీపురుషవ్యతికర తృష్ణ కామమనియు కామలోభములు వేరుగ జెప్పబడెను. ఇచట తృష్ణాసామాన్యాభిప్రాయముచే కామశబ్దమే ప్రయోగింపబడెను. లోభము వేరుగ జెప్పబడలేదు. ఇట్లే తనకు ప్రతికూలములగు దుఃఖహేతువులు దృశ్యమానములైనను, శ్రూయమాణములైనను, స్మర్యమాణములైనను వాటి దోషానుసంధానాభ్యాసముచే ప్రజ్వలనాత్మకమగు ద్వేషరూపమైన యేమన్యువుకలుగునో అదియే క్రోధము. అట్టి కామక్రోధముల యుత్కటావస్థ లోకవేదవిరోధప్రతిసంధానప్రతిబంధకమగుటచే లోకవేదవిరుద్ధప్రవృత్త్యున్ముఖత్వరూపమై నదీవేగసామ్యముచే వేగమని చెప్పఁబడుచున్నది. ఎట్లు నదీవేగము వర్షకాలములయందతిప్రబలమగుటచే లోకవేదవిరోధప్రతిసంధానముచేయుచు అనగా ప్రబలముగ ప్రవహించుచున్న నదియందు దిగిన మునిగిపోవుదురు. అనుజ్ఞానముకలవాడైనను, "వర్షాసు న నదీం ప్రవిశేత్" వర్షకాలమున నదినిప్రవేశించరాదు అను వేదవాక్యమును స్మరించుచున్నవాడైనను, మన గతికిపుడు విరుద్ధమైన గతికలది నది యని విరోధమును స్మరించువాడైనను నదిని ప్రవేశించుట కిచ్ఛగించనివాడైనను, నదిని ప్రవేశించినవానిని నదీవేగము సుడిలోపారవైచి ముంచివేయును. మఱియు అడుగుభాగమునకు లాగుకొనిపోవును. అట్లే కామక్రోధముల వేగముకూడ వర్షాకాలస్థానీయమగు శబ్దస్పర్శరూపరసగంధరూపమగు విషయముల యభిధ్యానాభ్యాసముచే నతిప్రబలమై లోకవేదవిరోధప్రతిసంధానముచే (అనగా కామక్రోధములు కలవాడు చెడిపోవును. అను లోకజ్ఞానము కలవాడైనను, కామక్రోధవశుడు కాఁకూడదను వేద

**శాంకరభాష్యమ్‌:—**

వేగః, గాత్రప్రకంపప్రస్వేదసందష్టోష్ఠపుటరక్తనేత్రాదిలింగః క్రోధోద్భవో వేగ స్తం కామ క్రోధోద్భవం వేగం య ఉత్సహతే ప్రసహతే సోఢుం ప్రసహితుం స యుక్తో యోగీ సుఖీ చేహ లోకే నరః। ।౨౩।।

**శాంకరభాష్యతత్త్వబోధినీ:—**

మొదలగు నవయవములు ప్రహృష్టమైయుండుట సంభవించును. ఇట్టిప్రహృష్ట నేత్రాదులచేతను గరిపొడుపుచేతను కామోద్భవమగు నంతఃకరణ ప్రక్షోభరూపవేగ మూహింపనగును.) క్రోధోద్భవవేగమనగనేమి? అదియు నంతఃకరణ ప్రక్షోభరూపమే. అట్టి వేగము ప్రాప్తించినపుడు శరీరము కంపించుట, శరీరమునం బ్రికృష్టముగ చెమటపట్టుట, పెదిమలను కొరకుట, నేత్రములు యెర్రనగుట మొదలగునవి సంభవించును. ఇట్టిచిహ్నములు కల యంతఃకరణప్రక్షోభము క్రోధోద్భవవేగ మనఁబడును. అట్టికామోద్భవ వేగమును, క్రోధోద్భవవేగము నెవడు మరణము నకు పూర్వమునందే జీవించియుండగనే సహించుటకు సమర్థుడగునో వాడీలోకమునందే యోగియు సుఖవంతుడును అగును. ॥౨౩॥

జ్ఞానము కలవాడైనను, కామక్రోధములు విరోధకోటియందు ప్రవిష్టములు అని విరోధజ్ఞానముకలవాడైనను, అట్టి జ్ఞానముచే కామక్రోధముల నిచ్ఛగించని వానినిగూడ విషయములనెడి గోతులయందు పారవైచి సంసార సముద్రమున ముంచివేయును. మరియు మహానరకములను పొందించును అని సూచించుటకు "వేగం" అను పదము ప్రయోగించబడెను. ఈ విషయము "అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః" అనుచోట వివరింపబడెను.

స్తంభస్వేదాద్యనేకబాహ్యవికారములచే నూహింపదగినట్టియు, అంతఃకరణప్రక్షోభరూపమునగు నిట్టి కామక్రోధోద్భవమగు వేగమును "ఆశరీరవిమోక్షణాత్" శరీరవిమోక్షణపర్యన్తము అనేకనిమిత్తములవలన యెల్లపుడు సంభావ్యమానమగుటచే నమ్మదగదని లోపల జనించినంతమాత్రమైె యీ లోకముననే బహిరింద్రియ వ్యాపారమును జనింపజేయును. అదియే గర్తపతనము. అట్టి గర్తపతనమునకు ముందుగనే ధీరుడగు యే యతి తిమింగిలము నదీవేగము నెదుర్కొనునట్లు విషయములయందు దోషదర్శనముయొక్క యభ్యాసముచే జనించిన వశీకరణమను పేరుగల వైరాగ్యముచే "సోఢుం" దానికనురూపమగు కార్యముల యసంపాదనచే కామక్రోధోద్భవ వేగమును నిరర్థకము చేయుటకు సమర్థుడగునో అట్టివాడే యోగి; వాడే సుఖి; వాడే పురుషార్థసంపాదనవలన "పుమాన్" అని అనిపించుకొనును. ఇతడు ఆహారనిద్రాభయమైథునాది పశుధర్మమాత్రరతుడగుటచే మనుష్యాకారమగు పశువే యనఁబడును.

"ప్రాక్ఛరీరవిమోక్షణాత్" అను వాక్యము మరియొక తీరునకూడ వ్యాఖ్యానింపదగును. అది యెట్లనిన? ఎట్లు మరణించినపిమ్మట దుఃఖించుచున్న స్త్రీలచే యాలింగనచేసుకొనబడుచున్నను, పుత్రాదులచే తగులబెట్టబడుచున్నను ప్రాణశూన్యుడగుటవలన కామక్రోధోద్భవవేగమును సహించునో యట్లే మరణమునకు పూర్వమునందున్న జీవించియుండగనే యే యతి కామక్రోధోద్భవవేగమును సహించునో యాయతియే "యుక్తః" యోగి యనఁబడును. వాడే సుఖియు నగును. ॥౨౩॥

శంకరానందీయము:—నిఖిలప్రపంచమును బ్రహ్మస్వరూపముగ దెలిసికొనినట్టియు, బ్రహ్మనిష్ఠచే క్షాళన చేయబడిన నిఖిలపాపపుణ్యసంస్కారములు కలిగిన యాత్మారాముడగు సిద్ధునకు సుఖేచ్ఛ, విషయములయందు ప్రవృత్తియు లేకుండుగాక, అభ్యాసము జేయుముముక్షువునకు యిష్టమైన దానియందు కామము, దానివలనప్రవృత్తి, అనిష్టమునందు ద్వేషము, దానివలన నివృత్తియు సంభవించుగాక యని యాశంకింపజనదు. అట్టి ముముక్షువుగూడ ప్రయత్నపూర్వకముగ కామక్రోధములను పరిహరింపవలయును. ఎందువలననిన? కామక్రోధములను జయించు

గీ॥ యోఽన్తస్సుఖోఽన్తరారామ స్తథాఽన్తర్జ్యోతి రేవ యః ।
స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి ॥ ॥౨౪॥

పదవిభాగము:— యః— అన్తస్సుఖః— అన్తరారామః— తథా— అన్తర్జ్యోతిః— ఏవ— యః— సః— యోగీ— బ్రహ్మనిర్వాణం— బ్రహ్మభూతః— అధిగచ్ఛతి ॥

ప్రతిపదార్థము:— యః=ఏపురుషుడు; అన్తస్సుఖః=ఆత్మయందేసుఖముకలవాడో; అన్తరారామః=ఆత్మయందే క్రీడకలవాడో; యః=ఏవఁడు; తథా=అట్లే; అన్తర్జ్యోతిరేవ=ఆత్మయే ప్రకాశకముగాఁ గలవాడో; సః=అట్టి; యోగీ=యోగి; బ్రహ్మనిర్వాణం=బ్రహ్మమునందు నిర్వృతిని అనగా మోక్షమును; బ్రహ్మభూతః=బహ్మస్వరూపుడైనవాడై; అధిగచ్ఛతి=పొందుచున్నాడు. ॥౨౪॥

టచే శమము (అంతరింద్రియనిగ్రహము) మొదలగునవి ప్రాప్తించును. అట్టి శమాదులవలన వివిదిష, దానివలన శ్రవణము, మననము, నిదిధ్యాసనము వీనివలన జ్ఞాననిష్ఠాపరిపక్వత, దానిచే మోక్షము, తత్సుఖము సిద్ధించును. మరి యొకతీరున సిద్ధించదను యాశయముచే "శక్నోతి" అను శ్లోకము చెప్పఁబడుచుండెను.

భోగ్యపదార్థము స్మృతమైనను, శ్రుతమైనను, దృష్టమైనను, ప్రాప్తించినను త్వర(తొందర) తోకూడిన భోగేచ్ఛ కామ మనిపించుకొనును. అప్రియమగు వస్తువు స్మృతమైనను, శ్రుతమైనను, దృష్టమైనను మనస్సు క్షోభపెట్టెడి ద్వేషపరిపాకము క్రోధ మనిపించుకొనును. ఈద్వేషము సదాచారసంపన్నుని భ్రష్టునిగను, వృద్ధుని నింద్యునిగను, తాపములేనివానిని తాపముగలవానిగను జేయును. మరియు తన యాశ్రయమును యగ్నివలె దహింపజేయును. గురువును హింసింపఁజేయును అట్టి కామక్రోధములచే జనించిన యుద్రేకమును యీదేహ ముండగనే అనగా యౌవనకాలమునందే యేముముక్షువు తీవ్రమోక్షేచ్ఛచే జనించిన తితిక్షచే సహించుటకు సమర్థుడగునో అట్టివాడు కామక్రోధములను జయించి శాంతుడు, దాంతుడు, యగుటకు తగినవాడు. అట్టి మోక్షార్థి శ్రవణాదులచే జ్ఞానమును సంపాదించి యోగియు, బ్రహ్మానందముకలవాడగుటకు సమర్థుడగును.

ఈశ్లోకాభిప్రాయము మొత్తముమీద యేమనిన, "దుర్లభో మానుషో దేహో బ్రాహ్మ్యో దేహస్సుదుర్లభః! బ్రాహ్మ్యదేహం సమాసాద్య యేన ముక్త్యై నయత్యతే, సుమేరో రగ్రి సామాద్య స్వదేహం పాతయత్యధః తమేవ పతితం విద్యాద్బ్రాతిభ్రష్టం మహాశయః॥" మనుష్యదేహముదుర్లభము. అందునను బ్రాహ్మణదేహ మతిదుర్లభము. అట్టి బ్రాహ్మణదేహమును పొందియు యెవఁడు ముక్తికొఱకు ప్రయత్నించడో అట్టివాడు సుమేరువు యగ్రము నధిష్ఠించి యచట నిలుకజాలక తన దేహమును క్రిందుకి పడవైచినవాడె యగును. అట్టివానిని మహర్షులు జాతిభ్రష్టు డని తెలిసికొనెదరు. అనున్యాయమున మోక్షసంపాదనకు యోగ్యమగు బ్రాహ్మణదేహమును పొందియు కామక్రోధ పరవశుడై పతితుడగుచో తిరిగి యిట్టి బ్రాహ్మణదేహము ప్రాప్తించుట దుర్లభము. కాన ముముక్షువు వివేకవైరాగ్యములచే పూర్వవయస్సునందే కామక్రోధాదిశత్రువులను జయించి ప్రయత్న పూర్వకముగ దేహముండుండగనే మోక్షము సంపాదింపదగినది.

లేక యేముముక్షువు మోక్షేచ్ఛచే గార్హస్థ్యమును విడవక గార్హస్థ్యమునందే (సంన్యాసమునకు పూర్వమునందే) వివేకవైరాగ్యములచే కామక్రోధములవలన జనించెడి వేగమును సహించునో యట్టి ముముక్షువుశ్రవణ మననములచే జ్ఞానమును సంపాదించి బ్రహ్మయోగయుక్తుడై, బ్రహ్మానందముకలవాడై యగుటకు తగినవాడ గును. కామక్రోధములను జయింపనివాడు సన్యసించినను శ్రవణాదులచే జ్ఞానమును, తత్ఫలమగు బ్రహ్మాత్మభావమును, మోక్షసుఖమును పొందుటకు సమర్థుడు కాడు. ॥౨౩॥

శ్రీధరీయము:— కాన మోక్షమే పరమపురుషార్థము. అట్టి మోక్షమునకు కామక్రోధముల వేగము విరోధి. అందువలన కామక్రోధవేగములను సహించుటకు సమర్థుడే మోక్షమునుపొందునని "శక్నోతి" అను శ్లోకముచే జెప్పుచుండెను. కామక్రోధములవలన జనించెడి మనోనేత్రాదిక్షోభరూపమగు వేగమును "ఇహైవ" అట్టి వేగోద్భవసమకాలమునందే యేమనుష్యుడు సహించునో ఆ సహనము క్షణకాలముమాత్రము కాదు, మరి యనిన "శరీరవిమోక్షణాత్ప్రాక్" దేహపతనపర్యంతము సహించునో యట్టివాడే సమాహితుడు, సుఖియు యగును. ఇతరుడు కానేరడు. ॥౨౪॥

**శాంకరభాష్యమ్:—**

కథంభూతశ్చ బ్రహ్మణి స్థితో బ్రహ్మ ప్రాప్నోతీత్యాహ- యోఽన్తస్సుఖోఽన్తరాత్మని సుఖం యస్య సోఽన్తస్సుఖ స్తథాఽన్తరే వాత్మ న్యారామ ఆక్రీడా యస్య సోఽన్తరారామ స్తథైవాన్తరాత్మైన్యేవ జ్యోతిః ప్రకాశో యస్య సోఽన్తర్జ్యోతిరేవ। య ఈదృశ స్స యోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మణి నిర్వృతిం మోక్ష మిహ జీవన్నేవ బ్రహ్మభూత స్సన్నధిగచ్ఛతి ప్రాప్నోతి। ||౨౪||

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

బ్రహ్మమాత్రనిరతుడై యుండుట జ్ఞానమున కత్యంత మాంతరంగము అని యీశ్లోకమునందు చూపుచుండెను. ఎట్టివాడై బ్రహ్మమునందుండి బ్రహ్మమును పొందును? అనునాశంకమీద చెప్పుచుండెను. ఎవఁడాత్మయందే సుఖముకలవాడో, అనగా బాహ్యవిషయ ప్రయుక్త సుఖము లేనివాడో, స్త్రీలుమొదలగు విషయప్రయుక్త క్రీడానిరపేక్షుడై ఆత్మయందే క్రీడ కలవాడో, చక్షురింద్రియాది ప్రయుక్త ప్రకాశమునందు నిరపేక్షుడై ఆత్మయే ప్రకాశముగా కలవాడగునో అట్టి యోగి జీవించియుండగనే బ్రహ్మభూతుఁడై బ్రహ్మమునందు నిర్వృతిని (మోక్షమును) పొందుచున్నాడు. అనగా యథోక్తవిశేషణసంపన్నుఁడు జీవించియుండగనే సర్వానర్థనివృత్తితో గూడిన నిరతిశయానందావిర్భావ రూపమగు మోక్షమును పొందుచున్నాడు. (జీవన్ముక్తుడగుననుట) ||౨౪||

—• ౫వ అధ్యాయము — ౨౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— కామక్రోధముల వేగము సహించుటమాత్రముచే ముక్తుడు కాడు, మరికొన్ని సాధనము లుండవలెను. అవియేవి యనుశంకను "యోఽన్తః" అను శ్లోకముచే తొలగించుచుండెను. బాహ్యవిషయముల యపేక్షలేని తత్స్వరూపమగు సుఖముకలవాడై (అనగా బాహ్యములగు శబ్దస్పర్శరూప రస గంధాత్మకమగు విషయములవలన జనించెడి సుఖము లేనివాడై,) బాహ్యవిషయజనిత సుఖశూన్యు డెట్లగుననిన? "అంతరారామః" బాహ్యసుఖసాధనములగు బాహ్యవిషయములందు ప్రీతిలేనివాడు కనుకనే యాత్మయందే క్రీడకలవాడు. అట్టివాడు విడచిపెట్టబడిన సర్వపరిగ్రహములు కలవాడగుటచే బాహ్యసుఖశూన్యుడై- విడచిపెట్టబడిన సర్వపరిగ్రహములుకల యతికి- యాదృచ్ఛికముగ ప్రాప్తించిన యారణ్యకమగు కోకిలాది మధురశబ్ద శ్రవణముచేతను, మందవాయుస్పర్శచేతను, చంద్రోదయ మయూరనృత్యాది దర్శనముచేతను, అతిమధుర శీతల గంధోదక పానముచేతను, కేతుకీ కుసుమ సౌరభాదుల యఘ్రాణముచేతను సుఖోత్పత్తి కలుగుచుండ బాహ్య సుఖతృష్ణన శూన్యత్వ మెటుల సంభవించును? అనుశంకను తొలగించుటకు "తథాన్తర్జ్యోతిరేవ" అనిచెప్పెను. ఎల్లప్పుడాత్మయందే సుఖమో బాహ్యవిషయములచే సుఖము ప్రాప్తించదో అనగా శ్రోత్రాదీంద్రియ జన్యశబ్దాది విషయ విజ్ఞాన రహితుడై ఆత్మవిజ్ఞాన మాత్రుడై యుండునో (అనగా సమాధికాలమున శబ్దాదిప్రతిభాసయే లేనందున, సమాధివ్యుత్థానదశయందు శబ్దాదులయందు మిథ్యాత్వనిశ్చయమువలనను బాహ్యవిషయముల వలన సుఖోత్పత్తి సంభవముకాదని యాశయము.) అట్టివాడు యోగి (సమాహితుడు.) "బ్రహ్మైవసన్బ్రహ్మాప్యేతి" అను శ్రుత్యుక్తరీతిని బ్రహ్మభూతుడు. వాడే "బ్రహ్మనిర్వాణం" పరమానందరూపము. కల్పితద్వైతోపశమ రూపమగుటచే నిర్వాణ (పరమసుఖ) రూపము. కల్పితముయొక్క యభావమధిష్ఠానరూపమగుటవలన అవిద్యానివృత్తిచే ట్టి పరమ సుఖరూపమగు నిర్వాణమును పొందుచున్నాడు. నిత్యప్రాప్తమగు నట్టి బ్రహ్మనిర్వాణమును యవిద్యానివృత్తిచే పొందుటవలన నెల్లపుడట్టివాడు బ్రహ్మభూతుడే. ||౨౪||

గీ॥ లభన్తే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః ।
ఛిన్నద్వైధా యతాత్మాన స్సర్వభూతహితే రతాః ॥ ॥౨౫॥

పదవిభాగము:— లభన్తే-బ్రహ్మనిర్వాణం-ఋషయః-క్షీణకల్మషాః- ఛిన్నద్వైధాః-యతాత్మానః-సర్వభూతహితే-రతాః ॥ ॥౨౫॥

ప్రతిపదార్థము:—క్షీణకల్మషాః=క్షీణ-నశించిన; కల్మషాః=పాపములు కలిగినట్టియు; ఛిన్నద్వైధాః=నశింపఁజేయబడిన సంశయములు కలిగినట్టియు; యతాత్మానః=సంయతమగు నింద్రియములు కలిగినట్టియు; సర్వభూతహితే=సర్వభూతముల యొక్క అనుకూల్యమునందు; రతాః=ఆసక్తిగలవారు; ఋషయః=జ్ఞానులు; (బ్రహ్మ నిర్వాణం=బ్రహ్మమునందు నిర్వృతిని; (మోక్షమును) లభన్తే=పొందుచున్నారు. ॥౨౫॥

---

శంకరానందీయము:— నిత్యానిత్యవస్తువివేకము, వైరాగ్యము, ముముక్షుత్వము వీటిచే సన్న్యాసమును సన్యసించి శమదమాది రూపమగు యంతిరంగసాధన సంపత్తిచే "శ్రోతవ్యోమంతవ్య" అను శ్రుతిహితశ్రవణమననములనాచరించి వాటిచే జనించిన యాత్మవిజ్ఞానముగల యతి విదేహకైవల్యార్థియై బ్రహ్మనిష్ఠతో నుండిన ముక్తిని పొందును. మరియొకవిధమున ముక్తిని పొందనేరడని సూచించుచుటకు "యోఽన్తః" అని చెప్ప మొదలిడెను.

"యోగీ" శ్రవణమననములచే జనించిన యాత్మజ్ఞానముయొక్క పరిపాకముతోడను సమాధినిష్ఠయందు ప్రవృత్తుడైన బ్రహ్మవేత్తయగు సంన్యాసి "అన్తర్జ్యోతిరేవ" ఆత్మయందే మనస్సుగలవాడై యుండవలెను. ఇచట అంతః అనుశబ్దము "సర్వస్మాదన్తరతమం యదయ మాత్మా" అను శ్రుతిచే నాత్మవాచకము. "జ్యోతిః" అనుశబ్దము "మనోజ్యోతిః" అను శ్రుతిచే మనోవాచకమని తెలిసికొనవలెను. ఎన్నడును బాహ్యములయందు మనస్సుగలవాడై యుండరాదు. అనగా సర్వదా యాత్మనే చూచుచుండవలెను. బాహ్యములనెన్నడు చూడరాదని యర్థము. "అన్తరారామః" ఆత్మయందే బుద్ధి క్రీడించుచుండవలెను. ఎప్పుడును యనాత్మయందు బుద్ధి క్రీడించరాదు. అనగా యెల్లపుడాత్మయందే యహం బుద్ధి కలవాడై యుండవలెను. యోన్తస్సుఖః" యెల్లపుడాత్మయందే సాధనాపేక్షలేని సుఖముకలవాడు. అనగా యెల్లపుడాత్మచేతనే సంతసించువాడు అట్టి యోగి స్వయముగనే నిత్యనిరంతర బ్రహ్మనిష్ఠచే బ్రహ్మభూతుడై నిశ్శేషముగ దేహాత్మభావమును పరిత్యజించి బ్రహ్మయందే యాత్మభావమును పొందినవాడై విదేహకైవల్యమును పొందుచున్నాడు. పైనిచెప్పిన లక్షణములుగల యతియే విదేహముక్తిని పొందునని యర్థము. ॥౨౪॥

—: ౫వ అధ్యాయము. ౨౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. :—

మధుసూదనసరస్వతీయము:- ముక్తికి హేతువగు జ్ఞానమునకు మరికొన్ని సాధనములను వివరించుచు "లభన్తే" అను శ్లోకముచే జెప్పుచుండెను.

మొట్టమొదట యజ్ఞాదులచే నశించిన పాపములుగలవారై యనంతరమున యంతఃకరణ పరిశుద్ధిచే నాత్మవస్తువివేచనచే సంన్యాసులై యనంతరమున వేదాన్త శ్రవణాదుల పరిపాకముచే నివృత్తమైన సర్వసంశయములు కలవారై యనంతరమున నిదిధ్యాసనపరిపాకముచే పరమాత్మయందేకాగ్రచిత్తముగల బ్రహ్మవేత్తలు ద్వైతజ్ఞానములేమిఁజేసి సర్వభూతములయందు హింసారహితులై బ్రహ్మనిర్వాణమును పొందుచున్నారు. ఈవిషయమున "యస్మిన్సర్వాణి భూతాన్యాత్మైవా భూద్విజానతః తత్ర కో మోహః కశ్శోక ఏకత్వ మనుపశ్యతః" అను శ్రుతియే ప్రమాణము. ఇచట "ఋషయః" అని బహువచనము "తద్యో దేవానాం ప్రత్యబుధ్యత" అను శ్రుత్యుక్తనియమ ప్రదర్శనార్థము. అనగా పైశ్రుతి దేవతలలో యెవడెవడాత్మజ్ఞానముగలవాడో వాడే ముక్తుడను బోధించుటచే నాత్మజ్ఞానియే ముక్తుడగును కాని ఇతరుడు కారడని నియమము ప్రదర్శింపబడెను. ॥౨౫॥

**శాంకరభాష్యమ్:—**

కించ- లభన్తే బ్రహ్మనిర్వాణం మోక్ష మృషయః క్షీణకల్మషాః క్షీణపాపాదిదోషా- శ్ఛిన్నద్వైధా శ్ఛిన్నసంశయా యతాత్మాన స్సంయతేన్ద్రియా స్సర్వభూతహితే రతా- స్సర్వేషాం భూతానాం హిత ఆనుకూల్యే రతా అహింసకా ఇత్యర్థః । ॥౨౫॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

ముక్తికిహేతువగు జ్ఞానమునకు సాధనాంతర మీశ్లోకమునం దుపదేశించుచుండెను. మఱియు పంచపాక యజ్ఞాది నిత్యకర్మానుష్ఠానమువలన పాపాదిరూప కల్మషమును నశింపఁజేసుకొని (వివిదిషవలన) వేదాన్త శ్రవణమనేక సారులాచరించి, అనేక పర్యాయములు మనననిదిధ్యాసనముల నొనరించి పోయిన సంశయములు కలవారై త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములనెడి యింద్రియములను శబ్దస్పర్శరూప రసగంధములనెడి విషయములయందు ప్రవేశింపకుండగ నియమించుకొని సర్వభూతములయొక్క ఆనుకూల్యమునం దాసక్తి కలవారై అనగా అహింసకులైన ఋషులు మోక్షమును పొందుచున్నారు.

(అనగా మోక్షసాధనమగు జ్ఞానమునకుసాధనముశ్రవణాదులు. అట్టిశ్రవణాదులుసిద్ధింపవలెననిన పాపక్షయమపేక్షితము. అట్టి పాపక్షయమునుకూర్చి నిత్యనైమిత్తిక కర్మానుష్ఠానమవశ్యకర్తవ్యము. అట్టి కర్మానుష్ఠానము కర్మనాశద్వారా శ్రవణాదులను సిద్ధింపజేసి జ్ఞానమును కలుగజేయును. అట్లే శ్రవణాదులచే సంశయములు నివృత్తమై కార్యకరణ నియమన మొనరించి దయాళువై అహింసకుడగును. కాన, అహింసయు జ్ఞానప్రాప్తికి సాధనమే యని గ్రహింపనగును.) ॥౨౫॥

శంకరానందీయము:- ఎవరు నశించిన పాపములు కలవారై ద్వైతభావమును విడనాడి, నియమితాతఃకరణము కలవారై యెల్లపు డాత్మయందే క్రీడకలవారో యట్టివారే విదేహముక్తిని పొందెదరని "లభన్తే" అను శ్లోకముచే చెప్పుచుండెను.

"యతాత్మానః" అన్నివిధములచేనిరోధింపబడిన మనస్సుకలవాడై "తదేతత్ప్రేయః పుత్రాత్ప్రేయో విత్తాత్ప్రేయోఽన్యస్మా త్సర్వస్మాదన్తరతమం యదయమాత్మా" అను శ్రుతివలన, ఆనన్దరూపమగుటవలన బ్రహ్మాది స్తంబపర్యన్తమగు నిఖిలప్రాణులకు (భూతములకు) ఆత్మప్రియము. కాన సర్వభూతములకు హితమైనది స్వాత్మభూతమునగు బ్రహ్మమునందే నిరతులై ఋషులు యెల్లపుడు సదాత్మయందే క్రీడింతురో అట్టివారు యెల్లపు డాత్మనిష్ఠులగుటచే "క్షీణకల్మషాః" నిశ్శేషముగ నశించిన వాసనాశబ్దితము, మనః కషాయరూపమనగు కల్మషములు కలవారు. అనగా బ్రహ్మయోగనిష్ఠచే క్షాళితమయిన యంతఃకరణ దోషములు కలవారు. కనుకనే జనించిన యాత్మయాథాత్మ్య విజ్ఞానముచే "ఛిన్నద్వైధాః" వస్తువుయొక్క ద్వైధాత్వ జ్ఞానము ననుసరించి పుట్టినవి "ద్వైధాః అని యనుపించుకొనును. అవిసంశయులు. అది యెట్లనిన చీకటియందు ఒకవస్తువునుచూచిన తోడనే స్థాణుత్వబుద్ధియు, పురుషత్వబుద్ధియు, తత్తద్ధర్మజ్ఞానమువలన జనించును. అటుపిమ్మట ఇదిస్థాణువా? పురుషుడా? యనిసంశయము కలుగును అట్లే ఆత్మవిషయమున కూడ సంశయములు కలుగును. అదియెట్లనిన! ఆత్మచిద్రూపమా? అచిద్రూపమా చిద్రూపమైనను నిత్యమా? అనిత్యమా?, నిత్యమైనను దేహేంద్రియాదిభిన్నమా? అభిన్నమా? దేహేంద్రియభిన్నమైనను దేహాదులతో సంస్పృష్టమా? అసంస్పృష్టమా?, దేహేంద్రియాద్యసంస్పృష్టమైనను స్వయం కర్తృత్వాది ధర్మవిశిష్టమా? లేక కర్తృతాదిధర్మరహితమా?, కర్తృత్వాది ధర్మరహితమైనను సయసంగమా- కాదా? అసంగమైనను దేహాది కృతకర్మసంబంధముకలదా? కాదా? కర్మలేపములేకున్ననుస్వయముగబ్రహ్మభిన్న

గీ॥ కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్ ।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్ ॥ ॥౨౬॥

పదవిభాగము:— కామక్రోధ వియుక్తానాం- యతీనాం-యతచేతసాం- అభితః-బ్రహ్మనిర్వాణం- వర్తతే- విదితాత్మనామ్॥ ॥౨౬॥

ప్రతిపదార్థము:— కామక్రోధవియుక్తానాం= కామక్రోధములచే విడవబడినట్టియు; యతచేతసాం= సంయతమైనయంతఃకరణక లిగినట్టియు; విదితాత్మనాం=తెలియబడినయాత్మస్వరూపము కలిగినట్టి; యతీనాం= సంన్యాసులకు; అభితః=అంతటను; ఉభయతః=జీవించియున్నపుడు; సిద్ధినిపొంది (మరణించి) నపుడు; బ్రహ్మనిర్వాణం= మోక్షము; వర్తతే=ఉంటున్నది. ॥౨౬॥

శాంకరభాష్యమ్:—

కించ- కామక్రోధవియుక్తానాం కామశ్చ క్రోధశ్చ కామక్రోధౌ తాభ్యాం వియుక్తానాం యతీనాం సంన్యాసినాం యతచేతసాం సంయతాన్తఃకరణానా మభిత ఉభయతో జీవతాం మృతానాం చ బ్రహ్మనిర్వాణం మోక్షో వర్తతే, విదితాత్మనాం విదితో జ్ఞాత ఆత్మా యేషాం తే విదితాత్మాన స్తేషాం విదితాత్మనాం సమ్యగ్దర్శినా మిత్యర్థః । ॥౨౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కామక్రోధములవలన జనించెడి వేగముసహింపదగినదని పూర్వశ్లోకమునందుచెప్పఁబడెను. అంతమాత్రమేకాదు. మరేమనిన కామక్రోధములే విడువదగినవని యీశ్లోకమునందు చెప్పుచుండెను. కామక్రోధములచే విడవబడినట్టియు, (కామక్రోధములను విడచినట్టి) విషయపర్యాలోచనలేకుండగ) నియమింపఁబడిన యంతఃకరణము కలిగినట్టియు, తెలియబడిన యాత్మకలిగినట్టి (ఆత్మజ్ఞాన సంపన్నులైన) సంన్యాసుల కంతటను అనగా జీవించియున్నవారలకు, మృతులైనవారలకు. (అనగా అట్టి సంన్యాసులు జీవించియున్నను మృతులైనను అట్టివారలకు మోక్షము ప్రాప్తించుచున్నది.) అనగా కామక్రోధరహితులై, విషయముల పారవశ్యమును పొందకుండగ యంతఃకరణమును నియమించిన బ్రహ్మజ్ఞానులగు సంన్యాసులు ప్రారబ్ధకర్మ వశమున జీవించియున్నచో జీవన్ముక్తులగుదురు. ప్రారబ్ధకర్మ నశించి ప్రారబ్ధకర్మాయత్తమగు భౌతికదేహము నశించిన విదేహకైవల్యమును పొందుదురు. ఉభయతః వారు ముక్తులగుదురని యాశయము. ॥౨౬॥

మా? కాదా? బ్రహ్మాభిన్నమైనను బ్రహ్మాత్మైకత్వజ్ఞానము మనోజన్యమా? కాదా? మనోత్పన్నమైనను అజ్ఞానము యథార్థమా? కాదా?, అట్టిజ్ఞానము యథార్థమైనను ముక్తికి సాధన మగునా? కాదా? ముక్తిసాధనమైనను నాకు జీవన్ముక్తి కలదా? లేదా? జీవన్ముక్తి యుండినను విదేహముక్తి సిద్ధించునా? సిద్ధించదా? ఇట్టిసంశయము అనేకములు కలవు. పూర్వోక్తాత్మయాథాత్మ్య జ్ఞానముచే నిట్టి సంశయములన్నింటిని నశింపజేసుకొనినవారై విదేహకైవల్యమును పొందుచున్నారు. ॥౨౫॥

—: ౫వ అధ్యాయము. ౨౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. :—

మధుసూదనసరస్వతీయము:— పూర్వశ్లోకమున కామక్రోధములు జనించినను వాటి వేగము సహింపవలయునని చెప్పఁబడెను. ఇపుడు "కామక్రోధ వియుక్తానాం" అను శ్లోకముచే కామక్రోధముల యుత్పత్తి నే ప్రతిబంధింపవలయునని చెప్పుచుండెను.

గీ॥ స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాం శ్చక్షుశ్చైవాన్తరే భ్రువోః ।
పాాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ ॥ ॥౨౭॥

పదవిభాగము:— స్పర్శాన్- కృత్వా- బహిః- బాహ్యాన్- చక్షుః- చ- ఏవ- అన్తరే- భ్రువోః- ప్రాణాపానౌ- సమౌ- కృత్వా- నాసాభ్యన్తరచారిణౌ ॥ ॥౨౭॥

ప్రతిపదార్థము:— బాహ్యాన్=వెలుపలివగు; స్పర్శాన్=(స్పృశ్యన్త ఇతి స్పర్శాః శబ్దాదివిషయాః) శబ్దస్పర్శరూప రసగంధములనెడి విషయములను; బహిః=వెలుపలివానినిగ జేసి; చక్షుశ్చైవ=చక్షురింద్రియమునైతే; భ్రువోః=కనుబొమ్మలయొక్క; అన్తరే=మధ్యభాగమునందు; కృత్వా(ఈపదమనువృత్తము)చేసి; ప్రాణాపానౌ=ప్రాణాపానములను; నాసాభ్యన్తరచారిణౌ=నాసికయొక్క మధ్యయందు సంచరించువానినిగ; సమౌ=సమానముగ కృత్వా=చేసి॥ ॥౨౭॥

శాంకరభాష్యమ్:—

సమ్యగ్దర్శననిష్ఠానాం సంన్యాసినాం సద్యోముక్తి రుక్తా, కర్మయోగ శ్చేశ్వరార్పితసర్వ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పూర్వగ్రంథమునం దాత్మజ్ఞాననిష్ఠులగు సంన్యాసులకు సద్యోముక్తి చెప్పంబడెను. (మరియు) ఈశ్వరునియం దర్పించబడిన దేహేంద్రియమనస్సుల చేష్టావిశేషముచే ఈశ్వరుడగు బ్రహ్మమునం దర్పించి చేయబడు కర్మయోగము సత్త్వశుద్ధి, జ్ఞానప్రాప్తి, సర్వకర్మసంన్యాసము

కామక్రోధముల యుత్పత్తిరేలేనట్టియు, కనుకనే సంయతమైన చిత్తముకలవారైనట్టియు, సాక్షాత్కృత పరమాత్మకులు, యత్నశీలురగు సంన్యాసులకు "అభితః" బ్రతికియున్నపుడు శరీరపరిత్యాగము చేసినపుడును మోక్షము సిద్ధమే. మోక్షము నిత్యమగుటవలనను, సాధింపదగినది కానందునను పుట్టునది కాదని యాశయము.

శంకరానందీయము:— కామక్రోధరహితులై సదా ఆత్మనిష్ఠచే నుండువారలకే జీవన్ముక్తి, విదేహముక్తియు ప్రాప్తించును. ఇతరులకు ప్రాప్తించదని "కామక్రోధ వియుక్తానాం" అను శ్లోకముచే చెప్పుచుండెను.

కామమనగ యిచ్ఛావిశేషము. అది వస్తువులయం దిష్టబుద్ధిచే మనస్సుయొక్క బహిఃప్రవృత్తికి హేతువు. కామమునకు వ్యాఘాతము(అడ్డు) ప్రాప్తించినపుడు వస్తువునందనిష్టబుద్ధిచే మనస్సుయొక్క బహిఃప్రవృత్తికి హేతువగు బుద్ధివిశేషము క్రోధ మనఁబడును. ఈ కామక్రోధములే శ్రవణమననసమాధుల విచ్ఛిత్తికి పరమకారణములు. ఈ కామక్రోధములు కలవారలకు జ్ఞానము, సమాధియు సిద్ధింపవు. ఇట్టి కామక్రోధములచే సమాధి విచ్ఛిన్నమగుచో ననేకసార్లు శ్రవణమొనరించినను సమ్యజ్జ్ఞానము సిద్ధించదు. సమ్యజ్జ్ఞానమే సిద్ధించనిచో మోక్షముసిద్ధించదు. అందువలన ముముక్షువు, సమాధియందిచ్ఛగల యతి అవశ్యము కామక్రోధరహితుడై యుండవలెనని సూచించుటకు మాటిమాటికి కామక్రోధపరిత్యాగమును తద్విస్మరణకొఱకు "కామక్రోధవియుక్తానాం" అని స్మరింపజేయుచుండెను.

ఈచెప్పఁబడిన లక్షణములుగల కామక్రోధ వియుక్తులును, శాన్తులును, సర్వాత్మయు, ప్రత్యగభిన్నమునగుబ్రహ్మమునందే స్థాపించబడిన చిత్తముకలవారును, కనుకనే "అయమహమస్మి" అని సాక్షాత్స్వాత్మగ సర్వాత్మకము, నిర్విశేషమే అగు పరమాత్మను తెలిసికొనిన బ్రహ్మవేత్తలు బ్రతికియుండగను, విదేహదశయందును కూడ బ్రహ్మానందానుభూతి కలవారగుదురు.

ఈ చెప్పుటచే విక్షేపకారణమగు కామక్రోధాదులను దూరముగ విడచి సమాధినిష్ఠయందే యుండిన యతికే సమ్యక్ జ్ఞానము, తత్ఫలము, మోక్షము సిద్ధించునని సూచించబడెను. ॥౨౬॥

గీ॥ యతేన్ద్రియమనోబుద్ధి ర్ముని ర్మోక్షపరాయణః ।
విగతేచ్ఛాభయక్రోధో య స్సదా ముక్త ఏవ సః ॥ ॥౨౮॥

పదవిభాగము:— యతేన్ద్రియమనోబుద్ధిః– మునిః– మోక్షపరాయణః– విగతేచ్ఛాభయక్రోధః–యః– సదా– ముక్తః– ఏవ– సః॥ ॥౨౮॥

ప్రతిపదార్థము:— యః=ఏ; మునిః=మననముచేతను ముని యనఁబడుము. అట్టిసంన్యాసి; సదా=ఎల్లపుడు; యతేంద్రియమనోబుద్ధిః=విషయములయందు ప్రవేశింపకుండ నియమింపఁబడిన యింద్రియములు బుద్ధి కలవాడై; మోక్షపరాయణః=మోక్షమే యుత్కృష్టమగు గతిగా కలవాడై; విగతేచ్ఛాభయక్రోధః=విగత=పోయిన, ఇచ్ఛా=కోరికయు; భయ=భయము; క్రోధః=క్రోధముకలవాడై; భవతి=అగుచున్నాడో; సః=అట్టిపురుషుఁడు; ముక్త ఏవ=ముక్తుడే యగుచున్నాడు. ॥౨౮॥

---

శాంకరభాష్యమ్.—

భావే నేశ్వరే బ్రహ్మ ణ్యాధాయ క్రియమాణ స్సత్త్వశుద్ధిజ్ఞానప్రాప్తి సర్వకర్మసంన్యాసక్రమేణ మోక్షా యేతి భగవా న్పదేపదేఽబ్రవీ ద్వక్ష్యతి చ । అథేదానీం ధ్యానయోగం సమ్యగ్దర్శన స్యాన్తరంగం విస్తరేణ వక్ష్యామీతి యస్య సూత్రస్థానీయాన్ శ్లోకా నుపదిశతిస్మ–స్పర్శా న్శబ్దాదీన్కృత్వా బహి ర్బాహ్యా శ్ర్శోత్రాద్విద్వారే ణాన్తర్బుద్ధౌ ప్రవేశితా శ్శబ్దాదయో విషయా స్తా నచిన్తయతో బాహ్యా బహి రేవ కృతా భవన్తి తానేవం బహిః కృత్వా చక్షు శ్చైవాన్తరే భ్రువోః కృత్వే త్యనుషజ్యతే। తథా ప్రాణాపానౌ నాసాభ్యన్తరచారిణౌ సమౌకృత్వా ॥ ॥౨౭॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

అను నీక్రమముచే మోక్షముకొఱకు సమర్థ మగుచున్నదని మాటిమాటికి శ్రీకృష్ణపరమాత్మ చెప్పెను. ఈ విషయమునే ముందుకూడ చెప్పగలడు. ఇట్లు చెప్పినపిమ్మట యిపుడుసమ్యగ్దర్శన మున కంతరంగమగు ధ్యానయోగమును విస్తారముగ చెప్పెదనని ఆ ధ్యానయోగమునకు సూత్రస్థానీయములగు మూడుశ్లోకముల నుపదేశించుచుండెను.

---

—: ౫వ అధ్యాయము. ౨౭ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:—ఇంతకుపూర్వమునం దీశ్వరార్పిత సర్వభావములు కలవానికి కర్మయోగ ముచే నంతఃకరణపరిశుద్ధియు, దానివలన సర్వకర్మసంన్యాసము, దానివలన శ్రవణాదిపరుడగువానికి మోక్ష సాధనమగు తత్త్వజ్ఞానము జనించునని చెప్పఁబడెను. ఇపుడు "సయోగీ బ్రహ్మనిర్వాణం" అనుచోట సూచింప బడిన సమ్యగ్దర్శనమున కంతరంగసాధనమైన ధ్యానయోగమును విస్తారముగ చెప్పుటకు సూత్రస్థానీయమగు మూడు శ్లోకములను శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచుండెను. ఈ మూడుశ్లోకములకు వ్యాఖ్యాస్థానీయము ఆరవఅధ్యా యము. ఈ మూడుశ్లోకములలోను మొదటి రెండుశ్లోకములచేతను సంగ్రహముగ యోగము చెప్పబడెను. మూడవ శ్లోకముచే యోగఫలమగు పరమాత్మజ్ఞానము చెప్పఁబడెను.

"స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాన్" శబ్దాదివిషయములు బాహ్యములైనను శ్రోత్రాదిద్వారమున తత్తదాకారాంతఃకరణవృత్తులచే నంతఃప్రవిష్టము అగును. అట్టితీరున నంతఃప్రవిష్టములగు శబ్దాదులను తిరిగి బాహ్యములుగ చేయవలెను. అనగా పరమవైరాగ్యముచే శబ్దాద్యాకారవృత్తులను కలుగనీయకుండగచేయవలెను. శబ్దాదులు అన్తరములే యగుచో నుపాయసహస్రముచేతనైన స్వభావభంగము ప్రాప్తించునుకాన బాహ్యముల నొనర్చుటకు వీలుకాదు. బాహ్యములే యగుచో రాగవశమున నంతఃప్రవిష్టములు కావచ్చును. అట్టివాటిని వైరాగ్య ముచే బాహ్యముల నొనరించుటయు యుక్తమగునని చెప్పుటకిట "బాహ్యాన్" అను విశేషణమీయబడెను.

**శాంకరభాష్యమ్.—**

యతేన్ద్రియ ఇతి । యతేన్ద్రియమనోబుద్ధి ర్యతాని సంయతా నీన్ద్రియాణి, మనో, బుద్ధిశ్చ యస్య స యతేన్ద్రియయమనోబుద్ధి ర్మననా న్ముని స్సంన్యాసీ మోక్షపరాయణ ఏవం దేహసంస్థానో మోక్షపరాయణో మోక్ష ఏవ పర మయనం పరా గతి ర్యస్య సోఽయం మోక్ష పరాయణో ముని ర్భవేత్ । విగతేచ్ఛాభయక్రోధ ఇచ్ఛా చ, భయం, క్రోధశ్చేచ్ఛాభయక్రోధా స్తే విగతా యస్మా త్స విగతేచ్ఛాభయక్రోధః। య ఏవం వర్తతే సదా సంన్యాసీ ముక్త ఏవ స న తస్య మోక్షా దన్యః కర్తవ్యోఽస్తి । ॥౨౮॥

**శాంకరభాష్యతత్త్వబోధిని.—**

శ్రోత్రాద్యింద్రియాంతర్ద్వారములచే లోపల నుండు బుద్ధియందు ప్రవేశపెట్టబడిన శబ్దాదివిషయముల నాలోచించకపోవుటయే బాహ్యమగు విషయములను బహిష్కరణముచేయుట. అట్టి బాహ్యములగు శబ్దాదివిషయలను పై చెప్పిన విధమున బహిఃకృతములుగ చేసి, చక్షుస్సును కనుబొమ్మలమధ్యనిలిపి, ప్రాణాపానములను నాసికాభ్యంతరమున సంచరించువాటిగ జేసి. ॥౨౭॥

విషయప్రవణతను పరిత్యజించి, విక్షేపపరిహారార్థము చక్షురింద్రియమును కనుబొమ్మల మధ్యయందు నిలిపి, ప్రాణాపానములను న్యూనాధికభావములేకుండగ నాసికాభ్యంతరమున సంచిరించునటుల చేసి అనగా కుంభకముచే ప్రాణాపానములను నిరోధించి, సర్వేంద్రియములను విషయములయందు ప్రవేశింపకుండగ నిరోధించి ప్రాణాయామపరుడై యుండవలయునని పూర్వశ్లోకమున చెప్పఁబడెను. అట్లు ప్రాణాయామపరుడై యేమి చేయవలె ననిన ? విషయములయందు ప్రవేశింపకుండగ నింద్రియమనోబుద్ధులను నియమించినవాడై దేహమునందున్నవాడై నను, సర్వదా మోక్షమే యుత్కృష్టమగు గతిగా కలవాడై, ఎల్లపుడు కోరికను, భయమును, క్రోధమును, విడచినవాడై యేమునియగు సంన్యాసి యెల్లపు డిట్లుండునో అట్టి సంన్యాసి ముక్తుడే యగుచున్నాడు. అట్టివానికి మోక్షముకంటె యన్య మేదియు కర్తవ్యముగ సంభవింపదు. ॥౨౮॥

ఈ శ్లోకప్రథమపాదముచే వైరాగ్యమును చెప్పి యభ్యాసమును ముందుపాదములచే జెప్పుచుండెను. భ్రూమధ్యభాగమున దృష్టిని నిలుపవలెను. అత్యంతము నేత్రములను మూసివేసినచో నిద్రయనెడి లయాత్మకమగు వృత్తి జనించును. నేత్రములను బహిఃప్రసారణ మొనరించిన 1 ప్రమాణము, 2 విపర్యయము, 3 వికల్పము, 4 స్మృతి అనెడి విక్షేపాత్మకములగు వృత్తులు సంభవించెడిని. ఇట్టి యుభయవృత్తుల నరికట్టి అర్ధనిమీలనముచే భ్రూమధ్యయందు చక్షుస్సు నుంచి ప్రాణాపానములను సమానముగజేసి అనగా ఊర్ధ్వాధోగతి లేనివాటిగ నొనరించి నాసాభ్యంతరమున సంచరించువాటినిగజేసి కుంభకమనెడి ప్రాణాయామముచే నింద్రియమనోబుద్ధుల నరికట్టి మోక్షపరాయణుడై సర్వవిషయవిరక్తుడై విగతేచ్ఛాభయక్రోధుడై మననశీలుడు కావలెను. ఇట్టి సంన్యాసి ఎల్లపుడు ముక్తుడే. వానికి మోక్షము కర్తవ్యము కాదు. లేక ఇట్టి సంన్యాసి జీవించియున్నపుడు కూడ ముక్తుడే. ॥౨౭–౨౮॥

శంకరానందీయము:—"నియమితాంతఃకరణులకు" అని పూర్వమునందు జెప్పుటచే సమ్యగ్జ్ఞానసిద్ధికి, తత్ఫలసిద్ధికి సమాధి పరమకారణమని సూచింపఁబడెను. అట్టి సమాధియోగమును సాధనములతోఁగూడ నుపదేశిం

పదలచి దానికి సూత్రభూతములగు మూడు శ్లోకములను జెప్పుచుండెను. ఆమూడు శ్లోకములలోను మొదటి రెండుశ్లోకములచేతను నిదిధ్యాసచేయఁదలఁచినవానికి యంతరంగసాధనములగు నారింటిని కర్తవ్యములుగ నుపదేశించుచుండెను. 1 భ్రాన్తిచే నాత్మకంటె వేఱుగ కల్పించబడినవి బాహ్యములనఁబడును. అట్టి బాహ్యములగు శబ్దాదివిషయములను బహిఃప్రదేశమునందే స్థాపనజేసి అనగా శబ్దాదివిషయములలో దేనినైన మనస్సుచే స్మరింపకుండుట యొక సాధనము. 2 ఇటునటు దృష్టిప్రసరింపకుండగ భ్రూమధ్యయందు దృష్టిని నిలుపుట రెండవసాధనము. 3 ప్రాణాపానములను నాసాభ్యంతరమునందు సంచరించునటుల జేసిసామ్యావస్థాపన్నముగ హృదయమునందుంచుట. అనగా మనోనైర్మల్యమునిమిత్తము పాపక్షయార్థము ముముక్షువున కవశ్య మాచరణీయమగు కుంభకము మూడవసాధనము. 4 ఇంద్రియములచే విషయములను గ్రహించకుండుట. మనస్సుచే విషయములను చింతించకుండ, బుద్ధిచే నావేశమువలన ప్రాప్తించిన అర్థమునుగ్రహించకుండుట అయిదవసాధనము. 6 ఇచ్ఛాభయక్రోధములను బుద్ధినుండి పారద్రోలుట.. ఇచ్ఛగలిగినచో సమాధి సిద్ధించదు. పగలుకాని, రాత్రికాని, అరణ్యమునందుకాని, గుహయందుకాని, ప్రాణులవలన భయముండినచో సమాధి సిద్ధించదు. అపకారులగు మశకపిపీలికాదులయందు హృదయమున క్రోధముండినచో సమాధి సిద్ధించదు. కాన నిదిధ్యాసన చేయఁదలఁచినవాడు ఇచ్ఛాభయక్రోధములను పరిత్యజింపవలెను. ఇట్టి యాఱుధర్మములుకలవాడు, ప్రయత్నపూర్వకముగ కర్తవ్యమగు కార్యజాతమును పరిత్యజించి తీవ్రమోక్షేచ్ఛచే మోక్షసాధనైకనిష్ఠుడై, ముముక్షువై, సర్వమును సంన్యసించి వస్తుధ్యానమును నియమముగ నాచరించుమునియే ముక్తుడగును. ఇతరుడు శతధా క్రియల నాచరించినను ముక్తుడు కాజాలడని యీ శ్లోకద్వయమున కర్థము. ॥౨౭-౨౮॥

భాష్యార్కప్రదీపిక:— “స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాన్...మోక్షపరాయణః” అను పదములచే వైరాగ్యవంతుడగు ముముక్షువే యధికారి యనియు, “చక్షుశ్చైవాంతరే భ్రువోః” అను పదములచే ఆసనజయపూర్వకమగు అంగవిక్షేపరాహిత్యము, “ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యన్తరచారిణౌ” అను వాక్యముచే ప్రాణాయామము చెప్పబడెను. మఱియు “స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాన్” అను దానిచేతనే “అహింసాసత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః” అను సూత్రోక్తమగు అహింస, సత్యము, అస్తేయము (అపహరించకపోవుట,) ప్రతిగ్రహములేకపోవుట అను యమములు, “శౌచసంతోష తపస్స్వాధ్యాయేశ్వర ప్రణిధానాని నియమాః” అను సూత్రోక్తమగు శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము అను నియమములు జెప్పబడెను. “యతేన్ద్రియమనోబుద్ధిః” అను పదముచేప్రత్యాహారము, “యతమనాః” అను దానిచేధారణధ్యానములు, “యతబుద్ధిః” అనుదానిచేసమాధియు చెప్పబడెను. “విగతేచ్ఛాభయక్రోధః” అను దానిచే మోక్షపరాయణుడగు యతియొక్క స్వరూపము చెప్పఁబడెను. ॥౨౭-౨౮॥

పరమార్థప్రప:—“స్పర్శాన్” అను శ్లోకద్వయముచే పూర్వోక్తమగు యోగమునే జెప్పుచుండెను.

రూపరసాది విషయములను స్మరింపక దూరముగ విసర్జించి, భ్రూమధ్యయందు దృష్టినినిలిపి నేత్రములను పూర్తిగమూసుకొనిన నిద్ర ప్రాప్తించుననియు, పూర్తిగచూచిన రూపాదివిషయములను గ్రహించుననియు తలచి యట్టి యుభయదోషములు ప్రాప్తించకుండగ వర్ధనిమీలనముచే భ్రూమధ్యయందు దృష్టిని యుంచవలెనని చెప్పెను. ఈ విషయమే “భ్రువోరన్తర్గతా దృష్టిర్ముద్రా భవతి ఖేచరీ। న రోగో మరణం తస్య న నిద్రాక్షుత్తృడాదయః” దృష్టిని భ్రూమధ్యయందు నిలిపినచో అది ఖేచరీముద్ర యనుపించుకొనును. అట్టి ఖేచరీముద్రను వహించినవానికి నిద్రయు, ఆకలియు, దప్పికయు, రోగము, మరణము మొదలగునవి ప్రాప్తించవని యోగమార్తాండమునందు చెప్పబడెను. నాసాభ్యంతరములయందు సంచరించు ప్రాణాపానములను సమానముగ జేసి (అనగా కుంభకము జేసి) ఈ యుపాయముచేతనే క్రమముగ నింద్రియమనోబుద్ధులను నియమించిన

ముని మోక్షపరాయణుడు కావలెను. అట్టివాడు కనుకనే ఇచ్ఛాభయక్రోధములు లేనివాడై జీవించియున్నను, మృతుడైనను ఎల్లపుడును ముక్తుడే యగుచున్నాడు.

నీలకంఠీయము:—

ఇట్లు సమ్యగ్దర్శననిష్ఠులకు సద్యోముక్తి చెప్పఁబడెను. కర్మయోగముకూడ ఫలపరిత్యాగ పూర్వకముగ నీశ్వరప్రీత్యర్థ మనుష్ఠింప బడినదై సత్త్వశుద్ధిద్వారమున మోక్షముకొఱకు సమర్థ మగునని చెప్పఁబడెను. ఇపుడు సమ్యగ్దర్శనమునకంతరంగ సాధనమగు ధ్యానయోగమును విస్తారముగ చెప్పెదనని తత్సూత్రభూతములగు మూడు శ్లోకముల నుపదేశించుచుండెను.

ఈశ్లోకముయొక్క యుత్తరార్ధముచే ప్రాణాయామము చెప్పఁబడెను. "స్పర్శాన్కృత్వా బహిర్బాహ్యాన్" అను దానిచే ప్రత్యాహారము చెప్పఁబడెను. "భ్రువో రంతరే చక్షుః కృత్వా" అనుదానిచే ధారణ చెప్పబడెను. 'విగతేచ్ఛాభయ' అనుదానిచే సాధనభూతములు, ఫలభూతములునగు రెండు విధములైన యమములు, నియమములు చెప్పఁబడెను. "యతేంద్రియః" అను దానిచే వితర్క మను పేరుగల సంప్రజ్ఞాతము చెప్పఁబడెను. "యతమనాః" అను దానిచే విచారమను సంప్రజ్ఞాతము చెప్పఁబడెను. "యతబుద్ధిః" అను దానిచే ఆనందము, అస్మితము చెప్పఁబడెను. "మోక్షపరాయణః" అను దానిచే అసంప్రజ్ఞాత సమాధి చెప్పఁబడెను. మిగిలిన దానిచే యోగఫలము చెప్పఁబడెను. విభాగము చూచుకొన నగును. "పాఠక్రమా దర్థక్రమో బలీయాన్" (పాఠక్రమము కంటె నర్థ క్రమము బలవత్తరమైన) దను న్యాయమున నక్షరార్థము స్పష్టము చేయబడెను.

అందు "విగతేచ్ఛః, విగతభయః, విగత క్రోధః" అని మూటికి సంబంధము. ఎవడు యిచ్ఛకలవాడో వాడు యిష్టసిద్ధినిమిత్తము హింసను, అనృతమును, చౌర్యమును, స్త్రీపరిగ్రహమును చేయ నిచ్ఛగించును. కాన "విగతేచ్ఛః" అను పదముచే తద్విరుద్ధమగు నహింస, సత్యము, అస్తేయము. (చౌర్యము లేకపోవుట) బ్రహ్మచర్యము, అపరిగ్రహములు యమము అనెడి సూత్రోక్తమగు యమములు లక్షితమగు చున్నవి. అట్లే భయమువలన స్వోచ్ఛేదశంక. అట్టి భయముచే నుద్విగ్నుడు కానివాడు "శౌచ సంతోష తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః" (శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము) అనెడి సూత్రోక్త నియమములను స్వీకరించుటకు యిచ్ఛగించును కాన "విగతభయః" అను పదముచే పైనుదహరింపఁబడిన నియమములు గ్రహింపఁబడును. అట్లే క్రోధాక్రాంతుఁడు మైత్ర్యాదులను తలచుట కశక్తుఁడై చిత్తశాంతిని పొందుట కసమర్థుఁడు. "మైత్రీకరుణా ముదితో పేక్షాణాం సుఖ దుఃఖ పుణ్యాఽపుణ్య విషయాణాం భావనాతశ్చిత్తప్రసాదనమ్" అను సూత్రమువలన మైత్ర్యాదులు చెప్పఁబడెను. అందు క్రోధము లేనివాడు శాంతమగు ప్రకృతి కలవాడగుటవలన సుఖము కలవారి యందు మైత్రిని పరునియిష్టముచే నాకే యీయిష్టము సంప్రాప్తమైనదని తలచును. అట్లే దుఃఖము కలవారివిషయమై కరుణను, పుణ్యాత్ముల విషయమై సంతోషమును, పాపాత్ములవిషయమై యుపేక్షను తలచును. ఇట్టి ప్రసాదనము లేనిదే చిత్తమనెడి యీ దర్పణమునకు నిర్మలత్వము సంభవింపదు. ఇట్లుసాధనావస్థయందు యమనియమ చిత్తప్రసాదనముల సిద్ధినిమిత్తము విగతేచ్ఛాభయక్రోధత్వ మిష్టము. ఇట్లే ఫలావస్థయందుకూడ విగతేచ్ఛాభయ క్రోధత్వము యిష్టము, అది యెట్లనిన? సంప్రజ్ఞాతసమాధికి ఫలభూతమైనది మధుమతి యను పేరుగల యోగభూమి. అట్టి యోగభూమియం దుండిన యోగిని గూర్చి దివ్య కామములు సంప్రాప్తమగును. అట్టి కామములయందుకూడ విగతేచ్ఛుఁడు కావలెను. అది యెట్లనిన? "స్థాన్యుపనిమంత్రణే సంగస్మయాకరణం పునరనిష్టప్రసంగాత్" మధుమతీ యోగభూమి యందుండిన యోగిని దేవతలు—ఓయోగి వరేణ్య! ఈ ఆసనమునందు కూర్చుండుము, ఇవిమంచి గృహములు, ఈ స్త్రీలు బహుసుందర మైనవారు, ఈరసాయనములు జరా-మరణములను హరించునవి, మేమందరము నీకింకరులమే, నీపుణ్య

ముచే నీస్థాన మార్జించఁబడినది, ఈసర్వమును నీవనుభవించు మని ప్రార్థించెదరు. ఇట్లు దేవతలు ప్రార్థించినను వాటియందెంతమాత్రము కోరిక చేయరాదు. సంగము, గర్వము భ్రంశకు హేతువులు కాన ఇట్టి భోగములు ప్రాప్తించుటవలన తనను గొప్ప వానినిగ తలఁపరాదు. దేవతలుకూడ నన్ను ప్రార్థించుచుండిరని గర్వమును పొందరాదు. అని పైయోగసూత్రము తెలుపుచున్నది. అట్లే భయము కూడ యోగాంతరాయజమని, వితర్కజమని రెండు విధములు. అందు యోగాంతరాయజమగు భయము "వ్యాధి, స్త్యాన, సంశయ, ప్రమాదాల స్యావిరతి, భ్రాంతిదర్శ, నాలబ్ధభూమిక, త్వానవస్థిత త్వాని చిత్తవిక్షేపాస్తేఽన్తరాయాః" వ్యాధియు, కర్మలు చేయక పోవుట (అకర్మణ్యత్వము) సంశయము, ప్రమాదము, ఆలస్యము, వైరాగ్యము లేకపోవుట, భ్రాంతిదర్శము, భూమికనుపొందక పోవుట, ఒకదానియందును స్థితిలేకపోవుట ఇవి చిత్తవిక్షేపము అనియు, ఇవియే అంతరాయములని పైయోగసూత్రము బోధించుచున్నది. "దుఃఖదౌర్మనస్యాంగమేజయత్వ శ్వాస, ప్రశ్వాసా విక్షేపసహభువః" దుఃఖము, దుర్మనస్కత్వము, కంపవాయువు, శ్వాస, ప్రశ్వాసలు విక్షేపముతోగూడ సంభవించునని పైసూత్రమే బోధించుచున్నది. ఇట్టి సూత్రద్వయముచే చెప్పఁబడిన భయము యోగాంతరాయజమనఁబడును. వితర్కము హింస మొదలగు వాటివలన జనించిన భయము వితర్కజ మనఁబడును. మొదటిదగు యోగాంతరాయజభయ మీశ్వరప్రణిధానము (ఈశ్వరసేవ) చే తొలఁగును. ఈవిషయమునే "తతః ప్రత్యక్చేతనాధిగమో ఽప్యన్తరాయాభావః" (ఈశ్వరసేవవలన పరమాత్మసాక్షాత్కారమగును, అంతరాయ (విఘ్న)ములు తొలఁగును) అని పైయోగసూత్రమే బోధించుచున్నది. ద్వితీయమగు వితర్కజభయము వితర్కమునకు విరోధియేది కలదో అట్టి దానిని భావనచేయుటచే తొలఁగును. ఈవిషయమునే "వితర్కబాధనే ప్రతిపక్షభావనమ్" (వితర్కముపోవుటయందు ప్రతిపక్షభావనము సమర్థమైనది) అను యోగసూత్రమే తెలుపుచున్నది. "వితర్కా హింసాదయః కృతకారితానుమోదితా లోభక్రోధమోహమూలా మృదుమధ్యాధిమాత్రా దుఃఖాజ్ఞానానన్తఫలదా ఇతి ప్రతిపక్షభావనమ్" ఈసూత్రమున "హింసాదయః" అను చోటగల ఆదిపదమువలన యనృతమును" చౌర్యాదులనుగ్రహింపనగును. హింసాదులు కృతకారితానుమోదితభేదముచే మూడువిధములు. అనగా 1 తనచే చేయబడిన హింస కృతహింసయనఁబడును. 2 పరునిచే చేయింపబడినహింస కారితహింస యనియు, 3 ఇతరుడు హింసనాచరించుచుండ దానినంగీకరించుట యనుమోదితహింసయని హింస మూడువిధములు. అట్లే తాననృతమును పలుకుట 1 కృతానృతమనియు, 2 మఱియొకనిచే నసత్యమును పలికించుట కారితానృతమనియు, 3 ఇతరుడనృతమును పలుకుచుండ దాని నంగీకరించుట యనుమోదితానృతమనియు అనృతము మూడువిధములు. తాను స్వయముగ చౌర్యమును చేయుట (1)కృతచౌర్యమనియు, యితరునిచే చౌర్యమును చేయించుట (2) కారితచౌర్యమనియు, ఇతరుడు చౌర్యము నాచరించుచుండ దాని నంగీకరించుట (3) అనుమోదితచౌర్యమనియు, హింసయు, అనృతము, చౌర్యము మొదలగునవి కృతకారితానుమోదితభేదముచే నొక్కొక్కటి మూడు మూడు విధములు. అట్టి హింసానృతచౌర్యములు లోభక్రోధమోహములు కారణముగా కలవై ప్రత్యేకము మూడుమూడు విధములు. అది యెట్లనిన ? లోభమువలన చేయఁబడిన హింస 1 లోభమూలకకృతహింస యనియు, లోభమువలన చేయించిన హింస 2 లోభమూలకకారితహింస యనియు, పరునిచే చేయబడుచున్న హింసను లోభముచే నంగీకరించిన నది 3 లోభమూలకానుమోదితహింస యనియు లోభమూలకహింస మూడువిధములు. క్రోధమువలన తానాచరించు హింస 1 క్రోధమూలకకృతహింసయనియు, క్రోధమువలన పరునిచే చేయించు హింస 2 క్రోధమూలకకారితహింసయనియు, పరుడు హింస నాచరించుచుండ క్రోధముచే నాహింసనంగీకరించిన నట్టిహింస 3 క్రోధమూలకానుమోదితహింస యనియు క్రోధమూలకహింస మూడువిధములు. మోహమువలన తానాచరించు హింస 1 మోహమూలకకృతహింస యనియు, మోహమువలన పరునిచే హింసను చేయించిన నాహింస

(2)మోహమూలకకారితహింస యనియు, పరుడు హింసనాచరించుచుండ నద్దానిని మోహముకతన తానంగీకరించినచో నట్టిహింస (3)మోహమూలకానుమోదితహింస యనియు, మోహమూలకహింస మూడువిధములు. లోభముకతనఁబలుకు యనృతము(1)లోభమూలకకృతానృతమనియు, లోభముకతన పరునిచేననృతమును పలికించిన నట్టియనృతము (2)లోభమూలకకారితానృతమనియు, పరు డనృతమునుపలుకుచుండ నద్దానిని లోభముకతన నంగీకరించినచో నది (3) లోభమూలకానుమోదితానృతమనియు, లోభమూలకానృతము మూడువిధములు. క్రోధముకతననృతమును పలుకుట (1) క్రోధమూలకకృతానృతమనియు, క్రోధముకతన పరునిచే ననృతముపలికించుట (2)క్రోధమూలకకారితానృతమనియు, పరు డనృతమును పలుకుచుండ క్రోధముకతన నద్దానినంగీకరించుట (3)క్రోధమూలకానుమోదితానృతమనియు, క్రోధమూలకానృతము మూడువిధములు. క్రోధముకతన తానుస్వయముగ చౌర్యము నాచరించుట (1) క్రోధమూలకకృతచౌర్యమనియు, క్రోధముకతన చౌర్యమును పరునిచే చేయించుట (2) క్రోధమూలకకారితచౌర్యమనియు, పరుడు చౌర్యమును చేయుచుండ నద్దానిని క్రోధముకతన నంగీకరించుట (3)క్రోధమూలకానుమోదితచౌర్యమనియు, క్రోధమూలకచౌర్యము మూడువిధములు. మోహముకతన చేయుహింస (1 మోహమూలకకృతహింస యనియు, మోహముకతన పరునిచే చేయించు హింస (2)మోహమూలకకారిత హింస యనియు, పరుడు హింస చేయుచుండ మోహముకతన నద్దానిని యంగీకరించుట (3) మోహమూలకానుమోదితహింస యనియు మోహమూలక హింస మూడు విధములు. అవియు మృదువులనియు, మధ్యములనియు, అతిమాత్ర లనియు ప్రత్యేకము మూడు మూడు విధములు మూఁభూతములగు వితర్కములు ఒకపక్షమున మూడువిధములు, ఒకపక్షమున నాల్గువిధములు. ఒకపక్షమున నయిదువిధములు. మరియధికముకూడ నుండును. మూడుత్రిగుణితములై యెనుబదియొకటి, నూటయెనిమిది, ముప్పదిఅయిదుకంటెనధికము, నూరు, అధికముగాని యగును (ఈసంఖ్యానము యోగశాస్త్రమునందు చూడనగును ) శాఖాప్రతిశాఖాభేదముచే ననంతమగును, ఇవన్నియు దుఃఖరూపములు, అజ్ఞానరూపములు, అనంతసంసారఫలకములనితలచుట యేవిపరీతభావన.అట్టిభావనచేవితర్కబాధనమగును. ఇట్లుయమముచేతను, నియమముచేతను, చిత్తప్రసాదనముచేతను, ప్రతిపక్షభావనచేతను విఘ్నములు లేకుండగ మృదూకృతమగు చిత్తముకల యోగి జనరహితమగు రహస్యప్రదేశమునందు "అపీనస్సంభవాత్" అను బ్రహ్మసూత్రానుసారము స్థిరముగ సుఖకరమగు నాసనమునందు కూర్చుండవలెను. ఈవిషయమున ప్రదేశము, ఆసనము– "సమేశుచౌ శర్కరావహ్నివాలుకావివర్జితే శబ్దజలాశ్రయాదిభిః। మనోనుకూలే నతు చక్షుపీడనే గుహానివాతాశ్రయణే ప్రయోజయేత్॥ త్రిరున్నతం స్థాప్య సమం శరీరం హృదీంద్రియాణి మనసా సన్నిరుధ్య। బ్రహ్మోడుపేన ప్రతరేత విద్వాన్ స్రోతాంసి సర్వాణి భయావహాని॥ సమానమైనట్టియు, పవిత్రమైనట్టియు, గుల్ల రాళ్లు దావాగ్ని మొదలగు నగ్నులు, ఇసుక మొదలగునవి లేనట్టియు, శబ్దముచేతను, జలముచేతను, ఆశ్రయాదులచేతను మనోనుకూలమైనట్టి, గుహ మొదలగు పెద్దవాయురహితమగు ప్రదేశమునందు కూర్చుండవలయును. చక్షురింద్రియమునకు పీడగలుగజేయు ప్రదేశమునందు కూర్చుండరాదు. ఎట్లు కూర్చుండవలెననిన? కటిప్రదేశమును, వక్షస్స్థలమును, కంఠమును ఉన్నతముగునట్లు శరీరమును సమానముగ నిడువుగనుంచి సర్వేంద్రియములను మనస్సుచే హృదయమునందు లెస్సగనిరోధించినవాడై విద్వాంసుఁడు బ్రహ్మమనెడి నావచే భయంకరమగు సాంసారికమహాసముద్రప్రవాహముల నన్నిటినితరించవలెను. (దాటవలెను.) అనగా జితాసనుడై ప్రాణాయామము నభ్యసించవలెను. అట్టి ప్రాణాయామముచే ప్రాణము మందమైనగమనముకల దగును. అట్లు ప్రాణము మందగమనముకలదైయుండ ప్రాణము ననుసరించి యుండు మనస్సుకూడ చాంచల్యమును బరిత్యజించును. అట్లుకానిచో ప్రాణవాయు విక్షేపముచే మనస్సుకూడ విక్షేపము కలదగును. అని శ్రుతియందే దేశవిశేషము ఆసనవిశేషము చెప్పబడెను. ఆశ్రుతియందే ప్రాణజయ ప్రమాణముకూడ చెప్పఁబడెను, "ప్రాణాన్ప్రపీడ్యేహ సంయుక్తచేష్టః క్షీణే ప్రాణే నాసికయోచ్ఛ్వసీత, (స్థిరమైన యాసనమునందుండి ప్రాణములను పీడించవలెను 'అనగా

పూరకరేచకములచే ప్రాణాయామపరుఁడు కావలెను. అట్లు ప్రాణాయామముచే ప్రాణము క్షీణించ (అనగా మందమగుచుండ) నాశికచే నుచ్ఛ్వాసను మాత్రము విడువవలెను. అనునదికూడ శ్రుతిచే చెప్పబడినదానినే గ్రహించుచున్నది.

"ప్రాణాపానౌ సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ" ప్రాణాపానములను సమానముగ చేసి, అనగా నూర్ధ్వాధోచ్ఛ్వాసల నరికట్టి ప్రాణాపానములను నాసికయొక్క యభ్యంతరమున తిరుగునట్లు చేసి. అనగా కుంభకమనెడి ప్రాణాయామపరాయణుఁడై యనంతరమున నిత్యము యింద్రియద్వారమున నంతర్బుద్ధియందు సన్నిహితమునయినట్టి విషయసంబంధములను యోగి యింద్రియముల విషయములనుండి మరలించి వెలుపలనుండు వాటిగనే చేయవలెను. అనగా విషయసంబంధములు యింద్రియద్వారమున బుద్ధియందు ప్రవేశింపకుండగ నింద్రియములను విషయములనుండి మరలింపవలెను. అని యాశయము. అనంతరమున కరణములు (యింద్రియములు) నువిషయములనుండి మరలించి స్వప్నకాలమునందువలె యంతర్మనోమాత్రుఁడై యుండవలెను. ఇట్టి యింద్రియప్రత్యాహారము నుచేయుట కశక్తుఁడు, అవిరక్తుఁడుఅగువానికి గతియేదైనకలదా? యనుశంకను తొలిగించుటకు "చక్షుశ్చైవాంతరే భ్రువోః" అని చెప్పెను. ఇచట నుండు "చ" అను శబ్దము వికల్పార్థకము. చక్షుస్సునైనను కనుబొమ్మల మధ్యనుంచవలెను. అనగా ఖేచరీముద్ర నభ్యసించవలెను. అని యర్థము. అట్టి ఖేచరీముద్ర యోగసారమనెడి గ్రంథమునందు "లంబికోర్ధ్వస్థితే గర్తే జిహ్వాం వ్యావృత్య ధారయేత్। దృఢాసన శ్చిరం తిష్ఠే న్ముద్రైషా ఖేచరీ మతా। భ్రూమధ్యదృష్టిరప్యేషా మహాదేవేన కీర్తితా" లంబిక యనగ కొండనాలుక, దానియొక్క యూర్ధ్వభాగమునందుగల బొత్తయందు జిహ్వను (నాలుకను) మరలించి యుంచవలెను. అట్లు ధారణచేసి చిరకాలము దృఢమగు నాసనము కలవాడైయుండవలెను, ఇదియే ఖేచరీముద్ర యనుపించుకొనును. లేక, కనుబొమ్మల మధ్యయందు దృష్టినినిలుపుటయు ఖేచరీముద్ర యనుపించుకొనునని మహాదేవునిచే చెప్పఁబడెను. ఇంద్రియములను వెలుపలనుండు సూర్యాదివిషయములనుండి మరలించుట కశక్తులు ఖేచరీముద్ర నభ్యసింపవలయు ననియర్థము.॥౨౭॥

౨౮ శ్లో. నీలకంఠీయము:—ఏదోయొక స్థూలవిషయమునందు (ప్రతిమాదులయందు) కాని, సూర్యునియందు కాని, సూర్యకిరణములయందు కాని, విష్ణుప్రతిమయందు కాని, అనాహతధ్వనియందు కాని, లేక యేదోయొకదానియందు కాని చక్షురాదీంద్రియములలో యేదో యొక యింద్రియద్వారమున మనస్సును ధారణచేయవలెను. అట్టి మనస్సు అవిషయాకారత్వమును పొంది యావిషయమునందే స్థిరాభ్యాసముచే విశ్రాంతమై తన దేహమునుకూడ గుర్తెరుగదు. ఇదియే మహావిదేహ మనెడి ధారణాయోగము. ఇట్టి మహావిదేహమనెడి ధారణ సిద్ధించిన యెడల యింద్రియసముదాయము తమ తమ విషయములగు శబ్దస్పర్శరూపరసగంధములను గ్రహింపనేరవు. ఇది బహిర్విషయప్రత్యాహార మనఁబడును. పూర్వశ్లోకమున చెప్పబడిన దాంతరప్రత్యాహారము. ఇదియే యీరెంటికి గల భేదము. కనుకనే బహిర్విషయ ప్రత్యాహారమునకు, అంతరవిషయప్రత్యాహారమునకు ఫలమునందు సామ్యము సూత్రమునందు చెప్పఁబడెను. "తతః క్షీయతే ప్రకాశావరణమ్" అభ్యంతరప్రత్యాహారమువలన మనోవృత్తి బహిర్విషయములయం దకల్పితమై మహావిదేహ మను పేరుకలదై బహిర్విషయముల సంయమమువలన ప్రకాశావరణక్షయమగునని పై సూత్రార్థము. ఏసమయమున చిత్తము దేహమును మరువకయే హాతాత్తుమందుండు మూర్త్యాకారము చేయబడునో అట్టి సమయమునందు చిత్తమునకు మూర్త్యాకారతావృత్తి కల్పితమగును. ఎపుడు నిరవశేషముగ దేహమును మరచి చిత్తము ధ్యేయాకారమాత్రముగునో అపుడది మహావిదేహమనెడి ధారణయనుపించుకొనును. ఇట్టి ధారణకుకూడ ఫలము ప్రకాశావరణక్షయమే యని గ్రహింపనగును. విషయసంయమమునను, ఇట్టి ధారణయందు చిత్తముయొక్క నిగ్రహమువలనను ప్రకాశావరణ క్షయమగును. (ప్రకాశకేది యద్దుగనుండునో అట్టి యాటంకముయొక్క క్షయమగును.) దీనినే బాహ్యవిషయ సమాధియని యందురు.

వితర్కమనెడి సమాధి సవితర్కమనియు, నిర్వితర్కమనియు రెండువిధములు. అందు సవితర్కసమాధికి "శబ్దార్థజ్ఞానవికల్పై స్సంకీర్ణా సవితర్కా" (శబ్దార్థజ్ఞానవికల్పములచే సంకీర్ణమగు సమాధి సవితర్క

సమాధి) యనిలక్షణము మాత్రముచేరిచి చెప్పఁబడెను. ఎప్పుడు విష్ణుప్రతిమాదులయందు పూర్వాపరానుసంధానపురస్సరముగ "ఇది విష్ణుస్వరూపము" అని శబ్దార్థోల్లేఖనపూర్వకముగ భావన ప్రవర్తించునో అట్టి భావనయే సవితర్కసమాధియని యనుపించుకొనును. అట్టి విష్ణ్వాది ప్రతిమయందే పూర్వాపరానుసంధానపురస్సరముగ శబ్దార్థోల్లేఖన లేకుండగనే భావన ప్రవర్తించినచో నట్టిభావన నిర్వితర్కమనెడి సమాధి యనుపించుకొనును. ఈ విషయమునే "స్మృతిపరిశుద్ధౌ స్వరూపశూన్యేవార్థమాత్రనిర్భాసా నిర్వితర్కా" శబ్దస్మరణ లేకుండగనే భావనచేయువానికి "నేను దీనిని భావనచేయుచుంటిని" అనెడి యాకారముగల వృత్తియు భావనచేయువానికి లేనట్లుగనే యంతఃకరణవృత్తి భాసించును. ఎందువలననిన? "అర్థమాత్రనిర్భాసా" ధ్యేయమగు నర్థమాత్రమే యావృత్తియందు భాసించును. ఇతరమేదియు యావృత్తియందుభాసింపదు, అను సూత్రము బోధించుచున్నది. ఇట్టివృత్తి సిద్ధించినయోగి జితేంద్రియుఁడనుపించుకొనును.

అభ్యంతరవిషయ ప్రత్యాహారపూర్వకముగ నెప్పుడు మనఃకల్పితమగు సూక్ష్మవిషయమునందు పూర్వమువలె శబ్దార్థోల్లేఖనపూర్వకముగ మనస్సుయొక్క భావన ప్రవర్తించునో. అట్టి సమయమునందుండు సమాధి సవిచారసమాధి యనుపించుకొనును. ఈ భావనయే శబ్దార్థోల్లేఖనశూన్యమగుచో నిర్విచారసమాధి యనుపించుకొనును. ఈ విషయమునే "ఏతయైవ సవిచారా, నిర్విచారాచ సూక్ష్మవిషయా వ్యాఖ్యాతా" ఇచట "సూక్ష్మవిషయా" అని చెప్పుటవలన పూర్వసమాధియందు స్థూలవిషయత్వముండునని స్పష్టమగుచున్నది. "ఏతయైవ" రెండువిధములగు వితర్కసమాధులచే సవిచారసమాధి, నిర్విచారసమాధియు వ్యాఖ్యానింపఁబడెను. అను సూత్రమే బోధించుచున్నది. నిర్విచారసమాధి దృఢమైనచో అట్టియోగి జితమనస్కుఁడనిపించుకొనును

ఏసమయమున మనస్సు మార్గాంతరత్వమును విడచి సత్త్వోద్రేకమువలన సమష్టిమనోమయవిషయకమై "నేనేసర్వస్వరూపమయితిని" అను నాకారముగల భావన ప్రవర్తించునో ఇదియే సానందమనెడి సమాధి యని యనిపించుకొనును. ఎపుడట్టిభావనను కూడ పరిత్యజించి విషయవేదనను విడచియే "అస్మి" ఇంతమాత్రమే యాకారముగల భావన ప్రవర్తించునో. అది అస్మితారూపసమాధియని యనుపించుకొనును. అస్మితకు, అహంకారమునకు భేదము విషయవైముఖ్యవిషయాభిముఖ్యకృతము. అనగా అస్మిత విషయవైముఖ్యము కలది. అహంకారము విషయాభిముఖ్యముకలది. ఒకడే తూర్పునకభిముఖుడు. వాడే పశ్చిమాభిముఖుఁడు. అనుచోట ఒకనికే పూర్వాభిముఖత్వ పశ్చిమాభిముఖత్వములెట్లో అట్టి భేదమే అస్మితాహంకారములకు కలదని తెలిసికొననగును. అస్మితారూపసమాధ్యవస్థయందు యోగి బుద్ధివలన వేరుపరుచబడిన త్వంపదార్థమును సాక్షాత్కరింప జేసుకొనినవాడగుటవలన "జితబుద్ధి" అని యనుపించుకొనును. ఈ విషయమే "యతేంద్రియమనోబుద్ధిః" అను నీగీతావాక్యముచే చెప్పఁబడెను. ఈ ప్రసాధనములే గుణపర్వలని చెప్పఁబడును. ఈ విషయమునే "విశేషావిశేషలింగమాత్రాలింగాని గుణపర్వాణి" (విశేషములనగ స్థూలభూతములు, ఏకాదశేంద్రియములు. అవిశేషము లనగ పంచతన్మాత్రలు, అహంకారము. లింగమాత్రమనగ మహత్తత్త్వము. అలింగమనగ ప్రధానము. అందు విశేషము (స్థూలభూతములు, ఏకాదశేంద్రియములు) వలన నవిశేషమును (పంచతన్మాత్రలను, అహంకారమును) వివక్షచేయదలచిన యోగికి ప్రతిదినము లయాభ్యాసమువలన మనస్సుతోగూడ నింద్రియములు లయమును పొందును. లేక, యింద్రియములు బహిర్ముఖములైనను కావచ్చును. ఇంద్రియములు బహిర్ముఖములగుటయే విక్షేపము. ఇట్లే యవిశేషములగు పంచతన్మాత్రలు, అహంకారమువలన లింగమాత్ర (మహత్తత్త్వ) మును వివక్షచేయునట్టి యోగికి పంచతన్మాత్రలు లయించును. లేక, విక్షేపమైన ప్రాప్తించును. లింగమాత్ర (మహత్తత్త్వ)మునకంటె పరమగు పురుషుని వివక్షచేయు యోగికిని లయవిక్షేపములు కలవు. కాన నట్టి లయవిక్షేపములు విడువదగినవని "లయవిక్షేపరహితం మనః కృత్వా సునిశ్చలమ్। యదా యాత్యమనీభావం తదా తత్పరమంపదమ్" (మనస్సును లయవిక్షేపరహితమును గాను, సునిశ్చలముగాను చేసి యెప్పుడున్మనీభావమును

గీ॥ భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి ॥ ॥౨౯॥

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయా
సిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు
బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జున
సంవాదే సంన్యాసయోగో నామ
పఞ్చమోఽధ్యాయః ॥

పదవిభాగము:—భోక్తారం- యజ్ఞతపసాం- సర్వలోకమహేశ్వరం- సుహృదం- సర్వభూతానాం- జ్ఞాత్వా- మాం- శాన్తిం-ఋచ్ఛతి॥ ॥౨౯॥

ప్రతిపదార్థము:— యజ్ఞతపసాం=యజ్ఞములను; తపస్సులను; భోక్తారం=కర్తృరూపముచే ననుభవించునట్టియు; సర్వలోకమహేశ్వరం=సమస్తలోకములకు గొప్ప యీశ్వరుడైనట్టియు; సర్వభూతానాం=సమస్తప్రాణులకు; సుహృదం=ప్రత్యుపకారమునపేక్షించక నుపకృతి నొనరించునట్టి; మాం=నన్నును; జ్ఞాత్వా=తెలిసికొని; శాన్తిం=సర్వసంసారోపరతిరూపమోక్షమును; ఋచ్ఛతి=పొందుచున్నాడు ॥౨౯॥

పొందునో, అట్టి సమయమునందే పరమపదమును మోక్షమును పొందును.) అను శ్రుతియు చెప్పుచున్నది. పైమూటిలో లీనమైనవారలలో మొదటివాడు సుప్తుడనియు, రెండవవాడు విగతదేహాహంకారముకలవాడగుటవలన విదేహుడనియు, మూడవవాడు ప్రకృతిలయుడనియు నామములు కలవారు. ప్రథమద్వితీయుల (విదేహునియొక్కయు, ప్రకృతియందు లయముకలవానియొక్కయు) సమాధి గౌణము. కనుకనే "భవప్రత్యయో విదేహప్రకృతిలయానాం" (విదేహునియొక్కయు, ప్రకృతి లయముకలవారియొక్కయు సమాధి జన్మాంతరమునకు హేతువగును) (లేక పక్షుల కాకాకగమనమెట్లు జన్మముచేతనే ప్రాప్తించునో. అట్లే విదేహులకు, ప్రకృతిలయముకలవారలకు జన్మమాత్రముచేతనే సమాధిసిద్ధించును.) అను సూత్రముకూడ నీయర్థమునే దృఢపరచుచున్నది. ఎటు చూచినను వారలకు సద్యోముక్తి లేదని సిద్ధమగుచున్నది.

ఎపుడస్మితామాత్రమునకు నిర్వికల్పకమగు చిన్మాత్రమునందు లయము సంభవించునో. అపుడీవిద్వాంసుడు సమాధియను పేరుగల కైవల్యధర్మమునే యనుభవించుచున్నాడు. ఏ విద్వాంసు నుద్దేశించి "క్షణమేకం క్రతుశతస్య చతుస్సప్తత్యా యత్ఫలం తదవాప్నోతి" (ఒక క్షణమాత్రముననే డెబ్బదినాలుగు క్రతుశతముల ఫలమెదికలదో, అట్టి ఫలమును విద్వాంసుఁ డనుభవించుచున్నాడు. అనగా ననంతక్రతుఫలముల నొకక్షణమాత్రమున ననుభవించును.) అనిశ్రుతి విద్వాంసుని కనంత క్రతుఫలమును బోధించుచున్నది. ఇట్టిమోక్షమనెడి యుత్కృష్టమగు ప్రాప్యస్థానముకలముని మోక్షపరాయణుఁడని యనుపించుకొనును. ఈ యవస్థయందే యోగి జీవన్ముక్తుడని చెప్పనొప్పును. "విగతేచ్ఛాభయక్రోధః" అను పదమునకు పూర్వశ్లోకమునందే వ్యాఖ్యానించితిమి. ఏ యోగి యిట్టివాడో వాడు యెల్లపుడు ముక్తుడే. అనగా బంధప్రతీతికాలమునందుకూడ వాడు ముక్తుడైనవాడయియే యుంటున్నాడు. ముక్తికి యజ్ఞానమాత్రవ్యవధానము కాని ఎల్లపుడు ముక్తుడేయని యనదగును. ఈ చెప్పుటవలన నహంకారాది బంధము కాలత్రయమునందుఁడదని చెప్పుటవలన నహంకారాది బంధమునకు మిథ్యాత్వము చూపఁబడెను. ॥౨౮॥

—• ౫వ అధ్యాయము — ౨౯ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

మధుసూదనసరస్వతీయము:— ఇట్టి యోగముతో గూడినవాడు దేనిని తెలిసికొని ముక్తుడగును? అను ప్రశ్నను "భోక్తారం" అను శ్లోకముచే తొలిగించుచుండెను.

సకలయజ్ఞములకు, తపస్సులకు కర్తృరూపముచేతను, దేవతారూపముచేతను భోక్తయయినట్టియు,

ఏవం సమాహితచిత్తేన కిం? విజ్ఞేయ మిత్యుచ్యతే- భోక్తారం యజ్ఞానాం, తపసాం చ కర్తృరూపేణ చ సర్వలోకమహేశ్వరం సర్వేషాం లోకానాం మహాన్త మీశ్వరం సర్వలోకమహేశ్వరం సుహృదం సర్వభూతానాం సర్వప్రాణినాం ప్రత్యుపకారనిరపేక్షతయా ఉపకారిణం సర్వభూతానాం హృదయేశం సర్వకర్మఫలాధ్యక్షం సర్వప్రత్యయసాక్షిణం మాంనారాయణం జ్ఞాత్వా! శాన్తిం సర్వసంసారోపరతి మృచ్ఛతి ప్రాప్నోతి॥ ॥౨౯॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య గోవిన్ద
భగవత్పూజ్యపాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతః
కృతౌ శ్రీమద్భగవద్గీతాభాష్యే
ప్రకృతి గర్భో నామ
పంఞ్చమోఽధ్యాయః॥

శాంకరభాష్యతత్త్వబోధినిః—

పూర్వమునందు చెప్పఁబడిన యధికారికి కర్తవ్యమేమియు లేనిచో నట్టి యధికారిచే తెలిసికొనదగినది మాత్రమేమి కలదు? అనిశంకింపవలదు. అట్టి పురుషుడు యజ్ఞములను, తపస్సులను కర్తృరూపముచే ననుభవించునట్టియు, సర్వలోకములకు గొప్ప యీశ్వరుఁడై నట్టియు, సర్వప్రాణులకు ప్రత్యుపకారము నపేక్షింపక యుపకారము నొనర్చునట్టియు, సర్వభూతముల హృదయముల కీశ్వరుడై నట్టియు, సర్వకర్మ ఫలాధ్యక్షుడై నట్టియు, సర్వజ్ఞానసాక్షియగు నారాయణ స్వరూపుడనైన నన్ను తెలిసికొని సర్వసంసారోపరతిరూపానర్థనివృత్తి స్వరూపమగు మోక్షమును పొందుచున్నాడు.

(లోక పాలకుడైనట్టియు) సర్వలోకములకు మహేశ్వరుడైనట్టియు, అనగా హిరణ్యగర్భాదులకుకూడ నియామకుడైనట్టియు, సర్వప్రాణులకు ప్రత్యుపకారము నపేక్షింపక యుపకారమును చేయునట్టియు, సర్వాంతర్యామియు. సర్వభాసకము, పరిపూర్ణసచ్చిదానందైకరసస్వరూపము, పరమార్థతత్త్వము, సర్వాత్మయగు నారాయణస్వరూపమగు నన్ను ఆత్మగ సాక్షాత్కరింపజేసుకొని సర్వసంసారోపరతిరూపమగు ముక్తినిపొందును. అట్లగుచో ఓయీ శ్రీకృష్ణ నిన్ను నేను చూచుచుంటినిగదా! నేనెందులకు ముక్తుడను కాలేదని యర్జుని శంకకు సమాధానముగ పైవిశేషణములీయబడెను. ఓయర్జునా! నీవునన్ను జూచుచున్నను, నీదృష్టి నేను బంధువుడను. దేవకీపుత్రుడను, గోగోపగోపికాసమేతుడననియే కాని, పై శ్లోకమున జెప్పినతీరున నన్నాత్మగ నీవు దెలిసికొనుట లేదు. అందుచే నీవు ముక్తుడవు కాలేదు. ఇటుపైన పైశ్లోకమున జెప్పినతీరున నీవు తెలిసికొనుము. అట్లైన నీవు ముక్తుడ వగుదువని భావము. ॥౨౯॥

ఇట్లు శ్రీమధుసూదనసరస్వతీవిరచిత శ్రీమద్భగవద్గీతా చతుర్థాధ్యాయ
గూఢార్థదీపికకు "తర్కరత్న న్యాయవేదాన్త విద్యాసాగర"
బులుసు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

శంకరానందీయము:—పూర్వమందైన రెండుశ్లోకములచేతను ధ్యానించువానికిసాధనమున్ను, ధ్యాతను చెప్పి "భోక్తారం" అను యీ మూడవశ్లోకముచే ధ్యానించువానికి ధ్యేయమగు వస్తువును నిరూపించుచుండెను.

ఇట యజ్ఞములను, తపస్సులను కర్తృరూపముచే ననుభవించువాడు హిరణ్యగర్భుఁడేల కాఁడని శంకను తొలగించుటకు "మహేశ్వరం", అను విశేషణము విన్యసింపఁబడెను. ఈవిశేషణమున "మహాన్" అని ఈశ్వరునకు విశేషణము చూపఁబడెను. కాన ఈశ హిరణ్యగర్భవ్యావృత్తియగుచున్నది. తన పరివారమునకు ప్రత్యుపకారము నపేక్షించి యుపకార మొనరించు దేశప్రభువు వ్యావృత్తికై "సుహృదం", అను విశేషణము చెప్పఁబడెను. ప్రత్యుపకారము నపేక్షింపక యుపకృతిని చేయువాడని యర్థము దేశప్రభువు ప్రత్యుపకారము నపేక్షించియే యుపకృతి నొనరించు వాఁడగుటచే యీవిశేషణముచే దేశప్రభువ్యావృత్తి సంభవించును. "సర్వభూతానాం హృదయేశం" అని చెప్పుటచే నీశ్వరునికి తాటస్థ్యము తొలగించ బడెను. ఈశ్వరునకు తాటస్థ్యము లేనిచో నచ్చటచ్చటనుండు కర్మతత్ఫల సంబంధము సంభవించెడిని. అను శంకను తొలగించుటకు "సర్వకర్మ ఫలాధ్యక్షుడు" అని చెప్పఁబడెను. పరమేశ్వరునకు బుద్ధి, తద్వృత్తి సంబంధముకూడ వస్తుతః లేదని చెప్పుటకు "సర్వప్రత్యయసాక్షి" అని చెప్పఁబడెను.

ఈయధ్యాయమునందవిద్వత్కర్తృక కర్మసంన్యాస ఁ ముఖ్యసంన్యాస మనియు దానికంటె కర్మయోగమే యవిద్వాంసునకు ప్రశస్తమైనదని మొదట నిరూపించి అట్టి కర్మయోగము కంటె విద్వత్కర్తృక కర్మసంన్యాసము ముఖ్యసంన్యాసమనియు అదియే అధికమైనదనియు, అట్టి సంన్యాసముతో కూడినట్టియు, అంతఃకరణ పరిశుద్ధ్యాదులతో కూడినట్టియు, జీవించియుండగనే కామోద్భవ వేగమును, క్రోధోద్భవ వేగమును సహించునట్టియు, శమదమాదిగుణ సంపత్తిగలిగినట్టియు, యోగాధికృతుఁడగునట్టియు, త్వంపదార్థాభిజ్ఞుఁడైనట్టియు, పరమాత్మను ప్రత్యగ్రూపముగ దెలిసికొనునట్టి వానికి ముక్తియవశ్యము బ్రతికియుండగనే ప్రాప్తించునని నిరూపింపఁ బడెను. ॥౨౯॥

ఇట్లు నూరువేల సంఖ్యగలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపమునగు, మహాభారతమునందంతర్గతమైన భీష్మపర్వమందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యారూపమును, యోగశాస్త్రమునగు భగవద్గీతలయందున్న శ్రీకృష్ణార్జునసంవాదమునందుగల సంన్యాసయోగమను పేరి చతుర్థాధ్యాయమునకు గౌతమసగోత్రుఁడగు; తర్కరత్న న్యాయవేదాన్త విద్యాపారీణ బులుసు అప్పన్నశాస్త్రిచే రచియింపఁబడిన యానందగిరీయ వ్యాఖ్యానుసృత శ్రీభగవద్గీతా శాంకరభాష్య తత్త్వబోధిని సమాప్తము. హరిః ఓంతత్సత్.

శ్రీః శ్రీః శ్రీః

పూర్వమునందు చెప్పబడిన సాధనసంపన్నుఁడగు నిదిధ్యాసనమాచరించు యతి శ్రౌతస్మార్తాది నిఖిలకర్మలయొక్క, సత్యశుచిత్వాద్యాది నిఖిలతపస్సులయొక్క ఫలము ననుభవించునట్టియు, ఉపాధి తద్ధర్మరహితుఁడైనట్టిన్ని, బ్రహ్మాదిస్తంబపర్యన్తమగు సర్వభూతములకాత్మస్వరూపమగుటవలన సర్వభూతములకు సువృత్తుఁడైనట్టి లేక సర్వభూతముల హృదయములయందుండునట్టిన్ని. అవ్యక్తముల గాయుతు సూత్రపర్యన్తమగు వాటికంటె మహత్తమమున్న అనగా తనసన్నిధిమాత్రముచే సర్వము చలించుచున్నదో అట్టివాడు) సర్వాత్మ

కము, సచ్చిదానందైకరసస్వరూపమునగు పరమాత్మరూపమైన నన్ను తెలిసికొని (అనగా ప్రత్యగాత్మరూపమునగు తనను పరబ్రహ్మస్వరూపమగునన్నుగ తెలిసికొని. ధ్యానించి సర్వసంసారోపశమరూపమగు పరబ్రహ్మభావమును పొందుచున్నాడు.

లేక "యజ్ఞతపసాం భోక్తారం" అనగ దేహోపాధికుడగు త్వంపదార్థమును, "సర్వభూతానాం సుహృదం, సర్వలోకమహేశ్వరం" మాయోపాధికమగు తత్పదార్థమును "అథాత ఆదేశో నేతినేతి" ఇత్యాది శ్రుతిచేతను యుపాధిద్వయమును నిరసించి పైనచెప్పబడిన వారిరువురిని చైతన్యమాత్రస్వరూపులుగను, అట్టి వారిని అధిష్ఠానభూతము, సత్యజ్ఞానానంతరూపము, చిదానందైకరసస్వరూపము, నిర్విశేషపరబ్రహ్మస్వరూపము నగునన్నుగ "నేను పరబ్రహ్మస్వరూపుడను" అని తెలిసికొని (అనగా పరబ్రహ్మమునే తన యాత్మగ తెలిసికొని) ధ్యానించి విదేహముక్తిని పొందుచున్నాడు. ||౨౯||

ఇట్లు శ్రీశంకరానంద సరస్వతీవిరచిత శ్రీమద్భగవద్గీతా పంచమాధ్యాయ
తాత్పర్యబోధినికి తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ
బులుసు అప్పన్నశాస్త్రిచే రచియింపబడిన
తాత్పర్యబోధిని
సమాప్తము.

శ్రీధరీయము:— ఇంద్రియ సంయమమాత్రముచేతనే ముక్తి ప్రాప్తింపదు. మరేమనిన జ్ఞానద్వారమున ముక్తిప్రాప్తించునని "భోక్తారం" అను శ్లోకముచే చెప్పుచుండెను.

నాభక్తులచే సమర్పించబడు యజ్ఞములను, తపస్సులను స్వేచ్ఛచేననుభవించునట్టియు, లేక నాభక్తులచే నాచరింపబడు యజ్ఞములకు, తపస్సులకు పాలకుడైనట్టియు, సర్వలోకములకు మహేశ్వరుడైనట్టియు, సర్వభూతములకు ప్రత్యుపకారము నపేక్షింపక నుపకారము చేయునట్టియు, అంతర్యామియగు నన్ను తెలిసికొని నాయనుగ్రహముచే యతి మోక్షమును పొందుచున్నాడు. ||౨౯||

ఇట్లు శ్రీధరస్వామికృత శ్రీభగవద్గీతా పంచమాధ్యాయ సుబోధినికి "తర్కరత్న
న్యాయవేదాన్త విద్యాపారీణ" బులుసు అప్పన్నశాస్త్రి
విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము.

సదానందీయము:— నిష్కామః కర్మయోగ స్సపది రతికరా యేఽస్య పాదారవిన్దే జ్ఞానం వైరాగ్యయుక్తం భవతి చ సులభం యస్య భక్త్యా నరాణాం। కామక్రోధా నిరస్య స్థిరమతి రమితే లభ్యతే యత్ప్రసాదాత్తం స్వారాజ్యైక హేతుం నవజలదరుచం కృష్ణమేవానతోఽస్మి॥

ఏశ్వనియొక్క భక్తిచే మనుష్యులకు నిష్కామకర్మయోగము, ఎవని పాదారవిందములయందు ప్రీతికరమగు క్రియలు, వైరాగ్యయుక్తమగు జ్ఞానము సులభముగ గలుగుచున్నవో, ఎవని యనుగ్రహమువలన కామక్రోధములు తొలిగి సర్వవ్యాపక పరమేశ్వరజ్ఞానము సంభవించుచున్నదో ముక్తికి హేతువగు నవమేఘశ్యాముడగునట్టి యట్టి శ్రీకృష్ణపరబ్రహ్మమునే నమస్కరించుచుంటిని. ||౨౯||

ఇట్లు శ్రీసదానందసరస్వతీ విరచిత పంచమాధ్యాయ భావప్రకాశకకు
తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ
బులుసు అప్పన్నశాస్త్రి విరచిత
తాత్పర్యబోధిని
సమాప్తము.

భాష్యోత్కర్ష దీపిక:— ఇట్లు రెండు శ్లోకములచేతను ధ్యానయోగము సూచించి యట్టి ధ్యానయోగనిష్ఠుడే ముక్తుడని చెప్పబడెను. ధ్యానయోగము జ్ఞానమునువిడచి సాక్షాత్తు మోక్షసాధనమా? లేక జ్ఞానద్వారమున మోక్షమునకు సాధనమా? అను సంశయనివృత్తికొరకు "తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి, నాన్యః పంథా

విద్యతేఽయనాయ, జ్ఞానాదేవతు కైవల్యం, ఋతే జ్ఞానాన్న మోక్షః'' ఇత్యాది శ్రుతిబలమువలన జ్ఞానద్వారము నవే ధ్యానయోగము మోక్షసాధనమను ద్వితీయపక్షమునే "భోక్తారం'' అను తృతీయశ్లోకముచే సిద్ధాంత పరచుచుండెను.

యజ్ఞములకు, తపస్సులకు, కర్తృరూపమున దేవతారూపమున భోక్తయు, బ్రహ్మాదిస్తంబపర్యంతము సర్వులకు మహేశ్వరుడును, సర్వభూతములకు ప్రత్యుపకారము నపేక్షింపక నుపకారమొనరించువట్టిన్ని, సర్వభూతహృదయస్థుడును నారాయణుడగు నన్ను ఆత్మగ నెవడు తెలిసికొనునో వాడు సర్వసంసారోపరతిరూపమగు శాంతిని (మోక్షమును) పొందుచున్నాడు.

కొందఱు 25, 26 శ్లోకములలోనే ముక్తుడు చెప్పబడెను. ముముక్షువులు మూడువిధములు. 1 శ్రవణరతుడు 2 మననరతుడు. 3 నిదిధ్యాసనరతుడు. ఈ ముగ్గురుముముక్షువులు, అందు "లభంతే బ్రహ్మనిర్వాణ మృషయః క్షీణకల్మషాః'' అను శ్లోకముచే శ్రవణరతుండు చెప్పఁబడుచుండెను. "కామక్రోధ వియుక్తానాం యతీనాం యతచేతసాం । అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనాం'' అను శ్లోకముచే మననిరతుడు చెప్పబడెను. తరువాతయుండు రెండు (27, 28) శ్లోకములచే నిదిధ్యాసననిరతుడు చెప్పఁబడెను. అని చెప్పెదరు. ఈ విషయము విచారింపదగినది. "లభన్తే బ్రహ్మనిర్వాణం'' అను శ్లోకముచే శ్రవణనిరతునకు శ్రవణమాత్రముచే మోక్షము సంభవముకాదు. సాక్షాత్తు శ్రవణము మోక్షసాధనము కాదు. మరేమనిన శ్రవణము కించిద్ద్వారమున మోక్షసాధన మందుమేని ఆద్వారమునకే మోక్షసాధనత్వము సంభవించుచుండ శ్రవణమునకు గౌణత్వకల్పన యన్యాయము. "విదితాత్మనాం'' అనుదానికి షష్ఠాధ్యాయ సూత్రస్థానీయము, "ప్రాణాపానగతీః'' ఇత్యాదికముచే ప్రతిపాదనము నగు ధ్యానయోగమునకు బాధ ప్రాప్తించుటవలన సాక్షాత్తు శ్రవణము మోక్షసాధనముకాదు.

ఈపంచమాధ్యాయముచే- నపరిశుద్ధ చిత్తముకలవానిచే స్వీకరించబడిన జ్ఞాననిష్ఠారహితమగు సంన్యాసముకంటె చిత్తశుద్ధ్యాది సంపాదకమగు కర్మయోగమే శ్రేష్ఠమని చెప్పి శుద్ధమైన చిత్తముకల శమదమాదిసంపన్నుడగు నట్టియు, కామాదులచే పుట్టినవేగమును సహించుటకు శక్తుడైనట్టియు, యోగాధికృతుడైనట్టియు, త్వంపదార్థాభిజ్ఞుడైనట్టి, పరమాత్మను ప్రత్యగ్రూపముగ తెలిసికొనినట్టి సంన్యాసికి ముక్తియని చెప్పఁబడెను. ॥౨౯॥

ఇట్లు శ్రీధనపతి సూరివిరచిత శ్రీభగవద్గీతా పంచమాధ్యాయ భాష్యో
త్కర్షదీపికకు తర్కరత్న, న్యాయవేదాన్త విద్యావారీణ
బులుసు అప్పన్నశాస్త్రి విరచితతాత్పర్యబోధిని
సమాప్తము.

పరమార్థప్రశ్న:—గొప్పకార్యవిషయమున విఘ్నము లనేకములు సంభవించును కాన మనోబుద్ధీంద్రియనిగ్రహమార్గము లేనిదే చేయుటశక్యముకాదు. అని యట్టి యోగక్రియమును "భోక్తారం అను శ్లోకముచే చెప్పుచుండెను.

సర్వభూతములకు పరమప్రీతాస్పదమై నట్టిన్ని, అంతర్యామి యగువన్ను తెలిసికొని మోక్షమును పొందుచున్నాడు.

శ్లో॥ జ్ఞానం సంపాద్య సమ్యక్ క్రమవిరమతో కర్మణోయా సమాప్తి స్సంన్యాసః కర్మయోగ స్స్వయదమధియః కర్మకాసన్య మాభ్యామ్, బ్రహ్మణ్యాధీయతే యత్సుకృతశతజుషః కర్మ సర్వేన్ద్రియార్థం ప్రాణాయామేన చిత్తం విజిత పరపదంపంచమే ప్రోక్తమేతత్'' జ్ఞానమును సంపాదించి లెస్సగ కర్మలను క్రమముగ

విరమించు వాని కర్మల సమాప్తియే సంన్యాసము. నిర్మలమైన బుద్ధికలవానియొక్క కర్మలయందుకల నైష్కర్మ్యమునకుఁదో (అనగా యీశ్వరార్పణముగ ఫలనిరపేక్షతో కర్మల నాచరించుట) యది కర్మయోగ మనఁబడును. ఇట్టి కర్మసంన్యాసకర్మయోగములచే ననేకకాలనుకృతములు కలవానియొక్క సర్వేంద్రియములచే చేయఁబడిన కర్మను, ప్రాణాయామముచే చిత్తమును రోఁడు బ్రహ్మమునందుంచునో యట్టివాడు మోక్షమును పొందుచున్నాడని యీపంచమాధ్యాయమునందు చెప్పఁబడెను. ॥ ౨౯ ॥

ఇట్లు పరమార్థప్రపక—
తర్కరత్న, న్యాయవేదాన్తవిద్యాపారీణ
బులుసు అప్పన్న శాస్త్రివిరచిత తాత్పర్యబోధిని
సమాప్తము

నీలకంఠీయము:—

ఇట్లు సమాహితచిత్తునిచే విజ్ఞేయము తెలిసికొనదగినది ఏదనుశంకను "భోక్తారం" అను శ్లోకముచే తొలగించుచుండెను. సోపాధికరూపముచే యజ్ఞములను యనుభవించుచున్నట్టియు, కర్తృరూపముచేతను, దేవతారూపముచేతను తపస్సుల ననుభవించుచున్నట్టియు, హిరణ్యగర్భాది సర్వభూతములకు వ్యాపకము, నియామకుఁడు, అంతర్యామియు, సర్వప్రాణులకు ప్రత్యుపకారము నపేక్షించక నుపకారముచేయునట్టియు, సర్వప్రత్యయసాక్షియు, నారాయణస్వరూపము అగునట్టి నన్నును ప్రత్యగాత్మస్వరూపముగ దెలిసికొని మద్భావమును పొంది నిరుపాఖ్యమను పేరుగల యనుపాధ్యవస్థారూపమగు కైవల్య(మోక్ష)మును పొందుచున్నాడు.

ఈ చెప్పుటవలన సోపాధిక (సగుణ) బ్రహ్మప్రాప్తిపూర్వకముగనే నిరుపాధి (నిర్గుణ) బ్రహ్మప్రాప్తియని నూహింపనగును. ఈ విషయమే "సోపాధి ర్నిరుపాధిశ్చ ద్వేధా బ్రహ్మవిదుచ్యతే। సోపాధిస్స్యాత్సర్వాత్మా నిరుపాఖ్యోఽనుపాధికః॥ జక్షన్క్రీడన్ రతిం ప్రాప్త ఇతి సోపాధికస్యతు। ఛాందోగ్యేసర్వకామాప్తి స్సార్వాత్మ్య స్స్పష్టమీరితా॥ అహమన్నం తథాఽన్నాద శ్లోకకార్యప్యహం అహమ్। ఇతి తత్త్వవిద స్సామగానే సర్వాత్మతాశ్రుతా॥ అతోపి చక్రిదృష్టాంతా త్సోపాధి స్తత్త్వవిచ్ఛ్రుతః। అపూర్వానపరాద్యుక్త్యా శ్రోవ్యతే నిరుపాధికః॥ (సోపాధికమనియు, నిరుపాధికమనియు, బ్రహ్మవేత్త రెండువిధములు. సోపాధికుఁడు సర్వాత్మయని యనిపించుకొనును. నిరుపాధికుండు నిరుపాఖ్యుఁ (నిర్గుణుఁ)డని యనిపించుకొనును. ఛాందోగ్యోపనిషత్తునందు సర్వకామప్రాప్తి సోపాధికుండు సర్వాత్మస్వరూపమగుటవలన ప్రాప్తించును. కనుకనే సోపాధికుండు భక్షణచేయుచు, క్రీడించుచురతిని పొందునని స్పష్టముగ జెప్పఁబడెను. తైత్తిరీయకమునందుకూడ "ఏతత్సామగాయన్నాస్తే" అను స్థలమునందుగల సామగానమున "నేను అన్నస్వరూడను, నేను అన్నమును భక్షించువాడను, నేను శ్లోకకృత్తును (అనగా అన్నాన్నాదముల సంబంధకర్తను అని బ్రహ్మవేత్తయగు సోపాధికునకు సర్వాత్మత్వము చెప్పఁబడెను. ఈ స్థలమునందుకూడ చక్రిదృష్టాంతముచే తత్త్వవేత్త సోపాధికుఁడని చెప్పబడెను. కార్యకారణ విలక్షణుఁడని చెప్పటచే బ్రహ్మవేత్త నిరుపాధిక స్వరూపుఁడనియు ముందుచెప్పబడును.) అని వార్తికసారమునందు చెప్పఁబడెను. ॥ ౨౯ ॥

ఇట్లు శ్రీభగవద్గీతా పంచమాధ్యాయ నీలకంఠవ్యాఖ్యకు బులుసు
అప్పన్నశాస్త్రి తనూభవుఁడును, శ్రీ సత్యాం బాగర్భ
శుక్తిముక్తా ఫలాయమానుడును, గౌతమస గోత్రుఁ
డునగు బులుసు వెంకటశాస్త్రి విరచిత
తాత్పర్యబోధిని
సమాప్తము.

# శ్రీభగవద్గీతా

# శాంకరభాష్యతత్త్వబోధిని

## షష్ఠోఽధ్యాయః

శ్రీభగవానువాచ:—

గీ॥ అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మకరోతి యః।

స సంన్యాసీ చ యోగీ చ న నిరగ్ని ర్న చాక్రియః॥ ॥౧॥

**పదవిభాగము:**— శ్రీభగవాన్‌– ఉవాచ– అనాశ్రితః– కర్మఫలం– కార్యం– కర్మ– కరోతి– యః– సః– సంన్యాసీ– చ– యోగీ– చ– న– నిరగ్నిః– న– చ– అక్రియః॥ ॥౧॥

**ప్రతిపదార్థము:**— శ్రీభగవాన్‌=శ్రీకృష్ణపరమాత్మ; ఉవాచ=పలికెను. యః=ఎవడు; కర్మఫలం=కర్మఫలమును; అనాశ్రితః=ఆశ్రయించనివాడై (కోరనివాడై) కార్యం=చేయదగిన; కర్మ=నిత్యనైమిత్తికకర్మ అను; కరోతి=చేయునో; సః=వాడు; కేవలం=(ఈపదమధ్యాహార్యము) ఒక; నిరగ్నిః=కర్మసాధనమగు యగ్నులు లేనివాడే; నచ–కాడు; అక్రియః=తపోదానాదిక్రియారహితుడే; నచ=కాడు; పరంతు=(ఈపదమధ్యాహార్యము) మరేమనిన; సంన్యాసీచ=పరిత్యాగియు; యోగీచ=చిత్తసమాధానముకలవాడు; భవతి=(ఈపదమధ్యాహార్యము) అగుచున్నాడు ॥౧॥

---

**శాంకరభాష్యమ్:**—

(1) అతీతానన్తరాధ్యాయాన్తే ధ్యానయోగస్యసమ్యగ్దర్శనం ప్రత్యన్తరఙ్గస్య సూత్రభూతాః శ్లోకాః "స్పర్శాన్కృత్వా బహిః" ఇత్యాదయ ఉపదిష్టా స్తేషాం వృత్తిస్థానీయోఽయం షష్ఠోఽధ్యాయ ఆరభ్యతే। తత్రధ్యానయోగస్య బహిరఙ్గం కర్మేతి యావ ద్ధ్యానయోగారోహణ

---

**శాంకరభాష్యతత్త్వబోధిని:**—

(1)పంచమాధ్యాయాంతమున సమ్యగ్దర్శనమునకంతరంగమగు ధ్యానయోగమునకు సూత్రభూతములగు "స్పర్శా న్కృత్వా బహిః" అనునదిమొదలగు మూడుశ్లోకము లుపదేశింపబడెను. అట్టి సూత్రభూతములగు మూడుశ్లోకములకు వివరణస్థానీయముగ నీ యారవ యధ్యాయ మారంభింపబడుచుండెను. (వివిదిషాద్వారమున) సంన్యాసహేతువగు కర్మయోగ

---

—♦ ౬వ అధ్యాయము — ౧ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

**మధుసూదనసరస్వతీయము:**— పంచమాధ్యాయాంతమున మూడుశ్లోకములచే యోగసూత్రము చెప్పబడెను. విస్తరముగ అట్టి యోగసూత్రవ్యాఖ్యానము కొఱకు ఆరవ యధ్యాయము ప్రారంభింపబడుచుండెను.

అందు సర్వకర్మపరిత్యాగముచే యోగమును చెప్పదలచెను. కర్మ పరిత్యాజ్యమగుటచే హీనమైనదను శంకను తొలిగించుటకు "అనాశ్రితః" అను శ్లోకము మొదలు రెండు శ్లోకములచే కర్మను స్తుతించుచుండెను.

శాంకరభాష్యమ్.—

సమర్థ స్తావ ద్గృహస్థేనాధికృతేన కర్తవ్యం కర్మేత్యత స్తత్ స్తౌతి। నను కిమర్థం ధ్యానయోగారోహణసీమాకరణం యావతాఽనుష్ఠేయ మేవ విహితం కర్మ యావజ్జీవమ్। న, "ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే" ఇతి విశేషణా దారూఢస్య చ శమేనైవ సమ్బన్ధకరణాత్ ఆరురుక్షో రారూఢస్య చ శమః కర్మ చోభయం కర్తవ్యత్వేనాభిప్రేతం చేత్స్యా త్తదాఽఽరురుక్షో రారూఢస్య చేతి శమకర్మవిషయభేదేన విశేషణం విభాగకరణం చానర్థకం స్యాత్।

(2)తత్రాశ్రమిణాం కశ్చి ద్యోగ మారురుక్షు ర్భవ త్యారూఢశ్చ కశ్చి దన్యేఽనారురుక్షవో నచారూఢా స్తా నపేక్ష్యారురుక్షో రారూఢస్య చేతి విశేషణం విభాగకరణం చోపపద్యత

శాంకరభాష్యతత్త్వబోధిని.—

మునకు హద్దును చూపించుటకును, అంగసహితముగ యోగమును విచారించుటకున్ను యీ యధ్యాయము ప్రవృత్తమై యుండ ధ్యానయోగమునకు కర్మ బహిరంగసాధనము కాన నెంతవరకు ధ్యానయోగారోహణమునం దసమర్థుడో అంతకాలమువరకు కర్మలయం దధికృతుఁడగు పురుషుఁడు కర్మల నాచరింపవలయునని కర్మలను స్తుతించుచుండెను.

—• వృత్తికారపూర్వపక్షము •—

ధ్యానయోగారోహణపర్యంతము కర్మల ననుష్ఠింపవలయు నని ధ్యానయోగారోహణమును కర్మలకు హద్దుగా నేర్పరచుట యెందులకు. "యావజ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" అను శ్రుతివిహితమగు నిత్యనైమిత్తిక కర్మములు యావజ్జీవ మనుష్ఠేయములే అని శంకింపవలదు.

—• శ్రీభగవత్పాదుల సిద్ధాంతము •—

"ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే" జ్ఞానయోగమును పొంద నిచ్ఛగల మునికి కర్మమే కారణమని విశేషణమువలనను, ఆరూఢునకు శమముతోటి సంబంధము చేయుటవలనను కర్మలకు ధ్యానయోగారోహణము హద్దుగ చేయబడెను. ఆరురుక్షువునకు, ఆరూఢునకుకూడ శమము, కర్మము అనెడి రెండును కర్తవ్యములేయని శ్రీకృష్ణపరమాత్మ కభిప్రేతమగుచో అత్తరి ఆరురుక్షువునకు కర్మయని, ఆరూఢునకు శమమని శమకర్మవిషయభేదముచే విశేషణము, విభాగకరణమున్ను అనర్థకమయ్యెడిని.

—• వృత్తికారపూర్వపక్షము •—

(2) వ్యవహారావస్థయం దాశ్రములలో నొకడు యోగము నధిష్ఠించుట కిచ్ఛకలవాడు (ఆరురుక్షువు) మఱియొక డారూఢుడు. వీరిరువురికంటె భిన్నులగువా రారురుక్షువులు కారు. ఆరూఢులును కారు. అట్టి యనారురుక్షువులను, అనారూఢులను అపేక్షించి యారురుక్షువునకు కర్మ కారణమనియు, ఆరూఢునకు (శమము) సంన్యాసము కారణ మనియు, విశేషణము, ఆరురుక్షువు, ఆరూఢుడు అని విభాగకరణ ముపపన్నమే యగునని శంకింపవలదు.

ఫలాభిసంధిరహితుడై శాస్త్రముచే విధింపఁబడిన నిత్యమగు యగ్నిహోత్రాదికర్మమును యెవ డాచరించునో యట్టివాడు కర్మియైనను సంన్యాసి, యోగి యనఁబడునని స్తుతింపఁబడుచుండెను. సంన్యాస మః

**శాంకరభాష్యమ్॰—**

ఏవేతి చేన్న, తస్యైవేతి వచనాత్। పునర్యోగగ్రహణాచ్చ యోగారూఢస్యేతి య ఆసీత్పూర్వం యోగ మారురుక్షు స్తస్యైవారూఢస్య శమ ఏవ కర్తవ్యం కారణం యోగఫలం ప్రత్యుచ్యత ఇతి। అతో న యావజ్జీవం కర్తవ్యత్వప్రాప్తిః కస్యచిదపి కర్మణః, యోగవిభ్రష్టత్వ వచనాచ్చ। గృహస్థస్య చే త్కర్మిణో యోగో విహిత ష్షష్ఠేఽధ్యాయే స యోగవిభ్రష్టోఽపి కర్మగతిం

**శాంకరభాష్యతత్త్వబోధినీ॰—**

—: భగవత్పాద సిద్ధాంతము: —

"యోగారూఢస్య తస్యైవ" అని "తస్యైవ" అను వచనమువలనను, యోగారూఢునకు తిరిగి యోగగ్రహణమువలనను పూర్వోక్తాశంక సంభవింపదు. (అనగా) పూర్వము సందేవ డారురుక్షువై యుండెనో యోగారూఢుడైన వానికే యోగమును, యోగ ఫలమునుగూర్చి కారణముగ శమము కర్తవ్యమై చెప్పఁబడెను. అందుచే ఆరురుక్షువు వేరు, ఆరూఢుడు వేరనియు, ఆరూఢునకు శమము యోగఫలమునుకూర్చి కారణమైనను, ఆరురుక్షువునకు యోగమునుకూర్చి కర్మయే కారణ మగుటచే "యావజ్జీవ మగ్నిహోత్రము చేయవలయును" అను శ్రుతి యుపపన్నమే యను శంక ఆరురుక్షువు, ఆరూఢుడు నొకడే అయినను ప్రథమమున ఆరురుక్షువు, అనంతరమున ఆరూఢుడు అగుటచే ఆరురుక్షు వగు నపుడు కర్మ నాచరించినను ఆరూఢావస్థయందు సంన్యాసమే యగుటఁజేసి నిత్యనైమిత్తిక కర్మలలో దేనికైనను బ్రతికియున్నంతకాలము కర్తవ్యత్వము ప్రాప్తింపదు. కాన, పూర్వము నందు చెప్పిన రీతిని కర్మ, కర్మసంన్యాసములకు విభాగ ముపపన్న మగుచుండ "యావ జ్జీవ మగ్నిహోత్రం జుహుయాత్" అను శ్రుతి యన్యవిషయ (శ్రుతియాదివిషయ) మగు చుండ యోగారూఢుడగు ముముక్షువునకు నిత్యనైమిత్తికకర్మపరిత్యాగమే సిద్ధించుచున్నది.

ఈముందుచెప్పబోవుకారణమువలనకూడ యావజ్జీవముకర్మకు కర్తవ్యత్వముప్రాప్తింపదు. ఆ కారణమేమన? యోగివిభ్రష్టవచనమేయని చెప్పనగును. అనగా కర్మియోగారోహణయోగ్యు డైననుగృహస్థునకే యోగము విహితమగుచో షష్ఠాధ్యాయమునందు అట్టిగృహస్థుడు కర్మగతి యగుకర్మఫలమును పొందుచున్నాడు కాన వానికి కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్ర మివనశ్యతి" అని నాశాశంక యుపపన్నము కాకపోయెడిని. ఎందువలననిన ? మోక్షము నిత్యమగుటచే జన్యము కాదు. అందువలన కర్మలవలన మోక్షము పుట్టనేరదు. కాన తనచే నాచరింపంబడిన కర్మము కామ్యమైనను నిత్యమైనను తన ఫలము నవశ్యము జన్మింపచేయును. కాన తనచే నాచరింపఁబడిన కర్మవలన ఫలము జనించుచుండ "కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి" అని కర్మియగు గృహస్థునకు నాశము సంభవించునా ? సంభవించదా ? అని యర్జునుడు ప్రశ్నించుట యసంజసమే యగును. అందుచే కర్మలను యావజ్జీవము చేయుట సంభవింపదు. మరేమనిన ? ఆరురుక్షువైనపుడు యోగమును కూర్చి కారణమగు కర్మానుష్ఠాన మవశ్య

త్యాగము, చిత్తమునందుండు విక్షేపములయొక్క లేమియు ఫలత్యాగమువలన సంన్యాసము ఫలతృష్ణారూపచిత్తవి క్షేపాభావమువలన యోగము యొకనికి కలవో వాడు సంన్యాసి యోగి యని యనఁబడును. ఇట కర్మఫలత్యాగ

శాంకరభాష్యమ్ :—

కర్మఫలం ప్రాప్నోతీతి తస్య నాశాశంకాఽనుపపన్నా స్యాత్। అవశ్యం హి కృతం కర్మ కామ్యం నిత్యం వా మోక్షస్య నిత్యత్వా దనారభ్యత్వే స్వం ఫల మారభత ఏవ ।

(౨) నిత్యస్య చ కర్మణో వేదప్రమాణావబుద్ధత్వా త్ఫలేన భవితవ్య మిత్యవోచామ, అన్యథా వేద స్యానర్థార్థత్వ ప్రసంగా దితి। నచ కర్మణి సత్యుభయవిభ్రష్టవచన మర్థవ త్కర్మణో విభ్రంశకారణానుపపత్తేః ।

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

కర్తవ్యము. అట్టి పురుషుడే కర్మానుష్ఠానమువలన యోగారూఢుడైనచో అట్టి ఆరూఢునకు యోగఫలమగు జ్ఞానమునుకూర్చి శమము (సంన్యాసము) కారణము అనియే సిద్ధించుచున్నది. అట్లగుచో యోగమునుకూర్చి కర్మల నాచరించి యోగారూఢుడై శమము నాశ్రయించియుండ అట్టివాఁడు యోగభ్రష్టుడైయుండ వానికి జ్ఞానము లేమిం జేసి మోక్షము సిద్ధింపదనియు, కర్మలను పరిత్యజించుటచే కర్మఫలము సంభవింపదనియు, అట్టివాని నుద్దేశించి "కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి" అనియర్జునుడు నుడివిన నాశాశంక యుపపన్న మగును.

(౩) ముముక్షువు కామ్యప్రతిషిద్ధకర్మల నాచరింపడు. మరియు నిత్యనైమిత్తికకర్మలనే యాచరించును. అట్టి నిత్యనైమిత్తికకర్మలు ఫలమును పుట్టింపవు. కాన యోగభ్రష్టునిచే నాచరింపంబడిన కర్మలకు ఫలజనకత్వము లేమిం జేసి యోగభ్రష్టుని విషయమై "ఛిన్నాభ్ర మివ నశ్యతి" అని నాశాశంక యుక్తమే యని శంకింపఁజనదు. నిత్యనైమిత్తికకర్మలు ఫలజనకములు కానిచో నిష్ప్రయోజన మగు నిత్యనైమిత్తికకర్మలను విధించెడి వేద మనర్థము నిమిత్తమే యగును. కాన వేదప్రమాణముచే నవబుద్ధ మగుటవలన నిత్యనైమిత్తికకర్మలకు ఫల మవశ్య మంగీకరింపవలయు నని మేము చెప్పియే యుంటిమి. కాన, అనుష్ఠింపఁబడిన కర్మకు ఫలజనకత్వము నిశ్చిత మగుటవలన గృహస్థు యోగభ్రష్టుఁడైనను వానిచే ననుష్ఠింపఁబడిన కర్మయొక్క గతిని పొందుచున్నాడు. అందువలన గృహస్థవిషయమై "కచ్చి న్నోభయ విభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి" అని నాశాశంక యుక్తము కాదు. కనుక, ఆరురుక్షువగు గృహస్థు యోగమునిమిత్తము నిత్యనైమిత్తికకర్మల నాచరించి యోగారూఢుడై శమమును (సంన్యాసమును) పొందియుండ, అట్టివాడు యోగభ్రష్టుడయినచో ఇట్లు సంన్యసించుటచే కర్మదూరుడు, అట్టి యోగభ్రష్టుడు యగుటవలన "కచ్చి న్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి" అని యుభయభ్రష్టత్వవచనము, అందువలననే నాశాశంకయు సమంజస మగును.

మరియు యావజ్జీవము కర్మల నాచరింపవలెనను నీపక్షమున గృహస్థు కర్మకలవాడై యుండ యోగభ్రష్టుడైనను కర్మనాశమునకు కారణము లేమిం జేసి యుభయవిభ్రష్టవచన మర్థవత్తు కానేరదు.

ఫలత్యాగమును గౌణీవృత్తిచే సంన్యాసయోగశబ్దములచే చెప్పఁబడుచున్నవి. ఈ చెప్పుటవలన కొందరు అట్టివాడు శ్రేష్ఠుడని తెలియఁదగును. నిష్కామకర్మానుష్ఠాతకు ముఖ్యమగు సంన్యాసయోగము లేకపోవు అని యీ చెప్పుట సమంజసమే. విచారింపగ నిట్టివాడు అగ్నిసాధ్యశ్రౌతకర్మత్యాగియు కాడు;

**శాంకరభాష్యమ్ :—**

(4) కర్మ కృత మీశ్వరే సంన్యస్యేత్యతః కర్తరి కర్మఫలం నారభత ఇతి చేత్ । నేశ్వరే సంన్యాసస్యాధికతరఫలహేతుత్వోపపత్తేః । మోక్షాయైవేతిచే త్సర్వకర్మణాం కృతానా మీశ్వరే న్యాసో మోక్షాయైవ న ఫలాన్తరాయ యోగసహితో, యోగాచ్చ విభ్రష్ట ఇత్యతస్తం ప్రతి నాశాశంకా యుక్తైవేతిచేత్ న "ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః, బ్రహ్మ

**శాంకరభాష్యతత్త్వబోధిని :—**

(4) ముముక్షువు తనచే నాచరింపఁబడిన కర్మను పరమేశ్వరార్పణము చేయును. కాన, కర్మ నాచరించు ముముక్షువునం దాకర్మము ఫలజనకము కానేరదు అట్టి ముముక్షువు యోగ భ్రష్టుడైనచో నత డుభయభ్రష్టుఁ డగునా ? యని యర్జునుని శంక యుక్తమే యగునని శంకిం పఁజనదు. కర్మము స్వతః ఫలజనకము. అట్టి కర్మమును పరమేశ్వరార్పణ మొనరించినచో యాకర్మము- ప్రభువు నారాధించు బుద్ధితో ధనధాన్యాదికమును ప్రభువునకు సమర్పించిన నధికఫలప్రాప్తి యైనటుల కర్మవలన పుట్టు ఫలముకంటె నధికఫలజనక మగును కాన పూర్వోక్త శంక సంభవింపదు. సత్యమే, పరమేశ్వరార్పణ మొనరించిన కర్మవలన నధికఫలము జనించును. అట్టి ఫలమును కర్మ పుట్టించుటకు సహకారికారణమును కూడ నపేక్షించును. అట్టి సహకారి కారణము యోగమే. అనగా యోగసహితమై పరమేశ్వరార్పితమగు కర్మవలన నుత్కృష్ట మగు మోక్షరూపఫలము సంభవించును. కాని యితరఫల మేదియు సంభవింపదు. - ముముక్షువు తనచే నాచరింపబడిన కర్మమును పరమేశ్వరార్పణము చేసినను, మోక్షమును పుట్టించు యా కర్మమునకు సహకారికారణమగు యోగముతో యాముముక్షు వుభ్రష్టుడైనచో మోక్షము సంభవింపదు. మోక్షమే ఫలముగా కల యీశ్వరార్పితమగు యాకర్మ మాముముక్షువునకు ఫలాంతరారంభకము కానేరదు. కాన నట్టి ముముక్షువు నుద్దేశించి "కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి ?" అని యర్జునుఁడు శంకించుట యుక్తమే యని శంకింపవలదు.

యోగమనగ ధ్యానము. పరమేశ్వరునియందు కర్మసమర్పణము అట్టి ధ్యానసహిత మగుచో మోక్షప్రయోజక మగు ననుటయందు ప్రమాణము లేమింజేసి పరమేశ్వరార్పణముగ కర్మలనాచరించు గృహస్థు యోగభ్రష్టుఁడు కానేరడు. మరియు "ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః, బ్రహ్మచారి వ్రతే స్థితః" అను నుత్తరగ్రంథములచే చెప్పఁబడునట్టి యేకా కిత్వ, నియమితాంతఃకరణత్వ, నిరాసీష్ట్వ, అపరిగ్రహత్వ, బ్రహ్మచారివ్రతస్థత్వములనెడి విశేషణము లెన్నడుగృహస్థునకు సంభవింపవు. కాన, గృహస్థు నుద్దేశించి ధ్యానము విధింపఁ బడుట లేదు. అందుచే గృహస్థునకు ధ్యానయోగమే ప్రసక్తము కానందున గృహస్థు యోగ భ్రష్టుడని చెప్పుట యప్రసక్తప్రతిషేధమగును. కాన గృహస్థు యోగభ్రష్టుడైన యోగి యని యనుట యనుచితమే యగును. ఏకాకియై యుండవలెనని చెప్పుట గృహస్థునకు కూడ

అగ్నినిరపేక్షమగు స్మార్తకర్మత్యాగియు కాడు. మరేమనిన సాగ్నికుడు, సక్రియుడు యగును. అట్టివాడు నిష్కామకర్మానుష్ఠాతయైనను స్తుతినిమిత్తము సంన్యాసి, యోగి యనితలంపబడెను.

**శాంకరభాష్యమ్ :—**

చారివ్రతే స్థితః" ఇతి కర్మసంన్యాసవిధానాత్ । నచాత్ర ధ్యానకాలే స్త్రీసహాయత్వశంకాయేనైకాకిత్వం విధీయతే ।

(5) నచ గృహస్థస్య 'నిరాశీరపరిగ్రహః' ఇత్యాది వచనమనుకూలం । ఉభయవిభ్రష్టప్రశ్నానుపపత్తేశ్చ । "అనాశ్రితః" ఇత్యనేన కర్మిణ ఏవ సంన్యాసిత్వం యోగిత్వం చోక్తం, ప్రతిషిద్ధంచ। నిరగ్నే రక్రియస్యచ సంన్యాసిత్వం యోగిత్వం చేతి చేత్ న, ధ్యానయోగం ప్రతిబహిరంగస్య సతః కర్మణః ఫలాకాంక్షా సంన్యాసస్తుతిపరత్వాత్ । న కేవలం నిరగ్నిరక్రియ ఏవ సంన్యాసీ యోగీచ. కింతర్హి ? కర్మ్యపి కర్మఫలాసంగం సంన్యస్య కర్మయోగ మనుతిష్ఠ

**శాంకరభాష్యతత్త్వబోధిని :—**

ధ్యానకాలమునందు స్త్రీసహాయత్వమును నిరాకరించుటకే యనియు శంకింపవలదు. అగ్నిహోత్రాదుల యందువలె ధ్యానము స్త్రీసహాయము నపేక్షింపనందున ధ్యానమునకు స్త్రీసహాయత్వశంకయే సంభవింపదు. కాన ధ్యానకాలమునం దప్రసక్తమగు స్త్రీసహాయత్వమును "ఏకాకీ" అను వాక్యముచే నిషేధించుట యప్రసక్తప్రతిషేధమే యగును. కాన "ఏకాకీ యతచిత్తాత్మా" అను స్థలమునందుకల "ఏకాకీ" అను పదముకూడ గృహస్థపరము కాదు.

(5) మరియు, నిరాశీష్ట్వ, అపరిగ్రహత్వరూప విశేషణములు సుతరాం గృహస్థున కనుకూలములు కావు. కాన, 'ఏకాకీ' అనుశబ్దము గృహస్థపరము కానేరదు.

మరియు, గృహస్థునకే యేకాకిత్వాదికమును వివక్షచేసి గృహస్థునకే ధ్యానయోగము విధింపబడెననినచో గృహస్థు జ్ఞానమునుండి భ్రష్టుడైనను, అనుష్ఠీయమానకర్మభ్రంశ కలిగినను పూర్వమునం దనుష్ఠింపబడిన కర్మవశమున ఫలము ప్రాప్తించుచుండ గృహస్థునకు జ్ఞానమునుండి కర్మనుండి భ్రష్టత్వ మంగీకరించి "కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్ర మివ నశ్యతి?" అని నాశము నాశంకించుటయు యుపపన్నము కాదు. (సరిపడదు.) కాన నర్జునుని "కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్ర మివ నశ్యతి" అను ప్రశ్నను పర్యాలోచన చేసినచో గృహస్థునకు ధ్యానయోగవిధానము సంభవింపదు.

"స సంన్యాసీ చ యోగీ చ" కర్మయోగనిష్ఠుడగు గృహస్థుడే సంన్యాసి యని, యోగి యని గృహస్థునకే సంన్యాసిత్వము, యోగిత్వము శ్రీకృష్ణపరమాత్మచే చెప్పబడెను. మరియు "ననిరగ్ని ర్నచాక్రియః" నిరగ్నికుడు, కర్మయోగనిరతుడు కానివాడు "న" సంన్యాసియు కాదు, యోగియు కాడని నిరగ్నికునకు అక్రియునకు సంన్యాసిత్వమును, యోగిత్వమును, శ్రీకృష్ణపరమాత్మయే నిషేధించుటచే గృహస్థునకే యోగము విధింపబడినది. అట్టి యోగము నుండి చలించిన గృహస్థుడే యోగభ్రష్టుడగునని శంకింపజనదు. ధ్యానయోగమును కూర్చి కర్మ బహిరంగసాధనమైయుండ అట్టి కర్మఫలమునందాసక్తిని పరిత్యజించుటయొక్క స్తుతిపరము

ఇచట "అక్రియః" అను శబ్దము చేతనే సర్వకర్మసంన్యాసి యని లభించుచుండ "నిరగ్నిః" అని చెప్పుట వ్యర్థమని శంకింప జనదు. అగ్నిశబ్దముచే సర్వకర్మలను స్వీకరించి నిరగ్నిశబ్దముచే సంన్యాసియనియు, క్రియాశబ్దముచే చిత్తవృత్తులను స్వీకరించి "అక్రియః" అను శబ్దముచే నిరుద్ధచిత్తవృత్తులుకల యోగిని స్వీకరించిన పైశబ్దద్వయములలో నొకటి వ్యర్థమను శంక తొలగును. దీనివలన తేలిన యాశయమేమి? "ననిరగ్నిః సంన్యాసీమం

**శాంకరభాష్యమ్ :—**

న్నత్త్వశుద్ధ్యర్థం సంన్యాసీచ యోగీచ భవతీతి స్తూయతే। నచైకేన వాక్యేన కర్మఫలాసంగ సంన్యాసస్తుతి శ్చతుర్థాశ్రమప్రతిషేధ శ్చోపపద్యతే। నచ ప్రసిద్ధం నిరగ్నే రక్రియస్య పరమార్థ సంన్యాసిన శ్శ్రుతిస్మృతిపురాణేతిహాస యోగశాస్త్రవిహితం సంన్యాసిత్వం యోగిత్వం చ ప్రతిషేధతి భగవాన్।

**శాంకరభాష్యార్థబోధిని :—**

"స సంన్యాసీచ యోగీచ న నిరగ్ని ర్నచాక్రియః" అను వాక్యము కాని నిరగ్నికున కక్రియునకు సంన్యాసిత్వ యోగిత్వముల నిషేధపరముకాదు. అనగా కర్మఫలమును కోరక కర్మలనాచరించువాడు కేవలము నిరగ్నికుడు, అక్రియుఁడేకాడు. మరేమనిన ? కర్మలనాచరించువాడైనను కర్మఫలమునందాసక్తిని వదలి అంతఃకరణ పరిశుద్ధినిమిత్తము కర్మయోగము నాచరించువాడు సంన్యాసి యనియు, యోగియనియు స్తుతింపబడుచుండెను. 'స సంన్యాసీచ యోగీచ న నిరగ్ని ర్నచాక్రియః' అనువాక్యముచేతనే కర్మఫలపరిత్యాగముయొక్క స్తుతియు, సంన్యాసాశ్రమప్రతిషేధము చేయబడెననినచో అదియుపొసగదు. అట్లగుచో నొకవాక్యముచేతనే కర్మఫలపరిత్యాగ స్తుతియు, సంన్యాసాశ్రమప్రతిషేధ అను రెండు విధింపఁబడుటవలన విధేయభేదముచే వాక్యభేదమను దోషము ప్రసక్తమగును. (కాన "స సంన్యాసీచ యోగీచ న నిరగ్ని ర్నచాక్రియః" అను వాక్యముచే కర్మఫలపరిత్యాగమే స్తుతింపబడెను. చతుర్థాశ్రమము నిషేధింపఁబడుటలేదని గ్రహింపనగును.) వాక్యభేదమనగ నొకవాక్యముచే రెండువిషయములను బోధించుట ఇట్లు వాక్యభేదము శాస్త్రమునందు మహాదోషము. ఈ విషయమునే 'గుణానాంచ పదార్థత్వా దసంబంధ స్సమత్వాచ్చ" అను జైమినిసూత్రము స్పష్టపరచుచున్నది.

మరియు, నిరగ్నికుఁడు, అక్రియుఁడునగు పరమార్థసంన్యాసికి శ్రుతిస్మృతిపురాణేతిహాస యోగశాస్త్రములచే ప్రసిద్ధమగు సంన్యాసిత్వమును యోగిత్వమును శ్రీకృష్ణపరమాత్మ యెన్నడును, యెచ్చటను నిషేధింపడు.

---

తవ్యః" సంన్యాసి యని యతింపరాదు "నచాక్రియః యోగీ మంతవ్యః" యోగి యని తలపరాదు. అని యథాసంఖ్యముగ నుభయవ్యతిరేకము చూడనగును. ఇట్లు చెప్పుటచే సఖ్ద్వయ ముపపన్నమగును. ॥౧॥

శంకరానందీయము:— పంచమాధ్యాయాంతమున "స్పర్శాన్కృత్వా బహి ర్బాహ్యాన్" అనునది మొదలు మూడుశ్లోకములచే-నాత్మవేత్తయగు యతికి శ్రవణాది జన్య జ్ఞానమునకు ప్రతిబంధము లేకుండుట నిమిత్తమువశ్యకరణీయమగు ధ్యానయోగమును సూచించి యట్టి ధ్యానయోగమున కంతరంగ బహిరంగ సాధనములను, అధికరణమును, తల్లక్షణమును, తత్ఫలమును, నిరూపించుటకు షష్ఠాధ్యాయము ప్రారంభింపబడుచుండెను.

ప్రప్రథమమున చిత్తశుద్ధియున్నచో శ్రవణము, మననము, నిదిధ్యాసనము, తజ్జన్యజ్ఞానము సిద్ధించును. అట్టి చిత్తశుద్ధికి కారణము కర్మయోగము. కర్మయోగమున్నపుడే సత్త్వశుద్ధికలుగును. ఇట్టి సత్త్వశుద్ధిచేతనే శ్రవణాది కార్యము సిద్ధించును. కాన యను నిటువంటివలె కర్మయోగముకూడ శ్రవణాదులకు బహిరంగసాధనము. అందుచే ముముక్షువు తప్పక వైదికకర్మను నియమముగ శ్రద్ధచేతను, యీశ్వర భక్తిచేతను చేయవలయునని కర్మయోగము కల వారిని, వాని కర్మయోగమును స్తుతించుటకు శ్రీకృష్ణపరమాత్మ "అనాశ్రితః" అని మొదలిడెను.

వేదవేదాంగాధ్యయన మొనరించి, వేదార్థమును తెలిసికొనిన ముముక్షువగు బ్రాహ్మణుడు "స్వర్గకామశ్చన్వీతయః పశుకామః, పశ్యతిపుత్రం" ఇత్యాదిశ్రుతి వాక్యములచే బోధింపఁబడు పుత్రపశు స్వర్గప్రాప్తి

శాంకరభాష్యమ్ :—

(6) స్వవచనవిరోధాచ్చ। "సర్వకర్మాణి మనసా సంన్యస్య" "నైవ కుర్వన్న కారయన్" ఆస్తే మౌనీ సన్తుష్టో యేన కేనచి దనికేత స్థిరమతిః' 'విహాయ కామాన్యస్సర్వాన్పుమాం శ్చరతి నిస్పృహః' "సర్వారంభపరిత్యాగీ" ఇతిచ తత్రతత్ర భగవతా స్వవచనాని దర్శితాని। తై ర్విరుధ్యేత చతుర్థాశ్రమప్రతిషేధః। తస్మా న్మునే ర్యోగ మారురుక్షోః ప్రతిపన్న గార్హస్థ్యస్యాగ్నిహోత్రాదిఫలనిరపేక్ష మనుష్ఠీయమానం ధ్యానయోగారోహణసాధనత్వం సత్త్వశుద్ధిద్వారేణ ప్రతిపద్యత ఇతి సంన్యాసీ చ యోగీ చేతి స్తూయతే—

శాంకరభాష్యతత్త్వబోధిని :—

(6) అట్లు నిషేధించినచో స్వవచనవిరోధమే వాటిల్లును. (అదియెట్లనిన?) సర్వకర్మాణి మనసా సంన్యస్య' "నైవ కుర్వన్న కారయన్" 'ఆస్తే మౌనీ సన్తుష్టో యేనకేనచి దనికేతస్థిరమతిః' "విహాయ కామాన్యస్సర్వా న్పుమాం శ్చరతి నిస్పృహః' 'సర్వారంభపరిత్యాగీ" అని అచ్చటచ్చట యీగీతలయందే శ్రీకృష్ణపరమాత్మ స్వవచనములతోనే పారమార్థిక సంన్యాసమును చెప్పియుండెను అట్లు సంన్యాసమును చెప్పియు, ఇచట "న నిరగ్ని ర్న చాక్రియః" అను వాక్యముచే సంన్యాసమును నిషేధించినచో శ్రీకృష్ణపరమాత్మవాక్యములకే విరోధము వాటిల్లును కాన, "స సంన్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః' అను వాక్యముసంన్యాసనిషేధపరముకాదు. కాన, యోగారోహణేచ్ఛ కలిగి పొందబడిన గార్హస్థ్యము కలవానియొక్క యగ్నిహోత్రాదికము ఫలనిరపేక్షమై యనుష్ఠింపఁబడినచో అట్టి యగ్నిహోత్రాదికము సత్త్వశుద్ధిద్వారమున ధ్యానయోగారోహణసాధనత్వమును పొందుచున్న దని 'స సంన్యాసీ చ యోగీ' అని స్తుతింపఁబడుచుండెను.

రూపమగు కర్మఫలము నాశ్రయింపక (కోరకయే) మోక్షైకకామనచే సర్వకర్మలను యీశ్వరార్పణము చేసి నిష్కాముడై యెవడు నియమముచే కర్తవ్యమగు నిత్యనైమిత్తికములను కామ్యవర్జితమగు అగ్నిహోత్రాదికర్మను శ్రద్ధచేతను, భక్తిచేతను లెస్సగ ననుష్ఠించునో అట్టివాడు కర్మఫలకామనాపరిత్యాగరూపసంన్యాసము కలవాడగుటంజేసి 'సంన్యాసి' అనియు, కర్మయోగమునందు చిత్తసమాధానము కలవాడగుటచే 'యోగి' అనియు చెప్పబడుచున్నాడు. ఇట "ననిరగ్ని ర్న చాక్రియః" అనుచోట అవధారణార్థకమగు "ఏవ" అనుపద మధ్యాహార్యము. అనగా "నిరగ్ని రేవ న, "అక్రియ ఏవ న" అనిసమన్వయింపవలెను. దీనివలన దేలిన తాత్పర్యమేమి? "నిరగ్ని రేవ న" అనగా సంన్యాసియే కాదు మరేమనిన? ఫలకామసంకల్పత్యాగముచేతను, చిత్తనిశ్చలత్వముచేతను, మదేక (పరమేశ్వరైక) భక్తిచేతను యెవడు కర్మల నాచరించునో గృహస్థుకగు యట్టివాడు సంన్యాసియే, యోగియే యని యర్థము.

"నిరగ్నిః" అను స్థలమునగల అగ్నిశబ్దముచే అగ్నిపూర్వకమగు నిఖిలకర్మలు చెప్పబడును. అవి చౌలోపనయనము మొదలు బ్రాహ్మణునకు ప్రాప్తించు శ్రౌతస్మార్తాదికర్మలు. అట్టి శ్రౌతస్మార్తాదినిఖిలకర్మలను సాధనములతోకూడ నెవడువివిదిషచే పరిత్యజించునో వాడు "నిరగ్నిః" సంన్యాసి. వాడే శ్రవణాదులచే సంప్రాప్తమగు విజ్ఞానముకలవాడై జ్ఞానయోగమునందు ప్రవృత్తుడై దేహేంద్రియాదిచేష్టారూపములగు సర్వచేష్టలను విడచువాడగుచో "యోగీ" యోగియై యగుచున్నాడు. ॥౧॥

**శాంకరభాష్యమ్:—**

(7) అనాశ్రితో నాశ్రితోఽనాశ్రితః కిం కర్మఫలం కర్మణః ఫలం యత్ తదనాశ్రితః కర్మఫలతృష్ణారహిత ఇత్యర్థః। యో హి కర్మఫలతృష్ణావాన్ స కర్మఫల మాశ్రితో భవత్యయంతు తద్విపరీతోఽతోఽనాశ్రితః కర్మఫల మేవంభూత స్సన్ కార్యం కర్తవ్యం నిత్యం కామ్యవిపరీత మగ్నిహోత్రాదికం కరోతి నిర్వర్తయతి। యః కశ్చి దీదృశః కర్మీ స కర్మ్యన్తరేభ్యో విశిష్యత ఇత్యేవ మర్థ మాహ స సంన్యాసీ చ యోగీ చేతి। సంన్యాసః పరిత్యాగ స్స యస్యాస్తి స సంన్యాసీ చ యోగీ చ। యోగ శ్చిత్తసమాధానం స యస్యాస్తి స యోగీ చేత్యేవం గుణసమ్పన్నోఽయం మన్తవ్యో న కేవలం నిరగ్ని రక్రియ ఏవ సంన్యాసీ యోగీ చేతి మన్తవ్యః। నిర్గతా అగ్నయః కర్మాంగభూతా యస్మాత్స నిరగ్ని రక్రియ శ్చానగ్నిసాధనా అస్య విద్యమానాః క్రియా స్తపోదానాదికా యస్యాసా వక్రియః. ॥౧॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

(7) కర్మఫలము నాశ్రయింపక, అనగా నెవఁడు కర్మఫలమునం దాసక్తికలవాడో వాడు కర్మఫలము నాశ్రయించినవా డనిపించుకొనును. తద్విరుద్ధుడు కర్మఫలతృష్ణారహితుఁడు కర్మఫలము నాశ్రయింపనివాడు అట్టివాడై చేయదగిన కామ్యవ్యతిరిక్తమగు నిత్యనైమిత్తికమగు యగ్నిహోత్రాదిక్రియల నెవడు నెరవేర్చునో ఎవడిట్టి కర్మియో వాడితరకర్ములకంటె విశిష్టుడను యర్థమును "స సంన్యాసీ చ యోగీ చ" అను వాక్యముచే శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచుండెను. సంన్యాస మనగ పరిత్యాగము. అట్టి పరిత్యాగముకలవాడు సంన్యాసి యని యనుపించుకొనును. యోగ మనగ చిత్తసమాధానము. అట్టి చిత్తసమాధానము కలవాడు యోగి యని యనుపించుకొనును పూర్వోక్తవిధమున ఫలతృష్ణాపరిత్యాగపూర్వకముగ నిత్యనైమిత్తికకర్మల నాచరించువాడు అక్రియుడు, నిరగ్నికుడుమాత్రమే కాడు. మరేమనిన? సంన్యాసియు, యోగియు యని తలవదగినవాడు. కర్మాంగభూతములగు ఆవహనీయ గార్హపత్య దక్షిణాగ్ను లెవరినుండి తొలగునో వాడు నిరగ్నికుడు. అగ్నిసాధనముకానట్టి తపోదానాదిక్రియ లెవనికి లేవో వా డ క్రియుండనిపించుకొనును. "అక్రియః" అను పదమునకు అగ్నిహోత్రసాధనసాధ్యమగు క్రియలకంటె భిన్నమగు క్రియలని యర్థము చెప్పుటవలన 'క్రియ లగ్నిసాధ్యములు కదా! అట్టి యగ్నియే లేనితరి (నిరగ్నికుడైనచో) అక్రియత్వము సిద్ధించుచుండ తిరిగి "అక్రియః" అని చెప్పుట పునరుక్తి కాదా యను శంక తొలగింపబడెను. ॥౧॥

శ్రీధరీయము:—చిత్తే శుద్ధేఽపి న ధ్యానం వినా సంన్యాసమాత్రతః। ముక్తి స్స్యా దితి షష్ఠేస్మి న్ధ్యానయోగో వితన్యతే" చిత్తశుద్ధి కలిగినను సంన్యాసమాత్రముచేత ధ్యానములేనిచో ముక్తి సంభవింపదని యీ షష్ఠాధ్యాయమున ధ్యానయోగము విస్తారముగ చెప్పబడుచున్నది. "సర్వకర్మాణి మనసా" అనునది మొదలు గాను గ్రంథముచే సంన్యాసపూర్వకజ్ఞాననిష్ఠ తాత్పర్యముచే చెప్పుటవలనను, కర్మ దుఃఖరూపమగుటవలనను ఒకానొకడు తొందరచే సంన్యాసమును స్వీకరించెడిని. అట్టివానిని నివారించుటకు సంన్యాసముకంటె కర్మయోగము శ్రేష్ఠమైనదని కర్మయోగమును "అనాశ్రితః" అనుదానిచే స్తుతించుచుండెను. ॥౧॥

పరమార్థప్రపా:—పంచమాధ్యాయమునందలి "తయోస్తు కర్మసంన్యాసా త్కర్మయోగో విశిష్యతే" ఇత్యాదికముచే వర్ణాశ్రమోచితమగు కర్మయోగముచే పరిశుద్ధమైన యంతఃకరణకలవానికి ధ్యానయోగసాధనమగు

గీ॥ యం సంన్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ! ।
న హ్యసంన్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన ॥ ॥౨॥

పదవిభాగము:— యం- సంన్యాసం- ఇతి- ప్రాహుః- యోగం- తం- విద్ధి- పాణ్డవ!- న- హి- అసంన్యస్తసంకల్పః- యోగీ- భవతి-కః- చ-న॥ ॥౨॥

ప్రతిపదార్థము:— హే పాణ్డవ!=ఓయర్జునా!; యం=ఏ సర్వకర్మతత్ఫలపరిత్యాగమును; సంన్యాస మితి=పరమార్థసంన్యాసముగ; పండితాః=(ఈపదమధ్యాహార్యము) శ్రుతిస్మృతివేత్తలు; ప్రాహుః=చెప్పుచుండిరో; యోగం=నిత్యనైమిత్తికకర్మానుష్ఠానమును; తం=అపరమార్థసంన్యాసమునుగ; విద్ధి= తెలిసికొనుము. అసంన్యస్తసంకల్పః=అసంన్యస్త= విడిచిపెట్టబడని, సంకల్పః=ఫలవిషయమగు సంకల్పముకల; కశ్చన=ఏకర్మియు; యోగీ= చిత్తసమాధానముకలవాడై; న భవతి=కాడు. ॥౨॥

---

వాయుధారణారూపమైన కర్మయోగమును నిరూపించి నిచ్ఛకలవాడై వెంహాకలోకసన్యాయముచె తిరిగి కర్మసంన్యాసకర్మయోగముల కుపపత్తిపూర్వకముగ సాహచర్యమును "అనాశ్రితః" అను శ్లోకము మొదలు రెండుశ్లోకములచే శ్రీకృష్ణపరమాత్మ చూపించుచుండెను.

కర్మఫలము నపేక్షింపక అవశ్యము కర్తవ్యముగ విహితమగు కర్మల నెవ డాచరించునో వాడె సంన్యాసి, యోగియు నని యనబడును. కర్మఫలము నపేక్షింపకపోవుటయే సంన్యాసము. విహితమగుకర్మలనాచరించుటయే కర్మయోగము. ఇట్టిరీతిగ కర్మల నాచరించకపోవుటను "న నిరగ్ని ర్న చాక్రియః" అనువాక్యముచే నిషేధించుచుండెను.

దీని కర్థ మేమనిన? ఎవడు అపరిశుద్ధాంతఃకరణముకలవాడై "తత్త్వమసి" ఇత్యాదివాక్యములమాత్రముచే కలిగిన శాబ్దప్రతీతిమాత్రముచే "నేనుముక్తుడను" అనితలంచి యగ్నిహోత్రాదికమును పరిత్యజించునో, అదేవిధమున నెవడవశీకృతాంతఃకరణుడై కరచరణచేష్టారహితుడై, కపటముగ నేత్రములను మూసుకొని మిథ్యాచారుడై యుండునో అట్టివాడు సంన్యాసియు కాడు, యోగియు కాడు. ॥౧॥

—♦ ౬వ అధ్యాయము — ౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు ♦—

మధుసూదనసరస్వతీయము:—అసంన్యాసమునందు సంన్యాసపదప్రయోగము గౌణము. అట్టిగౌణప్రయోగమునకుకారణమగు గుణసంబంధమును చూపుటకు "యం సన్యాసం" అని చెప్ప మొదలిడెను.

"న్యాస ఏవాత్యరేచయతి, బ్రాహ్మణాః పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యం చరన్తి" ఇత్యాదిశ్రుతులు యే సర్వకర్మతత్ఫలపరిత్యాగరూపసంన్యాసమును బోధించుచున్నవో ఓయర్జునా! ఫలతృష్ణాకర్తృత్వాభిమానముల పరిత్యాగముచే విహితకర్మానుష్ఠానమును అట్టి సంన్యాసముగ తెలిసికొనుము. "అబ్రహ్మదత్తుని బ్రహ్మదత్తునిగ జెప్పుచుండిరి. అట్టి వాడు బ్రహ్మదత్తుడు కానందున బ్రహ్మదత్తసదృశునిగ నేమంతలచెదము" అనున్యాయమున యొకనిని బోధించు శబ్దము ఇతరునియందు ప్రయుజ్యమానమై గౌణీవృత్తిచేతను కాని, తద్భావారోపముచేతను కాని సాదృశ్యమును బోధించును. ప్రకృతమునందు ముఖ్యసంన్యాసమును బోధించు శబ్దమును కర్మయోగమునందు ప్రయోగించుటయందేమి సాదృశ్యము కలదో అట్టి సాదృశ్యమును చెప్పుచుండెను. పరిత్యజించని ఫలసంకల్పము కలవాడెవడును యోగి కాడు. ప్రతియోగియు పరిత్యక్తఫలసంకల్పము కలవాడే యగును. కాన సంన్యాసికి, యోగికి ఫలత్యాగసామ్యము వలనను తృష్ణారూపచిత్తవృత్తి నిరోధ సామ్యము వలనను, గౌణీవృత్తిచే కర్మయోగి సంన్యాసియు, యోగియు యగుచున్నాడు. అదియెట్లనిన? "యోగశ్చిత్తవృత్తినిరోధః" యోగ మనగ చిత్తవృత్తినిరోధము. "ప్రమాణవిపర్యయవికల్పనిద్రాస్మృతయః" ప్రమాణము, విపర్యయము, వికల్పము, నిద్ర, స్మృతి యని చిత్తవృత్తులయిదు విధములు. అందు ప్రత్యక్షము, అనుమానము, ఆగమము, ఉపమానము, అర్థాపత్తి, అనుపలబ్ధి యని ప్రమాణము లారువిధములని వైదికులు, ప్రత్యక్షము, అనుమానము, ఆగమము అని మూడువిధములే

శాంకరభాష్యమ్ :—

(1) ననుచ నిరగ్నే రక్రియస్యైవ శ్రుతిస్మృతి యోగశాస్త్రేషు సంన్యాసిత్వం, యోగిత్వం చ ప్రసిద్ధం, కథమిహ సాగ్నే స్సక్రియస్య సంన్యాసిత్వం యోగిత్వం చాప్రసిద్ధ ముచ్యత ఇతి । నైష దోషః, కయాచి ద్గుణవృత్త్యోభయస్య సంపిపాదయిషితత్వాత్ । తత్కథం ? కర్మఫలసంకల్పసంన్యాసా త్సంన్యాసిత్వం, యోగత్వేన చ కర్మానుష్ఠానా త్కర్మఫలసంకల్పస్య వా చిత్తవిక్షేపహేతోః పరిత్యాగా ద్యోగిత్వం చేతి గౌణ ముభయం న పున ర్ముఖ్యం సంన్యాసిత్వం యోగిత్వం చాభిప్రేత మిత్యేత మర్థం దర్శయితుమాహ-యమితి ।

శాంకరభాష్యార్థ తత్త్వబోధిని :—

(1) శ్రుతిస్మృతి యోగశాస్త్రములయందు నిరగ్నికుడు, అక్రియుడు నగువానికే సంన్యాసిత్వము, యోగిత్వము ప్రసిద్ధము. అట్టి ప్రసిద్ధమును విడచి యిచట సాగ్నికుడు, సక్రియుడునగువానికి శ్రుతిస్మృత్యాదులయం దప్రసిద్ధమగు సంన్యాసిత్వము, యోగిత్వ మెట్లు చెప్పఁబడుచుండె ననెదవా ? ఇట్లు దోషము ప్రాప్తింప నేరదు.

ఏదో యొక గౌణీవృత్తి నవలంబించి యిచట సాగ్నికుడు సక్రియుఁడునగువానికి సంన్యాసిత్వము యోగిత్వము సంపిపాదయిషితము. అది యెట్లనిన ? కర్మఫలసంన్యాసమువలన సంన్యాసిత్వము, యోగాంగమగు కర్మానుష్ఠానమువలన లేక చిత్తవిక్షేపహేతువగుకర్మఫలము యొక్క పరిత్యాగమువలనకాని యోగిత్వము అని యిచట సంన్యాసిత్వయోగిత్వములు రెండును గౌణములు. ముఖ్యమగు సంన్యాసిత్వము, యోగిత్వమనభిప్రేతము కాదను యర్థమును చూపుటకు "యం సంన్యాసం" అని చెప్పుటకు మొదలిడెను.

ప్రమాణములని యోగులు చెప్పెదరు. ఇరువురకిట్టి భేదమేలెందులకనిన? వైదికులు ఉపమానము అర్థాపత్తి, అనుపలబ్ధులు యోగులు చెప్పిన ప్రమాణత్రయముకంటె బహిర్భూతములని యారుప్రమాణములుగ చెప్పిరి. యోగులు ఉపమానము, అర్థాపత్తి, అనుపలబ్ధులు ప్రత్యక్షానుమానాగమములలో అంతర్భూతములే యని చెప్పిరి. కనుకనే తార్కికాదులు మతభేదమననుసరించి ప్రత్యక్షానుమానోపమానశబ్దములు నాలుగే ప్రమాణము లనిరి. విపర్యయమనగ మిథ్యాజ్ఞానము. అది అవిద్య, అస్మిత, రాగ, ద్వేష, అభినివేశము అని అయిదు విధములు. ఈయయిదే పంచక్లేశము అనబడును. శబ్దజ్ఞానము ననుసరించి వస్తుశూన్యమై భ్రమప్రమావిలక్షణమైన అసదర్థవ్యవహారము వికల్పమనబడును. అదియెట్లనిన "శశవిషాణము, అసత్పురుషుని చైతన్యము" అనునవి మొదలగు అసదర్థవ్యవహారములు. అభావప్రత్యయమాలంబనముగా గల వృత్తియే నిద్రయనబడును. అనగా ప్రమాణవిపర్యయ వికల్పస్మృతిరూపములగు నాలుగు వృత్తుల యభావమునకు కారణము తమోగుణము. అట్టితమోగుణ మాలంబనముగా గల వృత్తియే నిద్ర యని యర్థము. జ్ఞానాద్యభావమమాత్రమునిద్ర కాదు. అనుభూతవిషయాసంప్రమోషమే స్మృతి యనబడును. అట్టి స్మృతి పూర్వానుభవసంస్కారజన్యజ్ఞానము. ఈస్మృతి సర్వవృత్తిజన్యమగుటంజేసి సూత్రమున చివర జెప్పబడెను. లజ్జాదివృత్తులు పైజెప్పబడిన అయిదువృత్తులలో నంతర్భవించుటచే వృత్తు లయిదువిధములే యని యోగిసిద్ధాంతము. ఇట్టి యయిదువిధములగు ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్రా, స్మృతిరూపవృత్తినిరోధమే యోగమని, సమాధియని చెప్పబడును. రాగమనెడి ఫలసంకల్పము మూడవదియగు విపర్యయవిశేషము. అట్టి రాగనిరోధముకూడ గౌణీవృత్తిచే యోగమనియు, సంన్యాసమనియు చెప్పబడును కాన యోగము సంన్యాసమని చెప్పుటలో విరోధ మేమియు లేదు.

॥౨॥

శాంకరభాష్యమ్ :—

(2) యం సర్వకర్మతత్ఫలపరిత్యాగలక్షణం పరమార్థసంన్యాస మితి ప్రాహు శ్శ్రుతిస్మృతివిదో యోగం కర్మానుష్ఠానలక్షణం తం పరమార్థసంన్యాసం విద్ధి జానీహి హేపాణ్డవ! కర్మయోగస్య ప్రవృత్తిలక్షణస్య తద్విపరీతేన నివృత్తిలక్షణేన పరమార్థసంన్యాసేన కీదృశం సామాన్య మంగీకృత్య తద్భావ ఉచ్యత ఇత్యపేక్షాయా మిద ముచ్యతే। అస్తి పరమార్థసంన్యాసేన సాదృశ్యం కర్తృద్వారకం కర్మయోగస్య।

శాంకరభాష్యతత్త్వబోధిని:—

(2) శ్రుతిస్మృతియోగశాస్త్రవేత్తలు సర్వకర్మతత్ఫలపరిత్యాగమును యే పరమార్థసంన్యాసముగ చెప్పుచుండిరో సమాహితచిత్తముకలవా డగుటచే ఫలతృష్ణను వదలి యాచరించిన కర్మానుష్ఠానమును యోయర్జునా! ఆ పరమార్థసంన్యాసముగ దెలిసికొనుము, కర్మయోగము ప్రవృత్తిరూపము. అట్టి కర్మయోగమునకు నివృత్తిరూపము, కర్మయోగవిరుద్ధము నగు పరమార్థసంన్యాసముతో యెట్టి సాధారణధర్మము నంగీకరించి కర్మయోగము పరమార్థసంన్యాస రూపమగు నని చెప్పఁబడుచుండె నను యపేక్షయం దీవిషయము చెప్పఁబడుచుండెను. కర్మయోగమునకు కర్తృద్వారమున పరమార్థసంన్యాసముతో సాదృశ్యము కలదు. అదియెట్లనిన ?

శంకరానందీయము:—అనాత్మజ్ఞునిచే చేయబడు సర్వకర్మఅపరిత్యాగరూపమే సంన్యాసిత్వయోగిత్వములు. అదియే సర్వశాస్త్రప్రసిద్ధమైన బ్రహ్మవిద్ధర్మము. అట్టి సంన్యాసిత్వయోగిత్వరూపమై బ్రహ్మవిద్ధర్మము-ప్రవృత్తిధర్మకంతుడు, అనాత్మజ్ఞుడు, దారాగ్నిహోత్రాదిసాధనవంతుడు నగు గృహస్థున కెట్లుపొసగునని శంకింపజనదు. ధర్మలగు బ్రహ్మవిద్గృహస్థులకు తద్ధర్మములకు పరస్పరభేదమున్నను సంన్యాసకర్మయోగములకు ఫలము మోక్షమొక్కటియే యగుటంజేసి ఫలము ననుసరించి భేదములేమిఁజేసి సంన్యాసి కేది ఫలమో అఫలమే కర్మయోగికిగూడ ప్రాప్తించును కాన నుభయులకు ఫలసామ్యము సంభవించునని సూచించుచు సంన్యాసమువలె కర్మకూడ మోక్షమునకు పరమసాధనము కాన ముముక్షువునకు కర్మయవశ్యము కర్తవ్యమని కర్మను స్తుతించుటకు సంన్యాసకర్మయోగములకు "యంసంన్యాసం" అనుదానిచే నభేదమును చెప్పుచుండెను.

బ్రహ్మవేత్తలు- కర్మిత్వాదర్శనమునే సంన్యాసముగ జెప్పుచుండిరి. ఓయర్జునా? నీవాసంన్యాసమునే కర్మయోగముగ దెలిసికొనుము. అదియెట్లనిన? "సర్వకర్మాణి మనసా సంన్యస్యాస్తే సుఖంవశీ" అను వాక్యముచే తనను కూటస్థాసంగచిద్రూపముగ దెలిసికొనుటచే తాను చేయదగిన కర్మలేవియు లేవని తెలిసికొనుటయే సంన్యాసము. దానిఫలమగు మోక్షము, కర్మానుష్ఠానమువలన ప్రాప్తించు చిత్తశుద్ధివలన కలిగెడి జ్ఞానముచే ప్రాప్తించును కాన సంన్యాసమునకు కర్మ అంగము. అంగాంగులగు కర్మయోగసంన్యాసము లేక కార్యాన్వయులగుటచే నేకమోక్షఫలకములగుటవలన సంన్యాసకర్మయోగముల కేకత్వము సంభవించును. అందుచే నారెంటికి భేదమును తెలిసికొనుము.

లేక, క్రియాదిజన్యజ్ఞానము లేమిఁజేసి "నేను కర్మిని" అనెడిజ్ఞానములేకున్నను అవిక్రియాత్మస్వరూపముగ నవస్థానరూపమగు మోక్షమెట్లుసిద్ధింపదో యట్లే విహితకర్మల నాచరించనిచో చిత్తశుద్ధికలుగదు. చిత్తశుద్ధిలేనిదే యాత్మ స్వరూపజ్ఞానము కలుగదు. ఆత్మస్వరూపజ్ఞానము కలుగనిచో స్వస్వరూపముచే నవస్థానరూపమగు మోక్షము సిద్ధింపదు. కాన మోక్షమును గూర్చి సంన్యాసకర్మయోగము లసాధారణకారణముగుటయందు విశేషము లేమిఁజేసి సంన్యాసకర్మయోగము లేక శక్తికము లగుటవలన, నేక కార్యఫలకము లగుట చేసి భేదము లేనందున యారెంటికి నేకత్వము పపన్నమే.

శాంకరభాష్యమ్ :—

(3) యో హి పరమార్థసంన్యాసీ స త్యక్తసర్వకర్మసాధనతయా సర్వకర్మతత్ఫలవిషయం సంకల్పం ప్రవృత్తిహేతుకామకారణం సంన్యస్యతి। అయమపి కర్మయోగీ కర్మ కుర్వాణ ఏవ ఫలవిషయం సంకల్పం సంన్యస్యతీత్యేత మర్థం దర్శయన్నాహ—నహి యస్మా దసంన్యస్త సంకల్పోఽసంన్యస్తోఽపరిత్యక్తః ఫలవిషయ స్సంకల్పోఽభిసన్ధి ర్యేన సోఽసంన్యస్తసంకల్పః కశ్చన కశ్చి దపి కర్మయోగీ సమాధానవా న్భవతి న సమ్భవతీత్యర్థః। ఫలసంకల్పస్య చిత్త విక్షేపహేతుత్వాత్। తస్మా ద్యః కశ్చన కర్మీ సంన్యస్తఫలసంకల్పో భవే త్స యోగీ సమాధానవా నవిక్షిప్తచిత్తో భవే చ్చిత్తవిక్షేపహేతోః ఫలసంకల్పస్య సంన్యస్తత్వా దిత్యభిప్రాయః। ఏవం పరమార్థసంన్యాసకర్మయోగయోః కర్తృద్వారకం సంన్యాససామాన్య మపేక్ష్య "యం సంన్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాణ్డవ!" ఇతి కర్మయోగస్య స్తుత్యర్థం సంన్యాసత్వ ముక్తమ్ ॥ ॥2॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—

(3) ఎవఁడు పరమార్థసంన్యాసియో, వాడు విడిచిపెట్టబడిన సర్వకర్మ తత్సాధనములు కలవాడగుటచే ప్రవృత్తికి హేతువగునట్టి కామమునకు కారణమైన సర్వకర్మవిషయకమగు సంకల్పమును, సర్వకర్మఫలసంకల్పమును సంన్యసించును. ఈ కర్మయోగియు కర్మము నాచరించువాడైనను ఫలవిషయక మగు సంకల్పమును సంన్యసించును. అని ఇట్టి యర్థమును చూపుచు శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచుండెను. ఫలవిషయక మగు సంకల్పము చిత్తవిక్షేపహేతువు. కాన నెవఁడైనను ఫలవిషయకసంకల్పమును విడవనిచో నట్టి కర్మి చిత్తసమాధానము కలవాడు కాడు. అందువలన యే కర్మి ఫలవిషయకసంకల్పమును పరిత్యజించునో వాడు చిత్తవిక్షేపమునకుహేతువగు ఫలసంకల్పముయొక్క పరిత్యాగమువలన యోగి (సమాధానముకలవాడు) విక్షేపములేనిచిత్తముకలవాఁడగు నని యభిప్రాయము. పరమార్థసంన్యాసకర్మయోగములకు కర్తృద్వారమగు ఇట్టి పరిత్యాగరూపసాధారణధర్మము నవలంబించుకొనియే "యం సంన్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి పాండవ" అని కర్మయోగముయొక్క స్తుతినిమిత్తము కర్మయోగమునకు సంన్యాసరూపత్వము చెప్పఁబడెను. ॥2॥

లేక "సర్వసంకల్పసంన్యాసీ" అను వచనమునుబట్టి సంకల్పము అన్నిటిని వదలుటసంన్యాసము. అంతటను బ్రహ్మదృష్టినుంచి బాహ్యపదార్థభావనను విడచుట యతిధర్మము. ఈలక్షణము ముఖ్యవృత్తిచే కర్మయోగమునకు సంభవింపకున్నను, కర్మఫలసంకల్పసంన్యాసరూపలక్షణము సంభవించును గాన ఫలసంకల్పపరిత్యాగరూపగౌణీవృత్తిచే సంన్యాసకర్మయోగముల కేకత్వము సంభవించును. కాన సంన్యాసమే కర్మయోగము అని యారెంటికి నభేదమును తెలిసికొనుమని యర్థము. "యం సంన్యాస మితి ప్రాహు ర్యోగం తం విద్ధి" అని చెప్పుటచే కర్మఫలసంకల్పసంన్యాసోపలక్షితమగు కర్మయోగమే మోక్షసమర్థమగును అనిసూచితమైనది. కర్మయోగము కర్మఫలసంకల్పసంన్యాసైకప్రధాన మగుటచే ముముక్షువగు గృహస్థువు కర్మఫలసంకల్పమును విడువవలయునని బోధించుచున్నాడు.— మోక్షైకకామనచే ఫలవిషయకకామనను విడచినవాడు సంన్యస్తసంకల్పుఁడనబడును. తద్విలక్షణుడగునట్టివాడు కర్మకు భూతభవిష్యద్వర్తమానములయందు కర్మఫలమునే తలచుచు కర్మనుచేయును. అట్టివాడుబ్రాహ్మణుడుకాని, ఇతరుడుకాని, యెట్టివాడైనను యోగి కానేరడు. యోగమనగ కర్మఫలాపేక్షారా

గీ॥ ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే ।
యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే ॥ ॥౩॥

పదవిభాగము:— ఆరురుక్షోః- మునేః- యోగం- కర్మ- కారణం ఉచ్యతే- యోగారూఢస్య- తస్య- ఏవ- శమః- కారణం- ఉచ్యతే ॥ ॥౩॥

ప్రతిపదార్థము:— యోగం= ధ్యానయోగమును; ఆరురుక్షోః= పొందుటకిచ్ఛకల; మునేః= కర్మఫల సంన్యాసికి; కర్మ=నిత్యనైమిత్తికకర్మ; కారణం=సాధనమై; ఉచ్యతే=చెప్పంబడుచున్నది. యోగారూఢస్య= ధ్యానయోగారూఢుడగు; తస్యైవ=ఆరురుక్షువునకే; శమః=ఉపశమము (కర్మవలననివృత్తి) యోగారూఢత్వస్య= (ఈపదమ ధ్యానపూర్ణము) యోగారూఢత్వమునకు, కారణం=కారణమై; ఉచ్యతే=చెప్పంబడుచున్నది. ॥౩॥

---

హిత్యపురస్సరముగ బొందబడిన చిత్తనైర్మల్యము. అదికలవాడు యోగి. ఎవడు కర్మఫలాశాసంభావితచిత్తవిక్షేప వంతుడో వాడు యోగికానేర డని యర్థము.

లేక, "యో౽సంన్యస్తసంకల్పః స యోగీ న" ఎవడు కర్మఫలసంకల్పమును విడువడో వాడు మోక్ష యోగారూఢుడు కాడు. మరేమనిన: జన్మాదిదుఃఖయోగియే యగునని యర్థము. "కామాన్యః కాయతే మన్యమానః స కామభి ర్జాయతే తత్ర తత్ర" "ఉపాసతే పురుషం యే హ్యకామా స్తే శుక్ర మేత దతివర్తన్తి ధీరాః" అనుశ్రుతి ప్రసిద్ధార్థద్యోతకము "హి"శబ్దము. ॥౨॥

భాష్యార్కదీపిక -గౌణప్రయోగమున నిమిత్తభూతమగు గుణసంబంధము నీశ్లోకమున జూపుచు న్నాడు. —శ్రుతిస్మృతీతిహాసపురాణములు సర్వకర్మతత్ఫలత్యాగమును పరమార్థసంన్యాసమునుగ జెప్పుచున్నవి. ఫలవిషయకసంకల్పత్యాగరూప మగు గుణసంబంధముకల దగుటచే ఫలాభిసంధిరహితకర్మానుష్ఠానమును గూడ నట్టి పరమార్థసంన్యాసముగ నీవు తెలిసికొనుము. నిజమునకు నీ విందప్రభృతి పాండుక్షేత్రజాతుడవగు టచే పాండవశబ్దవాచ్యుడ వయితివి. అట్లే గుణసంబంధముచే ఫలాభిసంధిరహితకర్మానుష్ఠానమును పరమార్థ సంన్యాసముగ దెలిసికొనుమని సూచించుటకై "పాండవ" అని సంబోధించెను. ॥౩॥

పరమార్థప్రపా:— ఇట భగవదభిమతమగు సంన్యాసశబ్దార్థమేమనిన:—"సమ్యక్ప్రకారేణ న్యసనం చిత్తశుద్ధి ద్వారా జ్ఞాన ముత్పాద్య స్వత ఏవ కర్మోపరమః కర్మసంన్యాసో నతు కర్మత్యాగః" లెస్సగ చిత్త శుద్ధిద్వారమున జ్ఞానమును కలుగజేసి స్వతః కర్మల యుప రమమే (కర్మసమాప్తి) కర్మసంన్యాస మనబడును. కాని కర్మపరిత్యాగమమాత్రము కర్మసంన్యాసశబ్దార్థము కానేరదు. ఈవిషయము అధ్యాత్మమీమాంసయందు "సమ్యజ్న్యాస స్సమాప్తిర్విమలతరధియః కర్మణాం సంవిదాప్తౌ సంన్యాసో యద్వ దధ్వా స్వయ ముపరమతి గ్రామవర్త్మం ప్రవేశ్య। రంభా తావ ద్వివృద్ధిం భజతి ఫలభరం యావదుచ్చైః ప్రసూతే హ్రాసం పశ్చా త్తథై వామృతఫలిశతో జ్ఞానముత్పాద్య కర్మ" మార్గము పథికుని గ్రామద్వారమును ప్రవేశపెట్టి స్వయముగ నుపర మించును (సమాప్తమగును) అంతియేకాని యామార్గమా నేను గ్రామమును పొందినాను నీవిక మరలిపొమ్మ అని మార్గము విడువబడదు. మరేమనిన మార్గము పథికునికి గ్రామద్వారమును చూపించి స్వయముగనే యుపరమిం చును (శాంతించును) అట్లే— మరియు అరటిచెట్టు గెలవేయునంతవరకు వృద్ధినిపొంది గెలవేసినపిమ్మట క్రమముగ తానే క్షీణించును. అట్లే మోక్షమును కోరెడివాని కర్మయు జ్ఞానమును కలుగజేసి స్వయముగశాంతించునని చెప్ప బడెను. ॥౨॥

—: ౬వ అధ్యాయము. ౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. :—

మధుసూదనసరస్వతీయము:—ప్రశస్తమైనదగుటచే యావజ్జీవము కర్మయోగమే యనుష్ఠేయమా? అట్లు కాదని "ఆరురుక్షోః" అను శ్లోకముచే జెప్పుచుండెను.

అంతఃకరణపరిశుద్ధిరూపమగు వైరాగ్యమును పొంద నిచ్ఛగల భవిష్యన్మునికి అనగా కర్మఫలముల యందాసక్తిని వదలిన వానికి భగవదర్పణబుద్ధిచే నాచరించబడిన శాస్త్రవిహితమగు నిత్యనైమిత్తికాదికర్మ అంతఃక

శాంకరభాష్యమ్ :—

ధ్యానయోగస్య ఫలనిరపేక్షః కర్మయోగో బహిరంగంసాధన మితి తం సంన్యాసత్వేన స్తుత్వాఽధునా కర్మయోగస్య ధ్యానయోగసాధనత్వం దర్శయతి— ఆరురుక్షో రారూఢు మిచ్ఛాతోఽనారూఢస్య ధ్యానయోగేఽవస్థాతు మశక్తస్యైవేత్యర్థః । కస్యారురుక్షో ర్మునేః కర్మఫలసంన్యాసిన ఇత్యర్థః ।, కిమారురుక్షోర్యోగం కర్మ కారణం సాధన ముచ్యతే। యోగారూఢస్యపున స్తస్యైవ శమ ఉపశమ స్సర్వకర్మభ్యో నివృత్తిః కారణం యోగారూఢస్య సాధన

శాంకరభాష్యార్థతత్త్వబోధినీ :—

ఫలము నపేక్షింపక చేయునట్టి కర్మయోగము ధ్యానయోగమునకు బహిరంగసాధనము. కాన, అట్టి కర్మయోగమును సంన్యాసముగ స్తుతించి యీశ్లోకమున కర్మయోగమునకు ధ్యానయోగసాధనత్వమును. చూపించుచుండెను.

ధ్యానయోగము నధిష్ఠించు నిచ్ఛగలిగినట్టివానికి, కనుకనే ధ్యానయోగానారూఢుడు, ధ్యానయోగమునందుండుట కశక్తుడని యర్థము. అట్టి కర్మఫలసంన్యాసియగునట్టి యారురుక్షువునకు ఫలమును కోరకనాచరించునట్టి నిత్యనైమిత్తికకర్మము (ధ్యానయోగారోహణమునకూర్చి) సాధన మని యర్థము. ఆరురుక్షువే యోగారూఢుడైనచో అట్టివానికి సర్వకర్మల

రణపరిశుద్ధిరూపముగు వైరాగ్య మనెడి యోగమును పొందుటకు అకు సాధనముగా ననుష్ఠేయ మని వాచె వేద ద్వారమున చెప్పఁబడెను. అంతఃకరణపరిశుద్ధిరూపముగు వైరాగ్యమును పొందినట్టియు పూర్వము కర్మల నాచరించినట్టివానికైతే సర్వకర్మసంన్యాసమే జ్ఞానపరిపాక సాధనముగ ననుష్ఠేయ మని చెప్పఁబడెను. ॥3॥

శంకరానందీయము:—పూర్వమునందు చెప్పఁబడిన రీతిని ముముక్షువులకు కర్మయోగముయొక్క అవశ్యకర్తవ్యత్వము సిద్ధించుటకొఱకు కర్మయోగమును సంన్యాసముతో సమానముగను, కర్మయోగానుష్ఠానపరుని సంన్యాసితో సమానముగను స్తుతించి ప్రస్తుతము కర్మయోగమును జ్ఞానసాధనముగ జెప్పుచు యట్టికర్మయోగ మెంతవర కాచరించవలెనో అట్టిహద్దును సూచించుచు ఆరూఢునకు విదేహముక్తికి కారణమును "ఆరురుక్షోః" అను శ్లోకముచే చెప్పుచుండెను. సమ్యగ్దర్శననిష్ఠను పొంద నిచ్ఛగలిగినట్టియు ముక్తికొఱకు జ్ఞానమును పొందు నిచ్ఛగల (ఇచట మునిశబ్దమునకు ముని యర్థముకాని భవిష్యన్మని యని యర్థమెటుల పొసగు ననెదరా "గృహస్థః స్త్రియముద్వహేత్" అను స్థలమున వివాహానంతరము ప్రాప్తించు గార్హస్థ్యమును పురస్కరించుకొని యుద్వాహపూర్వమునందే బ్రహ్మచారియందు గృహస్థశబ్దమును ప్రయోగించి గృహస్థు వివాహమును చేసుకొనవలయు నని నటుల భవిష్యత్సంన్యాసము నవలంబించి మునిశబ్దప్రయోగము గౌణీవృత్తిచే యుపపన్నమే యగును.) భవిష్యన్మునికి— కర్మను విడచి మరేమియు చిత్తశుద్ధికి కారణము లేనందున కర్మయే చిత్తశుద్ధిని సంపాదించి పురుషుని జ్ఞానయోగారూఢునిగ జేయును గాన కర్మయే జ్ఞానయోగప్రాప్తికి కారణ మని మంత్రమునందు చెప్పబడుచున్నది. ఆమంత్రము లేవనిన? "కర్మాణి కవయో యాన్యపశ్యంస్తాని త్రేతాయాం బహుధా సంతతాని తాన్యాచరథ నియతం సత్యకామాః" ఇత్యాదిశ్రుతులే యని గ్రహింప నగును. ఎవరికి చిత్తశుద్ధి కొఱకు కర్మయోగము విహితమో అట్టివానికి నిత్యనైమిత్తికకర్మానుష్ఠానమువలన చిత్తశుద్ధి ప్రాప్తింప జనించిన వివేకవైరాగ్యశమదమాదిసాధనసంపత్తిచే సంభవించిన శ్రవణమననాదిజన్యజ్ఞానముచే జ్ఞానయోగారూఢుడు, విదేహకైవల్యార్థి యగు నట్టి యతికి "శమః" బాహ్యకర్మోపరమమే వేదముచేతను స్మృతులచేతను చెప్పబడుచున్నది. ఆశ్రుతిస్మృతులేవనిన? "తమేవైకం జానథ ఆత్మాన మన్యా వాచో విముంచథ। ఓ మిత్యేవం ధ్యాయథ ఆత్మానం త మేవ ధీరో విజ్ఞాయ। శాంతో దాంత ఉపరత స్తితిక్షు స్సమాహితో భూత్వాఽఽత్మన్యేవాత్మానం పశ్యేత్" ఆత్మరతి రాత్మక్రీడః" ఇత్యాదిశ్రుతులున్ను "నైతాదృశం బ్రాహ్మణస్యాస్తి విత్తం యథైకతా

**శాంకరభాష్యమ్‌:—**

ముచ్యత ఇత్యర్థః। యావ ద్యావ త్కర్మభ్య ఉపరమతే తావత్తావ న్నిరాయాసస్య జితేన్ద్రియస్య చిత్తంసమాధీయతే। తథాసతి స ఝడితి యోగారూఢో భవతి। తథాచోక్తం వ్యాసేన- నై తాదృశం బ్రాహ్మణస్యాస్తి విత్తం య థైకతా సమతా సత్యతా చ। శీలం స్థితిర్దండనిధాన మార్జవం తతస్తతశ్చోపరమః క్రియాభ్య ఇతి ॥3॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

నుండినివృత్తి యోగారూఢత్వమునకు సాధనమై చెప్పఁబడుచున్నదని యర్థము. ఎంతెంత కర్మలనుండి నివృత్తుఁడగునో అంతంత నిరాయాసుడగును. అట్టి జితేంద్రియునకు చిత్తము సమాధానమునం దుంచబడును. అట్లగుచో నట్టివాడు శీఘ్రముగ యోగారూఢు డగును. ఈవిషయమే శ్రీవేదవ్యాసునిచే "నై తాదృశం బ్రాహ్మణస్యాస్తి విత్తం య థైకతా సమతా సత్యతా చ। శీలం స్థితి ర్దండనిధాన మార్జవం తత స్తత శ్చోపరమః క్రియాభ్యః॥ "ఏకతా" సర్వభూతములయందు వస్తుతః ద్వైతాభావమే యని తెలిసికొనుట. 'సమతా" సర్వభూతములయందుపాధిప్రయుక్తవిశేష ముండినను స్వతః విశేషము లేదను జ్ఞానము, "సత్యతా" సర్వభూతములకు హితమగు వాక్యములను పలుకుట, "శీలం" స్వభావసంపత్తియు, 'స్థితిః' స్థైర్యము, 'దండనిధానం' యేభూతమును హింసించకపోవుట, 'ఆర్జవం' ఏభూతములయందు కుటిలత్వము లేకపోవుట, 'తత స్తత శ్చోపరమః క్రియాభ్యః' ఆయాక్రియలనుండి యుపరతియు అనెడి ధనముకంటె భిన్నము, పురుషార్థసాధనము నగు ధనము బ్రాహ్మణునకు లేదని వేదవ్యాసునిచే చెప్పబడెను. కాన బ్రాహ్మణునకు నిరతిశయము పురుషార్థసాధనము నగు ధన మాయాక్రియలనుండి యుపరతియే యని భావము. ॥3॥

---

సమతా సత్యతా చ। శీలం స్థితి ర్దండనిధాన మార్జవం తత స్తత శ్చోపరమః క్రియాభ్యః॥ నైవ ధర్మీ నచాధర్మీ నచైవ హి శుభాశుభీ। య స్స్యా దేకాసనే లీన స్తూష్ణీం కించి దచింతయన్" ఇత్యాదిస్మృతులున్ను యోగారూఢుడు విదేహకైవల్యార్థి యగువానికి బ్రహ్మయందారోపితనామరూపాద్యగ్రహణరూపము శమశబ్దార్థము అట్టి శమరూపమగు సర్వకర్మసంన్యాసమే విదేహముక్తికి పరమకారణ మని బోధించుచున్నది. కాన ముముక్షువు అవశ్యము చిత్తశుద్ధికొఱకు వైదికమగు కర్మలనే యాచరించవలయును. అట్టి వైదికకర్మల నాచరించుటచే ప్రాప్తమైన చిత్తశుద్ధిచే తదేకపరత్వమువలన లెస్సగ నాచరించబడిన శ్రవణాదులవలన సంప్రాప్తమగు జ్ఞానము కలిగినట్టి సమాధినిష్ఠునకు సర్వకర్మసంన్యాసమే కర్తవ్యము. అని యభిప్రాయము.

ఆరురుక్షువునకు కర్మ కారణము, ఆరూఢుడైనవానికే శమము కారణ మని చెప్పుటచే ప్రయాణము చేయువానికి గమనము సముద్రపర్యంతమే. ఆటు పిమ్మట గమనమునకు పరిసమాప్తి యెట్లో అట్లే ముముక్షువునకు జ్ఞానము సిద్ధించువరకే కర్మకర్తవ్యము. జ్ఞానము సిద్ధించినపిమ్మట సర్వకర్మసంన్యాసమే కర్తవ్యమనినూచింపబడెను.

ఈచెప్పుటచే "యావజ్జీవ మగ్నిహోత్రంజుహోతి, కుర్వ న్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగ్ం సమాః। ఇత్యాదిశ్రుతులు యావజ్జీవము కర్మలు కర్తవ్యము అని బోధించుట యజ్ఞానికేయనియు, జ్ఞానికి కాదని గ్రహింపవగును. జ్ఞానికి కూడ కర్మలు కర్తవ్యములే యగుచో "యదహరేవవిరజే త్తదహరేవ ప్రవ్రజేత్" "సశిఖం వపనం కృత్వా బహి స్సూత్రం త్యజే ద్బుధః। తే హ స్మ పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ వ్యుత్థాయాథ భిక్షాచర్యంచరన్తి" యదా తు విదితం తత్త్వం పరం బ్రహ్మ సనాతనమ్। తదైకదండం సంగృహ్య సోపవీతాం శిఖాం త్యజేత్" జ్ఞానికి సంన్యాసబోధకములగు పై నుదహరించబడిన శ్రుతులకు విరోధము

గీ॥ యదా హి నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే।
సర్వసంకల్పసంన్యాసీ యోగారూఢ స్తదోచ్యతే॥ ॥౪॥

పదవిభాగము:— యదా–హి–న–ఇన్ద్రియార్థేషు–న–కర్మసు–అనుషజ్జతే–సర్వసంకల్పసంన్యాసీ–యోగారూఢః–తదా–ఉచ్యతే॥ ॥౪॥

ప్రతిపదార్థము:— యదాహి=ఏసమయమునందు; యోగీ= (ఈపదమధ్యాహార్యము) సమాహితాంతఃకరణముకలయోగి; ఇన్ద్రియార్థేషు=శబ్దస్పర్శరూపరసగంధరూపములగు విషయములయందు; నానుషజ్జతే=కర్తవ్యత్వబుద్ధిని చేయడో; కర్మసుచ=నిత్యనైమిత్తిక కామ్యప్రతిషిద్ధకర్మలయందు; నానుషజ్జతే=కర్తవ్యత్వబుద్ధిని చేయడో; తదా=అట్టిసమయమున; సర్వసంకల్పసంన్యాసీ=ఇహాముత్రార్థకామహేతువులగు నిఖిలసంకల్పములను సన్యసించుస్వభావముకల; సః= (ఈపదమధ్యాహార్యము) అట్టియోగి; యోగారూఢః= పొందబడిన యోగముకలవాడని; ఉచ్యతే=చెప్పబడుచున్నాడు. ॥౪॥

---

వాటిల్లును. కాన అజ్ఞాని యగు ముముక్షువునకు కర్మలను బోధించునవి యావజ్జీవమగ్నిహోత్రమును బోధించు శ్రుతులు. ఆరూఢునకు సంన్యాసమును బోధించునవి సంన్యాసబోధక శ్రుతులని వ్యవస్థ గ్రహింపనగును.

"యదహరేవ విరజేత్తదహరేవ ప్రవ్రజేత్" ఇత్యాదిశ్రుతివిహితసంన్యాసమునం దధికారులు వైదికకర్మానధికారులగు జడులు, జాత్యంధులు, మూగవారలు. వారల నుద్దేశించియే సంన్యాసమును పైశ్రుతులు బోధించుచున్నవి. విద్వాంసునకు సంన్యాసము నా శ్రుతులు బోధించుటలేదు–మరేమనిన? "విద్వాన్యజతే" ఇత్యాదిశ్రుతులు విద్వాంసునకు కర్మలనే విధించుచున్నవి. కాన సంన్యాస విధాయక శ్రుతులు జడజాత్యంధమూకాది పరములు, "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" ఇత్యాది శ్రుతులు విద్వత్పరములుగ సమన్వయించిన యుభయ శ్రుతులకు విరోధము వాటిల్లనందున విద్వాంసునకు సంన్యాసము నంటకట్టుట యుక్తము కాదని శంకింపజనదు.

వేదశాస్త్రాధ్యయనము లేని జడజాత్యంధమూకాదులకు "పరీక్ష్య లోకా న్కర్మచితా న్బ్రాహ్మణో నిర్వేదమాయాత్" అను శ్రుత్యుక్తరీతిని లోకములు కర్మసంపాదితములు, అనిత్యములు, స్వల్పఫలములు కలవి, మిథ్యాభూతములు అను జ్ఞానము సంభవించనందున యిట్టి జ్ఞానము కల "బహి ర్మాత్రం త్యజే ద్బుధః" అను శ్రుత్యుక్తరీతిగ విద్వాంసునకే సంన్యాసమునం దధికారము గన్పట్టుచున్నందున సంన్యాసవిధాయకశ్రుతులచే చెప్పబడుసంన్యాసము విద్వాంసునకే (బ్రహ్మవేత్తకే) యని యొప్పుకొనవలయును. అట్లగుటచే సంన్యాసము, కర్మయోగము ఉభయము విద్వాంసునకే యగుచో యారెండును యొకనికే పొసగనందున సంన్యాసకర్మయోగములను బోధించు శ్రుతులకు విరోధము తప్పదని శంకింపజనదు. "విద్వాన్యజతే" ఇత్యాది శ్రుతిబోధితవిద్వాంసుడు వేదశాస్త్రార్థతత్ప్రయోగప్రాయశ్చిత్తములు తెలిసినవాడు. అట్టివాడగు విద్వాంసునకే కర్మవిధి. "మహత్పదం జ్ఞాత్వా వృక్షమూలే వసేత్" "జ్ఞాత్వా నైష్కర్మ్య మాచరేత్" తస్మాజ్జ్ఞానం పురస్కృత్య సంన్యసేదిహ బుద్ధిమాన్। అహ మేవాక్షరం బ్రహ్మ వాసుదేవాఖ్య మవ్యయమ్॥ ఇతి భావో ధ్రువో యస్య తదా భవతి భైక్షభుక్। యదా తు విదితం తత్త్వం" ఇత్యాది శ్రుతిస్మృతివచనములవలన బ్రహ్మవేత్తకే సంన్యాసము కర్తవ్యమని సిద్ధమగుచున్నందున సంన్యాసవిధాయకకర్మ విధాయకశ్రుతులు భిన్నపురుషాధికారికములగుటంజేసి యారెండుశ్రుతులను విరోధము వాటిల్లదను యాశయముచేతనే శ్రీకృష్ణపరమాత్మ ఆరురుక్షువునకు కర్మయోగమును, ఆరూఢునకు శమమును (సంన్యాసమును) "ఆరురుక్షో ర్మునే ర్యోగం కర్మ కారణ ముచ్యతే। యోగారూఢస్య తస్యైవ శమః కారణ ముచ్యతే॥" అని బోధించెను. ॥౩॥

పరమార్థప్రపా:— శుద్ధముకాని చిత్తము విక్షేపజనకమగుటవలన కర్మలవలన చిత్తశుద్ధి సంభవించుటచే యమనియమాది సోపానక్రమమున ఊర్ధ్వగతిని పొందనిచ్ఛయించిన పురుషునకు కర్మ చిత్తశుద్ధిజనకము. అట్టివాడారూఢావస్థను పొందినధ్యాననిష్ఠునకు జ్ఞానపరిపాకము నిమిత్తము శమము (విక్షేపోపరమము) కారణము. ॥౩॥

**శాంకరభాష్యమ్.—**

(1) అథే దానీం కదా యోగారూఢో భవతీత్యుచ్యతే। యదా సమాధీయమానచిత్తో యోగీ హీన్ద్రియార్థేషు ఇంద్రియాణా మర్థాశ్శబ్దాదయస్తే ష్వింద్రియార్థేషు కర్మసు చ నిత్యనైమిత్తిక కామ్యప్రతిషిద్ధేషు ప్రయోజనాభావబుద్ధ్యా నానుషజ్జతేఽనుషంగం కర్తవ్యతాబుద్ధిం న కరోతీత్యర్థః। సర్వసంకల్పసంన్యాసీ సర్వాన్సంకల్పా నిహాముత్రార్థకామహేతూ న్సంన్యసితుం శీల మస్యేతి సర్వసంకల్పసంన్యాసీ యోగారూఢః ప్రాప్తయోగ ఇత్యేత త్తదా తస్మిన్కాల ఉచ్యతే। సర్వసంకల్పసంన్యాసీతివచనా త్సర్వాంశ్చ కామాన్సర్వాణి చ కర్మాణి సంన్యసే దిత్యర్థః।

**శాంకరభాష్యతత్త్వబోధిని.—**

(1) ఇంతకుపూర్వమునందు యోగప్రాప్తి కుపాయము చెప్పఁబడెను. అనంతరమున నిపుడేసమయమున యోగారూఢుడగు నను శంకను తొలిగించుటకు శ్రీకృష్ణపరమాత్మ చెప్ప మొదలిడెను.

ఏసమయమున యోగి సమాహితాంతఃకరణకలవాడై శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయములయందును, నిత్యనైమిత్తిక కామ్యప్రతిషిద్ధ కర్మలయందును ప్రయోజనము లేదు. అనుబుద్ధిచే కర్తవ్యత్వబుద్ధిని పొందడో అనగా శబ్దాదివిషయములు ప్రయోజనకారులు కావనియు నిత్యనైమిత్తికాది కర్మలవలన ప్రయోజనములేదనియు, జ్ఞానముచే నాకర్మములు చేయదగినవనియు, శబ్దాదివిషయములు తెలిసికొనదగినవనియు జ్ఞానము కలుగదు. అట్టి జ్ఞానములేనివాడై (యుండునో) అట్టిసమయమున నిహాముత్రార్థకామములకు హేతువులగు సర్వసంకల్పములను సంన్యసించు స్వభావముకలవాడై యోగారూఢుడని (పొందబడిన యోగముకలవాడని) చెప్పఁబడుచున్నాడు. ఈ శ్లోకమున "సర్వసంకల్పసంన్యాసీ" అని చెప్పుటవలన అన్ని కోరికలను, సర్వకర్మలను సన్యసింప (పరిత్యజింప) వలెనని యర్థము సిద్ధించుచున్నది. అనగా సర్వకార్యములకు కారణము కామము. అట్టి కామమునకు మూలము సంకల్పము. అట్టి మూలమగు సంకల్పమును ఛేదించినచో కాముడు జనించడు. కాముడుజనించినచో కామకార్యమగు కర్మప్రవృత్త్యాదు లప్రయత్నముగనే సిద్ధించునని భావము.

—: ౬వ అధ్యాయము. ౪ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

**మధుసూదనసరస్వతీయము:—** ఎపుడు యోగారూఢుడగునను శంకను తొలిగించుటకు "యదాహి" అని చెప్ప మొదలిడెను.

ఏచిత్తసమాధానకాలమున శబ్దస్పర్శరూపరసగంధాదులయందు, నిత్యనైమిత్తికకామ్యలౌకికప్రతిషిద్ధ కర్మలయందు "నానుషజ్జతే" అభినివేశమును పొందడో అనగా శబ్దాదులు, నిత్యనైమిత్తికాది కర్మలు మిథ్య యను జ్ఞానముచేతను, ఆత్మ అకర్త, అభోక్త, పరమానందాద్వయస్వరూపము అను జ్ఞానముచేతను శబ్దాదుల యందు, నిత్యనైమిత్తికాదికర్మల ప్రయోజనము లేదను బుద్ధిచే "నేను నిత్యనైమిత్తికాదికర్మలకు కర్తను, నాకు శబ్దాదులు భోగ్యములు" అను యభినివేశమును పొందడో అట్టి సమయమున శబ్దాదులయందు, నిత్యనైమిత్తికాదికర్మలయందభినివేశము లేమిఁజేసి "ఈకర్మ నాచే జేయదగినది, ఈఫలము నాచే యనుభవింపదగినది" అనెడి సంకల్పరూపములగు మనోవృత్తులను త్యజించువాడగును. అట్టిసమయమున యట్టి త్యాగి సమాధ్యారూఢుడని చెప్పబడును,

**శంకరానందీయము:—** బాహ్యోపరమణ మనెడి యొక శమమునే సాధనముగ గైకొని యోగారోహణ

**శాం॰ భాష్యమ్ ॰—**

(2) సంకల్పమూలా హి సర్వే కామాః- “సంకల్పమూలః కామో వై యజ్ఞా స్సంకల్ప సమ్భవాః । కామ ! జానామి తే మూలం సంకల్పాత్త్వం హి జాయసే॥ న త్వాం సంకల్పయిష్యామి తేన మే న భవిష్యసి” ఇత్యాదిస్మృతేః । సర్వకామపరిత్యాగే చ సర్వకర్మసంన్యాస స్సిద్ధో భవతి “స యథాకామో భవతి తత్క్రతు ర్భవతి యత్క్రతు ర్భవతి తత్కర్మ కురుతే” ఇత్యాది శ్రుతిభ్యః, “యద్యద్ధి కురుతే కర్మ తత్తత్కామస్య చేష్టితమ్” ఇత్యాది స్మృతిభ్యశ్చ । న్యాయాచ్చ, న హి సర్వసంకల్పసంన్యాసీ కశ్చి త్స్పన్దితుమపి శక్తః । తస్మాత్సర్వసంకల్పసంన్యాసీతి వచనా త్సర్వాన్కామా న్సర్వాణి కర్మాణి చ త్యాజయతి భగవాన్ ॥ ॥౪॥

**శాం॰ భాష్యతత్త్వబోధని॰—**

(2) “సంకల్పమూలః కామో వై యజ్ఞా స్సంకల్పసంభవాః॥ కామ ! జానామి తే మూలం సంకల్పా త్త్వం హి జాయసే॥ నత్వాం సంకల్పయిష్యామి తేన మే న భవిష్యసి” కాముడు సంకల్పమువలన జనించును. యజ్ఞములు సంకల్పమువలన జనించును. ఓకాముడా ! నీవు జనించుటకు కారణమును నేనెరుగుదును. నీవు సంకల్పమువలననే జనించెదవు. నిన్ను నేను సంకల్పించను. అందుచే నీవు (నాకు) జనింపవు. అనెడి స్మృతివలన కాముడు సంకల్పమువలన జనించునని స్పష్టమగుచున్నది. సర్వకామములను పరిత్యజించినచో సర్వకర్మసంన్యాసము సిద్ధించును, “స యథాకామో భవతి తత్క్రతుర్భవతి యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే” అజ్ఞాని యెట్టి కోరికకలవాడగునో అట్టికోరిక కనుగుణమగు సంకల్పముకలవాడగును. ఎట్టి సంకల్పము కలవాడగునో అట్టి కర్మల నాచరించునని బోధించు శ్రుతివలనను, “యద్యద్ధి కురుతే కర్మ తత్తత్కామస్య చేష్టితమ్” ఏ యే కర్మల నాచరించునో అదంతయు కాముని చేష్టితమే అను స్మృతివలనను కామమువలననే కర్మలనుచేయునని సిద్ధించుచున్నది. సుషుప్తియం దేసంకల్పము లేమిఁజేసి యెవడును చలించుటకు సమర్థుడు కాడు. కాన లౌకిక, వైదిక, కర్మాభావము సిద్ధింపవలయుననిన సర్వసంకల్పసంన్యాసమే హేతువు, అనున్యాయమున కర్మమాత్రము కామచేష్టితమనుటయందు ప్రమాణము. కాన, శ్రీకృష్ణపరమాత్మ “సర్వసంకల్పసంన్యాసీ” అను వాక్యమువలన సర్వకామములను, సర్వకర్మలను విడిపించుచుండెను. అనగా యోగారూఢు డేకామములు, ఏకర్మలు లేనివాడై యుండవలెనని యాశయము, ॥౪॥

మానుజేయు యతికి యెపుడు యోగారూఢత్వము సిద్ధించును? అను శంకను “యదాహి” అను శ్లోకముచే తొలగించుచుండెను. “దత్యగుణకర్మాదులు మంచివి” అను బుద్ధులనెడి సర్వవిషయక సంకల్పములను పరిత్యజించు స్వభావముకలవాడు “సర్వసంకల్పసంన్యాసీ” అని యనుపించుకొనును. అనగా “సంకల్పమూలాః కామా వై యజ్ఞాస్సంకల్పసంభవాః” కామములు సంకల్పమువలన జనించును. (యజ్ఞములు సంకల్పసంభవములు) అను స్మృతివలన యేసంకల్పములవలన వైషయిక కామములు జనించునో అధిష్ఠానమగు యాత్మయాథాత్మ్యజ్ఞానముచే ఆరోపితము కనుకనే మిథ్యాభూతములు శుక్తిరజతాదులవలె యవభాసనములు నగు ద్రవ్యాదులయందు సమీచీనత్వబుద్ధు లనెడి అట్టిసంకల్పములు జనింపవు. అట్టివాడు ప్రత్యగ్దృష్టిచే- సర్వము బ్రహ్మమాత్రస్వరూపమగుటవలన అక్రియారహితమగు సర్వసంకల్పములను సన్యసించును. అట్టి “సర్వంబ్రహ్మ” అను సర్వత్ర బ్రహ్మదర్శనశీలుడు బ్రహ్మవేత్త యగు యతి యేకాలమునందు “నేన్ద్రియార్థేషు న కర్మ స్వనుషజ్జతే” ఇంద్రియార్థములగు భిక్షాటనాదులయందు, దృష్టమగు శబ్దస్పర్శరూపరసగంధాదులయందు, ఒకానొక పూర్వసంస్కారముచే

గీ॥ ఉద్ధరే దాత్మనాఽఽత్మానం నాత్మాన మవసాదయేత్।
ఆత్మైవ హ్యాత్మనో బంధు రాత్మైవ రిపు రాత్మనః ॥ ॥౫॥

పదవిభాగము:— ఉద్ధరేత్– ఆత్మనా– న– ఆత్మానం– అవసాదయేత్– ఆత్మా– ఏవ– హి– ఆత్మనః– బంధుః– ఆత్మా– ఏవ– రిపుః– ఆత్మనః॥ ॥౫॥

ప్రతిపదార్థము:— సంసారసాగరేనిమగ్నం= (ఈపదములు అధ్యాహార్యములు) సంసారసముద్రము నందు మునిగియున్న; ఆత్మానం=ఆత్మను; ఆత్మనా=ఆత్మచేతనే; (తనచేతనే) ఉద్ధరేత్ ఉత్ హరేత్=మీదుగ లేవతీయవలెను. అనగా యోగారూఢమైనదానినిగ చేయవలెను. ఆత్మానం=ఆత్మను; నావసాదయేత్= (సంసారసాగరమునందు) మునుగుదానినిగ చేయరాదు. హి=ఏకారణమువలన; ఆత్మైవ=ఆత్మయే; ఆత్మనః=ఆత్మకు; (తనకు) బంధుః– బంధువు; ఆత్మైవ=ఆత్మయే; ఆత్మనః– తనకు; రిపుః=శత్రువు. ॥౫॥

---

కర్తవ్యముగ ప్రాప్తమైన స్నానశౌచాదికర్మలయందు "భోక్తృభోగ్యభోజనములు, కర్తృకారణకార్యములు మిథ్య" అను బుద్ధిచే ఆసక్తిని చేయడు. అనగా నేను భుజించుచుంటిని, నేనుచేయుచుంటిని అనెడి భోక్తృకర్తృతాదాత్మ్యాపత్తినిచేయడు మరేమి చేయు ననిన అసంగుడై, ఉదాసీనుడై, అంతట సాక్షిభూతుడైయుండును.

లేక ప్రాచీనసంస్కారానురూపమగు ప్రవృత్తియే అనుషక్తి యనఁబడును. అట్టి యనుషక్తిని చేయడు. అనగా ప్రవృత్తి కామమువలన జనించును. కామము సంకల్పమువలన జనించును. శబ్దాద్యాశ్రయములయందు మిథ్యాత్వదర్శనముచే సర్వసంకల్పములు సంన్యస్తమగుటవలన కారణములేనిచో కార్యము సంభవింపదను న్యాయముచే విద్వాంసునకు శబ్దస్పర్శరూపరసగంధములయందు, కర్మలయందున్న అనుషంగము లేకుండుట యుక్తమే,

లేక– అధిష్ఠానాజ్ఞానదోషముచే శుక్తియందు రజతజ్ఞానమువలె నిర్విశేషము అద్వితీయము నగు పరబ్రహ్మమునందు ఆత్మాజ్ఞానముచే ఘటపటాదివిపరీతప్రత్యయములు సంభవించును. అట్టి విపరీతప్రత్యయముల నన్నిటిని చిద్వృత్తిచే బ్రహ్మమునందు లయింపచేసుకొనుటకు తగు స్వభావముకల బ్రహ్మవేత్త "సర్వసంకల్ప సంన్యాసీ" అని యనుపించుకొనును. అనగా విజాతీయప్రత్యయ(జ్ఞాన)ములను ప్రవిలాపనచేయుచు సజాతీయ ప్రత్యయావృత్తిని చేయు బ్రహ్మవేత్త "సర్వసంకల్పసంన్యాసీ"అని యనుపించుకొను నని యర్థము.

సర్వత్ర బ్రహ్మమాత్రగ్రహణస్వభావముకల బుద్ధివృత్తియొక్క స్థిరీభావదశయందు ఆభాసమాత్రమువలన ప్రతీయమానము అగు విషయములయందు, కర్మలయందు చక్షురాదీంద్రియములచే ఆయావిషయగ్రహణకర్మలయం దనుషక్తిని చేయడో, (అనుషక్తియనగ అకస్మాత్తుగ దృష్టార్థానురూపముగ తిరిగి వృత్తియొక్క పరిణతియే) దానిని చక్షురాదీంద్రియములచే గ్రహింపకుండగ దృష్టమగు విషయములను, తద్వృత్తిద్రష్టను త్రిప్పి బ్రహ్మమునందు ప్రవిలాపనచేయుచు ద్రష్టృదర్శనదృశ్యభేదభిన్నమగు సర్వప్రపంచమును బ్రహ్మమాత్రముగ నెపుడు చూచునో అట్టి సమయమున యోగారూఢు డని చెప్పబడును. సర్వమునకు, తనకును యప్రతిబద్ధమగు బ్రహ్మమాత్రాకారవృత్తి యోగమనఁబడును. అట్టి యోగమునం దారూఢుడు యోగారూఢు డనఁబడును. ఇట్టివాడే స్థితప్రజ్ఞుడు. జీవన్ముక్తుడు అని పండితులు పరస్పరము చెప్పుకొనెదరు. "విజాన న్విద్వాన్। భవతే నాతివాదీ ఆత్మక్రీడ ఆత్మరతిః క్రియావాన్" అను శ్రుతిప్రసిద్ధుడే స్థితప్రజ్ఞుడే యని సూచించుట కీశ్లోకమున "హి" అను శబ్దము ప్రయోగింపబడెను. ॥౪॥

పరమార్థప్రకా:—"యదా హి" అను శ్లోకముచే యోగారూఢుని స్వరూపమును జెప్పుచుండెను.

ఏకాలమున శబ్దాదివిషయములయందు, కర్మలయందును అప్రయత్నముగ ననుషక్తిని పొందడో కేవలము కర్మేంద్రియనిరోధమాత్రమే కాక సర్వవిషయభోగములకు కారణమగు సర్వసంకల్పములను ఎవడు పరిత్యజించునో అట్టిసమయమున వాడు యోగారూఢు డని చెప్పబడును, ఇతరుడు యోగారూఢుడు కాడు. ॥౪॥

**శాంకరభాష్యమ్:—**

యదైవం యోగారూఢ స్తదా తేనాత్మాఽఽత్మనోద్ధృతో భవతి సంసారా దనర్థజాతా దతః- ఉద్ధరే త్సంసారసాగరే నిమగ్న మాత్మనాఽఽత్మానం తత ఉత్ ఊర్ధ్వం హరే దుద్ధరే ద్యోగారూఢతా మాపాదయే దిత్యర్థః। నాత్మాన మవసాదయే న్నాధో నయే న్నాధో గమయేత్। ఆత్మైవ హి యస్మా దాత్మనో బన్ధుః। నహ్యన్యః కశ్చి ద్బన్ధు ర్య స్సంసారముక్తయే

**శాంకరభాష్యార్థతత్త్వబోధిని:—**

పూర్వోక్తవిధముగనెపుడు యోగారూఢుడగునో యపుడు అనర్థసంకులమగు సంసారమునుండి తనచేదానుద్ధరింపబడును. కాన సంసారసాగరమగ్నుడగుతననుతానేయుద్ధరించుకొననగును (అనగా దనకు యోగారూఢత్వమును సంపాదించుకొనవలెనని యర్థము.) ఆత్మావసాదనమును చేయరాదు. (అనగా యాత్మను అధోగతిపాలు చేయరాదని యర్థము,) సంసారమునుండి విని

—• ౬వ అధ్యాయము — ౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు •—

ఎవ డేసమయమున యోగారూఢు డగునో అట్టిసమయమున నట్టివానిచే యాత్మ సంసారానర్థసముదాయమునుండి నుద్ధృతమగును. కానవివేకయుక్తమగు మనస్సుచే సంసారసముద్రమునందు మునిగిన జీవస్వరూపమగు తననుసంసారసముద్రమునుండి యుద్ధరించుకొనవలెను. అనగా విషయాసక్తిపరిత్యాగపూర్వకముగ యోగారూఢత్వమును బొందించవలెను. కాని విషయాసక్తిచే జీవస్వరూపమగు తననుసంసారసముద్రమున మునుగునటులు చేయరాదు. ఎందువలనననిన? మనస్సే సంసారబంధనమునుండి మోచకమగుటచే తనకు బంధువు. ఇతరుడు కానేరడు. లౌకికబంధువు స్నేహానుబంధముచే బంధహేతువేకాని బంధమోచకుడు కాడు. పట్టుకాయయందు ప్రవేశించి యచటనేయుండి బంధింపబడు పట్టుపురుగువలె మనస్సే విషయబంధక మగుటంజేసి తనకు (జీవునకు) శత్రువు. బాహ్యశత్రువు కూడ మనఃప్రయుక్తుడగుటచే మనస్సే జీవునకు శత్రువని నిశ్చయముగ జెప్పుట యుక్తమే ॥౫॥

శంకరానందీయము:— ముముక్షువు దుర్లభమగు మనుష్యదేహమునుపొంది మఱియు సదసద్వివేకయోగ్యమగు దుర్లభమైన బ్రాహ్మణదేహమునుపొంది తన యభిప్రాయానుసారమనుష్ఠింపబడిన శ్రౌతస్మార్తాది సత్కర్మలచేతను, భక్తిచేతను, ప్రసన్ననిగ జేసుకొనిన పరమేశ్వరునియొక్క యనుగ్రహముతో గూడి శమదమాదిసాధనసంపత్తిచే సద్గురువులవలన శ్రవణమననములు నాచరించి "బ్రహ్మైవాహం" అని స్వాత్మచే బ్రహ్మస్వరూపమును దెలిసికొని యోగారూఢుడైనవాడై చిదేకరసబ్రహ్మస్వరూపముచే నెపుడుండునో అపుడతడు సంసారదుఃఖసముద్రమునందు మునిగిన తనను తానే యుద్ధరించి మోక్షసామ్రాజ్యసుఖమునందు తనను స్థాపనజేసినవా డగును. కాన బ్రాహ్మణాదులు తమకు గల మనుష్యత్వముయొక్కయు, బ్రాహ్మణత్వముయొక్కయు, వివేకముయొక్కయు సాఫల్యముకొఱకు సర్వమును సన్యసించి ప్రయత్నపూర్వకముగ సంసారసాగరనిమగ్నమగు ఆత్మయొక్క సముద్ధరణ మవశ్యము కర్తవ్యమని "ఉద్ధరే దాత్మనాత్మానం" అను శ్లోకముచే జెప్పుచుండెను.

పుత్రమిత్రకళత్రాదివిషయకమహామోహమనెడి యావర్త (సుళ్లు) శతములతో వ్యాకులమైనట్టియు, కామక్రోధలోభాహంకారాదిచిత్తవికారములనెడి మహాగ్రాహముల(మొసళ్ల)తో సముజ్జృంభితమైనట్టిన్ని, అనేకవిధములగు మహారోగములనెడి తిమితిమింగిలములకోట్లచే విరాజిల్లునట్టిన్ని, అశనాపిపాసలనెడి మహానిలునిచే ముద్వేల్లితమైనట్టిన్ని, ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికములనెడి తాపత్రయరూపంబైన నిబిడబడబానలముయొక్క జ్వాలామాలికలచే చుట్టువారుకొనబడినట్టిన్ని, స్వేష్టజననాశముచే బయలువెడలిన ప్రలాపములనెడి మహాధ్వనిచే విఘూర్ణితంబైనట్టిన్ని, నిత్యనిరంతరదుర్వాసనాశైవాలపటలముచే వ్యాప్తమైనట్టిన్ని విషయములనెడి విషముచేపరిపూర్ణమైన సంసారార్ణవమునందు "నిమగ్నం" జన్మమృత్యుజరాదిదుఃఖముచే "హతోఽస్మి" అని ఆక్రోశనమును జేయుచున్న తనను శ్రద్ధాభక్తులచే సమారాధితమైన పరమేశ్వరునియొక్క యనుగ్రహము కలిగినట్టిన్ని, సదసద్వి

శాంకరభాష్యమ్:—

భవతి। బన్ధురపి తావ న్మోక్షంప్రతి ప్రతికూల ఏవ స్నేహాదిబంధనాయతనత్వా త్తస్మా ద్యుక్త మవధారణ మాత్మైవ హ్యాత్మనో బన్ధురితి। ఆత్మైవ రిపు శ్శత్రు ర్యోఽన్యోఽపకారీ బాహ్యశ్శత్రుస్సోఽప్యాత్మప్రయుక్త ఏవేతి యుక్త మేవావధారణ మాత్మైవ రిపురాత్మన ఇతి॥౫॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ర్ముక్తుడగుటకై తనకు తానే బంధువగును కాని యితరుడెవడును బంధువు కానేరడు. లౌకిక బంధువుకూడ స్నేహాదిబంధనమునకు కారణమగుటవలన మోక్షమువిషయమై ప్రతికూలుడే యగును. కాన "ఆత్మైవ హ్యాత్మనో బంధుః" అను స్థలమున యవధారణార్థకమగు "ఏవ"

---

వివేకము శమము దమము మొదలైన సాధనములు గలిగినట్టిన్ని; శ్రవణాదులచే జనించిన యాత్మజ్ఞానముకల తనచే తనే ఉద్ధరింపబడుయును. తన యుద్ధరణయందు పైజెప్పబడిన లక్షణములుగల తానే యుత్తమమైన సాధనము. మరియితరసాధన మేదియులేదు. పైజెప్పబడిన సాధకతమము సిద్ధించినపుడే సాధనాంతరము, కార్యము సిద్ధించును. సాధకతమమే సిద్ధించనిచో సాధనాంతరము, కార్యము సుతరాం సిద్ధింపదు. కాన శ్రేష్ఠ యగు ముముక్షువు పైన జెప్పబడిన లక్షణములుగల తనచేతనే స్వోద్ధరణము చేయనగును. మహాజ్వరాదిప్రచండరోగదుఃఖమునందుమునిగిన తనను ప్రతికూలమైన యపథ్యాదులను విడచి దివ్యౌషధపథ్యసేవననిరతుడై స్వయముగ తానే ప్రయత్నపూర్వకముగ రోగమునుండి ఎట్లు యుద్ధరించుకొనునో అట్లే ఆపస్తంబమహర్షి చే జెప్పబడిన భూతదాహీయములగు క్రోధాదిదుర్గుణములను, తత్కార్యములను వదలి, ప్రతికూలమగు సర్వకర్మలను సన్యసించి, అమానిత్వాదాంభికత్వాద్యాత్మగుణముల సేవచే సద్గురుసన్నిధియందు శ్రవణాదుల నాచరించి దానిచే యాత్మజ్ఞానమును పొంది యోగారూఢుడై తనను తానే సంసారసాగరమునుండి యుద్ధరించుకొనవలెను.

ఆత్మోద్ధరణమనగ అవిద్యాతత్కార్యసంబంధలేశరహితమగు సచ్చిదానందైకరసస్వరూపముచే నవస్థానమే. ఇదియే స్వస్వరూపముచే నవస్థానమగు యాత్మయొక్క మోక్షము. అట్టిస్వస్వరూపేణావస్థానరూపమగు మోక్షమునే నిరంతరబ్రహ్మయోగనిష్ఠచే ముముక్షువు సంపాదింపవలయును. అట్లు కాక అనాద్యవిద్యావాసనాకళంకరితుడై బహిర్ముఖుడై రోగి జిహ్వాదోషవేగకళంకితుడై తన యారోగ్యమునకు విరుద్ధమగు నట్టి యపథ్యవస్తువులను సేవించి తనను తానే నశింపజేసుకొనినట్లు బాహ్యవాసనలచే ఆత్మేతరణప్రతికూలమగు బహిఃప్రవృత్తి నవలంబించి తనను తానే నశింపజేసుకొనును. అట్లు నశింపజేసుకొనక "వాచం యచ్ఛ మనో యచ్ఛ యచ్ఛ ప్రాణేన్ద్రియాణి చ। ఆత్మాన మాత్మనా యచ్ఛ నభూయః కల్పసేఽధ్వనః" అను న్యాయముచే వాగాదిసర్వేంద్రియములను మనస్సును ప్రాణమును నియమనముచేసి అనగా వాగాదీంద్రియములు శబ్దాదిబాహ్యవిషయములయందు ప్రవేశింపకుండగజేసి స్వోద్ధరణమునే జేయవలయును.

బురదయందు దిగబడిన గజము మొదలగు పశువులను యితరగజాదు లుద్ధరించినటుల తనభార్యాపుత్రాదిబంధువులే కన్యాదానము, శ్రాద్ధాదులు మొదలగువాటిచేతనే యుద్ధరించెదరు. తనకుప్రయాస యెందులకు? అను శంకను "ఆత్మైవ" అను దానిచే తొలిగించుచుండెను.

తన యజ్ఞానముచే జననమరణదుఃఖప్రవాహమునందు మునిగి యాధ్యాత్మికాదితాపత్రయాగ్నిచే సంతప్యమానమైన తనకు(ఆత్మకు) తానే(ఆత్మయే) బంధువు. "బంధుః" అనగా బధ్నాతీతిబంధుః" సంసారదుఃఖమునుండి విడిపించి నిరతిశయమోక్షసుఖముచే బంధించునది గాన ఆత్మయే "బంధుః" అని యనుపించుకొనును. ఆత్మయే సంసారదుఃఖసముద్రతారకమని యాశయము. మహారోగగ్రస్తుడు తాను పథ్యాదిసేవ చేయక యితరులచే చేయబడిన దివ్యౌషధసేవచే తనరోగ మెటుల నివర్తింపదో అట్లే పుత్రాదికృతకన్యాదానశ్రాద్ధాదుల కవిషయుడు కాన

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కారముతగును. అపకారియగు బాహ్యశత్రువుగూడ యాత్మ్రపయుక్తుడే గాన తననుద్ధరించుకొననిచో తానే తనకు శత్రువగునని "ఆత్మైవ రిపురాత్మనః" అను స్థలమునం దవధారణార్థకమగు "ఏవ" కారమును యుక్తమే. ||౫||

తాను స్వయముగ శ్రవణమనననిదిధ్యాసనల నాచరింపనిచో పుత్రాదికృతకర్మలచే తాను తరింపడు. తాను తరింపక పోవుటయే కాక పుత్రాదులు స్నేహాస్పదులగుటచే బంధహేతువులే యగుదురు. ముక్తిహేతువులు కారు. కనుకనే గీతయందు "ఆత్మైవ హ్యాత్మనో బంధుః" అనుచోట "ఆత్మైవ" అని అవధారణార్థకముగ "ఏవ" అను శబ్దము ప్రయోగింపబడెను. ఇట్లు ఏవకార మవధారణార్థ మగుటవలన ఆత్మయే (తానే) ఆత్మకు (తనకు) బంధువు ఇతరు డెవడు కాడని తేలిన యాశయము. తనకు ప్రాప్తించిన క్షుత్పిపాసాదులు యితరుల భక్షణోదకపానాదులచే నివర్తింపక తనచే నాచరింపబడిన భక్షణోదకపానాదులచే నివర్తించినటుల తనచే నాచరింపబడిన శ్రవణాదులచేతనే తాను తరించునుకాని యితరులచే నాచరింపబడిన సుకృతవిశేషములచే తాను తరింపడని యాశయము. కనుకనే "ఏతైరుపాయై ర్యతతే యస్తు విద్వాంస్తస్యైష ఆత్మా విశతే బ్రహ్మధామ" శ్రవణమననాద్యుపాయములచే నెవడు ఆత్మస్వరూపమును తెలిసికొనునో వాడే ముక్తుడగునని యీ గీతయందుండు "హి" అను శబ్దము ద్యోతన చేయుచున్నది.

ఆత్మనుద్దేశించి యాత్మయే బంధువగుచో తనకంటె నితరమగు వారందరు శత్రువులే యనియు, ఆత్మ యెప్పుడును బంధువే యనియు సిద్ధమగుచున్నది. అట్లగుచో బంధువగు తాను తనకెన్నడు అపకారి కాడు అట్లయిన యందరికి ముక్తి సిద్ధమే యని శంకింపజనదు, తన యుద్ధరణకొఱకు యత్నమును జేయని బహిర్ముఖుడు తనకు తానే శత్రువగు నని "ఆత్మైవ రిపు రాత్మనః" అని చెప్పుచుండెను.

"శాన్తో దాన్తః" ఇత్యాదిశ్రుతివిహితమగు శాంత్యాదులచే ఆత్మోద్ధరణకొఱకై యతి సమాధినిష్ఠ ననుసరింపడో జిహ్వాదోషముచే నపథ్యమును జేయు రోగి తనకు తానే శత్రువగునటుల ఆయతి కూడ తనకు తానే శత్రువు. అనగా శమదమాదిసాధనసామగ్రి నవలంబింపక స్వోద్ధరణసాధనమగు బ్రహ్మయోగనిష్ఠయం దుండక అనాద్యవిద్యావాసనావేగమువలన విదేహముక్తిహేతువగు జ్ఞానమును నశింపజేయు బాహ్యమునే యెవ డవలంబించునో అట్టియతి తనకు తానే మారకు డగును. ఇతరు డెవడు అపకారకుడులేడు. పరుడు బాహ్యకార్యములనుద్దేశించియే యపకారకుడు కాని ముక్తినిద్దేశించి యపకారకుడు కాడు. కనుకనే "ఆత్మైవ రిపు రాత్మనః" అనుచోట నిశ్చయార్థకముగ "ఏవ" అనునది ప్రయోగింపబడెను. ముక్తికి హేతువగు సర్వాత్మత్వసిద్ధికి బాహ్యాలంబనత్వము విరోధి. అపథ్యమును సేవించు రోగి తనకు తానే నాశకుడైనటుల బాహ్యాలంబనము కలవాడు తనకు తానే శత్రువు. యిది ప్రసిద్ధమే యని ద్యోతన చేయుటకు గీతయందు "హి" అనుపదము ప్రయోగింపబడెను. ||౫||

శ్రీధరీయము:— విషయములం దాసక్తిని విడచినచో మోక్షము ప్రాప్తించును. విషయములయం దాసక్తు డగుచో బంధము ప్రాప్తించును కాన నీరెండువిషయములను జక్కగ బరిశీలించి రాగాదిస్వభావమును పరిత్యజింపవలెనని "ఉద్ధరేత్" అను శ్లోకముచే జెప్పుచుండెను.

వివేకయుక్తమగు యాత్మచేతనే తనను సంసారమునుండి యుద్ధరింపవలెను. క్రిందికి త్రొక్కి వేయరాదు. మనస్సాంగత్యముగల దెందువలననిన? మనస్సాంగత్యమును త్యజించిన యాత్మయే ఆత్మకు (తనకు) బంధువు. మనస్సాంగత్యముగల యాత్మయే తనకు శత్రువు. ||౬||

పరమార్థప్రపా:— విషయములను పరిత్యజించిన మోక్షము, విషయములయం దాసక్తియున్నచో బంధము కాన యీ రెంటిని లెస్సగ నాలోచించి రాగాదిస్వభావమును త్యజింపవలెనని "ఉద్ధరేత్" అను శ్లోకముచే జెప్పుచుండెను. వివేకయుక్తమగు మనస్సుచే జీవదశాపన్నమగు తనను సంసారమునుండి యుద్ధరింపవలెను.

గీ॥ బంధు రాత్మాఽఽత్మన స్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ॥ ॥౬॥

పదవిభాగము :— బంధుః- ఆత్మా- ఆత్మనః- తస్య- యేన- ఆత్మా- ఏవ- ఆత్మనా- జితః- అనాత్మనః- తు- శత్రుత్వే- వర్తేత- ఆత్మా- ఏవ- శత్రువత్ ॥ ॥౬॥

ప్రతిపదార్థము:— యేన=ఏ; ఆత్మనా=ఆత్మచే; ఆత్మా=కార్యకరణసంఘాతము; జితః=వశీకృతమో; సః=అట్టి; ఆత్మా=ఆత్మ; ఆత్మనః=తనకు; బంధుః=బంధువు; అనాత్మనస్తు=కార్యకరణసంఘాతమును వశీకరణము చేసికొనని వానికి; ఆత్మైవ=తానే; శత్రువత్=బహిశ్శత్రువువలె; శత్రుత్వే=శత్రుభావమునందు; వర్తేత=ఉండెడిని. ॥౬॥

---

శాంకరభాష్యమ్:—

ఆత్మైవ బంధు రాత్మైవ రిపు రాత్మన ఇత్యుక్తం, తత్ర కిం లక్షణ ఆత్మనో బంధుః కిం లక్షణో వాత్మనో రిపు రిత్యుచ్యతే— బంధు రాత్మాత్మన స్తస్య తస్యాత్మనః స ఆత్మా బంధు ర్యేనాత్మనాత్మైవ జిత ఆత్మా కార్యకరణ సంఘాతో యేన వశీకృతో జితేంద్రియ ఇత్యర్థః । అనాత్మన స్త్వజితాత్మనస్తు శత్రుత్వే శత్రుభావే వర్తేతాత్మైవ శత్రువద్యథానాత్మా శత్రు రాత్మనోపకారీ తథాత్మాత్మనోఽపకారే వర్తే తేత్యర్థః ॥ ॥౬॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఆత్మయే బంధువు, ఆత్మయే తనకు శత్రువు అని చెప్పఁబడెను. అందు యేలక్షణములు కలయాత్మ యాత్మకు బంధువు? యే లక్షణములుకలయాత్మ యాత్మకు శత్రువు" అను శంకను తొలగించుటకు "బంధుః" అని చెప్ప మొదలిడెను.

యెవడు శరీరేంద్రియసముదాయమును స్వాధీనమొనరించుకొనునో అట్టి తానే తనకు బంధువు. శరీరేంద్రియ సంఘాతమునెవడు స్వాధీనమొనగించుకొనడో అనగా నెవడజితేంద్రియుడో అట్టివానికి ప్రసిద్ధశత్రువువలె తానే శత్రుభావము నందుండును. ॥౬॥

---

ఇంతియేకాని యధఃపతన మాచరింపరాదు, ఎందువలననిన "మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అనున్యాయమున మనస్సే వివేకయుక్తమగుచో మోక్షదాయకమై బంధు వగును. మనస్సే రాగాదిస్వభావము కలదగుచో బంధదాయకమై శత్రువగును. ॥౫॥

—:౬వ.అధ్యాయము —౬వ.శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— ఎట్టిలక్షణములు కల యాత్మ తనకు బంధువు? ఎట్టిలక్షణములు కల యాత్మ తనకు శత్రువు? అను శంకను "బంధుః" అను శ్లోకముచే తొలగించుచుండెను.

వివేకయుక్తమగు మనస్సుచే నెవనిచేత కార్యకరణసంఘాతము జయింపబడెనో అనగా శస్త్రాదులచే కార్యకరణసంఘాతమును జయించినను అట్టి జయ మనర్థదాయకమే కాని మోక్షదాయకము కాదు కావున నట్లు కాక వివేకయుక్తమగు మనస్సుచే నెవడు కార్యకరణసంఘాతమును జయించునో వాని స్వరూపము ఉచ్ఛృంఖల ప్రవృత్తినిరోధకమై తనకు హితమును సమకూర్చున దగుటచే బంధు వనబడును. ఎవని మనస్సుచే కార్యకరణసంఘాతము జయింపబడదో వాని స్వరూపము బాహ్యశత్రువువలె ఉచ్ఛృంఖలప్రవృత్తిచే తనచేతనే తన కనిష్ట మాచరింపబడుటవలన శత్రు వనఁబడును. ॥౬॥

శంకరానందీయము:— పూర్వశ్లోకమునందు తనకు తానే బంధువనియు, శత్రువనియు చెప్పబడెను. ఆ విషయమునే "బంధుః" అను యీ శ్లోకమునందు స్పష్టపరచుచుండెను.

ఎవఁడు బంధకగుణములగు అనాద్యవిద్యావాసనలచేతను, రాగద్వేషాదులచేతను ఇంద్రియపరవశుఁడై దేహేంద్రియాది ప్రవృత్తినే స్వాభావికమైనదానినిగను, తన కిష్టమైనదానినిగను తలఁచి సంసారనిమగ్నుఁడగునో అట్టివానికి- సదసద్వివేకము కలిగినట్టిన్ని, తీవ్రవైరాగ్యము కలిగినట్టిన్ని, మోక్షేచ్ఛచే శ్రవణాదుల నాచరించినట్టిన్ని, తెలియఁబడినయాత్మతత్త్వము కలిగినట్టిన్ని. అమానిత్వాదిగుణములతో కూడిన తనచే రాగద్వేషాదులను తిరస్కరించి కార్యకరణసంఘాతము (శరీరేంద్రియాదులు) జయించఁబడినదైన తనకుతానే బంధువగును. కార్యకరణసంఘాతజయము కార్యకరణప్రవృత్తికి విరోధియగు గుణముల నాశ్రయించియే చేయఁదగును. అదియెట్లనిన

(1) దేహము, శిరస్సు, కంఠము వీటిని సమానముగ ధరించుటచేతను ధైర్యముచేతను దేహప్రవృత్తి జయింపఁబడును.

(2) ప్రాణాయామముచేతను, శాంతిచేతను ప్రాణప్రవృత్తి జయింపఁబడును.

(3) వైరాగ్యముచేతను, శాంతిచేతను ఇంద్రియప్రవృత్తియు, మనఃప్రవృత్తియు జయింపఁబడును.

(4) సదసద్వివేకవిజ్ఞానముచేతను, తీవ్రమోక్షేచ్ఛచేతను బుద్ధిప్రవృత్తి జయింపఁబడును.

(5) బ్రహ్మమునందాత్మభావముచే నహంకారప్రవృత్తి జయింపఁబడును. ఇట్టిరీతిని దేహేంద్రియాదిసంఘాతరూపమగు యాత్మ యెవనిచే వశీకృతమో అట్టివాఁడు కార్యకరణసంఘాతమును జయించిన యాత్మ యనఁబడును. ఇట్టి యాత్మ- పూర్వమునందు చెప్పఁబడిన నహంకారమమకారావిష్టుఁడై సంసరణశీలుఁడైనయాత్మకు బంధువు (తారకుఁడు). ఎట్లు తారకుఁడనిన? తన తరణమునకు సాధనమైన జ్ఞానమునకు ప్రతిబంధకము లేకుండునట్లు తనచే నాచరింపఁబడు సమాధినిష్ఠకు ప్రతికూలమైన పూర్వవాసనాకృతమగు కార్యకరణసంఘాతప్రవృత్తిని పూర్వోక్తవిధమున నిరోధించి సమాధియందే ప్రవర్తించుటవలన బంధువు (తారకుఁడు) అనఁబడును.

ఈచెప్పుటవలన దేహేంద్రియమనోబుద్ధ్యాదు లనుకూలమగుచో సమాధి, జ్ఞానము, మోక్షము సిద్ధించును. ప్రతికూలమగుచో సమాధి సిద్ధింపదు. జ్ఞానము సిద్ధింపదు. మోక్షము సిద్ధింపదు. కాన దేహేంద్రియమనోబుద్ధ్యాదుల ప్రవృత్తికి విరోధియగు పైగుణముల నాశ్రయించి ముముక్షువగు యతి యవశ్యము దేహేంద్రియాదిజయము చేయఁదగునని సూచింపఁబడెను.

ఎవఁడు దేహేంద్రియాదులను జయింపఁడో అట్టివాఁడు తనకుతానే శత్రు వగునని "అనాత్మనస్తు శత్రుత్వే" అను యుత్తరార్థముచే జెప్పుచుండెను.

రోగముకలవాఁడు రోగమునకు విరోధియగు నపథ్యమును జేసిన తనకు తానే శత్రువగునట్లు దేహేంద్రియాదులు తమతమవాసనానురూపమగు ప్రవృత్తిచే సమాధినిష్ఠకు ప్రతికూలమగుచో నింద్రియప్రవృత్త్యనుసారి యాత్మయు స్వోద్ధరణక్రియకు ప్రతికూలమగు దేహాద్యనుసారియగుటవలన తనకు తానే శత్రువువలె యగును. అనఁగా అట్టివాఁడు "నావిరతో దుశ్చరితాత్, యచ్ఛేద్వాఙ్మనసీ ప్రాజ్ఞః, వాచం యచ్ఛ" ఇత్యాదిశ్రుతిస్మృత్యాదులచె ప్పఁబడిన మోక్షమార్గమును తిరస్కరించి వాసనానురూపముగ స్వముక్తికి విరోధియగు బహిఃప్రవృత్తి నాశ్రయించుటవలన తనకు తానే శత్రువగుట యుక్తమే. కాన శ్రవణాదిజన్యజ్ఞానము కల ముముక్షువగు యతి విదేహకైవల్యసిద్ధికొఱకు "కర్తృకరణభోక్తృభోగ్యాదిసర్వదృశ్యములు మిథ్య" అను బుద్ధిచేతను, తీవ్రవైరాగ్యముచేతను బంధకారియగు మిథ్యావిషయకమగు బాహ్యప్రవృత్తిని యరికట్టి బ్రహ్మయోగనిష్ఠనే యనుసరించి ప్రయత్నపూర్వకముగ ఆత్మోద్ధరణ మవశ్యము చేయఁదగును.

"ఉద్ధరేదాత్మనాఽఽత్మానం" అని తనను తానే యుద్ధరింపవలెనని చెప్పుటచే తనకే కర్తృత్వము తనకే కర్మత్వము చెప్పినట్లగును. ఇట్లు చెప్పుట లోకశాస్త్రవిరుద్ధము. ఎవఁడైన తనభుజముపై తానే యెక్కునా? ఇది విరుద్ధముకాదా? ఇట్లు విరుద్ధముగ జెప్పుట శ్రీకృష్ణపరమాత్మకు తగునా? యని శంకింపఁజనదు. గుణభేద మాశ్రయించి యొకనికే కర్తృత్వము, కర్మత్వము సంభవించును. అదియెట్లనిన? అజ్ఞానముచే నిర్జనారణ్యమునందు కాని హ్రదమునందు కాని, బురదయందు కాని దిగఁబడిన తనను వివేకియు, చతురుఁడు నగు తానే తరుశాఖను

కాని తీగెను కాని పట్టుకొని యుపాయముచే బురద మొదలగువాటినుండి యుద్ధరించునటుల స్వాజ్ఞానముచే సంసారమునందు నిమగ్నమైన తనను తానే శమదమసంన్యాసాదిసాధనసంపత్తిచే శ్రవణమనననిదిధ్యాసనాదుల నాచరించి వాటివలన కలిగిన కూటస్థాసంగచిద్రూపత్వవిజ్ఞానముచే దేహేంద్రియాదిసంబంధరహితునిగ తనను తెలిసికొని తనను కర్తృత్వభోక్తృత్వాది బంధమునుండి విడిపించుకొనును. కాన ఇట్లుఒకనికే కర్తృత్వకర్మత్వములు గుణభేదముచే ప్రాప్తించుచుండ, శ్రీకృష్ణపరమాత్మవచనము స్పష్టముగ బోధించుచుండ విరోధ మేమున్నది? ఏమియు లేదనియే స్పష్టమగుచున్నది. ||౬||

భాష్యోత్కర్ష దీపిక:— ఆత్మయే ఆత్మకు బంధువు. ఆత్మయే ఆత్మకు శత్రువు అని చెప్పబడెను. యెట్టిలక్షణములుకల ఆత్మ బంధువు? యెట్టిలక్షణములుకల యాత్మ శత్రువు అనుశంకపై 'బంధుః' అని చెప్పబొందలిడెను "యేన ఆత్మనాఽఽత్మైవ జితః, తస్యాఽత్మన స్స ఆత్మా బంధుః" యెవనిచే కార్యకరణసంఘాతము జయింపబడునో అనగా జితేంద్రియుడై యెవడు శ్రేయోభిముఖుడో యట్టి తానే తనకు బంధువు. "అనాత్మన స్తు" కార్యకరణసంఘాతము నెవడు జయింపడో అట్టివానికి "ఆత్మైవ" తానే తనకంటె యితరుడు తనకెట్లపకారి యో యట్లే "శత్రుత్వే వర్తేత" శత్రుభావమునందుండును. ఇట్టి యభిప్రాయముచేతనే మాటిమాటికి యాత్మశబ్దస్వారస్యము వలనను "ఉద్ధరే దాత్మనాఽఽత్మానం" అనుచోటగూడ తనకు తానే బంధువు, తనకు తానే శత్రువు అగుటవలన తానే తనను ద్ధరించుకొనవలెనని బోధించెను.

కొందరీ రెండుశ్లోకముల కన్యథా వ్యాఖ్యానము వ్రాసియుండిరి. అది యెట్లనిన?

ఇంద్రియార్థములయం దాసక్తి లేనిచో అట్టి సర్వసంకల్పసంన్యాసి కేమి ప్రయోజన మను శంకపై "ఉద్ధరేత్" అని చెప్పబొందలిడెను.

ఇట యుత్తరార్ధమునందుండు "ఆత్మా" అను పదమును పూర్వార్ధసమన్వయముకొఱ కనుషంగము చేయవలెను. అట్లగుచో "ఆత్మా" పూర్వ పూర్వానేకజన్మార్జితపుణ్యపుంజపరిపూర్ణ మగు యంతఃకరణము "ఆత్మానం" అంతఃకరణ మనెడి జడాశయమున నిమగ్న మగుటచే సర్వానర్థకారియగు కర్మను "ఆత్మనా" వివేకవైరాగ్యాదిసంపన్నునిచే "ఉద్ధరేత్" జడాశయమునుండి వేరుపరచవలెను. కాని స్వధర్మములగు కర్తృత్వాదులచే తిరస్కారము చేయరాదు. తనయొక్కయు, తనధర్మములయొక్కయు స్థితి ప్రత్యగధీనమగుటవలన తదధీనభూతము, ఇట్టి యుపకారము నాచరించెడి యంతఃకరణ యుద్ధరణము, తిరస్కారాకరణము న్యాయమే. ఇంద్రియార్థములయం దాసక్తుడగుచో "హవిషా కృష్ణవర్త్మేవ" (అగ్ని హవిస్సుచే తృప్తిపడనటుల) కామములు శాంతి చెందున అయా కామములకు విఘ్నము ప్రాప్తించినచో యా కామమే క్రోధరూపమును దాల్చుచుండుటచే నెన్నడునుసంసారనివృత్తి కాజాలదు. కాన "ఇంద్రియార్థే ష్వనాసక్తః" ఇంద్రియార్థములయం దనాసక్తుడై అని చెప్పుట యుక్తమే.

లేక "ఆత్మా" ప్రత్యగాత్మయగు యంతర్యామి "ఆత్మనా" వివేకాదిగుణసంపన్నమైన యంతఃకరణముచే "ఆత్మానం" పాదమునందు తగులుకొనిన కంటకమును కంటకముచేతనే యుద్ధరించినటుల కర్తృత్వాద్యభిమానకలుషితమైన యంతఃకరణను "ఉద్ధరేత్" కర్తృత్వాద్యభిమానకాలుష్యరహితముగ జేయవలెను. యెందులకిటుల చేయవలెననెదవా ? అనుశంకను తొలగించుటకు "నాత్మాన మవసాదయేత్" అని చెప్పెను. యెంతవరకంతఃకరణమును కర్తృత్వాద్యభిమానకాలుష్యరహితముగ జేయడో అంతవరకు తాను పరమాత్మతో విభక్తమయినటుల గోచరించును. యెప్పుడు యంతఃకరణమును కర్తృత్వాద్యభిమానకాలుష్యరహిత మొనరించునో అపుడే తనను పరమాత్మకంటె వేరుగ చేయనివాడగును. కాన పరమాత్మకంటె తనను వేరుచేయరాదు. అందుచే నంతఃకరణమును కర్తృత్వాద్యభిమానకాలుష్యరహితముగ జేయవలెనని యాశయము.

అట్లగుచో నా యంతఃకరణమే యాత్మ కుపకారకము, అపకారకమెట్లగునని శంకింపజనదు. ఒక విషమే (నాభియే) స్వభావమువలన మరణకారియు, గోమూత్రాదివిశేషములచే శుద్ధిజేయబడి యితరపదార్థములచే సమకూర్చబడి యౌషధరూపమై జీవనహేతువు యెట్లగుచున్నదో అట్లే యొకమనస్సే స్వభావసమాకారసంపన్నమై

నేరగుచు యుపకారకము, అపకారకము నగును. ఈవిషయమునే "ఆత్మైవ హ్యాత్మనో బంధుః" అను యుత్తరార్ధముచే స్పష్టపరచెను. "ఆత్మైవ" అంతఃకరణమే వివేకాదిగుణసంపన్నమై "ఆత్మనః" జీవునకు "బన్ధుః" బంధధ్వంసను చేయును. అట్లే "ఆత్మైవ రిపు రాత్మనః" వివేకాదిగుణశూన్యమగు యంతఃకరణమే స్వభావము వలన జీవునకు సర్వానర్థబంధహేతు వగుటవలన "రిపుః" శత్రువు అగుచున్నది. "ఆత్మైవ" అనుచోట "ఆత్మైవ రిపుః" అను రెండుస్థలములయందు ఏవకారములను బ్రయోగించు భగవదాశయమేమనిన ? యెచట దేవదత్తునకు యజ్ఞదత్తుడు బంధువని చెప్పబడునో, యెచట చైత్రునకు మైత్రుడు వైరియని చెప్పబడునో అచట. మిత్రత్వ శత్రుత్వములు చైతన్యమునకా ? లేక అంతఃకరణమునకా ? చైతన్య మపరిణామిగాన చైతన్యమునకు బంధుత్వము, రిపుత్వము సంభవింపవు. కాన నా రెండును యంతఃకరణమునకే యని చెప్పవలయును. యెందులకనిన నంతఃకరణము రాగమనెడి వృత్తిరూపమున పరిణమించినపుడు బంధుత్వము, ద్వేషమనెడి వృత్తిరూపమున పరిణమించినపుడు శత్రుత్వము. కాన నంతఃకరణమునకే బంధుత్వమును, శత్రుత్వమును 'బంధుః' అనుశ్లోకముచే స్పష్టపరచుచుండెను.

"తస్యాత్మనః" అట్టిజీవునకు "ఆత్మా" ఏజీవునిచే పూర్వమునందు చెప్పబడిన సహాయసంపత్తితో గూడిన యంతఃకరణద్వారా ఇంద్రియములతోగూడిన శరీరము "జితః" స్వాధీన మొనరించుకొనబడెనో యట్టి జీవుని యంతఃకరణము వానికి బంధువు ఎపు డంతఃకరణము రిపు వనుపించుకొనును అను శంకను తొలగించుటకే "అనాత్మనస్తు" అని చెప్పకుండలిడెను. పూర్వము నందాత్మశబ్దముచే జెప్పబడిన దేహము యెపుడు స్వాధీనము కాదో అపు డంతఃకరణమే శత్రువువలె నుండు నని తెలియనగును. అనికొందఱుయీరెండు శ్లోకములను వ్యాఖ్యానించిరి. ఈ శ్లోకములయందు మాటిమాటికి ఆత్మపరమగు నాత్మశబ్దప్రయోగస్వారస్యము ననుసరించి ఆత్మశబ్దమును దేహాదిపరముగ జెప్పిన పైవ్యాఖ్య యుపేక్షణీయము. అట్లు కానిచో ఆత్మశబ్దము ముఖ్యాముఖ్యవృత్తులు కలదగుటచే మఱియొక తీరునకూడ ననేకార్థము నిచట కల్పించుటకు శక్యమగును. అది యెట్లనిన ? "ఆత్మనా" ఈశ్వరునిచే "ఆత్మానం" జీవుని "ఉద్ధరేత్" సంసారమునుండి యుద్ధరింపవలెను. "నాత్మాన మవసాదయేత్" జీవుని సంసారపంకనిమగ్ననిగ చేయరాదు. "ఆత్మైవ" ఈశ్వరుడే "ఆత్మనః" జీవునకు "బంధుః" బంధువు. "ఆత్మైవ" ఈశ్వరుడే "ఆత్మనః" జీవునకు "రిపుః" శత్రువు. ఈశ్వరునికే బంధుత్వమును, శత్రుత్వమును, "బంధు రాత్మాఽఽత్మన స్తస్య" అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను. "తస్య" ఆజీవునకు "ఆత్మా" పరమేశ్వరుడే "బన్ధుః" ఉద్ధారకుడు. "యేనాత్మనా" భక్తియుక్తమగు యే మనస్సుచే "ఆత్మా" ఈశ్వరుడు "జితః" వశీకృతుడో స్వాధీనమొనరించుకొనబడెనో. "అనాత్మనస్తు" స్వాధీనమొనరించుకొననివానికి యీశ్వరుడే, "శత్రుత్వే వర్తేత" శత్రువువలె నుండును. అనగా యెవడు భక్తియుక్తమగు మనస్సుచే నీశ్వరుని స్వాధీన మొనరించుకొనునో వానికి భవబంధనాశకు డీశ్వరుడే యగును. యెవడట్టి మనస్సుచే నీశ్వరుని స్వాధీన మొనరించుకొనడో అట్టివాని కీశ్వరుడు శత్రువు భవబంధదాయి) యగును యని యాశయము.

లేదా మఱియొకతీరున గూడ వ్యాఖ్యానింపనగును. అది యెట్లనిన ? "ఆత్మనా" అనేకజన్మార్జిత పుణ్యపుంజముచే ప్రాప్తించిన మనుష్యదేహముచేతనే "ఆత్మాన ముద్ధరేత్" తనను ద్ధరింపవలెను. ఏందువలననిన? మనుష్యదేహమే తనకు బంధువు. మనుష్యదేహమే తనకు శత్రువు. మనుష్యదే[హ]మున మనకుంగల బంధుత్వమును, శత్రుత్వమును "బంధుః" అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను. యెవనిచే వివేకయుక్తమగు మనోద్వారమున దేహము జయింపబడునో అట్టివానికి మనుష్యదేహమే బంధువు. ఎవడు దేహమును వివేకయుక్తమగు మనస్సుచే జయింపడో అట్టివానికి దేహమే శత్రువువలె నుండును.

లేదా యీ శ్లోకములను మఱియొక విధమునగూడ వ్యాఖ్యానింప నగును. అది యెట్లనిన ? అఖండాకారబుద్ధిరూపముచే నహంకారమును "ఉద్ధరేత్" దేహమునందహంకారమును తొలగించి బ్రహ్మమునందే

గీ॥ జితాత్మనః ప్రశాన్తస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥ ॥౭॥

శ్లో॥ జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేన్ద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః ॥ ॥౮॥

**పదవిభాగము:— జితాత్మనః- ప్రశాన్తస్య- పరమాత్మా-సమాహితః- శీతోష్ణసుఖదుఃఖేషు-తథా-మానావమానయోః ॥** **॥౭॥**

ప్రతిపదార్థముః— జితాత్మనః=జయించబడిన కార్యకరణసంఘాతముకల; ప్రశాన్తస్య=ప్రసన్నమగునంతఃకరణముకల సంన్యాసికి; పరమాత్మా=పరబ్రహ్మము; సమాహితః=సాక్షాత్తు ఆత్మభావముచే నుంటున్నాడు. కించ=(ఈపదమధ్యాహార్యము) మరియు; శీతోష్ణసుఖదుఃఖేషు=శీతోష్ణములయందు: సుఖదుఃఖములయందు; తథా=అట్లే; మానావమానయోః=మానావమానములయందును; సమస్స్యాత్=(ఈపదమధ్యాహార్యము) సముడై యగును. ॥౭॥

పదవిభాగము: జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా- కూటస్థః- విజితేన్ద్రియః- యుక్తః- ఇతి- ఉచ్యతే- యోగీ-సమలోష్టాశ్మకాంచనః ॥ ॥౮॥

ప్రతిపదార్థము:— జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా=జ్ఞాన=శాస్త్రజన్యపరోక్షజ్ఞానముచేతను; విజ్ఞాన=శాస్త్రమువలన తెలియబడిన పదార్థముల తత్త్వముయొక్క స్వానుభవము (అపరోక్షము) చేతను, తృప్త=జనించిన అలంప్రత్యయము (చాలును అనెడివృత్తి)కల ఆత్మా=అంతఃకరణకలిగినట్టియు; కూటస్థః=కంపింపజేయుటకు శక్యముకానట్టియు; (అనగా హర్షవిషాద కామక్రోధాది రహితుఁడు) విజితేన్ద్రియః=విజిత=జయించబడిన; ఇన్ద్రియః=ఇన్ద్రియములు కలిగినట్టియు; సమలోష్టాశ్మకాంచనః=సమానమగు లోష్టాశ్మకాంచనములుకల; యోగీ=యోగి; (పరమహంస పరివ్రాజకుండు) యుక్త ఇతి=యుక్తుఁడని; (సమాహితుఁడని) ఉచ్యతే=చెప్పబడుచున్నాడు. ॥౮॥

---

"అహం బ్రహ్మాస్మి" అని యోజన చేయవలెను. "నాత్మాన మవసాదయేత్" పరిచ్ఛిన్నమగు దేహమునందు దేహాభిమానముచే నిడించరాదు యెందువల ననిన? అహంకారమే బ్రహ్మమునందు "అహం బ్రహ్మాస్మి" అని నియోజితమై జీవునకు బ్రహ్మభేదసంపాదనద్వారా బంధనివర్తక మగుటవలన బంధు వగుచున్నది. ఆయహంకారమే పరిచ్ఛిన్నమగు దేహాదులయందు పీడితమై జన్మమరణాద్యనర్థసముదాయము నిచ్చున దగుటవలన శత్రువు. అహంకారమునకు బంధుత్వమును, శత్రుత్వమును "బంధుః" అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను. యెవనిచే నఖండాకారబుద్ధిరూపముచే నహంకారము జయంచబడెనో అనగా స్వాధీన మొనరించుకొనబడి బ్రహ్మాకారత్వమును పొందించబడెనో అట్టివాని కహంకారము బంధనివర్తక మగుటవలన బంధువు. యెవనిచే నహంకారము స్వాధీన మొనరించు కొనబడలేదో అట్టివాని కహంకారము శత్రువువలె శత్రుభావమునం దుండును. యెటులైనను అనాసక్తునిచే సంసారనివృత్తి సంపాదింపదగినదని యర్థము. కాన ఆత్మ శబ్దమునకు గౌణముఖ్యార్థములనాశ్రయించిన యనేకవిధముల వ్యాఖ్యానింపవచ్చును. ఇట్టి యప్రకృతవ్యాఖ్య లెటుల యుపేక్షణీయములో అట్లే కొందరు పైవిధమున వ్రాసిన వ్యాఖ్యయు యుపేక్షణీయమే. ప్రకృతానుసారియగు భాష్యకారులచే జెప్పబడిన వ్యాఖ్యానమే శరణము. ॥౬॥

స్వాభిప్రాయము :— శ్రీ భాష్యకారులవ్యాఖ్య ప్రకృతానుసారి కాన యదియే శరణ యని భాష్యోత్కర్షదీపికాకారుల వ్రాతవలన మరికొందరివ్రాతలపై తాము వ్రాసిన యాపత్తివ్రాతలుకూడ మరికొందరి వ్రాతలువలె ప్రకృతానుసారములు కావనియు, తమ యాపత్తివ్యాఖ్య లుపాదేయములు కానటులమరికొందరి వ్రాతలుకూడ యుపాదేయములు కావనియు స్పష్టమగుచున్నది. భాష్యోత్కర్ష దీపికాకారుల కింతయనూయ యెందులకో తెలియకున్నది. భాష్యకారులవ్యాఖ్య ప్రకృతానుసారము కాదని యెవరన్నది? భాష్యకారులవ్యాఖ్యవలె కొందరివ్యాఖ్యలు, తానువ్రాసినవ్రాతలు యెందులకు ప్రకృతానుసారులు కావు? ప్రకృత మాత్మోద్ధరణముకదా! అట్టియాత్మోద్ధరణ కుపాయము లనేకులు ముఖ్యగౌణభేదము ననుసరించి శబ్దస్వారస్యమువలన వర్ణించుటలో తప్పేమి

**శాంకరభాష్యమ్‌ః—**

జితాత్మన ఇతి। జితాత్మనః కార్యకరణసంఘాత ఆత్మా జితో యేన స జితాత్మా తస్య జితాత్మనః ప్రశాన్తస్య ప్రసన్నాంతఃకరణస్య సత స్సంన్యాసినః పరమాత్మా సమాహిత స్సాక్షా దాత్మభావేన వర్తత ఇత్యర్థః। కించ శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానేఽవమానే చ మానావ మానయోః పూజాపరిభవయోః ॥ ॥౭॥

**శాంకరభాష్యతత్త్వబోధినిః—**

శరీరేంద్రియ సంఘాతమును జయించినట్టి ప్రసన్నమైన యంతఃకరణముకల సంన్యాసికి పరమాత్మ సాక్షాదాత్మభావముచే నుండును. అనగా విక్షేపములచే మాటిమాటి కనభిభూతుఁడై యెల్లపుడు చిత్తమునందు సాక్షాత్కరించును. మఱియు నీయతి శీతోష్ణములయందు, సుఖదుఃఖ ములయందు, మానావమానములయందును సముఁడగును అనగా నట్టి సంన్యాసి శీతోష్ణాది ద్వంద్వములచే చలింపఁజేయబడడని భావము. ॥౭॥

యున్నది? తాను ముఖ్యగౌణభేదముచే వ్యాఖ్యానించిన పద్ధతులన్నియు ప్రకృతానుసారులే యగుచుండ తన వ్యాఖ్యలన్నియు ప్రకృతానుసారములు కావని అటులనే కొందరి వ్యాఖ్యలుకూడ ప్రకృతానుసారములు కావని చెప్పుట తనకుంగల యసూయనే ప్రకటించుచున్నది. కాన కొందరివ్యాఖ్యలు, భాష్యోత్కర్షదీపికాకారుల వ్యాఖ్యలును యుపాదేయములే యని యాశయము. ॥౬॥

—: ౬వ అధ్యాయము. ౭,౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. :—

మధుసూదనసరస్వతీయము:— యెవడు జితాత్ముడో వాడు తనకు తానే బంధుగని పూర్వమునందు జెప్పబడెను. అట్టి తనకు గల బంధుత్వమును "జితాత్మనః" అను రెండుశ్లోకములచేతను స్పష్టపరచుచుండెను. చిత్తవిక్షేపమును కలుగజేయు శీతోష్ణసుఖదుఃఖములు ప్రాప్తించినను, అట్లే చిత్తవిక్షేపములకు హేతువులగు పూజాపరిభవములు ప్రాప్తించినను వాటియందు సమత్వముచే జితేన్ద్రియుడైనట్టిన్ని, అంతట సమబుద్ధిచే రాగ ద్వేషములు లేనట్టివానికి స్వప్రకాశజ్ఞానస్వభావమైకల యాత్మసమాధివిషయు డగును. యోగారూఢు డగును. లేదా "పరమాత్మా" అనుచోట "పరం ఆత్మా" అని పదవిభాగము జేయ నగును. జితేంద్రియుడైన ప్రశాంతునకే కేవలము ఆత్మ యోగవిషయు డగును. ఇతరునికి కాడనియు యాశయము వర్ణింప నగును. కాన జితేంద్రియుడు ప్రశాంతుడు కావలయు నని యర్థము. ॥౭॥

మరియు "జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా" జ్ఞాన మనగ గురూపదేశమువలన ప్రాప్తించిన శాస్త్రోక్తపదార్థ జ్ఞానము. విజ్ఞాన మనగ నట్టి జ్ఞానము యథార్థమా? అయథార్థమా? అను సంశయమును తొలగించు విచార ముచే గలుగు శాస్త్రోక్తపదార్థముల యపరోక్షీకరణము. అట్టి జ్ఞాన విజ్ఞానములచే జనించిన "అలం" చాలును, అను జ్ఞానముకల యంతఃకరణముతో గూడినవాడై శబ్దస్పర్శరూపరసగంధములనెడి విషయముల సాన్నిధ్య ముం డినను యే మనోవికారములులేనివాడై, కనుకనే రాగద్వేషపూర్వకమైన విషయగ్రహణమునుండి మరలించిన ఇంద్రియములు కలవాడు. కనుకనె "ఇది స్వీకరింపదగినది. ఇది పరిత్యజింపదగినది" అను జ్ఞానము లేనివాడగు టచే మృత్పిండపాషాణకాంచనములు సమానముగాకల పరమహంసపరివ్రాజకుఁడు తీవ్రవైరాగ్యయుక్తుడై యోగారూఢు డని చెప్పబడును. ॥౮॥

శంకరానందీయము:— సమాధికి ప్రతికూలమగు దేహేంద్రియాదిప్రవృత్తి నరికట్టి సమాధినిష్ఠ నాచ రించు యతికి ఫలము "అహ మేవేదం సర్వం" (సర్వము నేనే) అను యప్రతిబద్ధాత్మాపరోక్ష్యమే యని సూచించుచు, చెప్పబోవు లక్షణములుకలవాడై యెవడు సమాధినిష్ఠచే సంపాదించిన విజ్ఞానబలముచే విపరీత

శాంకరభాష్యమ్ :—

జ్ఞానేతి । జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా జ్ఞానం శాస్త్రోక్తపదార్థానాం పరిజ్ఞానం, విజ్ఞానం తు శాస్త్రతో జ్ఞాతానాం తథైవ స్వానుభవకరణం తాభ్యాం జ్ఞానవిజ్ఞానాభ్యాం తృప్తః స్సంజాతాలంప్రత్యయ ఆత్మాఽన్తఃకరణం యస్యస జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థోఽప్రకమ్ప్యో భవతీత్యర్థః । విజితేన్ద్రియశ్చ । య ఈదృశో యుక్తః స్సమాహిత ఇతి స ఉచ్యతే కథ్యతే । స యోగీ సమలోష్టాశ్మకాంచనో లోష్టాశ్మకాంచనాని సమాని యస్య స సమలోష్టాశ్మకాంచనః॥౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

చిత్తసమాధానమే విశేషఫలమగుచో నెట్టివాడు సమాహితుఁడని వ్యవహరింపబడును. అను శంకను "జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా" అను శ్లోకముచే తొలిగించుచుండెను. జ్ఞానమనగ శాస్త్రోక్తపదార్థముల పరిజ్ఞానము. అది పరోక్షరూపము. విజ్ఞానమనగ శాస్త్రమువలన తెలియబడిన పదార్థములను యథార్థస్థితిగ స్వానుభవమొనరించుట. ఇది యపరోక్షరూపము అట్టి పరోక్షాపరోక్షరూప జ్ఞానవిజ్ఞానములచే అలంప్రత్యయముకలవాడు. (దేనియందు కోరికలేనివాడు) అప్రకంప్యుడు. అనగాహర్షవిషాద కామక్రోధాది రహితుఁడు. యింద్రియములను జయించినట్టియు, మట్టిని, పాషాణమును, బంగారమును, సమానముగ చూచునట్టి పరమహంస పరివ్రాజకుఁడు సమాహితుఁడని చెప్పఁబడును. ॥౮॥

(విరుద్ధ జ్ఞానములచే) చలించకుఁడునో యట్టివాడు యోగారూఢుఁడని "జితాత్మనః" అనునది మొదలగు రెండు శ్లోకములచే బోధించుచుండెను.

వివేకవైరాగ్యములచేతను, తీవ్రమోక్షేచ్ఛచేతను, ఈశ్వరానుగ్రహమువలన, గుర్వనుగ్రహమువలనను శ్రవణమననము లాచరించి యాత్మను తిన్నగ దెలిసికొని, శరీరేంద్రియసంఘాతమును స్వాధీన మొనరించుకొని యెవడు సమాధినిష్ఠుఁడగునో అట్టి జితాత్మకు అనగా సమాధిచే స్వ్వాసనాపటలము నశింప విపరీతజ్ఞానము కలుగకుండునటుల విపరీతజ్ఞానవైముఖ్యమును పొందించబడిన మనస్సుకల నిర్వికల్పయతికి "పరమాత్మా" పరమశ్చాసౌ వాత్మా చ పరమాత్మా" అని విగ్రహము. అనగా నిరతిశయానందస్వరూప మగుటవలనను నిరవధికమహిమకలవాడగుటవలనను పరమాత్మ యనగ పరబ్రహ్మమే. అట్టి పరబ్రహ్మము సమాహితుడగును. అనగా చక్షురింద్రియమునకు రూపము ప్రత్యక్షవిషయ మగునటుల విపరీత (విరుద్ధ) ప్రత్యయ (జ్ఞాన) వినిర్ముక్తుడై బుద్ధివృత్తికి బహిఃప్రదేశమున లోపల విషయుఁ డగును. "నేను కర్తను, భోక్తను, సుఖదుఃఖతుడను" అనునట్టి విపరీతజ్ఞానములచే సంసారియగు యాత్మకు సమాధినిష్ఠచే జనించిన విజ్ఞానబలముచే యా యా విపరీతజ్ఞానసంబంధము లేకుండ జేయుటయే సముద్ధరణ మనిపించుకొనునని "పరమాత్మా సమాహితః" అను పదములచే సూచింపబడెను.

"ఉద్ధరే దాత్మనాత్మాఽఽనం" అనుదానిచే ఆత్మోద్ధరణప్రకారమును నిరూపించి యిట్టి లక్షణములుకల యోగారూఢుడు జీవన్ముక్తుడని యోగికి యోగారూఢత్వమును సూచించుటకు "శీతోష్ణసుఖదుఃఖేషు" అని చెప్ప మొదలిడెను. అట్టివానికి యోగనిష్ఠాసిద్ధికసాధారణకారణమును "విజితేన్ద్రియః" అనుదానిచే చెప్పుచుండెను. సదసద్వివేచనముచేతను జనించిన తీవ్రమోక్షేచ్ఛచేతను విశేషముగ విషయగ్రహణవైముఖ్యమును పొందింపబడిన బాహ్యాభ్యంతరకరణములుకలవాడై యోగనిష్ఠయందు ప్రవృత్తుడైన బ్రహ్మవేత్తయగు యతి– "జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా" జ్ఞానమనగ–జ్యోతిశ్శాస్త్రముచే కలిగిన సూర్యగ్రహణనిశ్చయమువలె సర్వజగత్తునకు నామరూపప్రత్యయనిరాసపూర్వకముగ నియమముగ బ్రహ్మమాత్రస్వరూపమును బోధించు "సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలాని, అయమాత్మా బ్రహ్మ, తత్త్వమసి, బ్రహ్మైవేదం సర్వం" వాసుదేవ స్సర్వమిదం" ఇత్యాదిశ్రుతి

స్మృతివాక్యబలముబలన నప్రతిహతముగ సర్వము బ్రహ్మమాత్రస్వరూపము అను నిశ్చయము. విజ్ఞాన మనగా—చక్షురింద్రియముచే రాహుగ్రస్తసూర్యబింబమును ప్రత్యక్షముచేసికొనినటుల శ్రుతిస్మృతులచే నిర్ధారితమైనట్టి నిర్విశేషాత్మచే సర్వత్ర పరిపూర్ణమైన పరబ్రహ్మమును చిదేకమే విషయముగా గల బుద్ధివృత్తిచే "నేను ఈజగత్తు బ్రహ్మస్వరూపమే" యని సాక్షాత్తు ప్రత్యక్షముచేసుకొనుట. ఇట్టి జ్ఞానవిజ్ఞానములు సర్వత్ర (అంతట) సర్వమును బ్రహ్మమాత్రస్వరూపావగాహులు. అప్రతిబంధములగు జ్ఞానవిజ్ఞానములచే "తృప్తాత్మ" వికల్పాంతరముల యవకాశములేని యంతఃకరణముకలవాడు. కనుకనే "సమలోష్టాశ్మకాంచనః" చిదాకారవృత్తిచే లోష్టాశ్మకాంచనములను బ్రహ్మమాత్రస్వరూపముగ సమానముగ చూచువాడు. అనగ సర్వమును బ్రహ్మమాత్రముగ చూచువాడు (తెలిసికొనువాడు.) ఈ చెప్పుటచే బాహ్యపదార్థజ్ఞానరాహిత్యము, హేయోపాదేయత్వబుద్ధిశూన్యత్వము సూచింపబడెను.

అధిభౌతికాద్యుపద్రవములు ప్రాప్తించినచో వాటిని చూచుట, వాటి ననుసంధానము చేయుటవలన యోగారూఢుడగు బ్రహ్మవేత్తకు బ్రహ్మదర్శనవ్యాఘాత సంభవించుచుండ సర్వదా సర్వత్ర బ్రహ్మదర్శనము బ్రహ్మవేత్తకు సంభవించదని శంకింపజనదు. బ్రహ్మవేత్త జితేంద్రియుడగుటవలనను, నిశ్శేషముగ నశించిన బాహ్యవాసనలు కలవాడగుటవలన ఆధ్యాత్మికాధిభౌతికాద్యుపద్రవములు ప్రాప్తించినను బ్రహ్మదృష్టి కలవాడయియే యుండును. ఎన్నడును బ్రహ్మదృష్టినుండిచలించడని "శీతోష్ణసుఖదుఃఖేషు" అనుదానిచే బోధించుచుండెను.

స్తుతిపూజోపచారములు కాని, నిందాతిరస్కారాదులు కాని ప్రాప్తించినను, అట్లే "శీతోష్ణసుఖదుఃఖేషు" ఇచట శీతోష్ణపదము అధిభౌతికాధిదైవికముల కుపలక్షణము. అనగా శీతోష్ణపదముచేతనే శీతోష్ణములు అధిభౌతికములు అధిదైవికములు గ్రహింపవలయుననుట. సుఖదుఃఖపదము ఆధ్యాత్మికముల కుపలక్షణము. ఉపలక్షణమనగ జెప్పదగినవిషయములలో యేకదేశమును చెప్పుట. అనగా అచటనుండుపదముచేతనే చెప్పదగిన విషయములనన్నిటిని గ్రహింపవలయుననుట. కాన "సుఖదుఃఖ" అనుపదముచే సుఖదుఃఖాద్యాధ్యాత్మికములను గ్రహింపవలయును. అట్లు గ్రహించిన శీతోష్ణాధిభౌతికాధిదైవికసుఖదుఃఖాద్యాధ్యాత్మికములు ప్రాప్తించినను అనగా శీతోష్ణవ్యాఘ్రసర్పదావాగ్న్యాదులు వృష్టియు, అశనిపాతాదులు, జ్వరాదులు,మృష్టాన్నాదులు ప్రాప్తించినను బ్రహ్మవేత్త సమదర్శియే యగును. నామరూపక్రియాతత్ఫలములు బ్రహ్మయందు ప్రవిలాపితములు కాన ప్రవిలాపితనామరూపక్రియాదులు తిరిగి యంతఃకరణవృత్తివిషయములు కానందున ఆరోపితనామరూపక్రియాతత్ఫలానుసంధానపరుడు కాడు. బ్రహ్మదృష్టి కలవాడయియే యుండును. ఎన్నడు బ్రహ్మదృష్టినుండి చలించడు. ఈ విషయమునే "మహత్పదం జ్ఞాత్వా వృక్షమూలే వసేత్ కుచేలోఽసహాయ ఏకాకీ సమాధిస్థ ఆత్మకామ ఆప్తకామో నిష్కామో జీర్ణకామో వ్యాఘ్రే హస్తిని సింహే దంశే మశకే నకులే సర్పే యక్షే రాక్షసే గన్ధర్వే మృత్యో రూపాణి విదిత్వా న బిభేతి కుతశ్చన" "వృక్ష ఇవ తిష్ఠాసేచ్ఛిద్యమానో న కుప్యేత న కమ్పేత। ఉత్పల ఇవ తిష్ఠాసేచ్ఛిద్యమానో న కుప్యేత న కమ్పేత। ఆకాశమివ తిష్ఠాసేత్" బ్రహ్మవేత్త పరమపదమును తెలిసికొని కుచేలుడై, ఏకాకియై, సమాధిస్థుడై, ఆత్మకాముడై, కనుకనే ఆప్తకాముడై, కనుకనే నిష్కాముడై కనుకనే జీర్ణకాముడై వ్యాఘ్రము, గజము, సింహము, దంశము, మశకము, నకులము, సర్పము, యక్షుడు, రాక్షసుడు, గంధర్వుడు, మొదలగు నవి ప్రాప్తించినపుడు మృత్యువుయొక్క రూపములను తెలిసికొని దేనివలనను భయపడడు. ఛేదింపబడుచున్నను వృక్షమువలెను, రాయివలెను, ఆకాశమువలెను యుండవలెను. కోపింపరాదు, కంపింపరాదు. సత్యరూపముచే నుండవలెనని శ్రుతులు బోధించుచున్నవి. విపరీతప్రత్యయహేతువులు ప్రాప్తించినను బ్రహ్మవేత్త కూటమువలె నిర్వికారుడై విపరీతప్రత్యయములచే నకమ్ప్యుడై యెపుడగునో అట్టిసమయమున పండితులచే యోగారూఢు డనబడును. ॥౮॥

౯. సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబన్ధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధి ర్విశిష్యతే॥ ॥౯॥

**పదవిభాగము:**—సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబన్ధుషు–సాధుషు–అపి–చ–పాపేషు–సమబుద్ధిః–విశిష్యతే ॥ ॥౯॥

**ప్రతిపదార్థము:**—సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు=సుహృత్; ప్రత్యుపకారమునపేక్షింపక నుపకృతిచేయునట్టివారలయందును; మిత్ర= స్నేహముకలవారలయందును; అరి=శత్రువులయందును; ఉదాసీన=వాదిప్రతివాదులలో నేపక్షమునవలంబించనివారియందును; మధ్యస్థ=విరోధముకలయుభయులకు హితవునుకోరెడివారలయందును; ద్వేష్య=తనకప్రియులయందును; బంధుషు=తనసంబంధులయందును; సాధుష్వపిచ=శాస్త్రానుసారమువర్తించువారలయందును; పాపేషు=శాస్త్రనిషిద్ధకర్మలనాచరించువారలయందును; సమబుద్ధిః=వీడేజాతికలవాడు, ఏగోత్రముకలవాడు, ఏవ్యాపార(కర్మ)ముకలవాడను విషయమునందు వ్యాపృతము(సంబంధముకాని) బుద్ధికలవాడు; విశిష్యతే=సర్వులకంటెనుశ్రేష్ఠుడగుచున్నాడు. (ఇట“విశిష్యతే” అనుచోట“విముచ్యతే” అని కొన్నిగ్రంథములయందు పాఠాంతరముకలదు. ఈపాఠమున“విముచ్యతే”=సర్వపాపములనుండివిముక్తుడగుచున్నాడు. అనియర్థము

**శాంకరభాష్యమ్:**—

కించ–సుహృత్యాదిశ్లోకార్ధ మేకం పదమ్। సుహృదితి ప్రత్యుపకారమనపేక్ష్యోపకర్తా। మిత్రం స్నేహవాన్। అరిః శత్రుః। ఉదాసీనో న కస్యచి త్పక్షం భజతే। మధ్యస్థో యో విరుద్ధయో రుభయో ర్హితైషీ। ద్వేష్య ఆత్మనోఽప్రియః। బన్ధు స్సంబంధీ త్యేతేషు. సాధుషు

**శాంకరభాష్యార్థబోధిని:**—

యోగారూఢునకు ప్రశస్తత్వము నంగీకరించి యోగమునకు మఱియొక యంగమును "సుహృత్" అను శ్లోకముచే చెప్పుచుండెను. ప్రత్యుపకారము నపేక్షింపక నుపకారము చేయువాడు సుహృత్తని యనబడును. అట్టి సుహృత్తులయందును, స్నేహముకలవారలయందును, పరోక్షమున నపకృతి నొనరించువా డరి యనుపించుకొనును. అట్టి యరులయందును, విరోధముకలవారిలో యెవరి పక్షము నాశ్రయింపకుండినవా డుదాసీనుడు, అట్టి యుదాసీనులయందును, విరోధముకలయిరువురిహితమును కోరెడివాడు మధ్యస్థుడు, అట్టి మధ్యస్థులయం

—:౬వ. అధ్యాయము —— ౯వ. శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

**మధుసూదనసరస్వతీయము:**— సుహృన్మిత్రాదులయందు సమబుద్ధి సర్వయోగులకు శ్రేష్ఠమైన దని "సుహృన్మిత్ర" అను శ్లోకముచే చెప్పుచుండెను.

ఉపకారము నపేక్షింపక పూర్వస్నేహము, సంబంధము లేనిదే యుపకారము చేయువాడు 'సుహృత్' అని చెప్పబడును. స్నేహముకలిగి నుపకారము చేయువాడు "మిత్రం" అని చెప్పబడును. తనచే చేయబడిన యపకార మేదియు లేనిదే స్వభావక్రౌర్యముచే నపకార మాచరించువాడు "అరిః" అని చెప్పబడును. ఇరువురు వివాదపడుచుండ యెవనిపక్షముకూడ నాశ్రయింపనివాడు "ఉదాసీనః" అని యనిపించుకొనును. వివాదపడుచుండెడి యుభయుల హితమును కోరువాడు "మధ్యస్థః" అని పిలువబడును. తనచే చేయబడిన యపకారము నాశ్రయించి తిరిగి ప్రత్యపకారము నాచరించువాడు "ద్వేష్యః" అని పిలువబడును. తన సంబంధముచే తన కుపకారమాచరించువాడు "బంధుః" అని పిలువబడును. ఇట్టివారలయందు శాస్త్రవిహితకర్మల నాచరించు సాధులయందు, మరి వీరలకంటె యితరులయందు "వీడెవడు, వీడికర్మ యెట్టిది" అని వారలయందు, వారి కర్మలయందు వ్యాపృతమైన (ఆసక్తమైన) బుద్ధిని వదలినవాడు అనగా పై యెవరియందును రాగద్వేష.

**శాంకరభాష్యమ్:—**

శాస్త్రానువర్తిష్వపిచ, పాపేషు ప్రతిషిద్ధకారిషు సర్వేష్వేతేషు సమబుద్ధిః కః? కిం? కర్మేత్యవ్యాపృతబుద్ధి రిత్యర్థః। విశిష్యతే విముచ్యత ఇతి వా పాఠాన్తరం। యోగారూఢానాం సర్వేషామయ ముత్తమ ఇత్యర్థః॥ ॥౯॥

**శాంకరభాష్యార్థ ప్రబోధిని:—**

దును, ఆత్మ(తన) కప్రియులయందును, తనబంధువులయందును, శాస్త్రానుసారముప్రవర్తించు వారలయందును. శాస్త్రప్రతిషిద్ధమగు కార్యముల నొనరించువారలయందును, సమబుద్ధికలవాడు అనగా 'వీడేజాతిగోత్రములుకలవాడు, వీడేమేమికర్మలు చేయుచుండె' నను విషయమునందు ప్రసక్తముకాని బుద్ధికలవాడు యోగారూఢులగువారలయందరిలో నుత్కృష్టుఁడగుచున్నాడు. ఈశ్లోకమున "విశిష్యతే" అనుచోట "విముచ్యతే" అని పాఠాంతరము కలదు. అట్టి పాఠమున సమబుద్ధికలవాడు ముక్తుఁడగుచున్నాడని యర్థమును చూచుకొనవలయును. ॥౯॥

ములు లేనివాఁడన్నివిధముల యుత్కృష్టుడు. ఈ శ్లోకమున "విశిష్యతే" అను స్థలమున "విముచ్యతే" అని పాఠాన్తరము కలదు. అట్టి పాఠాన్తరమున పైనచెప్పిన సమబుద్ధికలవాడు ముక్తుడగునని యర్థము వర్ణింపనగును. ॥౯॥

శంకరానందీయము:— జ్ఞానవిజ్ఞానపూర్ణత్వము, బాహ్యపదార్థవిశేకరాహిత్యము, హేయోపాదేయబుద్ధిశూన్యత్వము, విపరీతజ్ఞానములచే చలింపకుండుట యివి యోగారూఢుని లక్షణములని చెప్పి యిపుడుకూడనంతట సమదర్శనము బ్రహ్మవేత్త, యోగారూఢుడు అగు జీవన్ముక్తుని లక్షణమని చెప్పిన జీవన్ముక్తుని లక్షణమునే "సుహృత్" అను శ్లోకముచే దృఢపరచుచుండెను.

ప్రత్యుపకారము నపేక్షింపకయే యుపకార మాచరించువాడు "సుహృత్" అని చెప్పబడును. "దదాతి ప్రతిగృహ్ణాతి" అను న్యాయానుసారము ప్రత్యుపకారము నపేక్షించి యుపకారమును చేయువాడు "మిత్రం" అని పిలుబడును. పరోక్షాపరోక్షములయం దపకార మొనరించెడివాడు. "అరిః" అనిపించుకొనును. అప్రియములను పలుకువాఁడగుటవలన ద్వేషించుటకు దగినవాడు. "ద్వేష్యః" అని యనుపించుకొనును. వాదిప్రతివాదులయెడ సమానముగ సంచరించువాడు. "మధ్యస్థః" అని యనుపించుకొనును. వాదిప్రతివాదుల విషయమై సర్వవిషయముల యుపేక్ష కలవాడు. "ఉదాసీనః" అని చెప్పఁబడును. తన బంధువులే "బాంధవాః" అని చెప్పఁబడుదురు. ప్రాణము పోవుసమయమునందుకూడ యెవరు స్వధర్మమును వదలక శాస్త్రమార్గమునే యనుసరించెదరో అట్టివారు "సాధవః" అని యనుపించుకొనెదరు. శాస్త్రనిషిద్ధకర్మల నాచరించు దురాచారరతులు "పాపాః" అని పిలుఁబడెదరు. సంన్యాసికి సంన్యాసమునకు పూర్వమునందు- ఆపాతతః (తత్త్వవిచారణకు పూర్వమునందు) మృత్తుయందు ఘటబుద్ధి జనించినటుల సుహృదాదులయందు "వీడు సుహృత్తు, వీడు మిత్రుడు, వీడు శత్రువు" అనునట్టి బుద్ధులు జనించినను తత్త్వవిచారణానంతరము ఘటమునందు మృద్బుద్ధి జనించినటుల సుహృదాది పాపాన్తజనులయందు తత్త్వవిచారణానంతరము సుహృదాదిపాపాంతజీవులయందుదయించిన సుహృదాదిబుద్ధిని బాధించి సర్వత్ర బ్రహ్మబుద్ధియే యుత్కృష్టమై స్థిరమగుచున్నది. "సమబుద్ధిర్విముచ్యతే" అను పాఠాంతరమున "సమః" సమాకారమును పొందబడిన అనగా యెల్లపుడు అంతటను బ్రహ్మమాత్రము గ్రహించు బుద్ధికలవాడు. అనగా సుహృదాదిపాపాన్తజనులయందు సర్వత్ర యెల్లపుడు బ్రహ్మమునే తెలిసికొనువాడు ముక్తుడగునని యర్థము. ॥౯॥

గీ॥ యోగీ యుంజీత సతత మాత్మానం రహసి స్థితః।
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీ రపరిగ్రహః॥ ॥౧౦॥

**పదవిభాగము:—** యోగీ-యుంజీత-సతతం-ఆత్మానం-రహసి-స్థితః-ఏకాకీ-యతచిత్తాత్మా-నిరాశీః-అపరిగ్రహః॥ ॥౧౦॥

**ప్రతిపదార్థము:—** యోగీ=ధ్యానము చేయువాడు; రహసి=రహస్యమునందు; (పర్వతగుహాదులయందు) స్థితః=కూర్చుండినవాడై; ఏకాకీ=అసహాయుడై; యతచిత్తాత్మా=నియమింపబడినట్టియంతఃకరణము, శరీరముకలవాడై; నిరాశీః=తృష్ణలేనివాడై; అపరిగ్రహః=ప్రతిగ్రహములేనివాడై; సతతం=ఎల్లపుడు; ఆత్మానం=అంతఃకరణమును; యుంజీత=సమాధానముచేయవలెను,అనగా చిత్తసమాధాన మొనరింపవలయు ననుట. ॥౧౦॥

**శాంకరభాష్యమ్:—**

అత ఏవ ముత్తమఫలావాప్తయే యోగీ ధ్యాయీ యుంజీత సమాదధ్యా త్సతతం సర్వదాఽఽత్మాన మన్తఃకరణం రహ స్యేకాన్తే గిరిగుహాదౌ స్థిత స్సన్నేకా క్యసహాయః। రహసి స్థిత ఏకాకీ చేతి విశేషణా త్సంన్యాసం కృత్వే త్యర్థః। యతచిత్తాత్మా చిత్త మన్తఃకరణ మాత్మా దేహశ్చ సంయతౌ యస్య స యతచిత్తాత్మా నిరాశీ ర్వీతతృష్ణోఽపరిగ్రహశ్చ పరిగ్రహరహిత ఇత్యర్థః। సంన్యాసిత్వేఽపి త్యక్తసర్వపరిగ్రహ స్స న్యుంజీతేత్యర్థః॥ ॥౧౦॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

"జితాత్మనః" అనుశ్లోకము మొదలుకొని యింతవరకు చెప్పిన విశేషణములుకలవాడు యోగారూఢులలో యుత్తముఁడైనచో యోగానుష్ఠానమువిషయమై ప్రయత్నముచేయదగినది. కాన యోగాంగములను చెప్పినపిదప ప్రధానమగు యోగానుష్ఠానమును చెప్పుచుండెను.

**శ్రీధరీయము:—** సుహృదాది పాపాన్తజీవులయందు "సమబుద్ధిః" "సమా-రాగద్వేషాదిశూన్యా బుద్ధిః యస్య సః" రాగద్వేషాదులు లేని బుద్ధి కలవా డుత్కృష్టుడు ॥౯॥

—: ౬వ అధ్యాయము. ౧౦ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

**మధుసూదనసరస్వతీయము:—** యోగారూఢునకు లక్షణమును, ఫలమును చెప్పి యీయోగారూఢునకే సాంగముగయోగమును "యోగీ" అను శ్లోకము మొదలుకొని "స యోగీ పరమో మతః" అను ముప్పదిరెండవ శ్లోకమువరకగు-అనేకశ్లోకములచేతను విధించుచున్నాడు.

ఉత్తమఫలప్రాప్తికొఱకు యోగారూఢుడు యోగమునకు ప్రతిబంధకమైన దుర్జనాదిరహితమైన గిరిగుహాదులయం దుండి, ఏకాకియై (విడచిన సర్వగృహపరిజనములు కలవాడై) అనగా సంన్యాసియై, అంతఃకరణమును శరీరమును యోగప్రతిబంధకవ్యాపారశూన్య మొనరించినవాడై వైరాగ్యదార్ఢ్యముచే తృష్ణాపరిత్యాగియై, శాస్త్రీయ్యనుజ్ఞాతపరిగ్రహము యోగప్రతిబంధక మగుచో దానినికూడ పరిత్యజించినవాడై చిత్తము నెల్లపుడు క్షిప్తమూఢభూములను(భూమికలను)పరిత్యజించి ఏకాగ్రనిరోధభూమికలచే సమాహిత మొనరింపవలయును. ॥౧౦॥

**శంకరానందీయము:—** యోగారూఢునకే యప్రతిబద్ధమగు జ్ఞానము, సర్వత్ర బ్రహ్మదర్శనము ముక్తియు ప్రాప్తించును. యితరునకు ప్రాప్తింపదు. కాన శ్రవణమననములచే యాత్మతత్త్వమును దెలిసికొన్నిన ముముక్షువగు యతి ఇంతమాత్రముచే నేను కృతార్థుడ నైతినను అస్మితను (అహంభావమును) వదలి తనకు కలిగిన జ్ఞానమునకు ప్రతిబంధకము లేకుండుటకొఱకు సమాధి యవశ్య మాచరింపవలయును. కాన సమాధి నాచరించువానికి సమాధ్యంగములను సూచించు అట్టి యతికి సమాధిని "యోగీ" అను దానిచే విధించుచున్నాడు.

"సంన్యాసయోగా ద్యతయ శ్శుద్ధసత్త్వాః" అను శ్రుత్యనుసారము సంన్యాసి లేక బ్రహ్మమునందు

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యోగి రహస్యమునందు (గిరిగుహాదులయందు) కూర్చుండినవాడై, ఇతరసహాయము లేనివాడై, సన్యసించి నియమింపబడినట్టి యంతఃకరణము, శరీరము కలవాడై, తృష్ణారహితుడై, (కోరికలేనివాడై) దేనినిగ్రహింపనివాడై (ప్రతిగ్రహములేనివాడై) యెల్లపుడు యంతఃకరణమును సమాధాన మొనరించవలెను. చిత్తసమాధానముకలవాడై యోగాభ్యాసమునే యొనరింపవలెను. ఇట "రహసి స్థితః" అని చెప్పుటవలన యోగమునకు నైరంతర్యము. "సతతం" అని చెప్పుటవలన యోగమునకు దీర్ఘకాలమనుష్ఠానము, 'ఏకాకీ" అని చెప్పుటవలన యోగమునందాదరము సూచింపబడెను. గిరిగుహాదులయం దని వ్యాఖ్యానించుటవలన యోగప్రతిబంధక దుర్జనశూన్యదేశమనియు సూచింపబడెను. సంన్యాసియై యని చెప్పినంతమాత్రముననే పరిగ్రహము లేనివాడై యని యర్థము ప్రాప్తించుచుండ తిరిగి "అపరిగ్రహః" అని చెప్పుటచే అర్థమువలన పునరుక్తి ప్రాప్తించునని శంకింపవలదు. సంన్యాసియైనను కౌపీనాచ్ఛాదనాదులయందు కూడ నాసక్తిలేనివాడై యుండవలెనని విశేషమును చెప్పుటకు "అపరిగ్రహః" అని చెప్పబడెను. కాన పునరుక్తిదోషము ప్రాప్తింపదు. ॥౧౦॥

చిత్తమును స్థాపించు స్వభావముకల యోగి అనగా యోగాభ్యాసశీలుడు ఒంటరియై, యీ చెప్పుటవలన "ఏకస్తపో ద్విరధ్యాయీ" అను న్యాయముచే నిదిధ్యాసువు తనకంటె యితరులగు జనులసంబంధముండరాదని వివక్షచేయబడెను. జనాంతర ముండినచో వాగ్వ్యాపారాదులు సంభవించిన ధ్యాననిష్ఠాభంగ మగును. కాన నొంటరియై యుండవలెను. మరియు తీవ్రమోక్షేచ్ఛా వైరాగ్యములచే విషయభోగాలనుండి నిర్గతుడై, (అనగా విషయభోగాలను వదలినవాడై "ఏకాన్తవాసో లఘుభోజనాది మౌనం నిరాశా కరణావరోధః। మునే రసోస్సంయమనం షడేతే చిత్తప్రసాదం జనయన్తి శీఘ్రమ్" 1 ఏకాన్తవాసము, 2 లఘుభోజనాదికము 3 మౌనము, 4 నిరాశ, 5 ఇంద్రియనియమము, 6 ప్రాణవాయువును బంధించుట (ప్రాణాయామము) ఈ యారును శీఘ్రముగ చిత్తప్రసాదమును కలుగజేయు నను న్యాయముచే నిదిధ్యాసువు దేహజీవనాదులయందుకూడ యాశను వదలవలయు నని సూచింపబడెను. మఱియు కౌపీనము, కంథ (బొంత)ల కంటె వేఱగు పరిగ్రహమును వదలినవాడై, యితరపరిగ్రహముండినచో యతికికూడ చోరాదిభయము, తద్రక్షణప్రసక్తియు కలిగెడిని. అట్లగుచో సమాధి సిద్ధింపక పోయెడిని. కాన యతి కౌపీన కంథాదులనుమాత్రమే స్వీకరించుచు తదితరములను పరిగ్రహింపకుండ నుండవలెను.

ఇట్లు యోగబహిరంగసాధనసంపత్తి కలవాడైనను అంతరంగసాధనసంపత్తి లేనిచో యోగము సిద్ధింపదు. కాన నంతరంగసాధనసంపన్నుడు యోగి కావలయునని "యతచిత్తాత్మా" అను దానిచే బోధించుచుండెను.

పూర్వసంస్కారవశమున ప్రాప్తించిన ఆయా యింద్రియవ్యాపారములవలన నరికట్టబడినదేహేంద్రియమనోబుద్ధిచిత్తములు కలవాడై ముముక్షువు (నిదిధ్యాసువు.) పర్వతగుహాదులందుండి అజ్ఞానతత్కార్యములయందు మనస్సును పోనీయక యెల్లపుడు నిత్యశుద్ధబుద్ధముక్తసత్యపరమానంద రూపమగు స్వాత్మయందే తన మనస్సును సంధింపవలెను. అనగా "బ్రహ్మైవాహ మహ మేవ బ్రహ్మ" అని యనుసంధానము చేయవలెను.॥౧౦॥

భాష్యోత్కర్ష దీపిక:—

ఈశ్లోకమున "ఏకాకీ" అను విశేషణమువలన సంన్యాసమును స్వీకరించిశిష్యాదిసహాయరహితుడై యని యర్థము. "యతచిత్తాత్మా" చిత్తమునకు యతత్వ మనగ అనుభూతార్థచిన్తన లేకుండుట, దేహమునకు యతత్వ

గీ॥ శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిర మాసన మాత్మనః।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చేలాజినకుశోత్తరమ్॥ ॥౧౧॥

పదవిభాగము:- శుచౌ- దేశే- ప్రతిష్ఠాప్య- స్థిరం- ఆసనం- ఆత్మనః- న- అత్యుచ్ఛ్రితం- న- అతినీచం- చేలాజినకుశోత్తరమ్- ॥

శుచౌ=(స్వభావమువలన కాని, సంస్కారమువలన కాని,) పరిశుద్ధము, రహస్యమునగు, దేశే=స్థానమునందు; స్థిరం=స్థిరమగునట్టియు; నాత్యుచ్ఛ్రితం=అత్యంతమున్నతము కానట్టియు; నాతినీచం-అత్యంతముపల్లము కానట్టియు; చేలాజినకుశోత్తరం=చిత్రాసనము, కృష్ణాజినము, దర్భాసనము మీదుమీదు కలుగునట్టి; ఆత్మనః=తనకు; ఆసనం=ఆసనమును; ప్రతిష్ఠాప్య=స్థాపనచేసి. ॥౧౧॥

---

మనగ మక్షికాదంశపిపీలికాదులవలన బాధ ప్రాప్తించినను చలింపకుండి చిరకాలము పద్మాసనాదులయందుండుటచే ప్రాప్తించెడి బాధ లేకుండుట "నిరాశీః" ఫలతృష్ణారహితుడు "అపరిగ్రహః" సంన్యాసియైనను చోరభయజనకపుస్తకాదులనుకూడ గ్రహించనివాడై ముముక్షువగు యతి యంతఃకరణమును వృత్తినిరోధముచే నరికట్టవలయును. అది "ప్రమాణవిపర్యయవికల్పనిద్రాస్మృతయః" అను సూత్రోక్తప్రకారమయిదు విధములు. ప్రత్యక్షానుమానాగమములని ప్రమాణములు మూడువిధములని సాంఖ్యాదులు, ప్రత్యక్షానుమానోపమానాగమములని గౌతమీయులు తార్కికులు, ప్రత్యక్షానుమానోపమానాగమార్థాపత్త్యనుపలబ్ధు లనెడి యారుప్రమాణము అని పూర్వమీమాంసకులు, ఉత్తరమీమాంసకులు (వేదాన్తులు) చెప్పెదరు. ప్రత్యక్షానుమానోపమానాగమార్థాపత్త్యనుపలబ్ధి అనెడి యారున్ను, సంభవము, ఐతిహ్యము అనెడి రెండున్ను మొత్తము ప్రమాణము లెనిమిది యని పౌరాణికుల యభిప్రాయము.

అది కానిదానియందదియే యను బుద్ధి (శుక్తి రజితమనెడిబుద్ధి) విపర్యయ మనబడును.

ప్రమాభ్రమలవిలక్షణమగుబుద్ధి వికల్పము. నిద్రాస్మృతులు లోకప్రసిద్ధములే. ఇంకను యితరమగు వృత్తు లున్నచో అవి యన్నియు పైని చెప్పిన వృత్తులలోనే యంతర్భావమును చూచుకొనుడు. ఇట్టియన్నియంతఃకరణవృత్తులను నిరోధించి చిత్తమును సమాధియందు నిలుపవలెను. ॥౧౦॥

పరమార్థప్రప:—

యోగశాస్త్రమున ప్రాణాపానయోగమని, మనఃపవనయోగమని, జీవబ్రహ్మయోగమని యోగత్రయ ముపదిష్టము. ఇట్టియోగత్రయమును క్రమముగ, పొందుటకు యిచ్ఛగలవాడు యెల్లపుడు మనస్సును సమాహితముగ జేయవలెను. ॥౧౦॥

—:౬వ. అధ్యాయము — ౧౧వ. శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:—"శుచౌ దేశే" అను శ్లోకము మొదలుకొని రెండుశ్లోకములచే యోగమున కుపయోగించు ఆసననియమమును చెప్పుచుండెను.

స్వభావమువలన కాని, సంస్కారమువలనకాని పరిశుద్ధమైనట్టియు, జనసముదాయము లేనట్టియు, భయరహితమైనట్టియు, గంగాతటగిరిగుహాదులయందు గల సమమైన ప్రదేశమునందు మృదువస్త్రము, మృదువగు వ్యాఘ్రచర్మము, కుశాసనముపై నుండునటుల అనగా ముందు దర్భాసనము, దానిపై వ్యాఘ్రాసనము, దానిపై మృదువస్త్రము నమర్చబడిన తన యాసనమును అదియు యెత్తుగాక పల్లముగాక మధ్యభాగమునం దమర్చవలెను.

ఇచట పరుని యాసనముకాదని చెప్పుటకు "ఆత్మనః ఆసనం" (తన యాసనమని చెప్పబడెను. పరుని యిచ్ఛ నియమము లేనందున పరాసనముకూడ విక్షేపకారియే యగును కాన అట్లు చెప్పుట సమంజసమే ॥౧౧॥

శంకరానందీయము:—పూర్వమునందు యోగమునకు బహిరంగసాధనమును, అంతరంగ సాధనమును సంక్షేపముగ జెప్పి యిపుడు యోగమునకు బహిరంగసాధనములగు దేశము, ఆసనము, శరీరధారణ మొదలగువాటిని, అంతరంగసాధనములను విశేషరూపముగ బోధించుటకు మొదలిడి మొట్టమొదట ఆసనలక్షణమును "శుచౌ దేశే" అను దానిచే చెప్పుచుండెను.

శాంకరభాష్యమ్ :—

అథేదానీం యోగం యుంజత ఆసనాహారవిహారాదీనాం యోగసాధనత్వేన నియమో వక్తవ్యః, ప్రాప్తయోగలక్షణం తత్ఫలాది చేత్యత ఆరభ్యతే। తత్రాసనమేవ తావ త్ప్రథమ ముచ్యతే- శుచౌ శుద్ధే వివిక్తే స్వభావత సంస్కారతో వా దేశే స్థానే ప్రతిష్ఠాప్య స్థిర మచల మాత్మన ఆసనం నాత్యుచ్ఛ్రితం నాతీవోచ్ఛ్రితం నాప్యతినీచం తచ్చ చైలాజినకుశోత్తరం చైల మజినం కుశా శ్చోత్తరే యస్మి న్నాసనే తదాసనం చైలాజనకుశోత్తరం పాఠక్రమా ద్విప రీతోఽత్ర క్రమ శ్చైలాదీనామ్ ॥ ॥౧౧॥

శాంకరభాష్యార్థబోధిని:—

యోగస్వరూపమును, కొన్ని యోగాంగములను చూపి (చెప్పి) యోగాభ్యాస మొనరించువారికి ఆసనము, ఆహారము, విహారములు యోగసాధనములుగ నియమము చెప్పద గియున్నది మఱియు పొందబడిన యోగముకలవాని లక్షణము, యోగఫలమగు సమ్యగ్జ్ఞానము, సమ్యగ్జ్ఞానఫలమగు మోక్షము, యోగభ్రష్టున కత్యంతము వినాశము లేకపోవుట చెప్పదగియున్నది. కాన నందునిమిత్త ముత్తరగ్రంథ మారంభింప బడుచుండెను ఇది యిట్లుండ యోగానుష్ఠానమునకు ప్రధానమైనయాసనమును "ఆసీన స్సంభవాత్" అను సూత్రానుసా రము ముందుగ చెప్పుచుండెను. ఈచెప్పుటవలన యోగాభ్యాసము కూర్చుండి చేయవలెనా? పరుండియా? నిలుచుండియా? నడుచుచుండియా? ఏదియైన కార్యమును చేయుచుండియా? అను శంక తొలగింపబడెను. స్వభావమువలనకాని, గోమయాదిసంస్కారమువలనకాని పరిశుద్ధ మైన రహస్యప్రదేశమునందు అత్యున్నతముకానట్టియు, అతినీచము(పల్లము) కానట్టియు, "చిత్రాసనము, కృష్ణాజినము, దర్భాసనము ఉత్తరోత్తరమునందు గల" అను పాఠక్రమమునకు విపరీతముగ గ్రహించిన దర్భాసనమును ముందుగ నమర్చి దానియందు కృష్ణాజినమును దాని యందు చిత్రాసనమునుకాని, పట్టువస్త్రమునుకాని యుంచి చలనరహితమగు నాసన మును తనకు యేర్పరచుకొని. ఈశ్లోకమునందు "ఆత్మనః" అని చెప్పుటవలన యోగాభ్యాస మొనరించువానికంటెయితరున కీయాసనము కాదని స్పష్టపరచబడెను. "నాత్యుచ్ఛ్రితం" అని చెప్పుటవలన పతనశంక తొలగింపబడెను. "నాతినీచం" అని చెప్పుటవలన భూతలమునందుండు పాషాణాదుల స్పర్శకలిగినచో వాతక్షోభవలన నగ్నిమాంద్యము సంభవించు నను శంక తొల గింపబడెను. "స్థిరం" అని చెప్పుటవలన ఆసనము స్థిరముకానిచో నచట కూర్చుండి యోగానుష్ఠా నము చేయువానికి సమాధానము సంభవింపనందున యోగము సిద్ధింపదను శంక తొలగింప బడెను. ॥౧౧॥

మార్జనప్రోక్షణాదిక్రియలచేగాని, స్వభావముచలనగాని శుద్ధమైనదియు, జనశూన్యమైన ప్రదేశము నందు, అనగా నదీతీరగిరిగుహాదులయందు అత్యున్నతము కానట్టియు, అతినిమ్నము కానట్టియు. (అత్యున్నత మగుచో ఒకానొకసమయమున పారవశ్యముచే చలనపతనాదివిఘ్నము ప్రాప్తించెడిని. అట్లు కాకుండుటకు "నాత్యుచ్ఛ్రితం" అని చెప్పబడెను. అతినిమ్నమగుచో శైత్యోష్ణపాషాణాదిఘర్షణచే క్లేశము ప్రాప్తించెడిని. అట్లు క్లేశప్రాప్తి కాకుండుటకు "నాతినీచం" అని చెప్పబడెను "చేలాజినకుశోత్తరం" మొదట దర్భాసనము దానియందు వ్యాఘ్రాసనముకాని కృష్ణాజినమునుకాని దానియందు మృదువస్త్రమును కల యాసనమును తనకు

గీ॥ తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః।
ఉపవిశ్యాసనే యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే॥ ॥౧౨॥

**పదవిభాగము:—తత్ర—ఏకాగ్రం—మనః—కృత్వా—యతచిత్తేన్ద్రియక్రియః—ఉపవిశ్య—ఆసనే—యుంజ్యాత్—యోగం—ఆత్మవిశుద్ధయే ॥ ॥౧౨॥**

**ప్రతిపదార్థము:— తత్ర=అట్టి; ఆసనే=ఆసనమునందు; ఉపవిశ్య=కూర్చుండి; మనః=మనస్సును, ఏకాగ్రం=ఏకాగ్రమైనదానినిగ; కృత్వా=చేసి; యతచిత్తేన్ద్రియక్రియః=యత=నియమముచేయబడిన, చిత్త=చిత్తముయొక్కయు, ఇంద్రియ=ఇంద్రియములయొక్కయు, క్రియః=వ్యాపారములవాడై; (అనగా మనస్సును, ఇంద్రియములను నిరోధించుటచే వాటివ్యాపారములులేనివాడై) ఆత్మవిశుద్ధయే = ఆత్మ=అంతఃకరణముయొక్క విశుద్ధయే=పరిశుద్ధికొఱకు; యోగం=యోగమును; యుంజ్యాత్=అభ్యసింపవలెను. ॥౧౨॥**

---

**శాంకరభాష్యమ్:—**

ప్రతిష్ఠాప్య కిమ్?—తత్ర తస్మి న్నాసన ఉపవిశ్య యోగం యుంజ్యాత్। కథం?, సర్వవిషయేభ్య ఉపసంహృత్యైకాగ్రం మనః కృత్వా యతచిత్తేన్ద్రియక్రియః, చిత్తం చేన్ద్రియాణి చ చిత్తేన్ద్రియాణి తేషాం క్రియా స్సంయతా యస్య స యతచిత్తేన్ద్రియక్రియః। స కిమర్థం యోగం యుంజ్యా దిత్యాహాఽఽత్మవిశుద్ధయేఽన్తఃకరణస్య విశుద్ధ్యర్థ మిత్యేతత్॥ ॥౧౨॥

---

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

పూర్వోక్తమగు నాసనమును సంపాదించి యేమి చేయవలె ననెదవా? అట్టి యాసనమునందు కూర్చుండి యోగాభ్యాసమును చేయవలెను. ఎట్లు యోగము నాచరింపవలెను? శబ్దస్పర్శరూపరసగంధాది సర్వవిషయములనుండి మనస్సును మరలించి యొక్క ధ్యేయవస్తువునందే మనస్సును నిలిపి, చిత్తముయొక్క, యింద్రియములయొక్క బాహ్యక్రియల సంయమమును జేసినవాడై, అనగా చిత్తమును, ఇంద్రియములను బాహ్యక్రియలయందు ప్రవర్తింపకుండగ జేసినవాడై యోగానుష్ఠానపరుడు కావలెను. పూర్వమునందు చెప్పఁబడిన యాసనమునందు కూర్చుండి పైన చెప్పిన విధమున యోగము ననుష్ఠించిన నేమిఫలము ప్రాప్తించును? అని ప్రశ్నించెదవా? వినుము చెప్పెద. అంతఃకరణపరిశుద్ధికొఱకు పూర్వమునందు చెప్పఁబడిన విధమున నాసనము నేర్పరచుకొని అందు కూర్చుండి పైనచెప్పిన విధమున యోగము ననుష్ఠించిన నంతఃకరణము పరిశుద్ధ మగునని యాశయము. ॥౧౨॥

---

**యేర్పరచవలెను. "వస్త్రం దారిద్ర్యదుఃఖాయ దారు రోగాయ చోపలః" వస్త్రముపైకూర్చుండి ధ్యానించిన దారిద్ర్యదుఃఖము, దారుమయమగు పీటయందు కాని రాయియందు కానికూర్చుని ధ్యానించిన (జపించిన) రోగము ప్రాప్తించుననిస్మృతి బోధించుచుండ ఆసననియమములలో వస్త్రమును జెప్పుట యసంగతము కాదా యని శంకింపజనదు. పైస్మృతివాక్యము గృహస్థునకు వస్త్రము పనికిరాదని బోధించును కాని యతివిషయము కాదు. ధ్యానించుయతిపైనచెప్పిన విధమున యాసనమును నిశ్చలమగునటుల కల్పించుకొని, (ఇట పైశ్లోకముతో యన్వయము.) ॥౧౧॥**

—: ౬వ అధ్యాయము. ౧౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. :—

**మధుసూదనసరస్వతీయము:— ఇట్టి యాసనమును ప్రతిష్ఠచేసి యేమిచేయవలయు ననుశంకపై కర్తవ్యమును "తత్ర" అను శ్లోకముచే జెప్పుచుండెను. అట్టి యాసనమున నిలుచుండి ధ్యానముచేయరాదు. అట్లగుచో శరీరము పడిపోవునేమో యని మనస్సు విక్షిప్త మగును. పరుండియు ధ్యానింపవలదు. అట్లగుచో ఒకానొకప్పుడు నిద్ర ప్రాప్తించి ధ్యానచ్యుతుడగును. మరేమిచేయవలె ననిన? "ఉపవిశ్యైవ" అట్టి యాసనముపై**

గీ॥ సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్॥ ॥౧౩॥

**పదవిభాగము:**— సమం-కాయశిరోగ్రీవం-ధారయన్-అచలం-స్థిరః-సంప్రేక్ష్య-నాసికాగ్రం-స్వం దిశః-చ-అనవలోకయన్॥ ॥౧౩॥

**ప్రతిపదార్థము:**— కాయశిరోగ్రీవం=శరీరమును, శిరస్సును, కంఠమును; సమం=సమానముగునట్టుల; అచలం = చలనములేకుండునట్లు; ధరయన్ = ధారించువాడై; స్థిరః=స్థిరుడై; స్వం=తనసంబంధమగు; నాసికాగ్రం=నాసికయొక్కయగ్రభాగమును; సంప్రేక్ష్య=లెస్సగచూచువాడువలెనుండి; అంతరా=(ఈపదమధ్యాహార్యము) మధ్యమధ్య; దిశః=దిక్కులను; అనవలోకయంశ్చ=చూడనివాడై; ॥౧౩॥

**శాంకరభాష్యమ్:**—

బాహ్యమాసన ముక్త మధునా శరీరధారణం కథ మిత్యుచ్యతే- సమం కాయశిరోగ్రీవం కాయ శ్చ శిర శ్చ గ్రీవాచ కాయశిరోగ్రీవం తత్సమం ధారయ న్నచలం చ సమం ధారయత శ్చలనం సంభవ త్యతో విశిన ష్ట్యచల మితి। స్థిరో భూత్వేత్యర్థః। స్వం నాసికాగ్రం సంప్రేక్ష్య సమ్య క్ప్రేక్షణం దర్శనం కృత్వేవేతీవశబ్దో లుప్తో ద్రష్టవ్యః। నహి స్వనాసికాగ్రసం

**శాంకరభాష్యార్థబోధిని:**—

ఇంతకు పూర్వమునందు బాహ్యమగు నాసనమును చెప్పి యిపుడు శరీరధారణ మెట్లు చేయవలె ననుశంకకు సమాధానమును 'సమం" అనుశ్లోకముచే చెప్పుచుండెను. శరీరమధ్య భాగమును, శిరస్సును, కంఠమును ఋజువుగ (తిన్నగను) చలనములేనిదానిగను ధరించువాడై, ఇట శరీరమును, శిరస్సును, కంఠమును సమానముగ ధరించునపుడు శరీరమునకు చలనము

గూర్చుండి (కూర్చుండవలయునను ఈ విషయమునె "ఆసీన స్సంభవాత్" అను బ్రహ్మసూత్రముకూడ బోధించుచున్నది.) "దృశ్యతే త్వగ్ర్యయాబుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" అను శ్రుత్యనుసారము అంతఃకరణము సర్వవిక్షేపరహితమగుచో నతిసూక్ష్మ మగును. అట్టి తీరునయతిసూక్ష్మమైన యంతఃకరణమే బ్రహ్మసాక్షాత్కార యోగ్య మగును. అట్టితీరున బ్రహ్మసాక్షాత్కారయోగ్యతయే యాత్మవిశుద్ధి. అట్టి యంతఃకరణవిశుద్ధికొఱకు చిత్తముయొక్కయు, ఇంద్రియములయొక్కయు క్రియావృత్తులు బయలువెడలకుండగ జేసినవాడై రాజసతామసవ్యుత్థానము అనెడి భూమికాత్రయ పరిత్యాగపురస్సరముగ నేకవిషయకధారావాహికానేకవృత్తులు కలదానినిగను, అతిశయించిన సత్త్వగుణము కలదానినిగను మనస్సును దృఢభూమికాపురస్సరముగ ప్రయత్నపూర్వకముగజేసి ఏకాగ్రతవృద్ధిపొందునిమిత్తము సంప్రజ్ఞాతసమాధినభ్యసింపవలయును "బ్రహ్మాకారమనోవృత్తిప్రవాహో౽హంకృతింవినా।సంప్రజ్ఞాతసమాధి స్స్యా ద్ధ్యానాభ్యాసప్రకర్షతః" ధ్యానాభ్యాస ముత్కృష్టమైనచో నహంకృతినివిడచి బ్రహ్మాకారమనోవృత్తిప్రవాహము బయలుదేరును. అదియే సంప్రజ్ఞాతసమాధి యనబడును. ఇట్టి యభిప్రాయముచేతనే శ్రీకృష్ణపరమాత్మ "యోగీ యుంజీత సతతం, యుంజ్యా ద్యోగ మాత్మవిశుద్ధయే, యుక్త ఆసీత మత్పరః" అని యనేకసార్లు ధ్యానాభ్యాసప్రకర్షనే విధించుచుండెను. ॥౧౨॥

**శంకరానందీయము:**—పైలక్షణములు కల యతికి అవిద్యాకార్యదేహేంద్రియాదులయందు "నేను, ఇది నాది"అనునట్టివి మొదలుగాగల యసత్ప్రత్యయములు, తత్కారణవాసనలు నిశ్శేషముగ నశించుటయేయంతఃకరణముయొక్క విశుద్ధి. అట్టి విశుద్ధిసిద్ధికొఱకు బ్రహ్మమునం దాత్మభావముచే పురుషుని యోజనముచేయును గాన యోగ మనబడును. అదియే సమాధి. అట్టి యోగరూపమగు ప్రత్యక్ప్రత్యయసంతానమును చేయవలయును ॥౧౨॥

శాంకరభాష్యమ్ :—

ప్రేక్షణ మిహ విధిత్సితం, కిం తర్హి? చక్షుషో దృష్టిసన్నిపాతః। స చాంతఃకరణసమాధానాపేక్షో వివక్షితః। స్వనాసికాగ్రసంప్రేక్షణమేవ చే ద్వివక్షితం మన స్తత్రైవ సమాధీయేత నాత్మని। ఆత్మని హి మనస స్సమాధానం వక్ష్యతి "ఆత్మసంస్థం మనః కృత్వా" ఇతి। తస్మా దివశబ్దలోపేనాపేక్షో దృష్టిసంనిపాత ఏవ సంప్రేక్ష్యే త్యుచ్యతే। దిశశ్చానవలోకయ న్దిశాం చావలోకన మన్తరాఽకుర్వ న్నిత్యేతత్॥ ॥౧౩॥

శాంకరభాష్యతత్త్వబోధని :—

సంభవించును. కాన నట్టిచలనము కలదని "అచలం" అని చెప్పఁబడెను. స్థిరుడై (శరీరేంద్రియములను విషయపారవశ్యమును పొందనివాటిగ జేసినవాడై,) తననాసికాగ్రమును చూచుచున్నవాడువలె ఇట 'సంప్రేక్ష్య" అనియే యున్నది కాని "ఇవ" అను శబ్దము కానరాదే. 'చూచువాడువలె" అను యర్థ మెట్లు ప్రాప్తించు నని శంకింపఁజనదు. ఇవశబ్దము లుప్తము. లుప్తమగు "ఇవ' అనుశబ్దమును స్మరించుకొని తదర్థగ్రహణ మావశ్యకము అంతియే కాని స్వనాసికాగ్రసంప్రేక్షణ మిట విధింపబడుటలేదు. మరేమనిన చక్షురింద్రియముయొక్క సంన్నిపాతము చక్షురింద్రియమునకు రూపాదివిషయప్రవృత్తిరాహిత్యము వివక్షితము (అదియే విధింపబడునున్నది) సమాధానమిచట ప్రధానముగ వివక్షచేయబడుటవలన చక్షురింద్రియము బహిర్విషయముకలదగుటచే చిత్తసమాధానము భంగమునొందవలసివచ్చునని చక్షురింద్రియమును విషయములనుండి మరలించి యాత్మయందే సంన్నిపాతము వివక్షితము. అట్లు కాక స్వనాసికాగ్రసంప్రేక్షణమే వివక్షితమగుచో మనస్సు స్వనాసికాగ్రమునందే సమాధానమును పొందెడిని. ఆత్మయందు చిత్తసమాధానము లేకపోయెడిని. అట్లగుచో "ఆత్మసంస్థం మనః కృత్వా" అని ఆత్మయందు చిత్తసమాధానమును ముందుశ్లోకమునందు చెప్పుచుండెను. దానికి విరోధము ప్రాప్తించెడిని. కాన నీ శ్లోకమునందు ఇవశబ్దలోపముచే దక్షిణోత్తరచక్షుస్సుల యేదృష్టికలదో ఆదృష్టికి బాహ్యవిషయవైముఖ్యముచే నాత్మయందే సంనిపాతము "స్వం నాసికాగ్రం సంప్రేక్ష్య" అను దానిచే వివక్షితము. అని చెప్పఁబడుచుండెను. యోగానుష్ఠానమధ్యయందు దిక్కుల నవలోకించనివాడై. ॥౧౩॥

—: ౬వ అధ్యాయము ౧౩వ శ్లోకవ్యాఖ్యావిశేషణములు :—

**మధుసూదనసరస్వతీయము:**—యోగమునిమిత్తము బాహ్యమైన యాసనమును చెప్పి శరీరధారణ మెట్లు చేయవలయు నను విషయమును "సమం కాయశిరోగ్రీవం" అను దానిచే బోధించుచుండెను.

శరీర మధ్యభాగమును, శిరస్సును, కంఠమును, మూలాధారము మొదలు మూర్ధాంతపర్యంతము వంకరలేకుండగ, చలింపకుండగ ధరియించి అనగా నేకతత్త్వాభ్యాసముచేత- విక్షేపమునకు సహభావి (కూడయుండెడి) యంగచలనాదులు లేకుండగ జేసి, దృఢప్రయత్నముకలవాడై తన నాసికాగ్రమును చూచువాడువలె అనగా విషయవిక్షేపరాహిత్యముకొరకు విషయప్రవృత్తిరహితుడై యర్ధనిమీలితనేత్రుడై ధ్యాననిష్ఠాకాలమున మధ్యమధ్య యోగప్రతిబంధకమగు దిక్కులను చూచుటను వదలి. ॥౧౩॥

**శంకరానందీయము:**— తిరిగి యాంతరంగికమగు యోగాంగములనే యుపదేశించుచు యిట్టి లక్షణములు గల యతి సమాధిని చేయవలెనని "సమం" అను రెండుశ్లోకములచే బోధించుచుండెను.

గీ॥ ప్రశాన్తాత్మా విగతభీ ర్బ్రహ్మచారివ్రతే స్థితః।
మన స్సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః॥ ॥౧౪॥

పదవిభాగము:— ప్రశాన్తాత్మా - విగతభీః - బ్రహ్మచారివ్రతే-స్థితః-మనః-సంయమ్య-మచ్చిత్తః-యుక్తః-ఆసీత-మత్పరః॥ ॥౧౪॥

ప్రతిపదార్థము:— ప్రశాన్తాత్మా = ప్రశాన్త=ప్రకర్షగ శాంతిపొందిన, ఆత్మా = అంతఃకరణముకలవాడై, విగతభీః=విగత=పోయిన, భీః=భయముకలవాడై; బ్రహ్మచారివ్రతే=బ్రహ్మచారి= బ్రహ్మచారియొక్క, వ్రతే=వ్రతమగు బ్రహ్మచర్యమునందు; (గురుశుశ్రూష, భిక్షాన్నభోజనము, మూడుకాలములయందు స్నానము చేయుట, శౌచాచమనము మొదలగు వ్రతములయందు) స్థితః=ఉండినవాడై; మనః = మనస్సును; సంయమ్య = నియమించి, (అనగా మనోవృత్తులను నిరోధించి) యోగనిష్ఠః=(ఈ పదమధ్యాహార్యము) యోగనిష్ఠుడై; భవేత్=(ఈపదమధ్యాహార్యము) కావలయును; మచ్చిత్తః=పరమేశ్వరునియందుచిత్తముకలవాడై; యుక్తః=సమాహితుడై; మత్పరః=పరమేశ్వరుడే పరుడుగా కలవాడై; ఆసీత=కూర్చుండవలయును; ॥౧౪॥

---

కటిపైభాగము శిరస్సు కంఠము వీటిని ఋజువుగ (తిన్నగ) నుండునటుల ధరియించినవాడై, కాయశిరోగ్రీవములను ఋజువుగ ధరియించిన పార్శ్వములయందు వెనుకభాగమునందు చూచుటకు స్పృశించుటకు శక్యము కాదు. అయినను మశకపిపీలికాదుల యుపద్రవము ప్రాప్తించిన చలనము ప్రాప్తించును. అందు నిమిత్తము "అచలం" అని చెప్పెను. అనగా చలింపకుండగ కాయశిరోగ్రీవములను ధరించినవాడై యని యర్థము. స్థాణువువలె నిశ్చలుడై తన నాశికాగ్రమును చూచుచున్నవాడై "చక్షుషా నాశికాగ్రం సంప్రేక్ష్య" అనిచెప్పుట చక్షురింద్రియముచే రూపమును గ్రహింపరాదని నియమమునిమిత్త మని గ్రహింపనగును. ఇంతియే కాని నాశికాగ్రదర్శనార్థము కాదని గ్రహింపవలెను. ఇచట నాశికాగ్రదర్శనమే వివక్షితమగుచో మనస్సు నాశికాగ్రాకారమున యచటనే యుండును. అందుచే చిత్తమునకు బ్రహ్మయం దవస్థానము సంభవింపదు. బ్రహ్మమునందు చిత్తముయొక్క స్థాపన నిమిత్తము కదా సమాధి. అందులకే "ఆత్మసంస్థం మనః కృత్వా" అని చెప్పబడుచున్నది. అందుచే చక్షుస్సుచే నాశికాగ్రదర్శనవిధి రూపాగ్రహణ సూచన నిమిత్తమై చక్షుస్సుయొక్కయచాంచల్యము నిమిత్తము. దీనివలన దేలినయాశయ మేమి? చక్షుస్సు యెటుల రూపమును గ్రహింపకుండునో అట్లే శ్రోత్రాదీంద్రియములు కూడ శబ్దాదులను గ్రహింపకుండగ జేయవలెనని వివక్షితము. చక్షుస్సునకు రూపాగ్రహణ విధివలననే 'దిశశ్చానవలోకయన్' అని నిదిధ్యాసువును నియమించుచున్నాడు విచారింప నాశికాగ్రదర్శనవిధిచేతనే దానికన్న వ్యతిరిక్తమగు దర్శనము అన్నియు నిషేధింపబడుచున్నవి. అయినను క్వచిత్ ముందువెనుక పార్శ్వములయందు విపరీతశబ్దము ఒయలువెడలినను ప్రాచ్యాదిక్కులను తన శరీరమును చూడనివాడై యుక్తుడై కూరుచుండవలెనని యుత్తరశ్లోకముతో యీ శ్లోకమునకు సంబంధము. ॥౧౩॥

పరమార్థప్రప:— యోగశాస్త్రప్రకార మాసనమున కూర్చుండినచో గుదలింగమధ్యనున్న ఆధారచక్రమువలన మూలబంధాది బంధత్రయము సిద్ధించి అధివ్యాధిమనోవేగము ఉపశమించును. దానివలన కాయగ్రీవశిరస్సులకు ఋజుత్వము స్థాణువు వలె సంభవించును. ॥౧౩॥

—:౬వ.అధ్యాయము — ౧౪వ.శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— నిదాన (కారణ) నివృత్తిప్రకర్షచే శాంతించిన రాగాదిదోషములు కల యంతఃకరణము కలవాడై శాస్త్రీయదార్ఢ్యముచే నశించిన యుక్తత్వా యుక్తత్వశంక (సంశయము) కలవాడై బ్రహ్మచర్య గురుశుశ్రూషా భిక్షాభోజనాదులు కలవాడై మనస్సును శబ్దస్పర్శరూపరసగంధ రూపవిషయాకారవృత్తిశూన్యముగ నొనరించి, ప్రత్యగ్రూపమగు పరమేశ్వరునియందు అనగా సగుణమునందు కాని, నిర్గుణమునందు కాని చిత్తమునిలిపి పరమేశ్వరవిషయకధారావాహిక చిత్తవృత్తి కలవాడై యని యర్థము. ప్రియమైన పుత్రపౌత్రాదులు

శాంకరభాష్యమ్ :—

కించ— ప్రశాన్తాత్మా ప్రకర్షేణ శాన్త ఆత్మాఽన్తఃకరణం యస్య సోఽయం ప్రశాన్తాత్మా విగతభీ ర్విగతభయో బ్రహ్మచారివ్రతే స్థితో బ్రహ్మచారిణో వ్రతం బ్రహ్మచర్యం గురుశుశ్రూషాభిక్షాభుక్త్యాది స్తస్మింస్థిత స్తదనుష్ఠాతా భవే దిత్యర్థః। కించ మనః సంయమ్య మనసో వృత్తీ రుపసంహృత్యే త్యేత న్మచ్చిత్తో మయి పరమేశ్వరే చిత్తం యస్య సోఽయం

శాంకరభాష్యతత్త్వబోధిని :—

మఱియు రాగద్వేషాదిదోషములు తత్కారణము లేనట్టియంతఃకరణముకలవాడై పోయిన భయముకలవాడై (సర్వకర్మపరిత్యాగమునందు శాస్త్రీయనిశ్చయవశమువలన నిస్సందిగ్ధమగు బుద్ధికలవాడై) బ్రహ్మచారివ్రతములగు గురుశుశ్రూష, భిక్షాన్నాశనము, మూడుకాలములయందు స్నానముచేయుట, శౌచాచమనము మొదలగు వాటి నాచరించువాడై, మనోవృత్తుల నరికట్టినవాడై యోగనిష్ఠుఁడై యుండవలెను.

చిత్తనియుక్తైయుండ పరమేశ్వరునిచింతింపదగినవానిని చెప్పుట యొప్పు పానగునను శంకపై "మత్పరః" అని చెప్పుచుండెను. పరమానందరూపముగుటవలన నేనేప్రధానము (ప్రియము)గా కలవాడై, ఈ విషయము నే "తదేతత్ప్రేయః పుత్రాత్ప్రేయో విత్తాత్ప్రేయోఽన్యస్మాత్సర్వస్మా దాన్తరం యదయ మాత్మా" ఈ యాత్మయనునది యన్నిటికంటె యాంతరముగుటవలన ప్రేయోరూపము (ప్రియము) పుత్రునికంటె విత్తముకంటె యితరములన్నిటికంటె ప్రియమని శ్రుతియే ఘోషించుచున్నది. ఈ ప్రకారమున విషయాకార సర్వవృత్తి నిరోధపురస్సరముగ భగవదేకాకారచిత్తవృత్తికలవాడై సంప్రజ్ఞాతసమాధికలవాడై పూర్వోక్తమగు యాసనమునశక్తి నతిక్రమింపకుండగ కూర్చుండవలెను. ఆసనమునుండి స్వేచ్ఛచే లేవరాదు.

లోకమున ఒకానొక రాగి స్త్రీచిత్తుడగును. కాని వాడు స్త్రీనే పురుషార్థముగను, ఆరాధన చేయదగిన దానినిగను గ్రహింపడు. మఱేమి చేయునని రాజును గాని, దేవుని గాని పరుని ఉత్కృష్టునిగను ఆరాధ్యునిగను గ్రహియించును. యోగి యన్ననో మచ్చిత్తుడై మత్పరుడై పరమేశ్వరుడనగు నన్నే సర్వారాధ్యునిగ తలంచును. అనునది శ్రీ శంకరభగవత్పాదుల భాష్యము. "వ్యాఖ్యాతృత్వేఽపి మే నాత్ర భాష్యకారేణ తుల్యతా। గుంజాయాః కింను హేమ్నైక తులాయోగేఽపి తుల్యతా ॥" గురువింతగింజలను బంగారముతో కూడ త్రాసునందు తూచుటనిమిత్తముంచినను గురివింతగింజకు బంగరముతో సామ్యము సంభవింపదు. అట్లే నేను వ్యాఖ్యాతనైనను ఈ విషయమై శ్రీ భగవత్పాదులతో సామ్యములేదు. ॥౧౪॥

శంకరానందీయము:— శరీరము, శిరస్సు, కంఠములను సమానముగనుంచుట, స్థిరముగ (చలింపకుండగ) నుండుట, నాశికాగ్రమునందు దృష్టినిలుపుట ఇవి యోగికి యోగసిద్ధినిమిత్తము అంగములని సూచించి వీటికంటె యోగసిద్ధి కంతరంగములగు అసాధారణకారణములను సూచించుచు యీ చెప్పఁబడిన సాధనములతోఁగూడిన యతి సమాధిని చేయవలెనని "ప్రశాన్తాత్మా" అను శ్లోకముచే చెప్పుచుండెను.

ప్రకర్షగ శాంతమైన మనస్సుకలవాడై, అంతఃకరణకు శాంతియనగ రాగద్వేషాదులు పుట్టకుండుట కాదే, అట్టి శాంతికి ప్రకర్షయనగ రాగద్వేషాద్యుత్పత్తికి హేతువులగునట్టి విషయములయందు సమీచీనత్వాసమీచీనత్వ ప్రీత్యప్రీతిష్టసాధనత్వానిష్టసాధనత్వ బుద్ధుల నివృత్తియే. ఇట్టిరీతిన ప్రశాంతమైన యంతఃకరణముకలవాడై. "విగతభీః" అన్నము సేకరించుట దానిని భక్షించి మలరూపమున విసర్జించుట కాక "యికరముగు శాస్త్రీయమైన దంతధావన ముఖప్రక్షాళనాది కర్మలను విడచుటచే శిష్టులు నిందించెదరు" అను భీతివిడచిన వాడై స్వాధ్యాయమును, సర్వకర్మలను "వేదా నిమం లోక మముంచ పరిత్యజ్యాత్మాన మన్విచ్ఛేత్" "త్యజధర్మ మధర్మంచ, నైవధర్మీ నచాధర్మీ నచైవహి శుభాశుభీ" ఇత్యాది శ్రుత్యుక్తప్రకారము పరిత్యజించి నిర్భీకుడై బ్రహ్మచారివ్రతే స్థితః" ఇచట బ్రహ్మచారివ్రతమనగ భిక్షామాత్రమే గ్రహింపనగును. బ్రహ్మచారిధర్మములగు త్రిష

శాంకరభాష్యమ్:—

మచ్చిత్తో యుక్త స్సమాహిత స్స న్నాసీతోపవిశేత్ మత్పరోఽహం పరో యస్య సోఽయం మత్పరః। భవతి కశ్చి ద్రాగీ స్త్రీచిత్తో నతు స్త్రియ మేవ పరత్వేన గృహ్ణాతి, కిం? తర్హి రాజానం మహాదేవం వా, అయం తు మచ్చిత్తో మత్పరశ్చ॥ ॥౧౪॥

శాంకరభాష్యవ్యాఖ్యా తత్త్వబోధినీ:—

ధ్యానమనగ మనోవృత్త్యావృత్తియే కదా. అట్టి మనోవృత్తుల నరికట్టినచో ధ్యానమే సంభవింప దను శంకను తొలిగించుటకు "మచ్చిత్తః" అని చెప్పెను. విషయాంతరములు విషయముగాగల మనోవృత్తుల నరికట్టి నాయందే యుంచబడిన చిత్తముకలవాడై యుండవలెనని దాని యర్థము. పరమాత్మయే పరుడుగా కలవాడై కూర్చుండవలెను. పరమేశ్వరునియందు చిత్తము

---

క్షణస్నానాదికమును గ్రహింపరాదు. ఎందువలననిన? త్రిషవణస్నానాదికము సమాధిచే సంభావితమైన యవిక్రియ బ్రహ్మభిన్నత్వ జ్ఞానధ్వంసకమగుటవలనను "యోగం యుంజీత సతతం" అను స్మృతివలన నిత్యనిరంతర కర్తవ్యముగ ప్రాప్తమైన సమాధ్యనుష్ఠానమునకు విరోధియగుటవలనను బ్రహ్మచారివ్రతములగు త్రిషవణస్నానాదికమును త్యజించి యితరమైన భిక్షాటనమాత్రము బ్రహ్మచారివ్రతపదముచే గ్రహింపనగును. అట్టి బ్రహ్మచారివ్రతమగు మధుకరభిక్షణమునే యతి చేయవలెను. కాని ప్రాక్ప్రణీతాదులనవలంబింపరాదు. ఎందువలననిన ప్రాక్ప్రణీతమనగ తాను భిక్షాటనకు బయలుదేరుటకు ముందుగనే యితరులచే తీసుకురాబడిన యన్నము. అయాచితమనగ తాను యాచింపకుండగ తీసుకురాబడిన యన్నము. తాత్కాలికమనగ భోజనసమయమునకు ప్రాప్తమైన యన్నము. ఈ మూడురకములు ద్రవ్యగురుత్వము, అకాలికత్వము, న్యూనాతిరిక్తత్వము ప్రతీక్షాయనెడి దోషములు కలవగుటచే సమాధివిఘ్నకారులగును. కాన నిట్టియన్నమును గ్రహింపక భిక్షాశనమునే చేయువాడై విషయసంబంధములేకుండునటుల మనస్సునిగ్రహించి బుద్ధి తద్వృత్తి సాక్షియు, చిదేకరసము, ప్రత్యగ్రూపమునగు బ్రహ్మమునందు చిత్తమును నిలిపినవాడై అనగా వెలుపలకు పరుగిడుచున్న చిత్తమును నిగ్రహించి నాయందే స్థాపనచేసినవాడై. ఇచట "మచ్చిత్తః" అనుటచే అస్మచ్ఛబ్దార్థము చిత్తస్థాపనాధికరణమగు బ్రహ్మము. చిత్తమును బ్రహ్మమునందు స్థాపించువాడు తదితరుడు. కాన వారియువురికి భేదము ప్రాప్తించుచున్నది. అట్లగుచో "ఉదరమంతరం కురుతే అథ తస్య భయం భవతి" అను శ్రుత్యనుసారము భేదదర్శికి మోక్షము సంభవింపదని "మత్పరః" అని చెప్పెను. "అహ మేవ పరం ఆత్మా యస్యసః" అనివిగ్రహము. "బ్రహ్మైవాహ మస్మి" అని తనకు బ్రహ్మభావమును గ్రహించువృత్తిచే కూడుకొనినవాడై "ఆసీత" తనను బ్రహ్మముగ భావనచేయుచు నుండవలెను. ॥౧౪॥

పరమార్థప్రపా:— "ప్రశాన్తాత్మా" అను శ్లోకముచే మనోధారణను చెప్పుచుండెను.

సంకల్పరహితమైన యంతఃకరణ కలవాడై, భయమును విడచినవాడై, నిర్జనమైనప్రదేశమున యెటుల భయశూన్యుడై యుండవలెను? అను శంకను తొలిగించుటకు "విగతభీః" అనుపద ముపలక్షణమని గ్రహింపనగును. ఉపలక్షణమనగ జెప్పదగిన విషయములలో కొంతయే చెప్పుట. దీనివలన దేలిన యాశయమేమి? "హ్రీర్ధీర్భీరిత్యేతత్సర్వం మన ఏవ" అను శ్రుతి చెప్పిన మనోధర్మములనన్నిటిని విడచి, సంన్యాసమును గ్రహించుటకు పూర్వము అవసరమగు బ్రహ్మచారుల వ్రతమును గ్రహియించి అత్రిపువ్యతిరేకముగ నిట్టి మహాకార్యమునందు ప్రవృత్తమైనవానికి విఘ్ననాశన మెటులగుననిన? నిరంతరము నన్నే స్మరించువాడై, నన్నే స్మరించుటే నాప్రయోజనము కాదు. మరేమనిన? నేనే పొందదగిన స్థానముగ కలవాడై, యుక్తుడై కూరుచుండవలెను. ఈవిషయమే అతులాగమమునందు జెప్పబడెను.

శాంకరభాష్యతత్త్వబోధిని:—

కలవాడు పరమేశ్వరుడే పరుడుగా కలవాడుకదా తిరిగి 'మత్పరః' అని చెప్పుట యెందులకనిన? ఒకానొక యనురాగి స్త్రీయందే చిత్తముకలవాడై యుండును. కాని ఆస్త్రీనిమాత్రమేపరముగ గ్రహింపడు. మరి యెవరిని పరునిగ గ్రహించును ? రాజునుగాని, మహాదేవునికాని పరునిగ గ్రహించును ఈయోగి యైతే నాయందే చిత్తముకలవాడై. నన్నేపరునిగ గ్రహించునని చెప్పుటకు 'మత్పరః' అని చెప్పబడెను. ॥౧౪॥

"సుఖాసనే సమాసీన స్తత్త్వాభ్యాసం సమాచరన్। సదాభ్యాసేన తత్కార్యాత్పరతత్త్వప్రకాశనమ్॥" సుఖాసనమున కూర్చుండి తత్త్వాభ్యాసము నాచరించుచు యెల్లపుడట్టి యభ్యాసముచే పరతత్త్వప్రకాశన మొనరింపవలయును. "ఆసనం ప్రాణసంరోధః ప్రత్యాహారోఽథ ధారణా। ధ్యానం సమాధి రేతాని యోగాంగాని వరాననే!॥౨॥ ఓ పార్వతి! ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ, ధ్యానము, సమాధి యీయారును యోగాంగములు.

"ఏకాన్తే విజనే రమ్యే గుహాయాం పుణ్యభూమికే। రహితే మశకై ర్దంశై ర్దేవాయతనకేఽపి వా॥౩॥ సిద్ధక్షేత్రే మహాతీర్థే ధ్యానసిద్ధిః ప్రజాయతే। తత్ర సిద్ధాసనం బద్ధ్వా ఋజుకాయం తు ధారయేత్ ॥౪॥" రహస్యమైన, జనరహితమైన రమ్యమైన గుహయందుకాని, పుణ్యభూమియందుకాని, ఈగలు, దోమలు మొదలైనవి లేని దేవాలయమునందుకాని, సిద్ధక్షేత్రమునందుకాని మహాతీర్థమునందుకాని ధ్యానించిన ధ్యానసిద్ధి కలుగును. పైనచెప్పిన యేదో యొకస్థలమున సిద్ధాసనమును బంధించి ఋజువుగ (తిన్నగ) శరీరమును ధరింపవలెను. ॥౩, ౪॥ 'ఊర్ధ్వం మేఢ్రా దధో నాభేః కన్దోగ్రంథి రివ స్థితః। తత్ర నాడ్యః సముత్పన్నాః సహస్రాణి ద్విసప్తతిః॥౫॥' మేఢ్రమునకు పైన నాభికి యధఃప్రదేశమున గ్రంథివలె "కన్దః" దుంపకలదు. దానినుండి డెబ్బదిరెండువేల నాడులు బయలువెడలినవి. ఈవిషయమునే "హితా నామ నాడ్యో ద్వాసప్తతి స్సహస్రాణి హృదయాత్పురీతత మభిప్రతిష్ఠన్తే" అను శతపథబ్రాహ్మణశ్రుతియు బోధించుచున్నది. పురీతతమనగ హృదయాకాశమునందు నాడులచే నిర్మింపబడిన స్థానమని గ్రహింపనగును. ఇడా, పింగళా, సుషుమ్నా, సినీవాలీ, అనుమతి, పూషా, యశస్వినీ, అలంబుసా, కుహూ, శంఖినీ, అని ప్రాణమును వహించు ప్రధాననాడులు పది కలవు. ఇది నాడీచక్రము. అందు ప్రాణవాహికలగు ఇడా, పింగళా, సుషుమ్నా అను మూడునాడులలోను 'ఇడా' అనునాడి వామ (ఎడమ) భాగమునందును, 'పింగళా' అనునాడి దక్షిణ (కుడి) భాగమునందును, 'సుషుమ్నా' అనునాడి రెండిటి మధ్యప్రదేశమునందునను యుండి యీమూడును ప్రాణమార్గములని చెప్పబడుచున్నవి. ఎడమభాగమునందుండు 'ఇడా' అను నాడిచే వాయువును పూరించి, కుడిభాగమునందుండు 'పింగళా' అను నాడిచే పూరింపబడిన వాయువును రేచనచేయవలెను. (వెలుపలికి విడువవలెను.) ఇట్లే ఇడచే వాయువును పూరించుచు పింగళచే నావాయువును వెలుపలికి విడుచుచుండిన నాడీశుద్ధి యగును. శరీరమున ఎడమభాగము చంద్రాంగము, కుడిభాగము సూర్యాంగము అని చెప్పబడును. కాన చంద్రాంగమున 'ఇడా' అను నాడీద్వారమున ప్రాణవాయువును పూరించి, సూర్యాంగమున 'పింగళా' అను నాడీద్వారమున అపానము నభ్యసింపవలయును. పింగళాద్వారమునే వాయువును బయటకు విడవవలెను. అనగా ఎడమముక్కు ద్వారా వాయువును పూరించి కుడిముక్కు ద్వారా వాయువును విడువవలెను. దీనినే "పూరకము, రేచకము" అని అందురు. ఈ ఇడ చంద్రనాడి యనియును, పింగళ సూర్యనాడి యనియు పిలువబడును. చంద్రనాడిద్వారా వాయువును పూరించి ఇడాపింగళల మధ్య

యందున్న సుషుమ్నానాడీమధ్యగతంబైన చిద్రూపమగు పరమేశ్వరుని ధ్యానింపవలెను. యోగులు సుషుమ్నానాడీమధ్యగతంబగు ప్రణవరూపంబైన తారకబ్రహ్మమును నిత్యము ధ్యానించెదరు.

సుషుమ్నానాడీమధ్యగతముగ తారకబ్రహ్మమును ధ్యానించినయెడల తత్క్షణమే సిద్ధి కలుగును. సంశయ మెంతమాత్రము లేదు. ప్రణవాభ్యాసమువలన నాతో సమాన డభ్యాసకు డగును. యని శ్రీశంకరుడు గౌరికి బోధించెను.

యోగమార్తండమునందు :— యోనిస్థానమును కాలిమడమచే గట్టిగ నొక్కిపెట్టి మేఢ్రమునందు పాదమునుంచి నొక్కిపెట్టి శరీరమును తిన్నగ నిలిపి స్థాణువువలె చలింపకుండగ నుండి, యింద్రియముల నరికట్టి చలింపని దృష్టిచే భ్రూమధ్యభాగమును చూచుచుండిన యిది సిద్ధాసన మనిపించుకొనును. ఇట్టి సిద్ధాసనము మోక్షకవాటభేదకమని చెప్పబడెను.

ఎడమతొడయందు దక్షిణ (కుడి) పాదమును కుడితొడయం దెడమపాదమును యుంచి రెండుహస్తములచేతను పాదముల రెండు బొటనవ్రేళ్ళను పట్టుకుని చుబకమును (గడ్డమును) హృదయమునందుంచి నాశికాగ్రమును చూడువానివలె యుండిన యిది పద్మాసన మనిపించుకొనును. యీ పద్మాసనము యోగులకు సర్వవ్యాధివికారములను నశింపజేయును.

1 ఆధారచక్రము, 2 స్వాధిష్ఠానచక్రము, ఈరెండిటిమధ్యయందు కామస్వరూపమైన యోనిస్థానము. ప్రాణాపానముల కైక్యము చేసినచో మూత్రపురీషములు నశించును. మూలబంధనమువలన వృద్ధుడుకూడ యౌవ్వనపుడు పడుచువాడగును. మూలబంధన మనగ కాలిమడమచే యోనిని నొక్కిపెట్టి గుదభాగముమూడుచుకొనునట్లు చేసి అపానమూలమును ఆకర్షించి గుదభాగము ముడుచుకొనునట్లు చేసిన నది మూలబంధ మనుపించుకొనును. ఉదరముయొక్క పశ్చిమ (ఎడమ) భాగమునందు నాభికి ఊర్ధ్వమునందు యీ బంధము చెప్పబడుచున్నది. దీనికి "ఉడ్డియానబంధ" మనిపేరు. ఈ యుడ్డియానుబంధము కంఠమునందు ప్రాప్తించు దుఃఖసముదాయమును నశింపజేయును.

శిరస్సునందుగల జలసమూహమును బంధించిన నభోజలము క్రిందుగ ప్రసరించును. ఇది జాలాంధర బంధ మనుపించుకొనును. ఇది కంఠసంకోచము స్వభావముగా గలది. ఇట్టి కంఠసంకోచరూపమగు జాలాంధర బంధమువలన అమృతము జాఠరాగ్నియందు పడదు. వాయుప్రకోపము సంభవించదు.

తల్లక్రిందుగ కపాలకుహరమునందు జిహ్వను ప్రవేశపెట్టి భ్రూ(కనుబొమ్మల) మధ్యభాగమున దృష్టిని నిలిపిన ఖేచరీముద్ర యనుపించుకొనును.

ఏకాన్తమున తగిన యాసనముకలవాడై, శిరస్సును శరీరమును సమముగ నుంచి నాసాగ్రదృష్టికలవాడై సోమసూర్యాగ్నులు దేవతలుగాకల "భూలోక, భువర్లోక, సువర్లోకములు యే ఓంకారముయొక్క మాత్రలగు అకార ఉకార మకారముల యందుండెనో యట్టి ఓంకారమును పరజ్యోతిరూపముగ జపింపవలెను.

ఆసనముచే రోగమును పోగొట్టుకొనును. ప్రాణాయామముచే పాపమునశింపజేసుకొనును. ప్రత్యాహారముచే యోగి మానసవికారమును త్యజించును. మనోధైర్యమును ధరించుటకొరకు నిశ్చలమైన ధ్యానము చెప్పబడెను. సమాధివలన పుణ్యపాపకర్మలను త్యజించి మోక్షమును పొందును. పదిరెండు ప్రాణాయామములు ప్రత్యాహార మనబడును. పదిరెండు ప్రత్యాహారములు శుభమగు ధారణయగును. పదిరెండు ధారణలు ధ్యాన మనుపించుకొనును. పదిరెండు ధ్యానములు సమాధి యనబడును. ॥౧౪॥

గీ॥ యుంజ న్నేవం సదాఽఽత్మానం యోగీ నియతమానసః ।
శా న్తిం నిర్వాణపరమాం మత్సంస్థా మధిగచ్ఛతి ॥ ॥౧౫॥

**పదవిభాగము :—** యుంజన్–ఏవం–సదా–ఆత్మానం–యోగీ–నియతమానసః–శాన్తిం–నిర్వాణపరమాం–మత్సంస్థాం–అధిగచ్ఛతి ॥ ॥౧౫॥

**ప్రతిపదార్థము :—** యోగీ=యోగి (సంన్యాసి); ఏవం=పూర్వమునందు చెప్పఁబడినవిధమున; ఆత్మానం=మనస్సును; సదా=ఎల్లప్పుడు; యుంజన్=సమాధానమును చేయుచు; నియతమానసః=నియత=సంయతమైన(విషయములయందు బ్రవేశింపకుండఁగ నరికట్టబడిన); మానసః=మనస్సు కలవాఁడై; మత్సంస్థాం=నాయధీనమైన; నిర్వాణపరమాం=మోక్షమే యుత్కృష్టమైన నిష్ఠగాఁగల; శాంతిం=ఉపరతిని; అధిగచ్ఛతి=పొందుచున్నాఁడు. ॥౧౫॥

---

—: ౬వ అధ్యాయము ౧౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు సంప్రజ్ఞాతసమాధినిష్ఠున కేమి ఫలము ప్రాప్తించు ననుశంకపై "యుంజ న్నేవం" అని చెప్పుచుండెను.

యెల్లప్పుడు యోగి రహోవస్థానాదిరూపమగు పూర్వోక్తనియమానుసారము అభ్యాసవైరాగ్యములచే మనస్సును సమాహితమొనరించి యెల్లప్పుడు యోగాభ్యాసపరుఁడై అభ్యాసాతిశయముచే నిరుద్ధమైన మనోవృత్తిరూపమగు వికారములు కలవాఁడై సర్వవృత్త్యుపరతిరూపమైన ప్రశాన్తవాహితమైన తత్త్వసాక్షాత్కారోత్పత్తిద్వారమున సకార్యాఽవిద్యానివృత్తిరూప ముక్తిపర్యవసాయియు, మత్స్వరూపపరమానందరూపనిష్ఠను పొందుచున్నాఁడు. అనాత్మవిషయసమాధి ఫలములగు సాంసారిక మగునట్టి యైశ్వర్యములను పొందఁడు. ఇట్టి సాంసారికైశ్వర్యములు మోక్షోపయోగిసమాధికి విఘ్నకరములుకానట్టి యైశ్వర్యములను పొందఁడని భావము.

ఈ విషయమునే భగవత్స్వరూపుఁడగు పతంజలి "తే సమాధా వుపసర్గా వ్యుత్థానే సిద్ధయః, స్థాన్యుపనిమన్త్రణే సంగస్మయాకరణం పున రనిష్టప్రసంగాత్" అను సూత్రములచే స్పష్టపరచెను. ఈ విషయమునే వశిష్టమహర్షి ఉద్దాలకుఁడు దేవతలచే పిలువఁబడి దేవతలయొద్దకు గమనమందున్న యావరముంచక దేవతలను తిరస్కరించి తిరిగి యనిష్టప్రసక్తినివారణకొరకు నిర్వికల్పసమాధినిష్ఠుఁడాయెనని స్పష్టముగ జెప్పెను.

ముముక్షువులు విడువదగిన సమాధిని పతంజలి యీక్రిందిసూత్రములచే స్పష్టపరచెను. "వితర్కవిచారానందాస్మితానుగమా త్సంప్రజ్ఞాతః" యే సమాధిచే సంశయవిపర్యయానధ్యవసాయరహితముగ భావ్యస్వరూపము విశేషరూపముగ తెలియఁబడునో యాసమాధి సంప్రజ్ఞాతసమాధి యనఁబడును. (భావనావిశేషము.) భావనయనఁగ విషయాంతరపరిహారపురస్సరముగ చిత్తమునందు తిరిగితిరిగి భావ్యమును స్థాపించుటయే. బాహ్యమని, గ్రహణమని, గ్రహీతయని భావ్యము మూఁడువిధములు. అందు స్థూలమని, సూక్ష్మమని గ్రాహ్యము రెండువిధములు. ఈ విషయమునే "క్షీణవృత్తే రభిజాతస్యేవ మణే ర్గ్రహీతృగ్రహణగ్రాహ్యేషు తత్స్థతదంజనతాసమాపత్తిః" అను సూత్రముచే స్పష్టపరచెను. క్షీణమైన రాజసతామసవృత్తులుగల చిత్తమునకు ఆత్మేంద్రియ విషయములయందు "తత్స్థతా" వాటియందే తదేకాగ్రత, "తదంజనతా" తన్మయత్వము అనఁగా న్యగ్భూతమైన చిత్తమునందు భావ్యమానముయొక్క యుత్కర్షముగల "సమాపత్తిః" తద్రూపమగు పరిణామము చిత్తమునకు సంభవించును. ఎట్లనిన ? నిర్మలమైన స్ఫటికమునకు ఆయావస్తువు నాశ్రయించుటవలన యాయావస్తుస్వరూపాపత్తి యెట్లు సంభవించునో అట్లే నిర్మలమగు చిత్తమునకు భావింపదగిన తత్తద్వస్తూపరాగమువలన తత్తద్రూపాపత్తి అనఁగా

శాంకరభాష్యమ్—

అథేదానీం యోగఫల ముచ్యతే—యుంజ న్సమాధానం కుర్వ న్నేవం యథోక్తేన విధానేన సదాఽఽత్మానం యోగీ నియతమానసో నియతం సంయతం మనో యస్య సోఽయం

శాంకరభాష్యార్థప్రబోధిని—

యోగస్వరూపమును, యోగాంగము లగునట్టి యాసనద్వయమును, యోగానుష్ఠానపరున కుండవలసిన విశేషణములను చెప్పి యిపుడు యోగఫలమును చెప్పుచుండెను. సంన్యాసి మనస్సును పూర్వమునందు చెప్పఁబడిన యాసనాదివిధానపురస్సరముగ నెల్లపుడు పూర్వోపదర్శిత విశేషణత్రయము కలవాడై యోగాభ్యాసరతుడగుచు, నియతమగు మనస్సు కలవాడై (విష

సమాపత్తి (సమాధి) సంభవించును. సమాపత్తియనగ సమాధియనగ రెండును ఏకార్థకములు. మొట్టమొదట సమాధి గ్రాహ్యనిష్ఠము అనంతరము గ్రహణనిష్ఠముఅటుపిమ్మట గ్రహీతృనిష్ఠము కానప్రథమభూమిక గ్రాహ్యము, రెండవ భూమిక గ్రహణము. మూడవభూమి కగ్రహీతయే యుండినందున సూత్రమున గ్రహీతృ గ్రహణ గ్రాహ్యేషు అని భూమికాక్రమము నతిక్రమించి తల్లక్రిందులుగ చెప్పినను భూమికాక్రమానుసారము గ్రాహ్యము మొదట రెండుగ్రహణము 3 గ్రాహకమనియె గ్రహింపనగును. ఇంతవరకు తేలిన యాశయమేమి. 1 సవితర్క సమాధి 2 సవిచారసమాధి, 3 సానందసమాధి, 4 సాస్మితసమాధి, యని సంప్రజ్ఞాతసమాధులు నాలుగువిధములనియు అందు సవితర్కసమాధియనగ నెపుడు స్థూలము పంచమహాభూతములు పంచకర్మేంద్రియములు పంచజ్ఞానేంద్రియములను పదునారువికారరూపములగు విషయముల ననుసరించి పూర్వాపరానుసంధానపురస్సరముగ శబ్దార్థోల్లేఖనముగ భావనచేయునో అపుడు సవితర్కసమాధి యనుపించుకొనును.

పూర్వమునందు చెప్పబడిన పదునారువికారరూపములైన విషయముల ననుసరించి పూర్వాపరానుసంధానము శబ్దార్థోల్లేఖనము లేకుండగ నెప్పుడు భావన ప్రవర్తించునో అపుడు నిర్వితర్కసమాధి యనుపించుకొనును. ఈరెండుసమాధులు వితర్కసమాధు లనుపించుకొనును.

తన్మాత్రాంతఃకరణము, సూక్ష్మము అయిన విషయము నవలంబనముగ జేసుకొని అట్టి విషయమునకు దేశకాలము లవచ్ఛేదకములు అనగా ఒక దేశమునందు ఒక కాలమునందు ఆదికలదని యెపుడు భావన ప్రవర్తించునో అపుడు సవిచార సమాధి. తన్మాత్రాంతఃకరణరూపము, సూక్ష్మము నగు విషయము నవలంబనగ జేసుకొని దేశకాలములనెడియవచ్ఛేదమును విడచి యెపుడు ధర్మిమాత్రమును భాసింపజేయు భావన ప్రవర్తించునో అపుడు నిర్విచారసమాధి. ఈరెంటిని విచారసమాధులందురు. ఈవిచారసమాధులే గ్రాహ్యసమాపత్తులు గ్రాహ్యసమాధులు, అనిఅనిపించుకొనును.

యెపుడు అంతఃకరణముసత్త్వరజస్తమోలేశానువిద్ధమై భావన చేయబడునో అపుడు చిచ్ఛక్తి గుణభావనమును పొందుటవలన భావనావిషయమైన సుఖప్రకాశమయమైన సత్త్వముయొక్క యుద్రేకమువలన సానందసమాధి ప్రాప్తించును.

ఈసమాధియందే యెవరు ధైర్యముకలవారై ప్రధానపురుషరూపమగు తత్త్వాంతరమును చూడరో అట్టివారు దేహమునం దహంకారములేనివారగుటవలన విదేహ లనిపించుకొందురు. ఇదియే గ్రహణసమాధి.

అటుపిమ్మట రజస్తమోలేశముచే నభిభూతముకానట్టి శుద్ధసత్త్వము నవలంబనముగ జేసుకొని యేభావన ప్రవర్తించునో ఆభావనయందు గ్రాహ్యమగు సత్త్వముయొక్క న్యగ్భావము (తిరోధానము) వలన చిచ్ఛక్తియొక్క యుద్రేకమువలనను సత్తామాత్రము శేషించినదగుటచేతను ఆసమాధి సాస్మితసమాధి యనుపించుకొనును. ఎచట యంతఃకరణము "అహం" అను యుల్లేఖముచే విషయములను తెలిసికొనునో యది యహంకారమనబడును. ఎచట యంతర్ముఖుడగుటచే ప్రతిలోమపరిణామముచేత చిత్తము ప్రకృతియందు లీనమై సత్తామాత్రి

**శాంకరభాష్యమ్:—**

నియతమానస శ్శాంతి ముపరతిం నిర్వాణపరమాం నిర్వాణం మోక్ష స్తత్పరమా నిష్ఠా యస్యా శ్శాన్తే స్సా నిర్వాణపరమా తాం నిర్వాణపరమాం మత్సంస్థాం మదధీనా మధిగచ్ఛతి ప్రాప్నోతి॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

యములయందు మనస్సు ప్రవేశింపకుండగ నరికట్టినవాడై) నాస్వరూపమగునట్టియు, బ్రహ్మస్వరూపముచే నవస్థానరూపమగు మోక్షమే యుత్కృష్టముగా కల శాన్తిని (సంసారనివృత్తిని) పొందుచున్నాడు. ॥౧౫॥

---

ము భాసింపజేయునో అపుడు "సాస్మిత" అని యనుపించుకొనును. కాన నహంకారాస్మితలకు భేదమని శంకింపజనదు. ఈసమాధియందే యెవరు సంతోషముకలవారో అట్టివారు పరమపురుషుని చూడనివారై ప్రకృతియందు లీనులగుటవలన "ప్రకృతిలయులు" అని చెప్పబడుదురు. ఈసమాధి అస్మితామాత్రరూపమగు గ్రహీతయందే యున్నదగుటచే గ్రహీతృసమాపత్తి (సమాధి) యనుపించుకొనును.

యెవరు కేవలపరమపురుషుని వివేచన చేసి భావనయందు ప్రవర్తించెదరో వారల వివేకఖ్యాతి కేవలపురుషవిషయక మగుటచే యాసమాధి గ్రహీతృసమాధి యనుపించుకొనును. వివేకముచే నస్మితాత్యాగమువలన సాస్మితసమాధి కాదు. అందు గ్రహీతృభానపూర్వకమే గ్రహణభానము గ్రహణభానపూర్వకమే సూక్ష్మగ్రాహ్యభానము. సూక్ష్మగ్రాహ్యభానపూర్వకమే స్థూలగ్రాహ్యభానము. కాన స్థూలవిషయక మగు రెండు విధము లగు వితర్కము గ్రహీత. గ్రహము, (జ్ఞానము) సూక్ష్మము, స్థూలము అనెడి నాలిగింటిని యనుసరించినది.

రెండవది యగు సవిచారసమాధి వితర్కము లేనిదగుటచే త్రితయానుగతము, సానందసమాధి వితర్కవిచారములు లేనిదగుటచే ద్వితయానుగతము. సాస్మితసమాధి వితర్కవిచారానందవికలమై అస్మితామాత్రమగును. కాన ఇట్లు సంప్రజ్ఞాతసమాధి నాలుగువస్థలు కలదై యగుచున్నది.

ఇట్లు (1) సవితర్కసమాధి (2) సవిచారసమాధి (3) సానందసమాధి (4) సాస్మితసమాధి రూపము నాలుగువిధములగు సంప్రజ్ఞాతసమాధులు అంతర్ధానాదిసిద్ధిహేతువు అగుటచే ముక్తికి హేతువగు సమాధికి విరోధులగుటవలన ముముక్షువులచే విడువదగినవి. గ్రహీతృగ్రహణములు చిత్తవృత్తివిషయులైనకాలమున అరెండును గ్రాహ్యకోటియందే ప్రవిష్టములగుటచే హేయోపాదేయకథనముకొరకు గ్రాహ్యసమాపత్తియే సూత్రకారులుచే వివరింపబడెను.

ఇట్లు నాల్గువిధములగు గ్రాహ్యసమాపత్తి స్థూలగ్రాహ్యగోచరమై సవితర్కసమాధియని, నిర్వితర్కసమాధి యని రెండువిధములు. సూక్ష్మగ్రాహ్యగోచరమై సవిచారసమాధియని, నిర్విచారసమాధియని రెండువిధములు. అందు శబ్దార్థజ్ఞానవికల్పములచే సంకీర్ణమై, సవితర్కమై శబ్దార్థజ్ఞానవికల్పములతో గూడి స్థూలార్థావభాసరూపమై, సవితర్కసమాధి స్థూలము విషయముగాగల సవికల్పకవృత్తి యనుపించుకొనును. స్మృతి పరిశుద్ధియైనచో స్వరూపము లేనిదివలె యర్థమాత్రనిర్భాసమై నిర్వితర్కసమాధి యనిపించుకొనును. ఈస్థూలాలంబనమందు శబ్దార్థస్మృతి ప్రవిలయమగుచో తిరిగి జనించిన స్పష్టగ్రాహ్యాకారప్రతిభాసి యగుటచే న్యగ్భూతజ్ఞానాంశకలదగుటచె స్వరూపము లేనిదివలె నిర్వితర్కసమాధి స్థూలగోచరమై నిర్వికల్పకవృత్తి యగును. దీనిచేతనే (ఈ చెప్పుటచే) సూక్ష్మవిషయమైన సవిచారసమాధి, నిర్విచారసమాధి వ్యాఖ్యాతములు.

శబ్దార్థజ్ఞానవికల్పసహితముగ దేశకాలధర్మాద్యవచ్ఛిన్నమై సూక్ష్మార్థము దేనియందు భాసించునో యది సవిచారసమాధి యనబడును. శబ్దార్థజ్ఞానవికల్పరహితమై దేశకాలధర్మాద్యనవచ్ఛిన్నమై సూక్ష్మార్థముదేనియందు భాసించునో అది నిర్విచారసమాధి యనబడును. సవిచారనిర్విచారసమాధులు సూక్ష్మవియత్వవిశేషణములు కలగుటవలన, సవితర్క నిర్వితర్కసమాధులు స్థూలవిషయకములగుటవలన భిన్నములని స్పష్టమగుచున్నది. "సూక్ష్మవిషయత్వం చాऽలింగపర్యవసానం" అనుయోగసూత్రము సవిచారసమాధికి నిర్విచారసమాధికి సూక్ష్మవిషయత్వమునే బోధించుచున్నది. ఈవిషయము అలింగపర్యంతము చూడనగును. ఈచెప్పుటచే సానందసమాధి, సాస్మితసమాధిరూపములైన గ్రహీతృగ్రహణసమాధులు రెండును గ్రాహ్యసమాధియందే యంతర్భావమగు.

చున్నది. అది యెట్లనిన; పార్థివాణువునకు గంధతన్మాత్రము సూక్ష్మము. జలాణువునకు రసతన్మాత్రము సూక్ష్మము. తైజసాణువునకు రూపతన్మాత్రము సూక్ష్మము. వాయవీయాణువునకు స్పర్శతన్మాత్రము సూక్ష్మము. ఆకాశమునకు శబ్దతన్మాత్రము సూక్ష్మము. ఈసూక్ష్మములకన్నిటికి అహంకారము సూక్ష్మము. అహంకారమునకు లింగమాత్రమగు మహత్తత్త్వము సూక్ష్మము. మహత్తత్త్వమునకలింగమగు ప్రధానము సూక్ష్మమగు విషయము. శబ్దస్పర్శరూపరసగంధాత్మకమగు పంచతన్మాత్రలు, అహంకారము. మహత్తత్త్వము అనెడి యేడు ప్రకృతులకు ప్రధానమునందే సూక్ష్మత్వ విశ్రాంతివలన శబ్దాది పంచతన్మాత్రలు, అహంకారము, మహత్తత్త్వము ప్రధానము ఇవి సూక్ష్మములనఁబడును విచారింప ప్రధానముకన్నను పురుషుడు సూక్ష్మమే అయినను పైవాటికి పురుషు డన్వయకారణము కాకపోవుటవలనను, ప్రధానము సర్వమున కన్వయి కారణ మగుటవలనను ప్రధానమే నిరతిశయసూక్ష్మముగ వ్యాఖ్యానింపబడెను. పురుషుడు నిమిత్తకారణమైనను అన్వయి కారణత్వముచే సూక్ష్మత్వమునకు తగడు. యేదోయొక కారణత్వమాత్రముచే సూక్ష్మత్వమును వివక్ష జేయుచో ప్రధానముకన్నను పురుషుడు సూక్ష్మరూపమే యగును. ఈనాలుగు సమాధులు గ్రాహ్యరూపమగు బీజము నవలంబనముగ జేసుకొని ప్రవర్తించునవి కాన సబీజసమాధులనఁబడును. వితర్కము, విచారము, ఆనందము, అస్మితనములననుసరించుటవలన సంప్రజ్ఞాతసమాధు లనికూడ చెప్పనొప్పునని స్థూలవిషయమునందు సవితర్కమని, నిర్వితర్కమని సూక్ష్మవిషయమునందు సవిచారమని, నిర్విచారమని పూర్వమునందే జెప్పఁబడెను. అందు చివరది (నాల్గవది) యగు నిర్విచారసంప్రజ్ఞాతసమాధికి ఫలమేమనిన ? "నిర్విచారవైశారద్యేఽధ్యాత్మప్రసాదః" సవితర్క నిర్వితర్క సమాధులు స్థూలవిషయక మగుటలో సమానమైనను సవితర్కసమాధి శబ్దార్థజ్ఞానవికల్పసంకీర్ణము. కాన దానికంటె శబ్దార్థజ్ఞానవికల్పరహితమగు నిర్వితర్కసమాధి ప్రధానము. అట్టి నిర్వితర్కసమాధికన్నను సూక్ష్మవిషయకము, సవికల్పకప్రతిభాసరూపము నగు సవిచారసమాధి ప్రధానము. అట్టి సవిచారసమాధికన్నను సూక్ష్మవిషయకము, నిర్వికల్పకప్రతిభాసరూపము నగు నిర్విచారసమాధి ప్రధానము. ఈనాలిగింటిలో మొదటివగు సవితర్క నిర్వితర్క సవిచారసమాధులు మూడున్ను నిర్విచారసమాధినిమిత్త మగుటవలన నిర్విచారసమాధిఫలముచేతనే ఫలవత్తులు. నిర్విచారసమాధికి ఫలమేమనిన ? నిర్విచారసమాధిని యుత్కృష్టముగ నభ్యసించుటవలన దానిబలముచే వైశారద్యము ప్రాప్తించును. వైశారద్యమువలన సత్త్వము రజస్తమస్సులచే నభిభూతముకాక యుద్రిక్తమగును. సత్త్వోద్రేకమువలన నధ్యాత్మప్రసాదము, దానివలన క్లేశవాసనారహితమైన చిత్తమునకు భూతార్థవిషయకము, క్రమాననురోధి యగు స్ఫుటమైన ప్రజ్ఞాలోకము ప్రాదుర్భవించును. ఈవిషయమునే "ప్రజ్ఞాప్రసాద మారుహ్యాశోచ్య శ్శోచతో జనాన్। భూమిష్ఠా నివ శైలస్థ స్సర్వా న్ప్రాజ్ఞోఽనుపశ్యతి" పర్వతమునందున్నవాడు భూమియందున్నవారలనుగూర్చినటలె ప్రజ్ఞాప్రసాదము నధిష్ఠించినవాడు యజ్ఞానమువలన దుఃఖించుచున్న జనులను జూచి దుఃఖింపదగినవాడు కాడు (దుఃఖింపడు) అని భాష్యము స్పష్టపరచుచున్నది. ప్రజ్ఞాప్రసాదము ప్రాప్తింప సమాహితచిత్తముకల యోగికి యేప్రజ్ఞ జనించునో యాప్రజ్ఞ "ఋతంభరా" అని యనిపించుకొనును. "ఋతంభరా" అనగా "ఋతం=సత్యం; బిభర్తీతి ఋతంభరా" అని విగ్రహము. సత్యమునే భరించునది. ఆప్రజ్ఞయందు విపర్యాసలేశమైన యుండదుకనుక "ఋతంభరా" అని యౌగికార్థమే సంభవించును. ఈ ఋతంభరా ప్రజ్ఞాయోగమే యుత్తమమైనది. ఈ విషయమే "ఆగమేనానుమానేన ధ్యానాభ్యాసరసేనచ। త్రిధా ప్రకల్పయన్ ప్రజ్ఞాం లభతే యోగ ముత్తమమ్" శ్రవణముచేతను, మననముచేతను, నిదిధ్యాసచేతను, మూడురకములుగ ప్రజ్ఞను కల్పనచేయువాడై యుత్తమమైన యోగమును పొందుచున్నాడని భాష్యము స్పష్టపరచుచున్నది. ఆ ఋతంభరాప్రజ్ఞ విశేషార్థవిషయకమగుటవలన శ్రుతానుమాన ప్రజ్ఞలకన్న భిన్నమైన విషయము కలది. శ్రుతమనగ ఆగమిక విజ్ఞానము. అనగా శ్రుత్యర్థపరిశీలనచే జనించు విజ్ఞానము. అది సామాన్య

విషయకమే. ఏశబ్దమునకు విశేషముతో కూడ సంబంధము గ్రహించుటకు శక్యముకాదు. అట్లే అనుమానప్రమాణముకూడ సామాన్యవిషయకమే. విశేషముతోగూడ దేనికిని వ్యాప్తిని గ్రహించుటకు శక్యము కాదు. కాన శ్రుతానుమాన విషయము విశేష మెన్నటికిని కాదు. సూక్ష్మవ్యవహిత విప్రకృష్ట వస్తువు లోకప్రత్యక్షముచే గ్రహించుటకు శక్యము కాదు. మరేమనిన ? సమాధి ప్రజ్ఞచేతనే గ్రాహ్యమై భూతసూక్ష్మగతమై కాని, పురుషగతమై కాని సవిశేషమగును. కాన శ్రుతానుమానవిలక్షణమైనట్టియు, సూక్ష్మవ్యవహిత విప్రకృష్ట సర్వవిశేష విషయకమైనట్టియు, నిర్విచార వైశారద్యముచే జనించు ఋతంభరాప్రజ్ఞావిషయమై యోగి గొప్ప ప్రయత్నము చేయవలయును.

క్షిప్త మూఢవిక్షిప్తములనెడి వ్యుత్థాన సంస్కారములయొక్క యేకాగ్రతయుండినను సవితర్క నిర్వితర్క సవిచారసమాధులవలన జనించెడి సంస్కారములుండగ నట్టి సంస్కారములచే చలింపజేయబడుచున్న చిత్తమునకు నిర్విచార వైశారద్యపూర్వకమైన నధ్యాత్మ ప్రసాదమువలన లభించెడి ఋతంభరాప్రజ్ఞ యెట్లు సుస్థిరమగునని శంకింపజనదు. ఋతంభరాప్రజ్ఞవలన జనించిన సంస్కారము తత్త్వవిషయకమగు ప్రజ్ఞచే జనించినదగుటచే ప్రబలమైనది. వ్యుత్థానమువలన సవితర్క నిర్వితర్క సవిచారరూప సంప్రజ్ఞాత సమాధులవలన జనించిన సంస్కారములు అతత్త్వవిషయ ప్రజ్ఞాజనితములగుటచే దుర్బలములు. ప్రబలములు దుర్బలములను ప్రతిబంధించును కాన ఋతంభరాప్రజ్ఞాజన్యసంస్కారము దుర్బలమగు వ్యుత్థానజన్యములు సంప్రజ్ఞాతసమాధిజన్యములు నగు సంస్కారములను ప్రతిబంధించుటచే ఋతంభరాప్రజ్ఞయే సుప్రతిష్ఠితమగును. అనగా నట్టి దుర్బలసంస్కారముల తిరోభావమువలన వాటివలన జనించు ప్రత్యయములు జనింపనేరవు. అందుచే సమాధి సంభవించును. దానివలన ఋతంభరాప్రజ్ఞయు, దానివలన సంస్కారములు, ఇదేవిధమున నూతనమగు సంస్కారాశయములు వృద్ధిపొందును. దానివలన ప్రజ్ఞయు, దానివలన సంస్కారములు జనించును.

అతత్త్వ విషయప్రజ్ఞవలన జనించిన వ్యుత్థానసంస్కారములకు తత్త్వమాత్రవిషయ సంప్రజ్ఞాత సమాధిప్రజ్ఞవలన జనించిన సంస్కారములచే ప్రతిబంధ మౌండుగాక, తత్త్వమాత్రవిషయ సంప్రజ్ఞాత సమాధిప్రజ్ఞాజన్యసంస్కారములకు ప్రతిబంధకము లేమిచేసి ఏకాగ్రభూమియందే సబీజసమాధియే సంభవించుగాక, నిరోధభూమియందు నిర్బీజసమాధి సంభవించకపోయెడినని శంకింపజనదు. "తస్యాపి నిరోధే సర్వనిరోధా న్నిర్బీజ స్సమాధిః" ఏకాగ్రభూమిజన్యమైన సంప్రజ్ఞాతసమాధి క్షిప్తమూఢవిక్షిప్తములు యోగి ప్రయత్నవిశేషముచే లయముపొందించిన సర్వనిరోధమువలన సమాధియొక్కయు, సమాధిజన్య సంస్కారము యొక్కయు నిరోధమువలన నిరాలంబమైన అసంప్రజ్ఞాతసమాధి ప్రాప్తించును. అట్టి యసంప్రజ్ఞాతసమాధి సోపాయముగ పూర్వమునందే సూత్రముచే జెప్పబడెను. ఆసూత్ర మేదియన "విరామప్రత్యయాభ్యాసపూర్వః సంస్కారశేషోఽన్యః" "విరామప్రత్యయాభ్యాసపూర్వః" "విరమ్యతే-అనేనేతి విరామః తస్య ప్రత్యయః కారణం పరం వైరాగ్యం" వితర్క-విచారానందాస్మితాది రూపచింతాపరిత్యాగమునకు కారణము పరమవైరాగ్యము. అట్టి వైరాగ్యాభ్యాసము అనగా ఆ వైరాగ్యమును మాటిమాటికి చిత్తమునందు నెలకొల్పుట, అట్టి యభ్యాసమే కారణముగా కలిగినట్టిన్ని, అట్లే సంస్కారమాత్రవిశేషరూప మగు పూర్వమునందు చెప్పబడిన సబీజమునకంటెవిలక్షణమైన నిర్బీజమైనది అసంప్రజ్ఞాతసమాధి అని పై సూత్రార్థము. అసంప్రజ్ఞాతసమాధి ప్రాప్తించుటకు అభ్యాసము, వైరాగ్యము అనెడి రెండు యుపాయములు చెప్పబడినవి. అందు అభ్యాసము సాలంబనముకాన నిరాలంబనసమాధికి హేతువు కానందున నిరాలంబనమగు పరమవైరాగ్యమే నిరాలంబనమగు అసంప్రజ్ఞాతసమాధికి హేతువుగ జెప్పబడుచున్నది. అభ్యాస మన్ననో సంప్రజ్ఞాతసమాధిద్వారా "ప్రణాడ్యా" ఉపయోగపడును. ఈ విషయమే "త్రయ మంతరంగం పూర్వేభ్యః" ధారణాధ్యానసమాధులనెడి మూడుసాధనములున్ను యమనియమాసన ప్రాణాయామప్రత్యాహారము లనెడి యయిదుసాధనముల

కంటె సబీజసంప్రజ్ఞాతసమాధికి అంతరంగసాధనములు. యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహారధ్యాన ధారణసమాధులనెడి వాక్యమునందుగల సమాధిశబ్దముచే అభ్యాసమే చెప్పబడుచున్నది. ముఖ్యమగు సమాధి సాధ్యమగుటవలన యీసాధనకోటియందు ప్రవిష్టమైనసమాధిశబ్దమునకుఅభ్యాసమేయనియర్థమునిగ్రహింపవలెను. “తదపి బహిరంగం నిర్బీజస్య” ధ్యానధారణసమాధిరూపములగు మూడున్ను నిర్బీజసమాధికి (అసంప్రజ్ఞాతసమాధికి) బహిరంగసాధనములు. అనగా అసంప్రజ్ఞాతసమాధికి పరంపరయా కారణములు. పరమవైరాగ్యమున్మాత్రము నిర్బీజసమాధికి (అసంప్రజ్ఞాతసమాధికి అంతరంగసాధనము. అనగా సాక్షాత్తు కారణము. ఈ సమాధియు భవప్రత్యయమని, ఉపాయప్రత్యయమని రెండువిధములు. “భవప్రత్యయో విదేహప్రకృతిలయానాం” సానందులకు పూర్వమునందు చెప్పబడిన ప్రకృతిలయములకు సాస్మితులగు దేవతలకు జన్మవిశేషములవలన కాని, ఓషధివిశేషములవలనకాని, మంత్రవిశేషములవలనకాని, తపోవిశేషములవలనకాని, ఆత్మానాత్మవివేకాన్యరూపమైన భవ (సంసారము)మును కారణముగ జేసుకొని యేసమాధి ప్రాప్తించునో అసమాధి భవప్రత్యయ మనబడును. ఈ భవప్రత్యయరూపసంప్రజ్ఞాతసమాధి పక్షుల కాకాశగమనమువలె వారివారికి జన్మమాత్రమునకు హేతువగుట వలన దీనిని ముముక్షువులు విడవవలెను. “శ్రద్ధావీర్యస్మృతిసమాధిప్రజ్ఞాపూర్వక ఇతరేషాం” జన్మౌషధిమంత్రతపస్సిద్ధులకంటె వేరైనట్టి యాత్మానాత్మవివేకజ్ఞానము కలవారలకు ప్రాప్తించెడిసమాధి శ్రద్ధాదిపూర్వకమైనది. అనగా శ్రద్ధాదు లుపాయముగా కలది. శ్రద్ధయనగా యోగవిషయమైనచిత్తముయొక్క ప్రసాదమే. ఈశ్రద్ధ తల్లివలె యోగిని రక్షించును. శ్రద్ధకలవాని కుత్సాహము కలుగును. ఉత్సాహము కలవానికి యనంతరభూమికలయందు స్మృతి జనించును. అట్టిస్మరణమువలన చిత్తము వ్యాకులతను పొందక యేకాగ్రతను పొందును. సమాహితచిత్తునకు ధ్యేయవిషయమైనప్రజ్ఞ వివేకముచే జనించును దానియభ్యాసమువలనను పరమవైరాగ్యమువలనను ముముక్షువుల కసంప్రజ్ఞాతసమాధి ప్రాప్తించును. “ప్రతిక్షణపరిణామినో హి భావా ఋతే చితిశక్తేః” ఎట్లు సమిత్తులు, ఆజ్యము, హవిస్సు మొదలగువాటి నగ్నియందుంచినపు డాయగ్ని ప్రజ్వలించి వాటిని మానినపు డాయగ్ని క్రమక్రమముగా శాంతించునో అట్లే నిరుద్ధమైన చిత్తముకలవాని కుత్తరోత్తరాధికమైన ప్రశమము (శాంతి) కలుగును. (ప్రవహించును.) అందు పూర్వపూర్వప్రశమజనితసంస్కార ముత్తరోత్తరప్రశమమునకు కారణము. ఇట్టిచిత్తము నిరింధనాగ్నివలె క్రమముగ నుపశమించుచు వ్యుత్థానసమాధి నిరోధసంస్కారములతోగూడ తనప్రకృతియందు లీనమగును. అపుడు సమాధిపరిపాకమువలన, వేదాంతవాక్యశ్రవణమువలన జనించిన సమ్యగ్దర్శనముచే యవిద్య తొలగ నవిద్య కారణముగాగల దృగ్దృశ్యసంయోగము నశింప అయిదువిధములైన వృత్తులు నివర్తింప స్వరూపప్రతిష్ఠారూపమగు పురుషుడు కేవలముక్తుడగునని చెప్పబడుచున్నాడు. ఈవిషయమే “తదా ద్రష్టుస్స్వరూపేఽవస్థానం” సర్వవృత్తినిరోధమైయుండ ద్రష్టకు స్వరూపమునందే యవస్థానము సంభవించునని పై సూత్రము చెప్పుచున్నది. వృత్తిదశయందు నిత్యాపరిణామిచైతన్యరూపమగుటచే నది సర్వదా శుద్ధమైనను అనాదియు అవిద్యకము నగు దృశ్యసంయోగముచే నంతఃకరణతాదాత్మ్యధ్యాసమువలన నంతఃకరణవృత్తి సారూప్యమును పొందుచు అభోక్తయైనను దుఃఖముల ననుభవించువాడువలె నగును. ఈవిషయమే “వృత్తిసారూప్యమితరత్ర” అనుసూత్రముచే స్పష్టపరచెను. చిత్తము ద్రష్టృదృశ్యోపరక్తమైసర్వార్థస్వరూపమై విషయివిషయనిర్భాసరూపమై చేతనాచేతనస్వరూపాపన్నమై విషయాత్మకమైనను అవిషయాత్మకమువలె అచేతనమైనను చేతనమువలె స్ఫటికమణిసమానమై సర్వార్థరూపమగునని చెప్పబడుచున్నది. ఈచిత్తసారూప్యముచే కొందరు భ్రాంతులై చేతనమే యని పలుకుచుండిరి అసంఖ్యేయవాసనలచే చిత్తముకూడ పరార్థము సంహత్యకారి యగుటవలన యెవనిభోగాపవర్గార్థము చిత్తమో వాడు పరమైన చేతనుడు, వాడసంహతుడు, పురుషుడు. ఘటాదులవలె సంహత్యకారి యగు చిత్తము చేతనము కాదు. ఈచెప్పుటవలన దేలిన యాశయమేమి? విశేషదర్శికి ఆత్మభావభావనానివృత్తి

యగును. ఇట్లే యెవఁడంతఃకరణపురుషుల విశేషమును తెలిసికొనునో వానికి పూర్వము నందంతఃకరణమందు గలిగిన యేయాత్మభావన కలదో యది నివర్తించును. భేదదర్శనము కలిగిన యభేదభ్రమ తొలఁగుట న్యాయమే. సత్త్వపురుషుల భేదదర్శనము భగవదర్పిత నిష్కామకర్మవలన సిద్ధించును. ఇట్టివాని లింగము యోగభాష్యమునందు చెప్పఁబడెను. వర్షకాలమున తృణాంకురములు పుట్టుటచే తద్బీజసత్త యెట్లూహింపబడుచున్నదో యట్లే మోక్షమార్గశ్రవణముచే సిద్ధాంతరుచివలనను నెవనికి రోమహర్షము అశ్రుపాతము సంభవించునో (చూడబడునో) వానియందు కర్మాభినిర్వర్తితమగు మోక్షమార్గీయమగు విశేషదర్శనబీజముకలదు. అని యూహింపనగును. యెవనికట్టి కర్మబీజములేదో యట్టివానికి మోక్షమార్గశ్రవణమునందు పూర్వపక్షయుక్తులయందభిరుచి కలుగును. సిద్ధాంతయుక్తులయం దరుచియు జనించును. అట్టివానికి "నేనెవఁడను, నేనెట్లయితిని" అనునది మొదలగు స్వాభావికమైన యాత్మభావన ప్రవర్తించును. ఇట్టి యాత్మభావన విశేషదర్శికి (ఆత్మతత్త్వము తెలిసినవానికి) వర్తించును. అపుడు చిత్తము వివేకనిమ్నమై కైవల్యప్రాగ్భారమై (ప్రాగ్భారమనగ నీచదేశము.( నిమ్నమై జలప్రవాహయోగ్యమై సర్వదా వర్తమానవృత్తి ప్రవాహముచేత ప్రవహించు జలతుల్యమై పూర్వమునందాత్మానాత్మావివేకరూపవిమార్గవాహివిషయ భోగపర్యన్తము యిట్టివానికయి యిపుడాత్మానాత్మ వివేకమార్గవాహికైవల్యపర్యన్తము యగుచున్నది. ఈ వివేకవాహియగు చిత్తమునం దేయంతరాయములు (విఘ్నములు) కలవో యట్టి యంతరాయము లన్నియు సకారణముగ దొలిగింపదగినవని "తచ్ఛిద్రేషు ప్రత్యయాంతరాణి సంస్కారేభ్యః" "హాన మేషాం క్లేశవదుక్తం" అను రెండుసూత్రములచేతను బోధించుచుండెను. వివేకవాహియగు చిత్తమునందు ఛిద్రముల యందు (నడ్యమధ్యన) వ్యుత్థానరూపమగు "అహం, మమ" అనెడి ప్రత్యయములు వ్యుత్థానానుభవజన్యమగు సంస్కారములవలన యట్టి సంస్కారములు క్షీయమాణములైనను పుట్టుచుండును. ఈ సంస్కారములు క్లేశములవలె పరిత్యజింపదగినవి.అవిద్య మొదలగు క్లేశములు జ్ఞానాగ్నిచే దగ్ధబీజభావముకలవై తిరిగి చిత్తభూమియందు మొలకలెత్త నేరవు. జ్ఞానాగ్నిచే దగ్ధబీజభావముకల సంస్కారములు ప్రత్యయాంతరములను మొలిపించుటకు సమర్థములు కావు. జ్ఞానాగ్ని సంస్కారములన్నవో చిత్తమున్నంతపర్యంత మనుసరించియే యుండును.

అట్లగుచో ప్రత్యయాంతరము జనింపక పోవుటచే వివేకవాహి యగు చిత్తము స్థిరమై యుండ "ప్రసంఖ్యానే௨ప్యకుసీదస్య సర్వథా వివేకఖ్యాతే ర్ధర్మమేఘః సమాధిః" ప్రసంఖ్యానమనగ శుద్ధాత్మవిజ్ఞానము. అట్టి విజ్ఞానమునందు బుద్ధికి సాత్త్వికపరిణామమై యుండ సంయమము చేయువానికి నిఖిలగుణపరిణామముయొక్క ఆక్రమణము అనగా సర్వాధిష్ఠాతృత్వము,యై శాంతోదితావ్యపదేశ్యధర్మి యుండుటచే యథావద్వివేకవిజ్ఞానము, సర్వజ్ఞత్వము, వివేకమనెడి సిద్ధి యనుఫలము, వైరాగ్యమువలన కైవల్యము ప్రాప్తించును. ఈవిషయమునే "సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య సర్వభావాధిష్ఠాతృత్వం సర్వజ్ఞాతృత్వం చ" "తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్" అను రెండుసూత్రములచే స్పష్టపరచెను. అనగా ప్రసంఖ్యానము ప్రాప్తింప ఫలమును కోరనివానికి ప్రత్యయాంతరములు జనింపనందున సర్వవిధముల వివేకఖ్యాతివలన పరిశేషన్యాయమున ధర్మమేఘమను సమాధి సంభవించును. "ఇజ్యాచారదమాహింసాదానస్వాధ్యాయకర్మణాం। అయం తు పరమో ధర్మో యద్యోగే నాత్మదర్శనమ్॥" యాగము, ఆచారము, అహింసా, దానము, స్వాధ్యాయము అను కర్మలలో యోగముచే నాత్మదర్శనమను ధర్మ ముత్కృష్టధర్మమని స్మృతి బోధించుచున్నది. (1) ధర్మమేఘః=ధర్మం ప్రత్యగాత్మైక్యసాక్షాత్కారం మేహతి సించతీతి ధర్మమేఘః" ధర్మమేఘము తత్త్వసాక్షాత్కారమునకు హేతువని యర్థము. ధర్మమేఘమనెడి సమాధివలనకాని, ధర్మమువలనకాని క్లేశముయొక్క (1) అవిద్య (2) అస్మిత (3) రాగము (4) ద్వేషము (5) అభినివేశము అనెడి అయిదువిధములగు కర్మలయొక్కయు, అవిద్యామూలకమైన రక్తకృష్ణశుక్లములనెడి మూడింటియొక్క యాత్యంతికనివృత్తి అవిద్యాక్షయమగుచో బీజక్షయమువలన

ఆత్యంతికనివృత్తిరూపకైవల్యము ప్రాప్తించును. కారణనివృత్తివలన నాత్యంతిక కార్యనివృత్తి యుచితమే. ఇది యిట్లుండ "యుంజన్నేవం సదాత్మానం" అనుదానిచే శిక్షాభూమియందు సంప్రజ్ఞాతసమాధి చెప్పబడెను. "నియతమానసః" అనుదానిచే సంప్రజ్ఞాతసమాధికి ఫలభూతమైన యసంప్రజ్ఞాతసమాధి నిరోధభూమియందు చెప్పబడెను. "శాన్తిం" అనుదానిచే నిరోధసమాధివలన జనించు సంస్కారమునకు ఫలభూతమైన ప్రశాన్తవాహితయు "నిర్వాణపరమాం" అనుదానిచే ధర్మమేఘరూపసమాధికి తత్త్వజ్ఞానద్వారా కైవల్యహేతుత్వము, "మత్సంస్థాం" అనుదానిచే ఔపనిషదభిమతకైవల్యము చెప్పబడెను. యోగము మహాఫలము కలదగుటవలన నట్టి యోగమును గొప్పప్రయత్నముచే సంపాదింపవలయునని యభిప్రాయము. ॥౧౫॥

శంకరానందీయము:— "యోగ మాత్మవిశుద్ధయే" అను వచనమువలన యోగానుష్ఠానమునకు ఫలమాత్మవిశుద్ధి; ఆత్మవిశుద్ధికి ఫలమప్రతిబద్ధజ్ఞానసిద్ధిద్వారా బ్రహ్మనిర్వాణమే యని సూచించుటకు యోగియగు బ్రహ్మవేత్తకు జీవించియుండగనే ముక్తిఫలము ప్రాప్తించునని "యుంజన్" అను శ్లోకముచే చెప్పుచుండెను.

యోగనిష్ఠాపరుడగు యతి యేకాకిత్వ, నిరాశిష్ట్వ, అపరిగ్రహత్వ, సమకాయశిరోగ్రీవత్వ, స్థిరత్వ, నాసికాగ్రదృష్టిత్వ, దిగనవేక్షిత్వ, విగతభయత్వ, బ్రహ్మచారివ్రతస్థత్వ ప్రశాన్తత్వాది విశేషణ విశిష్టుడై పూర్వమునందు చెప్పబడిన యాసనమునం దుపవిష్టుడై యంతఃకరణను బ్రహ్మమునందే యనుసంధానము చేయువాడై శ్రద్ధచేతను తీవ్రముముక్షచేతను చిరకాలము నిత్యనిరంతర సమనుష్ఠిత సమాధ్యభ్యాసబలముచే బాహ్యవాసనలన్నియు నిశ్శేషముగ నశించుటవలన విపరీతప్రత్యయములు పుట్టనందున నిర్వికారాత్మనాస్థితమైన మనస్సు కలవాడై అనగా "మనసైవానుద్రష్టవ్యం" అను శ్రుతివలన "ఇదమేవాహ మస్మి" అని స్వాత్మచే బ్రహ్మము దేనిచే సాక్షాత్కరింపజేయబడెనో యది మనస్సు. మనస్సే మానసము అని చెప్పనొప్పును. అనగా నప్రతిబద్ధాత్మవిజ్ఞానముకలవాడై శరీరసంబంధరహితమగు పరమపురుషార్థలక్షణమగు కైవల్యమును పొందించుశాంతిని పొందుచున్నాడు.

లేక మోక్షరూపమగు నిరతిశయసుఖము దేనియందు కలదో యట్టి నాసంబంధమగు స్థితి కలశాంతిని పొందుచున్నాడు.

లేక నాస్వరూపముగ స్థితిని పొందించు శాంతిని పొందుచున్నాడు.

లేక మద్భావాపత్తిరూపమగు బ్రహ్మాత్మనాస్థితిరూపమైన శాంతిని (సర్వోపరతిని) పొందుచున్నాడు. అనగా నాత్యంతికసంసారనివృత్తిరూపమగు శాంతిని పొందుచున్నాడు. ఈచెప్పుటచే యోగముయొక్క ఫలము భోజనమునకు తృప్తివలె స్వప్రత్యక్షము కాన ముముక్షువగు యతి శ్రవణమాత్రసంభావిత ముక్తత్వభ్రాంతిని విడచి యవశ్యము విదేహముక్తికొరకు సమాధిని చేయవలెను. అని సూచింపబడెను. ॥౧౫॥

పరమార్థప్రపా:— "యుంజన్" అనుశ్లోకముచే యోగాభ్యాసఫలమును చెప్పుచుండెను.

పూర్వమునందు చెప్పబడినరీతిని యోగాభ్యాసరతుడై మనస్సును సమాహితమొనరించి స్వాధీనమైన మనస్సు కలవాడైనవాడై, సంసారోపరమమును పొందుచున్నాడు. పరమము ప్రాప్తస్థానముగా కలదియు, మదాకారసంస్థానమగునట్టి శాంతిని పొందును. ఈవిషయమే తైత్తిరీయకమునందుగల "యుంజానః ప్రథమం మనస్తత్త్వాయ సవితా ధియః" ప్రారంభమున మనస్సును స్వాధీనమొనరించుకొని అనంతరమున యాత్మప్రాప్తికొఱకు బుద్ధిని వినియోగించుపురుషుడు "సవితా" స్వయముగ యాత్మయే యగుచున్నాడు అని చెప్పబడెను. ॥౧౫॥

గీ॥ నాత్యశ్నత స్తు యోగోఽస్తి న చైకాన్త మనశ్నతః ।
న చాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ! ॥ ॥౧౬॥

**పదవిభాగము :–** న–అత్యశ్నతః–తు–యోగః–అస్తి–న–చ–ఏకాన్తం–అనశ్నతః–న–చ–అతిస్వప్నశీలస్య–జాగ్రతః–నఏవ–చ–అర్జున ! ॥ ॥౧౬॥

**ప్రతిపదార్థము :—** అత్యశ్నతః=శరీరపరిమితమగు నన్నముకంటె నధికముగ నన్నమును భక్షించువానికి యోగః=యోగము; నాస్తి=సంభవింపదు; ఏకాన్తం=అత్యంతము; అనశ్నతః=భక్షింపనివానికి; యోగః=(ఈ పదమనువృత్తము) యోగము; నాస్తి=సంభవింపదు; అతిస్వప్నశీలస్య=అత్యంతము నిద్రపోవువానికి; యోగః=(ఈపదమనువృత్తము) యోగము; నచ=సంభవింపదు; హే అర్జున!=ఓయర్జునుడా ?; జాగ్రతః=నిద్రనుమాని మేలుకొనువానికి; (ఈపదమనువృత్తము) యోగము; నచ=సంభవింపదు. ॥౧౬॥

---

**శాంకరభాష్యమ్:—**

ఇదానీం యోగిన ఆహారాదినియమ ఉచ్యతే—నాత్యశ్నత ఆత్మసంమిత మన్నపరిమాణ మతీత్యాశ్నతోఽత్యశ్నతో న యోగోఽస్తి, న చైకాన్త మనశ్నతో యోగోఽస్తి "యదు హ వా ఆత్మసంమిత మన్నం తదవతి తన్న హినస్తి, యద్భూయో హినస్తి తద్య

---

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

ఈశ్లోకమున యోగికి ఆహారాదినియమమును చెప్పుచుండెను. ఉదరసంమితమగు యన్నముకంటె నధికముగ భక్షించువానికి యోగము సంభవింపదు. అత్యంత మన్నమునుభక్షింపనివానికిని యోగము సంభవింపదు, ఈవిషయమే శతపథబ్రాహ్మణమునందు "యదు హ వా ఆత్మసంమిత మన్నం తదవతి తన్న హినస్తి, యద్భూయో హినస్తి తద్యత్కనీయో న తదవతి" ఉదరమునకు సరిపడిన యన్నమును భక్షించినచో నది రక్షించును. (మనుష్యుని) చంపనే

---

—: ౬వ అధ్యాయము. ౧౬ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

**మధుసూదనసరస్వతీయము:—** "నాత్యశ్నతస్తు" అనుశ్లోకము మొదలుకొని రెండుశ్లోకములచే యోగాభ్యాసనిష్ఠుం కాహారనియమమును చెప్పుచుండెను.

ఏంతయన్నముభుక్తమై జీర్ణమైనదగుచు శరీరమునకు కార్యక్షమత్వమును సంపాదించునో యాయన్నమాత్మసమ్మితమైన యన్నము. ఆపరిమాణమునుదాటి లోభముచే యధికాన్నమును భుజించినచో యజీర్ణాదిరోగములుజనించి శరీరము పీడితమగుటవలన నతనికి యోగముసంభవింపదు. ఆహారమును భుజింపకున్నను, అల్పాహారమునుభుజించినను రసపోషణలేమిచేసి శరీరము కార్యక్షమము కానేరనందున నతనికిని యోగము సంభవింపనేరదు. ఈ విషయమునే "యదుహవా ఆత్మసమ్మితమన్నం తదవతి తన్న హినస్తి యద్భూయో హినస్తి తద్యత్కనీయో న తదవతి" అను శతపథశ్రుతియు బోధించుచున్నది. కాన యోగి యాత్మ సమ్మితమగు యన్నముకంటె నధికమగు యన్నమునుకాని, తక్కువయన్నమునుకాని భుజింపరాదు.

లేక "పూరయే దశనేనార్ధం తృతీయ ముదకేనతు। వాయో స్సంచరణార్థంతు చతుర్థ మవశేషయేత్" ఉదరమున సగముభాగమును అన్నముచేత పూరింపవలెను. మూడవభాగము నుదకముచే నిండింపవలెను, నాల్గవభాగము వాయుసంచరణార్థము మిగల్చవలెను. యోగశాస్త్రోక్తపరిమాణముకన్న యధికము కాని, తక్కువకాని భుజించువానికి యోగము సంభవింపదు అని యర్థము.

శాం. భాష్యమ్.—

త్యనీయో న త దవతి" ఇతి శ్రుతేః। తస్మా ద్యోగీ నాత్మసంమితా దన్నా దధికం న్యూనం వాఽశ్నీయాత్। అథవా యోగినో యోగశాస్త్రే పరిపఠితా దన్నపరిమాణా దతిమాత్ర మశ్నతో యోగో నాస్తి। ఉక్తం హి "అర్ధ మశనస్య సవ్యంజనస్య తృతీయ ముదకస్య తు। వాయో స్సంచరణార్థం తు చతుర్థ మవశేషయేత్" ఇత్యాది పరిమాణమ్। తథా న చాతిస్వప్నశీలస్య యోగో భవతి, నైవ చాతిమాత్రం జాగ్రతో యోగో భవతి చార్జున!॥ ॥౧౬॥

శాం. భాష్య తత్త్వబోధిని:—

రదు. ఉదరమున కధికముగ భక్షించినచో యట్టియన్నము మానవుని చంపుచున్నది. ఉదరపరిమాణమునకు తక్కువగ నన్నమును భక్షించినను అట్టియన్నము మానవుని రక్షింపనేరదు. అని చెప్పఁబడెను. కాన యోగి యుదరప్రిమాణమునకు తగునటులనే భక్షింపవలయునుకాని యధికముగకాని, తక్కువకాని భక్షింపరాదు.

లేక, యోగశాస్త్రమునందు చెప్పఁబడిన నన్నపరిమాణముకంటె నధికముగ, న్యూనముగ భక్షించు యోగికి యోగము సంభవింపదు. అది యెట్లనిన ? ఈవిషయమే యోగశాస్త్రమునందు "అర్ధ మశనస్య సవ్యంజనస్య తృతీయ ముదకస్య తు। వాయో స్సంచరణార్థం తు చతుర్థ మవశేషయేత్" (శాకాది వ్యంజనములతో గూడిన నన్నముచే నుదరమున సగముభాగమును, మూడవభాగమును జలముచేతను పూరించి నాల్గవభాగమునుప్రాణవాయుసంచారము నిమిత్తము మిగల్చవలయును) అని చెప్పఁబడెను. యరియు స్థలాంతరమునందుగూడ "పూరయే దశనేనార్థం తృతీయ ముదకే న తు। వాయో స్సంచరణార్థాయ చతుర్థ మవశేషయేత్" అని చెప్పఁబడెను. (ఈశ్లోకముకూడ పైయర్థమునే చెప్పుచున్నది) ఇదియే పరిమాణము. అట్లే యతినిద్రపోవువానికి, అతిగ మేలుకొనువానికి నిద్రపోవుకాలమునందు నిద్రింపక మేలుకొను వానికిని యో యర్జునా! యోగము సంభవింపనేరదు. నిద్రించుకాలము, మేల్కొనుకాలము ధర్మశాస్త్రమునందు స్పష్టముగ చెప్పఁబడెను. ॥౧౬॥

అట్లే. ఓ యర్జున! అతినిద్రాశీలునకు, అతిగ మేల్కొనువానికి యోగము సంభవింపదు. ఈ శ్లోకమున రెండు చకారములు కలవు. అందొక చకారము చెప్పబడిన యోగాతిక్రమసముచ్చాయకము. రెండవ చకారము దోషసముచ్చాయకము. మార్కండేయపురాణమునందు "నాధ్మాతః క్షుధితశ్శ్రాన్తో నచ వ్యాకులచేతసః। యుంజీతయోగం రాజేంద్రయోగీ సిద్ధ్యర్థమాత్మనః॥ నాతిశీతే నచైవోష్ణే న ద్వంద్వే నానిలాన్వితే। కాలేష్వేతేషు యుంజీత న యోగం ధ్యానతత్పరః" అధ్మాతుడు, శ్రాంతుడు, వ్యాకులమనస్కుడు అగు యోగి తనయోగసిద్ధినిమిత్తము యోగాభ్యాసమును చేయరాదు. అతిశీతమునందు, ఉష్ణమునందు, ద్వంద్వప్రాప్తియందు, వాయువుతో కూడిన కాలమునందు యోగాభ్యాసము కూడదు. ధ్యానతత్పరుడగు యోగి పై కాలములయందు యోగాభ్యాసమును చేయరాదని చెప్పబడెను. ॥౧౬॥

శంకరానందీయము:—"యోగీ యుంజీత సతతం" అను శ్లోకము మొదలుకొని "యుంజన్నేవం సదాత్మానం" అను శ్లోకాంతగ్రంథముచే యోగమును, యోగాంగములను, యోగాసనమును, యోగియొక్క యోగమునకు ఫలమును చెప్పి "నాత్యశ్నతస్తు" అను శ్లోకముచే యోగాభ్యాసమాచరించువాని కాహారాది బహిరంగసాధనమును, యోగానందమును చెప్పుచుండెను.

**శాంకరభాష్యమ్ :—**

కథం పున ర్యోగో భవతీత్యుచ్యతే-యుక్తాహారవిహారస్యాఽఽహ్రియత ఇత్యాహారోఽన్నం విహరణం విహారః పాదక్రమస్తౌ యుక్తౌ నియతపరిమాణౌ యస్య,తథా యుక్తచేష్టస్య యుక్తా నియతా చేష్టా యస్య కర్మసు, తథా, యుక్తస్వప్నావబోధస్య యుక్తౌ స్వప్న శ్చావబోధశ్చ తౌ నియతకాలౌ యస్య తస్య, యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు యుక్తస్వప్నావబోధస్య యోగినో యోగో భవతి దుఃఖహా దుఃఖాని సర్వాణి హన్తీతి దుఃఖహా సర్వసంసారదుఃఖక్షయకృ ద్యోగో భవతీత్యర్థః ॥ ॥౧౭॥

**శాంకరభాష్యార్థబోధిని:—**

ఆహారమునకు నియతత్వ మనగ నుదరమున నర్థాంశమును యన్నముచే పూరించుట. విహారమునకు నియతత్వ మనగ యోజనము (ఆమడ) కంటె నెక్కువగ నడవకుండుట. కర్మల యందు (చేయుటకు) నియతత్వమనగ వాఙ్నియమాదులు. నిద్రకు, మేల్కొనుటకు నియతకాల మనగ రాత్రిని మూడుభాగములు చేసిన నొక్కొక్క భాగమునకు పదిపదిఘటికలు ప్రాప్తించును. అందు మొదటి పదిఘటికలయందు మేల్కొనుట, మధ్య పదిఘటికలయందు నిద్రించుట, అంత్యమగు పదిఘటికలయందు జాగరణము సేయుట ఇట్లు యుక్తాహారవిహారములు కలిగినట్టియు, కర్మలయందు నియతమగు చేష్ట కలిగినట్టి, నియతకాలములయందు స్వప్నప్రబోధములు కలగినట్టి (సంన్యాసికి) వానికి యోగ మాధ్యాత్మికాదిదుఃఖములను పోగొట్టునదగును. నిద్రయందు కూడ నాధ్యాత్మికాదిదుఃఖములు ప్రాప్తింపవుకదా! యోగమునకు నిద్రకంటె విశేషమేమి కలదనెదవా ? ఇట్టివానియొక్క యోగము సర్వసంసారదుఃఖములను నశింపజేయున దగును. నిద్ర యట్టిది కానేరదని యర్థము, ॥౧౭॥

కర్మలయందు చేష్టకు నియతత్వమనగ వాగాదీంద్రియముల చాపలపరిత్యాగమే. నిద్రకు మేలుకొనుటకు నియతకాలమనగ "రాత్రేః త్రిభాగత్రయం కృత్వా ప్రథమాన్త్యయో ర్జాగరణం మధ్యే స్వపనం" రాత్రిని మూడుభాగములుచేసి మొదటిభాగమునందు, చివరభాగమునందు మేలుకొనుట. మధ్యభాగమునందు నిద్రించుట యని గ్రహింపనగును, ఇట్లే యితరములగు యోగశాస్త్రోక్త నియమములు గ్రహింపనగును. ॥౧౭॥

**శంకరానందీయము:—** అట్లగుచో నెట్టివానికి యోగము సిద్ధించునను యీ శంకను "యుక్తాహారవిహారస్య" అను శ్లోకముచే తొలగించుచుండెను.

"పూరయే దశనేనార్థం" ఉదరమున సగముభాగము నన్నముచే నిండింపవలయును. "న గవ్యూతేః పరంగచ్ఛే న్న గ్రామే నగరే వసేత్" గవ్యూతియనగ రెండుక్రోసులు. యతి రెండుక్రోసులదూరముకన్న యధిక దూరము నడవరాదు. గ్రామమందు, పట్టణమునందు నివసింపరాదు. అను శాస్త్రముచే చెప్పబడిన నియమములతో గూడినట్టియు, అన్నాదాన విసర్గక్రియలయందు యుక్తమైన చేష్టకలిగినట్టియు అనగా యెట్టి చేష్టచే కార్యసిద్ధి యగునో విశృంఖలవృత్తిని విడచి అంతమాత్రమున చేష్టకలిగినట్టియు, "జాగృయాద్దశనాడ్యస్తు నిద్రాతు దశనాడికాః। పశ్చాజ్జాగరణం తద్వద్దశనాడ్యస్తు యోగినః" (యోగికి రాత్రిభాగమున మొదటి పదిఘటికలు జాగరణము, తరువాత పదిఘటికలు నిద్ర, తరువాతపదిఘటికలు జాగరణము చెప్పబడుచున్నది) అను శాస్త్రోక్తరీతిని నియతమగు నిద్రా జాగరణలుకల యతికి అనగా పైనచెప్పబడిన యన్నిలక్షణములుగల యతికి సమాధి ఆధ్యాత్మికాదిదుఃఖత్రయమును, జన్మాదిసర్వదుఃఖములను సమాధ్యనుష్ఠానముచే జనించిన యప్రతిబద్ధప్రబోధముచే నశింపజేయునది యగును. అనగా నట్టిసమాధి విదేహముక్తిని సంపాదించునని యర్థము. ॥౧౭॥

గీ॥ యదా వినియతం చిత్త మాత్మ న్యేవావతిష్ఠతే ।
నిస్పృహ స్సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥ ॥౧౮॥

**పదవిభాగము:**— యదా–వినియతం–చిత్తం–ఆత్మని–ఏవ–అవతిష్ఠతే–నిస్పృహః–సర్వకామేభ్యః–యుక్తః–ఇతి–ఉచ్యతే–తదా॥ ॥౧౮॥

**ప్రతిపదార్థము:**—యదా=ఏకాలమున; చిత్తం=చిత్తము; వినియతం=లెస్సగ నియమింపబడినదై; ఆత్మన్యేవ=కేవలాత్మయందే; అవతిష్ఠతే=ఉంటున్నదో; తదా=ఆకాలమునందు; సర్వకామేభ్యః=దృష్టాదృష్టవిషయములనుండి; నిస్పృహః=నిర్గతమైన తృష్ణ కలవాడైన; యోగీ=(ఈపదమధ్యాహార్యము) సంన్యాసి; యుక్తఇతి=సమాహితుడని; ఉచ్యతే=చెప్పబడుచున్నాడు ॥౧౮॥

**శాంకరభాష్యమ్:**—

అథాధునా కదా యుక్తో భవతీ త్యుచ్యతే—యదా వినియతం చిత్తం విశేషేణ నియతం సంయత మేకాగ్రతా మాపన్నం చిత్తం హిత్వా బాహ్యాచింతా మాత్మన్యేవ కేవలే ఽవతిష్ఠతే స్వాత్మని స్థితిం లభత ఇత్యర్థః । నిస్పృహ స్సర్వకామేభ్యో నిర్గతా దృష్టాదృష్టవిషయేభ్య స్స్పృహా తృష్ణా యస్య యోగిన స్స యుక్త స్సమాహిత ఇత్యుచ్యతే తదా తస్మి న్కాలే। ॥౧౮॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:**—

యోగి యేసమయమున యుక్తుడగునో చెప్పుచున్నాడు. ఏసమయమున యోగి యొక్క చిత్తము లెస్సగ నియమింపబడినదై యన్యచింతను విడచి కేవలాత్మయందే సంస్థితమై యుండునో ఆసమయమున యోగి సమస్తమగు దృష్టాదృష్టవిషయములనుండి నివృత్తమైన తృష్ణకలవాడై యుక్తు(సమాహితు) డని పిలువబడును. ॥౧౮॥

—: ౬వ అధ్యాయము. ౧౮ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

**మధుసూదనసరస్వతీయము:**— ఇశ్లోకాగ్రభూమియందు సంప్రజ్ఞాతసమాధిని చెప్పి నిరోధభూమియందసంప్రజ్ఞాతసమాధిని చెప్పుటకు "యదా వినియతం" అను శ్లోకముచే నుపక్రమించుచుండెను.

ఏసమయమునందు పరమవైరాగ్యమువలన సర్వవృత్తిశూన్యత్వమును పొందించబడిన చిత్తము (తొలగిపోయిన రజస్తమస్సులుకల యంతఃకరణసత్త్వము) స్వచ్ఛమైనదగుటవలన సర్వవిషయాకారగ్రహణసమర్థమైనను అంతట యరికట్టబడిన వృత్తికలదగుటవలన సాత్మరూపము, అనాత్మానుపరక్తము అగు ప్రత్యగ్బ్రహ్మమునందే వృత్తిరహితమైనను స్వతస్సిద్ధమైన ఆత్మాకారవృత్తిని వారించుట శక్యమగుటవలన చిత్తే ప్రధానమగుటవలన న్యగ్భూతమైయుండునో నిశ్చలమైయుండునో అట్టి సర్వవృత్తినిరోధకాలమునందట్టివాడు సమాహితు డని చెప్పబడును. అట్టివా డెవడనిన? ఎవనికి దోషదర్శనముచే నిఖిలదృష్టాదృష్టవిషయములనుండి స్పృహ(తృష్ణ) తొలగునో వాడు నిస్పృహుడు. ఈచెప్పుటచే అసంప్రజ్ఞాతసమాధి కంతరంగసాధనమగు పరమవైరాగ్యము చెప్పబడెను. పూర్వశ్లోకములయందు పరమవైరాగ్య మసంప్రజ్ఞాతసమాధి కంతరంగసాధన మనియే వ్యాఖ్యానింపబడెను.॥౧౮॥

**శంకరానందీయము:**— "యదా హి నేంద్రియార్థేషు" "కూటస్థో విజితేంద్రియః" అనువాటయోగికి యోగారూఢత్వము లెస్సగ నిరూపింపబడెను. అయినను బ్రహ్మవేత్తలక్షణము తెలియబడినచో ముముక్షువులు దానిని యారాధించి, దానిని యాశ్రయించి జ్ఞానమును, ముక్తిని పొందుటకు శక్యమగు నని అబ్రహ్మవేత్తలక్షణమునే తిరిగి "యదా" అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను.

పూర్వమునందు చెప్పబడిన బహిరంగాంతరంగసాధనసంపత్తిచేతను, తీవ్రమోక్షేచ్ఛచేతను, వైరాగ్యముచేతను నిత్యము యోగము నభ్యసించు యతికి ధ్యానకాలమునందు విషయసంబంధములేకుండగ నిరంతరాభ్యాసబల

గీ॥ యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుంజతో యోగ మాత్మనః ॥ ॥౧౯॥

పదవిభాగము:— యథా - దీపః - నివాతస్థః - న - ఇంగతే - సా - ఉపమా - స్మృతా - యోగినః - యతచిత్తస్య - యుంజతః - యోగం - ఆత్మనః ॥ ॥౧౯॥

ప్రతిపదార్థము:— ఆత్మనః = పరమాత్మయొక్క; యోగం = సమాధిని; యుంజతః = అనుష్ఠించునట్టియు; యతచిత్తస్య = సంయతమైన యంతఃకరణముకల; యోగినః = యోగియొక్క; చిత్తస్థైర్యస్య = (ఈపదమధ్యాహార్యము) చిత్తస్థైర్యమునకు; యథా = ఎట్లు దీపః = ప్రదీపము; నివాతస్థః = వాయురహితమైన ప్రదేశమునందున్నదై; నేంగతే = చలింపదో; తథైవేతి = (ఈ పదమధ్యాహార్యము) అట్లే అని; సా = అట్లుచలింపకపోవుట; ఉపమా = ఉదాహరణ సాధనముగ; యోగజ్ఞైః = చిత్తప్రసాదదర్శులచే; స్మృతా = తలఁచబడెను. ॥౧౯॥

---

శాంకరభాష్యమ్ —

తస్య యోగిన స్సమాహితం యచ్చిత్తం తస్యోపమోచ్యతే—యథా దీపః ప్రదీపో నివాతస్థో నివాతే వాతవర్జితే దేశే స్థితో నేంగతే న చలతి సోపమోపమీయతేఽనయేత్యుపమా యోగజ్ఞై శ్చిత్తప్రచారదర్శిభిః స్మృతా చింతితా । యోగినో యతచిత్తస్య సంయతాంతఃకరణస్య యుంజతో యోగ మనుతిష్ఠత ఆత్మనస్సమాధి మనుతిష్ఠత ఇత్యర్థః । ॥౧౯॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని —

ఆత్మానుసంధానము జేయుటకై నియమితాంతఃకరణుడైన యోగియొక్క చిత్తము వాయురహితమైన ప్రదేశమునం దుండు దీపమువలె చలనరహితమై స్థిరమైయుండును.

---

ముచే ఏకాగ్రతను పొందించబడిన చిత్తము నిత్యానందైకరసము, ప్రత్యగభిన్నము అగు బ్రహ్మమునందే యుండునో అనగా సర్వవాసనాక్షయముచేతను, సర్వకామములు నశించుటచేతను, స్వయముగ సిద్ధాసనాసక్తమై సర్వదా స్వరూపమునందే యుండునో ప్రయత్నము చేతగూడ బాహ్యము నవలంబింపదో ఈవిషయమునే "నిస్పృహః" అనుదానిచే స్పష్టపరచుచుండెను. ప్రయత్నములన గాని, అప్రయత్నములన గాని శబ్దాదిసర్వవిషయములయెడ నిస్పృహుడై అనగా శబ్దాదివిషయములయందు మిథ్యాత్వబుద్ధిచే యింద్రియములను, మనస్సును ప్రవర్తింపజేయడో అట్టి సమయమున పండితులచే యితడు యోగారూఢు డని చెప్పబడును. ॥౧౮॥

నీలకంఠీయము:— పూర్వశ్లో యుక్తప్రత్యగాత్మయగా కల శాంతిని పొందినవానిలక్షణములను "యదా" అను శ్లోకము మొదలు ఆశ్లోకములచే బోధించుచుండెను. విశేషముగ ఏకాగ్రతాభూమినుండి గూడ నిరుద్ధమై మనస్సు ప్రత్యగాత్మయందే యుండునో. అస్మితారూపముచేగూడ నుద్రేకమును పొందకుండునో. అట్టి సమయమున యోగి జాగ్రత్తునందును, స్వప్నమునందును. సబీజసమాధులందును యుపస్థిత (సంప్రాప్త) ములైనట్టి విషయములయెడ నిస్పృహుండై నిర్వికల్పకు డని చెప్పబడును. ॥౧౮॥

—: ౬వ అధ్యాయము. ౧౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. :—

మధుసూదనసరస్వతీయము:— సమాధియందు వృత్తిరహితమైన చిత్తమున కుపమానమును "యథా" అను శ్లోకముచే చెప్పుచుండెను.

దీపచలనమునకు కారణమైన వాయువు లేని ప్రదేశమున నున్న దీప మెట్లు చలన కారణము లేమిచేత చలించదో అట్టి దీపమే వృత్తిరహితచిత్తమున కుపమాన మని యోగజ్ఞులచే యూహింపబడెను. ఏకాగ్రభూమియందు సంప్రజ్ఞాతసమాధికలవాని కభ్యాసపాటవములన పరిపక్వమైన సర్వవృత్తులు కలిగినట్టియు యసంప్రజ్ఞాతసమాధిరూపమగు యోగమును నిరోధభూమియం దనుష్ఠించువాని యంతఃకరణమునకు నిశ్చలత్వముచేతను, సత్త్వోద్రేకముచేతను, ప్రకాశక మగుటచేతను నిశ్చలదీపము దృష్టాంతము.

గీ॥ యతోపరమతే చిత్తం నిరుద్ధం యోగసేవయా ।
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥ ॥౨౦॥

పదవిభాగము:—యత్ర- ఉపరమతే- చిత్తం-నిరుద్ధం- యోగసేవయా- యత్ర- చ-ఏవ-ఆత్మనా- ఆత్మానం-పశ్యన్- ఆత్మని- తుష్యతి. ॥౨౦॥

ప్రతిపదార్థము:—యత్ర=ఏ కాలమున; చిత్తం=చిత్తము; ఉపరమతే=ఉపరమమును పొందుచున్నదో; నిరుద్ధం=అంతటనుండి నివారింపబడిన ప్రచారముకలదై; యోగసేవయా=యోగానుష్ఠానముచే; యత్ర చైవ=ఏకాలమునందు; ఆత్మనా=సమాధి పరిశుద్ధమగు అంతఃకరణముచే; ఆత్మానం=చైతన్యజ్యోతిస్స్వరూపమగు పరమాత్మను; పశ్యన్=చూచుచున్నవాడై; ఆత్మని=ఆత్మయందే; యోగీ=యోగి; తుష్యతి=ఆనందమును పొందుచున్నాడో; తస్మిన్ కాలే సిద్ధిర్భవతి=(ఈ పదము ధ్యాహార్యము) ఆ కాలమున సిద్ధియగుచున్నది. ॥౨౦॥

---

శాంకరభాష్యము:—

ఏవం యోగాభ్యాసబలాదేకాగ్రీభూతం నివాతప్రదీపకల్పం సత్—యత్ర యస్మిన్కాల ఉపరమతే చిత్తముపరతిం గచ్ఛతి, నిరుద్ధం సర్వతో నివారితప్రచారం యోగసేవయా యోగానుష్ఠానేన యత్ర చైవ యస్మింశ్చ కాల ఆత్మనా సమాధిపరిశుద్ధేనాంతఃకరణేనాఽఽత్మానం పరం చైతన్యజ్యోతిస్స్వరూపం పశ్యన్నుపలభమానస్స్వ ఏవాత్మని తుష్యతి తుష్టిం భజతే ॥ ॥౨౦॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

పైన జెప్పినవిధముగ యోగాభ్యాసబలముచే చిత్తము వాయురహితప్రదేశమునందుండెడి దీపమువలె నిశ్చలమైనదై (ఏకాగ్రీభూతమై) ఏకాలమున సర్వమునుండి యోగసేవచే నుపరమమును పొందునో, ఏకాలమున సమాధిపరిశుద్ధమగు నంతఃకరణముచే జ్యోతిస్స్వరూపమగు బరమాత్మను చూచువాడై యోగి స్వరూపాత్మయందు సంతోషమును పొందునో ఆకాలమున యోగము సిద్ధించును. ॥౨౦॥

---

"ఆత్మనో యోగం యుంజతః" అను వ్యాఖ్యానమునందు దార్ష్టాంతికము లభింపదు. మరియు సర్వావస్థమైన చిత్తము సర్వదా ఆత్మాకారమగుటచే ఆత్మపదమునకు వైయర్థ్యము ప్రాప్తించును. యోగముచే చిత్తమున కాత్మాకారత్వము సంపాదింపబడదు. మరేమనిన? స్వతః ఆత్మాకారమయిన చిత్తమునకు అనాత్మాకారత్వమునివర్తింపజేయబడును. కానదార్ష్టాంతికప్రతిపాదకార్థమే ఆత్మపదమని గ్రహింపనగును. "యతచిత్తస్య" అనునది భావప్రధాననిర్దేశము. లేక "యతస్య చిత్తస్య" అని కర్మధారయ కాని గ్రహింపనగును. ॥౧౯॥

శంకరానందీయము:— యోగము నధిష్ఠించిన యోగియొక్క చిత్తమెటులుండు నను శంకయందు యోగి చిత్తస్థితికి—తదనుష్ఠితయోగమున కసంప్రజ్ఞాతసమాధిత్వమును సూచించుటకొఱకుపమానమును "యదా" అను శ్లోకముచే జెప్పుచుండెను.

"ఆత్మనః" అనునది "కర్మణి షష్ఠి" ఆత్మను విషయముగా జేసుకొని ప్రవర్తితమైనదియోగము. లేక ఆత్మసంబంధమైన సర్వోపలబ్ధిసిద్ధిసాధనమగు సమాధిని సాదరముగ నిత్యము నిరంతర మనుష్ఠించునట్టియు. బ్రహ్మమునందే బ్రహ్మాకారముగ నిశ్చలముగ స్థాపింపబడిన చిత్తము కల అనగా బ్రహ్మమునందే స్థిరీభూతమైన మనస్సుకలపరమహంసునకు వాయురహితమైన గృహమధ్యమున్న ప్రదీపము దృష్టాంతము. అనగా గృహమధ్యస్థమగు దీపము యెట్లు చలించదో అట్లే బ్రహ్మయందు స్థాపితమైన బహ్మైకత్త చిత్తము చలింపదు. బ్రహ్మమునందే

బ్రహ్మస్వరూపముచే నిశ్చలమై యుండును. ఇదియే యసంప్రజ్ఞాతసమాధ్యవస్థ యని యనబడును. ఈవిషయమే "మనసో వృత్తిశూన్యస్య నిర్వికారాత్మనా స్థితిః। అసంప్రజ్ఞాతనామాసౌ సమాధి ర్యోగినాం ప్రియః" వృత్తిశూన్యమగు మనస్సుయొక్క నిర్వికారస్వరూపముతో స్థితియే యోగులకు ప్రియమైన యసంప్రజ్ఞాతసమాధి యనబడును. ||౧౯||

—:౬వ. అధ్యాయము —౨౦వ. శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు సామాన్యముగ సమాధిని చెప్పి నిరోధసమాధిని విస్తారముగ వివరించుటకొఱకు "యత్రోపరమతే" అని ప్రారంభించుచుండెను.

ఏపరిణామవిశేషము యోగాభ్యాసపాటవముచే జనించినదైయుండ చిత్తము— ఏకవిషయకవృత్తిప్రవాహరూపమగు యేకాగ్రతను విడచి నిరింధనాగ్నివలె నుపశమించుచు నిర్వృత్తికమగుటచే సర్వవృత్తినిరోధరూపముగ పరిణమించునో! ఏపరిణామము సంభవించియుండ రజస్తమస్సులచే నభిభూతముకానట్టి శుద్ధసత్త్వముమాత్రమగు యంతఃకరణముచే తనను సచ్చిదానందఘనము, అనంతము, అద్వితీయమునగు పరమాత్మతో యభిన్నముగ చూచుచు వేదాన్తప్రమాణజన్యమైన వృత్తిచే సాక్షాత్కార మొనరించుకొనుచు దేహేంద్రియాదిసంఘాతమునందు కాని, తద్భోగ్యమునందుకాని తుష్టిని పొందక పరమానందఘనమైనయాత్మయందే తుష్టినిపొందునో, పరమాత్మసాక్షాత్కార మగుచో తుష్టిహేతువే లేనందున సంతోషించువానివలె యుండునో, అట్టి యంతఃకరణపరిణామమును సర్వచిత్తవృత్తినిరోధరూపమగు యోగమునుగ దెలిసికొనవలయును. "యత్ర" అను పదమునకు ఏకాలమునందు అని వ్యాఖ్యానించుట "తం విద్యాత్" అను యుత్తరత్ర యుండు తచ్ఛబ్దార్థముతో నన్వయింపనందున యసంగతము. ||౨౦||

శంకరానందీయము:— ఇట్టి లక్షణములతో గూడిన యే చిత్తపరిపాకవిశేషముకలదో అదియే యోగమని తెలిసికొనవలయు నని చెప్పుటకు యోగలక్షణములను "యత్రోపరమతే" అను శ్లోకము మొదలు మూడు శ్లోకములచే చెప్పుచుండెను.

బహిరంగసాధనసిద్ధిచేతను, తీవ్రమోక్షేచ్ఛచేతను విజృంభితమైన యోగసేవచేతను యోగాంగసవికల్పసమాధి- విజాతీయ ప్రత్యయరహితముగ కేవలచిత్ప్రత్యయరూపముగనుదయించును. అట్టి సవికల్పసమాధియొక్క సేవచేనిరంతరావృత్తిచేవిపరీతవృత్తి జనింపకుండగ నిరుద్ధమైనట్టిన్ని, చిరకాలము బ్రహ్మ ప్రత్యయావృత్తియందే స్థాపితమైనచిత్తము-స్వయముగ నిశ్శేషవినష్ట సర్వబాహ్యవాసనాసముదాయము కలదై తనకు కేవలశుద్ధసత్త్వాంశమాత్రావశేషరూపమగు దశ ప్రాప్తించియుండ యుపశమమును పొందునో అనగా వృత్త్యంతరపరిణామమును విడచిధ్యేయస్వరూపముగ నివాతస్థప్రదీపమువలె నిష్కంపముగ నుండునో.

మరియు "యత్ర" యే చిత్తపరిపాక దశయందు యీ బ్రహ్మవిదుత్తముడు నిర్మలాంతఃకరణమునందు "ఆకాశమునందు రాకాచంద్రబింబమువలె ప్రకాశమానమైన వృత్త్యారూఢమైన చిదానందైకరసస్వరూపమైన పరబ్రహ్మమును స్వాత్మచే (తనయంతఃకరణముచే) (బ్రహ్మైవాహం" అని స్వస్వరూపముగ సాక్షాత్కరింపజేసుకొనుచు ముక్తుడనుడు "కృతార్థోస్మి" అని సంతోషించును. ఈ విషయమునే "న మోదతే మోదనీయగ్ం హి లబ్ధ్వా" అను శ్రుతియు బోధించుచున్నది. ఈ చెప్పుటవలన యోగారోహణమును చేసిన మహానుభావునకు ఆత్మసంసారమోక్షణము, తత్సుఖము ప్రత్యక్ష మగుటవలన శ్రవణాదులచే తెలియబడిన యాత్మతత్త్వము కల యతికి యోగారోహణముచేతనే ఆత్మోద్ధరణము సిద్ధించును. అదియే యవశ్యకర్తవ్య మని సూచింపబడెను. ||౨౦||

గీ॥ సుఖ మాత్యంతికం యత్త ద్బుద్ధిగ్రాహ్య మతీంద్రియం ।
వేత్తి యత్ర నచైవాయం స్థిత శ్చలతి తత్త్వతః ॥ ॥౨౧॥

పదవిభాగము:— సుఖం- ఆత్యన్తికం-యత్- తత్- బుద్ధిగ్రాహ్యం- అతీంద్రియం-వేత్తి-యత్ర- న-చ- ఏవ- అయం- స్థితః-చలతి- తత్త్వతః ॥ ॥౨౧॥

ప్రతిపదార్థము:— అత్యంతికం=అనంతమైనది; యత్=ఏ సుఖం=సుఖమో; యత్=ఏ సుఖము; బుద్ధిగ్రాహ్యం=స్వానుభవగ్రాహ్యమో; అతీంద్రియం=ఇంద్రియాగోచరమో; తత్=అట్టిసుఖమును; యోగీ=యోగి వేత్తి=అనుభవించుచున్నాడో; యత్ర=ఏ కాలమున; ఆత్మస్వరూపేచ= (ఈపదమధ్యా) ఆత్మస్వరూపమునందు; స్థితః=ఉన్నవాడై; నైవ చలతి=చలింపడో; తస్మిన్ కాలే=ఆ కాలమున (ముందుశ్లోకాన్వయము ॥౨౧॥

శాంకరభాష్యమ్:—

కించ—సుఖ మాత్యంతిక మత్యంత మేవ భవతీత్యాత్యంతిక మనంత మిత్యర్థః । యత్త ద్బుద్ధిగ్రాహ్యం బుద్ధ్యైవేన్ద్రియనిరపేక్షయా గృహ్యత ఇతి బుద్ధిగ్రాహ్య మతీంద్రియ మింద్రియగోచరాతీత మవిషయజనిత మిత్యర్థః । వేత్తి తదీదృశం సుఖమనుభవతి యత్ర యస్మి న్కాలే నచైవా అయం విద్వా నాత్మస్వరూపే స్థిత స్తస్మాన్నైవ చలతి తత్త్వ స్తత త్త్వస్వరూపాన్న ప్రచ్యవత ఇత్యర్థః ॥ ॥౨౧॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఏసుఖము అనంతమో అట్టి సుఖము స్వానుభవైకవేద్యము, ఇంద్రియగోచర మగుదాని కంటె యతీతమునగును. (విషయజనితము కాని దని యర్థము.) యోగి ఇట్టి సుఖము నేకాలమున యనుభవించునో, యాత్మస్వరూపమునందె యున్నవాడై తత్త్వస్వరూపమునుండి చ్యుతిని పొందడో ఆకాలమున యోగసిద్ధి యగునని ముందుగ్రంథంతో సంబంధము. ॥౨౧॥

—: ౬వ అధ్యాయము ౨౧వ శ్లోకవ్యాఖ్యావిశేషణములు:—

మధుసూదనసరస్వతీయము:— ఆత్మయందే సంతోషము ప్రాప్తించుటయందు హేతువును "సుఖం" అను శ్లోకముచే చెప్పుచుండెను.

ఏ యవస్థావిశేషమునందు "ఆత్యంతికం" అనంతము, నిరతిశయము, బ్రహ్మస్వరూపము అయినట్టియు, "అతీంద్రియం" విషయేంద్రియసంయోగముచే నభివ్యంగ్యముకానట్టియు, "బుద్ధిగ్రాహ్యం" రజస్తమోమల రహితమైన సత్త్వమాత్రవాహియగు బుద్ధిచేతనే గ్రాహ్యమగు సుఖమును యోగి యనుభవించునో, దేనియందున్నవాడై విద్వాంసుడు "తత్త్వతః" ఆత్మస్వరూపమునుండిచలించడో దానినే యోగముగ దెలిసికొనవలయును. అని యుత్తరవాక్యముతో నన్వయము.

ఈ శ్లోకమున "ఆత్యంతికం" అను పదముచే బ్రహ్మసుఖస్వరూపము చెప్పబడుచున్నది. "అతీంద్రియం" అను పదముచే విషయసుఖము విషయేంద్రియసంయోగజమగుటచే విషయసుఖము వ్యావర్తింపబడెను. "బుద్ధిగ్రాహ్యం" అని చెప్పుటచే సుషుప్తియందు బుద్ధిలయమగుటవలన సౌషుప్తసుఖము వ్యావర్తించబడెను. సమాధియందు నిర్వృత్తికమైన బుద్ధి యుండుటవలన నాత్మసుఖము బుద్ధిగ్రాహ్యమగును. ఈ విషయమే— "లీయతేహి సుషుప్తౌ తన్నిగృహీతం న లీయతే" అని గౌడపాదాచార్యులవారిచే చెప్పబడెను. "సమాధి నిర్ధూతమలస్య చేతసో నివేశిత స్యాత్మని యత్సుఖం భవేత్ । న శక్యతే వర్ణయితుం గిరా తదా య దేత దంతఃకరణేన గృహ్యతే" సమాధిచే క్షాళితమైన రజస్తమస్సులు కలిగి యాత్మయందులగ్నమైన చిత్తమున (అంతఃకరణమున) కేసుఖము ప్రాప్తించునో, యేసుఖ మంతఃకరణముచే గ్రహింపబడునో యాసుఖము వాగింద్రియముచే వర్ణింప నలవికాదు. అని శ్రుతియు బోధించుచున్నది. ఇచట అంతఃకరణ మనగ నిరుద్ధసర్వవృత్తులు కల-

గీ॥ యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్ స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే ॥ ॥౨౨॥

పదవిభాగము:— యం- లబ్ధ్వా- చ-అపరం=లాభం-మన్యతే- న-అధికం- తతః-యస్మిన్-స్థితః-న-దుఃఖేన- గురుణా-అపి-న- విచాల్యతే ॥ ॥౨౨॥

ప్రతిపదార్థము:— యోగీ=జ్ఞానయోగి; (ఈ పదమధ్యా)యం=ఏ ఆత్మలాభమును; లబ్ధ్వాచ=పొంది; అపరం=మరియొకటగు లాభాంతరమును; తతః=ఆ యాత్మలాభముకంటె; అధికం=శ్రేష్ఠమైనది; అస్తీతి=కలదని; (ఈ పదమధ్యా)న మన్యతే=తలపడో; యస్మిన్=ఏ యాత్మతత్త్వమునందు; స్థితః=ఉన్నవాడై గురుణాపి=గొప్పదైనను; దుఃఖేన=శస్త్రనిపాతాదిదుఃఖముచే; నవిచాల్యతే=చలింపచేయబడడో; తం యోగం విద్యాత్=(ఈ పదమధ్యా)దానిని యోగముగ తెలిసికొనదగును. ॥౨౨॥

చిత్తమని గ్రహింపవలెను, వృత్తిచే సుఖాస్వాదన మట్టిదశయందు సంభవింపదని గౌడపాదాచార్యులవారు చెప్పియుండిరి. "నేను సమాధియం దీసుఖము ననుభవించుచుంటిని" అని సవికల్పవృత్తిరూపమగు ప్రజ్ఞరూపసుఖాస్వాదము వ్యుత్థానరూపమగుటచే సమాధివిరోధియగుటవలన దానిని యోగి చేయరాదు. కనుకనే యిట్టి ప్రజ్ఞతోకూడ సంగమును త్యజింపవలెను, అట్టి ప్రజ్ఞను నిరోధించవలెనని యర్థము. నిర్వృత్తికమగు చిత్తముచే స్వరూపసుఖానుభవము "స్వస్థం శాన్తం సనిర్వాణ మకథ్యం సుఖ ముత్తమం" అని గౌడపాదాచార్యులవారిచే చెప్పబడెను. మున్ముందీవిషయమును స్పష్టపరచెదము. ॥౨౧॥

శంకరానందీయము:— బుద్ధికి కేవలశుద్ధసత్త్వభావము ప్రాప్తించిన యేదశయందు బ్రహ్మనిష్ఠుడైన బ్రహ్మవేత్త యగు యతి— సమ్యక్త్వైకగమ్యము కనుకనే ఇంద్రియవిషయసంబంధరహితము అనగా నజన్యము కనుకనే యాద్యంతరహితము, కనుకనే "ఏషోఽస్య పరమానందః" ఇత్యాదిశ్రుతిప్రసిద్ధము నగు ఆనందరూపమును "సదానందోఽహ మస్మి" అని యాత్మానంద మనుభవించుచుండెనో. ఏదశయందు యోగి స్వయముగ చిదేకవృత్తిచే స్వస్వరూపము, సచ్చిదానందైకరసము, నగు బ్రహ్మమునందున్నవాడై పరమార్థస్వరూపమునుండి చలించడో అనగా శతధా బాహ్యాభ్యంతరవిక్షేపములు ప్రాప్తించినను కొంచమైన విపరీతభావనను పొందడో అట్టిదానిని అని "తం విద్యాత్" అను యిరువదిమూడవశ్లోకముతో సమన్వయము. ॥౨౧॥

పరమార్థప్రపా:—ఆత్మసుఖము విషయసుఖాతిరిక్తము సత్తు, ఉత్కృష్టము అని "సుఖం" అను శ్లోకముచే చెప్పుచుండెను.

ఈ యోగి యేసమయమున సర్వోత్కృష్టమగు సుఖము ననుభవించుచుండెనో అసుఖము బుద్ధిగ్రాహ్యము, అనగా కేవలాత్మాకారమైన బుద్ధిచేతనే యనుభవింపదగినది. కాని విషయేంద్రియసంయోగజన్యవృత్తిగ్రాహ్యమువంటిది కాదని యాశయము. అట్లే యవిద్యావృత్తిచే సుషుప్తియం దనుభవింపబడు సుఖమువంటిది కూడ కాదని "బుద్ధిగ్రాహ్యం" అను పదముచే స్పష్టపరుపబడెను. "అత్యన్తికం" అను పదముచే సర్వోత్కృష్టమని స్పష్టపరపబడెను. అట్టి సర్వోత్కృష్టత్వమునే యతేరిత్యాది గ్రంథముచే స్పష్టపరచుచుండెను. పరమానందమునందు క్షుద్రానందములం దుర్భూతము లగుటవలన నేసుఖమునందు నిశ్చయముగ స్థిరీభూతుడై మరియొక సుఖము నపేక్షింపడో ఈ విషయమే అధ్యాత్మమీమాంసయందు— జాగ్రత్యమన్తరాత్మా విషయసుఖకృతేఽనేకయత్నాంశ్చ కుర్వ స్స్వామ్య త్సర్వేంద్రియేభ్యోఽధిగతమపి సుఖం విస్మర స్యాతి నిద్రామ్ । విశ్రామాయాత్మరూపే త్వతితరసులభం తేన చాతీంద్రియం హి సౌఖ్యం సర్వోత్తమం. స్యాత్పరిణతివిరసా దింద్రియోత్థా త్సుఖాచ్చ ॥ జాగ్రదవస్థయం దంతరాత్మ విషయసుఖములనిమిత్తము నేకప్రయత్నముల జేయుచు శ్రమ నొంది సర్వేంద్రియముల వలనను పొందబడిన సుఖమును మరచిపోయి పొందు విశ్రాంతి కొరకు ఆత్మస్వరూపమునందే నిద్రించును. దానిచే పరిణతివిరసమైన యింద్రియజన్యసుఖముకన్న సర్వోత్తమమైనట్టి యతీంద్రియమైన సుఖమును పొందుచున్నాడని స్పష్టముగ చెప్పబడెను. ॥౨౧॥

**శాంకరభాష్యమ్ :—**

కించ—యం లబ్ధ్వా య మాత్మలాభం లబ్ధ్వా ప్రాప్య చాపర మన్య ల్లాభాంతరం తతోఽధిక మస్తీతి న మన్యతే న చింతయతి। కించ యస్మి న్నాత్మతత్త్వే స్థితో దుఃఖేన శస్త్రనిపాతాదిలక్షణేన గురుణా మహతాపి న విచాల్యతే॥ ॥౨౨॥

**శాంకరభాష్యతత్త్వబోధిని :—**

జ్ఞానయోగి యేయాత్మలాభమును పొంది దానికంటె నధికమగునది మరియొక లాభము కలదని తలపడో, మరియు నేయాత్మతత్త్వమునం దున్నవాడై దుర్భరమగు శస్త్రనిపాతాదిదుఃఖముచేగూడ చేలింపడో యట్టి దానిని యోగముగ తెలిసికొనదగును. ॥౨౨॥

—:౬వ అధ్యాయము—౨౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— "యత్ర న చైవాయం స్థిత శ్చలతి తత్త్వతః" అని పూర్వశ్లోకముచే చెప్పబడినదానినే విశేషముగ "యంలబ్ధ్వా" అను శ్లోకముచే చెప్పుచుండెను.

ఏ నిరతిశయాత్మక సుఖాభివ్యంజకమగు నిర్వృత్తిక చిత్తావస్థా విశేషమును పొంది సంతతాభ్యాస పరిపాకముచే సంపాదించి, దానికంటె వేరుగ నితరమైన యధికసుఖము కలదని తలపడో "కృతంకృత్యం ప్రాప్తం ప్రాపణీయ మిత్యాత్మలాభాన్న పరం విద్యతే" చేయదగినది చేయబడెను. పొందదగినది పొందబడెను. అని ఆత్మలాభముకంటె వేరులేదు. అను స్మృత్యనుసారము ప్రవర్తించువాడో, ఇట్లే విషయభోగవాసనచే సమాధి వలన చలనము లేదనిచెప్పి శీతవాత మశకాద్యుపద్రవ నివారణార్థము కూడ చలనములేదని "యస్మిన్" అను యుత్తరార్థముచే చెప్పుచున్నాడు

ఏ పరమాత్మసుఖమయమగు నిర్వృత్తిక చిత్తావస్థావిశేషమునం దుండిన యోగి శస్త్రనిపాతాదికము కారణముగాకల గొప్ప దుఃఖముచేతను చలింపచేయబడడు. నీచదుఃఖములచే చలింపజేయబడడని చెప్పవలెనా? చెప్పనవసరములేదు. ॥౨౨॥

శంకరానందీయము:— ఆత్మసాక్షాత్కారమే పరమలాభము. ఆత్మ సాక్షాత్కారమున కసాధారణకారణమగు యోగసిద్ధికూడ పరమలాభమే యని తలచి కార్యమగు నాత్మసాక్షాత్కారమునకు, తదసాధారణకారణమగు యోగసిద్ధికిన్ని "యం" అను శబ్దముచే యభేదముగ నిర్దేశముచేయబడెను. సదానందైకరసస్వరూపమగు నాత్మయొక్క సాక్షాత్కారమునకు పరమకారణమగు యే నిర్వికల్పకసమాధిని, తత్కార్యమగు నాత్మలాభమును పొంది యోగారూఢుడగు యతి కృతకృత్యుడగును, అనాత్మవిషయమగు లాభమును సర్వము బ్రహ్మమాత్రస్వరూపము అనెడి యుపలబ్ధిని కలుగజేయు నిర్వికల్పసమాధి కంటెను, అట్టి సమాధికి ఫలమగు నాత్మలాభముకంటెను యుత్కృష్టమని తలపడు. ఆత్మవ్యతిరిక్తమైన సర్వపదార్థములు మాయికములగుటచే యసత్తులు, తుచ్ఛములు, సోపద్రవములు, దుఃఖబీజములు, మిథ్యాభూతములు కనుకనే ధర్మాదుల లాభమును సత్పురుషులు లాభమని తలపరు.

విద్వాంసునకు బ్రహ్మవిష్ణ్వాదిలోక ప్రాప్తిలాభమే కదా యని శంకింపజనదు. బ్రహ్మవిష్ణ్వాదిలోకములు కూడ (సత్యవైకుంఠాదిలోకములు) కూడ మాయికములగుటవలన చెప్పబడిన దోషములు కలవే. అందుచేతనవియు మిథ్యాభూతములే కాన నాలోకములు లభించుట, ఆలోకములకు ప్రభుత్వలాభము యలాభమే కాని, లాభముకాదు. "ఆత్మలాభా న్న పరం విద్యతే" అను స్మృతిచేతనే యాత్మలాభాతిరిక్త లాభమునకు లాభత్వము నిషేధించుటవలన నిత్యనిరతిశయానందరూపమగు నాత్మలాభమే లాభమగును. కాన బ్రహ్మవేత్త ఆత్మసాక్షాత్కారకారణమగుటవలన నీయోగమునే పరమలాభముగ తలచును, దీనికంటె నితరమైనదానిలాభమును లాభముగ తలపడు.

౬॥ తం విద్యా ద్దుఃఖసంయోగవియోగం యోగసంజ్ఞితం ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోఽనిర్విణ్ణచేతసా ॥ ॥౨౩॥

పదవిభాగము:— తం-విద్యాత్-దుఃఖసంయోగవియోగం-యోగసంజ్ఞితం-సః-నిశ్చయేన-యోక్తవ్యః-యోగః-అనిర్విణ్ణచేతసా ॥౨౩॥

ప్రతిపదార్థము:—దుఃఖసంయోగవియోగం-దుఃఖ=దుఃఖములతో నైన; సంయోగ=సంయోగము యొక్క-; వియోగం=వియోగమును; తం=అట్టి; యోగసంజ్ఞితం= యోగమను పేరుకలదిగ; విద్యాత్=తెలిసికొనదగును; సః=అయోగము; నిశ్చయేన; నిశ్చయముతోటి; అనిర్విణ్ణచేతసా=నిర్వేదరహితమగు మనస్సుతోటి; యోక్తవ్యః-సమకూర్పదగును; ॥౨౩॥

---

**శాంకరభాష్యమ్:—**

యతోపరమత ఇత్యాద్యారభ్య యావద్భి ర్విశేషణై ర్విశిష్ట ఆత్మావస్థావిశేషో యోగ ఉక్తః— తం విద్యా ద్విజానీయా ద్దుఃఖసంయోగవియోగం దుఃఖై స్సంయోగో దుఃఖసంయోగ స్తేన వియోగో దుఃఖసంయోగవియోగ స్తం దుఃఖసంయోగవియోగం యోగ ఇత్యేవ సంజ్ఞితం విపరీతలక్షణేన విద్యా ద్విజానీయా దిత్యర్థః । యోగఫల ముపసంహృత్య పున

---

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

"యతోపరమతే" అనునది మొదలుకొని యింతవరకగు గ్రంథభాగముచే చెప్పబడిన యన్నివిశేషములతో గూడిన యాత్మావస్థావిశేషము యోగ మనబడును. దుఃఖములతో నైన సంయోగముయొక్క వియోగమునే (లేమినే) యోగ మను సంజ్ఞకల ఆయాత్మావస్థావిశేషము నుగ తెలిసికొనదగును. (ఈయోగావస్థ సముత్థాతనిఖిలదుఃఖభేదముకలదికాన దుఃఖసంయోగ

---

మరియు నే యంతఃకరణపరిణామవిశేషమునందు- బాహ్యాభ్యంతరములను మరచి సద్భావాపన్నమైన వృత్తిచే పూర్ణానందైకరసబ్రహ్మరూపముచే నున్న యతి ఖడ్గపాతాదిజనితము, యితరబాధాత్మకము నగు దుఃఖముచే స్వరూపమునుండిచలింపజేయుటకు శక్యము కాదో. అనగా బాహ్యాభ్యంతరవిక్షేపశతములచే విపరీతభావమును పొందించుటకు శక్యముకాదో. అని యర్థము. ॥౨౨

పరమార్థప్రప:— రేసుఖమును పొంది అదిరేము నిరతిశయమగుటవలన దానికంటె యితరమైన లాభ మధికమని తలపబడదో, యెట్లన: సుషుప్తిసుఖమును పొందినవాడు ప్రత్యవాయము ప్రాప్తించుటవలన భోజనము నిమిత్తము లేపదగినవాడు కాడు, ఈ విషయమునే "తస్మా దాయతం న భోధయేత్ దుర్భిషజం హాస్య భవతి" భాష్యం—యస్మా త్సుషుప్తౌ నిరతిశయసుఖం భవతి తస్మా త్కారణా దాయతం విస్తృతహస్తపాదనిద్రితం పురుషం న బోధయే జ్జాగరం న ప్రాపయేత్" సుషుప్తియందు నిరతిశయసుఖము ప్రాప్తించును కాన పాదములను, హస్తములను చాచుకుని నిద్రించుచున్నవానిని మెలుకవ కలవానిగ జేయరాదని శ్రుతియు బోధించుచున్నది "భాష్యం- హి యతోఽస్య జాగరం ప్రాపితస్య దుర్భిషజ మప్రతీకారం దుఃఖం భవతి" మెలుకువను పొందించబడిన యితనికి ప్రతీకారము లేని దుఃఖము ప్రాప్తించును.

మరియు రేసుఖమునందుండినవాడై స్థిరీభూతుడైనవాడై గొప్పదగు రోగశోకాదిదుఃఖములచే తన యవస్థను పొందింపబడడో. ॥౨౨॥

—: ౬వ అధ్యాయము. ౨౩ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— "యతోపరమతే" అనునది మొదలుకొని యనేక విశేషములచే నిర్వ్యృత్తికము, పరమానందాభివ్యంజకము అగునట్టి రే చిత్తావస్థావిశేషము చెప్పబడెనో అట్టి చిత్తవృత్తినిరోధమును చిత్తవృత్తిమయసర్వదుఃఖములను నిరోధించున దగుటచే దుఃఖవియోగరూపమై యుండినను వియోగపదవా

**శాంకరభాష్యమ్:—**

రన్వారంభేణ యోగస్య కర్తవ్యతోచ్యతే నిశ్చయానిర్వేదయో ర్యోగసాధనత్వవిధానార్థం। స యథోక్తఫలో యోగో నిశ్చయేనాధ్యవసాయేన యోక్తవ్యోఽనిర్విణ్ణచేతసా న నిర్విణ్ణ మనిర్విణ్ణం కిం తచ్చేత స్తేన నిర్వేదరహితేన చేతసా చిత్తేనేత్యర్థః ॥ ॥౨౩॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

రాహిత్యమే యోగసంజ్ఞ కర్హ మగు నని యర్థము.) పైవిధముగ యోగఫలము నుపసంహరించి నిశ్చయాఽనిర్వేదములు యోగసాధనములని చెప్పుటకై ప్రకారాంతరముగ కర్తవ్యతోపచ్యార్థ మైనను విరోధిలక్షణముచ యోగపదవాచ్యమని తెలిసికొనవలెను. యోగశబ్దానురోధమువలన యత్కించిత్సంబంధమును తెలుపుడుచేయనేరదు. ఈ విషయము షడ్గుణైశ్వర్యసంపన్ను డగు పతంజలి "యోగ శ్చిత్తవృత్తినిరోధః" చిత్తవృత్తినిరోధము యోగశబ్దవాచ్య మని చెప్పియుండెను. "యోగో భవతి దుఃఖహా" అని పూర్వమునందు చెప్పబడిన యోగ మిచట "యోగసంజ్ఞితం" అను దానిచే యుపసంహరింపబడెను.

ఇట్టి యోగమునందు నిశ్చయము, అనిర్వేదము అను రెండును సాధనములుగ విధించుటనిమిత్తము "సః" అని చెప్పమొదలిడెను. పూర్వమునందు చెప్పబడిన లక్షణములు కల యోగము "శాస్త్రాచార్యవచనతాత్పర్యవిషయమగు నట్టి యర్థము సత్యమే" అను నిశ్చయముచేత నభ్యసింపదగినది. యింతకాలము యోగ మభ్యసింపబడెను, యింతకాల మభ్యసించినను యోగము సిద్ధింపలేదు. ఇంతకన్న కష్ట మేమున్నది యను అనుతాపమే నిర్వేదము. అట్టి నిర్వేదములేని మనస్సుచే ఈ జన్మమునందుకాని, జన్మాంతరమునకాని యోగము సిద్ధించును. తొందరపడనేల అను ధైర్యయుక్తమగు మనస్సుచే నభ్యసింపదగినది. ఈ విషయమునే గౌడపాదాచార్యులవారు "ఉత్సేక ఉదధే ర్యద్వ త్కుశాగ్రే ణైకబిందునా। మనసో నిగ్రహ స్తద్వ ద్భవే దపరిఖేదతః" ఒకజలబిందుమాత్రమునే ధరించుటకు వీలగు కుశాగ్రముచే సముద్రము యొక్క ఉత్సేకమువలె అనగా కుశాగ్రముచే సముద్రగతజలమును తీసివేసి సముద్రమును రొండింపజేసెద నను నిశ్చయముచే సముద్రజలమును కుశాగ్రముచే మెరకకు చిమ్మినటుల ఖేదములేకుండగ మనస్సును నిగ్రహింపవలెనని చెప్పిరి.

ఈ విషయమై సంప్రదాయవేత్త లొక యాఖ్యాయికను జెప్పుచుండిరి. ఒకానొక పక్షి సముద్రతీరమున గ్రుడ్లుపెట్టియుండ నాగ్రుడ్లను తరంగముల ద్వారమున సముద్రుడపహరించెను. అంతట యాపక్షి "సముద్రుడు నాగ్రుడ్ల నపహరించుటా నేను యూరకుండుటా" అని క్రోధావేశమున యీసముద్రుని శోషింపజేసెద నని తనముక్కుతో సముద్రజలబిందువు నొక్కొకదానిని తీసుకువచ్చి యొడ్డున చిమ్ముచుండగా యితరపక్షులావిషయమును చూచి యో వెర్రిదానా యీసముద్రశోషణ మిట్లగునా? చాలించు మీయుద్యమమును యని బోధించినను పట్టుదలతో యట్లే చేయుచుండెను. అంతట నారదమహర్షి యచటకేగి యో పక్షిరాజమా! నీ వీసముద్రము నెంతకాలమున కిట్లు చేసి శోషింపజేయగలవు. నీశక్యముకాదు. నీ వీయుద్యమమును విరమింపుము. అని పలుకనావాక్యములను విని యాపక్షి ఓ నారదమహర్షి! యీజన్మమునకాని మరియొకజన్మమునకాని యట్లే చేయుచుకాని మరియొకయుపాయముచే కాని సముద్రమును శోషింపజేసెద. నాప్రతిజ్ఞ యిదియే యని పలుకదైవానుకూల్యమువలన దయావంతుడగు నారదుండు గరుడుని కడకేగి ఓపక్షిరాజమా సముద్రుడు నీజ్ఞాతిద్రోహముచే నిన్నవమానించుచుండె నని పలుక తక్షణమే గరుత్మంతుడు తనరెక్కలచే వాయువును ప్రేరణచేయ నావాయువువలన సముద్రుడు యెండిపోవుచు భీతుడై గ్రుడ్లను పక్షికిచ్చెను. ఇట్లే ఖేదము లేకుండగ పరమధర్మమైన మనోనిరోధమునందు ప్రవర్తించు యోగిని పరమేశ్వరుడనుగ్రహించును. అందువలన పక్షికి వలె నట్టి యోగికి యభిమతము సిద్ధించును. ॥౨౩॥

శాంకరభాష్యార్థతత్త్వబోధిని:—
దేశమును జేయుచుండెను. యథోక్తఫలముకల యోగము ఈజన్మమునందుకాని, లేకజన్మాంతరమునందుకాని తప్పక సిద్ధించు నను నిశ్చయముతో, నిర్వేదరహితమగు మనస్సుతో ననుష్ఠింపదగును. ||౨౩||

శంకరానందీయము:— ఇంతకు పూర్వమునందు యోగమునకు లక్షణములను చెప్పి యిప్పుడు "తం విద్యాత్" అనుదానిచే పూర్వోక్తలక్షణలక్షితమునే యోగముగ దెలిసికొనవలయునని చెప్పుచుండెను.

బాహ్యోపరతత్వాదిచిత్తపరిపాకవిశేషవిశిష్టమైన దేయంతఃకరణావస్థావిశేషముకలదో దానినే యోగశబ్దవాచ్యముగ గ్రహింపవలయును. చెప్పబడిన యోగలక్షణమునే విస్పష్టార్థమై "దుఃఖసంయోగ వియోగం" అను పదముచే తిరిగి చెప్పుచుండెను. ఇచట దుఃఖపదముచే దుఃఖానుబంధియగు వైషయికసుఖమును కూడ గ్రహింపవలయును. ఆధ్యాత్మికదుఃఖములయొక్కయు; వైషయికసుఖములయొక్కయు సంసర్గతో వియోగము కల యపరోక్షితబాహ్యసుఖదుఃఖప్రత్యయము కల యంతఃకరణస్థితివిశేషమునే యోగముగ దెలిసికొననగును.

ఇట్టి యోగలక్షణమును, యోగమును యాత్మయందు చూచుచు యోగి సంతోషించును అని యోగఫలమును చెప్పి సంసారనిమగ్నుని యుద్ధరణము యోగమును విడచి యితరమైనదానిచే చేయుట శక్యముకాదని, (సిద్ధించ దని) విజ్ఞాతమైన యాత్మతత్త్వము కల యతికి విదేహముక్తికొఱకు సమాధి యవశ్యకర్తవ్య మని సూచించుటకు తిరిగి "సః" అనుదానిచే చెప్పుచుండెను.

ఆత్మసముద్ధరణమునందు పరమసాధనమైనది చెప్పబడినలక్షణములు కల యీ యోగమే. ఈ యోగముచేతనే యాత్మ యుద్ధరింపబడును. ఇది శాస్త్రప్రసిద్ధము, అను నిశ్చయముచే చిత్తదార్ఢ్యముచేతను, "నాసాగ్రదర్శనము, ఇంద్రియనిరోధము, సాత్మ్యేనకాయస్థాపనము, మనోనిగ్రహము క్లేశదాయకములు నేను చేయుటకు సమర్థుడను కాను" అని సమాధికరణమునం దేయలసత్వము కలదో అదియే దోషము. అట్టి దోషముతోగూడిన చిత్తము నిర్విణ్ణమని చెప్పబడును. శీఘ్రమోక్షేచ్ఛచే నట్టి దోషరహితమైన చిత్తమనిర్విణ్ణ మనబడును. అట్టి యనిర్విణ్ణచిత్తముచే ముముక్షువగు యతికి చెప్పబడినలక్షణములు గల యోగము (సమాధి) విదేహముక్తికొఱకు తెప్పగ చేయదగినది. ||౨౩||

నీలకంఠీయము:— "యత్రోపరమతే చిత్తం" ఇత్యాది శ్లోకముచే చెప్పఁబడిన లక్షణములు కలదానిని అంతఃకరణసంబంధముయొక్క వియోగము కలదైనను విరుద్ధలక్షణముచే యోగమనెడిపేరు కలదానిగ దెలిసికొనవలెను. యోగఫలము నుపసంహరించి తిరిగి "శతకృత్వోఽపి పథ్యం వదితవ్యం" అనేకసార్లు పథ్యమగుదానిని చెప్పవలె నను న్యాయమున నిశ్చయానిర్వేదములకు సాధనత్వవిధానపూర్వకముగ "స నిశ్చయేన" అనుదానిచే విధించుచుండెను.

ఆయోగము నిశ్చయముచే నిర్వేదరహితమగు చిత్తముచే నభ్యసింపదగినది. లేక, "శాంతో దాంత ఉపరత స్తితిక్షు స్సమాహితో భూత్వాఽఽత్మ న్యేవాత్మానం పశ్యేత్" అనెడి శ్రుతివిహితము శ్రుత్యంతరదృష్టము, శ్రద్ధావిత్తపదోపేతము నగు శమాదిషట్కమిచట క్రమముగ విధింపబడుచుండెను. అందు "నిశ్చయేన" అను పదముచే గురువేదవాక్యములయందు ఫలావశ్యంభావనిశ్చయరూపమగు శ్రద్ధ గ్రహింపనగును. అట్లే "అనిర్విణ్ణచేతసా" అనుదానిచే వైరాగ్యముచే ద్వంద్వసహిష్ణుత్వరూపమగు తితిక్ష విధింపఁబడెను. అని తెలిసికొననగును. ||౨౩||

గీ॥ సంకల్పప్రభవా న్కామాం స్త్యక్త్వా సర్వా నశేషతః।
మనసై వేంద్రియగ్రామం వినియమ్య సమంతతః ॥ ॥౨౪॥

గీ॥ శనై శ్శనై రుపమే ద్బుద్ధ్యా ధృతిగృహీతయా।
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥ ॥౨౫॥

పదవిభాగము:— సంకల్పప్రభవాన్- కామాన్- త్యక్త్వా- సర్వాన్- అశేషతః- మనసా- ఏవ- ఇంద్రియగ్రామం- వినియమ్య- సమంతతః ॥ ॥౨౪॥

ప్రతిపదార్థము — సంకల్పప్రభవాన్-సంకల్ప=శోభనాధ్యాసరూపమగు సంకల్పము; ప్రభవాన్= కారణముగాకల; సర్వాన్=సమస్తములగు; కామాన్=కోరికలను; అశేషతః=(నిర్లేపముతో)శేషము లేకుండగ; త్యక్త్వా=విడచి; మనసైవ=(వివేకయుక్తమగు) మనస్సుతోటియే; ఇంద్రియగ్రామం= ఇంద్రియసముదాయమును; సమంతతః=అన్నివిషయములనుండి; సంనియమ్య=నియమనమును జేసి (నివర్తింపజేసి.) ॥౨౪॥

పదవిభాగము:— శనైః-శనైః- ఉపరమేత్-బుద్ధ్యా-ధృతిగృహీతయా-ఆత్మసంస్థం-మనః-కృత్వా-న-కించిత్- అపి- చింతయేత్ ॥ ॥౨౫॥

ప్రతిపదార్థము:— ధృతిగృహీతయా; ధృతి=ధైర్యముచే; గృహీతయా=గ్రహింపబడిన; బుద్ధ్యా= బుద్ధిచే; శనైశ్శనైః=మెల్లిమెల్లిగా; ఉపరమేత్=ఉపరమమును చేయదగును; మనః=మనస్సును; ఆత్మసంస్థం= ఆత్మయందున్నదానినిగ; కృత్వా=చేసి; కించిదపి=దేనినీ; న చింతయేత్=చింతింపరాదు. ॥౨౫॥

—: ౬వ అధ్యాయము ౨౪,౨౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— ఏమిచేసి యోగమభ్యసింపదగినది యను యాశంకపై "సంకల్పప్రభవాన్" అను శ్లోకముచే చెప్పుచుండెను.

సంకల్పమనగ దృష్టమగు విషయములయం దశోభనాదర్శనముచే శోభనాధ్యాసయే సంకల్పమన బడును. అట్టి యధ్యాసాత్మక మగు సంకల్పమువలన "ఇదం మే స్యా దిదం మే స్యాత్" అనెడి కోరికలు జనించును. అట్టి శోభనాధ్యాసజన్యమైన విషయాభిలాషలను విచారమువలన జనించిన నశోభనత్వనిశ్చయముచే శోభనాధ్యాసబాధవలన దృష్టమగు స్రక్చందనవనితాదులయందు, అదృష్టములగు యింద్రలోకపారిజాతాప్సరఃప్రభృతులందు శునకవాంతపాయసమునందువలెయశోభనత్వనిశ్చయముచే బ్రహ్మలోకపర్యంత ముండు వాసనాసహితమైయన్నిటిని విడచి తనుక నే యింద్రియప్రవృత్తి కామపూర్వకమగుటవలన కోరిక నివర్తించినచో వివేకయుక్తమగు మనస్సుచేతనే చక్షురాదికరణసమూహమును సర్వవిషయములనుండిమరలించి మెల్లిమెల్లిగ నుపరమింపవలెను అని ముందు శ్లోకముతో నన్వయింపనగును. ॥౨౪॥

ధైర్యముచే గృహీతమైన యవశ్యకర్తవ్యతానిశ్చయరూపమైన బుద్ధిచే అనగా యెపుడో యొకప్పు డవశ్యము యోగము (సమాధి) కాగలదు తొందరచే నేమిప్రయోజన మను బుద్ధిచే మెల్లిమెల్లిగ గురూపదిష్టమార్గముచే మనస్సును యరికట్టవలెను. ఈ చెప్పుటచే పూర్వమునందు చెప్పబడిన యనిర్వేద, నిశ్చయములు చెప్పబడెను. ఈవిషయమునే "యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞః ...ద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని" అను శ్రుతియుబోధించుచున్నది. లౌకికవాక్కును, వైదికవాక్కును వ్యాపారముకల మనస్సునందు నియమింపవలెను. "నానుధ్యాయా ద్బహూం శ్ఛబ్దా న్వాచో విగ్లాపనం హి తత్" అనేకశబ్దముల నుచ్చరింపరాదు అటులయుచ్చరించుట వాగింద్రియవిగ్లాపనమే యగు నను శ్రుతియు యీవిషయమునే బోధించుచున్నది. వాగ్వృత్తినిరోధముచే మనోవృత్తిమాత్రముకలవాడై యుండవలె నని యర్థము. ఈ భూమికయందు చక్షురాదీంద్రియనిరోధము చేయవలయు నని తెలిసికొననగును.

**శాంకరభాష్యమ్॰—**

కించ— సంకల్పప్రభవా న్సంకల్పః ప్రభవో యేషాం కామానాం తే సంకల్పప్రభవాః కామా స్తాం స్త్యక్త్వా పరిత్యజ్య సర్వా నశేషతో నిర్లేపేన। కించ మనసైవ వివేకయుక్తేనేంద్రియగ్రామ మింద్రియసముదాయం వినియమ్య నియమనం కృత్వా సమంతత స్సమంతాత్ ॥ ॥౨౪॥

**శాంకరభాష్యతత్త్వబోధని॰—**

మరియు శోభనాధ్యాసరూప మగు సంకల్పమువలన కల్గు సమస్తకామములను నిర్లేపముతో నిరవశేషముగ విడిచిపెట్టి మఱియు వివేకయుక్త మగు మనస్సుచే నింద్రియసముదాయమును నియమించి, (ముందుశ్లోకముతో నన్వయము) ॥౨౪॥

కర్మేంద్రియజ్ఞానేంద్రియసహకారియు, నానావిధవికల్పసాధనము నగునట్టి యామనస్సును "జ్ఞానే-జానాతీతి జ్ఞానం" అను వ్యుత్పత్తిచే జ్ఞాత యగు యాత్మయందు అనగా జ్ఞాతృత్వోపాధియగు యహంకారమునందు నియమింపవలెను. అనగా మనోవ్యాపారములను పరిత్యజించి యహంకారమాత్రమును మిగల్చవలయును. ఆజ్ఞాతృత్వోపాధియగు యహంకారమును "ఆత్మని మహతి" సర్వవ్యాపకమగు మహత్తత్త్వమునందు నియమింపవలెను. అహంకారము- విశేషరూపమని, సామాన్యరూపమని రెండువిధములు. "అయ మహ మేతస్య పుత్రః" ఈ నేను యితనియొక్క- పుత్రుడను అని వ్యక్తముగ యభిమన్యమానవిశేషరూపము వ్యష్ట్యహంకారము. "అస్మి" అని యేతావన్మాత్ర మభిమన్యమానసామాన్యరూపము సమష్ట్యహంకారము. ఈసమష్ట్యహంకారమే హిరణ్యగర్భుడని, మహదాత్మ యని సర్వానుస్యూత మగుటవలన చెప్పబడును. అట్టి వ్యష్ట్యహంకారసమష్ట్యహంకారములకంటె భిన్నమగు నిరుపాధికమైన శాంతాత్మ, సర్వాంతరము, చిదేకరసము. దానియందు సమష్టిబుద్ధిరూపమగు హిరణ్యగర్భుని నియమింపవలెను. అనంతరమున నిరుపాధికము, త్వం పదలక్ష్యము, శుద్ధము అగు యాత్మ సాక్షాత్కృత మగును.

శుద్ధము, చిదేకరసము నగు ప్రత్యగాత్మయందు జడశక్తిరూపము, అనిర్వాచ్యము, అవ్యక్తము నగు ప్రకృతి యుపాధి. అప్రకృతియే మొదట సామాన్యాహంకారరూపమై మహత్తత్త్వము అనెడి నామమును పొంది వ్యక్తమగుచున్నది. అనంతరమున బహిర్విశేషాహంకారరూపముచే వ్యక్తమగుచున్నది. అనంతరమున బహిర్మనోరూపముచే వ్యక్తమగుచున్నది. అనంతరమున బహిః వాగాదీంద్రియరూపమున వ్యక్తమగుచున్నది. ఈవిషయమే "ఇంద్రియాణి పరా ణ్యాహు రింద్రియేభ్యః పరం మనః, మనస స్తు పరా బుద్ధి ర్బుద్ధే రాత్మా మహా న్పరః। మహతః పర మవ్యక్త మవ్యక్తా త్పురుషః పరః। పురుషా న్న పరం కించి త్సా కాష్ఠా సాపరాగతిః" అను శ్రుతి బోధించుచున్నది. అందు గవాదులయందువలె వాఙ్నిరోధము ప్రథమభూమిక. బాలముగ్ధాదులవలె నిర్మనస్త్వము రెండవభూమిక. అలసునియందు గల యలసత్వమునందువలె యహంకారరాహిత్యము మూడవభూమిక. సుషుప్తియందువలె మహత్తత్త్వరాహిత్యము నాల్గవభూమిక. ఈ నాల్గుభూమికల ననుసరించి మెల్లిమెల్లిగ నుపరమింపవలెనని చెప్పబడెను.

విచారింప మహత్తత్త్వశుద్ధాత్మలమధ్య మహత్తత్త్వోపాదానమగు అవ్యాకృతమనెడి తత్త్వము శ్రుతిచే చెప్పబడెను. అయినను యీమహత్తత్త్వమునకు స్వోపాదానమగు యవ్యాకృత మనెడి తత్త్వమునందు నియమనము శ్రుతిచే చెప్పబడలేదు. ఎందులకు చెప్పలేదని శంకింపజనదు. మహతత్త్వమునకు సుషుప్తియందువలె స్వరూపలయప్రసక్తివలన కర్మత్వయమగుచో పురుషప్రయత్నము లేకుండగనె మహత్తత్త్వమునకు లయము స్వతస్సిద్ధమగుటవలన అట్టి మహత్తత్త్వమునకు ప్రకృతియందు లయము తత్త్వదర్శనమున కుపయోగము కొనంమనను అట్టిలయము చెప్పబడలేదు. "దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా సూక్ష్మయా సూక్ష్మదర్శిభిః" అని పూర్వమునందు

**శాంకరభాష్యమ్.—**

శనై శ్శనై ర్న సహసోపరమే దుపరతిం కుర్యాత్ । కయా బుద్ధ్యా । కిం విశిష్టయా-ధృతిగృహీతయా ధృత్యా ధైర్యేణ గృహీతయా ధృతిగృహీతయా ధైర్యేణ యుక్తయే త్యర్థః । ఆత్మసంస్థ మాత్మని సంస్థిత మాత్మైవ సర్వం న తతోఽన్యత్కించి దస్తీ త్యేవ మాత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ । ఏష యోగస్య పరమో విధిః ॥ ॥౨౫॥

**శాంకరభాష్యతత్త్వబోధిని.—**

ధైర్యయుక్తమగు బుద్ధిచే శీఘ్రముగ గాకుండ నెమ్మదిగ విషయములనుండి నుపరమమును సంపాదింపవలెను. (అట్లుగాక శీఘ్రముగనే విషయములనుండి మనస్సున కుపరమ మగుచో స్వాస్థ్యము సంభవింప దను అభిప్రాయముతో "శనైశ్శనైః" అనుపదము విన్యస్తము) ఇట బుద్ధియొక్కయుపరమ మనగ భూమి మొదలుకొని ప్రకృతిపర్యంతమగు యెనిమిదింటిలో పూర్వపూర్వమునందు ధారణము జేసి, యుత్తరోత్తరక్రమముగ ప్రవిలాపనము చేయవలె నని భావము. అవ్యక్తమును ఆత్మయందు ప్రవిలాపనము జేసి, మనస్సును ఆత్మమాత్రమునందున్న దానినిగ జేసి చింతింపదగిన దేదియు లేదుగాన అత్యంతము స్వస్థుడు కాదగునని చెప్పుచున్నాడు. మనస్సును ఆత్మసంస్థమగు దానిగ జేసి (సర్వము ఆత్మస్వరూపమే. ఆత్మకంటె వేరే దియు లేదని తలచి) వేరొకదానిని చింతింపరాదు. ఇదియే (మనోనైశ్చల్యమే) యోగము యొక్క పరమవిధానము. ॥౨౫॥

చెప్పి నూత్మ్మత్వసిద్ధికొఱకు నిరోధసమాధియొక్క చెప్పడమువలన యీ నిరోధసమాధి తత్త్వదిదృక్షువుకు దర్శన సాధనమగుటచేతను, దృష్టతత్త్వముకలవానికి జీవన్ముక్తికి ప్రతిబంధకమగు క్లేశముల క్షయమునిమిత్త మపేక్షితము.

శుద్ధాత్మయం దవరుద్ధమైన చిత్తము వృత్తిరహిత మగుటచే సుషుప్తియందువలె దర్శనహేతువు కానేర దని శంకింపజనదు.

దర్శనము స్వతస్సిద్ధ మగుటచే నివారించుట కశక్యము, ఈవిషయమే "ఆత్మా నాత్మాకారం స్వభావతోఽవస్థితం సదా చిత్తమ్। ఆత్మైకాకారతయా తిరస్కృతానాత్మదృష్టింవిదధీత" ఘట ముత్పద్యమానమైస్వతః ఆకాశముచే నిండింపబడియే జనించును. ఉత్పన్నమైనపిదప పురుషప్రయత్నముచే జలతండులాదులచే నిండింపబడిన దగును. అందుండు జలతండులాదులు నిస్సారితమైనను యీ కాశముమాత్రము నిస్సారితముగ జేయుటకు శక్యముకాదు. ఘటముయొక్క ముఖమును మూసివేసినను లోన నాకాశ మట్లే యుండును. కాని నిస్సారితము కాదు. ఆట్లే చిత్తము జనించుచు చైతన్యపూర్ణమయియే జనించును. చిత్తమట్టి తీయన జనించినపిదప మూసానిషిక్తదృతతామ్రమువలె (అనగా తామ్రమునుకరగి మూసయం దుంచిన యీ తామ్రమెటుల మూసయొక్క ఆకారమును పొందునో) ఆట్లే భోగహేతు వగు ధర్మాధర్మసహకృతసామగ్రివలన సుఖదుఃఖాదిరూప మగును. అందు విరామప్రత్యయము (అసంప్రజ్ఞాతసమాధి) యొక్క యభ్యాసముచే ఘట సుఖ దుఃఖాద్యనాత్మాకారము తొలగింప నిర్నిమిత్త మగు చిదాకారము నివారించుటకు శక్యముకాదు. కాన నిరోధసమాధికల నిర్వృత్తిక మగు చిత్తముచే సంస్కారమాత్ర మవశిష్టమగుటవలన నతిసూక్ష్మ మగుటచే నిరుపాధికచిదాత్మమాత్రాభిముఖమగుటవలన వృత్తిలేకయే నిర్విఘ్నముగ యాత్మ యనుభవింపబడును. ఈవిషయమునే "ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్" అని కృష్ణభగవానుడు చెప్పెను. ప్రత్యగ్రూపమగు నిరుపాధికాత్మయందు సమాప్తికలదానినిగ, సర్వాకారవృత్తిశూన్యముగ, స్వభావసిద్ధాత్మాకారమాత్రావశిష్టముగ మనస్సును చేసి అసంప్రజ్ఞాతసమాధిస్థుడై అనాత్మనుకాని, ఆత్మనుకాని వృత్తివిషయము చేయరాదు. అనాత్మాకారవృత్తి జనించిన సమాధివ్యుత్థానమే ప్రాప్తిం-

చును. అయాత్మాకారవృత్తి జనించిన సంప్రజ్ఞాతసమాధియే యగును. కాన యసంప్రజ్ఞాతసమాధిస్థైర్యము కొరకు రేవృత్తిని పుట్టింపరాదు. ॥౨౫॥

శంకరానందీయము:— సమాధి నెట్లు నాచరింపవలయునో యారీతినే "సంకల్పప్రభవాన్" అను రెండుశ్లోకములచే బోధించుచుడెను.

పదార్థములయందు సమీచీనత్వకల్పనమే సంకల్ప మనబడును. దానివలన జనించెడి సర్వపదార్థాభిలాషలను పరిత్యజించి, తైలపాత్రయందుండు తైలమంతను పరిత్యజించినను యాపాత్రయందు తైలవిశేషముండునట్లు సర్వకామములను పరిత్యజించినను విషయములయందు రంజనారూపముగ కామశేష ముండును. అట్టి కామశేషముకూడ లేనట్లు సర్వకామములను పరిత్యజింపవలయునని యాశయము. కామశేష మున్నచో అట్టి కామశేషముచే యాకృష్టమైన మనస్సు సమాధియందుండనేరదు, కాన యోగి దేహజీవనాదికమునందుకూడ నిరపేక్షుడై యుండవలెను.

యోగసిద్ధి కంతరంగమైన బహిస్సాధనమును చెప్పి "మనసా" అనుదానిచే సాధనాంతరమును చెప్పుచుండెను.

సమాధి చేయబడినచో సమ్యగ్జ్ఞానము జనించును. దానిచేతనే మోక్షము సంభవించును. మరియొకవిధమున మోక్షప్రాప్తి కానేరదను నిశ్చయముకలవానిచే కామసంకల్పములకు దూరముగనుండు మనస్సుచేతనే చక్షురాదిజ్ఞానేంద్రియముల వాగాదికర్మేంద్రియముల యొక్కయు ప్రవృత్తిని నిగ్రహించి "ఇంద్రియములకు మనస్సునకు సంయోగము లేకుండగ జేయుటయే యింద్రియనియమనము అని "మనసా" అను పదముచే సూచింపబడెను. ఇంద్రియములకు, మనస్సునకు సంయోగము లేకుండునట్లు యుండవలెనని యభిప్రాయము ॥౨౪॥

బ్రహ్మవేత్త చెప్పబడిన లక్షణములుగల యాసనమున లెస్సగ కూర్చుండి, శరీరమును ఋజువుగ స్థాపించి, దిక్కులను చూడక, నాసాగ్రమున దృష్టిని విడచి, సర్వకామసంకల్పపరిత్యాగపూర్వకముగ సర్వేంద్రియముల నరికట్టి మెల్లిమెల్లిగ నుపరమింపవలెను. అని "శనైః" అను వాక్యముచే జెప్పుచుండెను.

క్రమముగ బాహ్యవిషయములనుండియు, అనంతరము యింద్రియములనుండియు, అనంతరము లోపల జనించు విపరీతప్రత్యయములనుండియు, మెల్లిమెల్లిగ నంతఃకరణము నుపరతముగ జేయవలెను. అనగా మోక్షైకకాంక్షచే విషయములతోటి, ఇంద్రియములతోటి, అసత్ప్రత్యయములతోటి సంబంధము లేకుండునట్లు మనస్సుయొక్క బహిఃప్రవృత్తిని నిరోధింపవలయును. "యచ్ఛే ద్వాఙ్మనసీ ప్రాజ్ఞ స్తద్యచ్ఛే జ్జ్ఞాన ఆత్మని। జ్ఞాన మాత్మని మహతి నియచ్ఛే త్త ద్యచ్ఛే చ్ఛాంత ఆత్మని" అను శ్రుత్యుక్తరీతిని వాగుపలక్షితమగు సర్వేంద్రియములను తత్తద్విషయములతోగూడ మనస్సునందు ప్రవిలాపనచేయవలెను. ప్రపంచకారణమగునట్టి మనస్సును అహమాత్మికమగు బుద్ధియందు ప్రవిలాపనము చేయవలెను. అహమాత్మికబుద్ధిని మహత్తత్త్వమునందు ప్రవిలాపన మొనరింపవలయును. ఆ మహత్తత్త్వమును అవ్యాకృతమునందు, అవ్యాకృతమును సర్వప్రపంచోపశమము, నిర్విశేషమునగు పరబ్రహ్మమునందు ప్రవిలాపన మొనరింపవలయును. ఇట్లు సర్వమును బ్రహ్మమునందు ప్రవిలాపన మొనరించి "బ్రహ్మైవేదం సర్వం" ఇత్యాదిశ్రుత్యర్థావష్టంబముచే జనించిన నిశ్చయముకల దృఢవృత్తియే ధృతి. అదియే ధైర్యమనబడును. అట్టిధైర్యముచే నిగృహీతమైన బుద్ధిచే అనగా పూర్వోక్తప్రవిలాపనముచే నంతట బ్రహ్మమాత్రావశేషత్వ సంస్కారబలముచే సర్వము ఆత్మయే, అంతకంటె వేరుగ నేదియు లేదను ప్రత్యయముకల బుద్ధిచే మనస్సును చైతన్యరూపమగునట్టి యాత్మయందే నిశ్చలముగ నొనరించి సర్వమాత్మస్వరూపముగనే చూచుచు విద్వాంసుడు స్వయముగ బాహ్యవస్తువుగాని, ఆంతరవస్తువునుగాని, తలపరాదు. మరేమనిన ? సర్వమును బ్రహ్మముగనే భావన చేయవలెను. ఈ చెప్పుటచే బ్రహ్మాకారవృత్తిచేత మనస్సున కన్యభావన లేకపోవుటయే యోగమని సూచింపబడెను. ॥౨౫॥

పరమార్థప్రప:— పూర్వమునందు చెప్పబడినరీతిని యభ్యాసయోగమును చెప్పి "సంకల్పప్రభవాన్" అను దానిచే రాజయోగమును చెప్ప నారంభించుచుండెను.

సంకల్పమువలన జనించెడి సర్వకామములను వాటికి మూలమగు వాసనలతోకూడ పరిత్యజించి, వాటిని పరిత్యజించుటకు కారణమును "మనసా" అనుదానిచే చెప్పుచుండెను. అంతటను ప్రసరించుచుండిన జ్ఞానేంద్రియ కర్మేంద్రియ సమూహమును మనస్సుతోగూడ నియమనముచేసి, ఇంతియే కాని వాయుధారణాది ప్రయాసములచేమాత్రము మనస్సును నిగ్రహింపరాదు. యీ విషయమే "న యాహి చేత స్త్వమిత స్తతోఽపి దేహేంద్రియాద్యై ర్నకురుష్వ కర్మ। త్వం యత్ర కుత్రాప్యుపవిశ్య నిత్యం విచారయస్వ స్వనిదాన మన్తః" ఓ చిత్తమా! నీవు యిటునటు పరుగులిడకుము, దేహేంద్రియాదులచే కర్మను చేయకుము. నీ విచటనో యొక చోట కూరుచుండి నిత్యము లోలోపల నీనిదానమును విచారింపుము. అని చెప్పబడెను. ॥౨౪॥

"శనైః శనైః" అనుదానిచే యీరాజయోగనిర్వాహమును జెప్పుచుండెను ధైర్య నియమితబుద్ధిచేసంకల్పరూపమనస్సును బలాత్కారముగ నాత్మసంస్థ మొనరించి యాత్మాతిరిక్తమైనదేనినిగూడ చింతింపవలదు. ఇట్లే మెల్లి మెల్లిగ నభ్యాసక్రమముచే బాహ్యప్రపంచమునుండి యుపరతిని పొందవలయును. హఠాత్తుగమాత్ర ముపరతిని పొందవలదు. యీ విషయమే యోగసారావలియందు "అసమర్థో యదాఽభ్యాసే రాజయోగం తదాచరేత్। యేన స్యాత్తురీయావస్థా స పశ్చైవోన్మనీభవేత్। ప్రసహ్య సంకల్పపరంపరాణాం సంభేదనే సంతతసావధానః। ఆలంబనాశా దపచీయమానం శనైశ్శనై శ్శాన్తి ముపైతి చేతః॥ ప్రకాశమానే పరమాత్మభానౌ నశ్య త్యవిద్యా తిమిరే సమస్తే। అహో బుధా నిర్మలదృష్టయోఽపి కించి న్న పశ్యన్తి జగత్స్వరూపమ్" ఎపుడసంప్రజ్ఞాత సమాధ్యభ్యాసమునం దసమర్థుడో అపుడు రాజయోగము నాచరింపవలయును. రాజయోగముచే తురీయావస్థ ప్రాప్తించి యదియే పక్వమై ఉన్మనీ యగును. బలాత్కారముగ సంకల్పపరంపరలయొక్క సంభేదమునందు యెల్లప్పుడు సావధానుడై యుండినచో ఆ అంబనాశమువలన క్షీణించుచున్న మనస్సు శాంతిని పొందును. పరమాత్మ యనెడి సూర్యుడు ప్రకాశించుచుండ నిఖిలా విద్యారూప తిమిరము నశించుచుండ నిర్మలమైన దృష్టిగల విద్వాంసులు జగత్స్వరూపమును కొంచమైన చూడరు. ఎంత ఆశ్చర్యము! ॥౨౫॥

నీలకంఠీయము.— ఈశ్లోకము మొదలు రెండుశ్లోకములచే శమదమోపరమసమాధానములను విధించుచుండెను. సంకల్పమనగ "ఇది నాకు ప్రాప్తించుగాక" అనెడి చిత్తవృత్తి. అట్టి చిత్తవృత్తివలన కలిగెడి కోతికలో విషయములగు స్రక్చందనవనితాదినిఖిలవిషయములను వాసనాపరిత్యాగపూర్వకముగ విడచి, ఈచెప్పుటవలన యంతరింద్రియనిగ్రహరూపమగు శమము చెప్పబడెను. "మనసైవ" అను నుత్తరార్థముచే బాహ్యేంద్రియనిగ్రహరూపమగు దమమును చెప్పుచుండెను. స్రక్చందనవనితాదులయందు దోషమును గ్రహించుచుండెడి మనస్సుచే నన్నివిధముల శ్రోత్రాదీంద్రియసముదాయమును సర్వవిషయములనుండి నియమనము చేసి. యుపరతిని పొందవలయు నని యుత్తరశ్లోకముతో నన్వయము. ॥౨౪॥

నీలకంఠీయము:— భూమి కాజయక్రమద్వారమున దివ్యాదివ్యవిషయములనుండి నివృత్తుడు కావలెను. అది యెట్లనిన? ధృతిగృహీతమగు బుద్ధిచేతను (ధృతియనగ ప్రయత్నవిశేషము) ఆధృతియు "ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః। యోగే నావ్యభిచారిణ్యా ధృతి స్సా పార్థ సాత్త్వికీ" (యోగముచే నవ్యభిచారియగు నెప్రయత్నముచే మనస్సుయొక్కయు, ప్రాణములయొక్కయు, యింద్రియములయొక్కయు వ్యాపారము అరికట్టబడునో. ఓయర్జునా యాధృతి (పయత్నము) సాత్త్విక మనబడును.) అని పదునెనిమదవ యధ్యాయమునందున ముప్పదిమూడవశ్లోకముచే చెప్పబడు సాత్త్వికీధృతియే. అట్టి సాత్త్వికీధృతిచే వశీకృతమగు బుద్ధిచే మెల్లిమెల్లిగ నుపరతిని పొందవలెను. ఇట్లుపరతిని పొందినమనస్సును స్వరూపమునందు స్థితి గలదానినిగ నొనరింపవలెను. దృశ్యమునందు కాని, ద్రష్టయందు కాని స్థితిగలదానినిగ నొనరింపరాదు. అనగా ఆత్మైకాకారముగ (ఏకాగ్రముగ) నొనరింపవలెను. "ద్రష్టృదృశ్యోపరక్తం చిత్తం సర్వార్థం" "సర్వార్థతైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్యైకాగ్రతా పరిణామః" సర్వార్థ మనగ "అహ మిదం పశ్యామి"(నేను దీనిని చూచుచుంటిని) అను యనుభవమునందు ద్రష్టయు, దృశ్యము; దర్శనము ఈ మూడును భాసించును. అందు దర్శనభానము తప్పనిదే. అట్టి యనుభవము ద్రష్టృదృశ్యవిషయక మగుటచే నట్టి చిత్తము సర్వార్థ మనుపించుకొనును. అనగా ద్రష్టయు, దృశ్యము, దర్శన మేచిత్తవృత్తియందు భాసించునో యాచిత్తము సర్వార్థ మనుపించుకొను నని యాశ

గీ॥ యతో యతో నిశ్చరతి మన శ్చంచల మస్థిరమ్ ।
తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్ ॥ ॥౨౬॥

పదవిభాగము:— యతః- యతః- నిశ్చరతి- మనః- చంచలం- అస్థిరం- తతః- తతః- నియమ్య- ఏతత్- ఆత్మని- ఏవ- వశం- నయేత్- ॥౨౬॥

ప్రతిపదార్థము:— యోగీ=యోగాభ్యాసి; (ఈ పదమధ్యాహార్యము) చంచలం=చంచలమైనదియు; అస్థిరం=స్థైర్యములేనిదియునగు; మనః=మనస్సు; యతో యతః=నిమిత్తభూతములగు ఏ ఏవిషయములవలన; నిస్సరతి=బయల్వెడలునో; తతస్తతః=ఆయావిషయములనుండి; ఏతత్=ఈమనస్సును; నియమ్య=నియమించి; ఆత్మన్యేవ=ఆత్మయందే; వశం=స్వాధీనత్వమును; నయేత్=పొందింపవలెను. ॥౨౬॥

---

యము. కేవల దర్శనము భాసించినపుడుకూడ 'నాచిత్తము సర్వార్థమని చెప్పుటకు వీలుకాదు. అట్లగుచో ఏకాగ్ర మనగ దర్శనము కూడ భాసించనిదని యనిర్థము చెప్పవలెను దర్శనము కూడ భాసింపనపుడు చిత్తమునకు నాశమే సంభవించును. కాన ద్రష్టృదృశ్యదర్శనత్రయము భాసించినపుడే సర్వార్థమని చెప్పవలెను. ద్రష్టయు, దృశ్యము భాసించనపుడు యేకార్థము చిత్తమునఁబడును. అదియెట్లనిన? స్వప్నమునందు దృశ్యము లేదని పామరులకు కూడ తెలిసినవిషయమే. "ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహు ర్మనీషిణః" అను శ్రుత్యనుసారము ఇంద్రియ మనస్సులతో గూడిన యాత్మయే భోక్త యనుపించుకొనునని పైశ్రుతి బోధించుచున్నది. స్వప్నము నందింద్రియములు లేమిఁజేసి భోక్తయు లేడు. మరే మున్నదనిన? ద్రష్టృదృశ్యవాసనావాసితము చిత్రపటసదృశము నగు నొక మనస్సుమాత్రమే కలదు. అట్టి మనస్సు స్వయంజ్యోతీరూపమగు నాత్మచే ప్రకాశింపఁబడి జాగ్రద వస్థయందువలె స్వప్నమందును ద్రష్టృదృశ్యవాసనావాసితమగుటవలన ద్రష్టను దృశ్యమును ప్రకాశింపజేయు చుండెను. పర్యవసిత మే మనిన? ఎప్పుడు సర్వార్థత్వము నశించి యేకార్థత్వ ముదయించునో అపుడు చిత్తమున కేకాగ్రతాస్వరూపమగు పరిణామము సంభవించును "ఆత్మసంస్థం మనః కృత్వా" అనుదానిచే సంప్రజ్ఞాత సమాధి చెప్పఁబడెను. అందును పూర్వాభ్యాసవశమువలన చిత్తమునకు ద్రష్టృదృశ్యోపరక్తత్వము సంభవించును. అట్టి ద్రష్టృదృశ్యోపరక్తత్వనివారణపురస్సరముగ నసంప్రజ్ఞాతసమాధ్యవస్థను "నకించి దపి చింతయేత్" అను వాక్యముచె జెప్పుచుండెను. ధ్యాతృధ్యానధ్యేయవిభాగమునుకూడ స్మరింపరాదు. మరేమనిన? అఖండైక రససంవిత్స్వరూపముగ సుషుప్త్యవస్థయందువలె నుండవలెను. అని యర్థము. ॥౨౫॥

—: ౬వ అధ్యాయము. ౨౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. :—

మధుసూదనసరస్వతీయము:—

ఇట్లు నిరోధసమాధి నాచరించు యోగి చిత్తవిక్షేపహేతువులగు శబ్దాదులలో నేదో యొకటగు నిమిత్తమువలన అనగా శబ్దాదివిషయములవలన గాని, రాగమువలన గాని, ద్వేషమువలనగాని విక్షేపాభిముఖమైనదై మనస్సు విషయాభిముఖమైన ప్రమాణవిపర్యయవికల్పస్మృతులలో సమాధివిరోధి యగు యేదో యొక వృత్తిని పుట్టించును. అట్లగుచో లయహేతువగు నిద్రాశేష బహ్వాశన శ్రమాదులలో యేదోయొక కారణము వలన లయాభిముఖమై మనస్సు లీనమైన సమాధివిరోధి యగు నిద్ర యను వృత్తిని పుట్టించును. ఆయా విక్షేప నిమిత్తమువలన, లయనిమిత్తమునుండినియమనము చేసి యా మనస్సును నిర్వృత్తిక మొనరించి స్వప్రకాశ పరమానందఘనమగు యాత్మయందే యెట్లు విక్షేపమునుపొందదో యెట్లు లయమును పొందదో అట్లుయరికట్ట వలెను. ఈ శ్లోకమునందు గల ఏవకారముచే సమాధియనాత్మవిషయకము కాకూడదని స్పష్టపరుపబడెను. ఈ విషయమే గౌడాచార్యపాదులచే నీక్రిందివిధమున చెప్పబడెను.

"ఉపాయేన నిగృహ్ణీయా ద్విక్షిప్తం కామభోగయోః । సుప్రసన్నం లయే చైవ యథా కామో లయ స్తథా ॥౧॥ ఎట్లు కాముము విషయగోచరప్రమాణాదివృత్త్యుత్పాదనద్వారమున సమాధివిరోధియో అట్లే సుషుప్తమునందు మన స్సాయాసవర్జితమైనను సుషుప్తము (లయమందు) కూడ నిద్ర యనెడి వృత్త్యుత్పాదన ద్వారమున సమాధివిరోధి యగును. కాన కామభోగములయందు ప్రమాణ విపర్యయవికల్పస్మృతులలో నేదో యొక వృత్తిచే పరిణతమైన మనస్సును, లయ (సుషుప్త) ముననుం దాయాసవర్జితమైనను సమాధివిరోధినిద్రాఖ్య

**శాంకరభాష్యమ్‌—**

తత్రైవ మాత్మసంస్థం మనః కర్తుం ప్రవృత్తో యోగీ —యతో యతో యస్మా ద్యస్మా న్నిమిత్తా చ్ఛబ్దాదే ర్నిశ్చరతి నిర్గచ్ఛతి స్వభావదోషా న్మన శ్చంచల మత్యర్థం చల మత ఏవాస్థిరం తత స్తత స్తస్మా చ్ఛబ్దాదే ర్నిమిత్తా న్నియమ్య తత్తన్నిమిత్తయాథాత్మ్యనిరూపణేనాఽఽభాసీకృత్య వైరాగ్యభావనయా చైత న్మన ఆత్మన్యేవ వశం నయే దాత్మవశ్యతా మాపాదయేత్ । ఏవం యోగాభ్యాసబలా ద్యోగిన ఆత్మన్యేవ ప్రశామ్యతి మనః । ॥౨౬॥

**శాంకరభాష్యతత్త్వబోధిని—**

యోగప్రారంభసమయమున పై జెప్పిన విధముగ మనస్సును ఆత్మసంస్థముగ జేసుకొనుటకై ప్రవర్తించిన యోగి-స్వభావదోషముచే నత్యంతము చంచలము, కనుకనే యస్థిరము నగు మనస్సును నిమిత్తభూతమైన శబ్దాదులనుండి శబ్దాదిరూపమగు నేయే విషయములకై బయల్వెడలునో ఆయావిషయములనుండి నియమించి ఆవిషయములను యాథాత్మ్య నిరూ

వృత్తిని పుట్టించున దగుటవలన లయమునందును మనస్సును చెప్పబోవువైరాగ్యాభ్యాసరూపమగు యుపాయముచే యాత్మయందే యరికట్టవలెను. ఇట "లీయతేఽస్మిన్నితి లయః" అను విగ్రహముచే లయపదముచే సుషుప్తము చెప్పబడును.

"దుఃఖం సర్వ మనుస్మృత్య కామభోగా న్నివర్తయేత్ । అజం సర్వ మనుస్మృత్య జాతం నైవ తు పశ్యతి ॥౨॥ ఏ యుపాయముచే మనోనిగ్రహ మాచరింపవలయు నను శంకను తొలగించుటకు "దుఃఖం" అని చెప్పబడియుండెను, "యో వై భూమా త త్సుఖం, నాల్పే సుఖ మస్తి అథ యదల్పం తన్మర్త్యం తద్దుఃఖం" ఏది భూమయో (సర్వవ్యాపకమో) అది సుఖము. అల్పమునందు సుఖము లేదు. యేది యల్పమో అది నశించునది. అది దుఃఖరూపము. అనెడి శ్రుత్యర్థమును గురూపదేశానంతరము పర్యాలోచన చేసి సర్వద్వైత ప్రపంచము అవిద్యావిజృంభితము, దుఃఖస్వరూపమే యని తలచి చింత్యమానావస్థాపన్నమైన విషయములను, భుజ్యమానావస్థాపన్నమైన విషయములను మనస్సమీపమునుండి మరలింపవలయును. "కామశ్చ భోగశ్చ కామభోగం తస్మాత్" అని విగ్రహమునవలంబించియైన చింత్యమానావస్థాపన్న విషయములనుండియు, భుజ్యమానావస్థాపన్న విషయములనుండియు మనస్సును మరలింపవలయును. అను యర్థమైన సమంజసమే. ఇట్లు ద్వైతస్మరణకాలమున వైరాగ్యభావన యుపాయ మగును. ద్వైతవిస్మరణము పరమోపాయమని "అజం" ఇత్యాదివాక్యముచే చెప్పుచుండెను. సర్వము బ్రహ్మమే. బ్రహ్మముకంటె వేరుగ నేదియు లేదు. అను శాస్త్రాచార్యోపదేశానంతరము స్మరించుచుండిన అధిష్ఠానము జ్ఞాతమగుచో కల్పితము లేమింజేసి బ్రహ్మవ్యతిరిక్తముగ ద్వైతజాతమును చూడడు. ఈ ద్వైతవిస్మరణము వైరాగ్యభావనరూపమగు యుపాయముకంటె యుత్కృష్టమైన యుపాయమని "తు" అనెడిశబ్దముచే ద్యోతితము.

"లయే సంబోధయే చ్చిత్తం విక్షిప్తం శమయే త్పునః । సకషాయం విజానీయా త్సమప్రాప్తం న చాలయేత్" ॥ ఇట్లు వైరాగ్యాభ్యాసముచేతను, తత్త్వదర్శనముచేతను విషయములనుండి మరలింపబడుచుండు చిత్తము ప్రతిదినము లయా (సుషుప్త్యా) భ్యాసమువలన లయాభిముఖమగుచో లయకారణమగు నిద్రాశేషముయొక్క, అజీర్ణముయొక్క, బహ్వాశనశ్రమలయొక్క నిరోధముచే చిత్తమును ఉత్థానప్రయత్నద్వారా మెలుకవ గాంచునట్లు చేయవలెను. ఇట్లు చిత్తము ప్రబుధ్యమానమైనను దైనందినప్రబోధాభ్యాసమువలన కామభోగములయందు విక్షిప్తమగుచో వైరాగ్యభావనచేతను, తత్త్వసాక్షాత్కారముచేతను, తిరిగి శమింపజేయవలెను. ఇట్లు మాటిమాటికి యభ్యాసము చేయువాడైనను వానికి లయమువలన సంబోధితమైనను, విషయములనుండి వ్యావర్తిత

శాంకరభాష్యతత్త్వబోధినీ—

షణముచే (విషయములు నశించెడి స్వభావముకలవి; దుఃఖసంమిశ్రితములు, అను మొదలగు ఆలోచనముచేతను వైరాగ్యభావనచేతను) ఆభాసమాత్రములుగ జేసి, ఈమనస్సును ఆత్మ వశ్యము జేయవలెను. ఇట్లు యోగాభ్యాసబలముచే యోగి మనస్సు తన (ఆత్మ) యందేయుప శమించును. ॥౨౬॥

మైనను చిత్తము సమ (బ్రహ్మ) ప్రాప్తము కానిచో రాగద్వేషాది ప్రబలవాసనావశముచె స్తబ్ధీభావ మనెడి కషాయరూపమగు దోషముచే చిత్తము కూడుకొనిసదని సమాహితచిత్తమువలన తెలిసికొనవలయును. అనంతర మున చిత్తము సమాహితము కాలేదని తెలిసికొని లయవిక్షేపములనుండి యరికట్టినట్లే కషాయమునుండిగూడ చిత్తమును యరికట్టవలెను. లయవిక్షేపకషాయములు పరిత్యాజ్యము లగుచో పరిశేషన్యాయమువలన చిత్తముచే బ్రహ్మము పొందబడును. అట్టి బ్రహ్మప్రాప్తమగు చిత్తమును కషాయలయభ్రాంతిచే విషయాభిముఖము చేయ రాదు. మరేమి చేయవలెననిన ధృతిగృహీతమగు బుద్ధిచే లయకషాయప్రాప్తినుండి వేరుపరచి యా బ్రహ్మ ప్రాప్తియందే స్థాపింపవలయును.

"నాస్వాదయేత్సుఖం తత్ర నిస్సంగః ప్రజ్ఞయా భవేత్ । నిశ్చలం నిశ్చరచ్చిత్త మేకీకుర్యా త్ప్రయత్నతః ॥ ॥౪॥ అట్టి నిర్వృత్తిక (అసంప్రజ్ఞాత) సమాధి పరమసుఖాభివ్యంజకమైనను "ఇంత కాలము నేను సుఖపడుచుంటిని"అని సుఖాస్వాదరూపమగు వృత్తి నిసమాధిభంగప్రసంగమువలన కలుగచేయరాదు. (అని పూర్వమునందే వ్యాఖ్యానింపబడెను.) ప్రజ్ఞచే ననుభూయమానమగు సుఖముకూడ నవిద్యాపరికల్పితము, "మృషయే" అను భావనచే సర్వసుఖములయందు నిస్పృహుడై యుండవలెను. లేక—సవికల్పసుఖాకారవృత్తితో గూడ సంగమును పరిత్యజింపవలెను. కాని స్వభావప్రాప్తమగు స్వరూపసుఖము వారించుటకు శక్యము కానం దున, నిర్వృత్తికచిత్తముచే స్వరూపసుఖము ననుభవింపరాదని కాదు. ఇట్లన్నింటినుండి మరలించి ప్రయత్నవశ ముచే నిశ్చలమై చేయబడిన చిత్తము స్వభావచాంచల్యమువలన విషయాభిముఖముగ బయలువెడలినచో నట్టి చిత్తమును ప్రయత్నముతో నిరోధప్రయత్నముచే బ్రహ్మమునం దేకత్వమును పొందింపవలయును. ॥౫॥

"యదా న లీయతే చిత్తం న చ విక్షిప్యతే పునః । అనింగన మనాభాసం నిష్పన్నం బ్రహ్మ త త్తదా" ॥౬॥ బ్రహ్మప్రాప్తమైన చిత్త మెట్టిదిగ నుండు ననిన ? ఏసమయమున చిత్తము స్తంభీభావమును పొం దదో (ఇట లయశబ్దము తామసత్వసామ్యముచే స్తబ్ధీభావమున కుపలక్షకము) "న చ విక్షిప్యతే పునః" శబ్దా ద్యాకారవృత్తిని యనుభవింపదో, సుఖము నాస్వాదింపదో (ఇట విక్షేపశబ్దము రాజసత్వసామ్యముచే సుఖా స్వాదన కుపలక్షకము) పూర్వమునంద భేదనిర్దేశము పృథక్ప్రత్యయకరణముకొఱకే యని గ్రహింపనగును. ఇట్లు లయకషాయములతోటి, విక్షేపసుఖాస్వాదనములతోటిశూన్యమై నివాతప్రదీపమువలె చలనరహితమై (లయాభి ముఖ్యరహితమై) నివాతప్రదీపసమానమై అవాభాసమై అనగా యేవిషయాకారముచే నాభాస్యము కానట్టిదై, బ్రహ్మమును పొందినదై యగుచున్నది. కషాయసుఖాస్వాదములకుభయాంతరాభావముయుక్తమే. ఎపుడట్టిదోషచతు ష్టయరహితము చిత్తమగునో అపుడే యాచిత్తము బ్రహ్మమును పొందిన దగును. ॥౬॥

ఇట్టి యోగమునే "యదా పంచావతిష్ఠన్తే జ్ఞానాని మనసా సహ । బుద్ధిశ్చ న విచేష్టేత తా మాహుః పరమాం గతిమ్॥ తాం యోగ మితి మన్యన్తే స్థిరా మిన్ద్రియధారణామ్। అప్రమత్త స్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ" అను శ్రుతియు బోధించుచున్నది. ఈశ్రుతిమూలకమే "యోగ శ్చిత్తవృత్తినిరోధః" అను సూత్రము. కనుకనే "తత స్తతో నియమ్యైత దాత్మన్యేవ వశం నయేత్" అనునదియు యుక్తమే. ॥౨౬॥

శంకరానందీయము:— విషయవాసనలచేతను, రాగాదులచేతను మనస్సు విషయప్రవృత్త్యేకస్వభావము కలదగుటవలన విషయలంపటమైన మనస్సునకాత్మయందు సంస్థితి సంభవింపదు. "స్వభావో దురతిక్రమః" అను న్యాయముచే స్వభావముకలన ప్రాప్తమైన ప్రవృత్తియొక్క నిరోధము సిద్ధింపదు. వృత్తినిరోధము సిద్ధింపనిచో యాత్మయందు సంస్థితి యెట్టుల యని శంకింపజనదు. విషయములయందు సత్యత్వసమీచీనత్వేష్టసాధనత్వబుద్ధ్యైకబలమువలన మనస్సునకు ప్రవృత్తి కలుగును. సత్యత్వసమీచీనత్వేష్టసాధనత్వబుద్ధికి హేతువులు రాగాదులు "వికల్పో న హి వస్తు। మాయామాత్రమిదం ద్వైతం। త్రయ మేతత్సుషుప్తం స్వప్నం మాయామాత్రం" ఇత్యాదిశ్రుతులచేతను శుక్తిరజితమువలె యీ సర్వప్రపంచము కల్పితము గాన మిథ్యయను యుక్తులచేతను విషయములకు మిథ్యాత్వము సిద్ధింప విషయములయందు సత్యత్వసమీచీనత్వేష్టసాధనత్వబుద్ధులు, రాగాదులు నశించును. అట్టివి నశింప మనస్సునకు ప్రవృత్తి నశించును. ఒకానొక స్థలమున పూర్వసంస్కారముచే మనస్సునకు ప్రవృత్తి జనించినచో విషయమిథ్యాత్వబుద్ధిచే యా ప్రవృత్తిని మరలించి స్వరూపమునందే మనస్సును స్థాపింపవలయు నని "యతో యతః" అను వాక్యముచే చెప్పుచుండెను.

వాసనావేగమువలన చపలము, రాగాదిదోషగ్రస్తమగుటవలన నవ్యవస్థము నగు మనస్సు స్వవిషయమగు యాత్మ నాదరణ చేసి వాసనచేతనుకాని, రాగాదకముచేకాని, హఠాత్తుగాకాని, జ్ఞాతము యజ్ఞాతముయైయే యే విషయము నుద్దేశించి బయలువెడలునో ఆయావిషయమునుండి నియమనము చేసి యాయా విషయములయందు మిథ్యాత్వమును, దుఃఖప్రదత్వమును, బంధకత్వమును, ఆత్మవ్యతిరేకముగ నసత్త్వమును యుద్ఘాటన చేసి (ప్రకటించి) వైరస్యమును పొందించిరేని యీ మనస్సును తిరిగి యాకర్షించి చిదాభాసమును పొందించి యాత్మయందు నిత్యత్వచిద్రూపత్వాఖండానందైకరసస్వరూపత్వాదిగుణప్రకాశనద్వారా రుచిని సంపాదించి నియమముగ నాత్మసంస్థముగ చేయవలెను. ॥౨౬॥

పరమార్థప్రపః— ఇంతమాత్రముచేగూడ రజోగుణప్రచురమైన మనస్సు యాత్మప్రవణము కానిచో ప్రత్యాహారముచే స్వాధీన మొనరించుకొనవలయునని "యతో యతః" అను శ్లోకముచే చెప్పుచుండెను. స్వభావముచేచపలము, జలనిక్షిప్తమైనతుంబిక (ఆనపకాయబుర్ర)వలె ఒలాత్కారముగ ధరించుచున్నను యస్థిరమగు మనస్సుయే యే విషయమునుగూర్చి బయలువెడలునో ఆయా విషయమునుండినియమనముచేసి (ప్రత్యాహారముచేసి) ఆత్మయందే వశమును పొందింపవలయును. ఈ విషయము "హస్తం హస్తేన సంపీడ్య దన్తైర్దన్తాన్విచూర్ణ్య చ। అంగాన్యంగైః సమాక్రమ్య జయేదాదౌ స్వకం మనః॥ చిత్త మేకం న శక్నోతి జేతుం స్వాతన్త్ర్యవర్జితమ్। ధ్యానవార్తాం వద న్మూఢ స్స కిం లోకే న లజ్జతే॥ మనస్సు స్వాధీనమున లేనితరి ఒక హస్తమును మరియొక హస్తముచే నలిపి (పీడించి) దంతములచే దంతములను పటపటకొఱకి, (చూర్ణముగనొనరించి) శరీరావయవములచే నవయవముల నాకర్షించి మొట్టమొదట తన మనస్సును జయింపవలెను. స్వాతంత్ర్యము లేని యొక చిత్తమునే జయించుటకు సమర్థుడు కాడు. అట్టి మూఢుడు ధ్యాన మనగ యిటువంటిది. దాని నభ్యసింపవలయు నని పలుకుచు లోకమున యెందుకు లజ్జ పొందడు? అని వాసిష్ఠమున చెప్పబడెను.

ఈ విషయమే "విషయేభ్య స్సమాహృత్య విజ్ఞాతాత్మా మనో మునిః। చిన్తయే న్ముక్తయే తేన బ్రహ్మభూతం పరేశ్వరమ్" ఆత్మభావం నయత్యేనం తద్బ్రహ్మధ్యాయినం మునే। వికార్య మాత్మన శ్శక్త్యా లోహ మాకర్షకో యథా" తెలియబడిన యాత్మకల యోగి మనస్సును విషయములనుండి యాకర్షించి అట్టి మనస్సుచే ముక్తికొఱకు బ్రహ్మస్వరూపమగు పరమేశ్వరుని చింతింపవలయును. వికార్యమగు లోహమును యాత్మశక్తిచే అకర్షకు డెట్లు స్వాధీన మొనరించుకొనునో అట్లే యామనస్సు బ్రహ్మమును ధ్యానించువానిని యాత్మభావమును పొందించును. అని విష్ణుపురాణమునందు చెప్పబడెను. ॥౨౬॥

గీ॥ ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమం।
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూత మకల్మషమ్ ॥ ॥౨౭॥

పదవిభాగము:— ప్రశాంతమనసం- హి-ఏనం- యోగినం- సుఖం-ఉత్తమం- ఉపైతి-శాంతరజసం-బ్రహ్మభూతం- అకల్మషం- ॥౨౭॥

ప్రతిపదార్థము:— ప్రశాంతమనసం=అత్యంతము ఆత్మయందే లీనమైన మనస్సు కలిగినట్టియు; శాంతరజసం=శాంతించిన మోహాదిక్లేశములు కలిగినట్టియు; బ్రహ్మభూతం= జీవన్ముక్తుడైనట్టియు; అకల్మషం=ధర్మాధర్మవివర్జితుడైన; ఏనం=ఈ; యోగినం=యోగిని: ఉత్తమం సుఖం=నిరతిశయసుఖము; స్వయం=స్వయముగనే; ఉపైతి=పొందుచున్నది- ॥౨౭॥

శాంకరభాష్యమ్:—

ప్రశాంతమనసం ప్రశాంతం మనో యస్య స ప్రశాంతమనా స్తం ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖ ముత్తమం నిరతిశయ ముపైత్యుపగచ్ఛతి। శాంతరజసం ప్రక్షీణమోహాదిక్లేశరజస మిత్యర్థః। బ్రహ్మభూతం జీవన్ముక్తం బ్రహ్మైవ సర్వ మిత్యేవం నిశ్చయవంతం బ్రహ్మభూత మకల్మష మధర్మాదివర్జితమ్ ॥ ॥౨౭॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

లెస్సగ శాంతించిన మనస్సుకలిగినట్టియు, కనుకనే నశించిన మోహాదిక్లేశములుకలిగినట్టియు, కనుకనే-"ఈసర్వము బ్రహ్మస్వరూపమే" అను నిశ్చయముకలిగినట్టియు, కనుకనే జీవన్ముక్తుడైనట్టియు, కనుకనే ధర్మాధర్మవివర్జితుడు నగు యీయోగిని ఆత్మానందరూపమగు నిరతిశయసుఖము స్వయముగనే పొందును. ॥౨౭॥

—: ౬వ అధ్యాయము ౨౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— యోగియొక్క మనస్సు యిట్లు యోగాభ్యాసబలమువలన నాత్మయందే శాంతిని పొందును. అనంతరము నిర్వృత్తికముగ నిరుద్ధమైన సంస్కారమాత్రావశిష్టమైన మనస్సు కలిగినట్టిన్ని అనగా వృత్తిశూన్యమగుటచే నిర్మనస్కుడైనట్టిన్ని, "శాంతరజసం, అకల్మషం" అను విశేషణద్వయము నిర్మనస్కత్వమునందు హేతుగర్భితము. అనగా శాన్తరజస్కుడు, అకల్మషుడై కనుకనే యమనస్కుడని భావము. విక్షేపకమైన రజోగుణశూన్యుడు అనగా విక్షేపశూన్యుడై, అట్లే లయహేతువగు తమోగుణశూన్యుడు. ఇచట శ్రీధరస్వామి "శాన్తరజసం" అను పదము ఉపలక్షణము. కాన నట్టి పదముచేతనే తమోగుణశూన్యుడని యర్థము లభించుచుండ "అకల్మషం" అను పదమునకు సంసారహేతువగు ధర్మాధర్మాదులచే వర్జితుడు అని వ్యాఖ్యానించిరి. సర్వము బ్రహ్మమే యను నిశ్చయముచే బ్రహ్మమును పొందినవాడై జీవన్ముక్తుడై నిరతిశయసుఖమును పొందుచున్నాడు. మనసు, తద్వృత్తి లేనందున సుషుప్తియందు స్వరూపసుఖావిర్భావమును "హి" అనునది ద్యోతన చేయుచున్నది. అట్లే "సుఖ మాత్యంతికం" అనుచోట వ్యాఖ్యానింపబడెను.

శంకరానందీయము:— మాటిమాటికి విషయగతదోషోద్ఘాటనపురస్సరముగ విషయములనుండి మనస్సును యాకర్షించి యాత్మయందే నిలిపి యత్యన్తశ్రద్ధచే చిరకాలము నిత్యనిరంతరము చిత్ప్రత్యయావృత్తినే చేయు యతికి విషయవాసనలు, విషయప్రత్యయములు, నిశ్శేషముగ నశించిపోయియుండ యెపుడు బ్రహ్మమునందు మనస్సు ప్రశాంతిని పొందునో యపుడు బ్రాహ్మ్యము, అనుత్తమము (శ్రేష్ఠము) అగు సుఖ మావిర్భవించును. అని. "ప్రశాన్తమనసం" అను శ్లోకముచే చెప్పుచుండెను.

గీ॥ యుంజ న్నేవం సదాఽఽత్మానం యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శ మత్యంతం సుఖ మశ్నుతే ॥ ॥౨౮॥

పదవిభాగము:— యుంజన్ - ఏవం - సదా - ఆత్మానం - యోగీ - విగతకల్మషః - సుఖేన - బ్రహ్మసంస్పర్శం - అత్యంతం - సుఖం - అశ్నుతే. ॥౨౮॥

ప్రతిపదార్థము:— యోగీ=యోగాభ్యాసకుడు; ఏవం=పైవిధముగ; ఆత్మానం=పరమాత్మను; యుంజన్=సమాధిచేకలుసుకొన్నవాడై; విగతకల్మషః=విగత=పోయిన; కల్మషః=పుణ్యపాపములు కలవాడై; సుఖేన=అనాయాసముగ; బ్రహ్మసంస్పర్శం=బ్రహ్మతోనైన తాదాత్మ్యముకల; అత్యంతం=నిరతిశయరూపమైన=సుఖం=సుఖమును; అశ్నుతే=పొందుచున్నాడు. ॥౨౮॥

"ప్రశాంతరజసం" అనుచోట నుండు రజశ్శబ్దము తమోగుణమున కుపలక్షణము. (ఉపలక్షణమనగ చెప్పదగినదానియందేకదేశమునే చెప్పుట. అనగా రజశ్శబ్దముచేతనే రజోగుణము, తమోగుణముకూడ చెప్పబడుననుట) నశించిన రజోగుణము, తమోగుణకార్యములగు కామక్రోధలోభమోహాహంకారమమకారాదులతోగూడ నశించిన తమోగుణము కలిగినట్టిన్ని. అనగా కేవలశుద్ధసత్త్వభావము కలిగినట్టిన్ని, కనుకనే "అకల్మషం" సత్త్వమిశ్రీభూత భౌతిక రాజస తామసభేదవాసనలు లేనట్టి చిత్తముకలవాడై, కనుకనే "ప్రశాన్తమనసం" విక్షేప విపరీత భావములకు కారణమగునట్టి, కార్యసహితమైన రజస్తమోగుణములు నిశ్శేషముగ నశించుటవలన వృత్తిశూన్యమగుటచే విషయాకారమును పొందని మనస్సుకలవాడై, కనుకనే "బ్రహ్మభూతం" అనెడి యుపాధికృతపరిచ్ఛిత్తిని పరిత్యజించి పూర్ణాత్మగ నుండిన యీ బ్రహ్మవేత్తను - దేనికంటె యుత్తమము లేదోయది యన్నుత్తమమనబడును. అట్టియు నిత్యము, సాధనాపేక్ష లేనట్టియు, అయత్నసిద్ధము, అక్షయ్యము, ఆత్మభూతము అద్వైతైకవేద్యము నగు బ్రాహ్మ్యసుఖము నపుడు పొందుచున్నాడు. సుషుప్తియందు సాధన నిరపేక్షాపారసుఖావిర్భావము సర్వప్రత్యక్షమే "ఏషోఽస్యపరమానందః" అనుశ్రుతి ప్రసిద్ధము అని ప్రసిద్ధిద్యోతనార్థము "హి" అను శబ్దము ప్రయోగించబడెను. ॥౨౭॥

నీలకంఠీయము:— ఇట్లారునస్సు ఆత్మవశమైయుండ నేమిఫలము ప్రాప్తించుననుశంకను "ప్రశాంతమనసం" అను శ్లోకముచే తొలిగించుచుండెను. ప్రకర్షగ నుపరతమగు మనస్సుకల యోగిని యేకాగ్రతాభూమియందు సంప్రజ్ఞాతసమాధిఫలభూతమగు నుత్తమసుఖము పొందును. (అనగా నట్టియోగి సంప్రజ్ఞాతసమాధి ఫలమగు నుత్తమసుఖమును పొందునని యాశయము.) అట్టి యోగి భౌతికము, బాహ్యము, కోరబడెడి విషయము లను, అంతరంగికమగు సుఖాదివిషయములను పరిత్యజించుటవలన శాంతరజస్కుడు. మఱియు నశించిన మోహాది సర్వక్లేశములు కలవాడు కాన బ్రహ్మభూతమగు సద్వస్తుస్వరూపము. ధర్మాధర్మాదివర్జితుండు నగును ఈవిషయమే యోగభాష్యమునందు "య స్త్వేకాగ్రే చేతసి సద్భూత మర్థం ప్రద్యోతయతి కర్మబంధనాని శ్లథయతి నిరోధమభిముఖీకరోతి క్షిణోతి చ క్లేశా న్స సంప్రజ్ఞాతో యోగ ఇత్యాఖ్యాయతే" ఎవండు చిత్తము నేకాగ్రతను పొందించి యాత్మరూపమును ప్రకాశింపజేయునో అట్టివాడు కర్మలనెడి బంధనములను త్రెంచి యాత్మ నభిముఖముగ జేసుకొనును. సర్వక్లేశములను నశింపంజేసుకొనును. అదియే సంప్రజ్ఞాతయోగమనంబడునని చెప్పంబడెను. ఈచెప్పుటచే "ఆత్మ సంస్థం మనః కృత్వా" అను వాక్యము వ్యాఖ్యానింపంబడెను. ॥౨౭॥

—:౬వ. అధ్యాయము —౨౮వ. శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— చెప్పబడిన సుఖమును యోగికి "యుంజన్నేవం" అను శ్లోకముచే స్పష్టపరచుచుండెను.

"మనస్సైవేన్ద్రియగ్రామం" ఇత్యాద్యుక్తక్రమముచే మనస్సును యెల్లపుడు సమయుక్తముగజేయు యోగి (యోగముతో నిత్యసంబంధముకలవాడు) సంసారహేతువగు ధర్మాధర్మవిరహితుడై యనాయాసపూర్వక

శాంకరభాష్యమ్—

యుంజన్నితి । యుంజన్నేవం యథోక్తేన క్రమేణ యోగీ యోగాంతరాయవర్జిత స్సదాఽఽత్మానం విగతకల్మషో విగతపాప స్సుఖేనానాయాసేన బ్రహ్మసంస్పర్శం బ్రహ్మణా పరేణ సంస్పర్శో యస్య తద్బ్రహ్మసంస్పర్శం సుఖ మత్యంత మంత మతీత్య వర్తత ఇత్యత్యంత ముత్కృష్టం నిరతిశయ మశ్నుతే వ్యాప్నోతి ॥౨౮॥

శాంకరభాష్యార్థతత్త్వబోధిని—

పైన జెప్పిన విధముగ యోగాభ్యాసకుడు యోగాంతరాయవర్జితుడై యెల్లపుడు ఆత్మానుసంధానము చేయువాడై, ధర్మాధర్మవివర్జితుడై, బ్రహ్మతాదాత్మ్యము (బ్రహ్మైకరస్యము) కల విషయాసంస్పృష్టమగు నిరతిశయసుఖమును పొందుచున్నాడు. ॥౨౮॥

ము:గ ఈశ్వరప్రణిధానమువలన నిఖిలవిఘ్ననివృత్తిచే "బ్రహ్మసంస్పర్శం" విషయసంస్పర్శ లేని బ్రహ్మస్వరూపమును నిరతిశయసుఖరూపానందమును నిర్వృత్తికచిత్తముచే చలవిక్షేపవిలక్షణమగు యానందమును యనుభవించుచున్నాడు. విక్షేపమునందు వృత్తియుండుటవలన లయమునందు మనస్సు స్వరూపముచే నుండకపోవుటవలన సర్వవృత్తిశూన్యమైన సూక్ష్మమగు మనస్సుచే సమాధియందే సుఖానుభవము ప్రాప్తించును.

ఈశ్లోకమున "సుఖేన" అనుపదమున కనాయాసముగ అని వ్యాఖ్యానించుటచే అంతరాయనివృత్తి చెప్పబడెను. ఆఅంతరాయములు యీక్రిందియోగసూత్రముచే చెప్పబడెను.

"వ్యాధి స్త్యాన సంశయ ప్రమా దాల స్యావిరతి భ్రాన్తి దర్శ నాలబ్ధభూమిక త్వానవ స్థితత్వాని చిత్తవిక్షేపా స్తేఽన్తరాయాః"

వ్యాధి, స్త్యానము, సంశయము, ప్రమాదము, ఆలస్యము, అవిరతి, భ్రాన్తిదర్శనము, అలబ్ధభూమికత్వము, అనవస్థితత్వము అనెడి తొమ్మిదియు చిత్తవిక్షేపకరములగు అంతరాయములు యోగవిరోధులు. అందు సంశయము, భ్రాన్తిదర్శనము అను రెండును్న వృత్తిరూపముగుటవలన వృత్తినిరోధరూపయోగమునకు సాక్షాత్తు విరోధులు. వ్యాధ్యాధులు యేడును్న వృత్తిసహచరితములగుటచే యోగవిరోధులు. వ్యాధి యనగ ధాతువైషమ్యము కారణముగాగల జ్వరాదులు. స్త్యానమనగ అకర్మణ్యత్వము. అనగా గురువుచేత శిక్షింపబడుచున్నను అసనాదికర్మానర్హత్వము. సంశయమనగ=యోగము సాధనీయమా? అసాధనీయమా? అను సాధనీయత్వ. అసాధనీయత్వ రూపకోటిద్వయవిషయకవిజ్ఞానము. ఏకధర్మ(కోటి) ప్రతిష్ఠ కానిదగుటచే విపర్యయాంతర్గతమైనను విపర్యయ మేకకోటిస్పర్శియగుటవలన సంశయ ముభయకోటిస్పర్శియగుటవలనను యిట్టి యవాంతరవిశేషవివక్షచే విపర్యయమునకంటె వేరుగ జెప్పబడెను. ప్రమాద మనగ— సమాధిసాధనానుష్ఠానసామర్థ్య మున్నను వాని ననుష్ఠింపకపోవు స్వభావము. అనగా విషయాంతరములయందు వ్యాపృతు డగుటచే యోగసాధనములయం దౌదాసీన్యము. ఆలస్యమనగ ఔదాసీన్యప్రచ్యుతి యున్నను కఫాదులచేతను, తమస్సుచేతను శరీరచిత్తములకు గురుత్వము. అట్టి యాలస్యము వ్యాధి యని ప్రసిద్ధము కాకున్నను యోగవిషయమునందు ప్రవృత్తివిరోధి యగును. అవిరతి యనగ =విషయవిశేషమునందు చిత్తమునకు ఐకాంతికమయిన యభిలాష. భ్రాంతిదర్శన మనగ= యోగాసాధనమునందు యోగసాధనత్వబుద్ధి. అట్లే యోగసాధనమం దసాధనత్వబుద్ధియు భ్రాంతిదర్శనము లనంబడును. అలబ్ధభూమికత్వ మనగ= సమాధిభూమికయొక్కయు, ఏకాగ్రతయొక్కయు యలాభము. క్షిప్తమూఢవిక్షిప్తరూపత్వ మనిశ్చితము. అనవస్థితత్వమనగ =సమాధిభూమిక పొందబడినను ప్రయత్నశైథిల్యమువలన నచట చిత్తము ప్రతిష్ఠితము కాకపోవుట. ఈతొమ్మిదియు చిత్తవిక్షేపకరములు, యోగమలములు, యోగవిరోధులు యోగాంతరాయములని యనబడును.

"దుఃఖదౌర్మన స్యాంగమేజయత్వశ్వాసప్రశ్వాసావిక్షేపసహభువః" దుఃఖము, దౌర్మనస్యము, అంగమేజయత్వము, శ్వాస, ప్రశ్వాస యీ అయిదును్న విక్షిప్తచిత్తునకు కలుగును. దుఃఖమనగ— చిత్తముయొక్క—

బాధనాలక్షణముకల రాజసపరిణామము. అది ఆధ్యాత్మికమని, అధిభౌతికమని, అధిదైవికమని మూడువిధములు. ఆధ్యాత్మికము శారీరమని, మానసికమని రెండువిధములు. అందు శారీరము వ్యాధ్యాదులవలనను, మానసము కామాదులవలనను సంభవించును అధిభౌతికమనగ వ్యాఘ్రాదిజనితము. అధిదైవికమనగ గ్రహపీడాదిజనితము. ఇట్టిదుఃఖములు ద్వేష మనెడి విపర్యయహేతువులగుటవలన సమాధివిరోధులు. దౌర్మనస్యమనగ– ఇచ్ఛావిఘాతాదిబలవద్దుఃఖానుభవజనితమైన చిత్తముయొక్క తామసపరిణామవిశేషము. దీనికే క్షోభము అని, స్తబ్ధీభావమని పేరు. ఇది కషాయస్వరూపమగుటవలన భయమువలె సమాధికి విరోధి యగుచున్నది. అంగమేజయత్వమనగ–అంగచలనము. ఇది ఆసనస్థైర్యవిరోధి యగును. ప్రాణముచే బాహ్యవాయువునకు శరీరములోపల ప్రవేశనమే శ్వాస యనబడును. ఈశ్వాస సమాధ్యంగమగు రేచకమునకు విరోధి ప్రశ్వాసయనగ–ప్రాణముచే లోనయున్న వాయువునకు బహిర్నిస్సరణము. ఇట్టిప్రశ్వాససమాధ్యంగమగు పూరకమునకు విరోధి. సమాహితచిత్తముకలవాని కివి సంభవింపవు. విక్షిప్తచిత్తునకే సంభవించును. కాన విక్షేపసహభువములని చెప్పబడుచున్నవి. ఈయంతరాయములు అభ్యాసవైరాగ్యములచే నిరోధింపదగినవి. ఈశ్వరప్రణిధానముచే గాని నిరోధింపవలయును. తీవ్రవేగముకలవారలకు ప్రస్తుతసమాధిలాభ మాసన్నమైయుండ "ఈశ్వరప్రణిధానాద్వా" అని చెప్పి ప్రణిధేయమగు నీశ్వరుని "క్లేశకర్మవిపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః" క్లేశకర్మవిపాకాశయములచే స్పృశింపబడని పురుషవిశేషమే యీశ్వరుడు. "తత్ర నిరతిశయం సర్వజ్ఞబీజం" ఆతనియందు నిరతిశయసర్వజ్ఞబీజము కలదు. "స పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాద్" ఆతడుకాలపరిచ్ఛిన్నుడు కానందున యందరికి గురువు. అని మూడుసూత్రములచే చెప్పి తత్ప్రణిధానము "తస్య వాచకః ప్రణవః" ఆతనిని చెప్పునది ప్రణవము. "తజ్జప స్తదర్థభావనమ్" ప్రణవజపము, తదర్థభావనము ప్రణిధానమని రెండుసూత్రములచేతను చెప్పెను. "తతః ప్రత్యక్చేతనాధిగమోఽప్యన్తరాయాభావశ్చ" ప్రణవజపమువలన, ప్రణవార్థధ్యానమువలనను ఈశ్వరప్రణిధానము, దానివలన ప్రత్యక్చేతను డగుపురుషునియొక్క ప్రకృతివివేక పురస్సరముగ నధిగమము (నిశ్చయము) అనగా సాక్షాత్కారము సంభవించును. చెప్పబడిన యంతరాయములు సంభవింపవు. అభ్యాసవైరాగ్యాభ్యాసములచే యంతరాయములు నివర్తింపచేయవలసియుండ యభ్యాసదార్ఢ్యమునిమిత్తము చెప్పుచుండెను. "తత్ప్రతిషేధార్థ మేకతత్త్వాభ్యాసః" అట్టి యంతరాయములను తొలగించుటనిమిత్తము తన కభిమతమగు నేదోయొక తత్త్వమునందు చిత్తమును మాటిమాటికి నిలుపుట నాచరింపవలెను. అట్లే "మైత్రీకరుణాముదితోపేక్షాణాం సుఖదుఃఖపుణ్యాపుణ్య విషయాణాం భావనాత శ్చిత్తప్రసాదనమ్" మైత్రీ=సౌహార్ద్రము; కరుణా=కృపా; ముదితా=హర్షము; ఉపేక్షా=ఔదాసీన్యము; సుఖాదిశబ్దములచే సుఖాదులు కలవారు చెప్పబడును. సర్వప్రాణులు సుఖసంభోగాపన్నులైయుండ నామిత్రులు సుఖముకలవారు. ఇది బాగున్నది అని మైత్రిని తలవవలయును. ఈర్ష్యనుమాత్రము తలవరాదు. సర్వప్రాణులు దుఃఖితులైయుండ యెట్లు వీరలకు దుఃఖనివృత్తి యగును. అని కృపనే భావనచేయవలెను: ఉపేక్షనుకాని ఈర్ష్యనుకాని తలవరాదు. పుణ్యవంతులవిషయమే పుణ్యానుమోదముచే హర్షమును చేయవలెను, ద్వేషమును చేయరాదు. ఉపేక్షను చేయరాదు. అపుణ్యవంతులవిషయమై ఔదాసీన్యమునే భావింపవలయును. అనుమోదమును కాని, ద్వేషమును కాని, భావింపరాదు. ఇట్లు భావింపువానికి శుద్ధధర్మము జనించును. దానివలన రాగద్వేషములు తొలగి చిత్తము ప్రసన్నమైనదై యేకాగ్రతాయోగ్యమగును. మైత్ర్యాదిచతుష్టయము. అభయసత్త్వ సంశుద్ధ్యాదులకు, అమానిత్వాదంభిత్వాదుల కుపలక్షణము. అనగా వీటినికూడ గ్రహింపనగుననుట. ఈ ధర్మములన్నియు శుభవాసనారూపములు కాన మలినవాసనానివర్తకము లగుటవలన వీటినన్నిటిని గ్రహింపనగును. రాగద్వేషములు రెండునూ మహాశత్రువులు, సర్వపురుషార్థ ప్రతిబంధకములు; గొప్ప ప్రయత్నముచే పరిహరింపదగినవని యీ సూత్రార్థము. ఇట్టే యితరమగు ప్రాణాయామాదులు చిత్తప్రసాదనమునకు ఉపాయములుగ యోగశాస్త్రమున ప్రదర్శింపబడెను. ఇట్టి చిత్తప్రసాదము భగవదనుగ్రహముచే నెవనికి జనించునో అట్టివానినిగూర్చియే యీ "సుఖేన" అను భగవద్వచనము. మరియొకతీరున మనఃప్రశమనమే సంభవింపదు. ॥౨౮॥

సర్వభూతస్థ మాత్మానం సర్వభూతాని చాత్మని।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥ ॥౨౯॥

పదవిభాగము:— సర్వభూతస్థం–ఆత్మానం–సర్వభూతాని–చ–ఆత్మని–ఈక్షతే–యోగయుక్తాత్మా–సర్వత్ర–సమదర్శనః ॥౨౯॥

ప్రతిపదార్థము:— యోగయుక్తాత్మా = సమాహితాంతఃకరణము కలవాడై; సర్వత్ర= బ్రహ్మాదిస్థావరాంతవిషయములయందును, సర్వభూతములయందును; సమదర్శనః=నిర్విశేషబ్రహ్మైకత్వజ్ఞానము కలవాడై; యోగీ=(ఈపదమధ్యాహార్యము)యోగి; ఆత్మానం=తనను; సర్వభూతస్థం=సర్వభూతములయందున్న వానిగను; సర్వభూతాని=సర్వభూతములను; ఆత్మని=తనయందు; స్థితాని=(ఈపదమధ్యాహార్యము) ఉన్నవాటినిగను; ఈక్షతే= చూచుచున్నాడు. ॥౨౯॥

---

శంకరానందీయము:— ముముక్షు వశ్యము ముక్తిసుఖలాభముకొఱకు యోగము నభ్యసింపవలయును. అని సూచించుటకు యోగమునను ష్ఠించిరయే యోగి కృతార్థుడగును. యెల్లపుడు బ్రాహ్మ్యము, అక్షయ్యము నగు సుఖమునే పొందును. దుఃఖలేశముసైన పొందడని చెప్పబడిన యోగజమగు యోగియొక్క సుఖలాభమునే "యుంజన్" అను శ్లోకముచే ప్రశంసించుచుండెను.

"దృశ్యం సర్వం మిథ్యైవ" అని దృశ్యమిథ్యాత్వమును దృఢముగ నిశ్చయించి, అంతట కామసంకల్పపరిత్యాగపూర్వకముగ సర్వేంద్రియములను నిగ్రహించి, బహిరంగాంతరంగసాధనసంపన్నుడై, సమాధినిష్ఠయందు ప్రవృత్తుడైన యతి యథాశాస్త్రముగ చెప్పబడిన లక్షణములు కలిగినట్టి, చిదానందైకరసము, పరిపూర్ణము, అద్వితీయము నగు పరబ్రహ్మమును యనుసంధానమొనరించు వాడై "ఈసర్వము, నేను బ్రహ్మాహం" అను యఖండవృత్తిచే సర్వమును బ్రహ్మముగనే చూచువాడై, నిశ్శేషముగ వినష్టమైన కల్మషము కలవాడై అనగా వాసనాకృతభేదదర్శనము లేనివాడై అప్రయత్నసిద్ధము, సాధననిరపేక్షము, అకృత్రిమము నగు బ్రహ్మసంస్పర్శము అనగా బ్రహ్మస్వరూపముచే తెలియబడునది బ్రహ్మసంస్పర్శ మనబడును. బ్రహ్మభిన్నమగు చిదేకరసమును అనుభవించుచున్నాడు. లేక—"సంస్పృశ్యన్తే గృహ్యన్తే అనేనేతి సంస్పర్శః" స్వరూపమగు బ్రహ్మము దేనిచేయది బ్రహ్మసంస్పర్శమనబడును. బ్రహ్మాత్మకము. కనుకనే పరిణామము నతిక్రమించియుండునది. అపారము, అక్షయము, నిత్యము, శాశ్వతము. నగు బ్రాహ్మ్యసుఖము ననుభవించుచున్నాడు. జీవించియుండగనే ముక్తుడై ముక్తిసుఖము ననుభవించుచున్నాడు. ॥౨౮॥

నీలకంఠీయము:— యోగఫలమును "యుంజన్" అను శ్లోకముచే చెప్పుచుండెను. ఈచెప్పిన విధమున యోగి మనస్సును సమపూర్వవాక్యములో తొలగింపబడిన నవిద్యాప్రయుక్తక్లేశములు కలవాడై (అవిద్యవలన కలిగెడి సర్వక్లేశములు లేనివాడై) యనాయాసముగ సూక్ష్మసూక్ష్మకారణరూపమగు త్రివిధోపాధుల లయమువలన బ్రహ్మముతోగూడ నైక్యరూపమగు నిర్విశేషత్వమును పొందుచున్నాడు. విట్టి బ్రహ్మసంస్పర్శమును పొందుచున్నాడు? ద్రష్టృదృశ్యభావముచే సంభవించెడి యేపరిచ్ఛేదము కలదోదాని నతిక్రమించినది. అనగా ద్రష్టృదృశ్యభావరహితమని యర్థము. అట్టి నిర్విశేషమగు పరమానందైకరసస్వరూపమగు సుఖమును పొందుచున్నాడు. ఈచెప్పుటచే "న కించి దపి చింతయేత్" అను చతుర్థ పాదము వ్యాఖ్యానింపబడెను. ॥౨౮॥

——౬వ అధ్యాయము——౨౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు——

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు నిరోధసమాధిచే తత్పదలక్ష్యము, త్వంపదలక్ష్యము నగు శుద్ధచిద్రూపము సాక్షాత్కృతమైయుండ త్వంపదలక్ష్యము, తత్పదలక్ష్యముల యైక్యమువిషయము గాగల "తత్త్వమసి" అను వేదాంతవాక్యజన్య నిర్వికల్పకసాక్షాత్కారరూపమగు వృత్తి బ్రహ్మవిద్యయనే పేరుగలది జనించును.

శాంకరభాష్యమ్:—

ఇదానీం యోగస్య యత్ఫలం బ్రహ్మైకత్వదర్శనం సర్వసంసారవిచ్ఛేదకారణం తత్ప్ర దర్శ్యతే—సర్వభూతస్థం సర్వేషు భూతేషు స్థితం స్వమాత్మానం సర్వభూతాని చాఽఽత్మని బ్రహ్మాదీని స్తంబపర్యంతాని చ సర్వభూతాన్యాత్మన్యేకతాం గతానీక్షతే పశ్యతి యోగ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇపుడు సర్వసంసారనివృత్తికారణము, బ్రహ్మాత్మైక్యదర్శనరూపము, ఉత్కృష్టము నగు నిరతిశయఫలము యోగమునకు కలదని చెప్పుచున్నాడు.

యోగి- సమాహితాంతఃకరణముకలవాడై బ్రహ్మాదిస్థావరాంతము నగు విషయ

దానివలన నవిద్య, యవిద్యాకార్యముతోఁగూడ నివర్తింప ఆత్యంతిక బ్రహ్మసుఖము ననుభవించునని మూడు శ్లోకములచే చెప్పుచుండెను. అందు మొదటిదగు "సర్వభూతస్థం" అను శ్లోకముచే త్వంపదలక్ష్యోపస్థితిని చెప్పుచుండెను.

స్థావరజంగమాత్మక సర్వశరీరములయందు భోక్తగనుండిన, ఒకనాడునిత్యుడు, విభువు, ప్రత్యక్చేతనము, సాక్షి, పరమార్థసత్యము. ఒకడు, ఆనందఘనము నగునాత్మను అనృతజడపరిచ్ఛిన్నదుఃఖరూపములగు సాక్ష్యములకంటె వేరుగ చూచునో, (సాక్షాత్కరింప చేసుకొనునో) అట్టి యాత్మరూపమగు సాక్షియందు సాక్ష్యరూప మగు సర్వభూతములు- సాక్షిసాక్ష్యములకు సంబంధాంతరము సంభవింపనందున యాధ్యాసికసంబంధముచే భోగ్యములుగ కల్పితములు అనగా మిథ్యాభూతములు, పరిచ్ఛిన్నములు, జడములు, దుఃఖరూపములు అగు సర్వభూతములు సాక్షియొక్క- యవివేకముచే కల్పితములు అని తెలుసుకొనునో నిర్విచారవైశారద్యరూపమగు యోగముతో గూడినట్టి యంతఃకరణముకలిగినట్టివిన్ని ఈ విషయమే "నిర్విచారవైశారద్యేఽధ్యాత్మప్రసాదః" "ఋతంభరా తత్ర ప్రజ్ఞా" "శ్రుతానుమాన ప్రజ్ఞాభ్యామన్యవిషయా విశేషార్థత్వాత్" నిర్విచారవైశారద్యము ప్రాప్తించుచో చిత్తప్రసాదము ప్రాప్తించును. అట్టి చిత్తప్రసాదము ప్రాప్తించిన ఋతంభరాప్రజ్ఞ సంభవించును. యీ ఋతంభరాప్రజ్ఞ శ్రుతానుమానప్రజ్ఞలకంటె విశేషవిషయకముగాన నన్యవిషయము. కాన, శబ్దానుమానాగోచరమగు యథార్థవిశేషవస్తువు విషయముగా గల ఋతంభరయను పేరుగల యోగజప్రత్యక్షము చేతనే యొక్కమారుగ సూక్ష్మము, వ్యవహితము, విప్రకృష్టము నగు సర్వమును సమానముగనే చూచును. కాన "సర్వత్ర సమం దర్శనం యస్య" అను విగ్రహమునసరించి యంతట సమమగు దర్శనముకలవాడై యోగముతో గూడిన యంతఃకరణము కలవాడై ఆత్మను, అనాత్మను యథావస్థితముగ చూచును.

లేక, ఎవడు యోగయుక్తాత్మయో, ఎవడు సర్వత్ర సమదర్శియో వారిరువు రాత్మను చూచెదరు. కాన యోగియు, సమదర్శియు యిరువురు యాత్మేక్షణమునం దధికారులు. ఎట్లు చిత్తవృత్తినిరోధము సాక్షిసాక్షాత్కారహేతువో అట్లే జడవివేకముచే సర్వానుస్యూతచైతన్య పృథక్కరణముకూడ సాక్షిసాక్షాత్కారహేతువగును. అవశ్యము సాక్షి సాక్షాత్కారమునుగూర్చి యోగమే యపేక్షితము కాదు. కనుకనే వసిష్ఠ మహర్షి శ్రీరామునిగూర్చి యిట్లు చెప్పెను.

"ద్వౌ క్రమౌ చిత్తనాశస్య యోగో జ్ఞానం చ రాఘవ। యోగో వృత్తినిరోధో హి జ్ఞానం సమ్యగవేక్షణమ్॥ అసాధ్యః కస్యచిద్యోగః కస్యచిత్తత్త్వనిశ్చయః। ప్రకారౌ ద్వౌ తతో దేవో జగాద పరమశ్శివః" ఓ రామచంద్ర! సాక్షియొక్క సమీపమునుండి సాక్షి కుపాధియగు చిత్తముయొక్క పృథక్కరణమువలన చిత్తాదర్శనమున కుపాయ మొకటి యసంప్రజ్ఞాతసమాధి. సంప్రజ్ఞాతసమాధియం దాత్మాకారవృత్తిప్రవాహముతోగూడిన యంతఃకరణసత్త్వము సాక్షిచే యనుభవింపబడును. అసంప్రజ్ఞాతసమాధియన్నచో

శాంకరభాష్యమ్ :—

యుక్తాత్మా సమాహితాంతఃకరణ స్సర్వత్ర సమదర్శన స్సర్వేషు బ్రహ్మాదిస్థావరాంతేషు విషయేషు సర్వభూతేషు సమం నిర్విశేషం బ్రహ్మాత్మైకత్వవిశేషం దర్శనం జ్ఞానం యస్య స సర్వత్ర సమదర్శనః ॥ ॥౨౯॥

శాంకరభాష్యతత్త్వబోధినీ :—

ములయందును, సర్వభూతములయందును నిర్విశేషబ్రహ్మాత్మైకత్వదర్శియై, తనను (ఆత్మను) సర్వభూతములయం దున్నదానినిగను, సర్వభూతములను తనయందు (ఆత్మయందు) ఉన్నవాటినిగను చూచుచున్నాడు-. ॥౨౯॥

నిరుద్ధసర్వవృత్తికమై యంతఃకరణసత్త్వ ముపశాంతమగుటవలన ననుభవింపబడదు. ఇదియే సంప్రజ్ఞాతాసంప్రజ్ఞాతసమాధులకు గల విశేషము. సాక్షియందు కల్పితము. సాక్ష్యము, అనృతము కాన సాక్ష్యము లేదు. కేవల సాక్షియే పరమార్థసత్యము కలదు. అనునదియే విచారము. రెండవయుపాయము. ఆ రెంటిలో యోగమనెడి యుపాయమును ప్రపంచపరమార్థతావాదులగు హైరణ్యగర్భాదులు పొందిరి. వారలకు పరమార్థమగు చిత్తముయొక్క యదర్శనముచే సాక్షి దర్శనమునందు నిరోధముకంటె యతిరిక్తమగు యుపాయము సంభవింపనందున హైరణ్యగర్భాదులు ప్రథమోపాయమునే పొందిరి. శ్రీమచ్ఛంకరభగవత్పూజ్యపాదముతోపజీవులు, ఔపనిషదులు అగు ప్రపంచానృతత్వవాదులు రెండవయుపాయమునే పొందిరి. వారల కధిష్ఠానదార్ఢ్య మున్నచో యధిష్ఠానమునందు కల్పితము, బాధితము నగు చిత్తముయొక్కయు, చిత్తదృశ్యముయొక్కయు, యదర్శన మనాయాసముగనే యుపపన్నమగుననియు, కనుకనే భగవత్పూజ్యపాదులు యొచటను బ్రహ్మవేత్తలకు యోగాపేక్షను చెప్పియుండలేదు. కాన ఔపనిషదులగు పరమహంసలు శ్రోతమగు వేదాంతవిచారమునందే గురుసమీపమునకేగి బ్రహ్మసాక్షాత్కారముకొఱకె ప్రవర్తించుచుండిరి. విచారముచేతనే చిత్తదోషము నిరాకృతమగుటచే యోగమన్యథాసిద్ధము (వ్యర్థము) అని యోగమునందు ప్రవర్తించుట లేదు. ఇక యధికముగ జెప్పుట చాలును. ॥౨౯॥

శంకరానందీయము:— యోగమునకు ఫలము ప్రతిబద్ధముకాని ఆత్మైకత్వదర్శనము, ఆత్మానందానుభూతియు అనునవి రెండు. అందు క్రమము వివక్షచేయక రెంటికి ఆత్మానందానుభూతియే ఫలముగ చూపబడెను. ఇపుడు సర్వసంసారదుఃఖనిర్మూలన కారణమగు ఆత్మైకత్వదర్శనము “సర్వభూతస్థం” అను శ్లోకముచే చెప్పబడుచుండెను. పురుషుని పరమపురుషార్థముతో సమకూర్చునది యోగ మనబడును. బహుజన్మకృతపుణ్యపుంజపరిపాకముచేతను జనించిన ప్రత్యగ్దర్శనము, యేది యుండిన పురుషునకు మోక్షము సంభవించునో అట్టి సమ్యగ్దర్శనముచేతనే కూడికొనిన యంతఃకరణముకలవాడు బ్రహ్మాకారాకారితాంతఃకరణముకలవాడు కనుకనే “సమదర్శనః” సమభావాపన్నము. విశేషగ్రహణనిర్ముక్తము, చిరకాల యోగాభ్యాసవశమువలన నంతట సన్మాత్రగ్రహణశీలమయిన దర్శనముకల బ్రహ్మవిత్తముడు అధిష్ఠానాగ్రహణదోషముచే పృథక్సత్తకలవిగ ప్రతీయమానములైన యవ్యాకృతాదులు, బ్రహ్మాదిస్తంబ పర్యంతములవో అట్టి సర్వభూతములయందు బ్రహ్మాండమునందు సూర్యునివలె, గృహమునందు దీపమువలె, ఘటాదులయందాకాశమువలె అవికారస్వరూపముగనుండువాడు కాన సర్వభూతస్థుడు. అట్టి యాత్మను ఈ కార్యకరణసంఘాతమునందు దేహేంద్రియ ప్రాణమనోబుద్ధ్యాదులకు తద్ధర్మ తత్కార్యత దవస్థలకున్న సర్వప్రకాశకముగ అహమర్థముగ నిరభిమానముచే నేనుయుంటిని. అట్లే సర్వభూతములయందును భూత తదవస్థా తద్ధర్మ తత్కార్మాదులకు ప్రకాశకముగ, అహమర్థముగ నవికారస్వరూపముగ నేనే ఏకరూపమగు చైతన్యస్వరూపముచే యుంటున్నాను. అను అంతట తనకే యట్టి స్థితి యనుభవింపజేయు యనుభూతిచేతను తనస్థితిని యంతట నిశ్చయించి సర్వభూతములయందు ప్రత్యగ్రూప

ముచే నుండునట్టి యొక్కటియే యగు స్వరూపమగు నాత్మను చూచును. (లెస్సగ యనుభవించును.) ఇట్లు సర్వభూతములయందాత్మైకత్వమును తెలిసికొని బాహ్య నిర్వికల్పసమాధినిష్ఠచే నిష్పన్నమైన యధిష్ఠాన యాత్మభ్యా విజ్ఞానము యొక్క బలముచే పరిపూర్ణము, సచ్చిదానందైకరసము, నిర్వికల్పము, నిరాకారము, నిర్విశేషము నగు స్వస్వరూపమునందు అవ్యాకృతము మొదలు స్థూలాంతమగు కార్యములతోఁగూడిన సర్వభూతములను యాత్మమాత్రముగనే చూచును. ఎట్లధిష్ఠాన వివేకవిజ్ఞానముచే ఘటకరావాదులను మృణ్మాత్రములుగను, జలతరంగఫేనబుద్బుదాదులను మరుప్రదేశముగను, సర్పశిరఉరఃపుచ్ఛాదులను, రజ్జుమాత్రములుగను వివేకము కల పురుషుడు చూచునో అట్లే బ్రహ్మవేత్తయు యోగానుష్ఠానముచే జనించిన యప్రతిబద్ధాద్వైతాత్మవిజ్ఞాన బలముచే అధిష్ఠానాజ్ఞానమువలన కల్పితమైన సర్వభూతములను "అహమేవేదం సర్వం" అని సర్వము నాత్మ స్వరూపముగనే సాక్షాత్తు యనుభవించుచున్నాడు. ఆ భూతములకు తనకంటే వేఱుసత్తను చూడడు. ఇట్లాధారాధేయాభయస్వరూపముగ ప్రతీతము నిత్యశుద్ధబుద్ధ ముక్తస్వభావము, అద్వితీయము, నిష్కలము, నిష్క్రియము, శాంతము, అనంతము, అపారసుఖస్వరూపము, సర్వసంసారదుఃఖనిర్ముక్తము నగు నాత్మను చూచుచున్నాడు. కాన "ఈ దర్శనమే ముక్తికి పరమకారణము, అని సూచింపబడెను. యోగము కాని, సాంఖ్యము కాని, కర్మ కాని, స్తోత్రమంత్ర జపాదికము కాని, ముక్తికి పరమకారణములు కావు. ఈ విషయమునే "సర్వభూతేషు చాత్మానం సర్వభూతాని చాత్మని। సంపశ్యన్బ్రహ్మపరమం యాతి నాన్యేన హేతునా" అను శ్రుతియు బోధించుచున్నది. ఈ చెప్పుటచే సంసారసాగర నిమగ్నాత్మోద్ధరణనిమిత్తము విదేహకైవల్యార్థి యగు ముముక్షువు అవశ్యము సమాధి నాశ్రయింపవలెను. ॥౨౯॥

నీలకంఠీయము:— సంప్రజ్ఞాతసమాధియని, అసంప్రజ్ఞాతసమాధియని యోగము రెండువిధములు. అట్టి రెండువిధములగు యోగములకు "సర్వభూతస్థం" అను శ్లోకముచే ఫలమును చెప్పుచుండెను. "సోపాధిర్నిరుపాధిశ్చ ద్వేధా బ్రహ్మవిదుచ్యతే। సోపాధికస్స్యాత్సర్వాత్మా నిరుపాఖ్యోఽనుపాధికః" సోపాధియని (సంప్రజ్ఞాతమని) నిరుపాధియని (అసంప్రజ్ఞాతమనియు) రెండువిధములు. అట్టి రెండువిధములగు సమాధుల భేదముచే బ్రహ్మవేత్తలుగూడ రెండువిధములు. సంప్రజ్ఞాతసమాధినిష్ఠుఁడగు బ్రహ్మవేత్త సర్వాత్మ యగును. అసంప్రజ్ఞాతసమాధినిష్ఠుఁడగు బ్రహ్మవేత్త నిరుపాఖ్య శుద్ధబ్రహ్మస్వరూపుఁడు అని వార్త్తికమునందు చెప్పబడిన విధమున సంప్రజ్ఞాతసమాధియందు యోగి- సర్వాత్మస్వరూపము ననుభవించువాఁడై సర్వభూతములయందుపాదానస్వరూపముచే నిమిడియున్న యాత్మస్వరూపమును చూచును. అట్లే యసంప్రజ్ఞాత సమాధియందు యోగి యోగముచే సమాహితమైన యాత్మకలవాఁడై రజ్జువునందధ్యస్తమైన సర్పాదికము రజ్జువునం దేకత్వమును పొందినట్లు తెలిసికొనినవిధమున బ్రహ్మాదిస్తంబ పర్యంత నిఖిలభూతము లాత్మయం దధ్యస్తమై యాత్మయందే యేకత్వమును పొందినవానిగ దెలిసికొనును. ఇట్టి యోగి సమాధినుండి లేచిన యవస్థను "సర్వత్ర సమదర్శనః" అను వాక్యముచే చెప్పుచుండెను. బ్రహ్మాదిస్తంబపర్యంత భూతములయందు నిర్విశేషముగ బ్రహ్మాత్మైకత్వమును చూచునట్టివాఁడు. ఈ విషయమునే "యస్తు సర్వాణి భూతాన్యాత్మన్యేవానుపశ్యతి। సర్వభూతేషు చాత్మానం తతో న విగుజుప్సతే॥ సర్వస్యాత్మా భవతి॥ బ్రహ్మదాశా బ్రహ్మదాసా బ్రహ్మైవేమే కితవా ఉత। ఇదం సర్వం యదయమాత్మా" ఇత్యాది శ్రుతులు బోధించుచున్నవి.

— పూర్వపక్షము —

ఎవఁడు యోగము కలవాఁడో, లేక అంతటను బ్రహ్మాత్మైక్యమును చూచువాఁడో అట్టి వారిరువు రాత్మను తెలిసికొనెదరు కాన యోగియు, సమదర్శియు యాత్మను తెలిసికొనుటయం దధికారులు. ఇట్లు చిత్తవృత్తి నిరోధరూపమగు యోగ మాత్మసాక్షాత్కారహేతువో అట్లే జడప్రపంచవివేకపూర్వకముగ సర్వానుస్యూతచైతన్యపృథక్కరణము కూడ స్వతంత్రముగనే యాత్మసాక్షాత్కారహేతువు కాని యోగము నపేక్షింపదు. అని కొందరు చెప్పెదరు.

యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥ ॥౩౦॥

పదవిభాగము:— యః– మాం– పశ్యతి– సర్వత్ర– సర్వం– చ–మయి– పశ్యతి– తస్య–అహం–న– ప్రణశ్యామి– సః–చ–మే–న– ప్రణశ్యతి– ॥౩౦॥

ప్రతిపదార్థము:— యః=ఎవడు; సర్వత్ర=సర్వభూతములయందు; మాం=సర్వాత్మనగు నన్నును (వాసుదేవుని;) పశ్యతి=చూచుచున్నాడో; సర్వంచ=బ్రహ్మాదిసర్వభూతజాలము; మయి=సర్వాత్మనగు నాయందు; పశ్యతి=చూచుచున్నాడో; తస్య=అట్టి యాత్మైకత్వదర్శియగువానికి; అహం=ఈశ్వరరూపుడనగు నేను; న ప్రణశ్యామి; నశింపను. (పరోక్షభావమును పొందను) స చ=అట్టి విద్వాంసుడును; మే=నాకు; న ప్రణశ్యతి=ప్రణాశమును పొందడు; (పరోక్షభావమును పొందడు.) ॥౩౦॥

—♦ సిద్ధాంతము ♦—

"సమాహితో భూత్వాఽఽత్మన్యే వాత్మానం పశ్యతి" "తతస్తు తం పశ్యతి నిష్కలం ధ్యాయమానః" ఇత్యాదిశ్రుతులు సమాధి, ధ్యానముల కపరపర్యాయమగు యోగమే యాత్మదర్శనమునందు కారణమని బోధించుచున్నవి. మఱియు "తత్కారణం సాంఖ్యయోగాభిపన్నం విద్యా మేతాం యోగవిధిం చ కృత్స్నం" అను స్థలమున "సాంఖ్యయోగాభిపన్నం" అనియు "యోగవిధిం" అనియు స్పష్టముగ చెప్పుటవలన లింగమనెడి ప్రమాణమువలన జ్ఞానయోగములకు సముచ్చయ మవగతము. కాన నెవడు యోగియో, ఎవఁడు సమదర్శియో వారిరువు రాత్మను తెలిసికొనుట కధికారులు కాన నాత్మసాక్షాత్కారమును గూర్చి యోగము, సమదర్శిత్వము స్వతంత్రముగనే కారణము అనెడి మతము తొలిగింపబడెను.

సోపాధికమగు భ్రమ యుపాధినివృత్తి కానిదే నివర్తింపదు, కాన యుక్తివలన కలిగెడి వివేకమాత్రమువలన జడాజడరూపమగు దేహాత్మలయొక్క శ్రుతి సిద్ధమగు పృథక్కరణము సంభవింపదు. అట్లగుచో నుపాధి భూతమగు దర్పణాదుల నివృత్తి లేకున్నను ప్రతిబింబాదుల భ్రమనివర్తించెడిని అట్లు నివర్తించుట లేదని యాశయము. యోగములేనిచో యధిష్ఠాన జ్ఞానము సంభవించనందున యధిష్ఠానజ్ఞానము దృఢముగ నుండిన నధిష్ఠానమువందు కల్పితమగు చిత్తముయొక్కయు చిత్తదృశ్యములయొక్కయు, యదర్శనము నాయాసముగ సంభవించును. అనెడి మతము తొలగింపబడెను. స్త్రీ స్త్రీసుఖమును తెలిసికొనునట్లు బ్రహ్మము స్వసంవేద్యము. జాత్యంధుడు ఘటాదులను తెలిసికొననట్లు యోగరహితుఁడట్టి బ్రహ్మమును తెలిసికొనలేడని దక్షుఁడు "స్వసంవేద్యం హి తద్బ్రహ్మ కుమారీ స్త్రీసుఖం యథా । అయోగీ నైవ జానాతి జాత్యంధో హి యథా ఘటమ్" అను వాక్యముచే స్పష్టముగ చెప్పియుండెను.

భగవద్భాష్యకారులచటను బ్రహ్మవేత్తకు యోగాపేక్ష కలదని చెప్పియుండలేదని కొందఱు ప్రశ్నించెదరు. "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రమునందుగల "అథ" అను శబ్దముచే సూచితమగు ముముక్షువునకు విశేషణమగు సాధనచతుష్టయమునం దంతర్గతమగు శమాద్యుపేత సమాధిని గుర్తెఱుగక వటుల చెప్పుచుండిరి కాని మఱియేమియు కాదని తెలిసికొనెదరు గాక "ద్వౌక్రమౌ" ఆత్మను తెలిసికొనుటయందు రెండు మార్గములని బోధించు వసిష్ఠవాక్యము పరస్పరమపేక్ష లేనిదే సమదర్శిత్వము, యోగము అను రెండుమార్గములని వ్యాఖ్యానించిచో "నాన్యః పంథా విద్యతేఽయనాయ" మోక్షమునకు ఆత్మజ్ఞానముతప్ప మఱియొక మార్గము లేదను శ్రుతికి విరోధము ప్రాప్తించును కాన నా వసిష్ఠవాక్యము ప్రతిపత్తిక్రమభేదపరమని (జ్ఞానక్రమభేదమును బోధించునని) పూర్వమునందే మాచే వ్యాఖ్యానింపబడెను. మఱియు యోగప్రకరణమునందు యోగానపేక్షమార్గాంతర ప్రతిపాదన మసంగతము. అట్టి మార్గాంతర సూచకమగు శబ్దమేదియు యిచట కానరాదు. అట్టి శబ్దము "సమదర్శనః" అనునది కలదన్నను "యోవాసమదర్శనః" అని లేని "వా" అనుశబ్దము నధ్యాహారముచేయుటయు నసంగతమే. ॥౨౯॥

శాంకరభాష్యమ్:—

ఏతస్యాత్మైకత్వదర్శనస్య ఫల ముచ్యతే—యో మాం పశ్యతి వాసుదేవం సర్వస్యాత్మానం సర్వత్ర సర్వేషు భూతేషు సర్వం చ బ్రహ్మాదిభూతజాతం మయి సర్వాత్మని పశ్యతి తస్యైవ మాత్మైకత్వదర్శినోఽహ మీశ్వరో న ప్రణశ్యామి న పరోక్షతాం గమిష్యామి। సచ మే న ప్రణశ్యతి సచ విద్వా న్మమ వాసుదేవస్య న ప్రణశ్యతి న పరోక్షీభవతి। తస్య చ మమ చైకాత్మకత్వాత్ స్వాత్మాహినామాత్మనః ప్రియ ఏవ భవతి యస్మాచ్చాహమేవ సర్వాత్మైకత్వదర్శీ ॥30॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈ యాత్మైకత్వదర్శనమునకు ఫలమును జెప్పుచున్నాడు—ఎవడు సర్వమునకు నాత్మస్వరూపుడ నగు నన్ను (వాసుదేవుని) సర్వభూతములయందు చూచునో, మరియు బ్రహ్మాదిస్తంబపర్యంతమగు సర్వమును సర్వాత్మ నగు నాయందు జూచునో అట్టి బ్రహ్మవేత్త నాకు పరోక్షుడు కాడు. వానికి నేనును పరోక్షుడను కాను. ఏమన: అట్టి బ్రహ్మవేత్తకును నాకును ఆత్మైకత్వమే యందులకు కారణము. తన యాత్మ తనకు ప్రియముకదా! ॥30॥

—: ౬వ అధ్యాయము. ౩౦వ శ్లోకవ్యాఖ్యావిశేషములు. :—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు శుద్ధమగు త్వం పదార్థమును నిరూపించి శుద్ధమగు తత్పదార్థమును "యోమాం" అను శ్లోకముచే నిరూపించుచుండెను.

ఏ యోగి - ఈశ్వరుడు, అశేషప్రపంచకారణ మాయోపాధికుడనగు నన్ను ఉపాధి వివేకముచే నిఖిలప్రపంచమునందు సద్రూపముచేతను, స్ఫురణరూపముచేతను అనుస్యూతుడనుగను, సర్వోపాధివినిర్ముక్తునిగను, పరమార్థసత్యముగను, అసంగుననిగను, అనంతునిగను, యోగజప్రత్యక్షముచే సాక్షాత్కరింపజేసుకొనునో. అట్లే సర్వప్రపంచమును మాయచే నాయం దారోపితమై నాకంటె వేరుగ మృషాత్వముచే చూచునో అట్టి వివేకదర్శికి తత్పదార్థము భగవంతుడ నగు నేను "నప్రణశ్యామి" "ఈశ్వరుడను వాడు నాకంటె వేరుగ కలడు" అను పరోక్షజ్ఞానవిషయుడను కాను. మరేమనిన యోగజాపరోక్ష విషయుడ నగుదును. విచారింప తత్త్వమస్యాదివాక్యజన్యాపరోక్షజ్ఞాన విషయత్వము త్వం పదార్థాభేదముగనే సంభవించును. అయినను కేవల తత్పదార్థమునకు యోగజన్యాపరోక్షజ్ఞానవిషయత్వ ముపపన్నమే యగును. ఇట్లు యోగజప్రత్యక్షముచే నన్ను పరోక్షముగ జేసుకొను యోగియు "మే న ప్రణశ్యతి" నాకు పరోక్షుడు కాడు. అట్టి విద్వాంసుడు నా యాత్మస్వరూపుడై నా కతిప్రియు డగుటవలన "యే యథా మాం ప్రపద్యన్తే తాం స్తథైవ భజా మ్యహం" అను భగవదుక్తివలన యెల్లపుడు నా యపరోక్షజ్ఞానగోచరుడగును. అట్లే శరశయ్యాస్థ భీష్మధ్యానము ధర్మరాజును గూర్చి శ్రీకృష్ణపరమాత్మచే చెప్పబడెను.

అవిద్వాంసుడన్నచో స్వాత్మస్వరూపమైయున్నను భగవంతుని చూడడు. అందువలన భగవంతుడును చూచుచున్నను యట్టి యవిద్వాంసుని చూడడు. "స ఏన మవిదితో న భునక్తి" అను శ్రుతియు పైవిషయమునే బోధించుచున్నది. విద్వాంసుడన్నచో యెల్లపుడు సన్నిహితుడై భగవదనుగ్రహ పాత్రుడగును. ॥30॥

శంకరానందీయము:— చెప్పినవిధమున స్వాత్మకు సర్వభూతస్థత్వమును, సర్వభూతాధారత్వమును బ్రహ్మవేత్తకు, తనకు స్వరూపముచే నైక్యమును బోధించుటకొరకు తనకును సర్వభూతస్థత్వమును, సర్వభూతాధివాసత్వమును సూచించుచు యట్లే యీశ్వరునికి తనకు స్వరూపముచే నేకత్వమునే యప్రతిబద్ధవృత్తిచే చూచుచున్న బ్రహ్మవిద్యతికి యట్టి దర్శనమునకు ఫలమును "యః" అను శ్లోకముచే బోధించుచుండెను.

చెప్పబడిన సాధన సంపత్తిచే యే యోగారూఢుడగు బ్రహ్మవిద్యతి సచ్చిదానందైక రసస్వరూపమగు పరబ్రహ్మమును బ్రహ్మాదిస్తంబపర్యంత భూతములయందు ప్రత్యగాత్మస్వరూపముగ నుండిన వానినిగ తెలుసుకొనునో అట్లే చెప్పబడిన లక్షణములుకల పరబ్రహ్మస్వరూపుడగు నాయందే అవ్యాకృతాది స్థూలాంత నిఖిలజగత్తు యాకాశమునందు గంధర్వనగరమువలె యాభాసమాత్రము. సత్తారహితము, అని చూచునో అట్టివానికి నాకు నియతమగు సర్వభూతస్థత్వ సర్వాధారత్వ లక్షణముల చేతను, శ్రుతి యుక్తిబలమువలనను స్వరూపముచే నేకత్వమునే యెల్లపుడు చూచు బ్రహ్మవిత్తమునకు సచ్చిదానందైకరసమగు పరబ్రహ్మస్వరూపమైన నేను "న ప్రణశ్యామి" వృత్తికవిషయుడను కాను. మరేమనిన? అట్టి వాడు నిలుచుండినను, నడచుచుండినను, కూర్చుండినను, పరుండినను, నేత్రములు తెరచినను, మూసినను, భుజించుచుండినను, యథేచ్ఛగనుండినను, అట్టివాని బుద్ధివృత్తికి యెల్లపుడు చక్షుస్సునకు రూపమువలె పరమానందమును సమకూర్చువాడనై విషయుడనగుదును.

ఎట్లు ఘటము తననుచూచువానికి స్వయముగ, వేరయినదే విషయమగునో అట్లే బ్రహ్మయు యంతటను బ్రహ్మమునే చూచు బ్రహ్మవేత్తకు స్వయముగ భిన్నమయినదే విషయ మగునా? అట్లగునో "ఉదర మంతరం కురుతే అథ తస్య భయం భవతి" అను శ్రుతివలన భేదదృష్టికలవానికి మోక్షము లేకపోవలయును. కాన భేదదృష్టిని వదలివేయుటకు "స చ" అని చెప్పుచుండెను.

ఆ బ్రహ్మవేత్తయు చిదేకరసము, నిర్విశేషము, బ్రహ్మస్వరూపము అగు నాకు "న ప్రణశ్యతి" విద్వాంసునకు ప్రణాశమనగ అతన్మాతాదాత్మ్యాపత్తియే. ఎట్లు పురుషునకు వైధర్మ్యాపత్తి నరకాద్యనర్థహేతువగునో అట్లే బ్రహ్మవేత్తకు విపరీతభావాపత్తియే జన్మాద్యనర్థమునందు హేతువు, కాన నిట్టి బ్రహ్మవేత్తయే యనాత్మ యందాత్మభావమును చేయడు. మరేమనిన? దేవదత్తుడు స్వదేహమునందువలె బ్రహ్మవేత్త "బ్రహ్మైవాహం" అని స్వస్వరూపముచే విషయ మొనరించుకొనిన నిర్విశేషపరబ్రహ్మమునందే యెల్లపుడు "అహం" అను వృత్తిచే నుండును. ॥౩౦॥

నీలకంఠీయము— ఈ యాత్మైకత్వదర్శనమునకుకూడ ఫలమును 'యోమాం'అనుశ్లోకముచే చెప్పుచుండెను. ఈశ్లోకమునందుగల అస్మచ్ఛబ్దము ప్రత్యగాత్మపరము. ఏ యోగి బ్రహ్మాదిస్తంభపర్యంత భూతములయం దాత్మస్వరూపమును చూచునో బ్రహ్మాదిస్తంబపర్యంత భూతముల నాత్మయందు చూచునో అట్టి యోగికి సకృత్తు నష్టమైన మూలాజ్ఞానము తిరిగి సంభవించనందున జ్ఞాతమగు నాత్మతిరిగి తిరోహితుడు కాడు. బుద్ధితత్త్వ పక్షపాతి యగుటవలన శుక్తిరూప్యమువలె బ్రహ్మమునం దధ్యస్తమైన కార్యకరణ సంఘాతాభిమానిచే తదభిమాన పరిత్యాగపూర్వకముగ జ్ఞాతము, స్వాధిష్ఠానము అగు బ్రహ్మము తిరోహితము కాకుండు గాక. బ్రహ్మదృష్టిచే ముక్తజీవునకు నిరన్వయోచ్ఛేదము సంభవించునను శంకను "సచమేనప్రణస్యతి" అను వాక్యముచే తొలిగించుచుండెను. ఆ విద్వాంసుడు నా స్వరూపుడే కాన నాకును తిరోహితుడా విద్వాంసుండు కాడు. విద్వాంసుడు నాయం దధ్యస్థమైనను, నావికారమైన, నునిరన్వయోచ్ఛేదము (స్వరూపదర్శనము, లేక స్వరూపానాశము సంభవించెడిని అట్లు కాక విద్వాంసుడు నా స్వరూపుడే. ఈ విషయమునే "తత్త్వమసి" "అహంబ్రహ్మాస్మి" "అయమాత్మా బ్రహ్మ" ఇత్యాది మహావాక్యములు బోధించుచున్నవి. విద్వాంసుడు నా స్వరూపుడే యగుటవలన నిరన్వయోచ్ఛేదము ప్రాప్తింపదు. "సచమేన ప్రణశ్యతి" అని చెప్పుట యుక్తమే. ॥౩౦॥

సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః ।
సర్వథా వర్తమానోపి స యోగీ మయి వర్తతే ॥ ॥౩౧॥

పదవిభాగము:—సర్వభూతస్థితం-యః-మాం-భజతి-ఏకత్వం-ఆస్థితః- సర్వథా-వర్తమానః-అపి-సః-యోగీ-మయి-వర్తతే. ॥౩౧

ప్రతిపదార్థము:— యః=ఎవడు; ఏకత్వం=స్వాత్మాభేదమును; ఆస్థితః =పొందినవాడై; సర్వస్థితం=సర్వభూతములయందు యున్న; మాం=నన్ను; భజతి=పొందుచున్నాడో; (చూచుచున్నాడో;) సః=అట్టి; యోగీ=యోగి; సర్వథావర్తమానోపి=స్వైరప్రవృత్తితో నేవిధముగనున్నవాడైనను; మయి=నాయందు; వర్తతే=ఉ టున్నాడు. ॥౩౧॥

—: ౬వ.అధ్యాయము ౩౧వ. శ్లోకవ్యాఖ్యావిశేషములు :—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు త్వం పదార్థము, తత్పదార్థము అను శుద్ధమును నిరూపించి "తత్త్వమసి" అను వాక్యార్థమును "సర్వభూతస్థితం" అను దానిచే నిరూపించుచుండెను.

సర్వభూతములయం దధిష్ఠానరూపముగ నున్నట్టి అనగా సర్వానుస్యూత సన్మాత్రస్వరూపము, తత్పదలక్ష్యము ఈశ్వరుడు అగు నన్ను త్వంపద లక్ష్యమగు తనతోకూడ నత్యంతాభేదమును పొందించినవాడై అనగా ఘటాకాశము ఉపాధియగు ఘటనిరాకరణమునచ్చి మహాకాశమే యని నిశ్చయించినటుల తత్త్వం పదార్థోపాధి నిరాకరణముచే నిశ్చయించుచు "అహం బ్రహ్మాస్మి" అని వేదాంతవాక్యజన్య తత్త్వసాక్షాత్కారముచే నెవడు నన్ను పరోక్షముగ జేసుకొనునో యట్టివాడవిద్యా తత్కార్యనివృత్తిచే జీవన్ముక్తుడై కృతకృత్యుడేయగును.

ఎంతవరకట్టివానికి భాధితానువృత్తిచే శరీరాది దర్శన మనువర్తించునో యంతవరకు ప్రారబ్ధకర్మప్రాబల్యమున యాజ్ఞవల్క్యాదులవలె సర్వకర్మత్యాగముచేతగాని, జనకాదులవలె విహితకర్మచేతగాని, దత్తాత్రేయాదులవలె ప్రతిషిద్ధ కర్మచేగాని, యేదోయొక రూపముచే నుండినను (వ్యవహరించుచుండినను) ఆ యోగి "బ్రహ్మాహ మస్మి" అను జ్ఞానముకలవాడు పరమాత్మయందే యభేదముగ నుంటున్నవాడు. యేవిధముగనైన యతనికి మోక్షమును గూర్చి సంశయము లేదు. "తస్య హన దేవాశ్చ నాభూత్యా ఈశత ఆత్మాహ్యేషాం సంభవతి" మహాప్రభావముగల దేవతలుగూడ యట్టి యాత్మదర్శికి మోక్షము ప్రాప్తింపకుండగ జేయుటకు సమర్థులు కారు. ఇతర క్షుద్రులు సమర్థులు కారని చెప్పనవసరము లేదు. అను శ్రుతియు బోధించుచున్నది నిషిద్ధకర్మయందు ప్రవర్తకమగు రాగద్వేషములు బ్రహ్మవేత్తకు సంభవింపనందున బ్రహ్మవేత్త నిషిద్ధకర్మలెంతమాత్రము చేయడు. అయినను దత్తాత్రేయాది దృష్టాంతము ననుసరించి కొందరు బ్రహ్మవేత్తకు గూన నిషిద్ధకర్మాచరణము సంభవించునను వాదమును "తుష్యతు దుర్జనః" అను న్యాయముచే సంగీకరించి జ్ఞానస్తుత్యర్థమై "సర్వథావర్తమానోఽపి" "హత్వాఽపిస ఇమాంల్లోకాన్నహన్తి న నిబధ్యతే" అనువాక్యమువలె ఇదికూడ చెప్పబడెను.

శంకరానందీయము:— అంతట బ్రహ్మమాత్రత్వము నవగహించునట్టిన్ని యోగానుష్ఠానమువలన జనించు సమ్యగ్దర్శనమునకు ఫలమును, యెల్లపుడు సర్వత్ర బ్రహ్మదర్శనమును, బ్రహ్మమునందే యాత్మత్వదర్శనమును, యెల్లపుడు బ్రహ్మానందానుభూతిని సూచించి యిపుడిట్టి లక్షణములుకల బ్రహ్మవిత్తముడు తన ప్రారబ్ధానురూపముగ దేహము నానావిధ ధర్మములుకలదైనను తాను తన జ్ఞాననిష్ఠచేతనే యున్నవాడై ముక్తిని పొందగలడని "సర్వభూతస్థితం" అను శ్లోకముచే చెప్పుచుండెను.

"ఏకమేవాద్వితీయం బ్రహ్మ నేహ నానాస్తి కించన। సర్వం హ్యేతద్బ్రహ్మ। అయమాత్మా బ్రహ్మ। అహం బ్రహ్మాస్మి" ఇత్యాది శ్రుత్యర్థ విచారసముత్థ జ్ఞానబలముచేతను, యోగానుష్ఠానసముత్పన్న స్వానుభూతిబలముచేతను యేకత్వమును పొందినవాడై "సర్వమిదమహంచ బ్రహ్మైవ" (ఈ సర్వప్రపంచము, నేను

**శాంకరభాష్యమ్:—**

ఇత్యేత త్పూర్వశ్లోకార్థం సమ్యగ్దర్శన మనూద్య తత్ఫలం మోక్షోఽభిధీయతే। సర్వథా సర్వప్రకారై ర్వర్తమానోపి సమ్యగ్దర్శీ యోగీ మయి వైష్ణవే పరమే పదే వర్తతే నిత్యముక్త ఏవ స న మోక్షం ప్రతి కేనచిత్ప్రతిబధ్యత ఇత్యర్థః॥ ॥౩౧॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

పూర్వశ్లోకార్థమైన సమ్యగ్దర్శనము నీశ్లోకపూర్వార్ధముచే ననువదించి, ఆసమ్యగ్దర్శన ఫలమగు మోక్షమును చెప్పుచున్నాడు- ఎవడు స్వాత్మాభేదముతో నన్ను పొందుచున్నాడో అట్టియోగి— రాగాదిరహితుడు, యమనియమాదిసంస్కారవంతుడు నగును గాన వానికి స్వైర ప్రవృత్తి సంభవింపనే సంభవింపదు. ఒకవేళ స్వైరప్రవృత్తి యథాప్రారబ్ధముగ సంభవించినను జ్ఞానోత్పత్తిపర్యంతమే శాస్త్రనియమము గాన అట్టివాడేవిధముగ నున్నను, సర్వవ్యాపకమగు పరమపదము నందుచున్నాడు. (అనగానట్టి సమ్యగ్దర్శి నిత్యముక్తుడే యగును. మోక్షవిషయమై దేనిచేతను ప్రతిబంధింపబడ డనియర్థము) ॥౩౧॥

బ్రహ్మస్వరూపమే) అని యెల్లపు డేకత్వమును బొందినవాడై "సర్వం బ్రహ్మైవ" అను దృఢనిశ్చయ యుక్తుడై యేబ్రహ్మవేత్తయగు యతి- అయః పిండమున అంతర్బహిః ప్రదేశములయందు వ్యాపించియున్న యగ్నివలె మహదాది స్థూలపర్యన్త సర్వభూతజాతమును బహిరంతఃప్రదేశములయందు యెల్లపు డేకరూపముగ నుండువాడు సర్వభూతస్థుడని యనిపించుకొనును. అట్టి నిర్విశేషము. పరబ్రహ్మము అగునన్ను "భజతి" "బ్రహ్మైవాహ మస్మి" అను ప్రత్యగ్దృష్టిచే దనను నన్నుగ సాక్షాత్తు తెలిసికొని సాభావము నెవడుపొందునో అట్టిమద్భావమును పొందిన బ్రహ్మవేత్త యన్నివిధములచే నుండువాడై నను అనగా స్వప్రారబ్ధానుసారముగ వివిధచేష్టావత్తగు దేహచేష్టచేత లోకదృష్టిచే బాలుడువలె, మూఢునివలె, ఉన్మత్తునివలె, శిష్టునివలె, అశిష్టునివలె కనబడుచున్నను తనదృష్టిచే నిర్వికార బ్రహ్మస్వరూపముగ నున్న బ్రహ్మవిత్తముడు యీశరీరము పతితమైయుండ (నశించినదైయుండ) నాస్వరూపముగ నాయందే యుండును. లేక "మయి" అనునది తృతీయార్థమున ప్రయుక్తమౌ. బ్రహ్మస్వరూపముగ నుండును. విదేహముక్తిని పొందునని యర్థము. ॥౩౧॥

పరమార్థప్రప:— అనంతరము సర్వదృశ్యజాతమును ఆత్మాకారముగ చూచునని "సర్వభూతస్థితం" అను దానిచే చెప్పుచుండెను.

ఎవడుసర్వభూతాకారముగ నున్ననన్ను ఏకత్వమును పొందినవాడై యనువర్తించునో అట్టివాడు నామరూపాకారముగ నున్నవాడైనను "మయివర్తతే" నాయాకారుడగుచున్నాడు. ఈవిషయమునే "యస్మి న్సర్వాణి భూతా న్యాత్మైవాభూ ద్విజానతః తత్ర కో మోహః కః శోక ఏకత్వ మనుపశ్యతః" భాష్యమ్—విజ్ఞానముకల ఏపురుషునకు పంచభూతాత్మకమగు నిఖిలప్రపంచము ఆత్మస్వరూపమే యయ్యెనో, అనగా భూతభావన లేకపోవుటచే యాత్మాకారమే యయ్యెనో, అట్టి యద్వైతజ్ఞానము కలవానికి మాయావిలాసరూపమగు యజ్ఞాన మెచ్చట? అట్టి మాయావిలాసరూపమగు యజ్ఞానమువలన ప్రాప్తించెడి శోకమ్ము దేనివలన? దేనివలనను యట్టి యజ్ఞానము, అట్టి యజ్ఞానమువలన ప్రాప్తించు శోకము ప్రాప్తింపదని యర్థము. ॥౩౧॥

నీలకంఠీయము:— సర్వాత్మైకత్వదర్శి నారూపమే. కాన వనికి మోక్షము ప్రాప్తించుటయందే ప్రతిబంధకము సంభవింపదని "సర్వభూతస్థితం" అనుశ్లోకముచే చెప్పుచుండెను.

సర్వోపాదానత్వరూపముచే బ్రహ్మాదిస్తంబపర్యంత సర్వభూతములయందు సత్తాస్వరూపముచేతను, స్ఫురణరూపముచేతను యుండిన నన్ను (పరమాత్మను) జీవబ్రహ్మైకైక్యము నాశ్రయించిన వాడైనిర్వికల్ప

గీ॥ ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున! ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః॥ ॥౩౨॥

పదవిభాగము:— ఆత్మౌపమ్యేన-సర్వత్ర-సమం-పశ్యతి-యః-అర్జున!-సుఖం-వా యది-వా-దుఃఖం-సః-యోగీ-పరమః-మతః ॥౩౧॥

ప్రతిపదార్థము:— హే అర్జున=ఓ అర్జునుడా; యః=ఎవడు; సర్వత్ర=అంతట; ఆత్మౌపమ్యేన=ఆత్మసాదృశ్యముతో; సుఖంవా=సుఖమును గాని; యదివా=లేక; దుఃఖంవా=దుఃఖమును గాని; సమం=తుల్యముగా; పశ్యతి=చూచునో; సః=అట్టియోగి; సర్వయోగినాం మధ్యే=సర్వయోగులలోను; (ఈపదమధ్యాహార్యము) పరమః=ఉత్కృష్టుడుగా; మతః=అభిప్రేతుడు. ॥౩౨॥

---

సమాధిచే సేవించునో, ఆయోగి సమాధివ్యుత్థానదశయందు (సమాధినుండి లేచిన కాలమునందు) బాధితమగు నవిద్యయొక్క యనువృత్తిచే దేహారూఢుడై యాజ్ఞవల్క్యాదులవలె కర్మపరిత్యాగముచే కాని, వసిష్ఠజనకాదులవలె విహిత కర్మచేకాని, దత్తాత్రేయాదులవలె నిషిద్ధకర్మచే కాని వ్యవహరించినను బాయందే యుండినవాడగుచున్నాడు. అనగా బానుండిచ్యుతుడు కాడు. "యతో దేవేభ్యోపి నాస్య భయం" (ఇట్టియోగికి దేవతలవలనగూడ భయములేదు.) [అని శ్రుతిబోధించుచున్నది. "తస్య హ న దేవా శ్చ నా భూత్యా ఈశత ఆత్మా హ్యేషాం స భవతి" ఈశ్రుతియందు "తస్య హ న" అను స్థలమునందుగల "న" అను అవ్యయము "అపి" అను అవ్యయముయొక్క యర్థముకలది. దేవతలుకూడనట్టి బ్రహ్మవేత్తల యైశ్వర్యముకొరకుసమర్థులుకారు. ఎందువలననిన? ఈబ్రహ్మవేత్త దేవతలకుకూడ నాత్మస్వరూపమే; అనగ పూర్వమునందువలె బ్రహ్మవేత్త తిరిగి సంసారి కాడని యర్థము. ॥౩౧॥

## —:౬వ అధ్యాయము ౩౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లు తత్త్వజ్ఞాన ముత్పన్నమైనను ఒకానొకడు మనోనాశవాసనాక్షయములు లేనందున జీవన్ముక్తి సుఖము ననుభవింపడు చిత్తవిక్షేపముచే దృష్టదుఃఖము ననుభవించుచున్నాడు అట్టివాడు పరమయోగి కాడు. అట్టియోగి దేహపాతానంతరము కైవల్యమును పొందువాడగుటవలన దేహముండువరకు దృష్టదుఃఖానుభవమువలన తత్త్వజ్ఞాన మనోనాశవాసనాక్షయములయొక్క యుగపదభ్యాసములవలన దృష్టదుఃఖనివృత్తిపూర్వకముగ జీవన్ముక్తిసుఖమనుభవించుచు ప్రారబ్ధకర్మవశమున సమాధివ్యుత్థానకాలమున నాత్మదృష్టాంతముచే సర్వప్రాణులయందు సుఖమును కాని, దుఃఖమును కాని సమముగ నెవడుచూచునో అనగా తనకనిష్టమును యెట్లు సంపాదింపడో అట్లే పరునకుకూడ ననిష్టము నెవడు సంపాదింపడో, అట్లే తనకిష్టమును యెట్లు సంపాదించునో అటులనే యితరునకుకూడ నిష్టమును రాగశూన్యుడగుటవలన సంపాదించునో అట్టివాడు నిర్వాసన కలవాడగుటచే నుపశాంతమనస్కుడై బ్రహ్మవేత్తయై ఆపరమయోగికంటె శ్రేష్ఠుడై సమ్మతమగును. కావున నోయర్జునా! తత్త్వజ్ఞాన మనోనాశవాసనాక్షయములయొక్క యభ్యాసముకొరకు గొప్ప ప్రయత్నము చేయవలెను.

అందు యీ ద్వైతజాతమంతయు అద్వితీయమగు చిదానందాత్మయందు మాయచే కల్పితమగుటవలన మృషయే. ఒకయాత్మయే పరమార్థసత్యము. అట్టి "సచ్చిదానందాద్వయ స్వరూపుడను నేను అయితిని" అనుజ్ఞానముతత్త్వజ్ఞానము. ప్రదీపజ్వాలాసంతతివలె వృత్తి సంతానరూపముగ పరిణమించు అంతఃకరణద్రవ్యము మనసాత్మకమగుటవలన "మనస్సు" అని చెప్పబడుచున్నది. అట్టి మనస్సుయొక్క నాశమనగ వృత్తి రూప పరిణామమును పరిత్యజించి సర్వవృత్తి విరోధియగు నిరోధాకారముగ పరిణామము పూర్వాపర పరామర్శ లేకుండగ శీఘ్రముగ జనించు క్రోధాదివృత్తివిశేషమునకు హేతువగు చిత్తగతమగు సంస్కారవిశేషము పూర్వపూర్వాభ్యాసముచే చిత్తమునందు వాస్యమగుటవలన వాసనయనబడును. అట్టివాసనయొక్క క్షయమనగ వివేకజన్యచిత్త

శాంకరభాష్యమ్

కిం చాన్యత్— ఆత్మౌపమ్యేనాత్మా స్వయమేవోపమీయతే అనయా ఇత్యుపమా తస్యా ఉపమాయా భావ ఔపమ్యం తేనాత్మౌపమ్యేన సర్వత్ర సర్వభూతేషు సమం తుల్యం పశ్యతి యోఽర్జున సచ కిం సమం పశ్యతీత్యుచ్యతే యథా మమ సుఖమిష్టం తథా సర్వప్రాణినాం సుఖమనుకూలం। వాశబ్దశ్చార్థే। యది వా యచ్చ దుఃఖం మమ ప్రతికూల

శాంకరభాష్యతత్త్వబోధినీ—

మరియు నింకొక విషయమేమనఁ ఓయర్జునా! ఏయోగి యాత్మసాదృశ్యముతో సర్వభూతములయందు సుఖమునుగాని, దుఃఖమునుగాని తుల్యముగాజూచునో అనగా "ఎట్లునాకు సుఖము అనుకూలమై యిష్టమో యట్లే సర్వప్రాణులకుగూడ సుఖము అనుకూలమై యిష్టము. ఎట్లు నాకు దుఃఖము ప్రతికూలమై యనిష్టమో అట్లే యందరకును దుఃఖము ప్రతికూలమై

ప్రశమవాసన దృఢమైయుండ బాహ్యనిమిత్తము ప్రాప్తించినను క్రోధాద్యనుత్పత్తియే. తత్త్వజ్ఞానముండిన మిథ్యాభూతమగు జగత్తునందునరవిషాణమునందువలె ధీవృత్తి జనించకపోవుటవలన ఆత్మదృష్టమగుటచే తిరిగి వృత్త్యుపయోగము లేనందున నిరంధనాగ్నివలె మనస్సునశించును. మనస్సునశించినదైయుండ సంసారోద్బోధకమగు బాహ్యనిమిత్తము ప్రాప్తిపనందున వాసన క్షీణించును. వాసనక్షీణించినదైయుండ హేతువు లేమిఁజేసి క్రోధాదివృత్తి జనింపనందున మనస్సునశించును మనస్సునశించిన శమదమాదిసంపత్తిచే తత్త్వజ్ఞానము జనించును. ఇట్లు తత్త్వజ్ఞానము జనించిన రాగద్వేషాది రూపమగు వాసనక్షీణించును. వాసనక్షీణించిన ప్రతిబంధకము లేమిఁజేసి తత్త్వజ్ఞానము జనించును. ఇట్లుఁతత్త్వజ్ఞాన మనోనాశవాసనాక్షయములకు పరస్పరకారణత్వము చూడనగును. కనుకనే వసిష్టుడిట్లు చెప్పెను. "తత్త్వజ్ఞానం మనోనాశోవాసనాక్షయ ఏవచ। మిథః కారణతాంగత్వా దుస్సాధ్యాని స్థితాని హి॥ తస్మాద్రాఘవ యత్నేన పౌరుషేణవివేకినా। భోగేచ్ఛాం దూరతస్త్యక్త్వా త్రయమేతత్సమాచర॥" అని మున్నెన్నడో యీవిషయమునే చెప్పియుండెను. పౌరుషమనగా యత్నము. అనగా "యేదో యొక యుపాయముచే నవశ్యము సంపాదింపగలను" అనునట్టి యుత్సాహ రూపమైన నిర్బంధము. వివేకమనగా- వేరుపరచెడి నిశ్చయము. తత్త్వజ్ఞానమునకు శ్రవణాదికము సాధనము. మనోనాశమునకు యోగము సాధనము. వాసనాక్షయమునకు ప్రతికూల వాసనోత్పాదనము సాధనము. ఇట్లు వివేకయుక్తమగు ప్రయత్నముచే "హవిషా కృష్ణవర్త్మేవ" హవిస్సుచే యగ్నివలెతృప్తిపడనటుల స్వల్పమైన భోగేచ్ఛకూడ వాసనావృద్ధి హేతువగుటవలన దూరముగ దానినివిడువవలెను. అని చెప్పబడెను.

విద్యాధికారి- కృతోపాసనుడు, అకృతోపాసనుడు అని రెండు విధములు. అందుపాస్యసాక్షాత్కారపర్యంత ముపాసనను చేసి తత్త్వజ్ఞానము కొరకెవడు ప్రవృత్తుడో అట్టివానికి వాసనాక్షయమనోనాశనములు దృఢతరములగుటచే జ్ఞానము కలిగినపిమ్మట జీవన్ముక్తి స్వయముగనే సిద్ధించును. ఇప్పటివాడన్నవో తరచుగ యుపాసన చేయనివాడే అయినను ముముక్షువై ఔత్సుక్య మాత్రమువలన సహసా విద్యయందు ప్రవర్తించుచున్నాడు. మరియు యోగమును విడచియే చిజ్జడవివేకమాత్రముచేతనే మనోనాశవాసనాక్షయములను తాత్కాలికముగ సంపాదించి శమదమాది సంపత్తిచే శ్రవణమననిదిధ్యాసనలను సంపాదించుచున్నాడు. దృఢముగ నభ్యసింపబడిన శ్రవణమననిదిధ్యాసనలచే సర్వబంధమును విశేషముగ ఛేదించునట్టి తత్త్వజ్ఞానము కలుగును. అట్టి జ్ఞానమువలన నవిద్యాగ్రంధియు, అబ్రహ్మత్వము, హృదయగ్రంధి, సంశయములు, కర్మలు, అసర్వకామత్వము, మృత్యువు, పునర్జన్మము అనెడి అనేకవిధమైన బంధము నివర్తించును. ఈవిషయమునే "యోవేదనిహితం గుహాయాం సోఽవిద్యాగ్రన్థిం వికిరతీహసోమ్య। బ్రహ్మవేద బ్రహ్మైవభవతి। భిద్యతే హృదయగ్రన్థిశ్ఛిద్యన్తే సర్వసంశయాః। క్షీయన్తే చాస్య కర్మాణి తస్మిన్దృష్టే పరావరే। సత్యం జ్ఞానమనన్తం

**శాంకరభాష్యమ్:—**

మనిష్టం యథా తథా సర్వప్రాణినాం దుఃఖ మనిష్టం ప్రతికూల మిత్యేవ మాత్మౌపమ్యేన సుఖదుఃఖే అనుకూలప్రతికూలే తుల్యతయా సర్వభూతేషు సమం పశ్యతి న కస్య చిత్ప్రతికూల మాచరత్యహింసక ఇత్యర్థః। య ఏవ మహింసక స్సమ్యగ్దర్శననిష్ఠ స్స యోగీ పరమ ఉత్కృష్టో మతోఽభిప్రేత స్సర్వయోగినాం మధ్యే ॥32॥

**శాంకరభాష్యతత్త్వబోధిని:—**

యనిష్టము అను యీవిధముగా నాత్మసాదృశ్యముతో సుఖదుఃఖములను అనుకూలప్రతికూలములుగా సమముగ సర్వభూతములయందు నెవడు చూచునో అట్టి యోగి యెవనికిని ప్రతికూల మాచరింపడుగాన యహింసకుడని యర్థము అహింసకుడును, సమ్యగ్దర్శననిష్ఠుడు నగు యట్టియోగి యోగు లందరిలో శ్రేష్ఠుడుగా జెప్పబడును. ॥32॥

బ్రహ్మ । గూఢకదనిహితం గుహాయాం పరమే వ్యోమన్ ॥ సోఽశ్నుతే సర్వా న్కామాన్సహ । బ్రహ్మణా విపశ్చితేతి । తమేవ విదిత్వాఽతి మృత్యుమేతి । యస్తు విజ్ఞానవా న్భవత్యమనస్క స్సదాశుచిః । స తు తత్పద మాప్నోతి యస్మా ద్భూయో న జాయతే । య ఏవం వేదాహం బ్రహ్మాస్మీతి స ఇదగ్ సర్వం భవతి" ఇత్యాది శ్రుతులు జ్ఞాని కసర్వజ్ఞత్వనివృత్తిఫలమును బోధించుచున్నవి. ఈవిదేహముక్తి దేహమున్నను జ్ఞానము జనించిన కాలమునందే సంభవించు నని తెలిసికొనవలయును. బ్రహ్మయందు దవిద్యాధ్యారోపిత మగు యీబంధములు యవిద్య నశించిన వెంటనే తిరిగి జనింపనందున నివర్తించి శైథిల్యహేతువు లేనందున తత్త్వజ్ఞాన మతనికి యనువర్తించును. మనోనాశవాసనాక్షయములన్ననో దృఢాభ్యాసము లేనందున భోగప్రదమగు ప్రారబ్ధకర్మచే బాధ్యమానము అగుటవలన సవాతప్రదేశప్రదీపమువలె సహసా నివర్తించును. కాన యిదానీంతనుడగు తత్త్వజ్ఞానికి తత్త్వజ్ఞానము మొట్టమొదట సిద్ధింప ప్రాక్సిద్ధతత్త్వజ్ఞానవిషయమై ప్రయత్నాపేక్ష లేదు. మరి యేమనిన మనోలయవాసనాక్షయములే యతనికి ప్రయత్నసాధ్యములు. అందు మనోనాశ మసంప్రజ్ఞాతసమాధినిరూపణముచే పూర్వమునందే నిరూపింపబడెను. ఇపుడు వాసనాక్షయము నిరూపింపబడుచుండెను. అందు వాసనాక్షయమును వసిష్ఠుడు "దృఢభావనయా త్యక్తపూర్వా పరవిచారణమ్। యదాదానం పదార్థస్య వాసనా సా ప్రకీర్తితా" దృఢభావనచే పూర్వాపరవిచారణను వదలి పదార్థముయొక్క యాదానమే (స్వీకారమే) వాసన యని చెప్పెను. ఈవిషయమై తమతమ దేశాచార, కులధర్మ, స్వభావభేద, తద్గతాపశబ్దసుశబ్దాదులయందు ప్రాణులకభినివేశమే సామాన్యముగ వాసన కుదాహరణము. ఆవాసన మలినమనియు, శుద్ధమనియు రెండు విధములు. శుద్ధవాసన దైవీసంపత్తు శాస్త్రసంస్కారప్రాబల్యమువలన తత్త్వజ్ఞాన సాధన మగుటచే నేకరూపమే. బాహ్యాభ్యన్తరభేదముచే మలినవాసన రెండువిధములు. బాహ్యమలినవాసన,-లోకవాసన, శాస్త్రవాసన. దేహవాసన యని మూడు విధములు. "సర్వజనులు యెట్లు నన్ను నిందించరో యటుల నడచుకొనెదను" అను శక్యము కాని విషయమునందభినివేశము లోకవాసన "కో లోక మారాధయితుం సమర్థః" ఎవడు లోకమునంతనారాధించుటకు సమర్థుడు? ఎవడును కాడు అను న్యాయముచే యిట్టి సర్వలోకారాధన మెవనికి నాచరించుటకు శక్యము కానందున, పరమపురుషార్థమున కుపయోగము కానందున యీ లోకవాసన మలినమని చెప్పబడుచున్నది

శాస్త్రవాసన- పాఠవ్యసనమని, బహుశాస్త్రవ్యసనమని, అనుష్ఠానవ్యసనమని మూడు విధములు. అందు మొదటి దగు పాఠవ్యసనము భరద్వాజునకు, రెండవది యగు బహుశాస్త్రవ్యసనము దుర్వాసునకు మూడవది యగు అనుష్ఠానవ్యసనము నిదాఘునకు కలదని తెలిసికొనవలయును. ఈ మూడువిధములగు శాస్త్రవాసనలు క్లేశకారులగుట వలనను, పురుషార్థానుపయోగు లగుట వలనను, దర్పహేతువు లగుటవలనను జన్మహేతువు లగుటవలనను మలినవాసన అనంబడును.

దేహవాసనయు— ఆత్మత్వభ్రాంతి యనియు, గుణాధానభ్రాంతి యనియు, దోషాపనయనభ్రాంతి యనియు మూడువిధములు. అందు దేహమున సార్వలౌకికమై యాత్మత్వభ్రాంతి విరోచనాదులయందు ప్రసిద్ధము. గుణాధానము లౌకిక మని, శాస్త్రీయ మని రెండువిధములు. మంచిశబ్దాదివిషయసంపాదనము లౌకికము. గంగాస్నానసాలగ్రామాదితీర్థాదిసంపాదనము శాస్త్రీయము. దోషాపనయనము గూడ లౌకికమని, శాస్త్రీయమని రెండువిధములు. వైద్యునిచే చెప్పబడిన యౌషధములచే వ్యాధ్యాద్యపనయనము లౌకికము. వైదికస్నానాచమనాదులచే అశౌచాద్యపనయనము శాస్త్రీయ మని యనబడును. ఇన్నివిధములగు దేహవాసనలు అప్రామాణికములగుటవలనను, అశక్యము లగుటవలనను, పురుషార్థమున కుపయోగములు కాకపోవుటవలనను, జన్మహేతువులగుటవలనను మలినములే యని శాస్త్రమునందు ప్రసిద్ధములు.

కాన యీలోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన అను వాసనాత్రయము యవివేకుల కుపాదేయములగుటచే ప్రతిభాసమానమైనను వివిదిషువునకు జ్ఞానోత్పత్తివిరోధి యగుటవలనను, విద్వాంసునకు జ్ఞాననిష్ఠావిరోధియగుటవలనను వివేకులు యీలోకశాస్త్రదేహవాసనాత్రయమును పరిత్యజింపవలయును. ఇట్లు మూడు విధములగు బాహ్యవాసన నిరూపింపబడెను.

అభ్యంతరవాసన యన్నదో కామక్రోధ దంభదర్పాద్యాసురసంపద్రూపము. సర్వానర్థమూలము, "మానసీవాసనా" అని చెప్పబడుచున్నది. ఇట్లు బాహ్యాభ్యంతరవాసనాచతుష్టయమునకు క్షయము శుద్ధవాసనచే సంపాదింపనగును. ఈవిషయమే వసిష్ఠమహర్షి "మానసీర్వాసనాః పూర్వం త్యక్త్వా విషయవాసనాః। మైత్ర్యాదివాసనా రామ గృహాణామలవాసనాః॥" అని మున్నెన్నడో చెప్పెను. ఈశ్లోకమునందు గల విషయవాసనాశబ్దముచే పూర్వమునందు చెప్పబడిన లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన అనెడి మూడు వాసనలను గ్రహింపనగును. మానసవాసనాశబ్దముచే కామక్రోధదంభదర్పాద్యాసురసంపత్తును గ్రహింపనగును. లేక శబ్దస్పర్శరూపరసగంధములు, విషయములు, వాటియొక్క భుజ్యమానత్వదశవలన జనించు సంస్కారము విషయవాసన యని యనబడును. శబ్దస్పర్శరూపరసగంధములయొక్క కామ్యమానత్వదశవలన జనించిన సంస్కారము మానసవాసన యనబడును. యీపక్షమున పూర్వమునందు చెప్పబడిన లోకవాసన, శాస్త్రవాసన, దేహవాసన, అభ్యంతరవాసన అనెడి నాలుగువాసనలు బాహ్యాభ్యంతరవాసనలకంటె వేరే వాసనలు లేనందున పైన చెప్పబడిన "విషయవాసన, మానసవాసన" అను రెండు వాసనలలోనే యంతర్భవించుచున్నది. అట్టివాసనల పరిత్యాగమనగ నట్టి వాసనలకు విరుద్ధమైన మైత్ర్యాదివాసనలను పుట్టించుటయే. ఆ మైత్ర్యాదివాసనలు భగవంతుడగు పతంజలిచే సూత్రితములు. పూర్వమునందు సంక్షేపముగ నాచే వ్యాఖ్యాతమైనను తిరిగి యిచట వ్యాఖ్యానించుచుంటిని.

చిత్తము రాగ ద్వేషపుణ్యపాపములచే కలుషమై చేయబడును. మోహామువలన ననుభవింపబడుచుండిన సుఖము ననుసరించి బయలువెడలు "సర్వం సుఖజాతీయం మే భూయాత్" (నిఖిలసుఖజాతీయము నాకు సంభవించుగాక) అను రాజసమగు నొకానొక వృత్తివిశేషమే రాగము. అది సుఖానుశాయి. అట్టి సుఖము దృష్టాదృష్టసామాగ్రి లేమింజేసి సంపాదించుటకు శక్యముకానందున నారాగము చిత్తమును కలుషముగ జేయును. ఎపుడు సుఖవంతులగు ప్రాణులయందు "సర్వే ప్యేతే సుఖినో మదీయాః" (సుఖవంతులగు ఈసర్వులు నావారలే అని మైత్రిని భావన చేయునో అపుడు వారల సుఖములు స్వకీయముగనే సంపన్నములు అనిభావించువానికి— ఎట్లు తనకు రాజ్యము నివర్తించినను పుత్రాదుల రాజ్యమును స్వకీయముగ భావించువానికి రాజ్యమునందు రాగము నివృత్తమైనట్లు సుఖమునందు రాగము నివృత్తమగును. రాగము నివృత్తమైయుండ చిత్తము నిర్మలమగును. "ఇట్టి దుఃఖ మెపుడు నాకు ప్రాప్తింపకుండు గాక" అనెడి తమోనుగత రంజః పరిణామ మగు దుఃఖము ననుసరించి బయలు వెడలిన యొకానొక ధీవృత్తివిశేషమే ద్వేష మనబడును. అది దుఃఖానుశాయి. ఆ దుఃఖము శత్రువ్యాఘ్రాదులుండు తరి నివారించుటకు శక్యము కాదు. దుఃఖహేతువులగు శత్రువ్యాఘ్రాదులన్ని

టిని సంహరించుట యెవరికిని శక్యము కాదు. కానసాద్వేషము యెల్లపుడు హృదయమును దహింపజేయును. ఏసమయమున "తనకువలె యితరులందరికిని దుఃఖము సంభవింపకపోవుగాక" అని కరుణను దుఃఖము కలవారల విషయమై భావనచేయునో యట్టి సమయమున వైరాదిద్వేషము నివర్తించును. ద్వేషము నివర్తింప చిత్తము ప్రసన్న మగును. ఈవిషయమే "ప్రాణా యథాఽఽత్మనోఽభీష్టా భూతానా మపి తే తథా । ఆత్మౌపమ్యేన భూతేషు దయాం కుర్వన్తిసాధవః" అను స్మృతియు బోధించుచున్నది. "ఆత్మౌపమ్యేన సర్వత్ర" అను శ్లోకముచే శ్రీకృష్ణపరమాత్మయు నీవిషయమునే బోధించెను. అట్లేప్రాణులు స్వభావముచేతనే పుణ్యము ననుష్ఠింపరు. పాపమునైతే యనుష్ఠించెదరు. ఈవిషయమునే "పుణ్యస్య ఫల మిచ్ఛన్తి పుణ్యం నేచ్ఛన్తి మానవాః । న పాప ఫల మిచ్ఛన్తి పాపం కుర్వన్తి యత్నతః" (మానవులు పుణ్యఫలమును మాత్రము కోరెదరు. పుణ్యమును మాత్రము కోరరు. పపాఫలమునుమాత్రము కోరరు. ప్రయత్నముతో పాపమును చేయుదురు) అను స్మృతియు బోధించుచున్నది. పుణ్యమాచరింపబడనిదై, పాప మాచరింపబడినదై పశ్చాత్తాపమును జనింపజేయును. ఈవిషయమునే "కి మహగ్ం సాధు నాకరవం । కి మహం పాప మకరవం" అను శ్రుతి బోధించుచున్నది పుణ్యపురుషులయందు ముదితను భావించినచో యీవాసనావంతుడు స్వయముగనే యప్రమత్తుడై పుణ్యకర్మయందు ప్రవర్తించును. ఈవిషయమే "కర్మాశుక్లకృష్ణం యోగిన స్త్రివిధ మితరేషాం" అయోగులకు శుభకర్మ మని, యశుభకర్మయని, శుభాశుభకర్మమని కర్మము మూడువిధములు. అట్లే పాపపురుషులయం దుపేక్షను భావించుచు స్వయముగ తానుకూడ యట్టి వాసన కలవాడై పాపములనుండి నివర్తించును. దానివలన పుణ్యాకరణ పాపకరణములవలన జనించు పశ్చాత్తాపము సంభవింపదు. పశ్చాత్తాపము లేమిచేతనే చిత్తము ప్రసన్న మగును. ఇట్లే సుఖవంతులయందు మైత్రిని భావించు వానికి రాగమే నివరింపదు. మరేమనిన? అసూయేర్ష్యాదులుకూడ నివర్తించును. పరగుణములయందు దోషావిష్కరణ మసూయ యనబడును. పరగుణములను సహింపలేకపోవుట యీర్ష్య యని యనబడును. యెపుడు మైత్రివలన పరసుఖము స్వీయసుఖ మగునో అపుడు పరగుణములయందసూయాదిక మెట్లుసంభవించును? సంభవము కాదు. అట్లే దుఃఖవంతులయందు కరుణను భావించువానికి శత్రువధాదుల నాచరించు ద్వేష మెపుడు నివర్తించునో యపుడే దుఃఖిత్వవిరోధియగు స్వసుఖిత్వ ప్రయుక్తదర్పముకూడ నివర్తించును. ఇట్లే దోషాంతరనివృత్తికూడ యూహింపనగును. వాసిష్ఠరామాయణాదులయందీ విషయము స్పష్టముగ జెప్పబడెను. ఇట్టి తత్త్వజ్ఞానము, మనోనాశనము, వాసనాక్షయమనెడి మూడును్న యభ్యసింపదగినవి. అందు యేదోయొక ద్వారముచే మాటిమాటికి తత్త్వానుస్మరణముతత్త్వజ్ఞానాభ్యాస మనబడును. ఈవిషయమే "తచ్చిన్తనం తత్కథన మన్యోన్యం తత్ప్రబోధనమ్ । ఏతదేకపరత్వంచ బ్రహ్మాభ్యాసం విదుర్బుధాః ॥ సర్గాదావేవ నోత్పన్నం దృశ్యం నాస్త్యేవ సర్వదా । ఇదం జగ దహం చేతి బోధాభ్యాసం విదుః పరమ్" (తత్త్వచింతనము, అన్యోన్యముతత్త్వకథనము, అన్యోన్య తత్త్వప్రబోధము యనెడి తదేకపరత్వమునే బ్రహ్మాభ్యాసమునుగ విద్వాంసులు తెలుసుకొనుచున్నారు. సర్గాదియందే యుత్పన్నము కాదు. యెల్లపుడు దృశ్యములేదు. ఈజగత్తు నేనే అని దానిని యుత్కృష్టమైన బోధాభ్యాసమునుగ తెలిసికొనుచున్నారు. అని చెప్పబడెను మనోనిరోధాభ్యాసము దృశ్యాభ్యాసవిరోధియోగాభ్యాసమే యని "అత్యన్తాభావసంపత్తౌ జ్ఞాతుర్జ్ఞేయస్య వస్తునః । యుక్త్యా శాస్త్రైర్యతన్తే యే తే ఽత్రాభ్యాసిన స్థితాః" జ్ఞాతృజ్ఞేయములయందు మిథ్యాత్వబుద్ధియే యభావసంపత్తి యనబడును. సర్వరూపముచే గూడ యప్రతీతి అత్యంతాభావసంపత్తి యనబడును. దానినిమిత్తము యోగముచేతను, శాస్త్రములచేతను యెవరు యత్నించెదరో వారును యభ్యాసులు అని చెప్పబడెను. "దృశ్యాసంభవ బోధేన రాగద్వేషాది తానవే । ప్రీతి(రతి) ర్ఘనోదితా యాఽసౌ బ్రహ్మాభ్యాస స్స ఉచ్యతే" దీనిచే రాగద్వేషాది క్షీణతారూప వాసనాక్షయాభ్యాసము చెప్పబడెను. కాన నేతత్తత్త్వజ్ఞానాభ్యాసముచేతను, మనోనాశాభ్యాసముచేతను, వాసనాక్షయాభ్యాసముచేతను, రాగద్వేషశూన్యుడగుటచే యెవడు స్వపరదుఃఖాదులయందు సమదృష్టికలవాడో యట్టివాడు పరమయోగి యనబడును. ఎవడు విషమదృష్టికలవాడో యట్టివాడు తత్త్వజ్ఞానవంతుడైనను అపరమయోగి యనబడును. ॥౩౨॥

గీ॥ యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన ।
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥ ॥33॥

పదవిభాగము:— యః-అయం-యోగః-త్వయా-ప్రోక్తః-సామ్యేన-మధుసూదన-ఏతస్య-అహం-న-పశ్యామి-చంచలత్వాత్-స్థితిం-స్థిరామ్.

ప్రతిపదార్థము:— హేమధుసూదన=ఓశ్రీకృష్ణ; త్వయా=నీచే; యః అయం=ఏ ఈ; యోగః=యోగము; సామ్యేన=సామ్యముతోగూడ; ఉక్తః=చెప్పబడెనో; ఏతస్య=అయీయోగమునకు; స్థిరాం=స్థిరమైన స్థితిం=ఉనికిని: మనసః=(ఈపదముధ్యాహార్యము) మనస్సు;చంచలత్వాత్=చంచలమైనదగుటవలన;అహం=నేను న పశ్యామి=చూడను; ॥33॥

---

శాంకరభాష్యమ్:—

ఏతస్య యథోక్తస్య సమ్యగ్దర్శనలక్షణస్య యోగస్య దుఃఖసంపాద్యతా మాలక్ష్య శుశ్రూషు ర్ధ్రువం తత్ప్రాప్త్యుపాయమ్— యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన సమత్వేన హే మధుసూదన! ఏతస్య యోగస్యాహం న పశ్యామి నోపలభే చంచలత్వా న్మనసః కిం స్థిరా మచలాం స్థితిం ప్రసిద్ధ మేతత్ ॥33॥

---

శాంకరభాష్యతత్త్వబోధిని:—

సమ్యగ్దర్శనరూపము, పూర్వోక్తము నగు యీయోగము దుస్సంపాద్యమని యూహించి, తత్ప్రాప్త్యుపాయమును వినగోరినవాడై యర్జునుడు యిట్లు పలికెను— ఓమధుసూదనా! సమ్యగ్దర్శనరూపమగు యోగమును నీవుపదేశించితివి. కాని మనస్సు స్వభావముచే చంచలమైన దగుటచే నీయోగమునకు స్థిరమైన స్థితి సంభవింప దని యూహించుచుంటిని. ॥33॥

---

శంకరానందీయము:— "సర్వభూత సుహృచ్ఛాంత, జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయా త్పాపస్య కర్మణః" అనుస్మృతివలన సర్వభూత సుహృత్తుగనుండి మనోవాక్కాయకర్మలచే ప్రాణులకు పీడచేయనివానికే శ్రవణము, మననము, తజ్జన్యజ్ఞానము, జ్ఞానఫలమగు మోక్షము సిద్ధించును. మరియొకనికి సిద్ధింపదు. కాన శ్రవణాదినిష్ఠుడైన ముముక్షువగు యతి— తనసామ్యముచే సర్వప్రాణుల సుఖదుఃఖములను తెలిసికొని వారల కుపద్రవమెటులను చేయరాదని బోధించుటకు "ఆత్మౌపమ్యేన" అని చెప్పుచుండెను.

సర్వప్రాణి సుఖదుఃఖవేదన కర్మలయందు తనసామ్యముచే సర్వప్రాణులయందుకల సుఖదుఃఖము లను సమముగ నెవడు చూచునో అనగా యెట్లు తనకు సుఖమిష్టము, దుఖమనిష్టము, యగునో యట్లే సర్వప్రాణులకు సుఖమిష్టము, దుఃఖమనిష్టమని తెలిసికొని వాఙ్మనఃక్రియలచే పరులకు కొంచమైన యెప్పుడైన యెటులైన విక్షేపము చేయడో, ఇట్టి లక్షణములుకల యీ యతియుత్కృష్టుడని సమ్మతుడు.

లేక, నిత్యముక్తస్వరూపముచేతనే యెటుల నేను దేహతద్ధర్మకర్మసుఖదుఃఖాది సంబంధరహితుడనో అట్లే యీసర్వదేహులు దేహతద్ధర్మకర్మ సుఖదుఃఖాది సంబంధరహితులే యని యాత్మ సామ్యముచే విచారింప నందరకు నిత్యముక్తత్వమును ప్రత్యగ్దృష్టిచే తెలిసికొనినవాడైనను బాహ్యదృష్టిచే సుఖమును, దుఃఖమును తనతో సమముగ యే బ్రహ్మవేత్త సర్వభూతములయందు చూచునో "కీటవద్విచరే న్మహీం" కీటకమువలె భూమిని (యందు) సంచరింపవలెను, అనునది మొదలగు స్మృతిప్రామాణ్యమువలన నేను ముక్తుడను. కానవాకు పాపలేశ మెంతమాత్రము లేదను యభిమానమును విడచి యంతట యాత్మబుద్ధిచే ప్రాణిమాత్రమునకు విక్షేపము నెవడు చేయడో ఇట్లు సర్వప్రాణులయందు స్వబుద్ధిచే యనుకూలవర్తియగు యీయోగి (యోగనిష్ఠుడు) అను బ్రహ్మవిత్తగు యతి సర్వజ్ఞానులలోను యుత్తముడని యభిమతము. ॥32॥

గీ॥ చంచలం హి మనః కృష్ణ! ప్రమాథి బలవ ద్దృఢం ।
తస్యాహం నిగ్రహం మన్యే వాయో రివ సుదుష్కరమ్ ॥ ॥౩౪॥

పదవిభాగము:— చంచలం-హి-మనః కృష్ణ-ప్రమాథి-బలవత్- దృఢం-తస్య-అహం-నిగ్రహం మన్యే-వాయోః -ఇవ-సుదుష్కరం.

ప్రతిపదార్థము:— హేకృష్ణ=ఓకృష్ణభగవానుడా; మనః=మనస్సు, చంచలం=చంచలమైనదియు, ప్రమాథి=మథించెడిస్వభావముకలదియు; బలవత్=బలము-కలదియు, దృఢం=దృఢమైనదియు, భవతి (ఈపదము ధ్యాహార్యము) అగుచున్నది; అహం=నేను; వాయోరివ=వాయువునకంటెకూడ (ఇవశబ్దముఅప్యర్థకము) తస్య=ఆమనస్సుయొక్క; నిగ్రహం=నిగ్రహమును; దుష్కరం=చేయుటకశక్యమైనదిగ;మన్యే=తలచుచుంటిని. ॥౩౪॥

—:౬వ అధ్యాయము ౩౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు

మధుసూదనసరస్వతీయము:— చెప్పినయర్థము నాక్షేపించుచు యర్జునుడు "యో౽యం యోగః" అని చెప్పుచుండెను.

సర్వత్రసమదృష్టి స్వరూపమగు ఏ యీయోగము పరమయోగమో అనగా సమత్వముచే-విషమదృష్టిహేతువులగు చిత్తగతమైన రాగద్వేషాదుల నిరాకరణపూర్వకమైన ఏ యోగము సర్వజ్ఞుడవగు నీచే చెప్పబడెనో సర్వశైదికకర్మ పరిత్యాగుడవైన యో శ్రీకృష్ణ! నీచే చెప్పబడిన సర్వవృత్తినిరోధరూపమగు యోగము యొక్క దీర్ఘ కాలానువర్తియగు స్థితినితలవను. నేను కాని, నావంటివాడు కాని యోగాభ్యాస నిపుణుడు తలపడు. యెందునిమిత్తము స్థితినితలవ డనెదవా? మనస్సు చంచలమగుటవలన నట్టి యోగమునకు స్థితినితలపడు. ॥౩౩॥

శంకరానందీయము:— "ఆత్మసంస్థం మనఃకృత్వా నకించిదపి చింతయేత్" "యథాదీపో నివాతస్థో నేఙ్గతే సోపమాస్మృతా" ఇద్యాది శ్లోకములచే మనస్సున కాత్మ సంస్థత్వము, నివాతస్థ ప్రదీపమువలె నిశ్చలత్వము యోగులచే యోగసిద్ధికొరకు సంపాదింప దగినదని యంతః కరణ కాత్మసంస్థితత్వ స్థిరత్వముల సిద్ధి కుపాయజిజ్ఞాసచే "యః" అను దానిచే యర్జునుడు చెప్పుచుండెను,

"యోగీ యుంజీతసతతం" ఇత్యాదికముచే చెప్పబడిన ముముక్షువు కైవల్యార్థియగు యతికి కర్తవ్యముగ ఏ ధ్యానయోగము సాధారణ్యముగ నీచే చెప్పబడెనో అట్టి ధ్యానయోగము మనోనిరోధ సాధననిరూపణ పురస్సరముగ నీచే చెప్పబడలేదు. కాన మనస్సు చంచలమైనదగుటచే యీప్రతిపాదితమైన యోగము యొక్క స్థితిని అనగా బ్రహ్మమునందంతః కరణ స్థిరీభావమునకు హేతువును (సాధనమును) నేనెరుగను. ॥౩౩॥

—: ౬వ అధ్యాయము—౩౪వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— సర్వలోక ప్రసిద్ధమగుటచే మనస్సుయొక్క చాంచల్యమునే "చంచలంహి" అను శ్లోకముచే నుపపాదనము చేయుచుండెను.

మనస్సు యెల్లపుడు చలనస్వభావము కలదని ప్రసిద్ధమే. ఇట "హి" అనుపదము ప్రసిద్ధార్థకము. "భక్తానాం పాపాదిదోషా న్సర్వథా నివారయితుం మశక్యానపి కృషతి=నివారయతి తేషామేవసర్వథా ప్రాప్తుమశక్యానపి పురుషార్థానా కర్షతి=ప్రాపయతీతివా కృష్ణః" ఎన్నివిధములచేతను నివారించుట కశక్యమైన భక్తుల పాపాదిదోషములను నివారించువాడు కాన "కృష్ణః" అని చెప్పుచున్నాడు లేక, యెన్నివిధములచేతనైన పొందుటకు శక్యముకాని పురుషార్థములను భక్తులకు పొందించువాడు కాన "కృష్ణః" అని చెప్పబడుచున్నాడు. అట్టి కృష్ణపదముచే సంబోధించుటవలన చిత్తచాంచల్యము దుర్నివార్యమైనను అట్టి చిత్తచాంచల్యమును నివారించి పొందుట కశక్యమైనను సమాధిసుఖమును నీవెపొందుటకు సమర్థుడవని సూచింపబడెను. మనస్సు కేవలము చంచలమే కాదు. మరేమనిన? "ప్రమాథి" శరీరమును ఇంద్రియములను క్షోభపెట్టు స్వభావముకలది. క్షోభక మగుటచే శరీరేంద్రియ సంఘాతమునకు వివశతాహేతువు. మరియు "బలవత్" అభిప్రేతమైనవిషయమునుండి ఏ యుపాయముచేతనుకూడ నివారించుట కశక్యమైనది. మరియు "దృఢం విషయవాసనా సహస్రాను-

శాంకరభాష్యమ్:—

చంచల మితి। చంచలం హి మనః కృష్ణేతి కృషతే ర్విలేఖనార్థస్య రూపం। భక్తజనపాపాదిదోషాకర్షణాత్ కృష్ణః। న కేవల మత్యర్థం చంచలం, ప్రమాథిచ ప్రమథనశీలం ప్రమథ్నాతి శరీర మింద్రియాణిచ విక్షిపతి పరవశీకరోతి। కించ బలవన్న కేనచి న్నియంతుం శక్యం। కించ దృఢం తంతునాగవ దచ్ఛేద్యం తస్యైవంభూతస్య మనసోఽహం నిగ్రహం నిరోధం మన్యే వాయో రివ। యథా వాయోః దుష్కరో నిగ్రహస్తతోపి మనసో దుష్కరం మన్య ఇత్యభిప్రాయః ॥ ॥౩౪॥

శాంకరభాష్యార్థబోధినీ —

భక్తుల పాపాదిదోషముల నాకర్షించు యో కృష్ణా! మనస్సుచంచలమైనది. మరియు శరీరమును, ఇంద్రియములను క్షోభింపజేయును. ఎవనిచేతను. నియమింపబడునట్టిది కాదు. కాన బలిష్ఠమైనది. (అభిప్రేతవిషయమునుండి మరలించుటకు శక్యముకానిది). మరియు దృఢమైనది. అనగా తంతునాగము (వరుణపాశ మనెడి జలచరము) వలె దృఢమైనదగుటచే ఛేదించుట కశక్యమైనది. కాన యట్టి మనస్సును నిగ్రహించుట వాయువును నిగ్రహించుటకంటె గూడ దుష్కరమైనదిగ నేను తలంచెదను. ॥౩౪॥

---

దుర్భేద్యమగుటచే ఛేదించుట కశక్యము. (శ్రీమద్భాష్యకారులు "తన్తునాగవదచ్ఛేద్యం" అనిదృష్టాంత మొసగిరి. తంతునాగమనగ నాగపాశము. నాగపాశమువలె దృఢమైనదని గ్రహింపవగును. లేక తంతునాగమనగ మహాహ్రదనివాసియగు జంతు విశేషము. (అగుడు) అది అతిదృఢమగుటచే బలముకలది. అట్టి బలము కలదానికంటె బలము కలదగుటచే ప్రమథనశీలముకలవాటినిగూడ బరిమార్చున దగుటచే యతిచంచలము. మహామత్త వనగజమును బంధించుట యెటుల శక్యము కాదో అట్లే ఇట్టిమనస్సు యొక్క నిగ్రహము (నిర్వృత్తికముగ స్థాపనము) సర్వదా చేయుటకశక్యము, అనితలచెదను. మరి యెట్లుదుష్కరమని తలచెద వనెదవా? ఆకాశమునదోధూయమానమైనవాయువునకు నిశ్చలత్వమును సంపాదించి నిరోధించుట యెట్లశక్యమో యట్లే మనోనిగ్రహమశక్య మని యర్థము.

తత్త్వజ్ఞానము కలిగినను ప్రారబ్ధకర్మభోగముకొఱకు జీవించియున్న పురుషునియొక్క కర్తృత్వభోక్తృత్వసుఖదుఃఖరాగద్వేషాది స్వరూపమగు చిత్తధర్మము క్లేశహేతువగుటవలన బాధితానివృత్తిచేత బంధమగును. చిత్తవృత్తినిరోధరూపమగు యోగముచే యా బంధనివారణమే జీవన్ముక్తి యనబడును. యీ జీవన్ముక్తి సంపాదనచే "స యోగీ పరమో మతః" అని చెప్పబడెనో యట్టి జీవన్ముక్తి యోగముచేబంధనివారణమే. ఇచట యొకవిషయము ప్రశ్నింపవలసియున్నది అదియేమనిన? యోగముచేబంధము సాక్షివలన నివారింపబడునా? చిత్తము వలన నివారింపబడునా? తత్త్వజ్ఞానముచేతనే సాక్షివలన బంధము నివారింపబడియుండ యోగముచే సాక్షివలన బంధము నివారింపబడునని చెప్పుట సంభవము కాదు. స్వభావవిపర్యయము సంభవింపనందునను, బంధనివృత్తికి విరోధియగు ప్రారబ్ధకర్మ యుండుటవలనను బంధము చిత్తమునుండి నివర్తించు నను రెండవపక్షము సంభవము కాదు. జలమునుండి ఆర్ద్రత్వమును, అగ్నినుండి యుష్ణత్వమును నివారించుట యొకనికశక్యము ! యొకనికినిశక్యము కాదు. "ప్రతిక్షణపరిణామినోహి భావా ఋతే చితి శక్తేః" అను న్యాయముచే చిత్తము ప్రతిక్షణము పరిణామస్వభావము కలదగుటవలన ప్రారబ్ధభోగముకల కర్మచే నిఖిలావిద్యాతత్కార్యనాశ మగుచుండ ప్రవృత్తమైన తత్త్వజ్ఞానమునకు గూడ ప్రతిబంధమునుచేసి (స్వప్రారబ్ధకర్మ) ఫలదానముకొఱకు దేహేంద్రియాదిక మువస్థాపితము. కర్మచే స్వఫలసుఖదుఃఖాదిభోగము చిత్తవృత్తులు లేనిదే సంపాదించుటకు శక్యము కాదు. కాన, విచా

శ్రీభగవానువాచ:—

గీ॥ అసంశయం మహాబాహో! మనో దుర్నిగ్రహం చలమ్।
అభ్యాసేన తు కౌంతేయ! వైరాగ్యేణ చ గృహ్యతే॥ ॥౩౫॥

పదవిభాగము:— అసంశయం-మహాబాహో!-మనః-దుర్నిగ్రహం-చలం-అభ్యాసేన-తు-కౌంతేయ!-వైరాగ్యేణ-చ-గృహ్యతే ॥౩౫॥

ప్రతిపదార్థము:— హేమహాబాహో!=దీర్ఘబాహువులుకలయో అర్జునుడా!; చలం=చంచలమైన; మనః=మనస్సు; దుర్నిగ్రహం=నిరోధించుటకుశక్యముకానిది; ఇత్యత్ర=(ఈప్రదమధ్యాహారము) ఈవిషయమునందు; అసంశయం=సంశయములేదు; హేకౌంతేయ=కుంతీపుత్రుడవగు నోయర్జునా; తత్=(ఈపదమధ్యాహార్యము) అమనస్సు: అభ్యాసేనతు=అభ్యాసముచేతను; వైరాగ్యేణచ=వైరాగ్యముచేతను; గృహ్యతే=నిగ్రహింపబడుచున్నది. (నిరోధింపబడుచున్నది.) ॥౩౫॥

---

రింప స్వాభావికమైనను చిత్తవృత్తుల యభిభవమతికష్టముగ యోగముచే శక్యమయ్యెడిని. కాని తత్త్వజ్ఞానమువలె యోగమునకంటెకూడ ప్రారబ్ధఫలముకల కర్మయొక్క (ప్రాబల్యమువలన చిత్తమునకు చాంచల్య మవశ్యభావియై యుండ యోగముచే చిత్తచాంచల్యనివారణ మశక్యమని నాబుద్ధ్యనుసారము నేను తలచెదను. కాన "ఆత్మౌపమ్యేన సర్వత్ర సమదర్శీ పరమో యోగీ మతః" అని చెప్పుట మంచిదికాదని యర్జునుని యాక్షేపము. ॥౩౪॥

శంకరానందీయము:— పూర్వమునందు చెప్పినవిషయమునే సవిశేషముగ "చంచలం" అను శ్లోకముచే చెప్పుచుండెను.

"కృషి ర్భూవాచక శ్శబ్దో ణశ్చ నిర్వృతివాచకః। తయోరైక్యం పరం బ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే" కృష్ధాతువు భూవాచకము, ణకారము నిర్వృతివాచకము. భూనిర్వృతులైక్యమే పరం బ్రహ్మ. అట్టిపరంబ్రహ్మమే "కృష్ణ" అని చెప్పబడును. సదానందరూపమగుటవలన పరమాత్మ శ్రీకృష్ణుడని చెప్పనొప్పును. అతనికి సంబుద్ధి "హేకృష్ణ!" అనునది. ఓకృష్ణపరమాత్మ! మనస్సు చంచలమైనది. విచారింప కనురెప్పలు చపలమైనవే కాని వానివలన యనర్థమేమియులేదు. మనస్సట్టిదికాదు. మరేమనిన? "ప్రమాథి" తత్తద్విషయవాసనలచేతను, తత్కార్యములగు రాగద్వేషలోభాదిదోషములచేతను,ధీరపురుషునికూడ విక్షోభముకలవానినిగ జేయును, ఏమిచెప్పవలయును.? పండితునికూడ పరవశునిగ జేయునది. విచారింప సర్పవిషాదికముగూడ ప్రమథనస్వభావముకలదే అయినను మంత్రాదులచే నావిషము నిగ్రహించుటకు శక్యమగును. అట్టి మనస్సు బలవత్తగుటవలన, సారవత్తగుటవలన, మహావేగముకలదగుటవలన స్వశక్తిచే వేగముకలదగుటవలన మంత్రాదులచే యరికట్టుటకు సాధ్యము కాదు. యెట్లు మహావేగముకల బాణములు సాధనాంతరముచే ఛేదించుట శక్యములో అట్లు మనస్సును ఛేదించుటకు వీలుపడదు. ఎందువలననిన "దృఢం" వజ్రసారము కలది, సూక్ష్మమైనది. కాన ఛేదించుటకు వీలుపడదు. ఇట్టి లక్షణములుకలది మనస్సు. కాన, యీమనస్సుయొక్క నిగ్రహము ఆకాశమున మహావేగముకల వాయువుయొక్క నిగ్రహమువలె కోటి యుపాయములచే గూడ సుతరాం శక్యముకాదు. "అప్యబ్ధిపానా న్మహత స్సుమేరూన్మూలనా దపి। అపి వహ్న్యశనా త్సాధో! విషమశ్చిత్తనిగ్రహః" సముద్రమును మ్రింగుటకంటెను, గొప్పదగు మేరుపర్వతమును పెల్లగించుటకంటెను, వహ్నిని మ్రింగుటకంటెను, చిత్తనిగ్రహము విషమమైనది. (కష్టమైనది) అను శాస్త్రప్రసిద్ధిని "హి" అనుశబ్దము ద్యోతన చేయుచున్నది. ॥౩౪॥

—౬వ అధ్యాయము—౩౫వ శ్లోకవ్యాఖ్యావిశేషములు.—

మధుసూదనసరస్వతీయము:— అర్జునుని యాక్షేపమును పరిహరించుచు శ్రీకృష్ణపరమాత్మ "అసం

శాంకరభాష్యమ్:—

ఏవ మేతద్యథా బ్రవీషి—అసంశయం నాస్తి సంశయో మనో దుర్నిగ్రహం చలమిత్యత్ర హే మహాబాహో! కింత్వభ్యాసేన త్వభ్యాసో నామ చిత్తభూమౌ కస్యాం చిత్సమానప్రత్యయావృత్తి శ్చిత్తస్య। వైరాగ్యం నామ దృష్టాదృష్టేష్టభోగేషు దోషదర్శనాభ్యాసాద్వైతృష్ణ్యం, తేనచ వైరాగ్యేణ గృహ్యతే విక్షేపరూపః ప్రచార శ్చిత్తస్యైవం తన్మనో, గృహ్యతే నిగృహ్యతే నిరుధ్యత ఇత్యర్థః

శాంకరభాష్యతత్పర్యబోధిని:—

దీర్ఘబాహువులుకలయోయర్జునా! చంచలమైన మనస్సును నిగ్రహించుట కష్టసాధ్యము. నీవు చెప్పినమాటనిజమే. ఇట సందేహములేదు. కాని ఈచిత్తభూమియందు సమానప్రత్యయావృత్తిరూపమైన యభ్యాసముచేతను, దృష్టములు, అదృష్టములునైన ఇష్టభోగములయందు దోషదర్శనాభ్యాసముచే గలిగిన తృష్ణారాహిత్యము వైరాగ్యమనబడును. అట్టివైరాగ్యము చేతను విక్షేపరూపమగు చిత్తప్రచారము నిరోధింపబడును. ఈవిధముగ మనస్సు నిరోధింపబడును. ॥౩౫॥

శయం" అనిచెప్పుచుండెను. నీయొక్క చిత్తచేష్టితము లెస్సగ తెలియబడెను. కాన చిత్తము నిగ్రహించుటకు నీవుసమర్థుడవు కాగలవు. అను సంతోషముచే "హేమహాబాహో!" అని అర్జునుని సంబోధించుచుండెను. సాక్షాన్మహాదేవునిచే కూడ చేయబడినప్రహారణములు కల బాహువులుకల యోఅర్జునా! అని నిరతిశయమగు యుత్కర్ష యర్జునకు సూచింపబడెను. ప్రారబ్ధకర్మప్రాబల్యమువలన యసంయతాత్మచే దుఃఖముచేగూడమనస్సు నిగ్రహించుటకు శక్యము కానిది. అని "ప్రమాథి, బలవత్, దృఢం, అని విశేషణత్రయము కలిపిచెప్పబడెను. స్వభావముచే చంచలమైనది మనస్సు అని యనుటయందు సంశయము లేదు. ఈవిషయమై సత్యమునే పలుకుచుంటివి. ఇట్టిదైనను సమాధిమాత్రోపాయముకల యోగిచే యభ్యాసముచేతను, వైరాగ్యముచేతను, ఇట్టి మనస్సు సర్వవృత్తిశూన్యముగ చేయబడును. ఇచట "తు" అను శబ్దము నిగ్రహములేనియసంయతాత్మకంటె నిగ్రహముకల సంయతాత్మకు విశేషము కలదని సూచించుటకుప్రయోగింపబడెను. కేవల వైరాగ్యముచేతను కాని, లేదా యభ్యాసముచేతను కాని మనోనిగ్రహము సాధ్యము కాదు. మరేమనిన? వైరాగ్యము, అభ్యాసము యీరెండును "సముచ్చిత్య" కలసియే మనోనిగ్రహమునకు సాధనములని సూచించుటకు సముచ్చయార్థకమగు "చ" అను శబ్దము ప్రయోగింపబడెను. "కౌన్తేయ" అను సంబుద్ధిచే నీవు నాతండ్రి తోబుట్టువగు కుంతికుమారుడవు. అవశ్యము నాచే నీవు సుఖవంతుడవుగ జేయదగినవాడవని స్నేహసంబంధసూచనచే యూరడించుచుండెను.

ఈశ్లోకపూర్వార్థముచే చిత్తమునకు హఠనిగ్రహము సంభవింపదని, ఉత్తరార్థముచే క్రమనిగ్రహము సంభవించునని చెప్పబడెను. మనోనిగ్రహము- హఠనిగ్రహమని, క్రమనిగ్రహమని రెండువిధములు. అందు చక్షుశ్శ్రోత్రాది జ్ఞానేంద్రియములు, వాక్పాణ్యాది కర్మేంద్రియములున్న వాటి గోళకమాత్రపిధానముచే హఠాత్తు నిగ్రహింపబడును. అదృష్టాంతముచే మనస్సును కూడ నిగ్రహించెదనని మూఢునికి భ్రాంతికలుగును. మనోగోళకమైన హృదయకమలము నిరోధించుటకు శక్యము కానందున గోళకనిరోధద్వారా జ్ఞానేంద్రియ కర్మేంద్రియములను నిగ్రహించునటుల మనస్సు నిగ్రహించుటకును శక్యము కాదు. కనుకనే క్రమనిగ్రహము యుక్తము. ఈవిషయమునే వశిష్ఠుడు క్రిందివిధముగ జెప్పెను. "ఉపవిశ్యోపవిశ్యైక చిత్తజ్ఞేన ముహుర్ముహుః। శక్యతే నమనో జేతుం వినా యుక్తిమనిన్దితామ్ ॥ అంకుశేన వినా మత్తో యథా దుష్టమతంగజః ।అధ్యాత్మ

విద్యాధిగమః సాధుసంగమ ఏవచ ॥ వాసనాసంపరిత్యాగః ప్రాణస్పన్దనిరోధనమ్ । ఏతా స్తా యుక్తయః పుష్టా స్సన్తి చిత్తజయే కిల ॥ సతీషు యుక్తి ష్వేతాసు హఠా న్నియమయన్తి యే । చేత స్తే దీప ముత్సృజ్య వినిఘ్నన్తి తమోంజనైః” అంకుశమునువిడిచి దుష్టమతంగజమును జయించుట కెట్లుపీలుపడదో యట్లే చిత్తస్వభావమును దెలిసినవానిచే మాటిమాటికి కూర్చుని కూర్చుని యనిందితమగు యుక్తిని విడచి మనస్సును జయించుటకు శక్యము కాదు. అధ్యాత్మవిద్యను పొందుట, (తెలిసికొనుట) సాధుసాంగత్యము, వాసనాపరిత్యాగము, ప్రాణచలననిరోధము అను యీ నాలుగును పరిపుష్టమై చిత్తజయమునందు సాధనము లగుచున్నవి. ఈ నాలుగు యుక్తులుండ వీటిని విడచి యెవరు హఠాత్తు చిత్తమును నిగ్రహించుటకు యత్నించెదరో వారు దీపమును విడిచి యంజనములచే (కాటుకచే) చీకటిని తొలగించువారే యగుదురు. అనగా చీకటిని తొలగించు ప్రదీపమును విడిచి యంజనముచే చీకటిని తొలగించెదనను వాడెట్టి హాస్యాస్పదుడో అట్లే చిత్తనిగ్రహమునకు తగు సాధనములు, అధ్యాత్మవిద్యాధిగమము, సాధుసాంగత్యము, వాసనాపరిత్యాగము, ప్రాణస్పందనిరోధము, అను నాలుగు ముఖ్యసాధనము లుండ వాటిని విడిచి హఠాత్తు మనస్సును నిగ్రహించెదనని మాటిమాటికి కూర్చుండిన చిత్తజ్ఞుడు హాస్యాస్పదు డగును.

క్రమనిగ్రహమునం దధ్యాత్మవిద్యాధిగమ మొక్కటియే యుపాయము. ఆ యధ్యాత్మవిద్యయన్ననో దృశ్యమునకు మిథ్యాత్వమును, దృగ్వస్తువునకు పరమార్థసత్యపరమానందస్వప్రకాశత్వమును బోధించును. అట్లగుచో యీమనస్సు మనోగోచరములగు దృశ్యములయందు మిథ్యాత్వముచే ప్రయోజనాభావమును, ప్రయోజనముకల పరమార్థసత్యపరమానందరూపమగు దృగ్వస్తువునందు స్వాగోచరత్వమును (మనస్సున కవిషయమగుటను) తెలిసికొని నిరింధనాగ్నివలె స్వయముగనే యుపశమించును. ఎవడు తత్త్వము బోధితమైనను లెస్సగ దెలిసికొనలేడో, ఎవడు తెలిసికొనినను తత్త్వమును మరచునో వారియువురకు సాధుసంగతియే యుపాయము. సత్పురుషులన్ననో మాటిమాటికి బోధించెదరు. మాటిమాటికి స్మరింపజేసెదరు.

ఎవడు విద్యామదాది దుర్వాసనచే పీడింపబడి, సాధువుల ననుసరించుట కుత్సాహమును పొందడో అట్టివానికి పూర్వమునందు చెప్పబడిన వివేకముచే వాసనాపరిత్యాగమే చిత్తనిరోధమునం దుపాయము. ఎవడు— వాసన లతిప్రబలములగుటవలన వాటిని త్యజించుటకు సమర్థుడు కాడో యట్టివానికి ప్రాణస్పందనిరోధమే మనోనిగ్రహమునం దుపాయము. ప్రాణస్పందము, వాసన యీరెండున్ను చిత్తప్రేరకములగుటవలన వానిరెంటి నిరోధముండినచో చిత్తనిరోధము (చిత్తశాంతి) సంభవించును. ఈవిషయమునే వసిష్ఠమహర్షి యీక్రిందివిధమున చెప్పెను.

“ద్వే బీజే చిత్తవృక్షస్య ప్రాణస్పన్దన వాసనే, ఏకస్మిం శ్చ తయోః క్షీణే క్షిప్రం ద్వే అపి నశ్యతః ॥ చిత్తమనెడి వృక్షమునకు ప్రాణస్పందమని, వాసన యని రెండుబీజములు కలవు. ఆరెంటిలో యేదోయొకటి నశించిన రెండును శీఘ్రముగ నశించును. “ప్రాణాయామ దృఢాభ్యాసై ర్యుక్త్యాచ గురుదత్తయా । ఆసనాశనయోగేన ప్రాణస్పందో నిరుధ్యతే ॥ ప్రాణాయామములను దృఢముగ నభ్యసించుటచేతను గురుప్రసాదిత యుక్తిచేతను, సిద్ధాసనాది యోగములచేతను, “అర్ధశాదనేన” అనురీతిని యశనాది సంబంధముచేతను ప్రాణస్పందము నిరోధింపబడును.

“అసంగవ్యవహారిత్వా ద్భవభావనవర్జనాత్ । శరీరనాశదర్శిత్వా ద్వాసనా న ప్రవర్తతే ॥ వ్యవహారములతో సాంగత్యములేనివాడగుటవలనను, సంసారభావనను వర్జించుటవలనను, శరీరము నశించునదే యని తెలిసికొనుటవలనను వాసన ప్రవర్తింపదు.

“వాసనాసంపరిత్యాగా చ్చిత్తం గచ్ఛ త్యచిత్తతామ్ ॥ ప్రాణస్పన్దనిరోధాచ్చ యథేచ్ఛసి తథాకురు ॥ వాసనను లెస్సగ విసర్జించుటవలన చిత్త మచిత్తత్వమును పొందును. ప్రాణస్పన్దనిరోధమువలనను చిత్త మచిత్తత్వమును పొందును. కాన నోరామచంద్ర ! వాసనాపరిత్యాగప్రాణస్పన్దపరిత్యాగమనెడి రెండింటిలో దేనిని నీవు కోరెదవో దానిని యాచరింపుము.

ఏతావన్మాత్రకం మన్యే రూపం చిత్తస్య రాఘవ; యద్భావనం వస్తునోఽన్తర్వస్తుత్వేన రసేన చ॥ యదా న భావ్యతే కించిద్ధేయోపాదేయరూపి యత్ । స్థీయతే సకలం త్యక్త్వా తదాచిత్తం న జాయతే । అవాసనత్వాత్సతతం యదాన మనుతే మనః॥ అమనస్తా తదోదేతి పరమాత్మ పదప్రదా" వస్తువు యంతర్వస్తువుగను, రసస్వరూపముగను, ఏ భావనముకలదో, దేనిని హేయోపాదేయ రూపము కలదానినిగ తలపదో చిత్తము యొక్క రూపమింతమాత్రమే యని నేను తలచెదను. ఎట్టిసమయమున సకలమును విడచియుండునో అట్టి సమయమున చిత్తము జనింపదు యెల్లపుడు వాసనలేనిదగుటచే మనస్సు యెపుడు దేనిని తలపదో యపుడు పరమాత్మపదము నిచ్చు యమనస్తత జనించును.

ఇచట ప్రాణస్పందనిరోధార్థము యభ్యాసము, వాసనాపరిత్యాగార్థము వైరాగ్యము అను రెండు యుపాయములే పర్యవసితములు. సాధుసంగతి, యధ్యాత్మ విద్యాధిగమ మన్నవో అభ్యాస వైరాగ్యోత్పాదకములగుటచే యన్యథాసిద్ధములై అభ్యాసవైరాగ్యములలోనే యంతర్భవించుచున్నవి. కనుకనే శ్రీకృష్ణ పరమాత్మచే "అభ్యాసేన వైరాగ్యేణ" అని అభ్యాసవైరాగ్యములు రెండే చెప్పబడెను. కనుకనే పతంజలియు "అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః" అభ్యాస వైరాగ్యములచేతనే మనోనిరోధము సంభవించునని పైసూత్రముచే చెప్పెను. పూర్వమునందు చెప్పబడిన ప్రమాణ, విపర్యయ, వికల్ప, నిద్రా, స్మృతులనెడి యయిదు విధములగు వృత్తులయొక్కయు, అసురములగుటచే క్లిష్టమగు యనంతవృత్తులయొక్కయు, దైవములగుటచే యక్లిష్టములగు సర్వవృత్తులయొక్కయు, నిరోధము నిరింధనాగ్నివలె యుపశమమనెడు పరిణామము అభ్యాసవైరాగ్యములనెడి రెంటిచేతనే కలుగును. యీరెండును సముచ్చిత్యకారణములు. ఈవిషయమే యోగభాష్యమునందు "చిత్తమను నది యుభయతఃప్రవాహములుకలదై ప్రవహించుచున్నది. కల్యాణముకొఱకు ప్రవహించుచున్నది. పాపముకొఱకును ప్రవహించుచున్నది అందు ఏ చిత్తనదీప్రవాహము కైవల్యప్రాగ్భారమై, వివేకనిమ్నమై, ప్రవహించునో అచిత్తనదీప్రవాహము కల్యాణవహమగును. ఏది యవివేకనిమ్నమై సంసార ప్రాగ్భారమగునో యది పాపవహము. అందు వైరాగ్యముచే విషయస్రోతస్సు ఖిలముగ చేయబడును. వివేకదర్శనాభ్యాసముచే కల్యాణస్రోతస్సు ఉద్ఘాటనచేయబడును. (తెరువబడును.) అరెంటియధీనమే చిత్తవృత్తినిరోధము. అభ్యాసవైరాగ్యాధీనమే చిత్తవృత్తినిరోధమనుట. అని చెప్పబడెను. ప్రాగ్భార నిమ్న పదములు "తదా వివేకనిమ్నం కైవల్యప్రాగ్భారం చిత్తం" అను సూత్రమువద్ద వ్యాఖ్యానింపబడెను. యెట్లు తీవ్రవేగముతోగూడిన నదీప్రవాహమును సేతుబంధముచే (ఆనకట్టచే) మరలించి చిన్న కాలువలు త్రవ్వి వాటిద్వారమున క్షేత్రాభిముఖముగ తిర్యక్ ప్రవాహాంతరోన్ముఖముగ కల్పింపబడునో అట్లే వైరాగ్యముచే చిత్తనదీప్రవాహమును మరల్చి సమాధ్యభ్యాసముచే ప్రశాంత వాహిత సంపాదింపబడును. కాన ద్వారభేదముచే యభ్యాసవైరాగ్యములకు సముచ్చయము.

అభ్యాసవైరాగ్యములలో నేదోయొకటియే చిత్తనిరోధమునకు ద్వారమన్నచో వ్రీహియవలవలె వికల్పము ప్రాప్తించును. "అనగా వ్రీహిభిర్జుహోతియవైర్వా" అనుచోట వ్రీహులచేతను కాని, లేదా యవలచేతను కాని హోమముచేయవలెను. అనుస్థలమున వ్రీహియవలకు హోమమును కూర్చి వికల్పము ప్రాప్తించినటు లచటను యభ్యాసవైరాగ్యములకు వికల్పము ప్రాప్తించెడిని. అటగుచో క్రియారూపములగు మంత్రజప, దేవతాధ్యానముల కావృత్తిరూపమగు యభ్యాసము సంభవించును. సర్వవ్యాపారోపరమమగు సమాధియొక్క యభ్యాసమననేమి? అను శంకను నివారించుటకు అభ్యాసమనునెట్టిదో సూత్రముచే చెప్పుచుండెను. "తత్రస్థితౌ యత్నోఽభ్యాసః" అని స్వరూపావస్థితము, దృష్టము, శుద్ధము, అగు చిదాత్మయందు అవృత్తికచిత్తముయొక్క ప్రశాంతవాహితారూప నిశ్చలత్వమే స్థితి. అట్టి స్థితినిమిత్తము మానసికోత్సాహము స్వభావచాంచల్యమువలన బహిఃప్రవాహస్వభావముకల చిత్తమును అన్నిప్రకారములచేతను నిరోధింపగలవను యుత్సాహము యావత్త్వ

మానమై యభ్యాస మనబడును. "స తు దీర్ఘకాల నైరన్తర్య సత్కారాసేవితో దృఢభూమిః" ఆ యభ్యాసమును దీర్ఘకాలము భేదములేకుండగ సేవింపబడిన విచ్ఛేదముండదు. విచ్ఛేదము లేమిఁజేసి నిరన్తరము ఆసేవితమగును. శ్రద్ధాతిశయముచే సేవింపబడిన దృఢభూమియై విషయవాసనలచే చలింపజేయుటకు శక్యముకాదు. అదీర్ఘకాలమైనను, దీర్ఘకాలమైనను "విచ్ఛిద్య విచ్ఛిద్య" అపి సేవించినచో శ్రద్ధాతిశయము లేకుండుటవలన యవిక్షేపకషాయ సుఖాస్వాదనములు పరిహరించుటకు శక్యముకావు. అట్లగుచో వ్యుత్థానసంస్కారప్రాబల్యమువలన యభ్యాసము అదృఢభూమియై ఫలముకొఱకు సమర్థముకాదు. అందుచే దీర్ఘకాలము, నైరన్తర్యము, సత్కారము అని మూడు చెప్పబడెను. వైరాగ్యము — అపరమని, పరమని రెండువిధములు. అందు అపరవైరాగ్యము యతమానసంజ్ఞా, వ్యతిరేకసంజ్ఞా, ఏకేంద్రియసంజ్ఞా, వశీకారసంజ్ఞా. అను భేదములచే నాలుగువిధములు. అందు పూర్వపూర్వభూమికా జయముచే నుత్తరోత్తర భూమికా సంపాదన వివక్షచే నాల్గవదియగు వశీకారసంజ్ఞావైరాగ్యమునే సూత్రముచే సూత్రకారులు చూపిరి. "దృష్టానుశ్రవిక విషయ వితృష్ణస్య వశీకారసంజ్ఞా వైరాగ్యమ్" స్త్రీలు, అన్నపానములు, ఐశ్వర్యము, మొదలగునవి దృష్టమైన విషయములు మూడు. స్వర్గము, విదేహత, ప్రకృతిలయము, మొదలగునవి వైదికములగు ఆనుశ్రవిక విషయములు. అట్టి యుభయ విధములగు దృష్టానుశ్రవిక విషయములందు తృష్ణయున్నచో వివేకతారతమ్యముచే యతమానసంజ్ఞా వైరాగ్యము, వ్యతిరేకసంజ్ఞా వైరాగ్యము, ఏకేంద్రియసంజ్ఞా వైరాగ్యము సంభవించును. ఈజగత్తునందు ఏది సారము ఏది యసారము అని గురుశాస్త్రములచే తెలిసికొనగలనను యుద్యోగమే యతమానసంజ్ఞా వైరాగ్యము, తన చిత్తమునందు పూర్వమునందుండిన దోషములలో యభ్యసమాన వివేకముచే యీదోషము లుపక్షీణములు, ఈదోషములు మిగిలియున్నవి. అని వైద్యునివలె వివేచనము వ్యతిరేకసంజ్ఞా వైరాగ్యము. దృష్టానుశ్రవిక విషయ ప్రవృత్తి దుఃఖాత్మకము అను జ్ఞానముచే తృష్ణ, బహిరింద్రియ ప్రవృత్తిని పుట్టింపకపోయినను ఔత్సుక్యమాత్రముచే తృష్ణ మనస్సునందుండుటయే ఏకేంద్రియసంజ్ఞా వైరాగ్యమని యనబడును. మనస్సునందు తృష్ణలేమిఁజేసి యన్నివిధములచేతను వైతృష్ణ్యం అనగా జ్ఞానప్రసాదరూపము, తృష్ణావిరోధియగు చిత్తవృత్తి వశీకారసంజ్ఞా వైరాగ్యమనబడును. ఇట్టి వశీకారసంజ్ఞా వైరాగ్యము సంప్రజ్ఞాతసమాధి కంతరంగసాధనము. అసంప్రజ్ఞాతసమాధికి బహిరంగసాధనము. అసంప్రజ్ఞాతసమాధి కంతరంగసాధనము పరమవైరాగ్యమేయని గ్రహింపనగును. ఈవిషయమునే సూత్రకారులు "తత్పరం పురుషఖ్యాతేర్గుణవైతృష్ణ్యమ్" సంప్రజ్ఞాతసమాధి పాటవముచే సత్త్వరజస్తమోగుణత్రయాత్మకమగు ప్రధానమువలన వేరుపరుపబడిన పురుషునికి సాక్షాత్కారత్వము జనించును. దానివలన నిఖిలగుణత్రయ వ్యవహారములయందు వైతృష్ణ్యము కలుగును. అట్టి వైతృష్ణ్యమే ఫలభూతమైన పరమ వైరాగ్యమనబడును. దానిపరిపాకమువలన చిత్తోపశమపరిపాకము, దానివలన శీఘ్రముగ కైవల్యము సిద్ధించును. ॥35॥

శంకరానందీయము:— మనస్సునకు దుర్నిగ్రహత్వము లోకశాస్త్రప్రసిద్ధమే యని యంగీకరించియా యంగీకారమునే యనువదించుచు ముముక్షువునకు మనోనిగ్రహసాధనములు. శ్రీకృష్ణపరమాత్మ "అసంశయం" అను శ్లోకము మొదలుకొని రెండు శ్లోకములచే బోధించుచుండెను. విచారింప మనస్సు- చంచలమగుటవలనను, ప్రమాథియగుటవలనను, బలవంతమగుటవలనను, దృఢమగుటవలనను, దుర్నిగ్రహమనుటయందు సందియములేదు. అయినను తన్నిగ్రహోపాయమును చెప్పెద వినుము. శ్రుతిస్మృతియుక్తులచే పూర్వమునందు చెప్పిన రీతిని నిఖిలప్రపంచమునకు మిథ్యాత్వము తెలిసికొనిన విద్వాంసునకు విషయములయం దసత్త్వ తుచ్ఛత్వ బంధకత్వబుద్ధి లెస్సగ జనించును. అట్టి బుద్ధివలన, తీవ్రమోక్షేచ్ఛవలనను జనించిన విషయ వైశద్యమే వైరాగ్యమనబడును. అట్టి వైరాగ్యముచే మనోనిగ్రహము సంభవించును. పదార్థ మిథ్యాత్వజ్ఞానముచే రాగద్వేషాది దోషములు, రాగద్వేషజనక హేతువులు మరలిపోవును. వానినివృత్తిచే మనస్సు వశవర్తియై నిశ్చలమగును.

రాగద్వేషాదులులేని బాలాదులయందు మనశ్చాంచల్యమే చూడబడుచున్నదే! యెట్లు రాగద్వేషాదులు లేకపోవుటచేతను, వైరాగ్యమాత్రముచేతను మనస్సునకు నిశ్చలత్వము సిద్ధించును ? అని యాశంకింపజనదు—

వారలకు పదార్థ మిథ్యాత్వజ్ఞానము, రాగాద్యభావము సంభవింపదు. కాన మనోనైశ్చల్యము సంభవింపదు. అయినను అంగి లేనిందే అంగమాత్రముచే కార్యము సిద్ధింపదు. కాన అంగిని ప్రధానముగ సంపాదింపవలయునను యాశయముచే శ్రీకృష్ణపరమాత్మ "అభ్యాసేన" అని చెప్పుచుండెను.

అభ్యాసమనగ విజాతీయ ప్రత్యయ తిరస్కారపూర్వకముగ సజాతీయ ప్రత్యయావృత్తియే. అట్టి యభ్యాసముచే అనగా తీవ్రముముక్షేచ్ఛా తీవ్రవైరాగ్యక సాధనముచే చిరకాలము నిత్యనిరంతర భావితమగు "బ్రహ్మైవాహం" అను బ్రహ్మప్రత్యయాభ్యాసముచే విజాతీయ ప్రత్యయములు నిశ్శేషముగ నశింప తద్వాసనలు నిశ్శేషముగ నశించుటవలన "నిమిత్తాపాయే నైమిత్తిక స్యాప్యపాయః" కారణములేనిచో (నశించినచో) కార్యముకూడ నశించునను న్యాయముచే మనశ్చలననిమిత్తములగు వాసనలు నశింప మనస్సు స్వయముగనే నిశ్చలమగును. కాన తీవ్రముముక్షేచ్ఛావైరాగ్యములతోగూడిన సత్ప్రత్యయాభ్యాసమే మనోనిగ్రహమునందు, మనోనైశ్చల్యమునందు పరమకారణము. లెస్సగ ననుష్ఠితమగు యభ్యాసముచేతనే మనస్సు నిశ్చలమగునని యర్థము ॥35॥

పరమార్థప్రప:— రెండువిధములగు మనోనిగ్రహోపాయముల నుపదేశింపదలచి "అసంశయం" అని చెప్పుచుండెను.

చాంచల్యాదిస్వభావముకల మనస్సునిరోధించుటకు శక్యము కానిదనినీవు చెప్పిన విషయముసందేహము లేనిదే. అయినను యభ్యాసముచేతను, వైరాగ్యముచేతను, స్వాధీనము చేసుకొనబడును.

అందు అభ్యాసమనగ నిరంతర మాత్మానుసంధానము. వైరాగ్యమనగ విషయవైరస్యము. ఈమనస్సు నిగ్రహింపబడిన అభ్యాసముకాని, వైరాగ్యముకాని, సిద్ధించును. అట్లే యభ్యాసవైరాగ్యములచేతనే మనోనిగ్రహము సిద్ధించును. పిచ్చికుదిరిన పెండ్లియగును పెండ్లిఅయిన పిచ్చికుదురును. అనునట్లు అన్యోన్యాశ్రయ దోషము ప్రాప్తించుననిన ఇది సత్యమే. కాని యీ యభ్యాస వైరాగ్యములు విచారాధీనములగుటవలన అన్యోన్యాశ్రయము సంభవించును. అట్టి ప్రశ్నకుత్తరము "శనైశ్శనై రుపరమేత్" అని పూర్వమునందే శ్రీకృష్ణపరమాత్మచే చెప్పబడెను.

"అభ్యాసేనచ కౌన్తేయ వైరాగ్యేణచ గృహ్యతే" అను దానిచే స్మారితము. అది యెట్లనిన ? పరమార్థప్రాప్తియందు ఆత్మవిచారమే శరణము. "ద్రష్టవ్య శ్రోతవ్యో నిదిధ్యాసితవ్యః" అనుశ్రుతియే బోధించుచున్నది. "వేదాహమేతం" ఇత్యాదిశ్రుతులు యీవిషయమునే బోధించుచున్నవి. అందు యాత్మ దేహేంద్రియాది ద్రష్టయగుటవలన ఘటద్రష్ట ఘటము కానట్లు దేహేంద్రియాదులకంటె వేరు. అట్టి యాత్మ యెట్టిదని చారింప రూపరసాది గ్రాహకత్వమునందు ప్రతిక్షణము యన్వేషింపదగినది. అట్టి యన్వేషణమే ప్రస్తుతమగు యభ్యాసము. అట్లే యుత్పత్త్యనంతరము ననంతకాలమువాచే సుఖములలో యేది యధికముగ ననుభూతము? అని పరామర్శింప బాల్య, పౌగండ, కైశోర, యౌవన, వార్ధకాద్యవస్థలయందు విస్తారముగ దుఃఖమే యనుభూతముగ స్మరింపబడుచున్నది. అట్లే విషయలాభార్థము గొప్ప ప్రయత్నము ప్రాణాంతకమగునది చేయబడెను. కాన అది దుఃఖరూపమే. భోగసమయ మున్ననో నిమేషమాత్రమే. సుఖముగూడ నిమేషమాత్రమే. అట్టి సుఖముకూడ మత్స్యామిషన్యాయమున పరిణతియందు విరసమగుటవలన దుఃఖపర్యవసాయియే. అని విచారముచే వైరాగ్యముయొక్క రీతి సంభవించును.

మఱియు మనస్సు విషయలోపమైనను అభ్యాసము, విరాగము సంభవించును. ఈవిషయమే యోగశాస్త్రమందు "యత్రైవ యాతి చపలం నను చిత్తమేత త్తత్రైవ భాతి పరమేశ్వర ఏవ సాక్షాత్ । ప్రాగ్దుఃఖదోఽథ విరమే విరసః పదార్థ, స్త్వాత్మా చిరం సుఖద ఇత్యనిశం విచింత్య॥" చపలమగు చిత్త మెచట కేగునో యచటనే సాక్షాత్తు పరమేశ్వరుడే భాసించుచుండెను. పదార్థము మొట్టమొదట దుఃఖప్రదమైనను అనంతరమున విరమమునందు విరసమే యగును. ఆత్మ యొక్కటియే చిరకాలము సుఖప్రదమని యెల్లపుడు విచారించి" అని చెప్పబడెను.

గీ॥ అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః ॥ ॥౩౬॥

పదవిభాగము:— అసంయతాత్మనా - యోగః - దుష్ప్రాపః - ఇతి - మే - మతిః - వశ్యాత్మనా తు - యతతా - శక్యః - అవాప్తుం - ఉపాయతః ॥

ప్రతిపదార్థము:— అసంయతాత్మనా= అసంయత=నియమింపబడని; ఆత్మనా= అంతఃకరణముగలవానిచే; యోగః= యోగము; దుష్ప్రాపః=పొందుటకు శక్యముకానిది; ఇతి=ఇట్లని; మే=నాయొక్క; మతిః= అభిప్రాయము; వశ్యాత్మనాతు= వశ్యమైనయంతఃకరణకలవాడును; యతతా=ప్రయత్నముచేయువాడును అగు యోగిచే; ఉపాయతః, ఉపాయముచే; అవాప్తుం=పొంటకు; శక్యః=శక్యమైనది. ॥౩౬॥

కనుకనే "కౌన్తేయ! మహాబాహో!" అని సంబుద్ధిచే విశేషత్యాగములు గ్రహింపనగును. మేమున్ననో స్వాత్మభావమునందుండినవారలమైన నీకు సాహాయ్యమును చేయగలము. అని యర్థము. ॥౩౫॥

నీలకంఠీయము;—

మనస్సునకు దుర్గ్రాహత్వము (విషయములందు పోకుండగ నరికట్టుట శక్యముకాకపోవుట) నంగీకరించి శ్రీకృష్ణపరమాత్మ మందు విధమున చెప్పుచుండెను. విచారింప మనస్సు విషయములయందు ప్రవేశింపకుండగ నరికట్టుట శక్యమైనది కాదు. అయినను సముచ్చితమగు నభ్యాసవైరాగ్యములచే నిగ్రహమున శక్యమగు మనస్సును నిగ్రహింపవచ్చును. అభ్యాసమనగ నొకానొకచిత్త మనెడి భూమియందు సమానమగు ప్రత్యయావృత్తి అది యెట్లనిన ఇతరవృత్తులేక తైలధారవలె "బ్రహ్మైవాహ మస్మి" అను చిత్తవృత్తియొక్క యావృత్తి. వైరాగ్య మనగ దృష్టభోగములగు స్త్రీచందనవనితాదులయందు, అదృష్టములగు స్వర్గాదిభోగములయందును, తత్సాధనములయందును దోషజ్ఞానపురస్సరముగ తృష్ణలేకుండుట. వ్యవసాయము. (కృషి) చేయువాడు క్షేత్రమునందు కాల్వనీరును పెట్టుచు ఒక క్షేత్రముయొక్క ద్వారమును మూసివేసి రెండవక్షేత్రముయొక్క ద్వారమును తెరచును. అట్లే వైరాగ్యముచే విషయప్రవాహము నరికట్టి యభ్యాసముచే కల్యాణప్రవాహము తెరవబడును. కావున నభ్యాసవైరాగ్యములు రెండును యావశ్యకములు. ఈవిషయమునే "అభ్యాసవైరాగ్యాభ్యాం తన్నిరోధః" అనుయోగసూత్రముకూడ బోధించుచున్నది.

## —౬వ అధ్యాయము—౩౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు—

మధుసూదనసరస్వతీయము:—

ప్రారబ్ధ భోగముకలిగినట్టిన్ని తత్త్వజ్ఞానముకన్న ప్రబలమైన కర్మచేత స్వఫలదానమునకై మనస్సుయొక్క వృత్తులు జనించుచుండ నావృత్తుల నిరోధించుట యెటుల శక్యమగును. అని నీవుపలికిన విషయమై చెప్పెదవినుము. అని "అసంయతాత్మనా" అని శ్రీకృష్ణపరమాత్మ చెప్పమొదలిడెను.

తత్త్వసాక్షాత్కారము జనించినను వేదాన్తవ్యాఖ్యానాది వ్యాసంగములవలన కాని, ఆలస్యాదిదోషములవలన కాని, అభ్యాసవైరాగ్యములచే నిరుద్ధముకాని మనస్సు కలవాడు "అసంయతాత్మా" అని చెప్పబడును, తత్త్వసాక్షాత్కారము కల యట్టివానిచే మనోవృత్తి నిరోధము ప్రారబ్ధకర్మకృతచిత్తచాంచల్యమువలనదుఃఖము (కష్టము) చేకూడ పొందుటకు శక్యము కాదు. అని నీవు పలికెదవు. అందువిషయమై నాయభిప్రాయముకూడ నదియే.

అట్లగుచో యే యుపాయముచే మనోవృత్తినిరోధము ప్రాప్తించును? అని ప్రశ్నించెదవా? చెప్పెద వినుము. వైరాగ్యపరిపాకముచే వాసనాక్షయమైయుండ విషయపారతన్త్ర్యశూన్య మంతఃకరణమగును. అట్టివాడు వశ్యాత్మ అనగా స్వాధీన మొనరించుకొనిన యంతఃకరణకలవాడు. ఇట "తు" అను శబ్దము అసంయతాత్మవైలక్షణ్యద్యోతనార్థము. అనగా అసంయతాత్మకంటె సంయతాత్మ విలక్షణుడని యాశయము. లేదా "తు" అను శబ్దము అవధారణార్థకము అనగా సంయతాత్మయే యని భావము. అట్టి ప్రయత్నించువానిచే విషయస్రోతస్సు ఖిలీకృతమైనను ఆత్మస్రోతస్సుయొక్క యుద్ఘాటనార్థము ప్రాగుక్తమగు

శాంకరభాష్యమ్:—

యః పున రసంయతాత్మా తేన— అసంయతాత్మనాఽభ్యాసవైరాగ్యాభ్యామసంయత ఆత్మాన్తఃకరణం యస్య సోఽయ మసంయతాత్మా తేనాసంయతాత్మనా యోగో దుష్ప్రాపో దుఃఖేన ప్రాప్యత ఇతి మే మతిః। యస్తు పునర్వశ్యాత్మాఽభ్యాసవైరాగ్యాభ్యాం వశ్యతామాపాదిత ఆత్మా మనో యస్య సోఽయం వశ్యాత్మా తేన వశ్యాత్మనాతు యతతా భూయోఽపి ప్రయత్నం కుర్వతా శక్యోఽవాప్తుం యోగ ఉపాయతో యథోక్తాదుపాయాత్॥

శాంకరభాష్యతత్త్వబోధినీ —

అభ్యాస వైరాగ్యములతో నంతఃకరణమును స్వాధీన మొనరించుకొననివానికి యోగము పొందశక్యముకానిదని నాఅభిప్రాయము. అట్లు కాక నెవ డంతఃకరణమును అభ్యాసవైరాగ్యములచే స్వాధీనమొనరించుకొనునో వాడు వైరాగ్యపూర్వకమగు మనోనిరోధముచే యోగమును పొందుటకు సమర్థుడగును. ॥౩౬॥

యభ్యాస మొనరించువానిచే సర్వచిత్తనిరోధము చిత్తచాంచల్యకారణమగు ప్రారబ్ధకర్మలను తిరస్కరించి పొందుటకు శక్యమైనది.

అతిబలవంతమగు ప్రారబ్ధఫలకర్మల యభిభవమెట్లు సంభవించు ననిన ఉపాయమువలన ప్రాప్తించును. అనగా పురుషకారమున ప్రాప్తించును. లౌకికము కాని, వైదికము కాని, యుపాయము ప్రారబ్ధకర్మాపేక్షచే ప్రబలమగుటవలన పురుషకారరూపోపాయమే యోగప్రాప్తికి సాధనము. అట్లు కానిచో లౌకికుల కృష్యాది ప్రయత్నమునకు వైదికుల జ్యోతిష్టోమాది ప్రయత్నమునకు వైయర్థ్యము ప్రాప్తించెడిని. ప్రారబ్ధకర్మ యున్నచో దానివలననే ఫలముప్రాప్తించుచుండ ప్రయత్నముచే నేమి ప్రయోజనము? ప్రారబ్ధకర్మలేనిచో నెన్నివిధములైనను ఫలముప్రాప్తింపనందున పురుషకారముచే నేమి ప్రయోజనము? అను ప్రారబ్ధకర్మకు సదసత్త్వవికల్పన ప్రాప్తింప పురుషకారము వ్యర్థము కావలసివచ్చును.

స్వయముగ నదృష్టరూపముగుకర్మ దృష్టసాధనసంపత్తి లేనిదే ఫలమునుపుట్టించుటయం దసమర్థముగుట వలన కృష్యాదులయందు పురుషప్రయత్నమపేక్షితమేయగుదవా? యోగాభ్యాసమునందును, యోగాభ్యాసముచే సాధింపదగిన జీవన్ముక్తియన్ని సుఖాతిశయరూపమగుటచే ప్రారబ్ధకర్మ ఫలాంతర్భూతమగుట వలన పురుషప్రయత్నము నపేక్షించునదియే యగుటంజేసి సమాధానము సమానమే.

లేక, ప్రారబ్ధఫలకమగు కర్మ దుష్టమగుటవలన తత్త్వజ్ఞానముకంటె ప్రబలమని కల్పించుచో అట్లే శాస్త్రీయమగు ప్రయత్నము యంతటను ప్రారబ్ధకర్మకంటె ప్రబలమై చూడబడుటవలన ప్రారబ్ధకర్మకంటెను యోగాభ్యాసము ప్రబలము. ఈవిషయమునే వసిష్ఠమహర్షి యీక్రిందివిధమున చెప్పెను.

“సర్వమేవేహ హిసదా సంసారే రఘునందన। సమ్యక్ప్రయుక్తా త్సర్వేణ పౌరుషా త్సమవాప్యతే”

ఓ రామచంద్ర! ఈసంసారమునం దెల్లపుడు సర్వము- లెస్సగ ప్రయోగింపబడిన పౌరుషమువలన నందరిచే పొందబడుచున్నది.

“ఉచ్ఛాస్త్రం శాస్త్రితం చేతి పౌరుషం ద్వివిధం స్మృతం। తత్రోచ్ఛాస్త్ర మనర్థాయ పరమార్థాయ శాస్త్రితమ్॥” పౌరుషము ఉచ్ఛాస్త్రమని, శాస్త్రితమని రెండువిధములు. ఉచ్ఛాస్త్రితమనగ శాస్త్రనిషిద్ధమని యర్థము. శాస్త్రితమనగ శాస్త్రవిహితమని యర్థము. శాస్త్రనిషిద్ధపౌరుషము నరకాది ప్రాప్తికి హేతువు. శాస్త్రవిహితము- ధర్మార్థకామమోక్షము లనెడి నాల్గు పురుషార్థములలో నుత్కృష్టమగు మోక్షమునుగూర్చి యంతఃకరణశుద్ధిద్వారా హేతువగును.

"శుభాశుభాభ్యాం మార్గాభ్యాం వహన్తీ వాసనాసరిత్ । పౌరుషేణ ప్రయత్నేన యోజనీయా శుభే పథి॥" వాసనయనెడి నది శుభాశుభములనెడి మార్గముల ప్రవహించుచున్నది. అట్టిదానిని పౌరుషరూపమగు ప్రయత్నముచే శుభమార్గమున సమకూర్పవలెను.

"అశుభేషు సమావిష్టం శుభేష్వేవావతారయ । స్వమనః పురుషార్థేన బలేన బలినాం వర॥" బలవంతులలో శ్రేష్ఠుడవగు యోరామచంద్ర ! అశుభములయందు కూరుచుండిన నీమనస్సును బలమైన పురుషార్థముచే శుభములయందే ప్రవేశపెట్టుము. "ద్రాగభ్యాసవశా ద్యాతి యదా తే వాసనోదయమ్ ॥ తదాఽభ్యాసస్య సాఫల్యం విద్ధి త్వమరిమర్దన!" శత్రుసంహారకుడవగు ఓ రామచంద్రప్రభు! అభ్యాసవశమున నీమనస్సు శీఘ్రముగ నెప్పుడు వాసనోదయమును పొందునో అపుడే నీవు అభ్యాసము సఫలమని తెలిసికొనుము. ఇచటవాసనయనగ శుభవాసనయని యర్థము.

"సందిగ్ధాయామపి భృశం శుభామేవ సమాహర। శుభాయాం వాసనావృద్ధౌ తాత! దోషో న కశ్చన॥" సందిగ్ధమైనదానివిషయమైగూడ నత్యంతము శుభవాసననే సమకూర్పుము. వాసనావృద్ధి శుభమగుచో దోషమేమియు లేదు.

"అవ్యుత్పన్నమనా యావ ద్భవా నజ్ఞాతతత్పదః। గురుశాస్త్రప్రమాణైస్త్వం నిర్ణీతం తావ దాచర॥" ఓ రామచంద్ర నీవవ్యుత్పన్నమనస్కుడవై పరమతత్త్వమును తెలిసికొననివాడవగుచో గురుశాస్త్రప్రమాణములచే నిర్ణీతమునే యాచరింపుము.

"తతః పక్వకషాయేణ నూనం విజ్ఞాతవస్తునా । శుభోప్యసౌ త్వయా త్యాజ్యో వాసనాఘో నిరోధినా॥" అనంతరము పక్వకషాయము, తెలియబడిన యాత్మతత్త్వముకల నీచే శుభమగునట్టి యీవాసనాసమూహము కూడ నిరోధసమాధిచే విడవనగును అని చెప్పెను. కాన నవివేక నిబంధనమైన సాక్షిగతమగు సంసారము వివేక సాక్షాత్కారమువలన తొలగినను ప్రారబ్ధకర్మపర్యవస్థాపితములగు చిత్తముయొక్క స్వాభావికమగు వృత్తులు యోగాభ్యాసప్రయత్నముచే తొలగ జీవన్ముక్తుడై పరమయోగి యగును. చిత్తవృత్తినిరోధములేనిచో తత్త్వజ్ఞానవంతుడైనను అపరమయోగియే యని సిద్ధము. మిగిలినట్టి యధికవిషయములు జీవన్ముక్తివివేకమున సవిస్తరముగ చూడనగును. ॥౩౬॥

శంకరానందీయము:— మరియు తీవ్రమోక్షేచ్ఛా వైరాగ్యములు లేనట్టియు, ఆత్మతత్త్వము జ్ఞాతమైనను తత్తద్విషయ వాసనచే విషయములయందే ప్రవృత్తి కాన చిరకాలము నిత్యము, నిరంతరము, ఆత్యంతశ్రద్ధచే బ్రహ్మమునందు స్థాపింపబడని చిత్తముకల అనగా సమాధియోగము ననుష్ఠింపని యతిచే జ్ఞానయోగము అనగా శుక్తికాదర్శనముచే శుక్తిప్రత్యయమువలె బ్రహ్మమాత్రదర్శనలక్షణము, అప్రతిబద్ధము అగు అధిష్ఠాన (బ్రహ్మదర్శన సముత్పన్న సన్తత బ్రహ్మప్రత్యయము) నిత్యనిరన్తరాభ్యాస దుఃఖములేనిదే పొందుటకు శక్యము కాదు. అని పరమేశ్వరుడనగు నానిశ్చయము. కోటి శ్రవణములుచేసినను యతికి సమాధి లేనిదే సమ్యగ్దర్శనము సిద్ధించదని యర్థము.

ముముక్షువగు యతికి సమాధిచేతనే సమ్యగ్జ్ఞానముమోక్షము సిద్ధించును. కాన సమాధియేచేయదగినదని సూచించుటకు "వశ్యాత్మనా" అని చెప్పెను. అసంయతాత్మకంటె వశ్యాత్మకు వైలక్షణ్యద్యోతనార్థము "తు" అనుశబ్దము ప్రయోగింపబడెను. తీవ్రమోక్షేచ్ఛాతీవ్ర వైరాగ్యములచే సుతరాం విషయములయం దప్రవృత్తమైన యంతఃకరణము, ఇంద్రియములుకల వానిచేతనైతే అత్యంతశ్రద్ధచే యథాకాలము, యథాలక్షణము యోగసిద్ధికొఱకు యత్నముచేయు యోగిచేతనే చెప్పబడిన లక్షణములుకల యోగ మీయుపాయముచేతనే పొందుటకు శక్యమగును. మరి యితర యేయుపాయములచేతను పొందుటకు శక్యము కాదు. ॥౩౬॥

అర్జున ఉవాచ:—

గీ॥ అయతి శ్శ్రద్ధయోపేతో యోగా చ్చలితమానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥ ॥౩౭॥

పదవిభాగము:— అయతిః- శ్రద్ధయా- ఉపేతః- యోగాత్- చలితమానసః- అప్రాప్య- యోగసంసిద్ధిం- కాం- గతిం- కృష్ణ- గచ్ఛతి ॥౩౭॥

ప్రతిపదార్థము:— అర్జునః=అర్జునుండు; ఉవాచ=పలికెను; అయతిః=ప్రయత్నము లేనట్టియు; శ్రద్ధయా=యోగమార్గమునందు ఆస్తిక్యబుద్ధితో; ఉపేతః=కూడినట్టియు; యోగాత్=యోగమార్గమునుండి; చలితమానసః- చలిత=చలించిన; మానసః=మనస్సుకల సాధకుడు; యోగసంసిద్ధిం=సమ్యగ్దర్శనరూపమగు యోగఫలమును; అప్రాప్య=పొందక; హేకృష్ణ=ఓకృష్ణభగవానుడా ? కాం=ఎట్టి; గతిం=గతిని; గచ్ఛతి=పొందును? ॥౩౭॥

—౬వ అధ్యాయము—౩౭వ శ్లోకవ్యాఖ్యావిశేషములు.—

మధుసూదనసరస్వతీయము:— ఇంతవరకగుకు గ్రంథముచే ఉత్పన్నతత్త్వజ్ఞానియై యనుత్పన్న జీవన్ముక్తికలవాడు అపరమయోగియనియు, ఉత్పన్నతత్త్వజ్ఞానియై యుత్పన్నజీవన్ముక్తికలవాడు పరమయోగియని సమ్మతమని చెప్పబడెను. వారిరువురికి జ్ఞానముచేత నజ్ఞానము నశించినను యెంతవరకు ప్రారబ్ధభోగముకల కర్మ యుండునో యంతవరకు దేహేంద్రియసంఘాత ముండుటవలన ప్రారబ్ధభోగకర్మ నశింప వర్తమానదేహేంద్రియ సంఘాతము పోవుటవలన, తిరిగి శరీరేంద్రియోత్పాదకము లేనందున యట్టి యిరువురికి విదేహకైవల్యము ప్రాప్తించుటయందు యేసంశయము లేదు.

ఏవడు ప్రాక్కృత కర్మలచే పొందబడిన వివిదిషాపర్యన్త చిత్తశుద్ధికలవాడై కృతకార్యుడగుటవలన సర్వకర్మలను పరిత్యజించి పొందబడిన పరమహంసపరివ్రాజక భావముకలవాడై ఆత్మసాక్షాత్కారముచే జీవన్ముక్తుడు, పరప్రబోధనదక్షుడు, పరమహంసపరివ్రాజకుడు నగు గురువుయొక్క సమీపమున కేగి వానివలన వేదాన్తమహావాక్యోపదేశమును పొంది యా యుపదేశమునం దసంభావనా విపరీతభావనలనెడి ప్రతిబంధములను తొలగించుటకు "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రము మొదలుకొని "అనావృత్తి శ్శబ్దా దనావృత్తి శ్శబ్దాత్" అను సూత్రమువరకు నాలుగధ్యాయములు కల యుత్తరమీమాంసా శాస్త్రముచే శ్రవణమననిదిధ్యాసనలను గురుప్రసాదమువలన చేయుట కారంభించును. వాడు శ్రద్ధాళువైనను ఆయు వల్పమగుటచే నల్పప్రయత్నముకలవాడగుటవలన నప్రాప్తజ్ఞానపరిపాకముకలవాడై శ్రవణమననిదిధ్యాసనలు చేయుచుండగనే మధ్యయందు మృతిని పొందునో, అట్టివాడు కర్మలను యుపాసనలను విడచుటవలన జ్ఞానపరిపాకశూన్యుడు కాన నష్టజ్ఞానము నశింపనివాడై ముక్తిని పొందడు. ఉపాసనాసహితకర్మఫలమగు దేవలోకమును యర్చిరాది మార్గముచే ననుభవింపడు. కేవల కర్మఫలమగు పితృలోకమును ధూమాదిమార్గముచే ననుభవింపడు. కనుకనే యట్టి యోగభ్రష్టుడు అజ్ఞుడగుటంజేసి దేవయాన పితృయాన సంబంధములేనివాడగుటవలన వర్ణాశ్రమాచారభ్రష్టుడుకరాశాదిభావముచే కష్టదశను పొందునా ? లేక శాస్త్రనిందితకర్మ శూన్యుడు గాన వామదేవునివలె కష్టదశను పొందడా ? ఇట్లు సంశయపర్యాకులమనస్కుడై యర్జునుడు "అయతిః" అని చెప్పుచుండెను.

"అయతిః" న యతిః, అయతిః, అల్పార్థే నఞ్" "అయతిః" అనుచోట యల్పార్థమున నఞ్ ప్రయుక్త అల్పప్రయత్నముకలవాడై గురువేదాన్త వాక్యములయందు విశ్వాసబుద్ధిరూపమగు శ్రద్ధతో గూడినవాడైయుఇచట "శ్రద్ధయా" అను పదము శమదమాదుల కుపలక్షణము. అనగా శ్రద్ధతోటి,శమదమాదుల తోటికూడినవాడై దానిచే నిత్యానిత్యవస్తువివేకము, ఇహాముత్రఫలభోగవిరాగము, శమదమోపరతి, తితిక్ష

శాంకరభాష్యమ్:—

తత్ర యోగాభ్యాసాంగీకరణేన పరలోకేహలోక ప్రాప్తినిమిత్తాని కర్మాణి సంన్యస్తాని యోగసిద్ధిఫలంచ మోక్షసాధనం సమ్యగ్దర్శనం న ప్రాప్తమితి యోగీ యోగమార్గా న్మరణకాలే చలితచిత్త ఇతి తస్య నాశ మాశంక్య — అయతి రప్రయత్నవా న్యోగ

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఇట సాధకుడు యోగము నభ్యసించుచుండుటచే నిహలోకపరలోకప్రాప్తిసాధనములగు కర్మలను సన్యసించును. మరియు నట్టిసమయమున నింకను యోగసిద్ధికి ఫలము, మోక్షసాధనమునగు సమ్యగ్దర్శనము కలుగలేదనుకొనుము. అట్టి మరణసమయమున యోగి యోగమార్గమునుండి చలించిన మనస్సుకలవాడగుచో వాని కధోగతి (ఉభయభ్రష్టత్వము) కదా! యని

శ్రద్ధాదిసంపత్తు, ముముక్షుత్వము అనెడి సాధనచతుష్టయసంపన్నుడు అయి గురుసన్నిధి కేగి వేదాంత వాక్యశ్రవణాదులను చేయువాడైనను తన యాయువు అల్పమగుటచే మరణకాలమునందు యింద్రియములు వ్యాకులమగుటచే సాధనానుష్ఠానము సంభవింపనందున శ్రవణాది పరిపాకమునుండి పొందబడిన తత్త్వసాక్షాత్కారమువలన చలిత మనస్కుడై, అనగా తత్ఫలమును పొందని మనస్సుకలవాడు. యోగనిష్పత్తి లేకపోవుటచే యోగసిద్ధిని పొందక తత్త్వజ్ఞానము కారణముగాగల యజ్ఞానతత్కార్యనివృత్తిని అపునరావృత్తిసహితమైన దానిని పొందక తత్త్వజ్ఞుడు కాకయే మృతుడై ఓ కృష్ణా! ఏగతిని పొందును. అనగా కర్మపరిత్యాగమువలన, జ్ఞానము జనింపనందున శాస్త్రోక్తమోక్షసాధనముల ననుష్ఠింపనందున, శాస్త్రనిందితకర్మల నాచరింపని వాడగుటవలన అట్టివాడు సుగతిని పొందునా! లేక దుర్గతిని పొందునా! ॥38॥

శంకరానందీయము:— ఇట్లు యోగ ప్రాప్త్యుపాయమును తెలిసికొని తిరిగి ఇహపరలోకములయందు సుఖకారణములైన శ్రౌతస్మార్తకర్మలను సన్యసించి యోగనిష్ఠయందు ప్రవృత్తుడైన యోగసిద్ధి సంభవింపకుండగనే మృతుడై స్వర్గాపవర్గసాధనములులేని యతికి యేగతి ప్రాప్తింపగలదు? అను శంకచే యాగతిని తెలిసికొనగోరి యర్జునుడు "అయతిః" అను దానిచే ప్రశ్నించుచుండెను.

యోగానుష్ఠానముచేతనే సమ్యగ్దర్శనము, దానిచేతనే మోక్షము ప్రాప్తించును అని నిశ్చయపూర్వకమగు యాస్తిక్యబుద్ధిచే కూడుకొనినవాడైనను, "అయతిః" యోగసిద్ధికొఱకు యత్నమును చేయనివాడై, అనగా "శ్రేయాంసి బహువిఘ్నాని భవన్తి మహతా మపి" అను న్యాయముచే ప్రతిబంధకకర్మవశమున సంప్రాప్తవిచిత్ర విఘ్నవిశేషములచే సమాధిప్రముత్తుడు. కనుకనే "యోగా చ్చలితమానసః" "బ్రహ్మైవాహం" అని బ్రహ్మమునందే యాత్మచే ధీనైశ్చల్యము యోగ మనబడును. అట్టి యోగమునుండి యంతకాలమునందు బాహ్యవాసనచేగను దుష్కర్మచేతను విపరీతభావమును పొందిన మానసముకలవాడై చలించిన స్మృతికల యతి విదేహముక్తితో పురుషుని కూర్చునది కాన సమ్యగ్దర్శనము యోగ మనబడును. అట్టి సమ్యగ్జ్ఞానముయొక్క సంసిద్ధి యనగ నిరంతరసమాధ్యనుష్ఠానముచే యప్రతిబద్ధత్వము. "సర్వ మిద మహం చ బ్రహ్మైవ" అను యప్రతిబద్ధబ్రహ్మజ్ఞానమే యోగసంసిద్ధి యనబడును. సమాధిఫలమగునట్టి దానిని పొందకయే స్వయముగ మరణించి యేగతిని పొందును? అని యర్జునుడు ప్రశ్నించెను. ఇచట "కాం" అను కింశబ్దము అవిజ్ఞాతపదార్థజ్ఞానార్థకము కాని, యాక్షేపార్థకమమాత్రము కాదు. "గమ్యత ఇతి గతిః" అట్టి వానిచే పొందదగిన యర్థమేది? అని యర్థము.

అట్టి యతికి స్వర్గసంపాదకమగు కర్మానుష్ఠానము లేనందున స్వర్గప్రాప్తి లేదు. విష్ణ్వాదిదేవతోపాసన లేనందున వైకుంఠప్రాప్తియు లేదు. సమాధిసంభావితతత్త్వసాక్షాత్కారము లేనందున ముక్తియు ప్రాప్తిం

శాంకరభాష్యమ్.—

మార్గే శ్రద్ధయాఽఽస్తిక్యబుద్ధ్యా చోపేతో యోగా దంతకాలేపి చలితం మానసం మనో యస్య స చలితమానసో భ్రష్టస్మృతిస్సోఽప్రాప్య యోగసంసిద్ధిం యోగఫలం సమ్యగ్దర్శనం కాం గతిం హేకృష్ణ గచ్ఛతి॥

శాంకరభాష్యార్థతత్త్వబోధినీ.—

యాశంకించుకొని యర్జునుడు పలుకుచున్నాడు— యోగి ప్రయత్నరహితుడైనచో నాతడెంత శ్రద్ధా (ఆస్తిక్య) వంతుడైనను మరణకాలమున యోగమునుండి విచలితమైన చిత్తముకలవాడై యగును. అందుచే యోగఫలమగు సమ్యగ్దర్శనమాతనికి సంభవింపనేరదు. ఓశ్రీకృష్ణా! అట్టియెడ నాతడేగతిని (పురుషార్థము) పొందును. ॥32॥

పడు. పాపాచరణ లేనందున దుర్యోని దుర్గతియు ప్రాప్తింపదు. కాన నప్రాప్తయోగసంసిద్ధు డగు యతికి యేగతి పట్టగలదో దానిని చెప్పుమని "కాం గతిం కృష్ణ గచ్ఛతి" అను యర్జునవాక్యమున కాశయము.

యోగసంసిద్ధిని పొందకపోయినను ఇట్టి యతికి పూర్వజన్మములయం దాచరితపుణ్యకర్మ యుండుట వలన నాయతికి యాకర్మచే స్వర్గాదిలోకప్రాప్తి కలుగుచుండ "కాం గతిం కృష్ణ గచ్ఛతి" అని యర్జునుని ప్రశ్నయే యసంగత మని శంకింపజనదు.

అట్టి పూర్వజన్మకృతపుణ్యకర్మలు చిత్తశుద్ధిని కలుగజేసి నశించుటవలన స్వర్గాదిప్రాపకకర్మ లేమింజేసి యర్జునుని "కాం గతిం కృష్ణ గచ్ఛతి" అను ప్రశ్న యుపపన్నమే యగును. అనగా "జన్మాంతరసహస్రేషు యజ్ఞదానతపోద్వారైః। నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే" జన్మాంతరసహస్రములయం దాచరించిన యజ్ఞదానతపోద్వారములచే నశింప జేయబడిన పాపములుకల మనుష్యులకే శ్రీకృష్ణపరమాత్మయందు భక్తి జనించును, "స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్। సాధనం ప్రభవే త్పుంసాం వైరాగ్యాది చతుష్టయమ్" స్వవర్ణాశ్రమవిహితధర్మముచేతను, తపస్సుచేతను శ్రీహరి సంతసించును. అట్టి హరితోషణము వలన పురుషులకు వైరాగ్యాదిసాధనచతుష్టయసంపత్తి ప్రాప్తించును.

"నిత్యనైమిత్తికై రేవ నియమేనేశ్వరార్పితైః। బహుజన్మకృతైర్విప్ర స్సత్త్వశుద్ధిం సమశ్నుతే" నియమముచే యీశ్వరార్పితములు, అనేకజన్మకృతములు నగు నిత్యనైమిత్తికకర్మలచేతనే బ్రాహ్మణుడు సత్త్వశుద్ధిపొందుచున్నాడు. "స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" మనుష్యుడు తన వర్ణాశ్రమవిహితకర్మచే పరమేశ్వరుని పూజించి యంతఃకరణపరిశుద్ధిని పొందుచున్నాడు, అని చెప్పుటవలన నీశ్వరార్పితమగు పూర్వజన్మోపార్జితపుణ్యకర్మలకు చిత్తశుద్ధియే ప్రయోజన మగుటవలన చిత్తశుద్ధికల అయతికిని, యోగచలితమనస్కుడగు యతికి స్వర్గప్రాప్తికి హేతువగు కర్మ లేమింజేసి యర్జునుని "కాం గతిం కృష్ణ గచ్ఛతి" అను ప్రశ్న ముపపన్నమే.

అట్లగుచో సంన్యాసముమాత్రము స్వీకరించిన యతికి "సంన్యాసా ద్బ్రహ్మణ స్థానం" అను స్మృతిప్రసిద్ధసంన్యాసక్రియామాత్రమువలన బ్రహ్మలోకప్రాప్తి సంభవించుచుండ యర్జునుని "కాం గతిం కృష్ణ గచ్ఛతి" అను ప్రశ్న యసంగతమే యని శంకింపవలదు. అట్టివాని సంన్యాసమన్యథాసిద్ధ మగుటవలన యర్జునుని "కాం గతిం కృష్ణ గచ్ఛతి" అను ప్రశ్న ముపపన్నమే. అనగా "ఏతమేవ ప్రవ్రాజినో లోక మిచ్ఛన్తః ప్రవ్రజన్తి" "సంన్యస్య శ్రవణం కుర్యాత్" ఇత్యాదిశ్రుతిస్మృతివిహితసన్యాసము శ్రుత్యంగ మగుటచే శ్రవణాదిరూపార్థసిద్ధియందే యుపక్షీణ మగు శక్తికల దగుటవలన సంన్యాసమునకు బ్రహ్మలోకప్రాపకత్వ ముపపన్నము. కాన యర్జునుని "కాం గతిం కృష్ణ గచ్ఛతి" అను ప్రశ్న ముపపన్నమే. ఎట్లన? "జ్యోతిష్టోమేన స్వర్గకామో యజేత" అను శ్రుతివిహితజ్యోతిష్టోమయాగము స్వర్గమును పొందించుటయందే

క్లుప్తసంకల్పముకలదగుటవలన స్వర్గమును పొందించుటయందే యాయాగమునకు సామర్థ్యము. ఫలాంతరమును పొందించుటయందు సామర్థ్యము లేదు. ఇందుకు "స యథాకామో భవతి తత్క్రతుర్భవతి యత్క్రతుర్భవతి తత్కర్మ కురుతే తదభిసంపద్యతే" అను శ్రుతియే ప్రమాణము. కాన శ్రవణాంగముగ స్వీకరించినవివిదిషాసంన్యాసము శ్రవణాదులయందే యుపక్షీణమగుటవలన యతికి దానికంటె వేరగు పుణ్యకర్మ కనుపింపనందున నర్జునిని "కాం గతిం కృష్ణ గచ్ఛతి" అను ప్రశ్న సమంజసమే.

అట్లగుచో "సంన్యాసా ద్బ్రహ్మణ స్థానం" అను స్మృతివాక్యమునకానర్థక్య మని శంకింపవలదు. "సంన్యాసా ద్బ్రహ్మణస్థానం" అను స్మృతి సంన్యాసమువలన బ్రహ్మలోకము ప్రాప్తించునని చెప్పుచున్నది. సత్యమే. ఏసంన్యాసమువలన బ్రహ్మలోకము ప్రాప్తించునని చెప్పుచున్నది? అనగా విద్వత్సంన్యాసము వలన బ్రహ్మలోకప్రాప్తి యనియా? వివిదిషాసంన్యాసమువలన బ్రహ్మలోకప్రాప్తి యనియా? అపత్సంన్యాసము వలన బ్రహ్మలోకప్రాప్తియనియా? "నతస్యప్రాణా ఉత్క్రామన్తి" విద్వత్సంన్యాసికి ప్రాణోత్క్రమణమే లేదనిబోధించుచుండ విద్వత్సంన్యాసమునకు బ్రహ్మలోకప్రాప్తి ఫలము కానందున ప్రథమపక్షము సంభవింపదు.

వివిదిషాసంన్యాసము శ్రవణమననాదిసిద్ధియే ఫలము కలదనుటవలన బ్రహ్మలోకప్రాప్తిరూపఫలాంతరము కల్పించుట సంభవింపదు. కాన "సంన్యాసా ద్బ్రహ్మణ స్థానం" అను స్మృతి వివిదిషాసంన్యాసవిషయము కానందున రెండవపక్షము కూడ సంభవింపదు. విద్వత్సంన్యాస వివిదిషాసంన్యాసపక్షములు సంభవింపనందున పరిశేషన్యాయమున "సంన్యాసా ద్బ్రహ్మణః స్థానం" అను స్మృతిచే బోధింపబడు బ్రహ్మలోకప్రాప్తి అపత్సంన్యాసవిషయమే యగుటవలన సార్థకమగుటచే యేయనుపపత్తియు సంభవింపదు. ఈవిషయమునే "అపద్యపి చ కుర్వీత సంన్యాసం బ్రాహ్మణోత్తమః । యదనుష్ఠానమాత్రేణ ప్రయాతి బ్రహ్మణః పదమ్" ఏసంన్యాస స్వీకారమాత్రముచే బ్రహ్మపదమును పొందునో అట్టి సంన్యాసమును అపత్తునందైన బ్రాహ్మణుడుస్వీకరింప వలయును అని స్మృతిబోధించుచున్నది.

అపత్తునందు సంన్యసించినను తిరిగి జీవించి వివేకి శ్రవణమననాదులచే జ్ఞానమును పొంది ముక్తుడగును. కాన నాపత్సంన్యాసమునకు బ్రహ్మలోకైక ఫలమెట్లు సంభవించు ననెదవా? వినుము—జన్మాంతరమున మోక్షేచ్ఛచే సంన్యసించి శ్రవణాదుల నొనరించినవానికి ప్రతిబంధకవశమున జ్ఞానము కలుగకుండినచో తిరిగి యీజన్మమునందు అపద్యుపదేశమున, పూర్వసంస్కారమువలనను సన్యసించి శ్రవణమననములచే జ్ఞానమునుపొంది ముక్తుడగును, అని యీయర్థమునే శ్రీకృష్ణపరమాత్మయు "శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే" అని చెప్పగలడు. కాన విరోధమేమియు ప్రాప్తింపదు.

పొందబడని యోగసంసిద్ధి కల యతియొక్క సంన్యాసము శ్రవణాదిమాత్రఫలక మగుటచే నుపక్షీణమైనను అట్టి యతి "భిక్షాటనం జప శ్శౌచం స్నానం ధ్యానం సురార్చనమ్। కర్తవ్యాని షడేతాని యతీనాం నృపదండవత్" భిక్షాటనము, జపము, శౌచము, స్నానము ధ్యానము సురార్చనము అను నీయారును నృపదండమువలె నాచరింపవలయు నని స్మృతిబోధించుటచే నట్టి వాటి నాచరించుయతికి స్వర్గాదిప్రాపకమగు మంత్రజపాదులవలన స్వర్గము ప్రాప్తించుచుండ యర్జునిని ప్రశ్న యెట్లుపొసగునని శంకింపజనదు. స్తోత్రమంత్రజపాదికము భేదప్రత్యయ ఘటితమగుచే విపరీతహేతుభావనాహేతువగుటవలన బ్రహ్మవిద్విషయము కానేరదు. "నైతాదృశం బ్రాహ్మణస్యాస్తి విత్తం" "ఉపరతః క్రియాభ్యః" నైవధర్మీ నచాధర్మీ తూష్ణీం కించిదచిన్తయేత్" అని యతికి సర్వకర్మోపరమము స్మరింపబడెను. "ధ్యానయోగపరో నిత్యం" అను స్థలమున నిదిధ్యాసనమునకు క్రియాంతరానవకాశము నిమిత్తము "నిత్యం" అను పదమిచట నిక్షేపింపబడెనని శ్రీభాష్యకారులచేత నేవ్యాఖ్యానింపబడెను నిరంతరయోగనిష్ఠాపరు డగు యతికి మంత్రజపాది పుణ్యకర్మానుష్ఠానము సంభవింపనందున తన్మూలక మగు పుణ్యలోకము సంభవింపదు. కాన నర్జునుడు "కాం గతిం కృష్ణ గచ్ఛతి" అని ప్రశ్నించుట సమంజసమే యగును. ॥౩౮॥

గీ॥ కచ్చిన్నోభయవిభ్రష్ట శ్ఛిన్నాభ్రమివ నశ్యతి,
అప్రతిష్ఠో మహాబాహో! విమూఢో బ్రహ్మణః పథి ॥౩౮॥

పదవిభాగము:—కచ్చిత్ – న – ఉభయవిభ్రష్టః – ఛిన్నాభ్రం – ఇవ – నశ్యతి – అప్రతిష్ఠః – మహాబాహో! – విమూఢః – బ్రహ్మణః – పథి ।

ప్రతిపదార్థము:— హేమహాబాహో!=గొప్పబాహువులుకల యో అర్జునా! యోగీ–పూర్వోక్తయోగి (ఈపదమధ్యాహార్యము) అప్రతిష్ఠః=నిరాశ్రయుడై; బ్రహ్మణఃపథి=బ్రహ్మప్రాప్తిమార్గమునందు; విమూఢస్సన్=విమూఢుడై; ఉభయవిభ్రష్టస్సన్=కర్మమార్గ యోగమార్గములనుండిభ్రష్టుడై; ఛిన్నాభ్రమివ=ఛిన్న; విడిపోయిన; అభ్రమివ=మేఘమువలె; ననశ్యతికచ్చిత్=నశింపడా; ఏమి ॥౩౮॥

శాంకరభాష్యమ్:—

కచ్చిదితి । కచ్చిత్కిం నోభయవిభ్రష్టః కర్మమార్గా ద్యోగమార్గాచ్చ విభ్రష్టః సంఛిన్నాభ్రమివ నశ్యతి కిం వా న నశ్యత్యప్రతిష్ఠో నిరాశ్రయో హే మహాబాహో! విమూఢస్సన్బ్రహ్మణః పథి బ్రహ్మప్రాప్తిమార్గే. ॥౩౮॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

గొప్పబాహువులుకల యో శ్రీకృష్ణా! యోగికర్మమార్గమునుండియు, యోగమార్గమునుండియు భ్రంశమును పొందినచో నిరాశ్రయుడై, బ్రహ్మప్రాప్తిమార్గమునందు విమూఢుడై విడిపోయిన మేఘమువలె నశింపడుకదా? ॥౩౮

—:౬వ అధ్యాయము ౩౮వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— ఈసంశయబీజము (కారణము.) నే "కచ్చిత్" అనుదానిచే వివరించుచుండెను. ఇచట "కచ్చిత్" అను శబ్దము సాభిలాషప్రశ్నార్థకము. "హేమహాబాహో!" సర్వభక్తుల సర్వోపద్రవనివారణ సమర్థములు, లేక పురుషార్థ చతుష్టయ దానసమర్థములగు నాలుగుబాహువులుకల యో శ్రీకృష్ణ! ఈచెప్పుటచే వీడినట్లుప్రశ్నించునా? నన్నుఅని ప్రశ్నమిత్తకమగు క్రోధము శ్రీకృష్ణునకు లేదనియు, అట్టి ప్రశ్నకు సమాధాన మిచ్చుటయందు సహిష్ణుత్వము కలదనియు సూచింపబడెను. "బ్రహ్మణః పథి" బ్రహ్మప్రాప్తిమార్గమగు జ్ఞానమునందు చిత్తభ్రంశముకలవాడు, అనగా బ్రహ్మాత్మైక్యసాక్షాత్కారము జనింపనివాడు, పితృయానమార్గగమన హేతువులగునుపాసనా ఉపాసనలతోగూడిన సర్వకర్మలను పరిత్యజించుటవలన దేవయాన కర్మలనెడి సాధనములులేనివాడై, కర్మమార్గమునుండి, జ్ఞానమార్గమునుండి, విభ్రష్టుడై వాయువుచేపూర్వమేఘమునుండి విశకలితమై యుత్తరమేఘముతో కలిసికొనిన మేఘ మెటుల వర్షమునకు యోగ్యము కాక యంతరాళమున నశించునో యట్లేపూర్వకర్మమార్గమునుండి విచ్ఛిన్నుడై యుత్తరజ్ఞానమార్గమును పొందక యంతరాళమునందు కర్మఫలముగాని, జ్ఞానఫలముకాని, పొందుట కయోగ్యుడై నశించునా? లేక నశింపడా? యని యర్జునుని ప్రశ్న. ఈచెప్పుటచే జ్ఞానకర్మసముచ్చయపక్షమున ఇట్టివానికి జ్ఞానఫలము సంభవింపకున్నను కర్మఫలము సంభవించుటవలన నుభయభ్రష్టత్వము సంభవింపనందున జ్ఞానకర్మసముచ్చయము సంభవింపదు. అట్టి వానికి కర్మఫలము సంభవించినను కర్మఫలకామనా పరిత్యాగమువలన తత్ఫలభ్రంశ కలుగునా? కలగదా? యని ప్రశ్నించుట సమంజసమే యని శంకింపజనదు. నిష్కామకర్మలకు కూడ ఫలము కలదని యాపస్తంబవచనాదులు నిదివరకే చాలచోట్ల మే ముదహరించియే యుంటిమి. కాన సర్వకర్మత్యాగి విషయమే యనర్థప్రాప్తిశంక జనించుటవలన యీ యర్జునునిప్రశ్నయనియే నిర్ధారణ చేయనగును. ॥౩౮॥

గీ॥ ఏతం మే సంశయం కృష్ణ! ఛేత్తు మర్హస్యశేషతః,
త్వదన్య స్సంశయస్యాస్య ఛేత్తా నహ్యుపపద్యతే॥ ॥౩౯॥

పదవిభాగము:— ఏతం–మే–సంశయం–కృష్ణ–ఛేత్తుం అర్హసి–అశేషతః–త్వదన్యః–సంశయస్య–అస్య ఛేత్తా–న–హి–ఉపపద్యతే

ప్రతిపదార్థము:— హేకృష్ణ=ఓశ్రీకృష్ణభగవానుడా!; ఏతం=పూర్వోక్తమగు; మే=నాయొక్క; సంశయం=ఉభయభ్రష్టత్వ ప్రయుక్తమగు నాశసత్త్వాఽసత్త్వోభయకోటికమగు సంశయమును; అశేషతః=నిశ్శేషముగ; ఛేత్తుం=ఛేదించుటకు; త్వం=నీవు; (ఈపదమధ్యాహార్యము) అర్హసి=తగుదువు, అస్య=ఈ; సంశయస్య=సంశయమును; త్వదన్యః=నీకంటెనితరుడగువాడు; ఛేత్తా=ఛేదించెడివాడు; నహ్యుపపద్యతే=లేడు; ॥౩౯॥

శాంకరభాష్యమ్.—

ఏతదితి। ఏతన్మే మమ సంశయం కృష్ణ! ఛేత్తు మపనేతు మర్హస్యశేషత స్త్వదన్య స్త్వత్తోఽన్య ఋషి ర్దేవో వా ఛేత్తా నాశయితా సంశయస్యాస్య నహి యస్మాదుః పపద్యతే సంభవ త్యత స్త్వమేవ ఛేత్తు మర్హసీత్యర్థః ॥౩౯॥

శాంకరభాష్యతత్త్వబోధని.—

ఓ కృష్ణప్రభూ! పూర్వోక్తమగుయతివిషయకమగు యుభయభ్రష్టత్వ ప్రయుక్త నాశాసత్త్వ సత్త్వరూపమగు సంశయమును నీవే నిశ్శేషముగ తొలగించుట కర్హుడవు. నీకంటె నితరుడగు దేవుడుగాని, ఋషిగాని, వేరొకడు యీసంశయమును తొలగించుటకు సమర్థుడు లేడు. కాన సర్వజ్ఞుడవగు నీవే యీసంశయనివారణార్హుడవని యర్థము. ॥౩౯॥

గీతారహస్యవిమర్శనము:— శ్రీ బాలగంగాధరతిలక్మహాశయులు కర్మజ్ఞానసముచ్చయమును విహంగమన్యాయము ననుసరించి యంగీకరించిరి. అట్లు కర్మజ్ఞాన సముచ్చయమే యంగీకరించినచో యోగభ్రష్టునకు ఆపస్తంబాది మహర్షులు మొదలగువారిచే నంగీకరింపబడిన నిష్కామకర్మఫలము ప్రాప్తించుచుండ "కచ్చిన్నోభయ విభ్రష్ట శ్ఛిన్నాభ్ర మివ నశ్యతి" అను యుభయభ్రష్టత్వప్రశ్న యనుపపన్న మగును. కాన తిలక్మహాశయుల కర్మజ్ఞానసముచ్చయ మీ గీతావచనమునకు విరుద్ధమగును. కాన కర్మజ్ఞానసముచ్చయ మెట్టుల చూచినను పొసగదు. ॥౩౮॥

—౬వ అధ్యాయము—౩౯వ శ్లోకవ్యాఖ్యావిశేషములు.—

మధుసూదనసరస్వతీయము:— వెనుక చూపబడిన సంశయమును తొలగించుట కర్జునుడు శ్రీ కృష్ణపరమాత్మను "ఏతన్మే" అను శ్లోకముచే ప్రార్థించుచుండెను.

ఓ కృష్ణపరమాత్మ! నీవు నిశ్శేషముగ సంశయమూలమగు యధర్మమును నశింపచేయుట ద్వారము నీ సంశయమును తొలగించుటకు తగుదువు. నాకంటె యితరుడగు ఋషికాని, దేవుడుకాని, నీసంశయము తొలగించకలడనెదవా? పరమేశ్వరుడు, వేదకర్త, పరమగురువు, కారుణికుడు, అగు నీకంటె యితరుడు అగువాడనీశ్వరుడగుటచే అసర్వజ్ఞుడు. అట్టి ఋషికాని, దేవుడుకాని, యోగభ్రష్టుని పరలోకగతి విషయమగు సంశయమును లెస్సగ మంచి సమాధాన ప్రదానపూర్వకముగ తొలగించువాడు సంభవింపడు. కాన, ప్రత్యక్షదర్శివి, పరమగురుడవునగునీవే యీసంశయమును ఛేదించుటకు తగుదువు. ॥౯౩॥

శంకరానందీయము:— ఓ శ్రీకృష్ణ! సదానందస్వరూప! పరమాత్మ। సర్వజ్ఞుడవు, పరమేశ్వరుడవు అగు నీవెహా యీసంశయమును నిశ్శేషముగ శ్రుతి స్మృతియుక్తులచే ఛేదించుటకు సమర్థుడవు. యీసంశయము తొలగించినచో ముముక్షువులు భయములేనివారై సర్వకర్మలను సన్యసించి యోగనిష్ఠయందు ప్రవర్తించెదరు సర్వజ్ఞులు, మహానుభావులు అగు దేవతలుకాని, ఋషులుకాని నీసంశయమును తొలగించెదరు. వారలనడుగుమనె

శ్రీభగవానువాచ—

గీ॥ పార్థ! నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే।
న హి కల్యాణకృత్కశ్చి ద్దుర్గతిం తాత! గచ్ఛతి॥ ౪౦

పదవిభాగము:— పార్థ-న-ఏవ-ఇహ-న-అముత్ర- వినాశః-తస్య-విద్యతే- న-హి- కల్యాణకృత్-కశ్చిత్-దుర్గతిం-తాత-గచ్ఛతి ॥

ప్రతిపదార్థము:— హే పార్థ! కుంతీపుత్రుడవగు నో అర్జునా! తస్య=అట్టియోగభ్రష్టునకు; ఇహ=ఈలోకమునందుకాని; అముత్ర=పరలోకమందుకాని; వినాశః=హీనజన్మప్రాప్తిరూపమగువినాశము;నవిద్యతే=లేదు; తాత! ఓతండ్రీ!; కల్యాణకృత్=యోగరూపమగు పరమశుభమునుజేయువాడగు; కశ్చిత్=ఒకానొకడును; దుర్గతిం=చెడుఫలితమును; నగచ్ఛతి=పొందడు; ॥౪౦॥

---

దవా? దేవతలకు, ఋషులకు నీవే ఆదిపురుషుడవు సర్వజ్ఞుడవు. కాన నీకంటెనితరుడగు, దేవతకాని, ఋషికాని యీసంశయమును నివర్తింపజేయువాడులేదు. "మేధావీ-ఛిన్నసంశయః," అని నీకే సర్వసంశయచ్ఛేత్తృత్వము శాస్త్రప్రసిద్ధము. అని ప్రసిద్ధిద్యోతనార్థము "హి" అను శబ్దమిచట నిజేశింపబడెను. ॥౩౯॥

—:౬వ అధ్యాయము ౪౦ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— ఇట్లుయర్జునునిచే చేయబడిన "యోగభ్రష్టుడునశించునా? నశింపడా? యనుయాశంకను తొలగించుటకు శ్రీకృష్ణపరమాత్మ "పార్థ" అను శ్లోకముచే చెప్పుచుండెను.

"ఉభయవిభ్రష్టుడగు యోగి నశించును" అనుదాని కర్థమేమి ఉచ్ఛృంఖల వృత్తికలవాడువలె వేదవిహిత కర్మపరిత్యాగమువలన శిష్యులచే నిందింపదగిన వాడగు ననియా? లేక శరీరపాతానంతరమున నికృష్టగతినిపొందు ననియా? అనగా "అథైతయోః పథోర్న కతరేణ చ న తే కీటాః పతంగా యదిదం దందశూకమ్" అను శ్రుత్యుక్తరీతిని కీటపతంగదందశూకాదిజన్మలను, "వాన్తాశ్యుల్కాముఖః ప్రేతో విప్రో ధర్మాత్స్వకర్మణాచ్యుతః" అని మనువుచెప్పినరీతిని బ్రాహ్మణుడు స్వధర్మమును పరిత్యజించినచో మరణించినపిమ్మట ఉల్కాముఖుడై వాంతాశియై జన్మించునా?

ఓ యర్జునా! యథాశాస్త్రముగ సర్వకర్మల సన్యసించునట్టిన్ని, సర్వతః విరక్తుడైనట్టిన్ని, గురుసన్నిధికేగి శ్రవణాదుల నాచరించినట్టిన్ని, యోగము సిద్ధింపకుండగ మధ్యనేమరణించినయోగభ్రష్టునకిహలోకమున పరలోకమున వినాశము లేదు. ఎందువలననిన? శాస్త్రవిహితకారి యెవడైనను యీ లోకమున యపఖ్యాతినిగాని, మరణించినపిదప కీటకాదిజన్మములనుకాని పొందడు. ఈ యోగభ్రష్టన్నవో సర్వోత్కృష్టుడు కనుక దుర్గతిని పొందడని చెప్పనవసరములేదు. యెంతమాత్రము దుర్గతిని పొందడనియే యాశయము "తనోత్యాత్మానం పుత్రరూపేణేతి పితా తత ఉచ్యతే స్వార్థకేఽణి తత ఏవ తాతః" తండ్రి తన స్వరూపమునే పుత్రరూపముగ జేయునుగాన తండ్రియే "తాత! అని పిలువబడును. తండ్రియే పుత్రరూపమున నుండుటచే కుమారునకు కూడ "తాత!" అను శబ్దము వర్తించును. శిష్యుడుకూడ పుత్రస్థానీయుడగుటంజేసి శిష్యుడగు యర్జునునియందలి కృపాతిశయమును తెలుపుడుచేయుటకు యర్జునుని "తాత" అని శ్రీకృష్ణపరమాత్మ యిచట సంబోధించెను.

స్వధర్మభ్రష్టునివలె యోగభ్రష్టుడు దేవయాన, పితృయాన సంబంధములేనివాడగుటవలననికృష్టగతిని పొందును. అను అనుమానమునందీయబడిన దేవయాన పితృయాన సంబంధము లేనివాడగుటవలన అను హేతువసిద్ధము. ఎందువలననిన? పంచాగ్నివిద్యయందు "య ఇత్థం విదుర్యేచామీ అరణ్యే శ్రద్ధాం సత్యముపాసతే తేఽర్చిరభిసంభవన్తి" అను శ్రుతి పంచాగ్నివిద్యోపాసకులవలె పంచాగ్నివిద్యోపాసకులు కాని శ్రద్ధాసత్యవంతులగు ముముక్షువులకు దేవయానమార్గముద్వారా బ్రహ్మలోకప్రాప్తిని బోధించుటవలన యీ హేతు

శాంకరభాష్యమ్—

పార్థేతి । హేపార్థ నైవేహ లోకే నాముత్ర పరస్మిన్వా లోకే వినాశ స్తస్యవిద్యతే నాస్తి । నాశో పూర్వస్మా ద్ధీనజన్మ ప్రాప్తిః । స యోగభ్రష్టస్య నాస్తి । నహి యస్మా

శాంకరభాష్యతత్త్వబోధిని—

ఓకౌన్తేయ! అట్టి యోగభ్రష్టుడగు యోగి ఇహలోకమున హీనజన్మ ప్రాప్తిరూపము, పరలోకమున నారకాద్యాది ప్రాప్తిరూపము నగు వినాశమును పొందనేరడు. ఓతండ్రీ! అట్టివాడు శ్రద్ధ, ఇంద్రియసంయమము, కొంతవరకు నాచరించి, శ్రవణాదికము కలవాడు గాన

ప్రసిద్ధమే యగును. శ్రవణాదిపరాయణుడు అగు యోగభ్రష్టునకు "శ్రద్ధాన్వితో భూత్వా" అను శ్రుతిబోధితమగు శ్రద్ధయు, "శాన్తోదాంతః" అను శ్రుతి బోధితమగు అనృతభాషణరూపవాగ్వ్యాపారనిరోధరూపమగు సత్యము ప్రాప్తములు. దమమనగ బహిరింద్రియముల యుచ్ఛృంఖలవ్యాపారనిరోధమే. యోగశాస్త్రమున "అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యాపరిగ్రహా యమాః అహింస, సత్యము, చౌర్యములేకుండుట, బ్రహ్మచర్యము, పరిగ్రహము లేకుండుట యమములు. ఈయమములు యోగాంగముగ జెప్పబడెను. సత్యశబ్దముచే బ్రహ్మమే చెప్పబడినను వేదాంతశ్రవణాదికము సత్యబ్రహ్మచింతనరూపమగుటవలన యోగులు పంచాగ్నివిద్యోపాసకులు కాకున్నను పంచాగ్నివిద్యోపాసకులవలె బ్రహ్మలోకము ప్రాప్తించుట నిస్సంశయమే. ఈవిషయమునే "సంన్యాసా ద్బ్రహ్మణస్స్థానమ్" అను స్మృతియు బోధించుచున్నది. అట్లే ప్రతిదివసము వేదాంతవాక్యవిచారము చేయువానికి యెనుబది కృచ్ఛ్రవ్రతములు చేయువాని ఫలము ప్రాప్తించునని స్మృతి బోధించుచున్నది. ఈచెప్పుటవలన దేలిన యాశయమేమనిన? సంన్యాస, శ్రద్ధా, సత్య, బ్రహ్మవిచారము లలో యేదో యొకదాని నవలంబించినను బ్రహ్మలోకము ప్రాప్తించునని దేలిన యాశయము నాలిగింటి నవలంబించినవానికి బ్రహ్మలోకము ప్రాప్తించుటలో చిత్రమేమున్నది. చిత్రమేమియు లేదు. కనుకనే యోగి చరితము సర్వసుకృతరూపమని "తస్య హ వా ఏవం విదుషో యజ్ఞస్య" అను శ్రుతిచే తైత్తిరీయులు చెప్పుచుండిరి. ఈవిషయమునే స్మృతియు "స్నాతం తేన సమస్తతీర్థసలిలే సర్వాఽపి దత్తాఽవని, ర్యజ్ఞానాం చ కృతం సహస్ర మఖిలా దేవాశ్చ సంపూజితాః । సంసారాచ్చ సముద్ధృతా స్స్వపితర స్త్రైలోక్యపూజ్యోఽ ప్యసౌ, యస్య బ్రహ్మవిచారణే క్షణమపి స్థైర్యం మనః ప్రాప్నుయాత్" ఎవని మనస్సు క్షణకాలమైనను బ్రహ్మవిచారణయందు స్థిరత్వము పొందునో వాడు సమస్తపుణ్యనదులయందు స్నానమాచరించినవాడు, ఆసేతుహిమాచలమధ్యనుండు నిఖిలభూమిని దానము చేసినవాడు, సహస్ర యజ్ఞము లాచరించినవాడు, నిఖిలదేవతలను పూజించినవాడు యగును. వాని పితృదేవతలు సంసారమునుండి యుద్ధరింపబడినవారగుదురు వేయేల అట్టివాడు ముల్లోకములయందుండువారలచే పూజ్యుడని బోధించుచున్నది. ॥౪౦॥

శంకరానందీయము:—"న్యాస ఇతి బ్రహ్మ బ్రహ్మ హి పరః పరో హి బ్రహ్మ తాని వా ఏతాన్యవరాణి తపాంసి న్యాస ఏవాత్యరేచయత్" అను శ్రుతి సంన్యాసమునకు బ్రహ్మస్వరూపత్వమును, సర్వతపస్సుకంటె యుత్కృష్టత్వమును బోధించుచున్నది. అట్లే "వేదాన్తవిజ్ఞానసునిశ్చితార్థా స్సంన్యాసయోగా ద్యతయశ్శుద్ధసత్త్వాః" అను శ్రుతియు సంన్యాసయోగముకల యతులకు శుద్ధసత్త్వమును, వేదాంతార్థవిజ్ఞాతృత్వమును బోధించుచున్నది. ఋతం తపస్సత్యం తపశ్శ్రుతం తపశ్శాన్తం తపః" "శమేన శాన్తా శ్శివమాచరన్తి శమేన నాకం మునయోఽన్వవిన్దన్ । తస్మా చ్ఛమం పరమం వదన్తి దమేనదాన్తాః కిల్బిష మవధూన్వన్తి దమేన బ్రహ్మచారిణస్సువరగచ్ఛన్ । దమోభూతానాం దురాధర్షమ్ । సత్యం పరం పరం సత్యం సత్యేన నసువర్గాల్లోకాచ్చ్యవన్తే కదాచన సతాం హి సత్యం" ఇత్యాది శ్రుతివాక్యములచే ముముక్షుధర్మము లగు

శాంకరభాష్యమ్:—

తత్కల్యాణకృచ్ఛుభకృత్కశ్చిద్దుర్గతిం కుత్సితాం గతిం హే తాత ! తనోత్యాత్మానం పుత్రరూపే ణేతి పితా తాత ఉచ్యతే పితైవ పుత్ర ఇతి పుత్రోఽపి తాత ఉచ్యతే శిష్యోఽపి పుత్ర ఉచ్యతే గచ్ఛతి । ॥౪౦॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

శుభకృత్తు (మంచినిచేసినవాడు) అగును. అట్టివాడు దుర్గతినిపొందనేరడు. ("ఇట తాత అను శబ్దము కేవలము తండ్రినే చెప్పునది యైనను "ఆత్మావై పుత్రనామాసి" అను శ్రుతిచొప్పున తాత శబ్దముచే బుత్రుడుకూడ జెప్పబడును. కనుక పుత్రస్థానీయుడగు శిష్యుని గూడ తాత" అను శబ్దముచే బిలుచుట యవిరుద్ధము. ॥౪౦॥

ఋతసత్యశ్రుతశాన్త్యాదులకు తపస్త్వము చెప్పబడుచున్నది. "మానసం హి ప్రాజాపత్యం" "మనసశ్చేన్ద్రియాణాంచ హ్యైకాగ్ర్యం పరమంతపః" "అశ్వమేధ సహస్రాణి వాజపేయ శతానిచ । ఏకస్య ధ్యానయోగస్య కలాం నార్హన్తి షోడశీం" అను శ్రుతిస్మృతులు సమాధికి పరమతపస్త్వమును బోధించుచున్నవి. "అథ యద్యజ్ఞ ఇత్యాచక్షతే । బ్రహ్మచర్యమేవ బ్రహ్మలోకం నిగచ్ఛ బ్రహ్మచర్యైక నిష్ఠయా అహింసా పరమోధర్మో యయా యాతి త్రివిష్టపమ్" తపఃహోమని సర్వేషాం వైరాగ్యం పరమ తపః" "సత్యం తీర్థం క్షమాతీర్థం తీర్థమిన్ద్రియనిగ్రహః । సర్వభూతదయాతీర్థం తీర్థమార్జవ మేవచ" ఇత్యాది శ్రుతిస్మృతులు ముముక్షుధర్మములగు బ్రహ్మచర్యాదులకు పరమమహత్త్వమును బోధించుచున్నవి. విఘ్నముచే విహతమైన యోగముకల జడభరత వీత హవ్యాదులకు జన్మాంతరమున యోగ పారంగతత్త్వము విష్ణుపురాణమునందు, వాసిష్ఠాదులయందు ప్రసిద్ధమే. ఇట్లు నిరుక్తలక్షణములచేతను, సంన్యాస ఋతసత్య శమదమాద్యుత్తమ తపస్సులచేతను, బ్రహ్మచర్యాద్యుత్తమ ధర్మములచేతను కూడుకొనిన యతికి యొకానొక దుష్కర్మవశమున యోగభ్రంశ సంభవించినను అట్టి బ్రహ్మవేత్తకు యిహలోకమునకాని, పరలోకమునకాని, యే యనర్థము లేదని "పార్థ" అను శ్లోకముచే శ్రీకృష్ణ పరమాత్మ చెప్పమొదలిడెను.

తనచే సమర్పించబడిన బ్రహ్మవిద్యను శిష్యప్రశిష్యద్వారమున వివరింపజేయువాడగుటవలన యర్జునుని "హే తాత" అని సంబోధించెను. ఓ యర్జునా ! సమాధినిష్ఠయందు ప్రవృత్తమైన సంన్యాసఋతసత్యశమదమాద్యుత్తమతపోవిశిష్టుడైన, బ్రహ్మచర్యాహింసాదివిశేషధర్మములు కల యతికి దుష్కర్మవశమున బ్రహ్మమార్గప్రచ్యుతి సంభవించినను యీ భూలోకమున "వినాశః" శిష్టగర్హణచే ప్రాప్తమైన ప్రతిష్ఠాభంగరూపవినాశము "నైవాస్తి" లేదు. అనగా అట్టియతి బ్రహ్మవిద్యయందు శ్రద్ధా మొదలగు విశేషగుణములు కలవాడగుటవలనను, బ్రహ్మచర్యాద్యుత్తమధర్మములు కలవాడగుటవలనను శిష్టులు నిందించుట సంభవింపనందున నాశములేదని యాశయము. శాస్త్రము నతిక్రమింపకుండగ సంకల్పపూర్వకముగ యజ్ఞములను ప్రకటించి యగ్నిష్టోమాద్యంత క్రతువుల నాచరించి దైవవశమున మిగిలిన క్రత్వకనమునకు విఘ్నము ప్రాప్తింప శ్రద్ధావంతుడగునట్టి యజమానుని శ్రోత్రియులు నిందింపనటుల పైచెప్పబడిన యతికి యీ లోకమున ప్రతిష్ఠాభంగరూపమగు వినాశము సంభవింపదు. అట్లే పరలోకమునను యీ యతి కల్యాణకృత్తగుటవలన దుర్యోని దుర్గతి ప్రాప్తిరూపమగు వినాశము ప్రాప్తింపదు. శుభము నాచరించువాడెవడును దుర్గతిని పొందడు. సద్గతినే పొందును. ఈవిషయమునే "తద్య ఇహ రమణీయ చరణా అభ్యాశో హ యత్తే రమణీయాం యోని మాపద్యేరన్ బ్రాహ్మణ యోనిం వా క్షత్రియయోనిం వా వైశ్యయోనిం వా" అనుశ్రుతియు బోధించుచున్నది.

శ్చ, అతికల్యాణరూపత్వాన్నిత్యకల్యాణసంశ్రయాత్ । స్మర్తౄణాం వరదత్వాచ్చ బ్రహ్మతన్మంగళంవిదుః" "మంగళానాంచ మంగళమ్" "పవిత్రం మంగళం పరమ్" ఇత్యాది వాక్యములు పరబ్రహ్మమునకు మంగళస్వరూపత్వమును బోధించుటవలన మంగళస్వరూపమగు బ్రహ్మమును స్వస్వరూపముగ సాక్షాత్తు తెలిసికొనువాడు కల్యాణకృత్తు. అట్టి బ్రహ్మవిత్తగు బ్రాహ్మణుడుకాని, క్షత్రియుండుకాని, యితరుడుకాని, యోగభ్రంశమును పొంది నరకమును పొందడు, జడభరతాదుల యందీవిషయము ప్రసిద్ధమే యని "హి" అను శబ్దము ద్యోతనచేయుచున్నది.

ధ్యానయోగమునందు ప్రవృత్తుడైన యతి బ్రహ్మవేత్త కాడు. బ్రహ్మవేత్తయే యగుచో ధ్యానాభ్యాసక్రియయే సంభవింపదు. ధ్యానయోగాభ్యాసముకూడ స్వాధ్యాయాభ్యాసమువలె క్రియయే యగును. "తస్య కార్యం న విద్యతే" "నైవాస్తి కించి త్కర్తవ్యం" అను వాక్యములు బ్రహ్మవేత్తకు కర్తవ్యాభావమును బోధించుచున్నవి అని యనెదవా ? సత్యమే. బ్రహ్మవేత్తకు కర్తవ్యము కాదు. వాడు కృతకృత్యుడు, వానికి చక్షురింద్రియమునకు రూపమువలె బహిరంతః బ్రహ్మోపలబ్ధియే. అయినను యీవిషయమున నిన్నొకటి యడుగదగియున్నది. "ఆత్మా వా౽రే ద్రష్టవ్యః శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః" అను శ్రుతిచే ముముక్షువునకు నిదిధ్యాస కర్తవ్యముగ బోధింపబడుచున్నది. అట్టి నిదిధ్యాస శ్రవణ మొనరించినవానికా ? శ్రవణ మొనరించినవానికనెదవా ? అట్లగుచో వేదస్త్రార్థశూన్యున కాత్మానాత్మవివేకవిభాగజ్ఞానము లేమింజేసి అట్టివానికి నిదిధ్యాసయే యుపపన్నము కాదు. శ్రవణ మొనరించువానికే నిదిధ్యాస యని యనెదవా ? అట్లగుచో శ్రవణాదులచే తెలియబడిన యాత్మతత్త్వముకలవానికి నిదిధ్యాస యనెవా ? శ్రవణాదులచే నాత్మతత్త్వము తెలియబడనివానికే నిదిధ్యాసయనెదవా ? శ్రవణాదులచే నవిదితాత్మతత్త్వముకలవానికి నిధిధ్యాసయే సంభవింపనందున రెండవపక్షము సంభవింపదు. నిదిధ్యాసయనగ విజాతీయప్రత్యయతిరస్కార పూర్వకముగ సజాతీయప్రత్యయావృత్తియే కదా. అట్టి నిదిధ్యాస లెస్సగ తెలియబడిన యాత్మతత్త్వము కలవానికే సిద్ధించుచున్నది. ఎట్లనిన ? "ఘటప్రత్యయమునకు విజాతీయము పటప్రత్యయము" అను జ్ఞానము ఘటపటముల స్వరూపలక్షణజ్ఞానానంతరమే కలుగును. ఘటపటముల సందర్శనముకలవానికే ఘటపటవిజ్ఞానము సిద్ధించును. యితరునకు సిద్ధింపనట్లు ఆత్మప్రత్యయముల కనాత్మప్రత్యయములు విజాతీయములు అను జ్ఞాన మాత్మానాత్మల స్వరూపమును, లక్షణమును తెలిసినవానికే సిద్ధించును. తత్సాక్షాత్కారము కలవానికే యట్టి విజ్ఞానము కలుగును. యితరునకు కలుగదు. లోకమున యెవడును గండభేరండమును చూడనివాడు దృష్టమగు గరుడాదులవలె భావించుటకు శక్యుడు కాడు. అట్లే యవిజ్ఞాతమైన యాత్మతత్త్వము కల తదనుభవశూన్యుడు స్వానుభవము లేనందున యనాత్మనువలె యాత్మను భావన చేయుటకు సమర్థుడు కాడు. కాన అనాత్మవలె తద్విలక్షణముగ నాత్మస్వరూపమును లెస్సగ తెలిసినవానికే నిదిధ్యాసరూపమగు సమాధి కర్తవ్యమగును. "తమేవ ధీరో విజ్ఞాయ ప్రజ్ఞాం కుర్వీత బ్రాహ్మణః" "తమేవైకం జానథ ఆత్మాన మన్యా వాచో విముంచథ" అని చెప్పి నిరుక్తలక్షణముకల యాత్మ తెలిసినవానికే "ఓమిత్యేవం ధ్యాయథ ఆత్మానమ్" అను శ్రుతి యాత్మధ్యానమును విధించుచుండెను.

ఆత్మజ్ఞానికి ధ్యానముతోగాని, సమాధితోగాని, యేమి ప్రయోజనముని తలపవలదు, ధ్యానసమాధులాత్మజ్ఞానాప్రతిబంధహేతువులు. "సర్వమిద మహంచ బ్రహ్మైవ" అని సర్వమునకు తనకు బ్రహ్మమాత్రత్వవిజ్ఞానము బ్రహ్మమునందే యాత్మతాజ్ఞానమున్న యప్రతిబద్ధమై శ్రుతిమాత్రముచే ధ్యానసమాధులు లేనిదే సిద్ధింపదు. "సమాహితో భూత్వా౽౽త్మ న్యేవాత్మానం పశ్యతి సర్వ మాత్మానం పశ్యతి" అని బ్రహ్మవేత్తకు బ్రహ్మమునందే యాత్మత్వవిజ్ఞానము సిద్ధించుటకు నిదిధ్యాసాదిక మవశ్యము కర్తవ్యమని పర్యవసితము. ॥౧౦॥

గీ॥ ప్రాప్య పుణ్యకృతాం లోకా నుషిత్వా శాశ్వతీ స్సమాః,
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥

పదవిభాగము:— ప్రాప్య-పుణ్యకృతాం-లోకాన్-ఉషిత్వా-శాశ్వతీః- సమాః- శుచీనాం-శ్రీమతాం-గేహే- యోగభ్రష్టః-అభిజాయతే- ॥౪౧॥

ప్రతిపదార్థము:—యోగభ్రష్టః=యోగమునుండిభ్రంశము పొందినవాడు; పుణ్యకృతాం=అశ్వమేధాది పుణ్యకర్మలు జేసినవారియొక్క; లోకాన్=పుణ్యలోకములను; ప్రాప్య=పొంది; శాశ్వతీః=అనేకములైన; సమాః=సంవత్సరములు; ఉషిత్వా=నివసించి; శుచీనాం=వేదోక్త కర్మ కారులగు; శ్రీమతాం=ఐశ్వర్యవంతుల; గేహే=గృహమునందు; అభిజాయతే=పుట్టుచున్నాడు; ॥౪౧॥

---

శాంకరభాష్యమ్:—

కిం త్వస్య భవతి— యోగమార్గే ప్రవృత్త స్సంన్యాసీ సామర్థ్యా త్ప్రాప్య గత్వా పుణ్యకృతా మశ్వమేధాదియాజినాం లోకాం స్తత్ర చోషిత్వా వాస మనుభూయ శాశ్వతీ ర్నిత్యా స్సమా స్సంవత్సరాం స్తద్భోగక్షయే శుచీనాం యథోక్తకారిణాం శ్రీమతాం విభూతిమతాం గృహే యోగభ్రష్టోఽభిజాయతే॥ ॥౪౧॥

---

శాంకరభాష్యతత్త్వబోధినీ:—

యోగమార్గమునందు ప్రవర్తించుయతి యోగమార్గమునుండి భ్రష్టుడగుచో నాతడు అశ్వమేధాది యాగముల ననుష్ఠించినవా రేలోకములను పొందెదరో యాలోకములనే పొంది యట యనేక సంవత్సరములు నివసించి యాభోగక్షయము కాగానే యథాశాస్త్రోక్త కర్మ కారులగు శ్రీమంతులఇంటిలో బుట్టును. ॥౪౧॥

---

—౬వ అధ్యాయము—౪౧వ శ్లోక వ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— యోగభ్రష్టుడు శుభము నాచరించువాడగుటచే లోకద్వయమునందతనికి నాశములేనిచో యేమి ప్రాప్తించును. అను శంకపై "ప్రాప్య" అని చెప్పుచుండెను.

సర్వకర్మసంన్యాసి యోగమార్గప్రవృత్తుడై వేదాన్తశ్రవణాదికము చేయుచుండగ నంతరాళమున మరణించి యొకానొకడు పూర్వోపచితభోగ వాసనా ప్రాదుర్భావమువలన విషయములను కోరును. మరియొకడు వైరాగ్యభావనా దార్ఢ్యము వలన విషయములను కోరడు. వారిరువురిలో మొదటివాడగు విషయములను కోరువాడు అశ్వమేధ క్రతువులను జేసినవారలు పొందు పుణ్యలోకములను యర్చిరాదిమార్గముచే పొంది (ఇట "లోకాన్" అని బహువచనము భోగభూమి భేదముల ననుసరించి ప్రయోగింపబడెను) బ్రహ్మపరిమాణముచే నక్షయమగు సంవత్సరములు నివసించి తదంతమున (కల్పాంతమున) ఐశ్వరసంపన్నులైన పరమశుద్ధులైన మహారాజ చక్రవర్తుల కులమునందు భోగవాసనా శేషము యుండుటవలన నజాతశత్రు జనకాదులవలె యోగభ్రష్టుడు జనించును. అనగా భోగవాసనా ప్రాబల్యమున బ్రహ్మలోకాన్తమునందు సర్వకర్మ సంన్యాసయోగ్యుడై మహారాజై జనించును. ॥౪౧॥

శంకరానందీయము:— పూర్వమునందు చెప్పిన విధమున సమాధినాచరించు బ్రహ్మవేత్తకు దుష్కర్మవశమున సమాధివిఘ్నము ప్రాప్తించి మధ్యమరణము ప్రాప్తించినచో నాయతికి దుర్గతి లేదు. మరియు సద్గతియే ప్రాప్తించునని "ప్రాప్య" అను శ్లోకముచే జెప్పుచుండెను.

యోగమార్గమునందు ప్రవృత్తమైన బ్రహ్మవేత్తయగు యతి యోగసిద్ధిని పొందనివాడై మరణించి "వాజిమేధ సహస్రాణి రాజసూయశతానిచ! వాజపేయసహస్రాణ్యశ్వమేధశతాని చ ॥ ఏకస్యజ్ఞానయోగస్య కలాం నార్హన్తిషోడశీమ్" అనేకవేల వాజిమేధములు, అనేక రాజసూయ యాగములు, వాజపేయ

గీ॥ అథవా యోగినా మేవ కులే భవతి ధీమతాం ।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశం ॥ ॥౪౨॥

పదవిభాగము:— అథ-వా- యోగినాం- ఏవ-కులే-భవతి-ధీమతాం- హి-దుర్లభతరం-లోకే-జన్మ-యత్ -ఈదృశం ॥ ॥౪౨॥

ప్రతిపదార్థము:— అథవా=అట్లుకానిచో; ధీమతాం=బ్రహ్మవిద్యావేత్తలగు; యోగినాం=యోగులగు దరిద్రులయొక్క; కులేఏవ=కులమునందే; జన్మ=పుట్టుక; భవతి=యగుచున్నది: లోకే=లోకమునందు; ఏతద్ధి=ఈ; జన్మ=పుట్టువు; ఈదృశం=యిట్టిది; దుర్లభతరం=దుర్లభమైనదికదా; ॥౪౨॥

---

సహస్రములు, అశ్వమేధ శతములు ఒక జ్ఞానయోగముయొక్క పదునారవకళకు సరిపడవు "మనసశ్చేంద్రియాణాంచహ్యైకాగ్ర్యం పరమంతపః" మనస్సునకు యింద్రియములకు ఏకాగ్రత పరమతపస్సు అని యశ్వమేధాది క్రతుకోటులకంటె ధ్యానయోగము మహత్తరపుణ్యకర్మయనియు, పరమతపస్సనియు, స్మృతి బోధించుటవలన యట్టి పుణ్యకర్మ మహిమచేతనే స్వయముగ నశ్వమేధాది మహాక్రతువుల నాచరించినవారల మహాలోకములను పొంది యనేకసంవత్సరములు యచట భోగముల ననుభవించి యనంతరమున యీ లోకమునందు యోనిబీజకర్మాదులచే శుద్ధులైన భాగ్యవంతులగు గృహస్థులవంశమునందు యోగభ్రష్టుడు జనించును. కర్మభ్రష్టుడైనమాత్రము జనింపడు. కర్మల నాచరించువానికిమాత్రము కర్మభ్రంశ ప్రాప్తించినచో తైలపాకమువలె సాంగకర్మలవలననే ఫల మవశ్యంభావి యగుటవలన పుణ్యలోకప్రాప్తియు, శుచిశ్రీమంతుల వంశమున జనించుటయు సంభవింపదు. అట్లు యోగికి కాదు. యోగికి దేవతాధ్యానమువలె నెంతెంత యోగానుష్ఠానమో అంతంతఫలము ప్రాప్తించును. కనుకనే యోగభ్రంశ ప్రాప్తించినను యోగికి పుణ్యలోకప్రాప్తి, శుచిశ్రీమతుల ప్రమాప్తి సంభవించునని యర్థము. ॥౪౧॥

—•౬వ అధ్యాయము—౪౨వ శ్లోకవ్యాఖ్యావిశేషములు•—

మధుసూదనసరస్వతీయము:— వైరాగ్యభావనాదార్ఢ్యమువలన నెవడు విషయములను కోరడో యట్టివానిగూర్చి "అథవా" అను శ్లోకముచే జెప్పుచుండెను.

శ్రద్ధావైరాగ్యాది కల్యాణగుణము అధికమైయుండ భోగవాసనలేమింజేసి పుణ్యమాచరించు వారలలోకమును పొందక దరిద్రులు, బ్రహ్మవిద్యావంతులు నగు బ్రాహ్మణులకులమునందే యోగభ్రష్టుడగు యోగిజనించును. శ్రీమంతులగు క్షత్రియులకులమున జన్మింపడు. "యోగినాం" అని చెప్పుటచేత కర్మలగ్రహమున కాదని స్పష్టపరుపబడెను. పవిత్రులైన శ్రీమంతులగు క్షత్రియులగృహమునందు జన్మముకూడ ననేకసుకృతసాధ్యమగుటవలనను, మోక్షపర్యవసాయి యగుటవలనను దుర్లభమే.

పవిత్రులు, దరిద్రులు, బ్రహ్మవిద్యావంతులు నగు బ్రాహ్మణుల కులమునందు జన్మించుట శుకాదులవలె దుర్లభమైనదానికంటె దుర్లభము. సర్వప్రమాద కారణశూన్యమైన యట్టి జన్మము దుర్లభము. అని రెండవవాడు భోగవాసనాశూన్యుడగుటచే సర్వకర్మ సంన్యాసార్హుడగుటవలన స్తుతింపబడుచుండెను. ॥౪౨॥

శంకరానందీయము:— "మనోహరాణాం భోజ్యానాం యువతీనాంచ వాససామ్ । విత్తస్యాపి చ సాన్నిధ్యాచ్చలే చ్చిత్తం సతామపి । తస్మాన్నిత్యం తతస్త్యక్త్వా ముముక్షు ర్దూరతో వసేత్" మనోహరమగు భోజ్యములైన స్త్రీలయొక్కయు, వస్త్రముల యొక్కయు, ధనముయొక్కయు, సాన్నిధ్యమువలన సత్పురుషులయొక్కయు చిత్తముచలించును. కాన, నిత్యము అట్టి సాన్నిధ్యమును విడచి ముముక్షువు దూరమునసుండవలెనను న్యాయముచే విషయసాన్నిధ్యమే విక్షేపకరమైయుండ శ్రీమంతుని గృహమునందు జన్మించిన యుత్తమభక్తుడగు యోగికి విషయభోగాసక్తిచే రాగద్వేషాదులచే మనస్సుయొక్క క్షోభను విడచి తిరిగి వివేకవైరాగ్యాది విజ్ఞాన యోగము శీఘ్రముగ సంభవింపదని యోగసిద్ధికి కాలవ్యవధానమును సహింపనివాడై శ్రీకృష్ణపరమాత్మ "అథవా" అని పక్షాంతరమును చెప్పుచుండెను.

శాంకరభాష్యమ్:—

అథేతి । అథవా శ్రీమతాం కులా దన్యస్మిన్ యోగినామేవ దరిద్రాణాం కులే భవతి జాయతే ధీమతాం బుద్ధిమతాం ఏతద్ధి జన్మ యద్దరిద్రాణాం యోగినాం కులే దుర్లభతరం దుఃఖలభ్యతరం పూర్వ మపేక్ష్య లోకే జన్మ యదీదృశం యథోక్తవిశేషణే కులే ॥౪౨॥

శాంకరభాష్యతాత్పర్యబోధినీ:—

ఓ అర్జునా! పూర్వోక్తవిధముగా గానిచో నట్టియోగభ్రష్టుడు బ్రహ్మవిద్యావేత్తలు దరిద్రులునగు వారివంశముననే జన్మించును. లోకమున యిట్టి యోగభ్రష్టుడు శ్రీమంతులవంశమునబుట్టుటకంటె బ్రహ్మవిద్యావేత్తలగు దరిద్రులయిండ్లలో జన్మించుట దుర్లభము ॥౪౨॥

శ్రీమంతులకంటె విలక్షణులగు దరిద్రులు, పవిత్రులు, ధీమంతులు అగు యోగులకులమునందు అట్టి యోగభ్రష్టుడు జన్మించును. లేక, బ్రహ్మవేత్త మరణకాలమున ప్రాచీనకర్మవశమున హృదయమునందు విషయభోగేచ్ఛా వేగముకలవాడైనచో పుణ్యాత్ముల లోకముల ననుభవించి శేషానుభూతి కొఱకు శ్రీమంతుల గృహమునందు జన్మించును. హృదయమునందు చిత్తశోధక సత్కర్మ విశేషవశమున తీవ్రమోక్షేచ్ఛా వైరాగ్య ముండినచో అట్టి సమయమున నాయోగి "అథవా" ఇట "అథ-వా" అని పదద్వయము. వాశబ్ద మవధారణార్థకము. దేహపాతానంతరమునందే జ్ఞానులు అందునను జ్ఞానయోగనిష్ఠులగువారల కులమునందే జన్మించును. ఇట్టి వైరాగ్య మోక్షేచ్ఛా వేగమున కనురూపమగు బ్రహ్మనిష్ఠులై జ్ఞానుల కులమునందు యీ శరీరపాతానంతరమునం దీజన్మమే దుర్లభతరము. గృహస్థులకు జ్ఞానమే దుర్లభము. అందట్టిబ్రహ్మనిష్ఠకలవారల కులమునందు లోకాంతరమును, యోన్యంతరమును పొందక కాలవ్యవధానము లేకుండగనే జన్మించుట దుర్లభతరము. అట్టి జన్మము గొప్పతపస్సుచే లభ్యము కాదు. కనుకనే యట్టి జన్మము దుర్లభతరమని చెప్పబడుచున్నది.

శమదమవైరాగ్య సంన్యాసాద్యంతరంగ సాధనములు లేని బహిర్ముఖులగు గృహస్థులకు జ్ఞానోత్పత్తి కధికారమే సంభవింపనందున శ్రవణాదులచే వారల కపరోక్షజ్ఞానమే సంభవింపదు. అపరోక్షజ్ఞానము పరమహంసలకే ప్రాప్తించును కదా. కాన జ్ఞానులగు గృహస్థులకులమునందు యోగభ్రష్టుడు జన్మించునని చెప్పుట యెట్లు పొసగునని శంకింపజనదు.

ముఖ్యాధికారియగు పరమహంసకే వేదాంతశ్రవణాదులచే బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానము జనించును. ఆశ్రమాంతరనిష్ఠునకు జనింపదు. కాన, గృహస్థునకు జ్ఞానము లేనిచో వారలకు జ్ఞాననిష్ఠ యెక్కడ? అని యనెదవా? అట్లగుచో "ధీమతాం" కర్మశాస్త్రార్థ జ్ఞానవంతులగు "యోగినాం" కర్మయోగుల కులమునందు యోగభ్రష్టుడు జన్మించును. అని చెప్పెదవా? అట్లగుచో శ్రోత్రియకులమున జన్మించుట సత్కర్మకలవారికి కూడ సాధారణమగుటవలన నెవరెవరు సత్కర్మవంతులో వారందరు "రమణీయచరణాః" అను శ్రుతివలన శ్రోత్రియుల కులమందే జన్మించెదరు. యోగభ్రష్టున కట్టిజన్మమునకు దుర్లభతరత్వానుపపత్తి ప్రమాణార్థాపత్తిచే నీశ్వరానుగ్రహముకల కొందరుగృహస్థులకు కూడ శుద్ధాత్ములగు వారలకు జ్ఞానము, జ్ఞానయోగిత్వము నంగీకరింపవలయును. అట్లంగీకరించనచో ప్రాచీనులగు వసిష్ఠాగస్త్యాదులకు, జనకాశ్వపత్యాదులకు, అధునికులగు వాచస్పతిఖండనకారాదులకు అనాత్మజ్ఞత్వము సంభవించెడిని. అట్లగుచో "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" అను సూత్రస్థమగు "అథ" అను శబ్దముచే సూచితమైన శ్రవణసాధనమగు సాధనచతుష్టయసంపత్తి లేకున్నను, శ్రవణాదులచే జ్ఞానము సిద్ధించుచో "అథ" అను శబ్దమున కానర్థక్యము సంభవించు నని శకింపజనదు. అట్టి గృహస్థులకు కూడ యీజన్మమున జనించిన జ్ఞానముచే జన్మాంతరమందు శమదమసంన్యాసాద్యుత్తమసాధనములు కలవని యూహించుటవలన "అథ" అను శబ్ద మర్థవత్తే యగును. అట్లగుచో శమదమసంన్యాససాధనములు కలవారల శ్రవణాదులచే జనించిన జ్ఞానముచే

గీ॥ తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికం ।
యతతే చ తతో భూయ స్సంసిద్ధౌ కురునందన ॥ ॥౪౩॥

పదవిభాగము:—తత్ర-తం-బుద్ధిసంయోగం- లభతే -పౌర్వదైహికం- యతతే-చ-తతః-భూయః-సంసిద్ధౌ-కురునందన ॥౪౩॥

ప్రతిపదార్థము:— తత్ర=బ్రహ్మవేత్తలగు దరిద్రులవంశమునందు పౌర్వదేహికం= పూర్వదేహసంబంధమగు; తం=ఆ; బుద్ధిసంయోగం=ఆత్మవిషయకబుద్ధితో సంబంధమును; సః=ఆయోగభ్రష్టుడు; (ఈపదమధ్యాహార్యము) లభతే=పొందుచున్నాడు; తతః=ఆ పూర్వకర్మసంస్కారము వలన; భూయః=ఎక్కువగా; సంసిద్ధౌ=మోక్షమువిషయమై; యతతే=శ్రవణాద్యనుష్ఠాన విషయకమగు ప్రయత్నము జేయుచున్నాడు. ॥౪౩॥

---

వారలు కాజన్మమునందే ముక్తి సిద్ధించుచుండ తిరిగి జనించుట యట్టివారల కెటుల పొసగుననెదవా! వారల కట్టిసాధనసంపత్తి పూర్వజన్మవందున్నను ప్రతిబంధవశమున సమ్యగ్జ్ఞానము జనింపలేను. కనుకనే పూర్వజన్మమునందట్టి వారలకు మోక్షముసంభవము కాదు. జన్మాంతరమునందు ప్రతిబంధము నివర్తింప సమ్యగ్జ్ఞానము, యోగనిష్ఠ, పరమోపశాంతియు సంభవించును. "క్రమాత్తస్యాపి జాయతే" అను స్మృతివాక్యవిశేషమువలన "క్రమాత్" అక్రమక్రమమువలన, లేక జన్మక్రమమువలన, లేక చిత్తపరిపాకక్రమమువలన "తస్యాపి" అక్రమాంతరవంతునకు కూడ (గృహస్థునకు)-కూడ జ్ఞానముజనించును, అట్టి గృహస్థులకు-విషయానుభావకకర్మచే సమాధివ్యుత్థాన నిరోధము సంభవించుటవలన సమాధివ్యుత్థానము సంభవించు ననుశంకయు తొలగింపబడెను. కాన నిట్టి నిరంతరబ్రహ్మనిష్ఠులు, నిత్యానందామృతపాయులు అగునట్టి గృహస్థులకు సంన్యాసముచే సాధింపదగిన దేదియు లేదు. అట్టివాని దృష్టిచే విషయానుభూతి యాభాసరూపమగుటవలన స్వప్నపదార్థములవలె మిథ్యయగుటంజేసి విషయానుభూతి, బ్రహ్మానుభూతు లొకనికి సంభవము కావను శంకయు తొలగింపబడెను. అట్టివారలగు సర్వమిథ్యాత్వదర్శులకు ప్రత్యవాయానర్థము లేనందున ఒకానొక సమయమునందు వానిచే కర్మ చేయబడును ఒకానొకసమయమునందు కర్మ చేయబడదు. కాన నట్టివానికి వ్యవహారలోపము ప్రాప్తించు ననుశంకయు సంభవింపదు. "శౌచమాచమనం స్నానం నతు చోదనయాచరేత్ । అన్యాంశ్చ నియమాన్ జ్ఞానీ యథాహం లీలయేశ్వరః" పరమేశ్వరునడనగు నేను లీలచే యెటుల జేయుచుంటినో యట్లే జ్ఞానియు లీలచేతనే శౌచము, ఆచమనము, స్నానము మరి యితర కర్మలను యాచరించును. విధివిహితమని మాత్ర మాచరింపడు. అని యీశ్వరునికివలె జ్ఞానికిని విధి, తన్నియమభంగమువలన దోషము లేదని స్మృతి బోధించుచున్నది. ॥౪౩॥

—౬వ అధ్యాయము—౪౩వ శ్లోకవ్యాఖ్యావిశేషములు.—

మధుసూదనసరస్వతీయము:— ఏ కారణమువలన నిట్టి జన్మద్వయము దుర్లభమను శంకపై "తత్ర" అని చెప్పుచుండెను.

పూర్వదేహమునందైన-సర్వకర్మసంన్యాస, గురూపసదన, శ్రవణ, మనన, నిదిధ్యాసనలో యేదేది యనుష్ఠింపబడెనో అంతవరకగు బ్రహ్మాత్మైక్య విషయకమగు బుద్ధిచే తత్సాధనకలాపమును యీ రెండువిధములగు జన్మములందు పొందుచున్నాడు. అంతమాత్రమే కాదు. అట్టి సాధనకలాపముచే తిరిగి యిదివరకు పొందబడిన భూమికకంటె నధికమగు భూమికను సంపాదించుటకు మోక్షమునిమిత్తమై ప్రయత్నించుచున్నాడు. అనగా మోక్షము ప్రాప్తించువరకు భూమికలను సంపాదించుచున్నాడు. ఓకురునందన! నీకును పవిత్రులగు శ్రీమంతులకులమునందు యోగభ్రష్టజన్మ ప్రాప్తించినది. పూర్వవాసనావశమున ననాయాసముగనే నీకు జ్ఞానలాభము కాగలదని సూచించుటకు మహాప్రభావముకల కురువుయొక్క కీర్తనము "కురునందన" అని చేయబడెను. ఈవిషయమే భగవద్వసిష్ఠవచనమునందు "శ్రీరామో వాచ, ఏక మధ ద్వితీయాం వా తృతీయాం భూమికా మత । ఆరూఢస్య మృతస్యాథ కీదృశీ భగవ న్గతిః" పూర్వమునం దేడుభూమికలు వ్యాఖ్యానింపబడెను అందు నిత్యానిత్య వస్తువివేకమువలన నిహాముత్రార్థభోగవైరాగ్యము, దానివలన శమదమశ్రద్ధాతితిక్షా

శాంకరభాష్యమ్:—

యస్మాత్—తత్ర యోగినాం కులే తం బుద్ధిసంయోగం బుద్ధ్యా సంయోగం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికం పూర్వస్మిన్దేహే భవం పౌర్వదేహికం యతతే చ ప్రయత్నం కరోతి తతస్తస్మాత్పూర్వకృతాత్సంస్కారాద్భూయో బహుతరం సంసిద్ధౌ సంసిద్ధినిమిత్తం హే కురునందన॥ ॥౪౩॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

యోగభ్రష్టుడు యథోక్తకర్మకారులు, శ్రీమంతులునగువారి కులమునబుట్టుటకంటె దరిద్రులగు బ్రహ్మజ్ఞానుల కులమున బుట్టుటలో శ్రైష్ఠ్యము నీశ్లోకమున చెప్పుచున్నాడు. కురువంశోద్భవుడవగు నోయర్జునా! యోగభ్రష్టుడు దరిద్రులు, బ్రహ్మజ్ఞానులునగువారికులమున బుట్టిన పూర్వదేహసంబంధమగు జ్ఞానముకలవాడగును. అందుచే నాతడు పూర్వజన్మసంస్కారముచే లెస్సగ మోక్షవిషయమై శ్రవణాద్యనుష్ఠానరూపముగ ప్రయత్నించును ॥ ॥౪౩॥

సర్వకర్మ సంన్యాసాది పురస్సరముగ ముముక్ష జనించును. యీముముక్షయే శుభేచ్ఛ. ఇదియే సాధనచతుష్టయ సంపత్తిరూపమగు ప్రథమభూమిక. దానివలన గురుసన్నిధికేగిచేయు వేదాంతవాక్యవిచారణయే రెండవ భూమిక (శ్రవణమనన సంపత్తు). అనంతరమున శ్రవణమనన పరినిష్పన్నమై తత్త్వజ్ఞానమునకు నిర్విచికిత్సతారూపమే "తనుమానసా" అను మూడవభూమిక (నిదిధ్యాసనసంపత్తు.) తత్త్వసాక్షాత్కారమే నాల్గవభూమిక యనంబడును. అయిదు ఆరు ఏడవభూమికలు జీవన్ముక్తియొక్క యవాంతరభేదములు అని తృతీయాధ్యాయమున వివరింపబడెను. అందు నాల్గవభూమికను పొంది మరణించినవానికి జీవన్ముక్తి లేకున్నను విదేహకైవల్యము తప్పక ప్రాప్తించును. సంశయము లేదు. అయిదు, ఆరు, ఏడవ భూమికలను పొందినవాడు జీవించియున్నను ముక్తుడే. చతుర్థభూమికయందు విదేహుడా? అను సంశయము లేదు. సాధనభూత భూమికాత్రయమునందు కర్మత్యాగము వలన జ్ఞానము లభింపనందునను ఆశంక సంభవించును. ప్రశ్నయు సాధనభూత భూమికాత్రయమునందే. ఈ విషయముననే వసిష్ఠమహర్షిచే "యోగభూమిక యోత్క్రాంతజీవితస్య శరీరిణః । భూమికాంశానుసారేణ క్షీయతే పూర్వదుష్కృతమ్ । తతస్సురవిమానేషు లోకపాలపురేషు చ । మేరూపవనకుంజేషు రమతే రమణీసఖః ॥ తపస్సుకృతసంభారే దుష్కృతే చ పరాకృతే । భోగక్షయా త్పరిణే జాయన్తే యోగినో భువి ॥ శుచీనాం శ్రీమతాం గేహే గుప్తే గుణవతాం సతామ్ । జనిత్వా యోగమేవైతే సేవన్తే యోగవాసితాః ॥ తత్ర ప్రాగ్భావనాభ్యస్తం యోగభూమిక్రమం బుధాః ! దృష్ట్వా పరిపతన్త్యుచ్చైరుత్తరం భూమికాత్రయమ్" అని ప్రాగుపచిత భోగవాసనా ప్రాబల్యమున నల్పకాలాభ్యస్త వైరాగ్యవాసనా దౌర్బల్యముచే ప్రాణోత్క్రాన్తిసమయము ప్రాదుర్భూత భోగస్పృహకలవాడైన సర్వకర్మసంన్యాసియే చెప్పబడెను. మరియు వైరాగ్యవాసనాప్రాబల్యమున ప్రకృష్ట పుణ్యప్రకటిత పరమేశ్వర ప్రసాదవశముచే ప్రాణోత్క్రాంతి సమయమున ననుద్భూతభోగ స్పృహకల సంన్యాసి భోగవ్యవధానము లేకుండగనే బ్రహ్మవేత్తలగు బ్రాహ్మణులయొక్క సర్వప్రమాద కారణ శూన్యమగు కులమునందు సముత్పన్నుడో అట్టివానికి ప్రాచీన సంస్కారాభివ్యక్తివలన ననాయాసముగనే మోక్షము సంభవించుటవలన వెనుకటివానివలె మోక్షమునుగూర్చి యాశంక లేదు. అని చెప్పెను. పరమకారుణికుడైన భగవంతునిచే నైతే "అథవా" అని పక్షాంతరము నవలంబించి చెప్పబడెను. ॥౪॥

శంకరానందీయము:—శిలోంఛవృత్త్యాపరితుష్టచిత్తో, ధర్మంమహాన్తంవిరజంజుషాణః। మయ్యర్పితాత్మా గృహఏవతిష్ఠ, న్నాతిప్రసక్తస్సముపైతిశాన్తిమ్" (శిలావృత్తి చేతను, ఉంఛవృత్తి చేతను సంతోషించినయంతఃకరణముకలవాడై శ్రేష్ఠమగు గొప్పధర్మము నాచరించువాడై పరమేశ్వరునియందే యర్పితమైన యంతఃకరణముకలవాడై యెవడు గృహమునందే యుండి విషయములయం దతిప్రసక్తుడు కాడో యట్టివాడు శాంతిని లెస్సగపొందుచున్నాడు. అను వచనప్రామాణ్యమువలన లక్షకోటి గృహస్థులలో యొకానొక గ్రహస్థుడు యీశ్వరాను

గీ॥ పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥ ॥౪౪॥

పదవిభాగము:— పూర్వాభ్యాసేన – తేన – ఏవ – హ్రియతే – హి – అవశః – అపి – సః – జిజ్ఞాసుః – అపి – యోగస్య – శబ్దబ్రహ్మ – అతివర్తతే. ॥౪౪॥

ప్రతిపదార్థము:— సః=దరిద్రయోగికులమునందు బుట్టిన యోగభ్రష్టుడు; అవశోఽపి=అశక్తుడైనను; తేనైవ=ఆట్టి; (బలవత్తరమైన) పూర్వాభ్యాసేన=పూర్వజన్మకృతాభ్యాసముచేతనే; హ్రియతే=యోగాభ్యాసము గూర్చి తీసుకువెళ్ళబడును; సః=అట్టివాడు; యోగస్య=యోగమును; జిజ్ఞాసురపి=తెలిసికొనునిచ్ఛకలవాడైనను; (యిదివరకు యోగాభ్యాసము చేయనివాడైనను.) శబ్దబ్రహ్మ=వేదప్రతిపాదితమగు కర్మము; అతివర్తతే=అతిక్రమించుచున్నాడు. ॥౪౪॥

---

గ్రహమునకు పాత్రుడై జ్ఞానియు, జ్ఞానయోగియునై జనించును. కాన జ్ఞానులు, జ్ఞానయోగులు అగు గృహస్థుల గృహమునందు యోగభ్రష్టునకు శీఘ్రముగ యోగసిద్ధికొఱకు జన్మ మంగీకరింపబడియెను. ఈ విషయమునే స్పష్టపరచుటకు "తత్ర" అని చెప్పుచుండెను.

జ్ఞానవంతులగు యోగుల కులమునందు జన్మమును పొంది యా యోగి పూర్వజన్మానుష్ఠిత శ్రవణాదులచే ప్రాప్తమైనట్టియు, జ్ఞానులు, యోగులు నగు పితాదులచే నుపదిష్టమైన "తం బుద్ధిసంయోగం" తండ్రి యేధర్మముకలవాడో యాధర్మమునే కొమరునికొఱకుపదేశించును ఇది లోకప్రసిద్ధము. ప్రాగ్జన్మయం దనుష్ఠితమగుటవలన నగ్నివలె నంతర్లీనమై బ్రహ్మవేత్తయగు తండ్రిచే వేదాన్తవాక్యములచేత వ్యక్తీకృతమును తత్త్వమసి కత్వ ప్రతిపాదనరూపము, ముక్తిసిద్ధికి పరమోపాయమునగు జ్ఞానయోగమును పూర్వజన్మమునందే నాటుబడిన దగుటవలన స్వల్పోపదేశముచేతనే యల్పకాలముననే పొందుచున్నాడు. జ్ఞానమునకు సమ్యక్త్వమును సంపాదింపనిదే యింతమాత్రముచే పురుషుడు కృతార్థుడు కాడు. కాన ముముక్షు వవశ్యము జ్ఞానమునకు సమ్యక్త్వమును సంపాదింపవలెయునని సూచించుటకు "యతతే" అని చెప్పుచుండెను. పితాదులవలన జ్ఞానయోగమును పొందినపిమ్మట జ్ఞానముయొక్క సమ్యక్త్వసిద్ధికొఱకు తిరిగి యీజన్మమునందుకూడ ప్రయత్నించును. లేక, ఆ సంస్కారవేగమువలననే తిరిగి అధికతరముగ జ్ఞానముయొక్క యప్రతిబద్ధత్వసిద్ధికొఱకు పూర్వముకంటె నియమముగ గురూపదిష్టరీతిచేతనే సత్యము నిరంతరము సమాధి నాచరించును. ॥౪౩॥

—౬వ అధ్యాయము— ౪౪వశ్లోకవ్యాఖ్యావిశేషములు:—

మధుసూదనసరస్వతీయము:— ఏయోగభ్రష్టుడు బ్రహ్మవేత్తలగు బ్రాహ్మణుల వంశమునందు పుట్టునో అట్టివానికి మధ్యయందు విషయభోగవ్యవధానము లేనందున అవ్యవహితప్రాగ్జన్మయం దగు సంస్కారము యొక్క యుద్భోధవలన తిరిగి సర్వకర్మసంన్యాసపూర్వకమగు జ్ఞానసాధనలాభము సంభవించుగాక. ఏయోగభ్రష్టు శ్రీమంతులగు మహారాజచక్రవర్తుల గృహమునందు (కులమునందు) యనేకవిధములగు విషయభోగముల వ్యవధానముచే జన్మించునో అట్టి వానికి విషయభోగవాసనా ప్రాబల్యమువలన ప్రమాదకారణములు సంభవించుట వలన యతివ్యవహితజ్ఞానసంస్కారోద్భోధము యెట్లుల సంభవించును? క్షత్రియుడు కాన సర్వకర్మసంన్యాసానర్హుడగు వానికి జ్ఞానసాధనలాభ మెట్లుల సంభవించును. అను శంకను "పూర్వాభ్యాసేన" అను శ్లోకముచే తొలగించుచుండెను.

అతిచిరవ్యవహిత జన్మోపచితమైన ప్రాగ్జన్మార్జితజ్ఞానసంస్కారముచేతనే– మోక్షసాధనముకొఱకు యత్నింపనివాడును హఠాత్తుగ భోగవాసనలను వదలి మోక్షసాధనోన్ముఖుడై చేయబడును. ఏందుకనగా సర్వకాలాభ్యస్తజ్ఞానవాసన వస్తువిషయక మగుటచే అవస్తువిషయకము భోగవాసనలకంటె ప్రబలమగుటవలన గ్రహింపనగును. అది యెట్లనిన? ఓ యర్జునా? యుద్ధమునందు ప్రవృత్తమైన నీవే జ్ఞానముకొఱకు ప్రయత్నింపనివాడవైనను పూర్వసంస్కారప్రాబల్యమున హఠాత్తుగ రణభూమియందు జ్ఞానో

శాంకరభాష్యమ్:—

కథం పూర్వదేహబుద్ధిసంయోగ ఇతి, తదుచ్యతే—యః పూర్వజన్మని కృతోఽభ్యాస స్స పూర్వాభ్యాస స్తేనైవ బలవతా హ్రియతే హి యస్మా దవశోఽపి స యోగభ్రష్టో న కృతం చే ద్యోగాభ్యాససంస్కారా ద్బలవత్తర మధర్మాదిలక్షణం కర్మ తథా యోగాభ్యాసజనితేన సంస్కారేణ హ్రియతే। అధర్మ శ్చేద్బలవత్తరః కృత స్తేన యోగజోఽపి సంస్కారోఽభిభూయత ఏవ॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

దరిద్రులు యోగులు నగు వారి కులమున బుట్టిన యోగభ్రష్టుఁ డవశుఁడైనను బలవత్తరమగు పూర్వజన్మకృత యోగాభ్యాసపాటవముచేతనే యాకర్షింపబడును. (అనగా నట్టివాడు పూర్వజన్మమునందాచరించిన యోగాభ్యాసము వల్ల బుట్టిననంస్కారముకంటె బలవత్తరమగు యధర్మరూపమగు కర్మనాచరింపనిచో నపుడు యోగాభ్యాస జనిత సంస్కారమాతనిని తిరిగి యోగమార్గమునందు ప్రవర్తింపజేయును. ఒకవేళ యధర్మమే బలవత్తరమైనచో నా యధర్మముచే యోగజమగు సంస్కారమభిభూయమానమై యుండును. కాని నశింపదు).

స్సుఖుడవైన నీవే యీ విషయమున యీ యతికి దృష్టాంతము. కనుకనే "నేహాభిక్రమనాశోఽస్తి" అని పూర్వమునందు చెప్పబడెను. అనేకజన్మసహస్ర వ్యవహితమైనను జ్ఞానసంస్కారము సర్వవిరోధినాశద్వారమున తన కార్యము నవశ్యము నెరవేర్చునదియే యని యభిప్రాయము.

క్షత్రియునకు సర్వకర్మ సంన్యాసము లేకున్నను జ్ఞానాధికారము మాత్రముకలదు. అది యెట్లన? అనేకరక్షకుల మధ్యనున్నను యశ్వాదివస్తువు దొంగవానిచే స్వయముగ నిచ్ఛయింపకున్నను రక్షకులనందరిని తిరస్కరించి తనసామర్థ్యవిశేషమువలన నపహరింపబడును. అనంతరమున నాచోరులకు యీ యశ్వాదిక మెప్పుడపహరింపబడెనని విమర్శసంభవించును. అట్లే యనేక జ్ఞానప్రతిబంధకముల మధ్యయందు యోగభ్రష్టుఁడుండినను తాను స్వయముగ నిచ్ఛగించినవాడైనను ప్రబలమగు బలవత్తరమయిన జ్ఞానసంస్కారముచే స్వసామర్థ్యవిశేషమువలననే నిఖిలప్రతిబంధకములను తిరస్కరించి యాత్మవశము చేసుకొనబడును. అని "హ్రియతే" ధాతుప్రయోగముచే సూచించుచుండెను.

కనుకనే సంస్కార ప్రాబల్యమువలన జిజ్ఞాసువుకూడ మోక్షసాధనజ్ఞానమునకు విషయమైన ప్రథమభూమికయందున్న సంన్యాసియు యీ ప్రథమభూమికయందే మృతుడై మధ్యకాలము నందనేకవిషయముల ననుభవించి మహారాజచక్రవర్తికులమునందు జన్మించినవాడైనను అట్టి యోగభ్రష్టుడు పూర్వమునందు సంపాదింపబడిన జ్ఞానసంస్కార ప్రాబల్యమువలన నాజన్మమునందే కర్మ ప్రతిపాదకమగు వేదమును యతిక్రమించుచున్నాడు. అనగా కర్మాధికారాతిక్రమముచే జ్ఞానాధికారియగునని యర్థము. ఈ చెప్పుటచే జ్ఞానకర్మసముచ్చయపక్షమున జ్ఞానికి కర్మకాండాతిక్రమము సంభవింపనందున కర్మ జ్ఞానసముచ్చయవాదము నిరాకృతమని తెలిసికొనదగును. ॥౪౪॥

శంకరానందీయము:— యెల్లపుడు సమాధ్యనుష్ఠానమునందు కారణమును "పూర్వాభ్యాసేన" అను శ్లోకముచే జెప్పుచుండెను.

పూర్వజన్మమునందు శ్రద్ధచేతను, తీవ్రమోక్షేచ్ఛచేతను, అత్యంతవైరాగ్యముచేతను, చిరకాలము నిత్యము నిరంతరము నియమముచే చేయబడిన సంతత సమాధ్యావృత్తిచేతనే సంస్కారరూపముగ బుద్ధిస్థమైన యభ్యాసవేగముచే సర్వకర్మలను యథాశాస్త్రముగ విడచిపెట్టిన యోగభ్రష్టుడగు యతి స్వయముగ నవశుడైనను బలా

శాంకరభాష్యమ్ :—
తత్ర యే తు యోగజ స్సంస్కార స్స్వయమేవ కార్య మారభతే। న దీర్ఘకాలస్థస్యాపి వినాశ స్తస్యాస్తీ త్యర్థః। జిజ్ఞాసురపి యోగస్య స్వరూపం జ్ఞాతుమిచ్ఛన్యోగమార్గేప్రవృత్త స్సంన్యాసీ యోగభ్రష్టస్సామర్థ్యా త్సోపి శబ్దబ్రహ్మ వేదోక్తకర్మానుష్ఠానఫల మతివర్తతేఽపాకరిష్యతి కిముత బుద్ధ్వా యో యోగం తన్నిష్ఠోఽభ్యాసం కుర్యాత్ ॥౪౪॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—
అయధర్మము నశింపగనే యోగజమగు సంస్కారము స్వయముగ కార్యము నారంభించును. కాన యోగస్వరూపమును తెలిసికొన కోరినవాడైనను (ఇదివరకు యోగమును తెలిసికొననివాడైనను) ప్రస్తుతము యోగమార్గమున బ్రవృత్తుడగు సంన్యాసి వేదోక్తకర్మానుష్ఠాన ఫలము నతిక్రమించుచున్నాడు. అనగా వేదోక్తకర్మఫలమును నశ్వరమగు దానినిగ నెంచి యంత కంటె యుత్కృష్టమగు మోక్షమును బొందుచున్నాడని యర్థము. ఇక యోగమును దెలిసికొని తన్నిష్ఠుడై యభ్యాసము జేయువాడు మోక్షము నొందునని వాని విషయ మేమి చెప్పవలెను? ॥౪౪॥

త్కారముగ యోగనిష్ఠయందే స్థాపింపబడును. కర్మనిష్ఠయందు స్థాపింపబడడు. విషయభోగనిష్ఠయందు స్థాపింపబడడు కాన సంసిద్ధినిమిత్తము తిరిగిపూర్వముకంటెనధికతరముగ యత్నించును, అనిపూర్వముతో నన్వయింపనగును.

"అహరహ స్సంధ్యాముపాసీత" "ఉదితే సూర్యే ప్రాతర్జుహోతి" "దర్శపూర్ణమాసాభ్యాం యజేత" "యావజ్జీవ మగ్నిహోత్రం జుహోతి" అను మొదలగు శ్రుతులయుపదేశమును, "శ్రౌతంచాపి తథా స్మార్తం కర్మాలంబ్య వసేద్ద్విజః। తద్విహీనః పతత్యేవ హ్యాలంబరహితాంధవత్" అలంబనములేని యంధునివలె శ్రౌతస్మార్తాది కర్మరహితుడగు ద్విజుడు పతితుడగును. కాన ద్విజుడు శ్రౌతస్మార్తాది కర్మల నాచరించుచునే యుండవలెనను స్మృత్యుపదేశమును తిరస్కరించి బ్రాహ్మణుడై శ్రౌతస్మార్త కర్మల నన్నిటిని సంన్యసించి, యోగభ్రష్టుడు యెటుల యోగనిష్ఠయందే ప్రవర్తించును? అని శంకింపజనదు. "జన్మాంతర సహస్రేషు బుద్ధిర్యా భావితా పురా। తామేవ భజతే జన్తు రుపదేశో నిరర్థకః" అను న్యాయముచే జన్మాంతరమున కర్మియగుచో కర్మరతుడు, ధర్మముగుచో ధర్మరతుడు. పాపియగుచో పాపరతుడు, భక్తుడగుచో భక్తిరతుడు, జ్ఞానియగుచో జ్ఞానరతుడు, యోగియగుచో యోగరతుడు తనసంస్కారానురూపముగ నగును. సంస్కారము లేనిదే యెవడును యుపదేశతత్పరుడు కాడు. అట్లే యీ యోగభ్రష్టుడును నిఖిలవేదశాస్త్రాదికము నధ్యయన మొనరించి "నకర్మణా నప్రజయా" ఇత్యాది శ్రుతివాక్యములచే కర్మలు మోక్షసాధనములు కావని నిశ్చయించి ప్రాచీనమగు జ్ఞానయోగాభ్యాససంస్కార వేగమువలన వైదికములగు నిఖిలకర్మలను సంన్యసించి బ్రహ్మనిష్ఠయందే యుండునని చెప్పవలెను. ముముక్షువుకూడ సర్వకర్మలను పరిత్యజించి శ్రవణాదులయందే యుండునని "జిజ్ఞాసుః" అను శ్లోకముచే చెప్పుచుండెను.

యోగస్య శ్రవణాదిసంజాత విజ్ఞానవస్తుం యోగినం స్వభావం బ్రహ్మభావం యోజయతి గమయతీతి యోగో నిర్విశేషః పరమాత్మా" శ్రవణాదులవలన జనించిన విజ్ఞానముకల యోగిని బ్రహ్మభావమును పొందించు నిర్విశేషపరమాత్మయే యోగమనబడును. అట్టి బ్రహ్మమును దెలిసికొనునిచ్ఛగల ముముక్షువు మోక్షైక కామనచే వేదమును, తదుపదేశమును, తత్ప్రతిపాద్యకర్మను– "ఏతమేవ ప్రవ్రాజినో లోకమిచ్ఛన్తః। వేదానిమం లోకమముంచ పరిత్యజ్యాత్మాన మన్విచ్ఛేత్" ఇత్యాది శ్రుతిస్మృతిబలమువలన పరిత్యజించి శ్రవణాదులయందే ప్రవర్తించునని యర్థము. ॥౪౪॥

గీ॥ ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేకజన్మసంసిద్ధ స్తతో యాతి పరాం గతిమ్ ॥ ॥౪౫॥

**పదవిభాగము:—** ప్రయత్నాత్- యతమానః- తు- యోగీ- సంశుద్ధకిల్బిషః- అనేకజన్మసంసిద్ధః- తతః- యాతి- పరాం- గతిం. ॥౪౫॥

**ప్రతిపదార్థము:—** ప్రయత్నాత్=గొప్పప్రయత్నవలన; యతమానః=ప్రయత్నము చేయుచున్న; యోగీ=బ్రహ్మజ్ఞాని; సంశుద్ధకిల్బిషః=నశించినపాపములుకలవాడై; (ఇట సంసిద్ధియనగ-బూర్తిగనశించుటయే) అనేకజన్మసంసిద్ధః=అనేకజన్మకృతముచే కల్గిన సంసిద్ధికలవాడై; తతః=దానివలన; పరాం=ఉత్కృష్టమగు; గతిం=మోక్షరూపగమనమును; యాతి=పొందుచున్నాడు. ॥౪౫॥

---

**శాంకరభాష్యమ్.—**

కుతశ్చ యోగిత్వం శ్రేయఇతి—ప్రయత్నా ద్యతమానోధికం యతమాన ఇత్యర్థః । తత్ర యోగీ విద్వాన్సంశుద్ధకిల్బిషో విశుద్ధకిల్బిషస్సంశుద్ధపాపోఽనేకేషు జన్మసు కించిత్కించి త్సంస్కారజాత ముపచిత్య తేనోపచితే నానేకజన్మకృతేన సంసిద్ధోఽనేకజన్మసంసిద్ధ స్తతో లబ్ధసమ్యగ్దర్శన స్సన్యాతి పరాం ప్రకృష్టాం గతిమ్॥ ॥౪౫॥

---

**శాంకరభాష్యతత్త్వబోధినీ:—**

ఈయాత్మసంయమయోగము శ్రేష్ఠమనుటకు కారణాన్తరము నీశ్లోకమున జెప్పుచున్నాడు- యోగవిషయమై యధికముగ ప్రయత్నము చేయు బ్రహ్మజ్ఞాని నిర్ధూతనిఖిలపాపుడై యనేకజన్మములనుండి కొద్ది కొద్దిగ సంపాదింపబడిన యోగవిషయమున సంస్కారముల సముదాయము నభివృద్ధి నొందించుచు యట్టి జన్మార్జితసంస్కారజాతముచే సంసిద్ధుడై అందుచే గలిగిన సర్వోత్కృష్టమగు మోక్షరూపపరమపురుషార్థమును పొందుచున్నాడు. ॥౪౫॥

---

—:౬వ అధ్యాయము ౪౫ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు:—

**మధుసూదనసరస్వతీయము:—** ప్రథమభూమికయందు మృతుడైనవాడైనను అనేక ప్రమాదకారణములుకల మహారాజకులమున యనేకభోగవాసనాభ్యవహితమైన జన్మము పొందియు యోగభ్రష్టుడు పూర్వమునందు సంపాదింపబడిన జ్ఞానముయొక్క సంస్కారప్రాబల్యముచే కర్మాధికారము నతిక్రమించి జ్ఞానాధికారియగును. ఇక రెండవభూమికయందుగాని, మూడవభూమికయందుగాని, మృతుడై విషయభోగాన్తమున మహారాజకులమున జన్మించినవాడై, లేక భోగము ననుభవింపకయే బ్రహ్మవిద్యాసంపన్నుడగు బ్రాహ్మణుని కులమునందు జన్మించినవాడైన యోగభ్రష్టుడు కర్మాధికారము నతిక్రమించి జ్ఞానాధికారియై జ్ఞానసాధనములను సంపాదించి జ్ఞానఫలలాభముచే సంసారబంధనమునుండి ముక్తుడగునని చెప్పవలయునా ! తప్పక ముక్తుడే యగును. ఈ విషయమునే "ప్రయత్నాత్" అను శ్లోకముచే చెప్పుచుండెను.

పూర్వమునందు చేయబడిన ప్రయత్నముకంటె నత్యధికప్రయత్నమును చేయువాడై యోగి పూర్వమునందు సంపాదింపబడిన సంస్కారములవాడై యా యోగప్రయత్న పుణ్యముచేతనే జ్ఞానప్రతిబంధక నిఖిలపాపములను క్షాళనచేసుకొని, కనుకనే సంస్కారాభివృద్ధివలనను, పుణ్యాభివృద్ధివలనను యనేకజన్మలచే సంసిద్ధుడై, సంస్కారాతిశయముచేతను, పుణ్యాతిశయముచేతను, చివరజన్మమును పొంది దానినుండి సాధనపరిపాకమువలన మోక్షమును పొందుచున్నాడు. ఈ విషయమున సందియమము లేదు. ॥౪౫॥

**శంకరానందీయము:—** తీవ్రముముక్షేచ్ఛావైరాగ్యబలముచే యోగవిషయమై యధికతరప్రయత్నము చేసిన యతికి ఫలమును "ప్రయత్నాత్" అను శ్లోకముచే చెప్పుచుండెను.

గీ॥ తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥ ॥౪౬॥

పదవిభాగము:— తపస్విభ్యః– అధికః– యోగీ–జ్ఞానిభ్యః– అపి–మతః– అధికః–కర్మిభ్యః– చ–అధికః –యోగీ– తస్మాత్– యోగీ– భవ– అర్జున. ॥౪౬॥

ప్రతిపదార్థము:— యోగీ=ఆత్మసంయమయోగి; తపస్విభ్యః=తపశ్శాలురకంటె; అధికః=శ్రేష్ఠుడు; జ్ఞానిభ్యః=శాస్త్రార్థపాండిత్యముకలవారికంటె; అధికః=శ్రేష్ఠుడని; మతః=తలపబడెను; కర్మిభ్యశ్చ=అగ్నిహోత్రాది కర్మకారులకంటె; అధికః=శ్రేష్ఠుడు; తస్మాత్=ఆ కారణమువలన; త్వం=(ఈపదమధ్యాహార్యము) నీవు; యోగీ=యోగివై; భవ=అగుము; ॥౪౬॥

---

ఉత్కృష్టమగు ప్రయత్నమువలన సంసిద్ధికొఱకు యతమానుడై అనగా తత్పరత్వముగ నిత్యము నిరంతరము నియమముగ సమాధినిష్ఠ నాచరించువాడై కాలాంతరఫలసిద్ధికల మందప్రయత్నముకల భిక్షువుకంటె యితడు వేరని చెప్పుటకు "తు" అను శబ్దము ప్రయోగింపబడెను. ప్రకృష్టప్రయత్నము కలిగినట్టి తీవ్రమోక్షేచ్ఛకల బ్రహ్మవేత్త యగుయతి "సంశుద్ధకిల్బిషః" నిత్యనిరంతరసమాధినిష్ఠచే లెస్సగనిర్వాపితమైన (పోగొట్టబడిన) అజ్ఞానతత్కార్యములు కలవాడై, అనగా నిశ్శేషముగ వినష్టమైనబాహ్యవాసనా తత్కార్య కామకర్మఫలములు కలవాడై "అనేకజన్మ సంసిద్ధః" కపింజలాధికరణన్యాయమున యొకటికాని దనేకము, మూటియందు కూడ బహువచన పర్యవసాయికాన యొకటిరెండు మూడుజన్మములందు సమ్యగ్దర్శనము కలవాడై, అనగా యప్రతిబద్ధ విజ్ఞానము కలవాడై, నిశ్శేషముగ నశించిన భేదప్రత్యయము కలవాడై, యాసమ్యగ్దర్శనముచేతనే పరమపురుషార్థమగు "గతిం" తనచే పొందబడునది గతి యనుపించుకొనును. స్వస్వరూపమగు పరమార్థస్వరూపమైన విదేహముక్తిని "యాతి" పొందుచున్నాడు. అనగా నిర్విశేషనిత్యశుద్ధబుద్ధముక్త సత్యపరమానందాద్వితీయ బ్రహ్మస్వరూపమగు స్వస్వరూపముచే నుండునని యర్థము.

ఈ చెప్పుటచే తీవ్రమోక్షేచ్ఛగల యతి శ్రవణమనన నిదిధ్యాస సమాధులయందు క్రియాంతరమున కవకాశము లేకుండునటుల యధికప్రయత్నముచే నుండవలయును, అల్పప్రయత్నముకలవానికిమాత్రముచిరకాలమునకే ముక్తిసంభవించునని సూచింపబడెను. ॥౪౬॥

నీలకంఠీయము:— ఇట్లు యోగభ్రష్టునకు గతిని చెప్పి యెవడు శబ్దస్పర్శరూపరసగంధము లనెడి విషయములచే లాగబడుచుండినను ప్రయత్నముచే యోగమునే యభ్యసించుటకు ప్రవర్తించునో అట్టివాని గతిని "ప్రయత్నాత్" అను శ్లోకముచే చెప్పుచుండెను. వాయునిరోధాదిరూపమగు హఠయోగమువలన, ఖేచర్యాది ముద్రాభ్యాసమున నెవడు ప్రయత్నము చేయుచు పాపరహితు డగునో, ఈవిషయమునే "ప్రాణాయామైర్దహే ద్దోషాన్" ప్రాణాయామములచే పాపమును (దహింపజేయవలెను) అని మనువు చెప్పెను. నిఖిలహఠయోగములు పాపనివృత్త్యుపాయములే కాని తత్త్వసాక్షాత్కారమునందు సాక్షాత్సాధనములు కావు. కనుకనే అట్టి యోగి యనేకజన్మలచే ప్రాప్తమైన యోగము కలవాడై యనంతరమున మోక్షమును పొందును. ఈచెప్పుటచే "చక్షుశ్చైవాంతరే భ్రువోః" అని పంచమాధ్యాయాంతమున సూచిత విషయము వ్యాఖ్యానింపబడెను. ॥౪౬॥

—• ౬వ అధ్యాయము. ౪౬వ శ్లోకవ్యాఖ్యావిశేషములు•—

మధుసూదనసరస్వతీయము:— అర్జునిగూర్చి శ్రద్ధాతిశయోత్పాదనపూర్వకముగ యోగమును విధించుటకొఱకు యిపుడు యోగి "తపస్విభ్యః" అను శ్లోకముచే స్తుతింపబడుచుండెను.

యోగి కృచ్ఛ్రచాంద్రాయణాది తపః పరాయణులకంటెను యుత్కృష్టుడు. ఎందువలననిన? తత్త్వజ్ఞానానంతరము మనోనాశవాసనాక్షయ కారియగుటవలన యనగ్రహింపనగును. మరియు "విద్యయా తదారోహన్తి యత్ర కామాః పరాగతాః, న తత్ర దక్షిణా యాన్తి నావిద్వాంస స్తపస్వినః" యేస్థానమునందు నిఖిల కామములు పరాగతములో యాస్థానమును విద్యచే నధిష్ఠించుచుండిరి. అట్టి స్థానమును కర్ములు అవిద్వాంసులు తపశ్శీలురు.

శాంకరభాష్యమ్:—

యస్మాదేవం తస్మాత్—తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోపి జ్ఞానమత్ర శాస్త్రపాండిత్యం తద్వద్భ్యోపి మతో జ్ఞాతోధికః శ్రేష్ఠ ఇతి కర్మిభ్యోఽగ్నిహోత్రాది కర్మ తద్వద్భ్యోధికో యోగీ విశిష్టో యస్మాత్తస్మాద్యోగీ భవార్జున ! — ॥౪౬॥

శాంకరభాష్యతత్త్వబోధిని:—

ఈ యోగము పరమపురుషార్థప్రాపకము గాన యీ యోగి తపశ్శాలురకంటె నధికుడు; శాస్త్రార్థపరిజ్ఞానము కలవారికంటెకూడ నధికుడుగా తలవబడుచున్నాడు. మరియు నగ్నిహోత్రాది కర్మకారులకంటె నధికుడు. ఓ యర్జునా! నీవట్టి యోగివి కమ్ము. ॥౪౬॥

పొందరు. అను శ్రుతివలనను యోగి యుత్కృష్టుడని చెప్పనొప్పును. కనుకనే దక్షిణాసహిత జ్యోతిష్టోమాది కర్మానుష్ఠాతలకంటెను యోగి యుత్కృష్టుడు. ఎందువలననిన? కర్మలు తపస్సులు అజ్ఞానులగుటచే మోక్షానర్హులు కాన యని గ్రహింపనగును. పరోక్షజ్ఞానవంతులకంటెను యపరోక్షజ్ఞానము కలవా డధికుడు. ఇట్లే మనోనాశవాసనాక్షయములు లేమింజేసి జీవన్ముక్తుడు కాని యపరోక్షజ్ఞానము కలవానికన్నను మనోనాశవాసనాక్షయములు కల జీవన్ముక్తుడగు యోగి యధికుడు. కాన నో యర్జునా! యోగభ్రష్టుడవగు నీవును యిపుడధికప్రయత్నబలమువలన యుగవత్సంపాదిత తత్త్వజ్ఞానమనోనాశవాసనాక్షయములచే సాధనపరిపాకమువలన జీవన్ముక్తుడవగుము. ఇచట "అర్జున" అను సంబుద్ధిచే శుద్ధుడని సూచింపబడెను. ॥౪౬॥

శంకరానందీయము: —శమదమసంన్యాసాద్యుత్తమసాధనసంపత్తి కలిగినట్టియు, అధికతరప్రయత్నసమనుష్ఠితసమాధినిష్ఠాసంభావితాద్వైతవిజ్ఞానవంతుడు అగు నట్టి యోగిచే పొందదగినది మోక్షము. కాన, అద్వైతవిజ్ఞానముకల యోగికి అన్యసాధనానుష్ఠానము కలవారలకంటె యాధిక్యమును "తపస్విభ్యః" అను శ్లోకముచే చెప్పుచుండెను.

కృచ్ఛ్రచాంద్రాయణాదిపంచాగ్నిమధ్యస్థత్వాది తపోనిరతులైన ముముక్షువులకంటె పైనచెప్పఁబడిన లక్షణములుకల బ్రహ్మవేత్తయగు యతి యధికుడు. అనగా "తపసా కల్మషం హన్తి" తపస్సుచే కల్మషమును (పాపమును) నశింపజేయుచున్నాడు. అను స్మృతివలన వారి తపస్సు పాపనివృత్తియే ప్రయోజనముగా కలదగుటచే నల్పఫలముకలదనుటవలన స్వల్పప్రయోజనముకల ప్రాజాపత్యాది లోకగాములగు తపశ్శీలురకంటె జ్ఞాననిష్ఠచే పునరావృత్తిరహిత విదేహముక్తిపథగామియగు బ్రహ్మవేత్త యుత్తముడని యాశయము గాన మీమాంసాదిశాస్త్రార్థజ్ఞానము ధర్మానుష్ఠానానుష్ఠానైకప్రయోజనము కలదగుటచే నల్పఫలముకలది. కాన నట్టివారలకంటె బ్రహ్మవేత్త యధికుడని భావము.

విచారింప "యస్తు వ్యాకురుతే యస్తు మీమాంసతే గిరం । తావుభౌ పుణ్యకర్మాణౌ పంక్తిపావన పావనౌ" ఎవడు వాక్కును వ్యాఖ్యానించునో, యెవడు వాక్కును విచారణచేయునో అనగా మీమాంసాది శాస్త్రముల నధ్యయనముచేయునో, ఎవడు వాటిని విచారణచేయునో వారిరువురు పుణ్యకర్మ కలవారలు; పంక్తిపావన పావనులు అని యాశయము. అట్టివారలైనను దానిచే పుణ్యలోక ప్రాప్తియు, పునరావృత్తియు సంభవించును. కాన వారలకంటెను పైనిచెప్పబడిన యోగి యధికుడు.

మరియు నగ్నిహోత్రాది వైదికకర్మనిష్ఠులకంటెను యోగి యధికుడు! విచారింప "అపామసోమమమృతా అభూమ" "అక్షయ్యం హ వై చాతుర్మాస్యయాజిన స్సుకృతం భవతి" అను శ్రుతులు కర్మల కమృతత్వమును, సుకృతమున కక్షయ్యత్వమును బోధించుచున్నవి. అయినను చాతుర్మాస్యాది కర్మలవలన జనించినపుణ్యమున కగ్నిహోత్రాది జనిత పుణ్యాపేక్షచే నక్షయ్యత్వము కాని యీ యక్షయ్యత్వము స్వాభావికము కాదు. అట్టివారల కమరత్వము మర్త్యాపేక్షచే మాటిమాటికి మ్రరణరాహిత్యమే. "నాకస్య పృష్ఠే తే సుకృ

గీ॥ యోగినా మపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।
శ్రద్ధావా న్భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥ ॥౪౭॥

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం
భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే
ధ్యానయోగో నామ
షష్ఠోఽధ్యాయః ॥౬॥

---

పదవిభాగము:— యోగినాం- అపి- సర్వేషాం- మద్గతేన- అంతరాత్మనా- శ్రద్ధావాన్- భజతే- యః- మాం- సః- మే- యుక్తతమః- మతః ॥౪౭॥

ప్రతిపదార్థము:— యః=ఎవడు; శ్రద్ధావాన్=శ్రద్ధకలవాడై; మద్గతేన=నా (వాసుదేవుని)యందుంచబడిన; అంతరాత్మనా=మనస్సుతో; మాం=నన్ను; భజతే=సేవించుచున్నాడో; సః=అట్టివాడు; మే=నాకు; సర్వేషాం=సమస్తమగు; యోగినాం=రుద్రాదిత్యాదిపరాయణులగు యోగులలో; యుక్తతమః=అత్యంతము యుక్తుడుగ; మతః=అభిప్రేతుడు; ॥౪౭॥

---

తేనుభూత్వేమంలోకం హీనతరం వా విశన్తి" అను శ్రుతి కర్ములకు పునరావృత్తిని బోధించుచున్నది. కాన కర్ములకంటెను నిరుక్తలక్షణములుకల యోగి యధికుడు. ఇట "చ" అను పదమువలన ఉక్తానుక్తములగు సాంఖ్యయోగాది మతనిష్ఠులకంటెను జ్ఞాననిష్ఠుడగు బ్రహ్మవేత్తయే శ్రేష్ఠుడని జ్ఞాపనచేయబడెను. కాన నో యర్జునా! నీవు ముముక్షువగుచో యోగి వగుము. యోగనిష్ఠాజనిత సమ్యగ్జ్ఞాననిష్ఠాబలముచే పునరావృత్తిరహితమగు విదేహకైవల్యమును పొందగలవు. ॥౪౬॥

—౬వ అధ్యాయము— ౪౭ వ శ్లోకవ్యాఖ్యావిశేషములు—

మధుసూదనసరస్వతీయము:— సర్వయోగిశ్రేష్ఠుడైన యోగిని చెప్పుచు "యోగినాం" అను శ్లోకముచే యీ యధ్యాయము నుపసంహరించుచుండెను.

వసురుద్రాదిత్యాది క్షుద్రదేవతాభక్తులలో యొకడు భగవంతుడును, వాసుదేవుడును, అగు నాయందు పుణ్యపరిపాక విశేషముచే ప్రీతివిశేషమువలన నిమగ్నమైన యంతఃకరణచే ప్రాగ్జన్మమందైన సంస్కారపాటవమువలనను సాధుసంగతివలనను నన్ను సేవించుటయం దతిశయముగ శ్రద్ధకలవాడై "యీ వాసుదేవుడు మనుష్యుడు యీశ్వరాంతరసాధారణుడు" అను యభిప్రాయమును వదలి నన్ను సగుణుడైన నారాయణునిగనో, యీశ్వరునిగనో, లేక నిర్గుణునిగనో, చింతించునో అట్టివాడే నాభక్తుడు మరియు సమాహితచిత్తులగు యుక్త (యోగు) లలో శ్రేష్ఠుడు. అని పరమేశ్వరుండను, సర్వజ్ఞుడను అగు నాయొక్క నిశ్చితము. యోగాభ్యాసక్లేశము సమానమైనను, భజనాయాసము సమానమైనను మద్భక్తిశూన్యులకంటె మద్భక్తుడె శ్రేష్ఠుడగుటవలన నీవు నాభక్తుడవు, యుక్తతముడవు, అనాయాసముగ యగుటకు సమర్థుడవు అని భావము.

యీ యధ్యాయముచే నంతఃకరణశుద్ధికి హేతువగు కర్మయోగులయొక్క మర్యాదయు, అనంతరమున సర్వకర్మసంన్యాసికి సాంగముగ యోగమును వివరించియు, ఆక్షేపసమాధానపూర్వకముగ మనోనిగ్రహో

శాంకరభాష్యమ్ :—

యోగినా మితి । యోగినా మపి సర్వేషాం రుద్రాదిత్యాదిధ్యానపరాణాం మధ్యే మద్గతేన మయి వాసుదేవే సమాహితే నాంతరాత్మనాఽన్తఃకరణేన శ్రద్ధావా న్ఛ్రద్దధాన స్సన్భజతే సేవతే యో మాం స మే మమయుక్తతమోఽతిశయేన యుక్తో మతోఽభిప్రేత ఇతి ॥ ॥౪౭॥

ఇతి శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్య గోవిందభగవత్పూజ్య
పాదశిష్య శ్రీమచ్ఛంకరభగవతః కృతౌ
శ్రీభగవద్గీతాభాష్యేఽభ్యాసయో
గోనామ షష్ఠోఽధ్యాయః ॥
హరిః ఓమ్ తత్సత్ ॥

శాంకరభాష్యతత్త్వబోధిని :—

ఎవడు శ్రద్ధావంతుడై నా (వాసుదేవుని) యందుసమహితాంతఃకరణముకలవాడై, నన్ను సేవించునో యట్టియోగి రుద్రాదిత్యాదిపరాయణులగు యోగులందరిలో అతిశయించిన యోగముకలవాడుగ నాకు అభిమతుడు. ॥౪౭॥

ఇట్లు నూరువేల సంఖ్యకలిగి, వ్యాసప్రోక్తము, సంహితారూపము నగు మహాభారత
మునం దంతర్గతమైన భీష్మపర్వమునందున్న యుపనిషద్రూపము, బ్రహ్మవిద్యా
రూపమును, యోగశాస్త్రమును, నగు భగవద్గీతలయందున్న శ్రీకృష్ణార్జునసంవా
దమునందు గల ఆత్మసంయమయోగ మను పేరి షష్ఠాధ్యాయనకు గౌత
మసగోత్రుడగు 'తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ బులుసు
అప్పన్నశాస్త్రిచే రచింపబడిన, ఆనందగిరీయవ్యాఖానుసృత
శ్రీ భగవద్గీతాశాంకరభాష్యతత్త్వబోధిని
స మా ప్త ము.
హరిః ఓమ్, తత్సత్,

—

పాయము నుపదేశించియు, యోగభ్రష్టునకు పురుషార్థశూన్యతాశంకను తొలగించియు, శ్రీకృష్ణపరమాత్మ కర్మకాండను, త్వంపదార్థ నిరూపణమును సమాప్తిని పొందించెను. అటుపిమ్మట "శ్రద్ధావాన్భజతే యోమాం" అను దానిచేసూచింపబడిన భక్తియోగమును, భజనీయుడు, భగవంతుడు, వాసుదేవరూపము అగు తత్పదార్థమును నిరూపించుటకొఱకు ముందుదియగు యధ్యాయషట్క మారంభించుచుండెను "ఇతి శివమ్" ॥౪౭॥

ఇట్లు మధుసూదన సరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా
షష్ఠాధ్యాయ గూఢార్థ దీపికకు "తర్కరత్న
న్యాయవేదాన్త విద్యాపారీణ" బులుసు
అప్పన్నశాస్త్రి విరచితతాత్పర్యబోధిని
స మా ప్త ము.

శంకరానందీయము:- విదేహముక్తికసాధారణకారణమగు సమ్యగ్దర్శనముయొక్క సిద్ధికొఱకు సమాధి నధిష్ఠించిన యోగి పరమపురుషార్థసాధకుడగుటవలన వాని కితరులకంటె యధికత్వమును చెప్పి యెల్లపుడు సమాధిననుష్ఠించనిచో శ్రవణ శ్రావణకోటులచేగూడ సమ్యగ్దర్శనము సిద్ధింపదు. సమ్యగ్దర్శనము లేనిచో విదేహముక్తియు సిద్ధింపదు. కాన ముముక్షువగు యతికవశ్యము సమాధి కర్తవ్యమని జ్ఞాపకముచేయుటకు వానికి సమాధి క్రమకంటె యితరమైన బాహ్యమగు దేశ, కాల, యాలబన్ధ ఆసననియమాది క్రమరహితమగు సమాధిని సూచించుటకు స్వేచ్ఛచే సమాధినిష్ఠను శ్రీకృష్ణపరమాత్మ "యోగినాం" అను శ్లోకముచే స్తుతించుచుండెను.

"సర్వం ఖల్విదం బ్రహ్మ । సర్వం హ్యేతద్బ్రహ్మ । బ్రహ్మైవేదం సర్వమ్" ఇత్యాది శ్రుతిశతములచేతను "సోఽహం సచత్వం సచ సర్వమేతత్" "భూతానివిష్ణుర్భువనాని విష్ణుః" "వాసుదేవస్సర్వం" ఇత్యాదిస్మృతిసహస్రములచేతను, "ప్రపంచమంతయు మరుజలమువలె బ్రహ్మవివర్తముగాన బ్రహ్మస్వరూపమే"- అను యుక్తికోటులచేతను అర్థము నిర్ధారితమైయుండ సర్వము బ్రహ్మమాత్రమగుటయందు శ్రద్ధకలవాడై (శ్రద్ధ యనగ విపరీతభావనలేకుండగ నిశ్చితార్థానువృత్తబుద్ధి వృత్తివిశేషము.) యే ముముక్షువగు బ్రహ్మవిద్యతి "మద్గతేన" శ్రుతము, దృష్టము, స్పృష్టము, మతము విజ్ఞాతము సర్వము బ్రహ్మమే" అనియు పూర్వోక్త శ్రుతిస్మృతియుక్తులచే నిర్ధారితమైన సచ్చిదానందైక రసస్వరూపుడను అద్వితీయుడనుఅగు నాయందు స్థాపితమైనట్టిన్ని, బహిరంతఃసర్వత్ర మత్సత్తానువర్తియగు యంతరాత్మ స్వరూపమైన చిత్తముచే నిరుక్త లక్షణములు కల నన్ను సేవించునో అనగా "సర్వమిదమహంచ బ్రహ్మైవ" "నేను, యీ జగత్తు సర్వము బ్రహ్మమే" అని చూచునో, అనగా ఆహారవిహార శయ్యాసనాదులయందు సర్వావస్థలయందును సర్వదా వృత్త్యంతరము లేకుండగ పరమాత్మ స్వరూపమగు నన్ను తన యాత్మగ ననుసంధానమొనరించునో అట్టివాడు విరాడ్ధిరణ్యగర్భేశ్వరాద్యుపాసకులగు సర్వయోగులకంటెను యుక్తతముడు. విరాడాద్యుపాసకులగు యోగులు అవిద్యాపటలవ్యవహితదృష్టిచే యుపాస్యోపాసకాది భేదము నవలంబించి విరాడాదుల నుపాసించెదరు. యీ యోగియన్ననో శ్రవణాదిజన్య జ్ఞానాగ్నినిర్దగ్ధద్వైతభ్రమపటలుడై తనను, నిఖిలజగత్తును బ్రహ్మమాత్రముగనే చూచుచున్నాడు. కాన నితడుత్తమయోగి యనబడును. అని పరమేశ్వరుడనగు నాకభిమతము.

ఈచెప్పుటచే యెవడు బ్రహ్మవేత్తయో వాడు యెల్లపుడు బ్రహ్మనిష్ఠకలవాడయియే యుండవలెను. అని బోధింపబడెను. వృత్త్యంతరము లేకుండగప్రత్యగ్దృష్టిచే "సర్వముబ్రహ్మమాత్రమే" అను దర్శనమే ముఖ్యమగు సమాధి అని సూచితము. ॥౪౭॥

ఇట్లు శ్రీశంకరానందసరస్వతీ విరచిత శ్రీమద్భగవద్గీతా షష్ఠాధ్యాయవాక్య
తాత్పర్యబోధినికి "తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ"
ములుసు అప్పన్నశాస్త్రిచే రచింపబడిన తాత్పర్యబోధిని
సమాప్తము.

---

శ్రీధరీయము:— యమనియమాదిపరులగు యోగులమధ్య నాభక్తుడే శ్రేష్ఠుడని "యోగినాం" అను శ్లోకముచే చెప్పుచుండెను.

నాయందాసక్తమైన మనస్సుచే నెవడు పరమేశ్వరస్వరూపుడను, వాసుదేవుడనుఅగునన్ను శ్రద్ధాయుక్తుడై సేవించునో అట్టివాడు యోగయుక్తులలో శ్రేష్ఠుడని నాకు సమ్మతము. కాన నో యర్జున! నీవుకూడ నాభక్తుడవగు మని భావము.

---

ఆత్మయోగ మహోచద్యోభక్తియోగశిరోమణిమ్ ॥
తం వన్దే పరమానన్దం మాధవం భక్తిశేవధిమ్ ॥ ॥౪౭॥

ఇట్లు శ్రీధరవిరచిత శ్రీభగవద్గీతా షష్ఠాధ్యాయ టీకకు "తర్కరత్న,
న్యాయవేదాన్త విద్యాపారీణ" బులుసు అప్పన్నశాస్త్రి
విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము

———

భాష్యోత్కర్ష దీపిక:— యీ యారవయధ్యాయముచే సంన్యాసహేతువగు కర్మయోగముయొక్క యాథార్థ్యరూపము, మనోనిగ్రహోపాయమునగు అంగముతోఁగూడిన ధ్యానయోగమును, యోగభ్రష్టునకు దుర్గతి లేకపోవుటచే సుగతిచేత మోక్షప్రాప్తిని వాసుదేవభజనకు శ్రేష్ఠత్వమును బోధించుచున్న యీ సాధనముచే శుద్ధంత్వపదార్థాభిజ్ఞునకు వాక్యార్థజ్ఞానమునలన మోక్షమని ప్రసాధితము.

ఇట్లు ధనపతి సూరివిరచిత శ్రీభగవద్గీతా షష్ఠాధ్యాయ భాష్యోత్కర్ష
దీపికకు "తర్కరత్న, న్యాయవేదాన్త విద్యాపారీణ"
బులుసు అప్పన్నశాస్త్రి విరచిత తాత్పర్యబోధిని
సమాప్తము

———

పరమార్థప్రప:— యమనియమపరాయణులగు యోగులలో సాధకుఁడు శ్రేష్ఠుడని "యోగినాం" అను శ్లోకముచే చెప్పుచుండెను.

నాయందాసక్తమగు మనస్సుచే నెవడు పరమేశ్వరుడనగునన్ను శ్రద్ధాయుక్తుడై సేవించునో వాడు యోగయుక్తులలో శ్రేష్ఠుడు అని నామతము. కాన నోఅర్జునా? నీవు సాధకుడవగుమని భావము. సాధకుడు నాయనుగ్రహముచే సకలసాధనములతో స్వయముగనే యొక్కసారియే కూడుకొనినవాడై యగును. ఈవిషయమునే "యోగే యోగేతవస్తరం వాజే వాజే హవామహే" శునశ్శేపుడు ప్రాణాపానముల యోగము, మనఃపవనముల యోగము దుస్సాధ్యమైయుండ విఘ్నకర్తలగు కామక్రోధాదులతో మాటిమాటికి సంగ్రామము ప్రాప్తించుచుండ మేము పరమాత్మ నాహ్వానించుచుంటిమి. ఎందునిమిత్తమనిన? "ఊతయే" రక్షణనిమిత్తము పరమాత్మ యెట్టివాడు ? "తవస్తరం" రక్షించువాడు. మేమెట్టివారలము ? "సఖాయః" పరమేశ్వర ప్రేమాస్పదులమగుటచే యనుగ్రాహ్యులము అను శ్రుతియు. బోధించుచున్నది.

"ఏహ్యేహి బుద్ధే భవభీతిశాంత్యై గచ్ఛావ గోవిన్దపదారవిందమ్ । యద్యన్తరా త్వాం విషయాని హన్యుః క్రోశ త్వ మమ్భోరుహలోచనేతి" హేబుద్ధే? సంసారభీతిశాంతికొఱకు గోవిన్దపదారవిన్దమును జూర్చి రమ్మ రమ్మ, మధ్యమార్గమున విషయములు నిన్ను బాధించినచో ఓ యంభోరుహలోచన శ్రీకృష్ణ ! అని గోలపెట్టుము అని యీయార్యోక్తియు నైవిషయమునే బోధించుచున్నది. ॥౪౭॥

—♦షష్ఠాధ్యాయతాత్పర్యము♦—

"ప్రోక్తో విజ్ఞానయోగ స్థిరమనసి సదాత్మానుసంధానరూపో, నోచే దభ్యాసయోగో బహిరుపవిశతే చాసనాది క్రమేణ । అన్తర్యోగానువృత్తా స్వయముపరమతేదృశ్యతఃప్రాప్య తోషం, వైరాగ్యాభ్యాసయోగాత్పరిహరతి శనైర్వేగ మిత్యాహ షష్ఠే ॥"

యీయారవయధ్యాయమునందలి స్థిరమైనమనస్సుకలవాని విషయమై సదాత్మానుసంధానరూపమగు విజ్ఞానయోగము చెప్పబడెను. లేదా బహిరింద్రియములచే చలించువానివిషయమై యాసనాది క్రమముచే

యభ్యాసయోగము చెప్పఁబడెను. లోపలయోగానువృత్తి సంభవింప సంతోషమును పొంది దృశ్యములనుండి స్వయముగ నుపరతుఁడగును. వైరాగ్యాభ్యాస యోగములవలన మెల్లిమెల్లిగ వేగమును పరిహరించుచున్నాఁడని చెప్పెను. ॥౪౭॥

ఇట్లు దైవజ్ఞ పండితసూరి విరచిత శ్రీభగవద్గీతా షష్ఠాధ్యాయ పరమార్థప్రపకు
“తర్కరత్న, న్యాయవేదాన్త విద్యావారీణ” బులును
అప్పన్నశాస్త్రి విరచిత (అగతార్థ) గ్రహణరూప
మగు) తాత్పర్యబోధిని.

సమాప్తము

---

నీలకంఠీయము:— కర్మప్రధానమగు త్వంపదార్థవివేకము సమాప్తము. ఇటుపైన ఉపసనాప్రాధాన్యముచే తత్పదార్థమును నిరూపణ చేయఁదలచినవాఁడై తదుపాసనమునుమహాఫలముకలదానినిగ “యోగినాం”అను శ్లోకముచే స్తుతించుచుండెను.

“దైవమేవాపరే యజ్ఞం” ఇత్యాదిశ్లోకములచే చతుర్థాధ్యాయమునందు చెప్పఁబడిన పదురెండుయోగములలో నెవఁడు నాను దేవస్వరూపమగు నాయందు పొందిన (సమర్పితమగు) చిత్తముచే శ్రద్ధగలవాఁడై నన్ను సేవించునో వాఁడు నాకు మిక్కిలి శ్లాఘ్యుఁడై యభిప్రేతుఁడగును. కాన నోఅర్జునా! నీవు మద్భక్తుఁడవగు మని యాశయము. ॥౪౭॥

ఇట్లు నీలకంఠాచార్యవిరచిత శ్రీమద్భగవద్గీతాషష్ఠాధ్యాయ భారత భావదీపమునకు
బులును వెంకటశాస్త్రిచే రచియింపబడిన తాత్పర్యబోధిని
సమాప్తము.

---

